# NA ANUBHAVALU - JNAPAKALU

By - Dr B S N Murti

Published 1994

Copies - 1000



Price Rs 80 00

Cover Design V S Prakash

Copies available with
DR B S N MURTI
3-5-7, Madhavaipalem
NARSAPURAM - 534 275

Typeset at Jeevan Jyothi Press, Narsapur © 607
Inner matter and Cover page printed by
Mohan Offset Printers VJA-3 & Lakshmi Offset Press,
VJA-2 respectively

జన్మనిచ్చింది అమ్మ

శ్రీమతిభాస్కర్లసోమరాజు

చదువునిచ్చింది అమ్మమ్మ

శ్రీమతిమంచర్లదుర్గమ్మ

తీర్చుకోలేని ఋణానికి బదులుగా

వారిద్దరికీ ఈ పుస్తకం

అంకితం

\- బి.యస్.యన్. మూర్తి



నా తండ్రిగారు కీ శే శ్రీ భాస్కర్ల నరశిములు

# ( మీతో ఒక్క మాట )

ఎందరో మహానుభావులు అందరికీ వందనాలని త్యాగరాజు చెప్పిన మాటలు పదే పదే నా జీవితంలో మననం చేసుకుంటుంటాను ఎన్నో ఒడిదుడుకులతో ప్రారంభమయిన జీవితం చివరికి సుఖాంతం అయిందనే చెప్పాలి

మా బాబాయి వెంకటేశ్వర్లు గారు ఎన్నో దేశాలు తిరిగి వచ్చావు కదా ఆ అనుభవాలన్నీ పుస్తకం వ్రాయకూడదా! అనేవారు ఒకసారి నా మిత్రుడు కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) నరసాపురం వచ్చి నీవు తిరిగిన దేశాలు ఎవరూ తిరగలేదు ఆ అనుభవాలు పుస్తకంగా వ్రాయవచ్చు కదా! అన్నారు నేను పెద్ద సాధించినదేవిటిలే అనుకున్నాను మొదట్లో తర్వాత చాలా మంది మిత్రులు కూడా పట్టుబట్టారు వారందరి ప్రోద్బలమే ఈ మీ చేతుల్లో ఉన్న "నా అనుభవాలు - జ్ఞాపకాలు" రూపం

నేను సాధించాననుకున్న ఘనవిజయాలన్నీ నావిగా భావించడం లేదు ఎందరో ప్రోద్బలము, సహాయాలందించారు వారందరి గురించి మీరు చదవబోయే పుస్తకంలో చెప్పాను పేరు పేరునా ఇక్కడ మళ్ళీ చెప్పడం కంటే అందరికీ నా కృతజ్ఞతాభివందనాలు

నా జీవితానికి మంచిమిత్రులే ఊతకర్రలు మంచి మిత్రుల్ని పొందగలగడం నా అదృష్టం నా మిత్రులందరికీ ప్రేమ పూర్వక శుభాభివందనాలు

ముఖ్యంగా నా సాహసాలన్నిటినీ సహించి కుటుంబ బాధ్యతలను నా శ్రీమతి లక్ష్మీనరసమ్మ స్వీకరించింది ఆమె

ప్రోత్సాహమే లేకపోతే 'నేను' లేను అనే విషయం మీకు వేరే చెప్పనక్కర లేదు ఆమెకు ప్రేమాభినందనలు

ఈ పుస్తకాన్ని ప్రచురించాలనే అభిప్రాయం వచ్చిన నాటి నుంచి అన్ని విధాల ప్రోత్సహించి, ఎడిటింగ్ చేసి సహకరించిన శ్రీ వై యన్ కళాశాల ఆంధ్రోపన్యాసకులు డా॥ అరిపిరాల నారాయణ రావు గార్కి నా కృతజ్ఞతాభినందనలు ఆయన సహాయం విలువ కట్టలేనిది

ఈ గ్రంధాన్ని అందంగా అచ్చువేయించడంలో జీవన్‌జ్యోతి ప్రెస్ &పబ్లిషర్సు బిజినెస్ మేనేజరు మిత్రులు, కాకి ప్రసన్న కుమార్ సహకరించారు అమూల్యమైన కాలం వెచ్చించిన ఆయనకు అభినందనలతో కూడిన ఆశీస్సులు

నా బాల్యమిత్రులు కీ శే వరదరాజులు గారి కుమారులు రాజు, బదరి (స్టూడియో కేపిటల్) ఎంతో సహకరించారు వారికి నా ఆశీస్సులు

నరసాపురం
30 మార్చి 1994

- బి యస్ యన్ మూర్తి



నా సహధర్మచారిణి శ్రీమతి లక్ష్మి నరసమ్మతో



బాల్యంలో



ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నపుడు



కేంద్ర ప్రభుత్వోద్యోగిగా

# శైశవం - విద్యాభ్యాసం

జీవితంలో కష్టసుఖాలు కావడి కుండలన్నారు పెద్దలు మరికొందరు జయాపజయాలు దైవాధీనమన్నారు కాని మానవ ప్రయత్నం తప్పదు ఇప్పుడు తీరికగా కూర్చుని ఇంత వరకు జరిగిన జీవన ప్రయాణాన్ని సింహావలోకనం చేసుకుంటే నా జీవితంలోని చేదు అనుభవాలు, తీపి గురుతులు ఉక్కిరిబిక్కిరి చేస్తాయి నేను 8వ తరగతి చదివి హయ్యర్ గ్రేడ్ టీచర్ ట్రెయినింగ్ పూర్తి చేసి ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయ వృత్తిలో రెండు సంవత్సరాలు గడిపాను, తిరిగి పై చదువులు చదువుకుని ఇంగ్లాండు వెళ్ళి లండను విశ్వవిద్యాలయంలో డాక్టరు ఆఫ్ ఫిలాసఫీ డిగ్రీ పుచ్చుకున్నాను మా బాబాయి శ్రీ భాస్కర్ల వెంకటేశ్వర్లు "నీజీవిత చరిత్ర వ్రాయాలిరా" అనేవాడు ఆయన దృష్టిలో నా జీవితంలో సామాన్యులు సాధించలేని విజయం సాధించాననే వెఱ్ఱి నమ్మకం మహానుభావులు తమ జీవితాలతో ప్రపంచంలో అనేకమంది ప్రజలను ఉత్తేజపరిచిన ఉదాహరణలున్నాయి వారి జీవితాలలో అనుభవాలు, జయాపజయాలు, సామాన్యులకు ఆకర్షణీయంగా ఉంటాయి మా బాబాయి సలహా నాకెందుకో అప్పట్లో నచ్చలేదు

మా నాన్నగారు భాస్కర్ల నరశిములు నేను SSLC చదువుకునే రోజుల్లో చనిపోయారు మా అమ్మగారు శ్రీమతి సోమరాజు నేను మూడు నెలల పసివాడిగా ఉండగా మరణించింది నాకు ఆమెను చూచిన గుర్తు లేదు తల్లి ప్రేమను చవిచూడలేదు సరిగదా ఆమె ఫోటో కూడా లేదు అయితే మా అమ్మమ్మ శ్రీమతి మంచెర్ల దుర్గమ్మ గారు నా పసితనంనుంచి నాకు తల్లి లేని లోటు తీర్చి పెంచింది మా తాతగారికి నలుగురు మగపిల్లలు వారిలో మా నాన్న పెద్దవాడు ఆ తరువాత వెంకటేశ్వర్లు, ఈశ్వరుడు, గోపాలకృష్ణమూర్తి ఉండేవారు మా అమ్మకు ప్రథమ సంతానం అమ్మాయి ఆమె ఎంతోకాలం బ్రతకలేదు ఆ తరువాత మా అన్నయ్య దుర్గా ప్రసాదరావు పుట్టాడు ఆయన తరువాత ఎనిమిదేళ్ళ వరకు మా అమ్మకు సంతానం లేదు అప్పుడు మా అమ్మమ్మ సూర్య నమస్కారాలు చేసినదట ఆ సూర్య భగవానుని అనుగ్రహం వల్లనే నేను పుట్టానని మా అమ్మమ్మ నమ్మకం ఇప్పుడది పిచ్చి నమ్మకం అనిపిస్తుంది కాని నా పుట్టుక ఆమె ప్రార్థనల ఫలమని ఆమె ధృఢవిశ్వాసం

నేను పుట్టగానే మా తాతగారు సుబ్బారాయుడు మా జాతకం

చూపించాడట పిల్లవాడు తల్లిగండాన పుట్టాడన్నారు పండితులు పసివాడి గొంతులో వడ్లగింజ వేయమని మా తాతగారి సలహా తల్లి బ్రతికి ఉంటే ఇంకా సంతతి కలగవచ్చుననే ఉద్దేశ్యంతో తల్లిగండాన పుట్టిన పసివాణ్ణి చంపడానికి ఉద్యుక్తుడయ్యాడు కాని తన సూర్య నమస్కారాల ఫలంగా నేను పుట్టాననే మూఢనమ్మకంతో ఉన్న మా అమ్మమ్మ తల్లిగండాన పుట్టిన నష్టజాతకుణ్ణి కాబట్టి గొంతులో వడ్లగింజ వేసి చంపాలనే ఆలోచనకు అంగీకరించలేదు జాతకాలను నమ్మి నిండు ప్రాణం తీస్తావా? అని మా తాతగారిమీద విరుచుకు పడింది ఆమె నోటికి బయపడి మా తాతగారు తన సలహా ఉపసంహరించుకున్నాడు

అయితే విధి మా అమ్మమ్మను చూచి వికృతంగా నవ్వింది ఆమెకు జాతకాలమీద నమ్మకం ఉన్నా లేకపోయినా ఆమె కుమార్తె నా తల్లి నా మూడవ నెలలో మరణించింది "నేను ముందే చెప్పాను కదా!" అన్నాడు మా తాతగారు మనుమడి మీద మమకారంతో కుమార్తెను పోగొట్టుకొన్నదని నలుగురు అన్నారు ఆమె బోలెడు మానసిక వ్యధ అనుభవించింది అయినా మూడు నెలల పసికందును తీసుకుని పిఠాపురం వెళ్ళిపోయింది ఆమె పుట్టిల్లు విశాఖపట్నం జిల్లా యలమంచిలి ఆమె భర్త దుర్గయ్య పిఠాపురం వాస్తవ్యుడు కావడం వల్ల ఆయన మరణానంతరం కూడ ఆమె పిఠాపురంలోనే ఉండిపోయింది ఆమెకు ఆస్తిపాస్తులు లేవు పిఠాపురం మంగయ్యమ్మారావు పేటలో ఒక తాటాకు ఇల్లు ఉండేది ఆమె శ్రమ జీవి కూలి నాలి చేసుకుంటూ పనీపాటు చేసుకుని జీవించేది

మూడునెలల పసివాణ్ణి తనతో పిఠాపురం తీసుకువెళ్ళింది ఆ రోజుల్లో పోతపాలు గగన కుసుమాలు అయితే అప్పుడే బాలింతరాళ్ళు అయిన ముగ్గురు తల్లులకు నా పోషణ భారం అప్పగించింది మంగయ్యమ్మారావుపేటలో మా అమ్మమ్మ ఇంటి చుట్టుప్రక్కల నివశించే ముగ్గురు తల్లులు నాకు పాలు ఇచ్చి పెంచారు ఒక తల్లిని పోగొట్టుకొన్నాను ముగ్గురు తల్లుల్ని సంపాదించుకున్నాను వారిని పాలు తల్లులు అనేవారు వారి పుణ్యమా అని నేను బ్రతికి బట్టకట్టాను నాకు పెద్ద వయస్సు వచ్చిన తరువాత కూడా పిఠాపురం వెళ్ళినప్పుడల్లా నా పాల తల్లులను వారితో "పాలు" పంచుకున్న ముగ్గురు కుర్రవాళ్ళను చూడకుండా వచ్చేవాణ్ణి కాదు వారిలో ఒకడు మిరాయి వ్యాపారం మరొకడు కంసాలి వృత్తి మూడవవాడు దళారి వ్యాపారం చేసేవాడు వాళ్ళే నా చిన్ననాటి స్నేహితులు నాకు అయిదేళ్ళ వయస్సు వరకు పిఠాపురంలో పెరిగి చదువు కోసం అని నర్సాపురం తీసుకువచ్చి మా అమ్మమ్మ వదిలిపెట్టింది అది పిఠాపురంలో

నా మొదటి మజిలీ

పసితనం పిఠాపురంలో ఆటపాటలతో గడిపి నర్సాపురం చేరేసరికి మా నాన్నగారి క్రమశిక్షణ, మా బాబాయిగారి విద్యాబోధనలో క్రొత్త అనుభవం చవిచూడవలసి వచ్చింది ఆ రోజుల్లో 5 ఏళ్ళు నిండితే గాని అక్షరాభ్యాసం చేయించేవారు కాదు ఐదేళ్ళు నిండగానే నన్ను బోర్డు ఏనాది ఎలిమెంటరీ స్కూలులో వేసారు దానికి హెడ్ మాష్టరు మా వెంకటేశ్వర్లు బాబాయి ఆటపాటలతోను ఆకతాయితనంగా పెరిగిన నేను బడిలో కూడా అల్లరివానిగా లెక్క అయితే మా బాబాయిగారు అల్లరి కుర్రవాళ్ళకు ఇచ్చే శిక్షలు నరకాన్ని జ్ఞాపకం చేసేవి డాక్టరు నూకల రామయ్యగారి కుమారుడు, నేను శిక్షలు పొందటంలో పోటీ పడే వాళ్ళం నూకల మునలయ్యకు ముతపొగ పెడితే నాకు కోదండం వేసేవారు

నరసాపురం బోర్డు ఏనాది ఎలిమెంటరీ స్కూలులో నాల్గవ తరగతి పూర్తి చేసి మిషన్ మిడిల్ స్కూలులో 5 వ తరగతిలో చేరాను ఆ బడి వశిష్ట గోదావరి ఒడ్డున విశాలమైన ఆవరణలో ఉండేది దాని నిర్వహణ నేస్మిత్ దొర చేసేవాడు ఆయన అజానుబాహుడు స్కాట్లండునుంచి క్రైస్తవ మత ప్రచారానికి వచ్చారు ఒక ప్రక్క మిషన్ మిడిల్ స్కూలు ప్రిన్సిపాల్‌గా వ్యవహరిస్తూ, మరొకప్రక్క బైబిల్ ప్రచారం చేసేవారు ఆ స్కూలులో 5వ తరగతినుంచి 8 వ తరగతి వరకూ ఉండేవి మిషన్ స్కూలుకి శ్రీ కొప్పర్తి భానుమూర్తి గారు హెడ్ మాష్టరు ఏడు ఎనిమిది తరగతులకు నేస్మిత్ దొర ఇంగ్లీషు చెప్పేవారు ఆయన గడ్డి బజారులో తెలుగులో బైబిలు బోధించేవాడు, కాని 7 వ తరగతి 8వ తరగతి పిల్లలకు ఇంగ్లీషు పాఠం ఇంగ్లీషులోనే చెప్పేవారు ఆ రోజుల్లో ఐదవ తరగతి వరకు ఇంగ్లీషు చెప్పేవారు కాదు ఐదవ తరగతిలో మాష్టారు వాట్ ఈస్ దిస్? అని ప్రశ్నిస్తే వంకాయ పులుసు అని అల్లరి మూక సమాధానం చెప్పే స్థితి నుంచి ఏడవ తరగతిలో ఇంగ్లీషు పాఠం తెలుగు మాట పడకుండా ఇంగ్లీషులోనే నేర్చుకుని ఎదిగాను విద్యార్థులు దొరగారి క్లాసులో తెలుగులో మాట్లాడడానికి వీలు లేదు ఈ రోజు వరకు ఆయన చెప్పిన ఇంగ్లీషు పాఠాలు, కొట్టిన బెత్తం దెబ్బలు గుర్తే

స్కూలులో పాఠాలు ప్రారంభించడానికి ముందు పెద్ద హాలులో అందరికి ప్రార్థన ఉండేది ప్రార్థనకు ఆలస్యంగా వచ్చినవారికి ప్రార్థనానంతరం బెత్తపు పూజ ఉండేది నేస్మిత్ దొర బైబిలునుంచి చదివి ప్రార్థన చేయించేవారు అది ఆయన తెలుగులో చెప్పేవారు ఇంగ్లీషు భాషా పరిజ్ఞానం అంతగా లేని మాకు దొరగారు ఇంగ్లీషు పాఠం ఆయన ఉచ్చారణలో చెప్పుకునిపోతుంటే గుండెల్లో రైళ్ళు పరుగులెత్తేవి ఆ మరునాడు ఆయన అడిగిన ప్రశ్నకు

ఇంగ్లీషులో సమాధానం చెప్పాలి ఆయన ఇంగ్లీషులో చెప్పిన పాఠం అర్థం అయ్యేది కాదు అప్పుడు భానుమూర్తి మాష్టారి వద్దకు వెళ్ళి మొరపెట్టుకుంటే సాయంకాలం స్కూలు పూర్తి అయిన తరువాత ఆయన మాకు దొర ఇంగ్లీషులో చెప్పిన పాఠాన్ని తెలుగులో చెప్పేవాడు నేస్మిత్ దొర పాఠాలు నిర్లక్ష్యం చేసేవారిని గాని, క్రమశిక్షణారాహిత్యాన్ని గాని క్షమించేవారు కాదు ఆ కుర్రతనపు రోజుల్లో ఆయనను తిట్టుకునే వాళ్ళం కాని ఆయన ఇంగ్లీషు భాషలో ఆ చిన్న క్లాసులలో వేసిన పునాదులే పెద్దవాళ్ళమైన తరువాత ఆదుకున్నాయి

మిషన్ మిడిల్ స్కూలులో నేను చదివిన నాలుగేళ్ళు నేస్మిత్ దొర ప్రభావం అప్రతిమానం బైబిలు కథలు చదివి బైబిలు పాఠాలలో పోటీలు పెడితే ప్రథమ బహుమానం తెచ్చుకొనేవాడ్ని శ్రీయుతులు కొప్పర్తి భానుమూర్తి, బోడె సుందరం మాష్టార్లు తప్ప మిగిలినవారంతా క్రైస్తవ ఉపాధ్యాయులే ఆ స్కూలులో ఆడపిల్లలు కూడా చాలామంది ఉండేవారు కుర్రతనపు ఉత్సాహంలో వాళ్ళకు పేర్లు పెట్టడం, అల్లరి చేయడం తత్ఫలితంగా శిక్ష అనుభవించడం పరిపాటి మొండితనం బండతనం ఉన్నందున మాష్టర్లు శిక్షిస్తే బాధ పడేవాణ్ణి కాదు ఆ విషయం ఇంటిదగ్గర మానాన్నకు తెలిస్తే మళ్ళీ శిక్షించేవాడు ఒక తప్పుకు రెండు శిక్షలు ఉండకూడదనే న్యాయ సూత్రం ఎవ్వరూ పాటించేవారు కాదు క్రైస్తవ మిత్రులతో కలిసి ఆదివారం చర్చికి వెళ్ళే వాణ్ణి మా స్కూలులో ఉద్యోగం చేసే ఒక మాష్టారు ఆదివారం రోజున అందరూ చర్చికి వెళితే ఆయన శనివారం చర్చికి వెళ్ళేవాడు ఆయన్ని సెవెన్త్ డే ఎడ్వెంటిస్టు అనే వారు అప్పట్లో క్రైస్తవ మతావలంబులలో ఉన్న భేదాలు, వివిధ చర్చిలు, సాకార నిరాకార వాదం మాకు అర్థం అయ్యేవి కావు నేస్మిత్ దొర పుణ్యమా అంటూ బైబిల్ని క్షుణ్ణంగా చదివాను 8 వ తరగతి పరీక్షలో ఉత్తీర్ణుని కావడంతో జీవితం మరో మలుపు తిరిగింది

మానాన్న, ఆయన ఇద్దరు తమ్ముళ్ళు ఐదవ తరగతి వరకు చదివారు వెంకటేశ్వర్లు బాబాయి, ఈశ్వరుడు బాబాయి ఆ కాలంలో ఉండే లోయర్ గ్రేడ్ ఉపాధ్యాయ ట్రెయినింగ్ పూర్తి చేసి ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయ వృత్తిని చేపట్టారు మానాన్న స్కూళ్ళ ఇన్స్పెక్టరు ఆఫీసులో ఉద్యోగం చేసేవాడు వారు ముగ్గురు కలిసి తమ నాల్గవ తమ్ముడైన గోపాలకృష్ణమూర్తిని పై చదువులు చదివించాలని దీక్షబూని తమ సర్వ శక్తులు ధారపోసి ఆయన్ని కళాశాల చదువుకు పంపగలిగారు

1921 లో ఆయన ఇంటర్ మీడియట్ చదివే రోజుల్లో మహాత్మాగాంధీ స్వాతంత్ర్య సమర శంఖారావానికి ఆకర్షితులై కళాశాల చదువుకి స్వస్తి

చెప్పారు అప్పటినుంచి మా కుటుంబంలో ఒక్కడినైనా పట్టభద్రుణ్ణి చేయాలని నలుగురు అన్నదమ్ములకు పట్టుదల ఎక్కువైంది ఆ అవకాశం మా అన్నయ్య దుర్గాప్రసాదరావుకి ఇచ్చారు అప్పటికి మా నాల్గవ బాబాయి బందరులో ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీలో ఉద్యోగం చేస్తూ ఉండేవాడు బందరు నోబెల్ కళాశాలలో మా అన్నయ్యను ఇంటర్‌మీడియెట్‌లో చేర్చారు అందరి ఆశలు ఆయనమీద కేంద్రీకృతమయ్యాయి మా అన్నయ్య ఇంటర్‌మీడియెట్ రెండవ సంవత్సరం పరీక్షలో పూర్తిగా ఉత్తీర్ణుడు కాలేకపోయాడు దానితో ఆయన చదువుకి అంతటితో స్వస్తి చెప్పాడు మా నాల్గవ బాబాయి రాజకీయాల పుణ్యమా అంటూ ఇంటర్‌మీడియేట్ దాటలేకపోతే మా అన్నయ్య నాటకాల పిచ్చిలో పడి ఇంటర్‌మీడియేట్‌తో చదువు మానుకున్నాడు వారి కళాశాల చదువుకు ఇంటర్‌మీడియేట్ చెలియకట్ట అయ్యింది

మా అన్నయ్యను కళాశాలలో చేర్పించే రోజుల్లో నేను థర్డ్ ఫారంలో ఉత్తీర్ణుడనయ్యాను మా అన్నయ్య కళాశాల చదువుతో నాకు హైస్కూలు చదువు ప్రాప్తి లేకపోయింది మా నాన్న, మా బాబాయిలు ఆలోచించి నన్ను ఉపాధ్యాయ వృత్తిలో పెట్టడానికి నిర్ణయించారు అప్పుడు 8 వ తరగతి చదివి రెండేళ్ళు హాయ్యర్‌గ్రేడ్ ట్రెయినింగ్ అయినట్లయితే ఉపాధ్యాయవృత్తి చేసే అవకాశం ఉండేది హాయ్యర్ గ్రేడ్ ట్రెయినింగ్ స్కూలు నర్సాపురంలోనే ఉండేది నేను ఆ స్కూలులో చేరాను అప్పుడు ట్రెయినింగ్ అయ్యే రోజుల్లో నెలకు ఆరు రూపాయల పావలా స్టయిఫండుగా యిచ్చేవారు దానితో నా ఉపాధ్యాయవృత్తికి పునాది పడింది ట్రయినింగ్ రెండు సంవత్సరాలు ట్రయినింగ్ స్కూలు ప్రిన్సిపాల్ పేరు గుర్తు లేదు గాని ఆయన చాలా స్ఫుర ద్రూపి, పొడుగు కోటు, తలపాగాతో నడుస్తుంటే ఆయన చాలా ఆకర్షణీయంగా ఉండేవారు ట్రయినింగ్‌లో ఉపాధ్యాయులు చెప్పే పాఠాలు వినడానికి బాగానే ఉండేవి ట్రయినింగ్ అయ్యే విద్యార్థులు చిన్నపిల్లలకు పాఠాలు చెప్పడం అంటే ఒళ్ళంతా చెమటలు పట్టేవి ఎలాగో ఆ రెండు సంవత్సరాలు గడిచిపోయాయి హాయ్యర్ గ్రేడు ట్రయినింగ్‌లో ఉత్తీర్ణుడయ్యాను ఉపాధ్యాయ వృత్తి సంపాదించడానికి అర్హత సంపాదించాను

నా చిన్నతనంలో నాకు నున్నటి గుండు, పిలక చెవులకు బంగారు పోగులు ఉండేవి వాటిని వదలించుకోడానికి నేను పడ్డ అవస్థలు తల్చుకున్నప్పుడల్లా నాకు నవ్వు వస్తుంది మా నాన్నకు ఈశ్వర్రు బాబాయిగారికీ హెయిర్ స్టయిల్ గుండు, పిలక క్రాపు ఉంచుకుందామని ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోయింది మా అన్నయ్య హైస్కూలులో

చదువుచున్నాడు గాబట్టి ఆయనకు క్రాపు ఉండేది నాకు మాత్రం మంగలి ఇంటికి వచ్చి క్షురకర్మ చేసే రోజు నిజంగా దుర్దినంగా ఉండేది కాస్త అంటుకత్తిరి వేయమని ఎంత బ్రతిమాలుకున్నా ప్రయోజనం ఉండేది కాదు మా నాన్న ఎదురుగా నిలబడి పూర్తిగా గుండు చేయమని ఆజ్ఞాపించేవాడు నెమ్మదిగా క్షౌరం చేయించుకోడానికి ఆలస్యం చేసేవాణ్ణి పిలకను వదిలించుకోవడానికి కూడా అవస్థ తప్పలేదు తమ్మయ్యలింగం గారి మిషన్ కొట్టువద్ద కూర్చుని కత్తెరతో కొంచెం కొంచెం పిలక కత్తిరించేవాణ్ణి మిషన్ మిడిల్ స్కూలులో చేరిన ఏడాదిలో చెవిపోగులు, గుండు పిలక వదిలించుకున్నాను మా నాన్న చనిపోయినప్పుడే మరలా గుండు చేయించుకున్నాను

మా ఈశ్వర్డు బాబాయిగారు ఆ రోజుల్లోనే జాతీయ బావాలతో మహాత్ముని పిలుపు మేరకు కాంగ్రెసు నిర్వహించే కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొనేవారు మా నాల్గవ బాబాయి గోపాలకృష్ణ మూర్తిగారు ఇంటర్మీడియేట్ చదువుతూ మహాత్మాగాంధీ స్వాతంత్ర్య శంఖారావం విని కళాశాల చదువు మానివేసాడు తరువాత శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి ప్రోత్సాహంతో జాతీయోద్యమంలో తన పాత్ర మచిలీపట్నంలో నిర్వహించారు అయితే నా చిన్నతనంలో మా ఈశ్వరుడు బాబాయిగారి రాజకీయ కార్యక్రమమే నాకు రాజకీయాలలో ఉత్సాహం, సరదా, స్ఫూర్తి కలిగించాయి నాకు జాతీయ గీతాలు పాడడం అంటే ప్రత్యేక శ్రద్ధ ఉండేది ఉప్పు సత్యాగ్రహం జరిగే రోజుల్లో ఒక మహిళ నరసాపురం గడ్డిబజారులో శాసనోల్లంఘనం చేస్తూ ఉప్పు వండడానికి ప్రయత్నించే సమయంలో కాంగ్రెసు వాలంటీర్లు పొయ్యి చుట్టూ చేతులు కలుపుకుని నిలబడే వారు వారికి రెండవ రక్షణ వలయంగా నిలబడ్డవారితో నేను కూడా చేతులు కలిపేవాణ్ణి పోలీసులు లాఠీతో చేతులమీద కొట్టి రక్షణ వలయాన్ని ఛేదించేవారు ఉప్పు వండే కుండను బద్దలు కొట్టేవారు పోలీసులు వెళ్ళగానే మళ్ళా ఉప్పు వంట అలా తయారు చేసిన ఉప్పు బహిరంగ స్థలంలో వేలం పాడితే ఎంతో ఉత్సాహంగా ప్రజలు ఆ ఉప్పును భక్తితో కొనుక్కునేవారు

ఆ రోజుల్లో నరసాపురంలో డప్పుల సుబ్బారావు పోలీస్ సబ్ ఇనస్పెక్టరుగా పనిచేసేవాడు బ్రిటిష్ ప్రభుత్వ ఆదేశాలను అధిగమించి డప్పుల సుబ్బారావు కాంగ్రెసు వాలంటీర్లమీద తన క్రౌర్యం అంతా చూపించేవాడు మా ఈశ్వరుడు బాబాయి డప్పుల సుబ్బారావు చేతిలో అనేక లాఠీ దెబ్బలు తిన్నాడు మా బాబాయి ఆజానుబాహువు కొంచెం స్థూలకాయుడు ఉద్యమ రోజుల్లో ఒకనాడు బాబాయిని లాఠీలతో కొట్టడం స్వయంగా చూసాను ఆయన

పడిపోయాడు కాని కాంగ్రెసు జండా వదలకుండా వందే మాతరం అంటూనే ఉన్నాడు అవి త్యాగధనుల రోజులు ఆయన అనేకసార్లు జైలుకి వెళ్ళాడు ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుడు కావడం వల్ల ఆయనకు జైలులో ఎప్పుడు "సి" క్లాసు ఇచ్చేవారు

ఆ రోజుల్లో "సి" క్లాసు జైలు శిక్ష నరక సదృశ్యం అని బాబాయి చెప్పేవారు ఆయన పుణ్యమా అంటూ మా ఇంట్లో యావన్మంది సభ్యులు రాట్నాలమీద నూలు తీసేవారు ఆ నూలు నేయించుకుని బాబాయి కట్టుకునేవాడు యువకునిగా నేను కూడా ఖద్దరు ధరించేవాణ్ణి మా నాన్నకు రాజకీయాలతో ప్రమేయం లేకపోయినా ఎప్పుడూ ఖద్దరే ధరించేవాడు నాకు ఆ రోజుల్లో పందలపాక కోరా ఖద్దరంటే మక్కువగా ఉండేది మా ఈశ్వరుడు బాబాయి నాలోని స్వాతంత్ర్య బావాలను ప్రోత్సహించి భారతదేశ స్వాతంత్ర్య సమరంలో నావంతు సేవలు అందించడానికి పునాదులు వేసారు నా చిన్నతనంలో నరసాపురంలో శ్రీ తోలేటి పేర్రాజు, శ్రీ భాస్కర్ల ఈశ్వర్లు కాంగ్రెసు ఉద్యమానికి పట్టుగొమ్మలుగా ఉండేవారు

నేను ట్రెయినింగు పూర్తి చేసి బోర్డువారి ఉద్యోగం కోసం ఎదురు చూసే సమయంలో ఉపాధ్యాయవృత్తిలో అనుభవం కోసం చించినాడలో ఉద్యోగం చేసాను ఆ రోజుల్లో మా ఈశ్వరుడు బాబాయి చించినాడలో బాలికల పాఠశాల ప్రధానోపాధ్యాయుడుగా ఉండేవాడు చించినాడలో రుద్రరాజు గోపాలరాజుగారికి ఒక ఎయిడెడ్ స్కూలు ఉండేది దానికి ఉపాధ్యాయుడు లేనందున స్కూలు మూతపడింది మా బాబాయి శ్రీ రాజుగారితో మాట్లాడి నాకు వారి ఎయిడెడ్ బడిలో ఉద్యోగం ఇప్పించారు బడి అరుగుమీదనే! విద్యార్థులు వారి కుటుంబంలోని పిల్లలు అదే సమయంలో బాబాయిగారి బాలికల పాఠశాలలో ఒక ఉపాధ్యాయుడు నెల రోజులు సెలవు పెడితే ఆ ఖాళీలో నాకు ఉద్యోగం వేయించారు అవన్నీ కాలక్షేపం ఉద్యోగాలు కొన్ని మాసాలు చించినాడ మకాం రాజకీయాల్లో ఉన్నందువల్ల మా ఈశ్వరుడు బాబాయిగారికి చించినాడలో కూడా చాలా మర్యాద ఉండేది నేను శని ఆదివారాల్లో నరసాపురం వచ్చి సోమవారం తిరిగి చించినాడ వెళ్ళేవాణ్ణి ఆ ప్రయాణాలన్నీ కాలినడకనే చేసేవాణ్ణి ఏటిగట్టుపై నరసాపురం నుంచి చించినాడ ఆరుమైళ్ళు ఉండేది చించినాడలో బాబాయిగారింట్లో మకాం

ఆరోజుల్లో ప్రాధమిక పాఠశాలల్లో ఉద్యోగాలు వేసే అధికారం తాలూకా బోర్డు అధ్యక్షులకు ఉండేది శ్రీ గ్రంధి వెంకటరెడ్డినాయుడు తాలూకా బోర్డు ప్రెసిడెంటు ఆయన నరసాపురం వాస్తవ్యులు మా నాన్న ఆయన్ని కలిసి నాకు ఉద్యోగం వేయమని కోరాడు అయితే అప్పటికే తాలూకా బోర్డుల్ని

ఎత్తివేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది అయినా మా నాన్న యందున్న అభిమానంతో శ్రీ రెడ్డినాయుడుగారు నాకు చిట్టవరం ప్రాథమిక పాఠశాలలో చిన్న మాష్టారు ఉద్యోగానికి ఆర్డరు వేసారు నిజానికి నేను ఉద్యోగంలో చేరడానికి వెళ్ళే సమయానికి తాలూకా బోర్డులు ఎత్తివేసారు పాత ప్రెసిడెంటువారు ఇచ్చిన ఆర్డరు చెల్లుతుందని మా ఇంట్లో ఎవరికీ నమ్మకం లేదు అయినా శ్రీ రెడ్డినాయుడుగారి ఇచ్చిన ఆర్డరు తీసుకుని చిట్టవరం ప్రాథమిక పాఠశాలలో ఉద్యోగానికి బయలుదేరాను ఆ స్కూలు హెడ్మాష్టరు శ్రీ లక్ష్మీనారాయణగార్కి శ్రీ రెడ్డినాయుడు గారి ఆర్డరు చూపించాను అప్పటికే తాలూకా బోర్డు ఎత్తివేసినందున ఆ తరువాత అమలులోకి వచ్చేటట్లు వేసిన ఆర్డరు చెల్లుతుందా లేదా అనే మీమాంస వచ్చింది అయితే ఆ బడిలో జూనియర్ ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న వ్యక్తి సెకండరీ గ్రేడ్ ట్రెయినింగు అయిన ఉపాధ్యాయుడు కావడం వల్ల ఏ విధమైన ఇబ్బంది పెట్టకుండా తాను ఉద్యోగంలోనుంచి తప్పుకుని నేను ఉద్యోగంలో చేరడానికి వీలు కల్పించాడు

నరసాపురంనుంచి చిట్టవరం ఊళ్ళోకి ఐదుమైళ్ళదూరం చిట్టవరం బడిలో పని చేసిన ఏడాది కాలం రోజూ ఉదయం నరసాపురంలో చల్ది అన్నం తిని నడిచి చిట్టవరం బడికి చేరుకునే వాణ్ణి కొంతకాలం మధ్యాహ్న భోజనం ఉండేది కాదు మంచినీళ్ళు త్రాగి మా హెడ్మాష్టరు గారి ఇంటి అరుగుమీద పడుకుని మధ్యాహ్నం బడి అయిన తరువాత నరసాపురం నడిచి వచ్చేవాణ్ణి కొద్దిరోజుల తరువాత ఒక కాపుల ఇంట్లో మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేసుకున్నాను అయినా రోజుకి 10 మైళ్ళు నడవడం భోజన సదుపాయం లేనందున వివాహం చేసి చిట్టవరంలో కాపురం పెడితే బాగుంటుందనే ఆలోచన మా పెద్దలకు వచ్చింది ఆ విషయం మరోసారి ప్రస్తావిస్తాను

మా హెడ్మాష్టరుగార్ని ఆ ఊళ్ళో అంతా వసిష్టులవారు అనే వారు ఆయన ప్రాథమిక పాఠశాల హెడ్మాష్టరు ఆ ఊళ్ళో పోస్టు మాష్టరు, పురోహితుడు కూడాను ఆయన ఇల్లు బ్రాహ్మణ వీధిలో ఉండేది దాని ఎదురుగా కరణం బాపిరాజుగారి ఇల్లు మరొకప్రక్క మునసబు సూర్యనారాయణగారి ఇల్లు ఉండేవి వారంతా భోజనాలు చేసి హెడ్మాష్టరు ఇంటి అరుగుమీద కూర్చుని కబుర్లు చెప్పుకునేవారు నేను కుర్ర వాణ్ణి కావడం వల్ల ఏవో పగటి కలలు కంటూ వారి కబుర్లు వింటూ ఆ అరుగుమీద పడుకునే వాణ్ణి బడిలో మాత్రం పిల్లలకు అ ఆ లు వ్రాసిపెట్టడం అల, వల తల పాఠాలు చెప్పడంతో సరిపోయేది ఒక్కొక్కసారి మా హెడ్మాష్టారు తద్దినాలు పెట్టడానికి వెళుతూ ఆయన క్లాసులు కూడా చూడమనే వారు

చిట్టవరంలో ఉద్యోగం చేసిన ఏడాదిలో నాకు బాగా గుర్తున్న విషయాలు రెండు శ్రీ బడేటి వెంకట్రామయ్య నాయుడు తాత్కాలిక గవర్నరుగా చిట్టవరం వచ్చారు ఆ సందర్భంలో జరిగిన బ్రహ్మాండమైన మహాసభలో గవర్నరుగారికి సమర్పించిన స్వాగత పత్రం నన్ను చదవమన్నారు గ్రామంలో ఎంతోమంది పెద్దలున్నప్పటికీ ఆ అవకాశం నాకు ఇచ్చినందుకు ఎంతో ఆనందపడిపోయాను అది అప్పటి పరిస్థితి

ఇక రెండవ అనుభవం దసరా సందర్భంలో మా వసిష్టులవారు నన్ను ప్రోత్సహించి ఆ ఏడాది విద్యార్థుల చేత దసరా పట్టించారు ఈ కాలపు విద్యార్థులకు దసరా పట్టడం అంటే ఏమిటో తెలియదు అది వారి తప్పు కాదు అది పరిస్థితుల మార్పు ప్రభావం దసరా పండుగ రోజుల్లో స్కూలు పిల్లలకు పెద్ద పండుగ ఉత్సాహవంతులైన ఉపాధ్యాయులు ఉన్న పాఠశాలలలో దసరా రోజుల్లో చాలా హడావిడిగా ఉండేది ముందు విద్యార్థులకు దసరా పాటలు నేర్పాలి ఆపాటలు చాలా చక్కగా ఆహ్లాదకరంగా ఉండేవి ఆ పాటలు పాడుకుంటూ ఉపాధ్యాయుని నాయకత్వంలో విద్యార్థులంతా కొందరు విద్యార్థుల ఇళ్ళకు వెళ్ళేవారు వారంతా పటాలు పట్టుకునేవారు మరికొందరు గిలకలతో బుక్కా జల్లుకుంటూ కొందరు విద్యార్థుల ఇంటికి వెళ్ళి దసరా పాటలు పాడేవారు ఆ పాటలో గృహ యజమాని కర్తవ్యం సూచనగా ఉంటుంది "పిల్లవాళ్ళకు చాలు పప్పు బెల్లాలు, అయ్యవారికి చాలు ఐదు వరహాలు" అని పాడతారు ఆ డబ్బు చేతిలో లేకపోతే అప్పు చేసి అయినా ఇవ్వమని ఆ పాటలో సూచిస్తారు పప్పుబెల్లాలు తిన్న విద్యార్థులు, బహుమానం అందుకున్న అయ్యవారు ఆనందంగా మరొక ఇంటికి వెళతారు ఆ సంవత్సరం దసరా పట్టించినందున వచ్చిన బహుమానం నన్నే ఉంచుకోమని మా హెడ్మాష్టారు చెప్పారు నెలంతా ఉద్యోగం చేస్తే పదమూడు రూపాయల జీతం వచ్చే రోజుల్లో దసరా బహుమానం ఎంత వచ్చినా బ్రహ్మాండమైన ఆనందం కలగటంలో ఆశ్చర్యం లేదు దసరా పట్టించే అనుభవం జీవితంలో ఒక్కసారి వచ్చినా ఆ వయస్సులో నాకు చాలా ఆనందాన్ని కలుగజేసింది

చిట్టవరం ఊళ్లోనుంచి నరసాపురం - పాలకొల్లు రోడ్డుకి రావడానికి పుంతలో నడక సాయంకాలం తొందరగా ఇంటికి చేరాలని తలవంచుకు నడిచేవాణ్ణి ఉదయం బడికి చేరాలనే తొందరలో దారిలో ఎవరినీ పట్టించుకునే వాణ్ణి కాదు అయితే చిట్టవరం మునసబుగారు రోజూ నరసాపురంనుంచి చిట్టవరం గుర్రపు బండిలో వచ్చే వారు ఆయన ఎవరో నాకు తెలియదు ఆయన నన్ను ఎప్పుడూ పలకరించలేదు నేను ఆయనకు ఎప్పుడూ

నమస్కారం పెట్టలేదు నేను చిట్టవరంలోని ప్రాథమిక పాఠశాల చిన్న మాష్టార్ని అని ఆయన తెలుసుకుని అంత చిన్న వాడు తనకు నమస్కారం పెట్టకపోవడాన్ని సహించలేకపోయారు అంతే పిచ్చుకమీద బ్రహ్మాస్త్రాన్ని వేసారు దాని ఫలితంగా నా చిట్టవరం ఉద్యోగానికి కాలం తీరింది చిట్టవరంనుంచి గొంది ప్రాథమిక పాఠశాలకు బదిలీ చేసారు

చిట్టవరంలో ఉపాధ్యాయవృత్తి చేసేటప్పుడే భోజన వసతి లేనందున నాకు వివాహం చేస్తే బాగుంటుందని పెద్దలు నిర్ణయించారు కాని నేను ససేమి వివాహం అంత కుర్రతనంలో చేసుకోనన్నాను మా పెద్దల దృష్టిలో నేను నెలకు 13 రూపాయల ఉద్యోగం చేస్తూ ప్రయోజకుణ్ణి అయ్యాను కాబట్టి నన్ను ఒక ఇంటి వాణ్ణి చేస్తే బాగుంటుందని మా నాన్న గారి ఆలోచన అది నాకు నచ్చలేదు అయితే కుటుంబ సభ్యులందరి వేధింపుకు తల వంచవలసి వచ్చింది సరేనన్నాను ఇక వధువుని వెదకడం పెద్ద సమస్య కాలేదు నరసాపురంలోనే దగ్గర బంధువుల అమ్మాయిని చేసుకోమన్నారు ఆ అమ్మాయి అన్నగారు నాకు ప్రాణ స్నేహితుడు మేము ఇద్దరం ఒక కంచాన తిని ఒక మంచాన పడుకునేవాళ్ళం నా తీరిక సమయమంతా వాళ్ళ ఇంట్లోనే గడిపేవాణ్ణి మా మిత్రుని చెల్లెల్ని వివాహం చేసుకోమన్నారు నాకు ఎందుకో మనస్కరించలేదు వాళ్ల అమ్మాయికి ఇతర సంబంధాలకోసం ప్రయత్నించారు మా వాళ్ళు నా కోసం ఒకటి రెండు సంబంధాలు చూసారు మా ప్రయత్నాలు గాని వాళ్ళ ప్రయత్నాలు గాని ఫలించలేదు వివాహాలు ఎక్కడ వ్రాసి ఉందో అక్కడే జరుగుతాయనే నమ్మకం నిజమైంది పెద్దల నిర్ణయానికి మరొకమారు తల వంచాను గొందిలో ఉపాధ్యాయవృత్తిలో ఉన్న చివరి రోజులలో నరసాపురంలో నా వివాహం చి॥ సౌ॥ లక్ష్మీ నరసమ్మతో జరిగిపోయింది సామాన్యంగా వివాహం విద్యని నాశనం చేస్తుందంటారు కాని నా విషయంలో దానికి వ్యతిరేకంగా జరిగింది

చిట్టవరంనుంచి గొంది ప్రాథమిక పాఠశాలకు బదిలీ కావడం పెనం మీదనుంచి నిప్పులో పడ్డట్టయింది ఊరికి బైట స్కూలు ఊళ్లోకి వెళ్ళి ఎవరితోను మాట్లాడే అలవాటు చేసుకోలేదు బడికి ఒకటి అర విద్యార్థులు వస్తే గొప్ప మధ్యాహ్న భోజనం ఏర్పాటు లేదు ఉదయం నరసాపురంలో చల్ది అన్నం తిని గోదావరి గట్టుమీద నవరసపురం చేరి అక్కడ ఏటిగట్టు దిగి పొలాల వెంబడి నడిచి గొంది చేరేవాణ్ణి ఆ దూరం కూడా ఐదు మైళ్ళకు తక్కువ ఉండేది కాదు ఐదు మైళ్ళు నడిచి వెళ్ళడం ఐదు మైళ్ళు సాయంకాలం తిరిగి నరసాపురం నడిచి రావడంతో సరిపోయేది బడికి వచ్చే పిల్లలు ఉండేవారు కాదు కాబట్టి పాఠాలు చెప్పే బాధ ఉండేది కాదు ఉదయం

స్కూలు సమయానికి తెరవడం, టైము అయిపోగానే మూయడం ఆ ప్రక్కనే ఉన్న చెరువులో మంచినీళ్ళు త్రాగి కడుపులో కాళ్ళు పెట్టుకుని బడిలోనే పడుకోవడం మధ్యాహ్నం బడి తెరవడం టైము ప్రకారం మూసివేయడం, నరసాపురానికి నడవడం ఇది నిత్య కార్యక్రమం ఇలా ఒక ఏడాది జరిగిపోయింది గొంది పాఠశాల ఏకోపాధ్యాయ పాఠశాల కావడం వల్ల మాట్లాడడానికి కూడా ఎవరూ ఉండే వారు కాదు

అంతలో స్కూళ్ళ ఇనస్పెక్టరుగారు గొంది పాఠశాల తనిఖీ చేయడానికి వస్తున్నారని వార్త ఆయన పరీక్షలో భాగంగా తయారు చేయవలసిన రికార్డులు మా నాన్న సహాయంతో తయారుచేసాను ఇక విద్యార్థుల సమస్య మిగిలింది మొదటిసారిగా ఊళ్ళోకి వెళ్ళి గ్రామ పెద్దలను కలిసి పాఠశాలకు ఇనస్పెక్టరుగారు వస్తున్న విషయం చెప్పాను నేను ట్రెయినింగు అయిన ఉపాధ్యాయుణ్ణి కావడం వల్ల నా ఉద్యోగానికి ఢోకా లేదు గాని పిల్లలు బడికి రాకపోతే పాఠశాల మూసివేసే అవకాశం ఉందని హెచ్చరించాను చెరువుకి అవతల గట్టున నగ్నంగా ఆకతాయిగా తిరుగుతున్న కరణంగారి కుమారరత్నం "ఏవిటిరోయ్ మాష్టరు లం- కొడకా ఏవిటో చెపుతున్నావని" పలకరించాడు నిస్సహాయంగా బాధపడి పెద్దలకు చెప్పవలసిన నాలుగుముక్కలు చెప్పి బడికి తిరిగి వచ్చాను ఆ మరుసటి రోజు ఇనస్పెక్షను ఒక పెద్ద కుర్రవానికి బడి తాళాలు ఇచ్చి ఉదయాన్నే బడి తెరచి కాస్త శుభ్రం చేసి ఉంచమని చెప్పి నరసాపురం వెళ్లాను

ఆ మరుసటి రోజు ఉదయం ఎంత పెందలాడే నరసాపురంనుంచి బయలు దేరినా నాకంటే ముందే ఇనస్పెక్టరుగారు గొంది చేరారు ఆయన రెండెడ్ల బండిలో ప్రయాణం చేసి చిట్టవరం మీదుగా గొంది చేరారు నేను గోదావరి గట్టు దిగేసరికి ఇనస్పెక్టరుగారి బంట్రోతు నాకోసం వస్తూ ఎదురయ్యాడు మేమిద్దరం నడిచి గొంది చేరాం జూనియర్ ఇనస్పెక్టరు శ్రీ లక్ష్మీ నారాయణగారు అప్పటికే రికార్డులు చూచి సంతకాలు చేసారు ఆశ్చర్యం ఏమిటంటే బడినిండా పిల్లలే ఆ క్రిందటి రోజున గ్రామ పెద్దలతో నా సంబాషణ ఫలితంగా పిల్లలంతా బడికి వచ్చారు ఇనస్పెక్టరు గారు వాళ్ళు చదివిన చదువులు పరీక్షిస్తానన్నారు ఆయనకు అసలు రహస్యం చెప్పాను నా మధ్యాహ్న భోజన విషయం అడిగారు మంచినీళ్ళే మధ్యాహ్న భోజనం అన్నాను అయితే బండి ఎక్కు అన్నారు ఇనస్పెక్షన్ అయిపోయింది ఆయన గొందినుండి ఏనుగువాని లంక స్కూలు తనిఖీ చేయడానికి వెళుతున్నారు

ఏనుగువాని లంక పాఠశాల హెడ్మాష్టరు ఇనస్పెక్టరుగారికి తన ఇంట్లో భోజనం ఏర్పాటు చేసారు అది విందు భోజనం ఇనస్పెక్టరు గారి పుణ్యమా

అంటూ నాకు కూడా భోజనం పెట్టారు ఆ సాయంకాలానికి ఇనస్పెక్టరు గారితో బాటు ఎడ్లబండిలో నరసాపురం చేరాను

అది నా జీవితంలో ఉపాధ్యాయవృత్తికి స్వస్తి పలికిన రోజు ఆ రోజున గొంది పాఠశాలలో ఉపాధ్యాయ పోష్టుకి రాజీనామా చేసాను అంతే దానితో మా ఇంట్లో కలకలం బంగారంలాంటి ఉద్యోగానికి రాజీనామా చేసి ఏమి చేయబోతున్నావని అందరి ప్రశ్న మా నాన్న, బాబాయిలు నా నిర్ణయాన్ని మార్చడానికి ప్రయత్నించారు నేను గౌరవించే డా॥ కోసూరి ఆదినారాయణ, ప్రముఖ ఫొటోగ్రాఫరు శ్రీ సిజె రావు గార్లచే చెప్పించారు ఫలితం లేకపోయింది నా నిర్ణయాన్ని మార్చుకోలేదు నెలకు 13 రూపాయల జీతం కోసం రోజుకి పది మైళ్ళు నడవడం, భోజన సదుపాయం లేకపోవడంతో పాటు మానసిక పరివర్తన రావడం నా నిర్ణయానికి తోడ్పడింది చేతిలో ఉన్న ఉద్యోగం వదులుకుని 8 వ తరగతి చదువుతో ఏమి చేయాలనేది నిజంగా జటిలమైన సమస్యే! కాని అవేవీ నన్ను బాధించలేదు, భయపెట్టలేదు

గొంది పాఠశాలలో ఉపాధ్యాయ ఉద్యోగానికి రాజీనామా చేసిన తరువాత భవిష్యత్ కార్యక్రమం గురించి ఆలోచన ప్రారంభించాను ఫోర్తు ఫారంలో చేరి అధమం S S L C యోగ్యత అయినా సంపాదించి పోలీసు సబ్ ఇనస్పెక్టరు ఉద్యోగం సంపాదించాలని అప్పటి ఆలోచన అప్పట్లో మా అమ్మమ్మ మంచెర్ల దుర్గమ్మ నరసాపురంలో ఉండేది నా ఆలోచన ఆమెకు చెప్పాను పిఠాపురంలో ఆమె ఇంటివద్ద ఉండి అక్కడ హైస్కూలులో ఫోర్తుఫారం చదవాలనే నా నిర్ణయం ఆమెకు చెప్పాను ఆమహాతల్లికి నా యందున్న ప్రేమ అపారం నేను చెప్పిన ఆలోచనకు ఆమె అంగీకరించింది పిఠాపురంలో తనకు బాకీ ఉన్నవారి పేర్లు కొన్ని చెప్పి వారి వద్ద ఆ డబ్బు వసూలు చేసుకోమంది మా నాన్న నా నిర్ణయం మార్చలేక పోయినందున నిరుత్సాహపడి నాకు ఏ విధమైన ఆర్థిక సహాయం చేయలేనన్నాడు పిఠాపురానికి ప్రయాణమయ్యాను ఆ తెల్లవారు ఝామున రైలుకి వెళుతూ మా నాన్నను లేపి వెళుతున్నానన్నాను చదివి ఏం చేస్తావన్నాడు సబ్ ఇనస్పెక్టరుని అవుతానన్నాను ఆయన ఏమీ అనలేదు ఫోర్తు ఫారంలో చేరడానికి పిఠాపురం వెళ్ళడంతో నా జీవితంలో మరో ఘట్టం ప్రారంభమైంది

నరసాపురంలో మిషన్ మిడిల్ స్కూలు ఇచ్చిన థర్డ్ ఫారం ట్రాన్స్ఫర్ సర్టిఫికెట్‌తో పిఠాపురం హైస్కూలులో చేరడానికి వెళ్లాను ఆ స్కూలు పేరు రాజారావు భావాయమ్మారావు ఉన్నత పాఠశాల అది పిఠాపురం మహారాజావారు నెలకొల్పిన హైస్కూలు అప్పట్లో శ్రీ భీమసేనరావు పంతులు గారు హైస్కూలు హెడ్‌మాష్టరు ఆయన పొట్టిగా లావుగా కొంచెం

కురచ చేతులతో ఉండేవారు ఆయన్ని కలుసుకుని ఫోర్తుఫారంలో చేర్చుకోమని అర్థించాను నా ధర్డుఫారం టిసి చూసి ఆయన ఆశ్చర్యపోయారు ధర్డుఫారం ప్యాసు అయి నాలుగేళ్ళు అయితే ఇంత ఆలశ్యంగా ఫోర్తు ఫారం చదవడానికి వచ్చేవేమిటి అన్నాడు నాకు అప్పటికి తోచిన సమాధానం చెప్పాను అయితే నేను హయ్యర్ గ్రేడు ట్రెయినింగ్ అయినట్లు గాని ప్రాధమిక పాఠశాలలో ఉపాధ్యాయవృత్తి చేసినట్టుగాని ఆయనకు చెప్పబుద్ధి వేయలేదు మా నాన్న ఆర్థిక ఇబ్బందులు మూలంగా నాకు హైస్కూలు చదువు చెప్పించ లేకపోయాడని ఆపద్ధర్మంగా అబద్ధమాడాను శ్రీ దువ్వ సూరయ్య గారు నాకు లోకల్ గార్డియన్ గా ఉంటారని ఉత్తరం ఇచ్చాను ఆయాపద గడిచి ఫోర్తు ఫారంలో చేరాను నాలుగేళ్ళ క్రితం వదిలిన చదువు మళ్ళా చదవడం సులభం కాదు నాకు బాగా గుర్తు మొదటిసారిగా కొన్న పుస్తకం రెన్ గ్రామరు మా అమ్మమ్మగారి పాకలో అరుగుమీద గోనెపట్టా మీద కూర్చుని కిరసనాయిలు బుడ్డి దీపం ముందు రెన్ గ్రామరు చదివేవాణ్ణి

స్కూలులో మా క్లాసు కుర్రవాళ్ళందరిలోను నేను వయస్సులో నాలుగేళ్ళు పెద్ద అంతే గాకుండా నేను అప్పటికే దాదాపు 6 అడుగుల పొడుగు ఉండేవాణ్ణి దానితో మా క్లాసు నాయకత్వం నాదే మా హైస్కూలు గుమాస్తాగారి కుమారుడు సూర్యప్రకాశరావు, ముద్దుగా కుటుంబం అని పిలుచుకునే కుటుంబరావు తెలివైనవాడిగా పరిగణింపబడే బంగారేశ్వర శర్మ మహారాజావారి బావమరిది సోములు బాబుగారి కుమారుడు మాధవబాబు, ఆటలలో మంచి దిట్టు అయిన చందనాల సుబ్బారావు, రామకృష్ణ మొదలైన మిత్రులు నా పిఠాపురం చదువు మరువరానిదిగా చేసారు ఇక ఉపాధ్యాయులలో శ్రీయుతులు వేపా అప్పారావు, కురిమెళ్ళ వెంకట్రావు, జగన్నాధరావు, చిత్రాడ శాస్త్రులు మొదలైనవారు చదువులోని ఆనందాన్ని, ప్రయోజనాన్ని గురించి నా మనస్సులో దృఢమైన ముద్ర వేసారు

నాకు నాటకాలయందు సరదా కలగటానికి స్కౌట్ మాష్టరు కురిమెళ్ళ వెంకట్రావుగారే కారణం మమ్మల్నందరినీ వరుసగా నిలబెట్టి రాముణ్ణి అరణ్యవాసానికి పంపేటప్పుడు దశరధుడు పెట్టిన ముఖం పెట్టండిరా ! అనే వారు అలా ఒకటి రెండు సన్నివేశాలలో ఆయనకు సంతృప్తి కలిగించిన విద్యార్థులను స్కూలు నాటకాల్లో పాత్రలు ఇచ్చేవారు ఆయన అభిమానించే విద్యార్థుల్లో నేను, రామకృష్ణ ఉండేవాళ్ళం ఆయన మహారాజావారితో ఇంగ్లండు, యూరోపు దేశాలతో పర్యటించారు తిరిగి వచ్చిన తరువాత మా స్కూలులో ఉపన్యాసాలు చెప్పేవారు ఆయన విదేశ యాత్రలలోని

అనుభవాలు, అందాలు చెప్పి మమ్మల్నందరినీ అలరించేవాడు భవిష్యత్తులో నేను విదేశాలలో ప్రయాణాలు చేస్తున్నప్పుడల్లా వెంకట్రావు మాష్టారు పిఠాపురం హైస్కూలులో చెప్పిన ఉపన్యాసాలు గుర్తుకు వచ్చేవి

ఇక నేను పిఠాపురం హైస్కూలులో చదువుకునే రోజుల్లో శ్రీ వేపా అప్పారావు గారు నేను మర్చిపోలేని మాష్టారు ఆయన విద్యార్థులచేత ఏ పాఠాన్నయినా చదివించడానికి నూతన పద్ధతిని కనిపెట్టారు ఆయన జాగ్రఫీ చెప్పేవారు జాగ్రఫీ చదవడాన్ని నిర్లక్ష్యం చేసే విద్యార్థుల్ని జాగృతం చేసి ఆ పీరియడ్ మళ్ళా ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూచేటట్టు చేసేవారు

పిఠాపురం హైస్కూలులో చదువు హాయిగా జరిగిపోతోంది నాలుగు సంవత్సరాలు చదువు మానివేసినా శ్రద్ధగా చదివి ఫోర్తుఫారంలో ఉత్తీర్ణుడయ్యాను హైస్కూలులో చదువు పుణ్యమా అని మంచి స్నేహితులు దొరికారు వారిలో చందనాల సుబ్బారావు ఆటలలో మంచి దిట్ట మా హైస్కూలునుంచి ఏ టీము ఆటలపోటీలకు వెళ్ళినా మా క్రీడాకారుల్ని ఉత్తేజపరచడానికి నన్ను కూడా టీముతో పాటు పంపేవారు ఆ రోజుల్లో పుట్టిన ఆటల సరదా ఈనాటివరకు నన్ను వదలలేదు సోములు బాబుగారి చిన్న కుమారుడు మాధవబాబు స్నేహం వల్ల నాకు విచిత్రమైన సమస్య ఉత్పన్నమైంది మామూలుగా బడినుంచి ఇంటికి నడిచి వస్తే ఏ సమస్యా లేదు కాని మిత్రుడు మాధవబాబు రాజావారి కోటకు వెళుతూ తాను వెళ్ళే గుర్రపు బగ్గీలో నన్ను మా ఇంటివద్ద దిగబెడతాననే వాడు అది కోటనుంచి వచ్చిన గుర్రపుషార్టు అని అందరికీ తెలుసు దానిలో దుర్గమ్మ మనుమడు ఇంటికి రావడం అందరికీ ఆశ్చర్యంగా ఉండేది ఆ గుర్రపు బగ్గీలో వచ్చి మా చిన్న పాకముందు దిగడానికి నాకు కూడా బాధగా ఉండేది ఆ బండిలో కొంతదూరం వచ్చి మా వీధి మొగలో దిగిపోయేవాణ్ణి ఇది మా అమ్మమ్మకు తెలిసింది వెంటనే మా ప్రక్క వీధిలో ఉన్న బియ్యపు వర్తకుడు వెంకట్రామయ్యగారి పెంకుటింట్లో కొట్టుగది అద్దెకు పుచ్చుకుని దానిలో చదువుకోమంది

పిఠాపురం రైల్వేస్టేషను దగ్గరలోనే స్కూలు భవనం దాని దగ్గరగానే సోములు బాబుగారి భవనం స్కూలు అయిపోయిన తరువాత సెలవు దినాల్లో మాధవబాబు, అతడి స్నేహితులతో కాలం గడిపేవాణ్ణి వారంతా వెలమలు వారి పేర్ల తరువాత దొర అనే గౌరవపదం ఉంటుంది మాధవరావు దొర, సత్యనారాయణ దొర అని పిలిచేవారు అలా దొర అని పిలిపించుకునే మరో కులం ఒంటరులు ఒళ్ళు బలిసిన కాపులు ఒంటరులు అవుతారని వేళాకోళంగా అనేవాణ్ణి మాతో బాటు చదువుకునే సూర్యారావు దొర అనే విద్యార్థి

దురదృష్టవశాత్తు మరణించాడు హెడ్మాష్టరు సెలవు ఇవ్వడానికి నిరాకరించాడు ఆయన అనుమతి లేకుండా మా క్లాసువాళ్లమంతా అతడి ఇంటికి వెళ్ళి మా విచారం వ్యక్తం చేసాం హెడ్మాష్టారికి చాలా కోపం వచ్చింది తన ఆజ్ఞను విద్యార్థులు లక్ష్యపెట్టకపోవడానికి నేనే కారణమని భావించి ఆయన నా మీద కోపం పెట్టుకున్నారు మా స్కూలు హెడ్ గుమాస్తాగారి అబ్బాయి సూర్యప్రకాశరావు మా స్నేహితుడు అతని ద్వారా హెడ్మాష్టారు నా మీద కోపంగా ఉన్నారు కాబట్టి జాగ్రత్తగా ఉండమని ఆయన సలహా ఇచ్చారు ఆయనకు నేనంటే వల్లమాలిన అభిమానం ఏ కారణం వల్లనైనా నేను సమయానికి జీతం కట్టలేకపోతే ఆయనే కట్టి వేసే వారు అప్పట్లో స్కూల్ ఫైనల్ పరీక్షకు విద్యార్థుల్ని పంపడం, పంపకపోవడం హెడ్మాష్టరు ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉండేది నన్ను స్కూలు ఫైనల్ పరీక్షకు హెడ్మాష్టరు పంపకపోవచ్చునని మా హెడ్ గుమాస్తాగారికి అనుమానం తట్టి స్కూలు ఫైనల్ చదవడానికి మరేదైనా స్కూలుకి వెళ్ళమని సలహా ఇచ్చారు అది బ్రహ్మాండమైన సమస్యగా కనిపించింది

మా అన్నయ్య నాటకాల పిచ్చిలో పడి ఇంటర్మీడియేట్‌లో ఉత్తీర్ణుడు కాలేక చదువు మానివేసాడు కొచ్చెర్ల కోట రంగారావుతో రంగూన్ రౌడీ మొదలైన నాటకాలు వేస్తూ తిరిగేవాడు మా అన్నయ్య పిఠాపురం వచ్చి స్థానం నరసింహారావు నాటకాలు కాంట్రాక్టు చేస్తే ఆయనకు గాని, నాకు గాని ధనలోపం ఉండదని ప్రోత్సహించాడు స్థానం వారి నాటకాలు మూడు కాకినాడ, అనకాపల్లి, విజయనగరంలో వేయించడానికి అంగీకరించి మా అమ్మమ్మకు తెలియకుండా ఆమె మిత్రులనుంచి డబ్బు అప్పు తీసుకుని నాటకాల కాంట్రాక్టులో పట్టాము కాకినాడలో శ్రీ స్థానం నరసింహారావుని ఊళ్ళో ఊరేగించవలసి వచ్చింది అవి కాంట్రాక్టు నాటకాలరు చెడ్డరోజులు పెద్ద నటులు వస్తారని ప్రచారం చేసి నాటకం రాత్రికి వారు రాకపోవడంతో ప్రజలలో నమ్మకం పోయిన రోజులు కాకినాడ నాటక ప్రదర్శన పరవాలేదు అనకాపల్లిలో బ్రహ్మాండమైన ప్రేక్షకులు ఇక విజయనగరం పూర్తిగా నిరాశ మిగిల్చింది నటులకు కాంట్రాక్టు డబ్బు సరిపెట్టేసరికి నాకు మా అన్నయ్యకు తిరుగు ప్రయాణానికి డబ్బులు కరువయ్యాయి ఆ భారం మాట దేవుడెరుగు పిఠాపురంలో చేసిన అప్పులు తీర్చడానికి కూడా డబ్బులు మిగలలేదు నాకు అప్పు ఇచ్చిన వారంతా ఇంత కుర్రవానికి అప్పు ఇచ్చి [illegible] చేసామనుకున్నారు కాని మా అమ్మమ్మకు మా సోదరుల సమాధానం చెప్పిన తరువాత అప్పులవాళ్ల సొమ్ము తీర్చడానికి అంగీకరించింది

ఇన్ని గొడవలలోను చదువు విషయంలో అశ్రద్ధ చేయలేదు ఫిఫ్త్ ఫారం

పరీక్షలలో ఉత్తీర్ణుడయ్యాను స్కూలు ఫైనల్ ఎక్కడ చదవడం అన్నది సమస్య అయింది బందరులో మా నాలుగవ బాబాయి గోపాలకృష్ణమూర్తి గారు ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీలో అకౌంటెంటు ఉద్యోగంలో ఉన్నారు ఆయన వద్దనే ఉండి మా అన్నయ్య కళాశాల చదువు చదివాడు నాకు ఎలాగో అప్పట్లో స్కూలు ఫైనల్ కంటే హెచ్చు చదువు చదివే ఆలోచన లేనందున ఆ ఒక్క సంవత్సరం బందరులో బాబాయిగారింట్లో ఉండి స్కూల్ ఫైనల్ చదవడానికి నిర్ణయించాను పిఠాపురంలో పెంచుకున్న స్నేహాలు, ఆప్యాయతలు ఒక ప్రక్క, మా అమ్మమ్మ ప్రేమ అనురాగం మరోప్రక్క పిఠాపురాన్ని వదలనివ్వలేదు అయినా తప్పనిసరిగా మరొకసారి పిఠాపురం వదలవలసి వచ్చింది అంతే మళ్ళీ పిఠాపురం వెళ్ళిన గుర్తు లేదు

బందరులో ఉన్న నోబుల్ హిందూ హైస్కూళ్ళలో నాకు సీటు దొరకలేదు చివరకు శ్రీ రామా హైస్కూలులో చేరాను దానిని బందరులో డబ్బా హైస్కూలు అనేవారు తెలివైన విద్యార్థులు ఆ స్కూలులో చదవరని ఒక ప్రతీతి ఇక ఏ దారి లేక ఆ స్కూలులో చేరాను అప్పట్లో స్కూలు ఫైనల్‌లో ఆప్షనల్ సబ్జెక్టు ఉండేది నేను ఫిజిక్సు ఆప్షనల్‌గా తీసుకున్నాను శ్రీనివాసరావుగారు హెడ్మాష్టరు చాలా సమర్థుడు ఆ సంవత్సరం రెండు ముఖ్య సన్నివేశాలు జరిగాయి మొదటిది నరసాపురంలో మా నాన్నగారి మరణం రెండవది బందరు హిందూ కళాశాలలో విద్యార్థుల సమ్మె మా నాన్నగారి ఆరోగ్యం బాగాలేదు గాబట్టి వెంటనే బయలుదేరి రమ్మని టెలిగ్రాం వచ్చింది ఆ సాయంకాలానికి నరసాపురం చేరాను ఆ రాత్రి మా నాన్నగారు మరణించారు అప్పటికి ఆయన వయస్సు 54 అని గుర్తు మా అమ్మ పోయిన తరువాత ఆయన మళ్ళా పెళ్ళి చేసుకున్నాడు మా మంగమ్మ పిన్ని గారికి ఇద్దరు ఆడపిల్లలు రాఘవమ్మ రంగనాయకమ్మ ఒక కుమారుడు సుబ్బయ్యనాయుడు మా నాన్నగారికి తలగోరు నేనే పెట్టాలని నిర్ణయించారు మా అన్నయ్య బందరులోనే ఉన్నాడు కాని ఆయన భార్య గర్భవతి కావడం మూలంగా తలగోరు పెట్టగూడదన్నారు ఆ బాధ్యత నా మీద పడింది 12 రోజులు నరసాపురంలో ఉండి పోవలసి వచ్చింది పిత్రార్జితంగా నాకు అందినది 250 రూపాయలు మాత్రమే

బందరు తిరిగి వెళ్ళేసరికి హిందూ కళాశాలలో విద్యార్థుల సమ్మె జరుగుతోంది నిజంగా ఆ సమ్మెతో హైస్కూలు విద్యార్థినైన నాకు ఏమీ సంబంధం లేదు కాని విద్యార్థుల సమస్యల పరిష్కారానికి జరిగే సమ్మెలో నేను కూడా చిన్న నాయకుణ్ణి అయ్యాను ఆరోజుల్లో కళాశాల వద్ద పట్టణంలోని ముఖ్య ప్రదేశాలలోను విద్యార్థుల సమ్మె సందర్భంగా జరిగిన

బహిరంగ సభలలో నా ఉపన్యాసాలు జోరుగా సాగేవి చదువుని అశ్రద్ధ చేసి విద్యార్థుల సమ్మె గొడవలలో తిరుగుతున్నందుకు మా చిత్రరేఖ పిన్ని బాబాయితో ఫిర్యాదు చేసేది "మనవాడి ఉపన్యాసాలు బాగుంటున్నాయని పట్టణంలో పెద్దలు చెప్పుకుంటున్నారని" బాబాయి ఆమెకు చెప్పడం పరోక్షంగా విన్న నాకు సంతృప్తిగా ఉండేది

స్కూల్ ఫైనల్ పరీక్షలు వ్రాసాను లెఖ్ఖల పేపరు పాడుచేసినట్లు అనిపించింది ఆ మాటే మా రెండవ బాబాయిగారికి వ్రాసాను చిత్రం ఏమిటంటే పరీక్ష ఫలితాలు చూస్తే లెఖ్ఖలలో మంచి మార్కులే వచ్చాయి కాని ఆప్షనల్ ఫిజిక్స్‌లో నూటికి 34 మార్కులు వచ్చాయి పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాను కాని అప్పటి నిబంధనల ప్రకారం ఆప్షనల్‌లో నూటికి35 మార్కులు వస్తే గాని పోలీస్ సబ్ ఇనస్పెక్టరు ఉద్యోగానికి దరఖాస్తు పెట్టడానికి వీలులేక పోయింది ఉపాధ్యాయవృత్తికి స్వస్తి చెప్పి మళ్ళా చదువు ప్రారంభించినపుడు స్కూల్ ఫైనల్ ధ్యేయంగా పెట్టుకున్నాను ఆప్షనల్ ఫిజిక్స్‌లో వచ్చిన అత్తెసరు మార్కుల పుణ్యమా అంటూ ప్రభుత్వ ఉద్యోగాలకు దరఖాస్తు పెట్టుకోడానికి వీలు లేక పోయింది మళ్ళీ జీవిత సమస్య మొదటికి వచ్చింది

స్కూలు ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాననే సంతోషం లేకుండా పోయింది ఉద్యోగ ప్రయత్నానికి ఫిజిక్సులో వచ్చిన అత్తెసరు మార్కులు అడ్డు తగిలాయి ఇంటర్‌మీడియేట్ చదవరాదా అని మిత్రులు సలహా చెబితే ఇంటర్ చదివి ఏమి చేస్తామని నేనే అనేవాణ్ణి అప్పటి నా పరిస్థితులలో డిగ్రీ చదువుకి వెళ్ళగలననే ఆశ గాని, ఆర్థిక స్తోమత గాని లేవు చివరకు మరుసటి సంవత్సరం స్కూల్‌ఫైనల్ పరీక్షలో ఫిజిక్స్ పరీక్షకు కూర్చుని 35 మార్కులు తెచ్చుకోవాలని నిర్ణయించాను అప్పుడే మా బాబాయిగారి పెద్దమ్మాయి లలితాదేవికి డబుల్ టైఫాయిడ్ ఆమె తిరిగి కోలుకోవడానికి రెండుమాసాలు పట్టింది అంతవరకు ఖాళీగా ఉన్న నేను ఆమె ఆరోగ్యవంతురాలు కావడానికి నా సేవలు అందించాను ఆమె సంపూర్ణ ఆరోగ్యవంతురాలైంది నేను పనీపాటు లేకుండా ఇంటివద్ద కూర్చుని కాలక్షేపం చేసేవాణ్ణి బందరులో మా బాబాయి దశికవారి ఇంట్లో అద్దెకు ఉండేవాడు ఆ ఇంటి వెనుక సందులో మిత్రులు ఎమ్.ఎస్.బి ప్రసాద్, అచ్యుత దేవరాయలు ఉండేవారు ప్రసాద్, అడ్వకేటు గారైన మల్లంపల్లి భైరవ ప్రసాదరావుగారి కుమారుడు రాయలు శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి పెద్ద కుమారుడు నాకు వారు మంచి మిత్రులు వారిద్దరూ చాలా తెలివైనవారు స్కూలు ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణులై హిందూ కళాశాలలో లెఖ్ఖలు, ఫిజిక్స్, కెమిస్ట్రీ గ్రూపు సబ్జెక్టుగా తీసుకుని

ఇంటర్‌మీడియేట్ చదువుతున్నారు

కళాశాలలు తెరిచారు ఒక రోజు సాయంకాలం మా ఇంటి అరుగుమీద కూర్చుని ఆలోచిస్తూ ఉండగా ఒక ఆలోచన వచ్చింది కళాశాలలో ఎందుకు చేరకూడదూ! అని నాకే నవ్వువచ్చింది అంతవరకు కళాశాలలో చేరడంలో ఉన్న కష్టాలు, డిగ్రీ చదవలేని ఇంటర్ చదువుయొక్క నిరుపయోగం గురించి మిత్రులందరికీ చెప్పే నాకే కళాశాలలో చేరాలని ఆలోచన రావడం ఆశ్చర్యం అయితే ఆలోచన రావడంతో సరిపోదుకదా! అప్పటికి కళాశాలలో మొదటి టర్మ్ అయిపోతోంది అంతే కాకుండా కళాశాలలో చేరడానికి డబ్బు ఎక్కడనుంచి తేవడం? అనే సమస్యలు బాధించసాగాయి నాకు వచ్చిన ఆలోచన ఎవరికీ చెప్పలేదు రెండు మూడు రోజులు మధనపడ్డాను మా అమ్మమ్మను డబ్బు అడుగుదామనుకున్నాను ఆమె మా అన్నయ్య వద్ద కోరుకొండలో ఉంది బందరునుంచి కోరుకొండ వెళ్ళడానికి చేతిలో కానీ లేదు

అంతలో మా పిన్నిగారి మేనకోడల్ని అమలాపురంలో ఆమె అత్తవారింట్లో దిగబెట్టి రమ్మన్నారు దారి ఖర్చులు ఇచ్చారు శ్రీమతి హేమన్నను అమలాపురంలో క్షేమంగా దింపి తిరిగి బందరు రాకుండా కోరుకొండ వెళ్ళాను మా అమ్మమ్మతో నేను కళాశాలలో చేరాలనుకుంటున్నట్లు చెప్పాను ఆమె వద్ద డబ్బు లేదు మా కృష్ణమూర్తి బాబాయిగారి పేర ఒక ఉత్తరం వ్రాసి మా అమ్మమ్మ వేలి ముద్ర వేయించి ఆ ఉత్తరం తీసుకుని బందరు తిరిగి వచ్చాను ఆ మరునాడు ఉదయం బాబాయి ఆఫీసుకు వెళ్ళేటప్పుడు కూడా వెళ్లి ఆ ఉత్తరం ఇచ్చాను నేను కళాశాలలో చేరడానికి కావలసిన సొమ్ము ఆయన అప్పుగా ఇస్తే ఆ మొత్తం మా అమ్మమ్మ తీర్చడానికి అంగీకరించింది అది చదివి మా బాబాయి ఆశ్చర్యపోయాడు మా దుర్గమ్మ మామ్మమీద అభిమానంతో అంగీకరించాడు ఆర్థిక సమస్య మా అమ్మమ్మ పుణ్యమా అంటూ తాత్కాలికంగా తీరింది అక్షర జ్ఞానం లేని మా అమ్మమ్మ నేను ఫోర్తు ఫారం చదవడానికి పిఠాపురం వెళ్ళినా బందరులో కళాశాల చదువు ప్రారంభించినా నాకు ఆర్థిక సహాయం చేసి విద్యాభిక్ష పెట్టింది మా బాబాయి నా కళాశాల చదువుకి అడ్డు పెట్టలేదు కాని కొన్ని నియమాలు పెట్టాడు హాయిగా భోంచేసి చక్కగా చదువుకోవాలి రోజూ సాయంకాలం 8 గంటలకు ఇంటికి చేరాలి ఉదయం 7 గంటల తరువాత నిద్రపోకూడదు సినిమాలు నెలకు ఒకటో రెండో కుటుంబం అందరితోను కలిసి వెళ్లి చూడవచ్చును కళాశాల ఫీజులకు గాని ఇతర ఖర్చులకు గాని ఆయన్ని డబ్బు అడగకూడదు

ఇదంతా బాగానే ఉంది ముందు కళాశాలలో సీటు సంపాదించాలి కదా శ్రీ కాజ శివరామ కృష్ణారావు పంతులుగారు బందరు హిందూ కళాశాల ప్రిన్సిపాల్ కళాశాలకి వెళ్ళి ప్రిన్సిపాల్‌ని కలుసుకున్నాను నా స్కూలు ఫైనల్ మార్కులు చూచి ఆయన ఏమీ అనలేదు అప్పుడే కళాశాల తెరిచి మూడు మాసాలయిపోతున్నందున అటెండెన్సు తక్కువ కావచ్చునన్నారు అనారోగ్యకారణాలవల్ల ఒక రోజు కళాశాల మానివేసినా చాలా కష్టం అవుతుందన్నారు ఆయన నేను చచ్చిపోవలసివస్తే కళాశాల బల్లమీదే చచ్చిపోతాను తప్ప సెలవు పెట్టనని ప్రిన్సిపాల్ గారికి హామీ ఇచ్చాను ఆయన ఏమనుకున్నారో తెలియదు గాని వెంటనే అప్లికేషన్ పూర్తి చేసి జీతం కట్టమన్నారు ఆనందంగా అప్లికేషన్ పూర్తిచేయడానికి కళాశాల వెయిటింగ్ రూమ్‌లో కూర్చున్నాను అంతలో కళాశాల హెడ్ ప్యూను వచ్చి ఇంత ఆలస్యంగా కళాశాలలో చేరుతున్నావేమిటని అడిగి, గ్రూపు ఏవిటి తీసుకుంటున్నావన్నాడు దర్జాగా యం పి సి అన్నాను అతను ఆశ్చర్యపోయాడు అప్పుడే సైన్సులలో చాలా పాఠాలు అయిపోయాయి అంతే గాకుండా ఫిజిక్స్, కెమిస్ట్రీలలో అనేక ప్రయోగాలు అయిపోయాయి వాటిని అందుకోవడం సాధ్యం కాదు కాబట్టి హాయిగా ఇండియన్ హిస్టరీ, యూరోపియన్ హిస్టరీ, లాజిక్ గ్రూపు తీసుకోమని సలహా ఇచ్చాడు ఇండియన్ హిస్టరీ బాలకృష్ణ శాస్త్రి గారు గొప్పగా చెబుతారని, లాజిక్ లెక్చరర్ ఇంటికి పిలిచి పాత కోర్సు చెప్పేటంత మంచివాడని గ్రూపు విషయంలో నా మనస్సు మార్చేసాడు మనస్సు మార్చడమేమిటి, అతడు నా చేయి పట్టుకుని వ్రాయించినట్టనిపించింది గ్రూపు రెండు హిస్టరీలు, లాజిక్ అని వ్రాసాను ఆ అప్లికేషన్‌తో ప్రిన్సిపాల్‌గారి వద్దకు వెళ్లాను ఆయన ఏమీ అనకుండా'అడ్మిట్' అని వ్రాసారు జీతం కట్టి వేసాను అలా నా కళాశాల చదువు ప్రారంభమయ్యింది

బందరు హిందూ కళాశాలలో నా ఇంటర్‌మీడియేట్ చదువు మొదటి సంవత్సరం ఏ విధమైన వడిదుడుకులు లేకుండా జరిగిపోయింది శ్రీ ముత్తు అయ్యర్ ఇంగ్లీషు, బాలకృష్ణ శాస్త్రిగారు ఇండియన్ హిస్టరీ, శంకరం మాష్టారు లాజిక్ జానకి రామయ్యగారి తెలుగు పాఠాలు విద్యార్థుల్ని ప్రత్యేకంగా ఆకర్షించేవి ఆ కళాశాల ఉపాధ్యాయుల బృందం విద్యార్థుల పట్ల అత్యంత అభిమానంతో ఉండేవారు పుస్తకాలు కొనే ఆర్థిక స్తోమత లేనందున ఇంగ్లీషు తెలుగు విశ్వనాధ అచ్యుత దేవరాయలు వద్ద కూర్చుని అతడు చదువుతుంటే వినేవాణ్ణి మా లాజిక్ మాష్టారు ఇంటివద్ద కుర్చోబెట్టుకుని పాఠాలు చెప్పేవారు మొదటి సంవత్సరం గడిచిపోయింది ఇక రెండవ సంవత్సరంలో నా జీవితంలో ఒక ప్రక్క ఆనందం మరొకప్రక్క విషాదం చవి చూడవలసి

వచ్చింది

ఆ సంవత్సరం ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు నిర్వహించే అంతర్ విశ్వవిద్యాలయ వక్తృత్వ పోటీలకు మా కళాశాలనుంచి తెలుగులో పోటీ చేయడానికి నన్ను, కాజ సత్యనారాయణ మూర్తిని ఎంపిక చేసారు వాల్తేరు వెళ్ళాం విశ్వవిద్యాలయంలో తెలుగు వక్తృత్వ పోటీలకు 27 కళాశాలలనుంచి టీములు వచ్చాయి వాటిలో రాజమండ్రి నుంచి వచ్చిన టీములో కొత్తపల్లి వీరభద్రరావు ఉన్నాడు నేను మిత్రుడు కాజ కలిసి వక్తృత్వ పోటీలలో విజయం సాధించాము ఇక వ్యక్తిగత ఛాంపియన్‌షిప్ కప్పు కోసం అన్ని కళాశాలలు పోటీచేసాయి ఆ పోటీకి ఇచ్చిన విషయం అహింసకు సంబంధించినదని గుర్తు నేను హింస లేకుండా అహింస లేదని మాట్లాడాను దానితో విశ్వవిద్యాలయంలో తెలుగు వక్తృత్వంలో ఆ సంవత్సరానికి నన్ను ఛాంపియన్‌గా నిర్ణయించారు ఇక చూడండి ఎరుగున్నవారు, ఎరగనివారు అనే బేదం లేకుండా విశాఖపట్నంలో ఉన్న అన్ని కళాశాలల విద్యార్థులు, విద్యార్థినులు అభినందనల వర్షం కురిపించారు కరచాలనం చేసి చెయ్యి నొప్పి పెట్టింది ఆ ఆనందం జీవితంలో మొదటిసారి అనుభవించాను వైస్ ఛాన్సలర్ డా కట్టమంచి రామలింగారెడ్డి ఛాంపియన్‌షిప్పు కప్పు ఇస్తూ నన్ను హీరోగా అభివర్ణించారు హిందూ కళాశాల టీమ్ కప్పు గెలవడంలో తోడ్పడి నేను వ్యక్తిగత ఛాంపియన్‌షిప్పు గెల్చుకోవడం నాకు, మా కళాశాలకి కూడా గర్వకారణం

ఇంటర్‌మీడియేట్ రెండవ సంవత్సరం ఆఖరి టర్మ్‌లో ఉండగా నా చదువుకి స్వస్తి చెప్పవలసిన పరిస్థితి ఏర్పడింది అది ఊహించని విధంగా జరిగిపోయింది శ్రీ వి బి కృష్ణశాస్త్రి యూరోపియన్ హిస్టరి పాఠం చెబుతున్నారు ఆయన కారాకిళ్ళీ నోట్లో ఉంచుకుని పాఠం చెప్పేవారు నేను సాధారణంగా వెనుక బెంచీలో కూర్చునే వాణ్ణి అనుకోకుండా ఆయన నన్ను ఉద్దేశించి "నీవు పాఠం వినడం లేదు" అన్నారు నేను వింటున్నానన్నాను "నీవు నావైపు చూడడం లేదు" అన్నారు నేను పాఠం వినడానికి మీ ముఖం చూడనక్కరలేదనుకుంటూ నన్నాను దానితో ఆయనకు చాలా కోపం వచ్చి నన్ను క్లాసులోనుంచి వెళ్ళిపొమ్మన్నారు నేను పుస్తకాలు తీసుకుని క్లాసునుంచి బైటకు వచ్చాను శాస్త్రి మాష్టారు ఊహించని రీతిలో ఆ క్లాసులో ఉన్న విద్యార్థులు, విద్యార్థినులు క్లాసు ఖాళీ చేసి బైటకు వచ్చేసారు పాపం శాస్త్రి గారికి మతిపోయింది

ఆయన ప్రిన్సిపాల్ వద్దకు వెళ్ళి సూర్యనారాయణమూర్తి క్లాసు విద్యార్థుల్ని ప్రోత్సహించి తన క్లాసునుంచి బైటకు తీసుకువెళ్ళిపోయాడని

రిపోర్టు చేసారు అంతే, ప్రిన్సిపాల్ గారు నన్ను కళాశాలనుంచి బహిష్కరించారు మూడు నెలల్లో ఫైనల్ పరీక్షలు ఉన్నాయనగా ప్రిన్సిపాల్ గారి నిర్ణయంతో నా నెత్తిన పిడుగు పడింది దిక్కు తోచని పరిస్థితి మా బాబాయిగారి మిత్రులలో ప్రముఖులు ప్రిన్సిపాల్ గారికి చెప్పి చూసారు ఆయన వారి సలహా వినలేదు పోనీ మరేదైనా కళాశాలలో చేరదామని ప్రయత్నించాను విజయవాడ కళాశాల ప్రిన్సిపాల్ గారిని కలుసుకుని నా పరిస్థితి విశదీకరించాను ఆయనపేరు గుర్తు లేదు కాని ఆయన ఇంత ఆలస్యంగా కళాశాలలో చేర్చుకోవడానికి వీలులేదన్నారు చివరకు ఆయనే నేను కళాశాలలో చేరడానికి దోహదం చేసారు ఆ వారం జరిగిన విశ్వవిద్యాలయం సెనేట్ సమావేశంలో విజయవాడ కళాశాల ప్రిన్సిపాల్ గారు వైస్ ఛాన్సలర్‌కి నా పరిస్థిని చెప్పారు మాటలో మాటగా ఆ విద్యార్థి విశ్వవిద్యాలయం వక్తృత్వ పోటీలలో ఛాంపియన్‌షిప్పు గెల్చుకున్నాడని గుర్తు చేసారు డా కట్టమంచి మా కళాశాల ప్రిన్సిపాల్ గారివైపు చూసి "ఏవిటి విశేషం" అన్నారట విశేషం ఏమీలేదని వైస్ చాన్సలర్‌తో చెప్పి మా ప్రిన్సిపాల్ బందరు తిరిగి రాగానే నాకు కబురు పెట్టి కళాశాలలో చేరమన్నారు గ్రహణం విడిచిపోయింది

కళాశాలలో చేరడంతో మనస్సు కుదుటపడింది చిత్రం ఏమిటంటే కళాశాల వైస్ ప్రిన్సిపాల్ పత్రి శేషగిరిరావుగారు, చిట్టా బాలకృష్ణ శాస్త్రిగారు మా ఇంటికివచ్చి నాకు సానుభూతి తెలియజేసి నన్ను శ్రద్ధగా చదవమని ప్రోత్సహించారు లెక్చరర్లలోను, విద్యార్థుల్లోను, శ్రేయోభిలాషులు మిత్రులలో నాయందు బ్రహ్మాండమైన సానుభూతి వ్యక్తమైంది కళాశాల జీతాలు కట్టడానికి నానా అవస్థపడే నేను కళాశాల యాజమాన్యంతో పేచీ పెట్టుకునే స్థితిలో లేను కళాశాలలో తిరిగి చేరిననాటినుంచి శ్రద్ధగా చదివాను అదృష్టం బావుండి ఇంటర్‌మీడియేట్ లో ఫస్టుక్లాసు వచ్చింది సామాన్యంగా ఫస్టుక్లాసులు సైన్సు లెఖలు విద్యార్థులకు వస్తాయి మా కళాశాలలో అప్పటికి పదకొండు ఏళ్ళుగా హిస్టరీ గ్రూపు విద్యార్థికి ఫస్టుక్లాసు రాలేదు మాతో హిస్టరీ గ్రూపుతో చదివిన కేశవరావుకి ఫస్టుక్లాసు వస్తుందని అందరూ ఆశించారు తీరా ఫలితాలు చూస్తే ఫస్టుక్లాసు నాకు వచ్చింది నా మిత్రులంతా బ్రంహానందపడ్డారు నేను ఆనందించానని వేరే వ్రాయనక్కరలేదు అప్పుడే మా బాబాయిగారి పెద్ద అల్లుడు రావిపాటి చక్రధరరావుగారు బందరులో ఉన్నారు ఆయన నాకు హిస్టరీ గ్రూపులో ఫస్టుక్లాసు రావడం చాలా గొప్పని, విశ్వవిద్యాలయంలో బి ఏ ఆనర్సులో చేరితే స్కాలర్‌షిప్పు వస్తుందని నన్ను ప్రోత్సహించారు

పదవ తరగతితో చదువు పూర్తి చేద్దామనుకున్న నేను ఇంటర్‌మీడియేట్ చదవడం, దానిలో ఫస్టుక్లాసు రావడం, దానితో విశ్వవిద్యాలయంలో చదవాలని సలహాలు రావడం నన్ను పూర్తిగా గందరగోళంలో పడేసింది కూర్చుని లేవలేనివాడు దేకుతూ స్వర్గానికి వెళ్ళాడని సామెత మా అమ్మమ్మ పుణ్యమా అని పదవ తరగతి, ఇంటర్‌మీడియేట్ పూర్తి చేయగలిగాను విశ్వవిద్యాలయం చదువు అనుకున్నంత సులభం కాదు సందిగ్ధంలో పడ్డాను విశ్వవిద్యాలయంలో చదువు నాకు సాధ్యం కాదనిపించింది ఆ పరిస్థితిలో శ్రీ గుడిసే సుబ్బారావు గారు నా విద్యా రక్షకునిగా తటస్థపడ్డారు

బందరులో నేను మా బాబాయిగారి ఇంటిదగ్గర విశ్వవిద్యాలయం చదువుకోసం ఎదురు చూస్తూ ఆశ నిరాశల మధ్య అల్లాడుతూ కూర్చున్నాను ఆ మహానుభావుడు సుబ్బారావుగారు ఆ రోజుల్లో ఇంపీరియల్ బ్యాంకు (నేటి స్టేట్ బ్యాంకు) లో ఉద్యోగం చేసేవాడు పట్టణంలోని వ్యాపారులంతా ఆయనకు తెలుసు ఎవరివద్దకు వెళ్ళాడో ఏమి చెప్పాడో నాకు తెలియదు గాని వారం రోజులు తిరగకుండా నేను వైజాగ్ విశ్వవిద్యాలయంలో చేరడానికి కావలసిన ఏర్పాట్లన్నీ ఆయన పూర్తి చేసారు విశ్వవిద్యాలయానికి కట్టవలసిన సొమ్ము ప్రయాణఖర్చులు నా చేతిలో పెట్టి నేను విశాఖపట్నంలో ఉండడానికి చేసిన ఏర్పాట్లు చెప్పి నన్ను ప్రయాణం చేయించారు ఆయనకు ముగ్గురు మగ పిల్లలున్నారు కాని ఆయన నా విషయంలో తీసుకున్న శ్రద్ధ పుత్రవాత్సల్యాన్ని అధిగమించింది అంతకు పూర్వం ఆయన్ని అంత బాగా ఎరగను అయినా నా చదువు యందు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని తాను ఎరిగినవారివద్ద చందాలు వసూలు చేసి నేను విశ్వవిద్యాలయం చదువుకి వెళ్ళడానికి తోడ్పడ్డ ఆయన ఋణం తీర్చుకోలేనిది నాకు ఇంటర్‌మీడియేట్‌లో ఫస్టుక్లాసు వచ్చింది కాబట్టి విశ్వవిద్యాలయంలో స్కాలర్‌షిప్ వస్తుందని ధైర్యం ఉంది ఆ స్కాలర్‌షిప్పుల నిర్ణయం జరిగేవరకు విశాఖపట్నంలో డాబా గార్డెన్సులో ఉండే శ్రీ బానోజీరావుగారితో మాట్లాడి ఆయన ఇంట్లో ఉండే ఏర్పాటు చేసారు

శ్రీ సుబ్బారావుగారి పుణ్యమా అంటూ ఆంధ్రా విశ్వవిద్యాలయంలో చేరాను అప్పట్లో హిస్టరీ ఎకనామిక్స్, పోలిటిక్స్ మూడు సబ్జెక్టులు కలిసి ఉండేవి వాటిలో ఒకటి ముఖ్యాంశంగా తీసుకుని మిగిలిన రెండూ జనరల్‌గా చదవడానికి ఏర్పాటు ఉండేది ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు పొలిటిక్స్ చెప్పేవారు ఆచార్య వి ఎస్ క్రిష్ణ ఎకనామిక్స్ ప్రొఫెసరు శ్రీ గొర్తి వెంకటరావు గారు హిస్టరీ ప్రొఫెసరు అప్పట్లో విశ్వవిద్యాలయంలో బి ఏ ఆనర్స్ మూడు సంవత్సరాల కోర్సు అది అయిన తరువాత మరొక ఏడాదికి

ఎం ఏ పట్టం కూడా ఇచ్చేవారు అటు తరువాత ఆనర్సు చదివిన వారికి ఎం ఏ డిగ్రీ ఇవ్వడం మానివేసారు నాకు బి ఏ ఆనర్సు ఎకనామిక్స్ చదవాలని ఉండేది అదేమాట ఆచార్య వెంకటరంగయ్యగారికి చెప్పాను ఎకనామిక్స్ కాని పొలిటిక్స్‌గాని తీసుకుంటే జూనియర్ స్కాలర్‌షిప్పు మాత్రమే వస్తుందని అన్నారు నాకు ఇంటర్‌లో 305 మార్కులు వచ్చాయి నాకంటే 5 మార్కులు ఎక్కువ వచ్చిన విద్యార్థులకు ఎకనామిక్స్ పొలిటిక్స్‌లో సీనియర్ స్కాలర్‌షిప్పులు ఇచ్చారు హిస్టరీలోనే సీనియర్ స్కాలర్‌షిప్పు ఉంది అయితే అదే చదువుతాను అన్నాను స్కాలర్‌షిప్పు ఎంత అని ఆలోచిస్తున్నారా? సీనియర్ స్కాలర్‌షిప్పు నెలకు 20 రూపాయలు జూనియర్ స్కాలర్‌షిప్పు నెలకు 15 రూపాయలు ఆ 20 రూపాయలతో విశ్వవిద్యాలయం హాస్టల్‌లో మకాం, భోజనం ఖర్చులు పోగా కొంత మిగిలేది ఆ విషయం తెలగానే శ్రీ భానోజీరావు గారి డాబా గార్డెన్స్ వదిలి విశ్వవిద్యాలయం హాస్టల్‌కి మకాం మార్చాను

హాస్టలు జీవితం చాలా హాయిగా ఉండేది విద్యార్థులంతా మొదటి బాచ్‌లో భోజనం చేయాలని సరదా పడేవారు దానికి కారణం గడ్డ పెరుగు ఇక ఆదివారం రోజున ఓ్రడమంగలి తలంటు అక్కడ ప్రత్యేకత వాల్తేరు వద్ద సముద్రతీరాన కూర్చుంటే సమస్యలు, బాధలు మాయమయ్యేవి మిత్రుడు జయంతి వల్లభరావుతో పరిచయం విద్యార్థి ఫెడరేషన్ రాజకీయాలకు ఆకర్షించ బడడం జరిగింది విశాఖపట్నం జిల్లాలో విద్యార్థి సంఘాలు ఏర్పాటు చేయడానికి ఆ జిల్లాలో విస్తృతంగా తిరిగాను అప్పట్లో ఆ జిల్లాలో విద్యార్థి ఉద్యమానికి పునాదులు వేయడంలో నేను ప్రముఖ పాత్ర వహించాను విశాఖ జిల్లా విద్యార్థి ఫెడరేషన్ మహాసభలు విజయనగరంలో జరిగాయి ఆనాటి బహిరంగ సభలో నేను కొన్ని గంటలు ఉపన్యసించాను ఆ మాట తల్చుకుంటే ఇప్పుడు నాకు నవ్వు వస్తుంది ఆ వయస్సు, ఆ ఉత్సాహం వేరు

విశ్వవిద్యాలయంలో ఆచార్య వెంకటరంగయ్యగారి పాఠాలు ఉత్తేజకరంగా ఉండేవి డా క్రిష్ణ ఎకనామిక్స్‌లో జర్మనీలో రిసెర్చి చేసి డాక్టరేట్ తీసుకున్నారు ఆయన థీసిస్ జర్మనీ భాషలో వ్రాసారని గొప్పగా చెప్పుకునేవారు అయితే ఆయనకు క్లాసులో నోరు పెగిలేది కాదు ఆయన చెప్పే పాఠం వినడానికి బాధగా ఉండేది కాని విద్యార్థుల్ని తమ ఇంటికి పిలిచి టిఫిన్ కాఫీలు ఇచ్చి ఎకనామిక్స్ అద్భుతంగా చెప్పేవారు నేను జనరల్ ఎకనామిక్స్ విద్యార్థినైనా స్పెషల్ విద్యార్థులతో పోటీ పడేవాణ్ణి శ్రీ గొర్తి వెంకటరావుగారు హిస్టరీ చెప్పేవారు ఆయన ఉపన్యాసాలకంటే నేను, ఆర్

సుబ్రహ్మణ్యం కలిసి శ్రీపీ సోమశేఖర శర్మ గారి వద్ద చదివిన ఆర్కియాలజీ చదువు బ్రహ్మాండంగా ఉండేది తర్వాత సుబ్రహ్మణ్యం డిగ్రీ పూర్తి చేసి కేంద్ర ఆర్కియాలజీ శాఖలో చేరి మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు నేను దానిని ఉపయోగించుకోలేకపోయాను

నేను బిఏ ఆనర్సు చదివేటప్పుడు ఆర్ట్సు విద్యార్థులకు ఫ్రెంచి భాషలోను సైన్సు, లెఖ్ఖలు విద్యార్థులకు జర్మన్ భాషలో పరీక్షలు ఉండేవి మా ఫ్రెంచి మాష్టారు ఆచార్యులు గారని గుర్తు ఫ్రెంచి క్లాసు వారానికి ఒక పీరియడ్ ఉండేది తరువాత కాలంలో లండన్ విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ కోసం రిసెర్చి చేసేటప్పుడు కూడా ఫ్రెంచి భాషతో పరిచయం ఉండాలనే నిబంధన ఉండేది ఆనిబంధనలు అధిగమించి ఫ్రెంచి పరీక్షలలో ఉత్తీర్ణుడయ్యాను కాని నా ఫ్రెంచి బాషా పరిజ్ఞానం అంత చెప్పుకోదగ్గది కాదని నాపారిస్ ప్రయాణంలో తెలిసింది అది చాలాకాలం తరువాతి మాట

నేను ఆనర్సు మొదటి సంవత్సరంలో ఉండగా మద్రాసు గవర్నరుగారైన శ్రీ నే (Ney) విశ్వవిద్యాలయానికి వచ్చారు ఆ సందర్భంలో విశ్వవిద్యాలయం విద్యార్థులు గవర్నరు రాకకు వ్యతిరేకంగా ప్రదర్శనలు చేసారు దానిలో నాది ప్రముఖ పాత్ర క్రిస్టమస్ సెలవులకు బందరు వెళ్ళాను

బందరులో శ్రీ సుబ్బారావు గారిని కలిసి ఆయన పుణ్యమా అంటూ నేను విశ్వవిద్యాలయంలో చేరగలగడం స్కాలర్‌షిప్పు రావడంతో హాస్టలులో చేరడం గురించి చెప్పి నా కృతజ్ఞత తెలియజేసాను ఆయన చాలా సంతోషించారు క్రిస్టమస్ సెలవులకు బందరు వెళ్లినప్పుడు శ్రీ గుంటూరు నాగభాషణంగారు ఒక రికమెండేషను ఉత్తరం పంపారు సెలవుల అనంతరం విశ్వవిద్యాలయానికి వెడుతూ దారిలో ఏలూరులో దిగి శ్రీ చదలవాడ చక్రధరరావు గారింటికి వెళ్ళాను ఆయన అడ్వకేటు పేద విద్యార్థులకు చదువుకోసం ఆర్థిక సహాయం చేస్తారని ప్రతీతి శ్రీ గుంటూరి నాగభూషణంగారు నాగురించి వ్రాసిన జాబు ఆయనకు చూపాను

శ్రీ నాగభూషణంగారి జాబు చదువుకుని విశ్వవిద్యాలయంలో ఏం చదువుతున్నావని శ్రీ చక్రధరరావుగారు ప్రశ్నించారు హిస్టరీ ఆనర్సు అన్నాను హిస్టరీ చదివి ఏం చేస్తారయ్యా! అంటూ లోపలకు వెళ్ళి మూడు పది రూపాయల నోట్లు తెచ్చి నా చేతిలో పెట్టారు విద్యా సంవత్సర ప్రారంభంలో వచ్చి ఉంటే ఇంకా ఎక్కువ ఇచ్చి ఉండేవాడినన్నారు ఎప్పుడైనా డబ్బు అవసరమైతే ఏలూరు వరకు వచ్చి దారి ఖర్చులకు డబ్బు వృధా చేయవద్దని సలహా ఇచ్చారు ఒక కార్డు వ్రాయమన్నారు ఆయనకు నమస్కారం పెట్టి ఏలూరు వదలి వాల్తేరు వెళ్ళాను శ్రీ చక్రధరరావు గారు

రికమెండేషనుమీద ముప్పై ఫ రూపాయలు ఇవ్వడం నన్ను ఆశ్చర్యపరచలేదు కాని ఆయన నా చదువు చివరి రోజుల్లో చేసిన సహాయం, ఆ సహాయం చేసిన పద్ధతి నన్ను ముగ్ధుణ్ణి చేసింది నేను ఫైనల్ ఆనర్సులో ఉన్నాను విశ్వవిద్యాలయం గుంటూరులో ఉంది పరీక్షలకు ముందు శ్రీ చక్రధరరావుగారు గుర్తుకు వచ్చారు డబ్బు అవసరమైతే ఒక కార్డు వ్రాయమని నాలుగేళ్ళ ముందు ఆయన చెప్పిన సలహా గుర్తుకి వచ్చి ఆయనకు ఒక కార్డు వ్రాసాను దానిలో ఆయన నాలుగేళ్ళ క్రిందట ఇచ్చిన ముప్పై ఫ రూపాయల సహాయం గుర్తు చేసాను చిత్రం ఏమిటంటే కార్డు వ్రాసిన నాలుగు రోజుల్లో ముప్పై ఫ రూపాయల మనియార్డరు వచ్చింది శ్రీ చక్రధరరావు గారు ఏవిధమైన ప్రశ్నలు అడగకుండా మనియార్డరు పంపారు లోగడ తాను సహాయం చేసిన విద్యార్థి నాలుగేళ్ళ తరువాత ఇంకా విశ్వవిద్యాలయంలో ఏమి చేస్తున్నాడనే అనుమానం ఆ మహానుభావునికి వచ్చినట్టు లేదు అందుకే కాబోలు "ఎందరో మహానుభావులు, వారందరికీ వందనాలు" అన్నాడు త్యాగరాజు

  

# చెలిశాలలే - పృథుశాలలు

భారత స్వాతంత్ర్య సమరం ఒక మహా యజ్ఞంలా సాగుతున్న రోజులు దేశనాయకుల పిలుపు మేరకు లక్షలాది భారతీయులు ఆనాటి బ్రిటిషు ప్రభుత్వాన్ని వ్యతిరేకించి వారి ఆజ్ఞలను ఉల్లంఘించి లాఠీ దెబ్బలు తిని, కాల్పులలో ప్రాణాలు కోల్పోయి, జైళ్ళలో మ్రగ్గి దేశ మాతను దాస్య శృంఖలాలనుండి విడిపించడానికి తమ సర్వస్వాన్ని త్యాగం చేస్తున్న రోజులు కులమతాల ప్రమేయం లేకుండా, వయోభేదం లేకుండా లక్షలాది స్త్రీ పురుషులు ఆ స్వాతంత్ర్య మహా యజ్ఞంలో పాల్గొన్నారు బ్రిటిషు ప్రభుత్వాన్ని బారత దేశం నుండి పంపివేసి దేశ స్వాతంత్ర్య సముపార్జన సాధించాలి బానిసలుగా కలకాలం బ్రతికేకంటే స్వాతంత్ర్యం కోసం పోరాడి ప్రాణాలు కోల్పోవడం ఉత్తమం అది నిష్కామ కర్మ ప్రయోజనాలను ఆశించి చేసిన త్యాగం కాదు విజయమో వీర స్వర్గమో అని పోరాడారు ఆ రోజుల్లో స్వాతంత్ర్య పోరాటం మహాత్మాగాంధీ నాయకత్వంలో దేశ వ్యాప్తంగా సాగుతోంది గాంధీజీ నాయకత్వానికి, ఉద్యమానికి, పోరాటానికి మూల సూత్రాలు సత్యం, అహింస, అయుధం సత్యాగ్రహం

అవి రెండవ ప్రపంచ యుద్ధం ప్రచండంగా జరుగుతున్న రోజులు బ్రిటిష ప్రభుత్వం హిట్లర్‌ను ఓడించి ఫాసిజాన్ని పాతివేసి ప్రపంచంలో ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించే ప్రయత్నంలో భారత ప్రజలు తమకు మద్దతు ఇవ్వాలన్నారు కాని మన నాయకులు దేశానికి స్వాతంత్ర్యం ఇస్తే తప్ప యుద్ధ కార్యకలాపాలతో బ్రిటిష వారితో సహకరించడం సాధ్యపడదన్నారు అది సామ్రాజ్యవాదుల మధ్య జరిగే యుద్ధం కాబట్టి దానితో మాకు సంబంధం లేదన్నారు ఒక ప్రక్క గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహం మరో ప్రక్క సత్యాగ్రహంతోను అహింసతోను, స్వాతంత్ర్యం సంపాదించడం సాధ్యం కాదనే వామ పక్షాలు విద్యార్థులు, కర్షకులు, కార్మిక వర్గాలలో సోషలిష్టు, కమ్యూనిష్టు బావాల ప్రభావం ఎక్కువవుతోంది ఏది ఏమైనా అప్పుడు కాంగ్రెసువారు వామపక్షాలు కూడా ఐక్య కంఠంతో బ్రిటిష యుద్ధ కార్యకలాపాలను వ్యతిరేకించారు ఆ రోజుల్లో నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి ఏ ఆనర్సు మొదటి సంవత్సరం విద్యార్థిని చిన్నప్పటినుంచి జాతీయ ఉద్యమం, స్వాతంత్రోద్యమం యొక్క ప్రబావంలో పెరిగినందున బ్రిటిష ప్రభుత్వ వ్యతిరేక బావాలతో నిండిన బుర్రతో

పోరాటమే ధ్యేయంగా, ఉత్సాహమే ఊపిరిగా వెనక ముందు చూసుకోకుండా ఆ స్వాతంత్ర్య మహా యజ్ఞంలో ఒక సమిధను అయ్యాను

విజయనగరంలో జరిగిన జిల్లా విద్యార్థి మహాసభలో కొన్ని గంటలు ఏకధాటిగా ఉపన్యసించాను దానితో బ్రిటిషు ప్రభుత్వాన్ని వారి విధానాలను, అప్పుడు జరుగుతున్న ద్వితీయ ప్రపంచ యుద్ధంలోకి బానిస భారత దేశాన్ని బలవంతంగా లాగడానికి చేసే ప్రయత్నాలను నిశితంగా విమర్శించాను ఆ సమావేశానంతరం నన్ను విశాఖ జిల్లా విద్యార్థి ఫెడరేషను అధ్యక్షునిగా ఎన్నుకున్నారు ఆ ఉత్సాహంతోనే మద్రాసు గవర్నరు ఆర్థర్ హోప్ విశ్వవిద్యాలయాన్ని సందర్శించిన సందర్భంలో వ్యతిరేక ప్రదర్శనలు నిర్వహించాం 'నో హోప్-ఆర్థర్ హోప్-గో బేక్' అనే నినాదాలు విని గవర్నరు కోపోద్రిక్తుడయ్యాడు విద్యార్థుల యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలు శృతిమించుతున్నాయని, వారి ఆట కట్టించాలని ఆలోచించే ప్రభుత్వానికి విశ్వవిద్యాలయంలో గవర్నరుకి జరిగిన అవమానం పుండుమీద కారంలా పనిచేసింది

క్రిస్టమస్ సెలవుల అనంతరం వాల్తేరు వస్తే విశ్వవిద్యాలయం వాతావరణం ప్రశాంతంగా ఉంది హాస్టలు జీవితం ఎప్పటివలెనే హాయిగా ఉంది అయితే రాబోయే తుఫాను ఎవరూ ఊహించలేకపోయారు ఒక రోజు హాస్టలు గదిలో కూర్చొని నేను, రూంమేట్ భాను వరప్రసాదరావు కబుర్లు చెప్పుకుంటున్నాం అంతలో కళాశాల బంట్రోతు వచ్చి నన్ను ప్రిన్సిపాల్ గారు పిలుస్తున్నారని కబురు తెచ్చాడు వెంటనే ప్రిన్సిపాల్ ఆఫీసుకు వెళ్ళాను అక్కడ పరిస్థితిని చూసి ఆశ్చర్యపోయాను ప్రిన్సిపాల్ విస్సా అప్పారావుగారి గదినిండా పోలీసు ఆఫీసర్లు ఉన్నారు అలా గదిలో అడుగుపెట్టగానే "నిన్ను అరెస్టు చేస్తున్నాం" అని పోలీసు ఆఫీసరు అన్నాడు ఆయన ఏమంటున్నాడో అర్థం అయ్యేసరికి పోలీసు జీపులో ఎక్కమన్నారు

హాస్టలు గదికి వెళ్ళడానికి అనుమతి ఇచ్చారు పోలీసులతో కలిసి నేను గదికి రావడం చూసి భాను ఆశ్చర్యపోయాడు ఈ వార్త నర్సాపురంలోను, పోలవరంలోను మా బంధువులకు తెలియజేయమని వారి అడ్రసు ఇచ్చాను నేను ఎవరితోను మాట్లాడకూడదని పోలీసువారి ఆజ్ఞ ఆ రోజుతో ఆంధ్ర విశ్వవిద్యాలయం హాస్టలుతో నా ఋణం తీరిపోయింది పోలీసు జీపులో విశాఖపట్టణం పోలీసు స్టేషను చేరేసరికి ఆనాడు అరెస్టు మర్యాద జరగడం నాకొక్కడికే కాదని అర్థం అయ్యింది నాకంటే ముందు మరికొందరిని అరెస్టు చేసి సబ్ జైలుకు తీసుకువచ్చారు వారిలో జె వి వల్లభరావు, సీతారామయ్యలను విశ్వవిద్యాలయం కళాశాలనుంచి, రంగనాయకుల్ని లా

కళాశాలనుంచి రంగయ్య రామమోహనరావులను వైద్యకళాశాలనుంచి అదే రోజున అరెస్టు చేసారు క్రొత్త ఉత్సాహం, హుషారు అంతా సబ్ జైలు వరాండా మీద జంబుఖానా మీద కూర్చుని కబుర్లాడుకున్నాం పోలీసువారు ఇంకా ఎవరినైనా తీసుకు వస్తారేమోనని ఊహాగానాలు చేస్తూ కూర్చున్నాం.

మమ్మల్ని డిఫెన్స్ ఆఫ్ ఇండియా చట్టం క్రింద అరెస్టు చేసారు కాబట్టి మా అరెస్టుకి కారణం చెప్పనక్కరలేదు ఒక అరడజను మంది యువకులు స్వేచ్ఛగా ఉంటే భారతదేశ రక్షణకు భంగం వస్తుందనుకున్న బ్రిటిష్ పాలకుల ఆలోచనకు నవ్వు వచ్చింది పోలీసు అధికారులు ఎవరూ నోరు విప్పడం లేదు మమ్మల్ని అరెస్టు చేసిన చట్టం పుణ్యమా అంటూ మమ్మల్ని కోర్టులో హాజరు పరచనక్కరలేదు నేరారోపణ, న్యాయవిచారణ మొదలైన తతంగం అవసరం లేదు అరెస్టు చేసి జైలులో ప్రభుత్వం ఇష్టం వచ్చినంతకాలం నిర్బంధంలో ఉంచవచ్చు వారిని డెటిన్యూలు అంటారు మమ్మల్ని విశాఖపట్నం నుంచి ఏ జైలుకి పంపుతారో అక్కడ ఎవరూ సూచనప్రాయంగా కూడా తెలియజేయలేదు మా అరెస్టువార్త తెలిసిన విద్యార్థులు అలజడి చేయడానికి వీలు లేకుండా కళాశాలలు మూసివేసే సమయంలో మమ్మల్ని అరెస్టు చేసారు ఈ వార్త పట్టణంలో తెలిసేసరికి మేమంతా రైలులో మద్రాసు వైపు ప్రయాణం చేస్తున్నాం మమ్మల్ని జైలుకి తీసుకు వెళ్లడానికి మాతో వచ్చిన ఆరుగురు పోలీసులకు కూడ విశ్వవిద్యాలయ విద్యార్థుల్ని అరెస్టు చేయడం ఆశ్చర్యం కలిగించింది కాని వారి సేవా ధర్మం వారు నిర్వర్తించేరు.

జనవరి 23, 1941 ఉదయం వెల్లూరు సెంట్రల్ జైలుకి మమ్మల్ని తీసుకువెళ్లారు జైలు ఆవరణలో అడుగు పెట్టేసరికి అనేకమంది డెటిన్యూలు గుమ్మంలోనే సాదరంగా ఉత్సాహంగా స్నేహపూర్వకంగా ఆహ్వానించారు వారికి మేము వస్తున్నట్లు ముందుగానే తెలుసునట నిజానికి మాకు అక్కడికి వెళుతున్నట్లు తెలియదు మమ్మల్ని ఆహ్వానించినవారిలో శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య డా పట్టాభి సీతారామయ్య, మహర్షి బులుసు సాంబమూర్తి, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ యన్ జి రంగా, శ్రీ మాధవ మీనన్ ఇంకా అనేక పెద్దలు ఉన్నారు

వెల్లూరు సెంట్రల్ జైల్‌లో వేలాదిమంది నేరస్తులకు వసతి ఉంది. రాజకీయ డెటిన్యూల కోసం నేరస్తులు ఉండే ప్రదేశానికి సంబంధం లేకుండా ఒక పెద్ద యార్డును ప్రత్యేకించారు అటువంటివి ఆ జైలులో రెండు డెటిన్యూ క్యాంపులు ఉన్నాయి అప్పట్లో వెల్లూరులో 250 మంది డెటిన్యూలు నిర్బంధంలో ఉండేవారు అలాగే దేశంలోని అనేక జైళ్లలో ప్రత్యేక డెటిన్యూ విభాగాలు ఉండేవి న్యాయవిచారణ లేకుండా నిర్బంధించబడ్డ డెటిన్యూలే కాక

దేశంలోని అన్ని జైళ్లలోను వేలాదిమంది రాజకీయ ఖైదీలు ఉండేవారు వారంతా అరెస్టు అయిన తరువాత కోర్టులో శిక్ష విధించబడి జైలుకి పంపబడ్డవారు వారిని డెటిన్యూలతో కలిపేవారు కాదు వారు సామాన్య నేరస్తులతో పాటు జైలు జీవితం గడిపేవారు మాతృదేశాన్ని దాస్య శృంఖలాలనుంచి విడిపించాలనే ఉత్సాహంతో సత్యాగ్రహం చేసి, శాసనోల్లంఘన కార్యక్రమం చేపట్టి లక్షలాదిమంది జైళ్లపాలయ్యారు తాము జైళ్లకి వెళ్ళడం వల్ల దేశానికి స్వతంత్రం ఎలా వస్తుందో తెలియని వేలాదిమంది తమ జీవితాలు త్యాగం చేసారు పరాయి పాలనను వ్యతిరేకించి జైలుకి వెళ్లడం స్వాతంత్ర్య సమరంలో ఒక భాగం అని నమ్మారు వారిది నిజమైన నిష్కామకర్మ స్వాతంత్ర్యం వచ్చే లక్షణాలు కన్నుపొడుచుకున్నా కనిపించేవి కావు వారంతా ఆ మహాయజ్ఞంలో సమిధలు మాత్రమే

వెల్లూరు సెంట్రల్ జైలులో అడుగు పెట్టగానే సామాన్య రాజకీయ ఖైదీకి డెటిన్యూకి ఉన్న తేడా అర్థం అయిపోయింది అది సత్రానికి ఐదు నక్షత్రాల హోటల్‌కి ఉన్న తేడా వంటిది జైలు అధికారులు డెటిన్యూ క్యాంపులో పని చేయడానికి సేవకుల్ని పంపేవారు వారు రకరకాల నేరాలమీద జైలుకి వచ్చిన మామూలు ఖైదీలు, మాకు బట్టలు ఉతకడానికి, వంటలో సహాయం చెయ్యడానికి అంట్లు తోమడానికి క్షురకర్మ చేయడానికి ఖైదీలు వచ్చేవారు వారు ఉదయం వచ్చి రాత్రి 8 గంటులవరకు మాతోనే ఉండేవారు తక్కువ పని, మంచి భోజనం, సిగరెట్లు బీడీలు దొరుకుతాయని మా యార్డులో పనిచేయడానికి ఖైదీలు పోటీపడేవారు ఆ రోజుల్లో ఖైదీలకు తెల్లటోపీలు ఉండేవి వాటిమీద ఎరుపు నీలం గుర్తులు ఉండేవి ఎరుపు గుర్తు ఉంటే అతడు హత్యానేరం మీద యావజ్జీవ జైలు శిక్ష అనుభవిస్తున్నాడన్న మాట నీలం రంగు ఉంటే అతగాడు జైలుపక్షి అని అర్థం అంటే అతడు జైలుకి రావడానికి అలవాటు పడ్డవాడు ఇక ఏమార్కు లేకుండా తెల్లటోపీ పెట్టుకున్నవాడు మొదటిసారిగా నేరం చేసి జైలుకి వచ్చినవాడు మాకు ప్రతీరోజూ ఒక మంగలి వచ్చేవాడు అతడు తమిళుడు పెద్ద బుంగమీసాలు ఎర్రటి కళ్లు పొట్టిగా లావుగా ఉండేవాడు అతడు మంగలి కత్తితో గడ్డం చేస్తూ ఉంటే అతడి టోపీమీద ఎర్రమార్కు చూసి తమ ప్రాణాలు అరచేతిలో పెట్టుకునేవారు మా పెద్దలు

డెటిన్యూ వార్డులో గదులు ఉన్నాయి డార్మిటరీలాగా అనేక మంచాలు పట్టే హాలు కూడా ఉంది విద్యార్థులందర్నీ ఆ హాలులో ఉండమన్నారు మంచాలు, పక్కలు, ప్రతీవారికి ఒక కప్‌బోర్డు ఏర్పాటు చేసారు డెటిన్యూలకు ఖైదీలవలె లాకప్‌లో పెట్టి తాళాలు వేయడం గాని, ఉదయం పెరేడ్‌గాని లేవు



ప్రతీ ఉదయం జైలు ఆవరణ బైట మాకందరికి ఉదయ వాహ్యాళి ఉండేది ఆరోగ్యం కోసం కొందరు కాలక్షేపం కోసం మరికొందరు, అలవాటుగా కొందరు ఉదయం నడక కార్యక్రమంలో పాల్గొనేవారు దానికి తోడు ఆ జైలులోనే మరొక వార్డులో ఉన్న డెటిన్యూలను కలుసుకోడానికి ఈ నడక తోడ్పడేది అల్లూరి సత్యనారాయణరాజు, కలిదిండి బంగార్రాజు రెండవ క్యాంపులో ఉండేవారు నడకకు వెళ్లిన రోజుల్లో వారు కలిసేవారు ఇక భోజనం విషయంలో కూడా చక్కటి ఏర్పాటు ఉండేది

ఫుడ్ కమిసార్ జైలు అధికారుల వద్ద నిబంధనల ప్రకారం రావలిసిన రేషన్లు వారానికొకసారి తీసుకునేవాడు అవి వంటచేసే గవర్నమెంటుకి అందజేసేవాడు వంట గవర్నమెంటు ఏమిటని ఆశ్చర్యపోతున్నారా? అదేకాదు వడ్డించే గవర్నమెంటు కూడా ఉండేది డెటిన్యూలలో పదిమందిని ఒక వారం రోజులు వడ్డనలు చేయడానికి ఏర్పరచేవారు ఆ వారం అయిన తరువాత మరొక వారం వంట డ్యూటీకి వెళ్లేవారు వారిని గవర్నమెంటు అనేవారు ఆ వారం రోజులు ఫలహారాలు, వంటకాలు ఏమి చేయాలనేది గవర్నమెంటు ఇష్టం ఆ వారానికి వచ్చిన రేషన్లతో ఉదయం ఇడ్లీ, చక్కటి భోజనం రాత్రి పడుకోబోయే ముందు త్రాగడానికి పాలు ఇచ్చేవారు నేను ఉన్న గవర్నమెంటులో ఉదయం పెసరట్లు, ఇడ్లీలు, ఉప్మా కూడా ఏర్పాటు చేసేవాళ్ళం గవర్నమెంటు తుదిరోజున మిగిలిన రేషన్లతో చక్కటి విందు ఏర్పాటుచేసేవాళ్లు ఆ రోజుల్లో నేను వంటలో సిద్ధహస్తుడి క్రింద లెక్క చిత్రం ఏమిటంటే ఎంత పెద్దనాయకుడైనా అక్కడి నియమాల ప్రకారం వంట, వడ్డన చేయవలసిందే అందుకే పట్టాభి సీతారామయ్యగారు ప్రతిసారి "మూర్తీ, నన్ను నీ గవర్నమెంటులో వేసుకోవయ్యా" అనేవారు అక్కడ స్వీట్లు తక్కువగా ఉండేవి జిహ్వాచాపల్యం ఉన్నవారు బజారు వార్డరు ద్వారా తమకు కావలసిన స్వీట్లు తెప్పించుకునేవారు నిజానికి జైలు నిబంధనల ప్రకారం వండిన పదార్థాలు బైటనుంచి జైలు లోనికి తీసుకురాకూడదు అయితే బజారు వార్డరు రంగయ్య తన టోపీలో బజారునే తీసుకువచ్చేవాడంటే నమ్మండి

మా కమ్యూన్ నియమం ప్రకారం డెటిన్యూలను చూడ్డానికి వచ్చిన బంధువులు మిత్రులు తీసుకువచ్చిన పండ్లు ఫలాలు ఫుడ్‌కమిసార్‌కి అందజేయాలి ఆయన వాటిని యావన్మందికీ పంచిపెట్టించేవాడు అయితే దానిలో కొన్ని మినహాయింపులు ఉండేవి ఏవైనా తక్కువ సంఖ్యలో ఉంటే వాటి వినియోగం ఎవరికి వస్తే వారికే వదిలేవారు మహర్షి బులుసు సాంబమూర్తిగారు తమకు వచ్చిన మామిడిపండ్లు ఆప్యాయంగా పిలిచి నాకు ఇచ్చేవారు "గదిబైటకు తీసుకు వెళ్లకు ఇక్కడే తినేసి వెళ్లు లేకపోతే

కమ్యూనిష్టులు గొడవచేస్తా"రనేవారు నేను వెల్లూరు జైలులో ఉండగా నన్ను చూడ్డానికి బంధువులు కాని మిత్రులు కాని ఎవరూ రాలేదు ఆరోజుల్లో వెల్లూరు సెంట్రల్ జైల్‌లో బ్రిటిష్ ప్రభుత్వం ప్రత్యేక అతిథి ఉండేవాడు ఆయన అల్లామామ్రషూకి ఇనయతుల్లాఖాన్ నార్త్‌వెస్ట్ ఫ్రాంటియర్‌లో రెడ్‌షర్ట్ ఉద్యమ నాయకుడు ఆయన్ని బ్రిటిష ప్రభుత్వం దక్షిణ భారతదేశంలో వెల్లూరు జైలుకి తరలించి ఉద్యమానికి దూరం చేసారు ఆయన మా క్యాంపులోని భవనంలో చివరి రెండు గదులలో ఉండేవారు మేమంతా ఆయన్ని ఖాన్‌సాహెబ్ అని ఆప్యాయంగా పిలిచేవాళ్లం ఆయనకు పుస్తో భాష, కొద్దిగా ఉర్దూ తప్ప మరేభాషా వచ్చేది కాదు ఆయనకు స్వంతసేవకుణ్ణి తనతో తెచ్చుకోడానికి అనుమతి ఇచ్చారు జైలర్ కాని, సూపరింటెండెంటుకాని ఆయనతో మాట్లాడ్డానికి భయపడ్డం చూస్తే మాకు వినోదంగా ఉండేది చెట్టంత మనిషి అర్థం కాని భాషలో అరిచేవాడు అయితే మాతో చాలా సౌమ్యంగా ఉండేవాడు మాట్లాడ్డమే తక్కువ ఆయనతో పాటు మేము కూడా నిర్బంధంలో ఉన్నా భాష రాక, మాట్లాడ్డానికి మనిషి లేకుండా బోనులో పెట్టిన సింహంలా ఉండే ఖాన్‌సాహెబ్‌ని చూస్తే మాకే బాధగా ఉండేది

పదిమందితో చావుకూడా పెళ్లితో సమానం అనే సామెత గుర్తుకు వచ్చేది పదేపదే జైలులో, నాలుగు గోడల మధ్య నిర్బంధంలో ఉన్నామని బైట ప్రపంచంతో సంబంధాలు లేవనే బాధ తప్ప వెల్లూరు సెంట్రల్ జైలులో జీవితం ఏవిధమైన ఒడుదుడుకులు లేకుండా సాగిపోతోంది అప్పటికే రాజకీయరంగంలో అనుభవం సంపాదించి, స్వతంత్ర పోరాటంలో పాల్గొని భారతదేశ దాస్యవిముక్తి కొరకు అనేక త్యాగాలు చేసిన పెద్దలతో పరిచయం సాహచర్యం లభించినందున కాలక్షేపానికి లోటు ఉండేది కాదు రాయవెల్లూరు జైలులో డెటిన్యూలుగా ఉన్నవారిలో అధిక సంఖ్యాకులు భారత రాజకీయాల్లో అతివాదులు అప్పటికి కమ్యూనిస్టు భావాలున్న అనేకమంది యువకులు కాంగ్రెసు సోషలిస్టులుగా వ్యవహరించబడేవారు మా కమ్యూన్ మేయరుగా ఉన్న మద్దూరి అన్నపూర్ణయ్యగారు ఆ కోవకు చెందినవారు ఆయన కమ్యూన్ నిర్వహణాబాధ్యతల్లో మునిగిపోయినందున రాజకీయ చర్చలలో పాల్గొనేవారు కాదు కాంగ్రెసు నాయకులు కూడా మహాత్ముని సిద్ధాంతాలపై చర్చలు జరిపేవారు కాదు శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్య అప్పట్లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ఆయన కాంగ్రెసు చరిత్ర వ్రాసుకుంటూ తన గదిలో కూర్చునేవాడు తనకు వచ్చిన ఉత్తరాల కవర్లు జాగ్రత్తగా విప్పి వాటి లోపలి ప్రక్క కాంగ్రెసు చరిత్ర వ్రాసేవారు పొదుపు ఆయనవద్దనే నేర్చుకోవాలనిపించేది రాత్రుళ్లు ఆయన సరిగ్గా ఒంటిగంటకు లేచి ఒక అరటిపండు తిని గ్లాసుడు మంచినీళ్లు త్రాగి పడుకొనేవారు ఆయన లేచారంటే

మనం టైము చూసుకోవలసిన పని ఉండేది కాదు

'మహర్షి' బులుసు సాంబమూర్తిగారు మద్రాసు శాసనసభ స్పీకరుగా చేసారు నేనెరుగున్నంత కాలం ఆయన నిండుపంచె కట్టుకోగా చూడలేదు చొక్కా వేసుకునేవారు కాదు పంచెకు అంగవస్త్రానికి మధ్యగా ఉండే పంచె మోకాళ్లవరకు వచ్చేట్టుగా కట్టుకునేవారు ఆయన ఎప్పుడూ వార్తాపత్రికలు చదివేవారు కాదు కారణం అడిగితే "పత్రికలలో మనగురించే ఉంటుంది కదోయ్ అవి మళ్లా మనం చదవడం ఎందుకు?" అనేవారు ఆయన మనస్తత్వం నాకు అర్థం కాలేదు శ్రీఅయ్యదేవర కాళేశ్వర్రావు, ఆచార్య ఎన్ జి రంగా ఇంకా అనేకమంది కాంగ్రెసు నాయకులు ఉండేవారు కామరాజ్ నాడార్ ఎప్పుడు చూసినా బీడీ కాల్చుకుంటూ ఒక మూల కూర్చుని కనిపించేవారు ఆయనతో మాట్లాడాలంటే భాష అడ్డు వచ్చేది ఆయనకు తమిళం తప్ప మరేభాష వచ్చేది కాదు కేరళనుండి వచ్చిన కాంగ్రెసు నాయకుల్లో మాధవమీనన్ ముఖ్యుడు ఆయన అప్పటికే మాజీమంత్రి పెద్దమాటకారి కాదు ఒకనాడు పట్టాభిగారు విద్యార్థి డెటిన్యూల డార్మిటరీ దగ్గరకు వచ్చి"మూర్తీ, ఇతగాడు మాతో ఉండటానికి చిన్నవాడు, మీతో ఉండటానికి పెద్దవాడు కాని ఇతణ్ణి మీతోనే ఉంచండి" అంటూ నీలం సంజీవరెడ్డిని తీసుకు వచ్చి మాకు పరిచయం చేసారు ఆ రోజునే వెల్లూరు జైలుకి వచ్చిన సంజీవరెడ్డి అప్పట్లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ సంయుక్త కార్యదర్శిగా ఉండేవారు మేము వెల్లూరు జైలులో ఉన్నంత కాలం సంజీవరెడ్డి హెచ్చు సమయం మాతోనే గడిపేవారు

ఇక మా క్యాంపులో సోషలిస్టు కమ్యూనిస్టు నాయకులు, విప్లవనాయకులు కోకొల్లలు పురుషోత్తమన్, కల్యాణసుందరం నాకు తమిళం నేర్పడానికి ప్రయత్నించారు కేరళనుండి వచ్చిన అనేకమందిలో ఇంబిచ్చిబావా మంచి మిత్రుడు ఆంధ్రులలో సి వి కె రావు అప్పటికే ఇంగ్లండులో చదువుకుని కమ్యూనిస్టు సిద్ధాంతంతో ప్రభావితులై దేశం తిరిగి వచ్చి రాజకీయ రంగప్రవేశం చేసిన తాత్వికవేత్త వెల్లూరు జైల్లో ఉండేవారు జైలుకి రావడానికి రెండేళ్లకు ముందే 1938 లో మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలలో రాజకీయ సిద్ధాంతాలపై ఆయన పాఠాలు చెప్పిన అనుభవంతో జైలులో కూడా మార్క్సిస్టు సిద్ధాంతాల గురించి మార్క్స్ రచించిన దాస్‌కేపిటల్ లోని అంశాలపై కూడా పాఠాలు చెప్పేవారు విద్యార్థి డెటిన్యూలలో రంగనాయకులు మా 'అన్న'సీతారాముడు, అచ్యుతన్ తప్ప మిగిలిన అంతా ఆయన నిర్వహించే పాఠాలు, చర్చలకు వెళ్లేవాళ్లం

అంతలో అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో పిహెచ్ డి డిగ్రీతో

తిరిగివచ్చిన డా కె బి కృష్ణను కూడా ప్రభుత్వం వెల్లూరు జైలుకు తీసుకువచ్చింది ఆయన మేధావి కమ్యూనిష్టు తత్వవేత్త సిద్ధాంతాలపై కె బి కృష్ణ అభిప్రాయాలలో విదేశీ దృక్పథం కొట్టవచ్చినట్లు కనిపించేది కమ్యూనిష్టు సిద్ధాంతాలతో ప్రభావితులైన"యోగులు" కూడా ఉండేవారు నాకు యోగాసనాలు నేర్పిన గురువు నేలమీద పద్మాసనం వేసుకుని కూర్చొని అలా శరీరాన్ని పైకి లేపివేసేవారు ఆయన తమిళుడు దేశపరిస్థితులు, పరాయిప్రభుత్వ దురాగతాలు చూచి సన్యాసిగా ఉంటూనే విప్లవ రాజకీయాలలోకి దిగారు కంభంపాటి సత్యనారాయణ సీనియర్ జూనియర్‌లు డా వెంకట్రామశాస్త్రి లాయర్ వెంకట్రామశాస్త్రి విప్లవవీరుడు గద్దర్ పార్టీ కృషిలో పాలుపంచుకున్న దర్శి చెంచయ్య, ప్రతివాది భయంకరాచారి వావిలాల గోపాలకృష్ణయ్య ఇంకా అనేకమంది రాజకీయ అతిరథ మహారథులతో సాహచర్యభాగ్యం కలిగింది

నానా అవస్థలు పడి చదువుకుని విశ్వవిద్యాలయం వరకు వచ్చి తరువాత చదువు పోయినదనే బాధ చాలా ఎక్కువగా ఉండేది మిత్రుడు ఎన్ ప్రకాశరావు, భానువరప్రసాదరావు, సోదరి సావిత్రి అనేకమంది ఇతర మిత్రులు పెద్ద పెద్ద జాబులు వ్రాసి నిరాశ, నిస్పృహలో పడిపోకుండా నన్ను ప్రోత్సహించేవారు సెన్సారై వచ్చిన వార్తాపత్రికలు తప్ప బైట ప్రపంచంతో సంబంధం లేకపోవడంతో మిత్రులకు జాబులు వ్రాయడం గొప్ప కాలక్షేపంగా ఉండేది జవహర్‌లాల్ నెహ్రూ వ్రాసిన ప్రపంచ చరిత్ర తెలుగు లోకి అనువదించాలని ప్రయత్నించాను ప్రయత్నంగానే మిగిలిపోయింది అదేసమయంలో యూనివర్సిటి పరీక్షలలో ప్రాధమిక ఫ్రెంచి పరీక్ష వ్రాయడానికి అనుమతించవలసినదని మద్రాను ప్రభుత్వ ముఖ్యకార్యదర్శికి ఒక విజ్ఞప్తి పంపాను నా విజ్ఞప్తిని మద్రాను ప్రభుత్వం తిరస్కరించింది ఉమ్మడి మద్రాను రాష్ట్రానికి అప్పట్లో ముఖ్య కార్యదర్శి శౌంరి రామమూర్తి ఇక జైలు నుంచి బయట పడేవరకు ఫ్రెంచి భాషకు తిలోదకాలు ఇచ్చాను

అంతవరకు ఒడిదుడుకులు లేకుండా ఉన్న ప్రశాంత జైలు వాతావరణంలో కలకలం ఎంతో మందాగా ఉండే అన్నపూర్ణయ్యగారిలో కూడా కోపం, అలజడి చూసి ఆశ్చర్యపోయాం జైలు సూపరింటెండెంట్‌కు గుణపాఠం నేర్పాలని ఆందోళన, ఆలోచనలు జరుగుతున్నాయి మా కమ్యూన్ మేయరు అన్నపూర్ణయ్యతో సహా చాలా మందికి వెల్లూరు సెంట్రల్ జైలు సూపరింటెండెంట్ గిల్ మీద బ్రహ్మాండమైన కోపం వచ్చింది కాని పేదవాని కోపం పెదవికి చేటన్నట్టు డెటిన్యూలుగా జైలులో ఉన్నవారికి అధికారులమీద కోపం వచ్చినా చేయగలిగిందేమీ లేదు అయితే

మహాత్మాగాంధీ తాను అవలంభిస్తూ ప్రజలకు ఆచరణ యోగ్యంగా చేసిన సత్యాగ్రహంలో భాగం అయిన నిరాహారదీక్ష ద్వారా తమ నిరసనను వ్యక్తం చేయడానికి నిర్ణయించారు డెటిన్యూలు అదీ మా వార్డులో కలకలానికి కారణం ఇంతకీ సూపరింటెండెంటు గిల్ మీద మా పెద్దలకు అంత కోపం రావడానికి కారణం అతడి దుర్భాషలు అని తేలింది

అడిగితే కాని అమ్మయినా పెట్టదని నమ్మిన నాయకులు డెటిన్యూలకు ఇంకా ఎక్కువ సదుపాయాలు కలుగజేయాలని జైలు అధికారులను అడిగారు లంగోటీలతో జైలుకి వచ్చిన డెటిన్యూలు సర్వభోగాలు కోరుతున్నారని ఆయన ఆక్షేపణగా అన్నాడట అంతే అలా అవమానించిన అధికారి వైఖరికి నిరసనగా నిరాహార దీక్ష చేస్తామని అధికారులకు తెలియజేసారు మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ ముఖ్య కార్యదర్శికి తమ కోరికలు తెలియజేస్తూ జైలు అధికారులు తమను అవమానించారు కాబట్టి తమ కోర్కెలు అంగీకరించేవరకు భోజనాలు మానేస్తామని తెలియజేసారు ప్రభుత్వం నుంచి ఏ విధమైన సమాధానం రాకపోవడంతో రెండు వందలమంది డెటిన్యూలు నిరహార దీక్ష ప్రారంభించారు వారిలో నేనూ ఉన్నాను

ఆ రోజుల్లో నిరాహారదీక్ష చాలా తీవ్రమైన చర్య ఎవరు ఆ దీక్షకు పూనుకున్నా ఒరవడి మహాత్మాగాంధీ గారిదే నిరాహారదీక్షలో పాల్గొనేవారందరికీ ఎనీమా చేసారు కొద్దిగా ఉప్పు కలిపిన మంచి నీళ్లు తప్ప మరేవిధమైన పానీయాలు కూడా నిషేధం నాయకులు డెటిన్యూల గదులకు వెళ్లి వారి గదులలో తినుబండారాలు ఏమీ ఉండకూడదని హెచ్చరించారు ఏదైనా ఉంటే తీసుకు వచ్చేసారు ఎవరికైనా ఆకలి వేస్తే స్నానం చేయమనేవారు వంటువార్పు లేనందున జైలు అధికారులు భోజనాలు ప్లేట్లలో పెట్టి గదుల వద్ద పెట్టేవారు డెటిన్యూలలో చురుకుపాలు ఎక్కువ ఉన్నవారు ఆ వార్డర్లను నానా తిట్లు తిట్టి అన్నం కంచాలు విసిరి కొట్టేవారు డాక్టరు వచ్చి ప్రతిరోజూ అందరి బరువు తూచేవాడు చిత్రం ఏమిటంటే అందరూ బరువు తగ్గుతుంటే బాలకృష్ణ అనే ఒక డెటిన్యూ మాత్రం బరువు హెచ్చేవాడు దానిలోని రహస్యం మాకు అంతు చిక్కలేదు ఐదురోజులు అయ్యేసరికి ఒకరి తరువాత ఒకరు నీరసంతో తోటకూర కాడల్లా పడిపోవడం మొదలైంది వారం రోజులైనా ప్రభుత్వానికి చీమకుట్టినట్టు లేకపోయేసరికి నిరాహారదీక్ష చేస్తున్న ప్రతివాది భయంకరాచారి మంచి నీళ్లు కూడా త్రాగనన్నాడు అతణ్ణి హాస్పిటల్ కు తరలించి బలవంతంగా ఆహారం ఇచ్చారు నీరసంతో పడిపోయినవారికి శోషవచ్చి స్పృహ తప్పినవారికి జైలు అధికారులు జైలు హాస్పిటల్‌కి తీసుకువెళ్లి ఆహారం ఇచ్చేవారు దానితో వారి దీక్ష పరిసమాప్తి అయినట్టే!

నిరాహారదీక్ష ప్రారంభమై పదిరోజులు దాటిపోయింది మిత్రుడు వల్లభరావు నిలబడలేక పోయాడు చాలా బలహీనంగా ఉండే వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఇంకా అనేకమందికి నిరాహారదీక్ష అగ్ని పరీక్ష అయింది వారందరినీ హాస్పిటల్‌లోకి తరలించారు అప్పుడు నేను 23 ఏళ్ల యువకుణ్ణి కావడం వల్ల ఆ ఉత్సాహంతో ప్రతిరోజూ ఉదయం, మధ్యాహ్నం సాయంకాలం వార్డు చుట్టూ తిరిగి అందర్నీ పలకరించేవాణ్ణి పదిరోజులు దాటిపోయేసరికి అన్నపూర్ణయ్య తదితర డెటిన్యూ నాయకులకు ఆదుర్దా ప్రారంభమైంది ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్టు ఊరుకుంది హాస్పిటల్‌కి వెళ్లిపోయే డెటిన్యూల సంఖ్య రోజురోజుకు ఎక్కువవుతోంది ప్రారంభించిన సమ్మె విఫలమయ్యే లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి గౌరవప్రదంగా సమ్మె విరమించడానికి మార్గాలు వెదకడం ప్రారంభించారు నాయకులు రాష్ట్రప్రభుత్వం వద్దనుండి ఏ విధమైన మాట పలుకు లేకుండా సమ్మె విరమించడం రాజకీయ విజ్ఞత కాదు నిరాహారదీక్షలో ఉన్నవారి సంఖ్య నానాటికి తీసికట్టు నాగంభొట్లు అన్నట్లు ఉంది

అది నాయకులకు నిజమైన పరీక్షా సమయం అప్పుడు మద్రాసులో ఉన్న ప్రముఖ న్యాయవాది శ్రీ వెంకటురామన్‌కి జైలు నుంచి ఒక జాబు పంపారు దానిలో మా కోర్కెలు, మాకు జరిగిన అవమానాలు మేము ప్రారంభించిన దీక్ష ప్రభుత్వ నిర్లిప్తత అంతా వివరంగా వ్రాసారు ఈ పరిస్థితి నుంచి గౌరవంగా బైటపడడానికి దారి చూపించమని ఆయన సహాయాన్ని అర్థించారు నిరాహారదీక్ష ప్రారంభించి 15 రోజులు పూర్తి అయ్యాయి హాస్పిటల్‌కి తీసుకుపోగా మిగిలిన వారిలో కూడా నీరసం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది అప్పుడు వచ్చింది వెంకట్రామన్ వద్దనుండి జాబు తాను ప్రభుత్వ ముఖ్యకార్యదర్శితో మా కోర్కెల గురించి చర్చించానని ఆయన వాటిని సుహృద్భావంతో పరిశీలిస్తానని హామీ ఇచ్చారు కాబట్టి నిరాహారదీక్షను విరమించవలసినదిగా సలహా యిచ్చారు ఆయన సలహాను పాటించి సమ్మె విరమించడానికి నిర్ణయించారు అంతే, ఎక్కడనుండి వచ్చాయో తెలియదు కాని బుట్టలకొద్దీ బత్తాయిపళ్లు, నారింజ పళ్లు వచ్చాయి 15 రోజుల తరువాత పళ్ల రసంతో నిరాహారదీక్ష విరమించాము

ఆ తరువాత తిరిగి ఆరోగ్యం కోలుకోవడానికి కొన్ని వారాలు పట్టింది మళ్లా మామూలు జైలు జీవితంలో పడ్డాం జైలులో అనేక రకాల రాజకీయ అభిప్రాయాలు ఉన్న వ్యక్తులు ఉండేవారు అయినా యావన్మందీ బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేకులే అప్పట్లో జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధం చేస్తున్న బ్రిటిష్ ప్రభుత్వంపై ఎవరికీ సానుభూతి లేదు ఆ యుద్ధం సామ్రాజ్యవాద

దేశాల మధ్య జరిగే యుద్ధం కాబట్టి దానితో వలస దేశమైన భారత దేశానికి ఏ విధమైన సంబంధం లేదని ఏకాభిప్రాయం ఉండేది హిట్లరు సోవియట్ రష్యాపై దాడి చేయడం, సోవియట్ యూనియన్ బ్రిటిష్ ప్రభుత్వంతో చేతులు కలపడంతో ద్వితీయ ప్రపంచ యుద్ధం కొత్తపుంత త్రొక్కింది

భారతదేశానికి సంబంధించినంత వరకు రష్యా యుద్ధంలో ప్రవేశించడంతో యుద్ధం యొక్క స్వభావం మారిందని కమ్యూనిస్టులు వాదించారు అంతవరకు సామ్రాజ్యవాదుల మధ్య జరిగే యుద్ధం రష్యా ప్రవేశంతో ప్రజాయుద్ధం అయినదని వారివాదం అందుమూలంగా భారతీయులు బ్రిటిష్ ప్రభుత్వ యుద్ధ కార్యక్రమాలకు మద్దతు ఇవ్వాలని వాదించారు కాని కాంగ్రెసు నాయకులకు ఈ వాదం నచ్చలేదు రష్యా యుద్ధంలోనికి వచ్చినా బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశానికి స్వతంత్రం ఇవ్వనంత కాలం భారతీయులు యుద్ధ సహాయక కార్యక్రమాలకు మద్దతు ఇవ్వడానికి వీలు లేదని సత్యాగ్రహం సహాయ నిరాకరణ జరిగి తీరవలసినదేనని కాంగ్రెసు వారి వాదం దేశవ్యాప్తంగా జరుగుతున్న సిద్ధాంతపరమైన చర్చలు భేదాభిప్రాయాలు వెల్లూరు జైలులో డెటిన్యూల మధ్య కూడా మొదలయ్యాయి

వెల్లూరు సెంట్రల్ జైలులో కాలక్షేపం కోసం తమిళం నేర్చుకోడానికి ప్రయత్నించాను పురుషోత్తమన్ నాకు తమిళ భాష నేర్పడానికి పూనుకున్నాడు అక్షరాలు వ్రాయడం వచ్చింది ఇకమాటల వరకు వచ్చేసరికి నా తమిళ భాషాధ్యయన ప్రయత్నం డా పట్టాభి సీతారామయ్యగారి దృష్టిలో పడింది తమిళం చదవను వ్రాయను నేర్చుకోవడం చాలా కష్టం అని అయినా ఆ భాష నేర్చుకోవడం వల్ల నాకు పెద్ద ఉపకారం ఉండదని నన్ను ఆ ప్రయత్నం నుంచి విరమింపజేశారు మాతో పాటు చాలామంది తమిళులు ఉండడం వల్ల చిన్నచిన్న సంభాషణావాక్యాల్ని నేర్చుకున్నాను కాని నేను అతి త్వరలో వెల్లూరు నుంచి రాజమండ్రి సెంట్రల్ జైలుకి బదిలీ కావడంతో నా తమిళ భాష ఆ చిన్న వాక్యాలతోనే ముగిసింది

జైలుకి వచ్చి ఆరు మాసాలు అవుతుంది అంతలో విద్యార్థి డెటిన్యూలను వెల్లూరు నుండి రాజమండ్రికి మారుస్తారని వార్తలు వచ్చాయి ప్రభుత్వం దృష్టిలో విద్యార్థుల్ని కాకలు తీరిన రాజకీయ నాయకుల మధ్య అందునా ముఖ్యంగా కమ్యూనిస్టు నాయకుల మధ్య ఉంచడం అంత మంచి పని అనిపించలేదట ప్రభుత్వ ఆలోచన ఒక కొలిక్కి రావడానికి ముందే వారి ఆలోచనలను గురించిన వదంతులు మా వరకు చేరాయి ఏరోజునైనా ఆర్డర్లు రావచ్చునని జైలు అధికారులు సంకేతాలు అందించారు అప్పుడు నాకు ఒక బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది

గురజాడవారి కన్యాశుల్కం నాటకం వేస్తే ఎలా ఉంటుందని మిత్రులతో సంప్రదించాను ఒకరు పుస్తకం తెప్పించారు బజారు వార్డరు సహాయంతో ఆడ వేషాలకు చీరలు, మేకప్ సామాగ్రి తెప్పించగలిగాం ఇక పాత్రధారుల ఎంపిక కన్యాశుల్కం అంటే గిరీశం పాత్ర నేనే వేయాలని నా నమ్మకం వెల్లూరు జైలులో ఉన్న డెటిన్యూలలో తెలుగువారిలో నాటకాల సరదా ఉన్నవాళ్లు తక్కువే అయినా మాకు కావలసిన పాత్రధారులు దొరికారు మిత్రుడు వల్లభరావు పూటకూళ్లమ్మ, ట్రేడ్ యూనియన్ నాయకుడు నరసింహం మధురవాణి పాత్రలు వేయడానికి అంగీకరించారు నాటకం రోజు రాత్రి జైలు అధికారులకు తెలియకుండా స్టేజీ ఏర్పాటు చేసి కన్యాశుల్కం లో కొన్ని ముఖ్యఘట్టాలు ప్రదర్శించాం తమిళులు, మలయాళులు భాష రాకపోయినా ఆనందించారు ఇక తెలుగువారు అంటూరా! బ్రహ్మానంద పడిపోయారు ఈ రోజువరకు ఆచార్య ఎన్ జి రంగాగారికి నేను గిరీశాన్నే! విద్యార్థి డెటిన్యూలను రాజమండ్రి సెంట్రల్ జైలుకి బదిలీ చేస్తున్నట్లు ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది 1941 జూలై 25 వ తేదీ రాజమండ్రి జైలుకి ప్రయాణం మా బదిలీ సందర్భంలో ఏర్పాటు చేసిన టెన్నిస్ పోటీలో నెగ్గాను ఆ రోజు విందు భోజనం ఆ వంటలు చూస్తూ కూర్చున్నాను మహర్షి బులుసు సాంబమూర్తిగారు వచ్చి మళయాళులలో మగవాళ్లే ఇళ్లల్లో వంట చేస్తారని తెలుగు మగవాళ్లు కూడా వంటనేర్చుకోవడం మంచిదని సలహా చెప్పారు అప్పుడే మా ప్రక్క వార్డులో ఉన్న అల్లూరి సత్యనారాయణరాజు నాకు వ్రాసి పంపిన ఒక జాబు ఇంటిచ్చిబావా తెచ్చాడు ఆయనకు సమాధానం వ్రాసి ఇంటిచ్చిబావాకు ఇచ్చాను

విద్యార్థి డెటిన్యూలకు వీడ్కోలు సభకు శ్రీ బులుసు సాంబమూర్తి గారు అధ్యక్షత వహించారు మేయరు అన్నపూర్ణయ్యగారు టెన్నిస్ పోటీలలో విజేతలకు వెండిరుమాళ్లు బహూకరించారు తరువాత చాలామంది ఉపన్యసించారు కొంతమంది విద్యార్థి డెటిన్యూలను చదువు మాట మర్చిపొమ్మన్నారు మరికొందరు విడుదల తరువాత చదువు సాగించాలన్నారు జె వి కె, నేను విద్యార్థుల తరఫున మాట్లాడాం కడుపులో దిగులుగా ఉంది ఇక విందు భోజనం, వరండాలో ఏర్పాటు చేసారు ఖాన్‌సాహెబ్ కూడా మాయందున్న అభిమానంతో భోజనానికి వచ్చారు పాయసం పరోఠా అవియల్ కుర్మా, ఆమ్లెట్ అన్ని పదార్థాలు అద్భుతంగా ఉన్నాయి రేడియోలో ఢిల్లీనుండి చక్కటి సంగీతం, భోజనానంతరం తాంబూలం ఏర్పాటుచేసారు జైలుకి వచ్చేనాడు వేసుకున్న తాంబూలం మళ్లా ఆరునెలల తరువాత ఆనాడు వేసుకున్నాను ఇక ప్రయాణానికి సూటు వేసుకున్నాను అంతా చాలా బాగుందన్నారు క్రైస్తవుడిలా ఉన్నావురా

తమ్ముడూ అన్నాడు మా అన్న సీతారాముడు మేయరు గదికి వెళ్లి అన్నపూర్ణయ్యగారి వద్ద సెలవు తీసుకుని బైటకు వచ్చేసరికి అయ్యదేవర కాళేశ్వర్రావుగారు "మూర్తీ నీకు జాతీయ ప్రభుత్వంలో D S P ఉద్యోగం ఇవ్వవచ్చునయ్యా"అంటున్నారు. "అప్పుడే ఫిల్మ్ డైరక్టర్‌లా ఉన్నావయ్యా మూర్తీ" అన్నారు ఆచార్య రంగా

ఇక ప్రయాణ సమయం అప్పుడే ఇంబిచ్చి మరొక వీడ్కోలు ఉపన్యాసం ఇచ్చాడు డా శాస్త్రి విచారంగా ఏదో మాట్లాడాడు జమదగ్నికి కళ్లనీళ్ల పర్యంతం జరిగింది మాధవమీనన్, ఖాన్‌సాహెబ్, రంగయ్యనాయుడు, పట్టాభి సాంబమూర్తి, రంగాగార్లు వీడ్కోలు అభినందనలిచ్చారు ఈ మార్పు మీ విడుదలకు ముందు మెట్టన్నారు డా కె బి కృష్ణగారు మళ్లా ఎప్పుడు కలుసుకోవడం అన్నారు షణ్ముగం పిళ్ళై మా అడ్రసులు తీసుకున్నారు 'పురుష' విడుదల అనంతరం తప్పకుండా కలుసుకుందాం అన్నాడు ప్రసాద్ చాలా దిగులుగా కనిపించాడు అందరూ చాలా విచారంగా, దిగులుగా ఉన్నారు మేము బైటకు నడిచాం మేము జైలుగేటు వద్దకు వెళ్లేవరకు వారంతా బైట నిలబడి చేతులు ఊపుతూనే ఉన్నారు నాకు అప్పుడు నిజంగా జైలుకి పోతున్నట్లు అనిపించింది ఆఫీసులో చాలా ఆలస్యమయింది

మాకు ఐదుగురు పోలీసు వారిని ఎస్కార్టుగా ఏర్పాట్లు చేసారు వారినాయకుడు హెడ్‌కానిస్టేబుల్ సాహెబ్‌గారు కొంచెం చాదస్తుడిలా కనిపించాడు మేము లారీలో ఎక్కే సమయంలో కొత్త జైలు సూపరిండెంటెంట్ క్లెమెన్స్ వచ్చాడు లారీలో కూర్చున్న తరువాత దర్శి చెంచయ్యగారి భార్య పిల్లలు కనిపించారు ఇక లారీ కాట్పాడి చేరేవరకు జె వి కె నినాదాలు చేస్తూనే ఉన్నాడు ఇంటర్ క్లాసు రైలు ప్రయాణం, మద్రాసు చేరగానే నేను వల్లభరావు, గణేష్ స్టేషన్ బైటకు వెళ్లి కాఫీహోటల్‌లో ఫలహారాలు, కూల్‌డ్రింక్స్, బాదాంఖీర్ త్రాగి స్టేషన్‌కి వచ్చాం విశాల ప్రపంచం చూసి ఆరుమాసాలు అయింది తీరా చూస్తే పట్టణమంతా బ్లాక్‌అవుట్ అట అన్ని దీపాలు క్రిందికి ఉన్నాయి అంతా ఫలహారాలు చేసి రైలులో పక్కలు విప్పారు కాస్సేపు కబుర్లు గోల మా రాజమండ్రి జైలు ప్రయాణం ప్రారంభమైంది వెల్లూరు నుంచి రాజమండ్రి జైలుకి మార్చబడిన విద్యార్థి డెటిన్యూలు తొమ్మిదిమంది జె వి కె వల్లభరావు, రంగయ్య, రంగనాయకులు, రామకోటేశ్వర్రావు, అచ్యు గణేష్ శంకరయ్య, సీతారామయ్య, నేను

విద్యార్థి డెటిన్యూలను వెల్లూరు సెంట్రల్ జైలు నుంచి రాజమండ్రి సెంట్రల్ జైలుకి బదలీ చేసారు రాజమండ్రికి రైలులో ప్రయాణం చేస్తున్నాం

తెల్లవారే సరికి ఒంగోలు స్టేషన్ వచ్చింది అక్కడ రెస్టారెంటు గదికి వెళ్ళి ఇడ్లీలు తిని కాఫీ త్రాగుతుండగా రైలు కదిలింది మా మిత్రులంతా పరుగున వచ్చి అన్ని పెట్టెల్లోను ఎక్కారు శంకరయ్య మాత్రం పడిపోయిన అణాకోసం వెతుక్కుంటూ అక్కడే ఉండిపోయాడు గొలుసులాగి రైలు ఆపవలసి వచ్చింది అంతా మా కంపార్టుమెంటుకి చేరాం అంత వరకు హాయిగా నిద్రపోతున్న మా ఎస్కార్ట్ పోలీసులు హడావిడిగా లేచారు మేము తొమ్మండుగురం ఆ పెట్టెలోనే ఉన్నందుకు సంతోషించారు రైలు ఆగిన కొన్ని స్టేషన్లలోదిగి రైలంతా చూస్తూ తిరిగాం బాపట్లలో రంగనాయకులు తండ్రి, భార్య, అత్తగారు ఇంకా చాలామంది ఎక్కారు రంగనాయకులు కాట్పాడి నుంచి టెలిగ్రాం ఇచ్చాడు అప్పికట్ల స్టేషన్‌కి వందలాదిమంది జనం వచ్చారు మేము చెప్పినా వినకుండా రంగనాయకులు వెళ్ళి తన బంధువులతో మూడవతరగతి పెట్టెలో కూర్చున్నాడు నిడుబ్రోలులో భారతీదేవి రంగా, లక్ష్మీనారాయణ్ నన్నపనేని వెంకటు సుబ్బయ్య వచ్చారు ఆచార్యరంగా సోదరుడు లక్ష్మీనారాయణ మా పెట్టెలో ఎక్కి రష్యా జర్మనీ యుద్ధం గురించి ప్రజాభిప్రాయం, రాజకీయ విభేదాల గురించి మాట్లాడారు ఏలూరు స్టేషన్‌లో భారతీదేవి రంగా దిగిపోయారు ఆరు మాసాలు జైలు జీవితం గడిపినా మీరంతా కులాసాగానే ఉన్నారనుకుంటున్నారయ్యా అందామె

గోదావరి స్టేషన్‌లో దిగాం సీతారాముడు అన్న స్టేషన్‌కి వచ్చాడు హెడ్ కానిస్టేబుల్ లారీకోసం ఫోను చేసాడు వెల్‌కం హోటల్‌కి కాఫీ త్రాగడానికి వెళ్ళాం విచిత్రమేమిటంటే మేము ఒక జైలు నుంచి మరొక జైలుకి వెళ్ళుతున్నామంటే ఒక్కడూ నమ్మలేదు 1941 జూలై 26 వ తేదీ శనివారం రాజమండ్రి సెంట్రల్ జైలులో అడుగుపెట్టాం జైలర్ మమ్మల్ని యార్డుకి తీసుకువెళ్ళాడు దానికి, పెద్ద జైలుకి సంబంధం లేదు జైలుకి అనుసరించి బైట ఉన్న సివిల్ డెట్యర్స్ యార్డులో మా మకాం అన్నారు అదొక చిన్న నరకంలా ఉంది అందునా వెల్లూరు నుంచి వచ్చిన మాకు ఆ యార్డు రాజుని చూసిన కళ్ళతో మొగుణ్ణి చూచినట్టుంది ఒక వంటుగది, స్నానాలగది, లెట్రిన్ ఉన్నాయి నన్నగా చిన్నగా ఉన్న హాలు దానిలో 25 ఓల్టులు ఒకే ఒక బల్బు ఒక కుర్చీ కాని, బల్లకాని, మంచం కాని, ఏమీ లేవు మా సామాన్లు ఏవయ్యా అంటే తెలియదన్నాడు భోజనానికి సంబంధించిన ఛార్టు తప్ప మరే విధమైన వివరాలు రాలేదట అవన్నీ వెల్లూరు జైలు నుంచి రావాలన్నాడు రాత్రి లాకప్ ఉంటుందన్నాడు మాకు లాకప్ లేదని ఎంత వాదించినా అంగీకరించలేదు చివరకు రాత్రి పదిగంటల వరకు బైట ఉండనిస్తానన్నాడు ముందు స్నానాలు చేయండి కాస్త చల్లబడతారని చెప్పి వెళ్ళిపోయాడు ఇక రంగయ్య గారు ఏమయినా సరే లాకప్‌కి అంగీకరించకూడదని తీవ్రంగా వాదించాడు

మాలో మాకు అభిప్రాయ భేదాలు వచ్చాయి చివరకు వెల్లూరు నుంచి ఆర్డర్లు వచ్చేవరకు వేచి ఉండాలని నిర్ణయించారు భోజనానికి బి క్లాసు వాళ్ళకిచ్చే గిన్నెలు ఇచ్చారు ఇంకా కోపంలో ఉన్న రంగయ్యగారు మట్టి మూకుడులో భోజనం చేసాడు

రామకోటేశ్వరరావుని మేయరుగా ఉండమని ఏకగ్రీవంగా కోరారు ఫుడ్ కమిసార్‌గా నన్ను ఉండమన్నారు కాని నా పట్టుదలవల్ల జె వి కె ఉండడానికి అంగీకరించాడు అంతలో జైలర్ వచ్చాడు తనకూడా తనకొడుకు ఇబ్రహీంని తీసుకువచ్చాడు ఫస్ట్‌ఫారం చదువుతున్న కుర్రవాడు మమ్మల్ని చూచి ఆశ్చర్యపోయాడు మీరంతా ఖైదీలు ఏవిటని ఏదో మాట్లాడేస్తున్నాడు అంతలో జైలర్ ఒక కట్లపాముని చంపాడు ఇంకా అనేకరకాల క్రిమికీటకాలు ఉండ వచ్చునన్నాడు తనింటికి పదిమంది అతిధులు వచ్చినా తనకు ఇంతగొడవ ఉండదని, మేము రావడంవల్ల తనకు శ్రమ ఎక్కువయిందని గొడవ చేసాడు ఇక లాకప్, ఆ తలుపులు వేసేటప్పుడు మొదటిసారిగా జైలులో ఉన్నట్టనిపించింది అరే తలుపుతాళం వేసుకుపోతున్నాడే అని దిగులు లోపల దోమలు, ఉక్క మంచాలు లేవు అలాగే పడుకున్నాం పయాణ బడలిక వల్ల కాబోలు మంచినిద్ర పట్టింది జీవితంలో లాకప్‌లో ుడుకోవడం అదే మొదటి అనుభవం మరునాటి ఉదయం తలుపులు ఎప్పుడు తెరిచారో కూడా తెలియదు మాకు సహాయం చేయడానికి ఇద్దరు ఖైదీలను పంపారు వారిలో ఒక వృద్ధుడు మందసా కాల్పుల నాటి వాడట ఆ నాటి కబుర్లు చెప్పాడు అంతలో జైలు సూపరింటెండెంటు గెరటీ జిల్లా కలెక్టరు సతియనాధన్ వచ్చారు డెటిన్యూలకు వెల్లూరు జైలులో ఇచ్చే సదుపాయాలు అన్నీ ఇక్కడ కూడా ఇవ్వాలని మా మేయర్ చెప్పాడు అవన్నీ వ్రాసి ఇవ్వండి తప్పకుండా ఇచ్చే ఏర్పాట్లు చేస్తామన్నారు బజారు నుంచి కావలసిన వస్తువులు తెచ్చి పెట్టడానికి ఒక వార్డరు వచ్చాడు అతడు హైయ్యర్ గ్రేడ్ టీచరు ట్రైనింగ్ అయి లెక్కల పరీక్షలో తప్పి జైలు వార్డర్ ఉద్యోగానికి వచ్చాడట

ధర్మయ్య అనే వార్డర్ని మా వార్డుకి వేసారు అతడు బెంగాల్ డెటిన్యూలు రాజమండ్రి జైలులో ఉన్నప్పుడు వారివద్ద ఉండే వాడట మా వద్ద పనిచేయడానికి ఒక కోయ దొరని తెచ్చాడు అతడు ఖైదీ అయినా తాము జాతి దొరలమని పాండవుల జాతికి చెందినవాణ్ణి కాబట్టి మీవద్ద పని చేయనన్నాడు అతడు మాకు వద్దన్నాం కాని ధర్మయ్య వాణ్ణే ఉంచాడు విశ్వవిద్యాలయం విద్యార్థులు జైలుకి వచ్చారంటే అందరికీ విడ్డూరంగా ఉంది జైలు హెడ్ గుమాస్తా మమ్మల్ని చూడ్డానికి వచ్చాడు మళయాళుడు ఏమి

కావాలన్నా ఇప్పించే ఏర్పాటు చేస్తానని చెప్పి వెళ్ళాడు ఆ మరుచటి రోజు ఉదయం కొత్త సమస్య వచ్చింది

ప్రతిరోజు ఉదయం జైలులోని ఖైదీలంతా బారులు తీరి నిలబడితే సూపరింటెండెంటు చూస్తాడు కాని డెటిన్యూలకు ఆ పద్ధతి వెల్లూరులో లేదు రాజమండ్రిలో మేమూ అలా నిబడడానికి అంగీకరించలేదు గెరిటీ ఖంగారుగా వచ్చి ఫైలులో ఎందుకు నిలబడలేదన్నాడు ఆ పద్ధతి మాకు వర్తించదన్నాము అతడు వెళ్ళిపోయాడు సాయంకాలం ఆటలు ఆడుకోవడానికి బైటకు వెళ్ళాం కుర్ర ఖైదీలు ఆడుకుంటున్నారు వాళ్ళతో మనం కలిసి ఆడాలా వద్దా అనే విషయం మీద పెద్ద చర్చ చివరకు వాళ్ళతో కలిసి ఆడకూడదని నిర్ణయించారు ఆ కుర్రవాళ్ళు వెళ్ళిపోయిన తరువాత మేము ఆడుకున్నాం ఆట స్థలానికి జైయిలర్ సంతానం వచ్చారు ఆయనకు 11 మంది సంతతి హైదర్ కూడా రాజకీయాల్లో చిక్కుకున్నాడని జైలర్ అనేవారు ఇబ్రహీమ్, జాఫర్ కుర్రవాళ్ళు ఒక అమ్మాయి కాన్వెంటులో చదువుతున్నదట ఇంగ్లీష, ఉర్దూ తప్ప మరే భాష రాదన్నది ఆ పిల్లలతో కబుర్లు చెబుతుంటే మళ్ళా ఇంతకాలానికి పిల్లల ప్రపంచంలో ఉన్న ఆనందాన్ని అనుభవించిన అనుభూతి కలిగింది

ఉదయం వాహ్యాళికి అనుమతించారు మేమంతా వాహ్యాళికి బయలుదేరాం వెల్లూరు జైలుతో పోలిస్తే రాజమండ్రి జైలు చిన్నది గాని ఆవరణ హెచ్చుగానే ఉంది అంతా పచ్చగా కన్నుల పండువగా ఉంది జైలు చుట్టూ ప్రదక్షిణ చేస్తూ ఉండగా నాతో పిఠాపురంలో చదువుకున్న బ్రహ్మజీరావు కనిపించాడు అతడు జైలు డాక్టరు అల్లుడట కాస్సేపు మాట్లాడి వార్డుకి తిరిగి వచ్చాము ఎలక్ట్రిషియన్ వచ్చి మరో రెండు బల్బులు, బైటు ఒకటి వేసాడు డాక్టరు వచ్చి మా బరువు, ఎత్తు, గుర్తింపు మచ్చల వివరాలు తీసుకువెళ్ళాడు ఆ బరువు మిషన్ రైల్వే కాటాలా ఉంది అది రాజమండ్రి జైలు వెనుకబడ్డతనానికి నిదర్శనం అని అన్న చమత్కరించాడు

రాజమండ్రి సెంట్రల్ జైలులో కాలక్షేపం కష్టంగా ఉంది అన్న సీతారాముడు సర్వజ్ఞుడు కావడం వల్ల ఏ విషయం మీద సంభాషణ ప్రారంభించినా చక్కటి విశేషాలు వివరాలు గంటల తరబడి చెప్పేవాడు వాడి తెలివితేటలకు మేమంతా ఆశ్చర్యపోయేవాళ్ళం అక్కడ ఉన్న తొమ్మిదిమందిలోను అచ్యు, అన్న అనేక రోజులు మౌనవ్రతం పాటించడం ప్రారంభించారు అచ్యు మౌనాన్ని పాడు చేయడానికి మిగిలినవారు చేసే ప్రయత్నాలు చూస్తే నవ్వు వచ్చేది అయితే బజారు వార్డరు వస్తే మాత్రం తనంతటతానే మౌన భంగం చేసుకుని తనకు కావలసిన సరుకులు వార్డరుతో

చెప్పి మళ్ళా మౌనంలోకి వెళ్ళిపోయేవాడు మౌనం పాటించడం వల్ల సాధించగలిగే మానసిక శక్తిని గురించి అన్న ఉపన్యాసాలు ఇచ్చేవాడు వారానికి ఒక రోజు మౌనం పాటిస్తే బాగుంటుందని నాకు కూడ అనిపించేది మేమంతా యువకులం కావడం వల్ల అధమం వ్యాయామం కోసమైనా ఆటలు ఆడేవాళ్ళం జైలర్ కుమారుడు హైదర్ రెండు డొక్కు టెన్నిస్ బ్యాట్లు తెచ్చాడు టెన్నిస్‌తో బాటు హాకీ, ఫుట్‌బాల్ కూడా ఆడేవాళ్ళం ఒకనాడు హాకీ ఆటలో రంగయ్యగారి హాకీ స్టిక్ తగిలి రామకోటేశ్వరరావు పై పళ్ళు కొన్ని విరిగిపోయాయి పెదవులు చిట్లాయి ఆయన దెబ్బలు తగిలి బాధ పడుతుంటే మరో ప్రక్క రంగయ్యగారు అయ్యో తనవల్లే కదా ఆయనకు దెబ్బలు తగిలాయని బాధపడుతూ ఏడుపు ఆయన ఏడ్పు చూస్తే మాకూ కళ్ళు చెమ్మగిల్లాయి అంత సున్నితమైన మనస్సుతో ఆయన డాక్టరు వృత్తి ఎలా చేస్తాడో అనిపించింది

జిల్లా కలెక్టరు సతియనాధన్ జిల్లా వైద్యాధికారి డాక్టరు రావు వెంకటరావు, జైలు అధికారులు అంతా వచ్చి పలకరించి వెళ్లారు డా||వెంకటరావు చాలా మంచి వైద్యుడే గాని ఆయన చాలా ముభావంగా ఉండేవాడు మాట్లాడితే వజ్రాలు రాలతాయా అన్నట్టు ప్రవర్తించేవాడు ౦కరింపుగాని చిరునవ్వుగాని ఉండేది కాదు అయితే మాలో ఇద్దరు నాల్గవ ౦వత్సరం యం బి బి యస్ విద్యార్థులు కావడం వల్ల మమ్మల్ని చూడ్డానికి ౦చ్చినప్పుడు మాత్రం కొద్దిగా ఆయన ప్రవర్తనలో తేడా కనిపించేది కూర్చుని మంచి చెడ్డలు మాట్లాడేవాడు కలెక్టరు సతియనాధన్ ఐ సి యస్ ఆఫీసరు తనవద్దనున్న ఇంగ్లీషు పుస్తకాలు తీసుకువచ్చి మాకు చదువుకోడానికి ఇచ్చేవాడు చాలా సరదాగా మాట్లాడేవాడు జాతీయ అంతర్జాతీయ విషయాలు చర్చించేవాడు మా చేతివంట రుచి చూడాలనేవాడు ప్రభుత్వం చేసే కొన్ని రూల్సు ఎంత అర్ధరహితంగా ఉంటాయో మేమంతా ఏకరువు పెట్టేవాళ్ళం కూరలు తరుక్కోడానికి కత్తిపీట ఇచ్చి పళ్ళు కోసుకోడానికి చాకు ఇవ్వడానికి వీలులేదన్న అధికారుల పద్ధతి మాకు అర్థం అయ్యేది కాదు దానికి తోడు జైలు అధికారులు మా జాబులు, వార్తాపత్రికలు సెన్సార్ చేసేవారు ఒకటి రెండుసార్లు మసిపూసి పంపిన వార్తాపత్రికలు తిరిగి పంపేసాం అంత మాత్రాన జైలు అధికారుల దృక్పథంలో మార్పు వస్తుందనుకోవడం మా భ్రమ పేదవాడి కోపం పెదవికి చేటన్నట్టు మా నిరసనను వారు పట్టించుకునేవారు కారు

వార్డుకి వెల్ల వేస్తున్నారు మా కోసం కుర్చీలు మంచాలు వచ్చాయి బల్లల మీద భోజనాలు జైలుశాఖ ఇన్‌స్పెక్టరు జనరల్ గిల్ రాజమండ్రి సెంట్రల్ జైలు

చూడ్డానికి వస్తున్నాడన్నారు తీరా చూస్తే మేము వెల్లూరులో ఉన్నపుడు జైలు సూపరింటెండెంట్‌గా ఉండే గిల్ ఉన్నత పదవికి చేరాడని తేలింది ఆయన మాకందరికి తెలిసినవాడు కావడం వల్ల చాలా చనువుగా కబుర్లు చెప్పాడు అది చూచిన రాజమండ్రి జైలు అధికారులకు మతులు పోయాయి గణేశన్ మమ్మల్ని సినిమాలు చూడ్డానికి అనుమతించాలన్నాడు అది సాధ్యం కాదు కాని ఫిల్మ్ఇండియా సినీపత్రిక పంపుతామన్నారు చదువుకోడానికి గ్రుడ్డిలో మెల్ల అని సంతోషించాం గణేశన్ తండ్రి తన కుమారుణ్ణి పెరోల్‌మీద విడుదల చెయ్యాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసుకున్నాడట దానిమీద ప్రభుత్వం గణేశన్‌ని జైలునుండి విడుదల చేసారు వాళ్ళు పెరోల్ అడిగితే ప్రభుత్వం పూర్తి విడుదల ఇచ్చింది దానితో మిగిలిన విద్యార్థి డెటినూ్యల విడుదల విషయంలో ప్రభుత్వ విధానంలో ఏదైనా మార్పు రావడానికి అవకాశం ఉన్నదా అని ఆలోచనలు, ఆశలు గణేశన్ విడుదల అయి వెళ్ళిపోయాడు చిత్రం ఏమిటంటే నేను ఆంధ్రా విశ్వవిద్యాలయం ఫ్రెంచి ప్రిలిమినరీ పరీక్షకు వెళ్ళడానికి అనుమతించవలసినదని ప్రభుత్వానికి చేసిన విన్నపానికి వచ్చిన సమాధానంలో "నిన్ను ఇప్పుడు విడుదల చేసే ఆలోచన ప్రభుత్వానికి లేదు" అని స్పష్టంగా ఉంది

జైలునుంచి బైటపడ్డ తరువాత ఏమి చేయాలనే సమస్యపై మేమందరం తీవ్రంగా చర్చించుకునేవాళ్ళం జైలు నాలుగు గోడలమధ్య భవిష్యత్తు ఎంత అంధకారంగా ఉన్నా మా ఆలోచనలు చర్చలు సాగుతూనే ఉండేవి తిరిగి చదువులు సాగించాలా వద్దా అనే విషయం కూలంకషంగా చర్చించి చదువు సాగించవలసినదేననే నిర్ణయానికి వచ్చారు వాళ్ళకున్నంత ధైర్యం నాకు లేకపోయింది వాళ్ళ జీవితాలు వడ్డించిన విస్తళ్ళు కొంతవరకు సీతారాముడి విషయంలోను, పూర్తిగా నా విషయంలోను జీవితం అంత సజావుగా హాయిగా నిర్విచారంగా జరిగే అవకాశాలు తక్కువ విశ్వవిద్యాలయం వరకు చేరడమే నాకు బ్రహ్మ ప్రళయమయింది రెండేళ్ళు ఆగిపోయిన చదువు కొనసాగించడానికి నేను పడ్డ పాట్లు మిత్రులకు చెప్పుకుని, ఆ శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరు అవుతుందేమోనని బాధ పడేవాణ్ణి మిత్రులందరూ నా కథ చాలా శ్రద్ధగా సానుభూతితో వినేవారు కాలక్షేపం లేకపోతే పాత కథలు చెప్పుకుని భవిష్యత్తు గురించిన ఆలోచనలను పంచుకునేవాళ్ళం

1941 సెప్టెంబరు 28 వ తేదీ ఉదయం పత్రికలలో సంచలనాత్మకమైన వార్త అంతకు ముందురోజు వెల్లూరు సెంట్రల్ జైలు నుంచి ఐదుగురు డెటినూ్యలు పారిపోయారట శ్రీయుతులు సి వి కె రావు, గోపాలన్, కన్నన్, పట్టాభిరామయ్య, సూర్యనారాయణ రాజు జైలు గోడకు రంధ్రం చేసి

పారిపోయినట్లు వార్త అది చదివి మేమంతా ఆశ్చర్యపోయాం రాజమండ్రి జైలులో ఉన్న విద్యార్థి డెటిన్యూలలో జైలునుంచి పారిపోవడం మీద చర్చ. చాలా సాహసవంతమైన పనిచేసారని కొందరంటే, వారి చర్యవల్ల జైళ్ళలో ఉన్న మిగిలిన డెటిన్యూలకు ఇబ్బందులు ఎక్కువవుతాయని మరి కొందరు అభిప్రాయపడ్డారు అసలు వారు జైలు నుంచి ఎలా పారిపోగలిగారా? అని ఆలోచించాను అనుకున్నట్టు ప్రభుత్వ ఆజ్ఞలు రావడానికి ఒక వారం పట్టింది ఆనాడు రాత్రి భోజనాలు చేసి బైటకు వచ్చేసరికి జైలర్ వచ్చాడు మమ్మల్ని లాకప్‌చేయమని టెలిగ్రాం వచ్చింది కాబట్టి లాకప్ చేయాలన్నాడు అటువంటి దేదోవస్తుందని అనుకున్న విషయమే కాబట్టి ఎవరూ నోరెత్తలేదు వెంటనే తాళం వేసుకు వెళ్ళి పోయాడు

రాజమండ్రి జైలుకి వచ్చినప్పటి నుంచి లోపల పడుకోవడమే అలవాటు చేసుకున్నా లాకప్ అనేసరికి మనస్సు పీకింది ఆ రాత్రి 10 గంటలకు లాకప్ ఉదయ వాహ్యాళి, ఆటలు ఉంటాయా? ఉండవా? అనే విషయం మీద ఆలోచించాం ఆమరునాడు ఉదయం వాహ్యాళికి అనుమతించలేదని వార్త వచ్చింది లాకప్ గురించి మాలో ఎవరూ బాధపడలేదు కాని ఉదయం నడకకు వెళ్ళనివ్వక పోవడం మీద కారాలు మిరియాలు నూరారు జైలు సూపరింటెండెంటు మమ్మల్ని చూడ్డానికి వచ్చి మీ ఇబ్బందులు ఇనస్పెక్టర్ జనరల్‌కి చెప్పుకోమని సలహా ఇచ్చాడు నాలుగు రోజుల తరువాత లాకప్ ఏడుగంటలకే అన్నారు ఒక సుగుణం ఏమిటంటే సాయంకాలం ఆటలకు వెళ్ళడానికి అనుమతి ఇచ్చారు ఇప్పుడు మళ్ళా జైలులో ఉన్నట్టు అనిపిస్తోంది రోజురోజుకీ జైలు జీవితం కష్టభరితమవుతోంది 'అన్న' సీతారాముడు మౌనం పాటిస్తూనే ఉన్నాడు ఒకసారి మన దేశంలో మత కలహాలను ఆపడంలో మార్క్సిస్టు సిద్ధాంతం ఎందుకు ఉపయోగ పడటం లేదనే విషయం మీద, మరొకసారి 'నేను' అనే విషయం మీద తీవ్రంగా ఆలోచించడం కోసం మౌనం అవలంభిస్తున్నానన్నాడు వాడు మంచి మూడ్‌లో ఉన్నప్పుడల్లా 'ఒరే తమ్ముడూ నేను గొప్ప మేధావిని అవుతానురా' అనేవాడు వాడి సామర్థ్యాన్ని నేను ఎన్నడూ తక్కువగా అంచనా వేయలేదు అయితే తనకు ఏదైనా బిరుదు ఇప్పించమని గోలపెడితే ఒక నాడు సభ ఏర్పాటు చేసి 'సంగీతం మాష్టారు' అని బిరుదు ఇచ్చాం ఆనాడు నా జీవితంలో మొదటిసారిగా ఇంగ్లీషులో మూడు ముక్కలు చెప్పాను

గాంధీ జయంతినాడు ఉపవాసం చెయ్యాలా లేక విందు చేసుకోవాలా అని మీమాంస వచ్చింది మాలో అచ్యుతన్ నిజమైన గాంధీ భక్తుడు ఆ రోజున అతడు ఉపవాసంచేసి మౌనం పాటిస్తానన్నాడు మిగిలిన వారంతా

గాంధీజీ పుట్టిన రోజు సందర్భంగా విందు చేసుకోవాలన్నారు అచ్యు ఉపవాసం చేస్తూంటే మిగిలినవారు విందుచేసుకోవడం బాగోదు కాబట్టి ఆ మరుచటి రోజున చేసుకోవాలని నిర్ణయించాం అచ్యు ఎంత చాదస్తుడంటే అతడికి ఏ సమస్య వచ్చినా గాంధీజీకి వ్రాసేవాడు మేమంతా గాంధీజయంతి విందు చేసుకునే రోజున మహాత్ముని వద్దనుంచి అచ్యుకి ఒక కార్డు వచ్చింది అది ఆయన స్వహస్తంతో వ్రాసారు 'నీజాబు అందుకుని సంతోషించాను అపోహలు అజ్ఞానం మూలంగా వస్తాయి మీకందరకు నా శుభాకాంక్షలు' అని వ్రాసారు బాపు అని సంతకం పెట్టారు ఆ జాబు చూచుకుని అచ్యుతోపాటు మేమంతా మురిసిపోయాం గాంధీజీ మాకందరికీ ఆ సందేశం ఇచ్చారనే భావం కలిగింది ఆయన చేతి వ్రాతపై వ్యాఖ్యానిస్తూ ఆ వ్రాత అలా ఉండడం మూలంగానే ఆయన అంత గొప్పవాడయ్యాడన్నాడు అన్న ఆరోజు మేమంతా చాలా సంతోషించాం

మా వార్డుకి వచ్చే సేవకులు, వార్డర్లు వాళ్ల పేచీలు, గొడవలు మాముందు చెప్పుకునేవారు మాకు అది గొప్ప కాలక్షేపంగా ఉండేది మా వద్ద పనిచేసే నాగన్న అనే ఖైదీని హెడ్‌వార్డర్ వెతికిస్తే బీడ దొరికినదట అతగాణ్ణి కొట్టారు జైలులో జరిగే అన్యాయాలు, స్మగ్లింగ్, అక్రమ వ్యాపారాల గురించి ఖైదీలు, వార్డర్లు కూడా చెప్పేవారు ఖైదీలు జైలులోకి ప్రవేశించేముందు జైలు అధికారులు వాళ్ళను పూర్తిగా పరీక్షిస్తారు ఏమీ లోపలకు తీసుకు వెళ్ళనివ్వరు అయినా కొందరు నాణాలు, మరికొందరు బంగారం ముక్కలు లోపలకు తీసుకువెళ్ళి దానితో వ్యాపారం చేస్తారు దీనిలో రెండవసారి మూడవసారి జైలుకి వచ్చేవాళ్ళు సిద్ధహస్తులు జైలుకి వచ్చే సమయం వచ్చేసరికి దగ్గర ఉన్న డబ్బు గళ్ళా పట్టు పడతారు జైలు వార్డరు దానిని ఒక్క క్షణంలో కక్కిస్తాడు తెలివైన వాడు అరటిపండులో నాణాలు ఉంచి మింగివేస్తాడట వాటిని మరునాడు జైలు లెట్రిన్‌లో తీసుకుంటాడట వార్డర్లకు లంచాలు ఇచ్చి బీడీలు సిగిరెట్లు తెప్పించి వాటిని అన్నం ముద్దలకు ఖైదీలకు అమ్ముతారు ఇలా ఎన్నో వ్యాపారాలు కాసుగాడని ఒక ఖైదీ మా వార్డుకి వచ్చాడు అతడికి పాలమూరు ప్రాంతంలో మంచి పేరట 25 వేలవరకు దొంగతనాలు చేసాడట రెండుసార్లు రంగూన్ వెళ్ళాడు కాసుకి పోలీసులు అంతా తెలుసునట కోర్టులో తనే క్రాస్ ఎగ్జామినేషన్ చేస్తాడట దొంగతనం చేసినప్పుడు ఎప్పుడూ దొరకలేదట జూదం, త్రాగుడు అలవాట్లు మూలంగా దొరికిపోయేవాడట నాగన్న అంతర్వేదిపాలెం వాడు ఏడు ఎనిమిదివేలు దొంగతనాలు చేసాడట ఆరువేలు పట్టపగలే కన్నం వేసాడట గాని తనకు దానిలో కానీ రాలేదని వాపోయాడు వీళ్ళిద్దరూ కూర్చుని దొంగతనాలు చేసే పద్ధతులమీద ఉపన్యాసాలు చెప్పేవారు

జైలుకి వచ్చి సంవత్సరం అవుతోంది జైలునుంచి ఎప్పుడు ఎలా బైట పడతామా? అనే ఆలోచన ఎక్కువైపోతోంది గణేశన్‌ని విడుదల చేసినప్పుడు అది విద్యార్థి డెటిన్యూల విడుదలకు నాంది అని ఆశించాం అచ్యుత తండ్రి మద్రాసు ప్రభుత్వానికి వ్రాస్తే ఏవో కొన్ని షరతులమీద విడుదల చెయ్యడానికి అవకాశం ఉన్నట్టు తెలిసినదని, కాని చదువుకోడానికి అనుమతించరని ఆయన వ్రాసాడు ఇక స్వచ్ఛందంగా కాకుండా క్షమాపణ చెప్పుకునో రాజకీయాల్లో ప్రవేశించనని హామీ ఇచ్చో విడుదల అయ్యే అవకాశం ఉంటే మన దృక్పథం ఎలా ఉండాలనే విషయంమీద తీవ్రంగా మాలో మేము చర్చించుకున్నాం క్షమాపణ చెప్పడానికి ఎవ్వరూ సిద్ధంగా లేరు కాని హామీ ఇవ్వడానికి కొందరికి అభ్యంతరం లేదని తేలింది అయినా సంవత్సరంక జైలులో ఉండి ఇప్పుడు క్షమాపణ చెప్పుకోవడంలో అర్థం లేదనిపించింది అంత తీవ్రంగా చర్చించిన తరువాత అంతవరకు ఎవరికీ ప్రభుత్వం వద్దనుంచి ఏ విధమైన సమాచారం రాలేదని గుర్తు వచ్చి అంతా నవ్వుకున్నాం ఏదో శాస్త్రం చెప్పినట్టు మా ఆదుర్దాలో విడుదలకు సంబంధించిన ఏ చిన్న విషయాన్నైనా చాలా తీవ్రంగా చర్చించేవాళ్ళం

వెల్లూరు సెంట్రల్ జైలునుంచి పట్టాభి, సాంబమూర్తి, కాళేశ్వరరావు, కామరాజ్, మాధవమీనన్ మొదలైన కాంగ్రెలు నాయకుల్ని నవంబరు నెలాఖరులోగా విడుదల చేస్తున్నారనే వార్త విని సంతోషించాం మేము వెల్లూరునుంచి రాజమండ్రి బదిలీ అయినప్పుడు నాయకులు మా విడుదలకు సర్వవిధాలా ప్రయత్నిస్తామని ఇచ్చిన హామీలు గుర్తుకు తెచ్చుకున్నాం అంతలో రాజమండ్రికి మరొక విద్యార్థి డెటిన్యూ వస్తున్నాడని పిడుగువంటి వార్త అందింది ఏ రోజునైనా జైలునుంచి విడుదల కావచ్చునని పగటి కలలు కనే మాకు ఆ వార్త అశనిపాతం యజ్ఞమూర్తి నంబూద్రిపాద్ అనే మళయాళీ విద్యార్థిని వెల్లూరునుంచి రాజమండ్రి పంపారు మేమంతా గేటుదగ్గర నిలబడి అతనికి స్వాగతం చెప్పాం ఆ తరువాత కూర్చుని వెల్లూరు కబుర్లు విడుదల సందర్భంగా జరిగిన వీడ్కోలు సభలో పట్టాభిగారు మాట్లాడలేదట కాళేశ్వరరావుగారు అందరి విడుదలకు ప్రయత్నిస్తానన్నారట అవసరమైతే రాజాజీ సహాయం తీసుకుంటానన్నారట సాంబమూర్తిగారు మాత్రం బైటకు వెళితే జైలులోని సర్వ విషయాలు మర్చిపోతానన్నారట కాని మద్దూరి అన్నపూర్ణయ్యగారు మాట్లాడిన తరువాత విద్యార్థి డెటిన్యూల విడుదల గురించి ప్రయత్నిస్తానని సాంబమూర్తి గారు అన్నారట ఏవిటో అదంతా వింటుంటే ఇంతలో మాకు జైలునుంచి విముక్తి కలుగుతుందనే ఆశాభావం కలుగలేదు

కాశేశ్వర్రావుగారు మాత్రం విడుదల అయిన నాటి నుంచి రాజమండ్రిలో ఉన్న విద్యార్థులకు జాబులు వ్రాస్తూనే ఉన్నారు పత్రికా ప్రకటనలు ఇస్తూనే ఉన్నారు ఆయన అచ్యుకి జాబు వ్రాస్తూ నవంబరు 23లోపున రాజమండ్రి వచ్చి వాణ్ణి, నన్ను కలుసుకుంటానన్నారు ఎంతో ఆశతో ఎదురు చూసిన ఇంటర్వ్యూ రానే లేదు జైలు సూపరింటెండెంటు వచ్చి ఆయన మద్రాసు తిరిగి వెళ్లారని తిరిగి 15 రోజుల్లో వస్తారని కబురు చెప్పారు ఆయన మద్రాసు నుంచి చక్కటి పత్రికా ప్రకటన చేసారు అది మాకందరికీ ఎంతో నచ్చింది ఆయన రంగయ్యగార్కి జాబు వ్రాస్తూ విద్యార్థి డెటిన్యూల గురించి గాంధీజీకి వ్రాస్తానని, మద్రాసులో ప్రభుత్వ చీఫ్ సెక్రటరీని కలుసుకుని వస్తానని వ్రాసారు డాక్టరు పట్టాభి అన్నకు జాబు వ్రాసారు భక్తవత్సలం అచ్యుకి జాబు వ్రాసారు పట్టాభిగారి జాబులో విద్యార్థుల విడుదల ఆలస్యం అవుతుందని ప్రభుత్వం పట్టు వదలడం లేదని వ్రాసారు ఇంతలో అందరి విడుదల సానుభూతితో పరిశీలిస్తున్నామని, వ్యక్తిగతమైన కేసులు కూడా పరిశీలిస్తున్నట్టు ప్రభుత్వ ప్రకటన అది చూసి మేమంతా నిజంగా విడుదల అయిపోయినట్టే సంబరపడిపోయాము ఇక ప్రయాణాలు, చదువులు, భవిష్య కార్యక్రమాల గురించి ఆలోచనలు

అందరూ విద్యార్థి డెటిన్యూలు విడుదల కావడం తథ్యం అంటున్నారు కాని పత్రికలలో వచ్చే వార్తలు మమ్మల్ని ఆశ నిరాశల మధ్య ఊగిస్తున్నాయి. అంతలో ప్రపంచ యుద్ధంలో క్రొత్తమలుపు డిసెంబరు 7 వ తేదీన జపాన జర్మనీకి మద్ధతుగా మిత్రరాజ్యాలపై యుద్ధం ప్రకటించింది పెరల్ హార్బర్‌లో విధ్వంసకాండ, ఆసియాలో యుద్ధ జ్వాలలు అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా దేశాలు యుద్ధంలో దిగాయి జపాను యుద్ధంలో దిగేసరికి ప్రపంచయుద్ధం మన దేశానికి దగ్గర అయింది దాని మూలంగా భారత స్వాతంత్ర్య ఉద్యమంపై బ్రిటిష ప్రభుత్వం యొక్క ప్రభావం ఎలా ఉంటుంది అనే విషయం మీద మాలో చర్చ పరిస్థితి ఆశాజనకంగా లేదు

ఒకనాడు జైలర్ వచ్చి ఆ మరునాడు ఉరిశిక్ష అమలు చేస్తారని చెప్పి అది చూడాలంటే సూపరింటెండెంటు అనుమతి అడగమన్నాడు ఉరి తీయడానికి తీసుకువెళ్ళే ఖైదీ మనస్తత్వం ఎలా ఉంటుంది అనే విషయం మీద అనేకసార్లు చర్చించుకున్నాం మనం అడిగినా సూపరింటెండెంటు అనుమతించడు అనిపించింది అయినా ఒక నిండు ప్రాణాన్ని తీస్తుంటే దానిని వినోదంగా చూసే ఆలోచన ఎవరికీ నచ్చలేదు ఆ మరునాడు వార్డరు వచ్చి ఉరి తీయడం వివరాలు చెప్పాడు తెల్లవారు ఝామున జడ్జి వచ్చి శిక్ష చదివి వినిపించాడట సూపరింటెండెంటు తాను కోర్టు ఆజ్ఞలను పాటిస్తున్నాను తప్ప ఇందులో తన

పాపం ఏమీ లేదన్నాడట ఖైదీని స్నానం చేయించి ఉరితీసే ముందు ఏమి కావాలని అడిగారట అతడు త్రాగడానికి పాలు, కాల్చుకోవడానికి సిగిరెట్టు కోరాడట అది వింటే మాకు విషాదంతో కూడిన నవ్వు వచ్చింది ఆ తరువాత గంటల తరబడి ఉరిశిక్ష ఉండాలా అనే ప్రశ్న మీద చర్చ నేరం చేసినవాడు శిక్ష అనుభవించవలసినదే అని కొందరివాదం హత్యానేరానికి ఉరిశిక్ష వేయకపోతే నేరాలు ఆపడం కష్టం అన్నారు మాలో కొందరు ఉరిశిక్షను ప్రపంచ వ్యాప్తంగా రద్దు చేయాలని వాదించారు సామాన్య నేరాలకు జైలు శిక్ష వేసినంత మాత్రాన నేరాలు తగ్గనట్టే ఉరిశిక్ష వేసినంత మాత్రాన హత్యలు తగ్గవన్నారు నేరస్థులను సంస్కరించి మంచి మార్గంలో పెట్టడం ఉత్తమం అన్నాడు అన్న

మాకు పనులు చేసి పెట్టడానికి వచ్చే ఖైదీ నాగన్న శిక్ష పూర్తి అయి ఆ మరునాడు విడుదల అవుతున్నానని చెప్పాడు మేము రాజమండ్రి జైలుకు వచ్చినప్పటినుంచి మా పనులు చేసిపెట్టి మా అందరి ఆదరాభిమానాలు చూరగొన్నాడు నాగన్న విడుదల అవుతున్నాడని సంతోషం అతడి విడుదల సందర్భంగా ఆ రోజు రెండు పిండివంటలు చేయాలన్నారు బొబ్బట్లు, బజ్జీలు తయారు చేసుకు తిన్నాం వెళ్ళిపోయేముందు నాగన్న "మూర్తిగారూ, మీరేమీ చెప్పడం లేదు" అన్నాడు "ఏముంది, మళ్లా జైలుకి రాకుండా జాగ్రత్తగా ఉండు తరువాత మా విడుదల అనంతరం చూసుకోవచ్చు" అన్నాను నాగన్న మమ్మల్ని వదిలి వెళ్ళడానికి బాధపడ్డాడు మాకు కూడా మంచి మిత్రుణ్ణి వదులుకుంటున్నామనిపించింది ఏవిటో మానవ ప్రవృత్తి చిత్రంగా ఉంటుంది ఆ రోజునే కృష్ణమూర్తి బాబాయి వద్దనుంచి జాబు వచ్చింది ప్రభుత్వ ఛీఫ్ సెక్రటరీని కలుసుకుంటే ఒక్కడి గురించి వేరుగా నిర్ణయించడానికి సాధ్యం కాదన్నాడట

జైలులో సమయం వృథా చేయకుండా జవహర్‌లాల్ నెహ్రూ వ్రాసిన ప్రపంచ చరిత్ర గ్రంథం అనువదించాలని సంకల్పం కలిగింది అంతకుముందు రెండు ఏకాంకికలు వ్రాసాను కాని అనువాదం అంత సులభం అనిపించలేదు అందునా నెహ్రూ వ్రాసిన ఇంగ్లీషుని తెలుగు చేయడం కష్టమే అయినా నిరుత్సాహపడలేదు దానిని ఛాలెంజిగా తీసుకుని వ్రాయడానికి ఉపక్రమించాను అంతలో భారత రాజకీయ వాతావరణంలో మార్పు

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి (రాజాజీ) కి గాంధీజీకి అభిప్రాయ భేదాలు ఉత్పన్నమయ్యాయి యుద్ధానికి ఏ కారణంవల్లనైనా ఏ విధంగానైనా భారతీయులు సహకరించడానికి గాంధీజీ వ్యతిరేకతను వెల్లడించారు కాంగ్రెసు నాయకులకు గాంధీజీ అభిప్రాయాలు ఇబ్బందికరంగా తయారయ్యాయి

అనేకమంది కాంగ్రెసు కార్యవర్గసభ్యులు తన అభిప్రాయాలతో ఏకీభవించడం లేదు కాబట్టి తనను నాయకత్వంనుండి విడుదల చేయవలసినదిగా మహాత్మాగాంధీ కాంగ్రెసు అధ్యక్షుణ్ణి కోరారు తాను యుద్ధానికి వ్యతిరేకినని, కాంగ్రెసువారు బ్రిటిషు ప్రభుత్వానికి కొన్ని షరతులతో సహకరించడానికి ఉద్యుక్తులు కావడానికి తాను వ్యతిరేకినని అందుమూలంగా తాను కాంగ్రెసు నాయకత్వంనుంచి విరమించుకుంటున్నా నన్నారు కాంగ్రెసు కార్యవర్గం మహాత్మాగాంధీ కోరికపై ఆయన నాయకత్వంనుండి విరమించడానికి అంగీకరించిందని వార్త ఆ సాయంకాలం జైలర్ వచ్చి గాంధీజీ కాంగ్రెసునుంచి వెళ్లి పోవడం, దేశంలో కాంగ్రెసు మంత్రివర్గాలు వచ్చే అవకాశాలు, డెటిన్యూల విడుదల అవకాశాల గురించి చెప్పి వెళ్ళాడు

ప్రభుత్వం చేసే పనులు చిత్రంగా ఉంటాయి అధికారుల నిర్ణయాలు కొన్ని మనకు అర్థం కావు ఒక ప్రక్క దేశంలో అనేక జైళ్ళలో మ్రగ్గుతున్న డెటిన్యూల విడుదల విషయం తీవ్రంగా ఆలోచిస్తూ మరొకప్రక్క వాళ్ళందరికీ బట్టలు కొనుక్కోవడానికి ఒక్కొక్కరికి 30 రూపాయల చొప్పున ఇవ్వాలని నిర్ణయించారు అంతేకాదు, ప్రతి డెటిన్యూకి నెలకు 10 నుంచి 20 రూపాయల వరకు స్వంత ఖర్చులకు డబ్బు ఇవ్వడానికి ఆజ్ఞలు జారీ చేసారు ప్రభుత్వానికి మా మీద ఇంత అవ్యాజానురాగం ఎందుకు కలిగిందో అర్థం కాలేదు ఇంతలో మమ్మల్ని జైలునుంచి విడుదల చేసే ఆలోచన ప్రభుత్వానికి లేదేమో అనిపించింది రాజమండ్రి సెంట్రల్ జైలులో ఉన్న విద్యార్థి డెటిన్యూలను తమకు కావలసిన బట్టల వివరాలు జైలు అధికారులకు యివ్వమన్నారు నేను, వల్లభరావు, అచ్యు ఖద్దరు బట్టలు కావాలన్నాం మిగిలిన వారు కూడా ఖద్దరే అన్నారు దానితో రాజమండ్రిలోనున్న బట్టల షాపులకు సమస్య వచ్చింది ఒక్కసారిగా 400 రూపాయల బేరానికి కావలసిన ఖద్దరు గుడ్డల కోసం బందరునుండి విశాఖపట్నంవరకు తిరిగారట నేను నాలుగు జతల బట్టలు కావాలన్నాను నాలుగు చొక్కాలు, పంచెలు, తువ్వాళ్ళు, ఒక దుప్పటి కావాలని చెప్పాను ప్రభుత్వం ఇచ్చే 30 రూపాయలలో ఈ బట్టలే కాక ఒక జత జోళ్ళు కూడా కొనుక్కున్నాం

సామాన్యంగా మాకు ఏమి కావలసివచ్చినా బజారు వార్డరు తెచ్చిపెడతాడు కాని బట్టలు సెలక్షన్ అతడివల్ల అయ్యే పని కాదని నిర్ణయించారు పట్టణంలోని షాపువాళ్ళను జైలులోనికి అనుమతించనన్నాడు సూపరింటెండెంటు కాని తరువాత రూల్సు సడలించి బైటవాళ్ళని ముగ్గుర్ని బట్టలు, జోళ్ళు తీసుకువచ్చి మాకు చూపించడానికి అంగీకరించాడు ఒక షైలర్ని కూడా రానిచ్చారు వాళ్ళు మాతో ఉన్నంతసేపు సూపరింటెండెంటు

కూడా మాతోపాటే కూర్చున్నాడు కిచెన్‌కి వచ్చి కాఫీ త్రాగి దోసెలు వేసినపుడు తనకు కబురు పెట్టమని చెప్పి వెళ్ళాడు ఆయన మిలిటరీలో పనిచేసిన దొర పెద్ద చదువు లేదు చాలా మంచివాడు జైలు అధికారులలో అంత మంచివాళ్ళు అరుదు ఆయన భార్య కుమార్తె కూడా మమ్మల్ని కలుసుకుని మాట్లాడాలని సరదా పడేవాళ్ళు ఒకనాడు సూపరింటెండెంటు మా వార్డుకి వచ్చి విద్యార్థుల విడుదల కంటే తన విడుదల ముందు వచ్చినదని తన బదిలీ వార్త చెప్పాడు చాలాసేపు కూర్చుని పిచ్చాపాటి కబుర్లు చెప్పాడు అ మరుసటిరోజు అధికారికంగా వచ్చినపుడు మనసు విప్పి మాట్లాడడానికి వీలు పడదు కాబట్టి మాతో చాలాసేపు గడిపాడు చాలా మంచి మిత్రుడు, అప్పుడు వెళ్ళిపోతున్నాడని మేమంతా బాధపడ్డాం

అంతలో యుద్ధం రోజురోజుకీ మన దేశానికి దగ్గర పడుతోంది బ్రిటిష్ నౌకా స్థావరమైన సింగపూర్ జపాన్ వారి వశమయింది రంగూన్ ఏ రోజునైనా పడిపోవచ్చు పత్రికలు చూస్తూంటే మాకు మతులు పోతున్నాయి రష్యా ప్రవేశంతో యుద్ధం యొక్క స్వభావం మారింది కాబట్టి యుద్ధంలో బ్రిటన్‌కి భారతదేశం సహాయపడాలని ఒకవాదం దేశానికి స్వాతంత్ర్యం ఇస్తేకాని బ్రిటన్‌కి యుద్ధంలో సహాయం చేయడానికి వీలు లేదని మరొకవాదం కమ్యూనిష్టులంతా ప్రజాయుద్ధానికి సహాయపడాలంటున్నారు కాబట్టి జైళ్ళలో ఉన్న కమ్యూనిష్టుల్ని విడుదల చేస్తున్నారు జడ్జిముందు ఉంచిన డెటిన్యూల కేసుల పరిశీలన చాలా వరకు పూర్తి అయింది ఇక ఊహాగానాలు హరిక్రిష్ణన్‌కి విడుదల అన్నారు ఆతరువాత రామనాధానికి, నంబూద్రికి విడుదల వచ్చింది అప్పటికి 14 మాసాలు జైలులో గడిపిన మా కేసులు పరిశీలించకుండా మూడు నాలుగు మాసాల క్రిందట అరెస్టు చేసినవారిని విడుదల చేస్తున్నారు జడ్జిగారు నిర్ణయాలు ఏ ప్రాతిపదికమీద చేస్తున్నారో అంతు చిక్కలేదు రేపో మాపో అంటూ విడుదలకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాం అంతలో రాజకీయాలకు దూరంగా ఉంటామని వ్రాసి ఇచ్చి, సెక్యూరిటీ ఇస్తే ప్రభుత్వం విద్యార్థుల్ని విడుదల చేస్తుందని ఒక వార్త ఇంతకాలం జైలులో ఉండి ఇప్పుడు క్షమాపణలు చెప్పి, ప్రభుత్వం విధించిన షరతులకు అంగీకరించి విడుదల కావడానికి మనస్కరించలేదు దానితో అంతా దిగాలు పడిపోయారు

అప్పుడే మద్రాసు ప్రభుత్వం అనవసరమైన వారంతా పట్టణం వదిలి వెళ్ళిపోవాలని ఆజ్ఞలు జారీచేసింది విశాఖ పట్టణానికి కూడా అటువంటి ఆజ్ఞలు రావచ్చునుకున్నాం మిత్రుల వద్దనుంచి వచ్చే జాబుల ద్వారా ఆంధ్ర విశ్వవిద్యాలయం ఖాళీ చేసి వైజాగ్‌నుంచి గుంటూరుకి మార్చడానికి

సన్నాహాలు జరుగుతున్నాయని తెలిసింది మార్చి 24 వ తేదీన అచ్యుతమీనన్‌ని విడుదల చేయడంలో ప్రభుత్వ విధానం మాకు అర్థం కాలేదు గత 14 మాసాలనుంచి మాతో జైలులో ఉండి విడుదల అయినవాడు అచ్యు ఇక మా విడుదల తప్పదనుకున్నాం విడుదల అయిన తరువాత ఎక్కడికి వెళ్ళాలి ఏమి చేయాలి అని ఆలోచనలు నేను విశ్వవిద్యాలయం చదువు సాగించగలననే ధైర్యం కలగలేదు రాజమండ్రిలో ఏ సినిమా చూడాలని మీమాంస కాగితాలు సర్దివేసాను బట్టలు విడుదల కబురు వచ్చిన తరువాత సర్దవచ్చుని ఊరుకున్నాను మాకు ప్రభుత్వం ఇచ్చిన 30 రూపాయల బట్టలు, జోళ్లు విడుదల అయినవారు తమతో తీసుకుపోవచ్చునన్నారు క్రొత్తబట్టలు పెట్టి మరీ సాగనంపుతున్నారని చమత్కరించాడు అన్న ఇదంతా మా విడుదల తప్పకుండా ఆనాడు జరిగి తీరుతుందనే ఆశాభావం తప్ప మరేం లేదు ఆనాడు మా విడుదలకు సంబంధించిన ఆర్డర్లు రానేలేదు పుట్టెడు ఆశలు పెట్టుకున్నాం కాబట్టి మేమంతా పూర్తిగా నిరాశ చెంది నీరసపడిపోయాం మా విడుదల సందర్భంగా మాకు మేమే ఇచ్చుకోవాలనుకున్న వీడ్కోలు విందు ఆరగించి కిల్లీల వేసుకున్నాం

ఆ మరునాడు నిజంగా విడుదల వచ్చినా అంత ఉత్సాహ ఉండదనిపించింది 1942 మార్చి 25 వ తేదీన విడుదల వచ్చింది కాని అ స్వచ్ఛందమైన, షరతులు లేని విడుదల కాదు రాజమండ్రి జైలునుంచి తిన్న( నరసాపురం వెళ్ళి అక్కడే ఉండాలని ప్రభుత్వ ఆజ్ఞలు చిన్న జైలునుంచి పె జైలుకు మార్చారు నరసాపురం పొలిమేరలు వదలకూడదు ప్రతిరో౦ పోలీసు సబ్ ఇనస్పెక్టరు వచ్చి నన్ను చూసి వెళ్ళేవాడు అలా కొన్ని మాసాలు నరసాపురం వదలడానికి వీలు లేకుండా చేసింది ప్రభుత్వం చివరకు జూన్ నెలాఖరుకి నాపై ఉన్న నిర్బంధాలన్నీ తొలగించడంతో స్వతంత్రుణ్ణి అయ్యాను

జూలై 13 వ తేదీన గుంటూరుకి మారిన ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి ఏ ఆనర్సు రెండవ సంవత్సరంలో చేరాను వైస్ ఛాన్సలర్ సర్ సి ఆర్ రెడ్డి నేను రాజకీయాల్లో ఉన్నందున నాకు మొదటి సంవత్సరంలో ఉన్న స్కాలర్‌షిప్పును పునరుద్ధరించడానికి నిరాకరించారు వల్లభరావు, అన్న కూడా కళాశాలలో చేరారు ఆ సంవత్సరం గుంటూరులో మిత్రుడు శ్రీ వేణుబాబు ఇంట్లో ఉండి చదువు ప్రారంభించాను



# జీవనసమరం

మా నాల్గవ బాబాయి గోపాలకృష్ణమూర్తి పట్టాభిగారి అభిమాని ఆయనవల్ల ఉపకారం పొందిన కృతజ్ఞతాభావం మా బాబాయి జీవితాంతం ఉండేది డా॥ పట్టాభి మాకంటే ముందే జైలునుంచి విడుదలై మచిలీపట్నం చేరారు అక్కడ మా బాబాయి ఆయన్ని కలుసుకున్నప్పుడు మాటల్లో సూర్యనారాయణమూర్తి మీ అన్నగారి అబ్బాయటు కదా అంటూ నాగురించి నాలుగు మంచి మాటలు చెప్పారట ఆ వార్త నర్సాపురంలో ఉన్న మా వెంకటేశ్వర్లు బాబాయిగారికి తెలియజేసి ఆనందపడిపోయాడు పట్టాభి గారు సర్టిఫికెట్ యిస్తే శంఖున పోసిన తీర్థం అయింది చక్కటి ఎలిమెంటరీ స్కూలు మాష్టరు ఉద్యోగానికి రాజీనామా చేసి మళ్ళా చదువుకి వెళ్ళడం మా బాబాయిలకు ఎవరికీ నచ్చలేదు దానికి తోడు యూనివర్సిటీలో చేరి రాజకీయాల్లో పడి జైలుపాలు కావడం వారిని మరీ నిరుత్సాహపరిచింది రాజకీయాల్లో తిరిగి పాడైపోతున్నానని, నేను ఇక ఎందుకూ పనికిరాననే నిర్ణయానికి వచ్చారు కాని పట్టాభి సీతారామయ్యగారు నా గురించి మా బాబాయికి చెప్పిన మాటలు వారిమీద బ్రహ్మాండంగాపని చేసాయి నాయందు వారికున్న వ్యతిరేకభావం డా॥ పట్టాభి గారి పుణ్యమా అంటూ సద్భావంగా మారింది

వేణుబాబు కృష్ణా జిల్లా పెడనకు దగ్గరలో ఉన్న బల్లిపర్రు జమీందారు జమీందారుగా ఆయనకు 'జబ్బతుల్ అఖ్వరాన్ బాస్యద్ బసంద్' అని నైజాం నవాబు ఇచ్చిన బ్రహ్మాండమైన బిరుదు ఉండేది అయితే మనిషి చాలా నిరాడంబరంగా ఉండేవాడు గూడకట్టు లాల్చీ అతడి వేషం పెద్ద జమీందారీ కాదు చిత్రం ఏమిటంటే వేణుబాబుని చూచి ఎవరూ జమీందారు అనుకునేవారు కారు నేను, వేణు బల్లిపర్రు వీధుల్లో నడుస్తుంటే ఆ ఊరి యజమాని ఎవరో గ్రామస్తులకు తెలిసేది కాదు యూనివర్సిటీలో ఎకనామిక్స్ ఆనర్సు చదువు కోసం వేణుబాబు గుంటూరులో మకాం పెట్టాడు నేను నిరాశ్రయుడిగా ఉన్నందున తనతో ఉండమని ఆహ్వానించాడు ఆ సంవత్సరం హాయిగా జరిగిపోయింది భోజనం దగ్గర మాత్రం సమస్య వచ్చేది బల్లిపర్రునుంచి వచ్చిన సేవకులకు మాంసాహారం తప్ప కాయకూరలు వండడం చేతనయ్యేది కాదు వేణుబాబుకి రోజూ రెండుపూటలు మాంసాహారం ఉండవలసినదే నేను శాఖాహారిని కావడం వలన ఆ ఇంట్లో చిన్న సమస్య

ఉత్పన్నమయింది వేణుబాబు వాళ్ళ అమ్మగారు ఆ ఇంట్లో ఉండేవారు వాళ్ళ నాన్నగారు ఎప్పుడో పోయారు నా భోజనం సమస్య వాళ్ళ అమ్మగారు తీర్చేసారు ఆమె స్వయంగా నాకు కాయకూరలు వండిపెట్టేది ఇంటినిండా సేవకులు ఉన్నా అమ్మగారు స్వయంగా వంటచేయడం వాళ్ళకు ఆశ్చర్యం కలిగించేది ఆమెకు నాపై అపారమైన ఆప్యాయత, వాత్సల్యం ఉండేది ఆమెకు వేణుబాబు ఒక్కడే సంతానం కావడంతో ఆమెకు అతడే ప్రపంచం అతడి మిత్రుడిగా నాకు వారి ఇంట్లో ప్రత్యేక స్థానం ఉండేది

ఇక యూనివర్సిటీలో నేను రెండవ సంవత్సరం ఆనర్సులో చేరేసరికి నాతోబాటు మొదటి సంవత్సరం చదివినవారు ఫైనల్ ఆనర్సుకి వెళ్ళిపోయారు నాతోటి విద్యార్థులంతా కొత్తవారే అంతా కలిసి హిస్టరీ ఆనర్సులో ఆరుగురు ఉండేవాళ్ళం వారిలో ఆర్ సుబ్రహ్మణ్యం యూనివర్సిటీ కాలేజీ ప్రిన్సిపాల్ సూరి భగవంతంగారి దగ్గర బంధువు పెద్ద పెద్ద హిస్టరీ గ్రంథాలు కొని చదవలేని ఆర్థిక పరిస్థితిలో ఉన్న నేను సుబ్రహ్మణ్యం ఇంటికివెళ్ళి అతడు ఆ ఉద్గ్రంథాలు చదువుతుంటే వినేవాడిని అదే నా హిస్టరీ చదువు వేణుబాబు ఎకనామిక్స్ ఆనర్సు ఫైనల్ సంవత్సరంలో ఉన్నందున నాకు ఎకనామిక్స్‌లో మంచి పరిజ్ఞానం కలగడానికి అవకాశం చిక్కింది ప్రొఫెసర్ మామిడిపూ, వెంకటరంగయ్యగారి పుణ్యమా అంటూ పొలిటికల్ సైన్సు పాఠాలు కష్ట అనిపించలేదు చదువు చక్కగా సాగుతోంది యూనివర్సిటీకి సెలవులు ఇస్తే వేణుబాబుతో కలిసి బల్లిపర్రు వెళ్ళేవాణ్ణి ఆ రోజుల్లో వేణుబాబు వివాహ ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి అతడు యంబిబియస్ చదువుతున్న తన మిత్రురాలు కమలను వివాహం చేసుకోవాలనుకున్నాడు నేను విశాఖపట్నం వెళ్ళి కమలను కలుసుకుని ఆమె అభిప్రాయం తెలుసుకుని తిరిగి వచ్చి బల్లిపర్రులో వేణుబాబు తల్లిని ఒప్పించి అతడి వివాహానికి నా చేతనైన విధంగా తోడ్పడ్డాను

మా వేణుబాబు, అతడి తల్లి పుణ్యమా అంటూ గుంటూరులో యూనివర్సిటీలో ఒక సంవత్సరం జరిగిపోయింది ఫైనల్ ఆనర్సుకి వచ్చాను దానితో చదువు పూర్తి అవుతుంది అది అయిన తరువాత ఏమిటి? అనే విషయం ఆలోచించడానికే సమయం లేదు ప్రారంభించాను కాబట్టి చదువు పూర్తి చేయాలనేదే నా లక్ష్యం వేణుబాబు ఇంట్లో ఒక ఏడాది జమీందారులా బ్రతికాను ఫైనల్ ఆనర్సులో మళ్ళా మకాం, భోజనం వెతుక్కోవలసి వచ్చింది ఆపద్బాంధవులులా అనకాపల్లి మిత్రులు నన్ను ఆదుకున్నారు అనకాపల్లినుంచి యూనివర్సిటీ చదువులకు వచ్చిన విద్యార్థులు ఎనిమిది మంది అరండేల్ పేటలో ఒక డాబా అద్దెకు తీసుకుని హోటల్ భోజనం

తెప్పించుకుని తింటూ కాలక్షేపం చేస్తున్నారు దానిని అనకాపల్లి లాడ్జి అనేవారు వారందరూ గవరలు వి వి రమణ ఎకనామిక్స్ ఆనర్సు రెండవ సంవత్సరం చదువుతున్నాడు విశాఖపట్నంలో ఉన్న రోజులనాటి విద్యార్థి సంఘ రాజకీయాలు, నేను జైలులో ఉండి రావడం తెలిసున్నవాడు కావడం వలన నన్ను తమ లాడ్జిలో ఉండమని ఆహ్వానించాడు వారి ఆహ్వానం మకాం వరకు మాత్రమే పరిమితం అనకాపల్లి లాడ్జిలో మకాం పెట్టాను మా రమణ నన్ను అందలం ఎక్కించాడు యూనివర్సిటీలో ఆఖరి సంవత్సరంలోనే కాదు ఆ తరువాత అతడు రాజకీయాల్లో దిగి పార్లమెంటు సభ్యత్వం నిర్వహించి చాలా చిన్న వయస్సులో కేన్సర్ వ్యాధికి బలైపోయేటంతవరకు నేనంటే అత్యంత అభిమానం, స్నేహభావం, ఆప్యాయత, చూపించేవాడు చివరకు నేను పై చదువులకు ఇంగ్లండు వెళ్ళడానికి చేయూతనిచ్చినవాడు మా వి వి రమణ మా స్నేహం గుంటూరులో అనకాపల్లి లాడ్జిలో ప్రారంభమైంది

ఫైనల్ ఆనర్సులో ఉండగా ఆంధ్రా యూనివర్సిటీ విద్యార్థి సంఘ అధ్యక్ష పదవికి పోటీ చేసాను అప్పటికే బి కాం సెక్షన్లలో విపరీతంగా విద్యార్థులు ఉండేవారు ఆనర్సు కోర్సులు చదివేవారందరినీ కలిపినా బి కాం వాళ్ళలో సగం కూడా ఉండేవారు కాదు సంఖ్యాబలం చూచుకుని నామీద పోటీగా ఒక బి కాం విద్యార్థిని నిలబెట్టారు మొదట్లో ప్రచారం ముమ్మరంగా సాగింది నా పక్షాన యూనివర్సిటీ లోని విద్యార్థినులు ముఖ్యంగా కృష్ణవేణి రమణయ్య, నాగరత్నం వంటివారు పూనుకుని ప్రచారం చేసారు అయితే యూనివర్సిటీ విద్యార్థి సంఘ అధ్యక్షపదవికి జరిగే ఎన్నికలలో ప్రచారం ఒక బాగం మాత్రమే అది ప్రధాన భాగం అనుకోండి ఎన్నిక జరిగేనాడు యూనివర్సిటీ విద్యార్థుల్ని అందరినీ సభ తీర్చి కూర్చోబెట్టి అధ్యక్ష పదవికి పోటీ చేసే అభ్యర్థులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క విషయం ఇచ్చి దాని పై 7 నిమిషాలు ఉపన్యాసం చెప్పమనేవారు ఆ ఉపన్యాసాలు విన్న తరువాత విద్యార్థినీ విద్యార్థులు తమకు నచ్చిన అభ్యర్థికి ఓటు వేసేవారు ఆ ఎన్నికలో నాకు అఖండ విజయం లభించింది యూనివర్సిటీ స్టూడెంట్సు యూనియన్ ప్రెసిడెంటుగా నాకు వచ్చిన గౌరవాన్ని ఒక్కసారి మాత్రమే అనుభవించాను ఆ సంవత్సరం డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ యూనివర్సిటీని సందర్శించిన సందర్భంలో జరిగిన సభకు అధ్యక్షత వహించే అదృష్టం నాకు కలిగింది ఆ అనుభవం అనిర్వచనీయం ఆ తరువాత ఆ మహానుబావుణ్ణి లండనులో చదువుకునే రోజుల్లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో కలుసుకున్నాను ఆయన స్వయంగా నాతో వచ్చి ఆక్స్‌ఫర్డ్ కళాశాలలన్నీ చూపించారు జీవితంలో మరపురాని, మరువలేని ఆనందానుభూతులవి

స్వప్న సౌధాలు నిర్మించుకునే వయస్సు అది అయితే వాస్తవిక జగత్తును విస్మరింపలేము కదా! గుంటూరులో మకాం దొరికింది ఇక భోజనం సమస్య మిగిలింది స్కాలర్‌షిప్పును పునరుద్ధరించనందున చదువు సమస్య అయింది యూనివర్సిటీ హాస్టలులో వార్డెన్ చేసిన ఏర్పాటు ఫలితంగా ఇద్దరు పేద విద్యార్థులకు ఉచిత భోజనం లభించేది ఆ రోజుల్లో నెలకు హాస్టలు భోజనానికి విద్యార్థికి ఎనిమిది రూపాయలు ఖర్చు అయ్యేది హాస్టలులో భోజనం చేసే విద్యార్థులనుంచి మనిషికి బేడ (రెండు అణాలు) అధికంగా వసూలు చేసి దానితో వచ్చిన సొమ్ముతో ఇద్దరు విద్యార్థులకు ఉచితంగా భోజనం పెట్టేవారు ఆ సంవత్సరానికి ఆ ఇద్దరిలో నేను ఒకణ్ణి చిత్రం ఏమిటంటే భోజనాలవద్ద నేను ఉచితంగా భోజనం చేస్తున్నాననే ఆలోచన వచ్చేది కాదు ఒక పంక్తి నిండిపోతే అది పూర్తి అయ్యేవరకు విద్యార్థులు ఆగాలి కాని "ప్రెసిడెంటు" గా నా విషయంలో ప్రత్యేక ఆప్యాయత చూపించేవారు నేను ఏ సమయంలో భోజనానికి వెళ్లినా "ఒరే ప్రెసిడెంటుగారికి ఒక విస్తరి వెయ్యండి" అని నాకు ప్రత్యేక మర్యాద చేసేవారు అక్కడ భోజనం చేసే విద్యార్థులకు తాము యిచ్చే రెండణాలతో ఎవరికి ఉచితంగా భోజనం పెడుతున్నారో తెలియదనిపించేది ఏది ఏమైనా వాళ్ళందరి ఉదార స్వభావం ఫలితంగా నా భోజనం సమస్య తీరిపోయినట్టే

సమస్యలు తీరిపోయినందున చదువులో శ్రద్ధ వహించాలని నిర్ణయించాను కాని అలా జరుగలేదు డా|| వేణుగోపాలస్వామి నాయుడు అప్పట్లో యూనివర్సిటీ రిజిస్ట్రారుగా ఉండేవారు ఆయన విద్యార్థులతో చనువుగా ఉండి వారి సాంస్కృతిక కార్యకలాపాలకు గొప్ప ప్రోత్సాహాన్ని యిచ్చేవారు గుంటూరు విశ్వవిద్యాలయం ఆవరణలో ఓపెన్ ఎయిర్ థియేటర్ తయారు చేయించి దానిలో విద్యార్థులతో కన్యాశుల్కం నాటకం వేయించారు రిహార్సల్స్ చేయించడానికి ఓపిగ్గా ఎంతసేపైనా కూర్చునేవారు కన్యాశుల్కంలో నాది గిరీశం పాత్ర గుంటూరుకి తెనాలి దగ్గర కావడం మూలంగా స్థానం నరసింహారావుగారి నాటకం కంపెనీ కన్యాశుల్కం ప్రదర్శిస్తుంటే డా|| గోపాలస్వామినాయుడుగారి ప్రోత్సాహంతో మేమంతా తెనాలి వెళ్ళాం ఆ నాటకంలో వేషధారులంతా అనుభవజ్ఞులైనందున మా మిత్రులు తమ తమ పాత్రలను వారెలా పోషిస్తున్నారో చూచుకు రమ్మన్నారు మా నాయుడు గారు

డా|| గోవిందరాజుల సుబ్బారావుగారు గిరీశం పాత్ర వేసేవారు ఆయన చాలా పేరు ప్రఖ్యాతి ఉన్న నటుడు స్థానం వారింట్లో వారితో మాట్లాడుతూ సుబ్బారావుగారికి గిరీశం పాత్ర వదలమని సలహా ఇచ్చాను ఆ బుగ్గ

మీసాలు, బొజ్జతో ఉన్న గిరీశంతో వయస్సులో ఉన్న బుచ్చమ్మ వంటి విధవ లేచిరాదని ఆయన రామప్ప పంతులు వేషం వేస్తే బాగుంటుందని అన్నాను అంతా విని మీబోటి విశ్వవిద్యాలయం కుర్రవాళ్ళతో ఏవిధ లేచి వస్తుందయ్యా అన్నారు ఈ సంభాషణ వింటున్న శ్రీ స్థానం వారు 'మూర్తిగారూ కన్యాశుల్కం క్లాసిక్ అండీ దానితో వేళాకోళం ఆడకండ'ని హెచ్చరించారు మా విద్యార్థులు గుంటూరులో ప్రదర్శించిన కన్యాశుల్కం బ్రహ్మాండంగా ఉందన్నారంతా ఆ తరువాత కాలంలో డా|| గోపాలస్వామి నాయుడు గారు యూనివర్సిటీ థియేటర్ నిర్మాణానికి నిర్వహణకు ఆయువుపట్టుగా ఉండి పనిచేశారు

యూనివర్సిటీ విద్యార్థి యూనియన్ అధ్యక్షత, నాటకాల సరదా చాలదన్నట్లు నా సహాధ్యాయిని కృష్ణవేణి రమణయ్యతో నా స్నేహం నా చదువుకి కొంత భంగం కలిగించిన మాట వాస్తవం అదే సమయంలో మిత్రుడు వెంకటరత్నం ప్రేమాయణం, వారి ప్రణయ కలహాలు తీర్చడానికి నా సేవలు అందించడంతో నా చదువులో శ్రద్ధ కొంత తగ్గింది వెంకటరత్నం 6 అడుగుల ఎత్తైన విగ్రహం స్పురద్రూపి వాళ్ళ నాన్నగారు ప్రభుత్వోద్యోగి వెంకటరత్నం తన సహాధ్యాయిని ఒక ముస్లిం యువతిని ప్రేమించాడు అయితే వారిద్దరిమధ్య ఏదో పేచీ వచ్చింది దాని పరిష్కారానికి నాసహాయం కోరాడు కాని అతడి ప్రియురాలికి నేనంటే సదభిప్రాయం లేదు అయినా నా మధ్యవర్తిత్వానికి అంగీకరించింది ఆ ఇద్దర్నీ యూనివర్సిటీ ఆవరణలో చెట్లక్రింద నిలబెట్టి మాట్లాడేవాడిని వారిద్దరిమధ్య సయోధ్య కుదర్చడంలో నా ప్రయత్నాలు విఫలమయ్యాయి వారిద్దరు తెగతెంపులు చేసుకున్నారు దురదృష్టవశాత్తు వెంకటరత్నం చదువు పూర్తి చేయకుండానే అకాల మరణానికి బలైపోయాడు ఆమె యూనివర్సిటీ వదిలిన తరువాత రాజమండ్రిలో టీచరు ట్రెయినింగ్ చేయడం వరకు తెలుసు ఆ తరువాత ఆమె తెరమరుగైంది

నా సహాధ్యాయిని కృష్ణవేణి అక్కగారు కమల నాతో చదివింది అయితే నేను జైలుకి వెళ్ళి తిరిగివచ్చి మళ్ళా యూనివర్సిటీలో చేరేసరికి ఆమె ఫైనల్ ఆనర్సులోకి వెళ్ళింది ఆమె చెల్లెలు ఫోర్తు ఆనర్సులో నా సహాధ్యాయిని అయింది ఆమె నాకు చాలా మంచి మిత్రురాలు నేను ఆమె ఇంటికి వెళ్ళడం గురించి యూనివర్సిటీ అంతా నానారకాలుగా చెప్పుకునేవారు ఆ పుకార్లు విన్న మా రమణబాబు నన్ను ఒకనాడు నిలవేసాడు విద్యార్థులంతా అనుకునే దానిలో ఏమైనా నిజం ఉందా? లేకపోతే వాళ్ళని శిక్షిస్తామని అనకాపల్లి లాడ్జివాళ్ళంతా సిద్ధమయ్యారు వాళ్ళ ఆప్యాయత నన్ను ముగ్ధుణ్ణి చేసింది

కృష్ణవేణి నా మిత్రురాలు అని ఆమె ఇంటికి నేను వెళుతూ ఉంటానని మా రమణబాబుకి చెప్పి దానికోసం ఎవరితోను గొడవలు పెట్టుకోవద్దని కోరుకున్నాను కృష్ణవేణి చదువు పూర్తిచేసిన తరువాత కూడా మంచి మిత్రురాలుగా ఉంది

నేను హైదరాబాదులో ఉద్యోగం చేసేటప్పుడు వచ్చి నా కుటుంబంతో కొన్ని రోజులు గడిపి వెళ్ళింది నేను వివాహితుడనని తెలిసినా అంత చదువు చదివిన వ్యక్తి తనను వివాహం చేసుకోమనేది ఆమె దృష్టిలో ఆరోజుల్లో హిందువులకు రెండు వివాహాలు నిషిద్ధం కాదు కాబట్టి తనను వివాహం చేసుకోమనేది ఆమె ఇంగ్లండు వెళ్ళిపోయేటంత వరకు నాకు తెలుసు ఆమె కుటుంబంవారికి నేనంటే కోపం ఆమె తండ్రి రమణయ్యగారు బ్రాహ్మణుడు తల్లి క్షత్రియ ఆయన వర్ణాంతర వివాహం చేసుకునే ఉద్దేశ్యంతో బర్మా వెళ్ళి క్రైస్తవమతం తీసుకుని వివాహం చేసుకున్నాడు వాల్తేరులో ఉండేవాడు వారి ఇంటికి వెళ్ళినట్లు గుర్తు ఇంటిల్లపాది " అబ్బా! ఎంతనల్లగా ఉన్నాడో" అని ఆశ్చర్యపోయారు వారి కుటుంబసభ్యులంతా తెల్లటి తెలుపు

ఫైనల్ ఆనర్సు పరీక్షలు దగ్గరపడడంతో నా సమస్యల పునరావృతమయ్యాయి యూనివర్సిటీ హాస్టలు మూసివేయడం అనకాపల్లి లాడ్జి విద్యార్థులంతా వెళ్ళిపోవడంతో పరీక్షలు పూర్తి అయ్యేవరకు నా మకాం భోజనం సమస్య అయింది అయితే అనకాపల్లి లాడ్జిలో నా పరీక్షలు అయ్యేవరకు ఉండడానికి మిత్రులు ఏర్పాటు చేసారు వారు భోజనాలు తెప్పించుకునే హోటల్‌నుంచి నా పరీక్షలు పూర్తి అయ్యేవరకు కేరేజి పంపే ఏర్పాటు కూడా చేసారు అదంతా మా రమణ చలవ పరీక్షలు పూర్తి చేసి ఇంటికి చేరాను 1944 లో బి ఏ ఆనర్సు పరీక్ష ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణుడనయ్యాను

జీవనోపాధికి ఏదైనా ఉద్యోగం చేయాలనే ప్రయత్నంలో నిరాశ నిస్పృహ ఎదురైంది యూనివర్సిటీ చదువు పూర్తిచేసి ప్రప్రథమంగా డిఫెన్సు అకౌంట్స్ డిపార్ట్‌మెంట్ ఔరంగాబాద్‌లో ఆడిట్ గుమాస్తా ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాను అప్పటికింకా ద్వితీయ ప్రపంచ సంగ్రామం జరుగుతోంది నా దరఖాస్తు చదివిన ఆఫీసరు (ఆయన పేరు లక్ష్మీనారాయణ అని గుర్తు) పదవ తరగతి ప్యాసు అయ్యావా? అని అడిగారు అయ్యా నేను బి ఏ ఆనర్సు ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణుడనయ్యానని కొంచెం గర్వంగా చెప్పాను నేను దరఖాస్తు పెట్టిన ఉద్యోగానికి పదవ తరగతి ప్యాసు అయితే చాలునని ఆయన నవ్వుతూ చెప్పి ఆనర్సు సర్టిఫికెట్ వచ్చినప్పుడు చూపించమని బుజ్జగింపుగా చెప్పారు అంత కష్టపడి చదివిన చదువుకి విలువ లేకుండా

పోయిందే అని విచారించాను

ఔరంగాబాద్‌లో కొన్ని నెలలు మాత్రమే ఉద్యోగం చేసాను ఆ వ్యవధిలో ప్రపంచ ఖ్యాతికెక్కిన అజంతా ఎల్లోరా గుహలు చూసాను అది గొప్ప సంతృప్తి నా చదువుకి, నేను చేస్తున్న ఉద్యోగానికి పొంతన కనిపించలేదు ఎవరికీ చెప్పకుండా ఉద్యోగం వదిలి హైదరాబాదు చేరాను డిఫెన్స్ అక్కౌంట్స్‌లో ఉండి చెప్పకుండా ఉద్యోగం వదిలినందుకు అరెస్ట్ చేస్తారని మిత్రులు బెదిరించారు అయితే అటువంటిదేమీ జరగలేదనుకోండి హైద్రాబాద్‌లో జనవాణి అనే తెలుగు దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా చేరాను డెక్కన్ క్రానికల్, జనవాణి పత్రికలకు ఎడిటర్ రామాచారిగారు ఆయన వద్ద పత్రికా రచనకు సంబందించిన ప్రాధమిక పాఠాలు నేర్చుకున్నాను

హైద్రాబాదులో ఉండగా నాకు సాహిత్యంలో సరదా ఉండేది నా పాతనాటకాల పిచ్చ పుణ్యమా అంటూ హైద్రాబాదు రేడియోకి కాంచన అనే ఏకాంకిక వ్రాసాను అంతేకాదు, రేడియోలో ప్రసారమయ్యే కవిసమ్మేళనంలో పాల్గొనేవాణ్ణి అక్కడి పత్రికారచయితల సంఘానికి సంయుక్త కార్యదర్శిగా ఉండేవాణ్ణి కాంచన ఏకాంకిక రేడియోలో ప్రసారం కావడంతో ఆ ఉత్సాహంలో మరో రెండు ఏకాంకికలు వ్రాసాను అవి మూడూ కలిపి చిన్న పుస్తకరూపంలో అచ్చు వేయించమని మిత్రుడు సత్యనారాయణ ప్రోత్సహించాడు ఆ నాటికలు ప్రచురించేముందు ఆ పుస్తకానికి"ముందు మాట" వ్రాయించాలన్నారు విజయవాడ వెళ్ళి విశ్వనాధ సత్యనారాయణగారికి ఆ నాటికలు చూపించాను ఆయన ప్రోత్సాహ పూర్వకంగా భుజం తట్టి బాగానే ఉన్నాయన్నారు అదే అదనుగా తీసుకుని నాకు ప్రియ మిత్రుడు విశ్వనాధ వారి పెద్ద కుమారుడు అచ్యుతదేవరాయలు మాట సహాయంతో నా నాటికలకు ముందుమాట విశ్వనాధ సత్యనారాయణగారి చేత వ్రాయించాను ఆయనకు నాయందున్న వాత్సల్యంతో నా నాటికలు రవీంద్రనాధ్ ఠాగూర్ వ్రాసే భావనాటకాల కోవకు చెందుతాయనే బావం వ్యక్తీకరిస్తూ 'ముందుమాట'వ్రాసారు ఆ చిన్న పుస్తకం హైద్రాబాదులో అచ్చువేయించాను సాహిత్య ప్రక్రియ అంతటితో ముగిసింది మహాకవి విశ్వనాదవారిచేత 'ముందుమాట' వ్రాయించుకున్న సంతృప్తి మాత్రమే మిగిలింది

విమానదళంలో చేరాలనే ప్రయత్నం విఫలం కావడంతో 80 రూపాయల జీతంతో హైద్రాబాదులో కుటుంబంతో ఉండడం కష్టం అనిపించింది దూరపు కొండలు నునుపు అన్నట్లు భారతదేశపు ముఖ్యపట్టణమైన ఢిల్లీ నగరంలో నా అదృష్టాన్ని పరీక్షించుకోవాలని బుద్ధిపుట్టింది అంతే వెంటనే మా ఆవిణ్ణి

నరసాపురంలో ఆమె పుట్టింట వదలి డిల్లీ ప్రయాణమయ్యాను ఆ రోజుల్లో రైలులో డిల్లీ వెళ్ళడానికి మూడు రోజులు పట్టేది మిత్రుడు ప్రసాద్ ఢిల్లీలో అప్పటికే కేంద్ర ప్రభుత్వ ఆర్థికశాఖలో అసిస్టెంటు ఉద్యోగం చేస్తున్నాడు అతడు కరోల్‌బాగ్‌లో ఉండేవాడు డిల్లీ వెళ్ళి ప్రసాద్ ఇంట్లో మకాం పెట్టాను అది 1945 అప్పటికే ఆంధ్ర విశ్వవిద్యాలయం నాకు M A పట్టం కూడా ఇచ్చింది ఉద్యోగ ప్రయత్నాలు ఫలించలేదని ఒక్కమాటలో చెబితే సరిపోతుంది అవి ఇంకా ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులు అయినా ఎక్కడా గుమాస్తా ఉద్యోగం కూడా దొరకలేదు చివరకు డిల్లీలో అమెరికన్ సైనికులకోసం ఏర్పాటు చేసిన ఆర్మీ కాంటీన్‌లో అసిస్టెంటుగా చేరాను ఒక ఉదయం అంతా ఆ షాపులోని వస్తువులధరలు తెలుసుకోవడంతో గడిచిపోయింది ఆ మధ్యాహ్నం ఎలాగో షాపులో గడిపాను ఆ మరునాడు షాపుకి వెళ్ళబుద్ధి కాలేదు ఆ ఉద్యోగానికి ఆ రోజునే స్వస్తి చెప్పాను

డిల్లీ మహాపట్టణంలో ఉద్యోగం లేకుండా ఉండడం సాధ్యంకాదని తెలిసిపోయింది అప్పట్లో ఆల్ ఇండియా రేడియోలో సౌత్‌ఈస్ట్రన్ సర్వీసు ఉండేది దానిలో "శ్రీవత్సవ" ప్రోగ్రామ్ అధికారి ఆయన పుణ్యమా అంటూ ఆ సర్వీస్‌లో రేడియో ఉపన్యాసాలు వ్రాయడం, రేడియో నాటకాల్లో పాల్గొనడం ద్వారా నెలకు వందా రెండువందలు సంపాదించేవాణ్ణి ఆ రోజుల్లో ఆల్ ఇండియా రేడియోలో మిత్రుడు విశ్వనాధ అచ్యుత దేవరాయలు ఇంజనీరుగా ఉండేవాడు శ్రీవత్సవ తెలుగువాడే ఆయన పేరు యండమూరి సత్యనారాయణ శ్రీవత్సవ ఆయన రేడియో పేరు తెలుగు ఉచ్చారణలో మటికుడు అప్పట్లో రేడియో చుట్టూ తిరిగేవాణ్ణి దానితో తెలుగు విభాగంలో పనిచేసేవారంతా మంచిమిత్రులయ్యారు ఆనాడు శ్రీ కాశీపతి తెలుగు వార్తలు చదవడంలో పెట్టిన ఒరవడి ఈనాటికి అనుసరిస్తున్నారు

ఉద్యోగం దొరికే లక్షణాలు కనిపించకపోవడంతో ఆంధ్రాకు తిరిగి వచ్చేయాలని నిర్ణయించాను ఆమాటే చెప్పి వెళదామని ఆచార్య ఎన్ జి రంగాగారిని చూడ్డానికి వెళ్ళాను అప్పుడు ఆయన సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ (ఇప్పుడు దానిని లోక్‌సభ అంటారు) సభ్యుడు పార్లమెంటులో కాంగ్రెసు పార్టీ కార్యదర్శి ఆయనతోపాటు వెల్లూరు జైలులో ఆరుమాసాలు గడిపిన పరిచయంతో డిల్లీలో నా ఉద్యోగ ప్రయత్నాలు వివరించాను ఇంటికి తిరిగి వెళ్ళిపోవాలనే నిర్ణయం కూడా తెలియజేసాను ఆయన నన్ను పార్లమెంటులోని కాంగ్రెసు ఆఫీసులో ఉద్యోగం చేస్తావా? అని అడిగారు పెద్ద జీతాలు ఇవ్వలేకపోయినా నెలకు రెండువందల రూపాయలు జీతం ఇచ్చే ఏర్పాటు చేస్తానన్నారు ఏదో కల్లోలమైన సముద్రంలో కొట్టుకుపోయేవానికి

ఆదారం దొరికినట్టనిపించింది నా అంగీకారం తెలిపాను అప్పట్లో రంగాగారితోపాటు శ్రీ మోహన్‌లాల్ సక్సేనా దివాన్ చమన్‌లాల్ పార్టీ కార్యదర్శులుగా ఉండేవారు పార్టీ నాయకుడు శ్రీ శరత్ చంద్రబోసు శ్రీ అసఫ్ ఆలీ ఉపనాయకుడు రంగాజీ వారందరికీ నన్ను పరిచయం చేసారు శరత్‌బాబు సుభాష్ చంద్రబోసు అన్నగారు ఆయన సెంట్రల్ లెజిస్లేచర్‌లో ప్రతిపక్ష నాయకుడు పార్టీ ఆఫీసు పార్లమెంటు హౌస్‌లో 24 వ నెంబరు గదిలో ఉండేది అదే నాకు చాలాకాలం వరకు పర్మనెంటు అడ్రసు ఆచార్య రంగాగారి అభిమానం, వాత్సల్యం పుణ్యమా అంటూ నేను ఢిల్లీలో స్థిరపడ్డాను

ఢిల్లీలో ప్రారంభంలో ఒక్కణ్ణే ఉండేవాడిని కరోల్‌బాగ్‌లో పూసారోడ్డుకి కొంచెం లోపలగా ఉన్న ఒక మేడలో నలుగురు మిత్రులం కాపురాలు పెట్టాం నాతోబాటు విశ్వనాథ అచ్యుతదేవరాయలు, వెంకట్రావు, త్రివిక్రమరావు ఆమేడలోని నాలుగు పోర్షన్లలో ఉండేవాళ్ళం మిత్రుడు ప్రసాద్ పిలిస్తే పలికే దూరంలో ఉండేవాడు నర్సాపురం నుంచి నా కుటుంబాన్ని తీసుకువచ్చేవరకు కరోల్‌బాగ్‌లో ఉన్న పంతులు మెస్‌లో భోజనం చేసేవాణ్ణి భోజనం ఘోరంగా ఉండేది అప్పట్లో ఢిల్లీలో అంతా సైకిళ్ళమయం టాంగాలు ఫట్‌ఫటీలు జోరుగా ఉండేవి పాత ఢిల్లీలో ట్రాములు నడిచేవి నేను పనిచేసే పార్లమెంటు హౌస్ ఆఫీసు న్యూఢిల్లీలో ఉన్నందున పని ఉంటే గాని పాత ఢిల్లీ వెళ్ళేవాళ్ళం కాదు

న్యూఢిల్లీలో కన్నాట్ సర్కస్ ప్రాంతంలో ఉన్న సినీమాహాల్స్ అన్నీ ఇంగ్లీషు సినిమాలు ప్రదర్శించేవి హిందీ సినిమా చూడాలంటే పాతఢిల్లీ వెళ్ళవలసి వచ్చేది ఓడియన్ ప్లాజా రివోలి, రీగల్ సినిమాహాల్సులో ఇంగ్లీషు సినిమాలు జోరుగా చూసేవాణ్ణి ఆఫీసునుంచి ఇంటికి వస్తూ దారిలో ఒక సినిమా చూసి రావడం అలవాటైపోయింది ఆదివారం ఉదయం మ్యాటినీ చూసి కన్నాట్ సర్కస్‌లో కాఫీ సేవించి ఇంటికి వెళ్ళేవాణ్ణి ఆరోజుల్లో నేను రోజుకో సినిమా చూసేవాణ్ణి ఏకారణంవల్లనైనా ఒకరోజు సినిమాకు వెళ్ళలేకపోతే ఆ మరునాడు రెండు పిక్చర్లు చూచేవాణ్ణి దానినే కాబోలు పెద్దలు సినిమా పిచ్చి అంటారు ఆరోజుల్లో కరోల్‌బాగ్ చాలా ఖాళీగా ఉండేది ఆదివారం సాయంకాలం హల్వాయి కొట్టుకి వెళ్ళి అప్పటికప్పుడు వేసే జిలేబీ దానితో లోటాడు చిక్కటి వేడిపాలు త్రాగటం అలవాటు చేసుకున్నాను మిత్రుడు ప్రసాద్, నేను కలిసి వెళ్ళేవాళ్ళం మూర్తిగారూ మీకెప్పుడైనా ఉద్యోగాలు ఇవ్వగలిగే స్తోమత వస్తే ఒక కిలో జిలేబీ ఇచ్చినవాడికే ఉద్యోగం ఇచ్చేటట్టున్నారని వేళాకోళం చేసేవాడు అయితే అదృష్టవశాత్తు అటువంటి

అవకాశం రాలేదనుకోండి

కాంగ్రెసు పార్టీ ఆఫీసు పార్లమెంటు హౌస్‌లో ఉండడం వల్ల పార్లమెంటు సెక్రటేరియట్‌లో పనిచేసేవారంతా మంచి మిత్రులయ్యారు పార్లమెంటు లైబ్రరీనుంచి పుస్తకాలు ఇంటికి తీసుకువెళ్ళకూడదని నియమం కాని లైబ్రేరియన్ పుణ్యమా అని నాకు ఇంటికి పుస్తకాలు ఇచ్చేవారు దానినే 'వడ్డించేవాడు మన వాడైతే' అన్నారు పెద్దలు పార్లమెంటు భవనం బ్రహ్మాండంగా నిర్మించారు కాని అది పద్మవ్యూహంలాగా ఉంటుంది ఎటునుంచి లోపలికి ప్రవేశించినా అదే దారిన బైటకు రావడం సాధ్యం అయ్యేది కాదు పార్లమెంటు సభ్యులు అనేకమార్లు లోపల దారి తప్పిపోయేవారు శ్రీ ప్రకాశ్ తన సహజ హాస్య ధోరణిలో బ్రిటిషు వాళ్ళు భారతీయుల్ని దారి తప్పించడానికి కావాలని ఆ భవనం అలా నిర్మించారనేవారు ఆరోజుల్లో సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ అని పార్లమెంటు రెండు సభలను పిలిచేవారు లార్డ్ మౌంట్‌బాటెన్ వైస్రాయిగా వచ్చి భారతదేశంలోని స్వదేశ సంస్థానాధీశ్వరుల సమావేశాలు ఏర్పాటు చేసి భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చే సమస్యపై చర్చలు జరిపినప్పుడు అవి వినడానికి వెళ్ళేవాణ్ణి ఆ సమావేశాల్లో రాజాధిరాజులు, మహారాజులు, దివాన్లు, పాల్గొనేవారు స్వాతంత్ర్యానంతరం సర్దార్ వల్లభభాయి పటేల్ స్వదేశ సంస్థానాలను స్వతంత్ర భారతదేశంలో విలీనం చేసేవరకు ఆ సమస్యకు శాశ్వత పరిష్కారం సిద్ధించలేదు

1946 జూన్‌లో కాంగ్రెసు నాయకులు ముస్లింలీగ్ సభ్యులతో కలిసి తాత్కాలిక ప్రభుత్వాన్ని నిర్వహించిన రోజుల్లో జవహర్‌లాల్ నెహ్రూ వైస్ ఛైర్మన్ పదవిని అలంకరించారు ఆ ప్రయోగం విజయవంతం కాలేదు ముస్లింలీగ్ ప్రభుత్వంలోనుంచి నిష్క్రమించింది బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని రెండు ముక్కలుగా చీల్చి భారతదేశం, పాకిస్తాన్ దేశాలుగా చేసి వారి దారిన వారు వెళ్ళిపోయారు 1947 ఆగష్టు 15 అర్థరాత్రి జవహర్‌లాల్ నెహ్రూ స్వతంత్ర భారత త్రివర్ణ పతాకాన్ని ఎగరవేయడం పార్లమెంటు భవనం వద్ద చేరిన వేలాదిమంది ప్రజలలో నిలబడి చూసాను భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది కాంగ్రెసు పాలక పక్షం అయింది. ప్రధానమంత్రి, పార్లమెంటులో కాంగ్రెసు పార్టీ నాయకుడు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ అప్పటికి కాంగ్రెసు పార్టీ ఆఫీసులో లజపతి రాయ్, విఠల్‌బాబు, నేను పని చేసేవాళ్ళం కాంగ్రెసు పార్టీ ప్రతిపక్షంగా ఉన్నప్పుడు సభ్యులకు సమాచారం అందించడం బిల్లులపై నోట్సు తయారు చేసి ఇవ్వడం, పార్టీ మీటింగులు నిర్వహించడంలో కార్యదర్శులకు తోడ్పడడం వంటి పనులు చేసేవాళ్ళం దేశానికి స్వాతంత్ర్యం

వచ్చి కాంగ్రెసు పార్టీ పాలకపక్షం కావడంతో ఇక ప్రత్యేకంగా పార్టీ ఆఫీసు నడపడం అనవసరం అనుకున్నారు ప్రభుత్వం వారి చేతుల్లో ఉంది కాబట్టి మా ముగ్గురికి ప్రభుత్వ ఉద్యోగాలు ఇప్పించి పార్టీ ఆఫీసు మూసివేద్దామనే ఆలోచన వచ్చింది ఆ బాధ్యత కాంగ్రెసు ఛీఫ్‌విప్ శ్రీ సత్యనారాయణ సిన్హాకు అప్పగించారు

ఆయన పార్టీ ఆఫీసుకి వచ్చి మాకు ఏ ఉద్యోగాలు కావాలో కోరుకోమన్నారు లజపతిరాయ్ ఆర్మీలో కమిషను ఇప్పించమన్నాడు విఠల్‌బాబు కామర్స్ శాఖలోను నేను విదేశాంగ శాఖలోను అసిస్టెంట్ల ఉద్యోగాలు కోరుకున్నాం అదెంతపని అన్నారు చిత్రం ఏమిటంటే మా ముగ్గురిలో ఎవరికీ కూడా ఉద్యోగం ఇప్పించలేకపోయారు చివరకు మమ్మల్ని వదిలించుకోడానికి దారి కనిపించక పార్టీ ఆఫీసు నడపడానికే నిర్ణయించారు మిత్రుడు లజపతిరాయ్ విమాన ప్రమాదంలో పార్లమెంటు సభ్యుడు దేశబంధు గుప్తతోపాటు మరణించాడు ఇక నేను విఠల్‌బాబు మిగిలాం విఠల్ ఆఫీసులో చేరిన తరువాత ప్రయివేటుగా నాగపూర్ యూనివర్సిటీనుంచి ఎం ఏ డిగ్రీ తీసుకున్నాడు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్ర తయారు చేయడంలో ఆయనకు తోడ్పడ్డాడు దివాన్ చమన్‌లాల్‌కి కార్యదర్శిగా పని చేస్తూ ఆయన ద్వారా పార్టీ ఆఫీసులో చేరాడు. అతడు చాలా తెలివైనవాడు

ఆరోజుల్లో పార్లమెంటుకి ఎన్నికైన సభ్యులకందరికీ పార్లమెంటు కార్యకలాపాలు క్రొత్త అమెండ్‌మెంటుకి కట్‌మోషన్‌కి తేడా చాలామందికి తెలిసేది కాదు ప్రశ్నలు వ్రాయడం ఒక ప్రత్యేకమైన కళ కొన్ని ప్రశ్నలకు మంత్రి సమాధానం వ్రాసి ఇస్తారు వాటిపై చర్చ ఉండదు స్టార్ ప్రశ్నలకు మంత్రి ప్రశ్నల సమయంలో సమాధానాలు చెబుతారు అలా పార్లమెంటు సభ్యులకు ప్రశ్నలు వ్రాసిపెడితే ప్రశ్నకు రెండునుంచి ఐదురూపాయలవరకూ మాకు ప్రతిఫలం ముట్టేది అంతా పార్లమెంటుకు క్రొత్త కావడం వలన వారు చాలా వరకు పార్టీ ఆఫీసుమీద ఆధారపడేవారు కొందరు సభ్యులు తాము పార్లమెంటులో చేయదల్చుకున్న ఉపన్యాసాలకు సమాచారం కోసం కూడా పార్టీ ఆఫీసుపై ఆధారపడేవారు పార్టీ నాయకుడు జవహర్‌లాల్ నెహ్రూ అలా లోక్‌సభలోకి వెళుతూ పార్టీ ఆఫీసుకు వచ్చి మమ్మల్ని పలకరించి వెళ్ళేవారు పార్టీ మీటింగులు జరిగితే పార్లమెంటు కేంటీన్ కాంట్రాక్టరు సొనబర్‌ఖాన్ స్వయంగా నెహ్రూగారికి టీ తయారు చేసి ఇచ్చేవాడు జవహర్‌లాల్ నిమ్మకాయ పిండుకుని టీ డికాక్షన్ త్రాగేవారు సభ్యులు ఉపన్యాసాలు చెబుతూ ఉంటే తాను కాగితాలమీద పిచ్చిగీతలు గీస్తూ తనపేరు వ్రాస్తూ

కూర్చునేవారు మీటింగు తరువాత అవన్నీ నేను పోగుచేసుకునేవాణ్ణి

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని సంతోషించాలో దేశం రెండుముక్కలుగా చీలిపోయిందని విచారించాలో తెలియని పరిస్థితి పాకిస్తాన్ దేశం ఆవిర్భవించడంతో ఆ రాష్ట్రాలలోని హిందువులు భారతదేశానికి కట్టుగుడ్డలతో పారిపోయి వచ్చారు వేలాదిమంది కాందిశీకుల్ని పాకిస్తాన్‌నుంచి ఢిల్లీ తీసుకువచ్చే రైళ్ళు, లారీలు తమ ప్రాణాలు కాపాడుకోవడానికి తాపత్రయపడే కుటుంబాలతో నిండిపోయాయి సిక్కులు, హిందువులు పాకిస్తాన్‌నుంచి వస్తుంటే కొన్ని ముస్లిం కుటుంబాలు పాకిస్తాన్‌కి వెళ్ళాయి ఢిల్లీలోని కేంద్రప్రభుత్వం, ఢిల్లీపాలనా యంత్రాంగం యావత్తు కాందిశీకుల సమస్యతో సతమతమయిపోయాయి అది చాలదన్నట్లు మతకలహాలు ప్రారంభమయ్యాయి కాందిశీకుల మానసిక పరిస్థితి కరుడుగట్టుకు పోయింది ఢిల్లీలో వేలాదిమంది కత్తిపోట్లకు మరణించారు బజారులో నడుస్తూ ప్రక్కవ్యక్తిని కత్తితో పొడిచి ఏమీ పట్టనట్టు వెళ్ళిపోయే వారిని చూచి ఆశ్చర్యపోయేవాణ్ణి ఆరోజుల్లో ఢిల్లీలో పూసారోడ్డు ఒక ప్రక్క అంతా ఖాళీగా ఉండేది అక్కడ జరిగిన ఒక హత్య నా జీవితంలో మర్చిపోలేను నేను ఆ హత్యను మా మేడమీదనుంచి చూసాను ఒక వ్యక్తిని మధ్య నిలబెట్టి చుట్టూ వలయంగా జనం నిలబడి రాళ్లు రువ్వి అతణ్ణి చంపివేసారు అటువంటి క్రౌర్యం, పాశవికత నేను ఎప్పుడూ చూడలేదు అందుకే ఔత్తరాహికులు దక్షిణాదివారిని పిరికివారని వేళాకోళం చేసేవారు కాని ఢిల్లీలో మతకలహాలు తగ్గించడానికి దక్షిణాది సైనికులే కావలసి వచ్చారు ఏది ఏమైనా ఆ రోజుల్లో ఢిల్లీలో ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బ్రతికాం అది ఒక పీడకల

ఆ పరిస్థితులలో పాకిస్తాన్ లోని తమ నివాసాన్ని వదిలి ఢిల్లీకి వలస వచ్చిన డా|| పృథ్వీనాద్ చోప్రా కుటుంబం మాఇంట్లో కొద్దిరోజులు తలదాచుకున్నారు అప్పుడు వాళ్ళ రెండవ కుమారుడు పసివాడు చోప్రాగారి భార్య శకుంతల పుట్టిల్లు జమ్మూ వారికి ఇద్దరు కుమారులు చోప్రా కలకత్తాలో హోమియో వైద్యవిద్యనభ్యసించారు ఆ తరువాత లండనులోను, అమెరికాలోను హోమియో వైద్య విధానంలో పై చదువులు చదివారు శకుంతలాజీ ఎం ఏ చదివింది ఆమె సోదరుడు బలవంత్ నా మిత్రుడు కావడం మూలంగా చోప్రాగారి కుటుంబంతో సాన్నిహిత్యం, స్నేహం చిరకాలంనుంచి నిలిచిపోయింది ఆ సమయంలో కాశ్మీర్ ముఖ్యమంత్రి షేక్ అబ్దుల్లా కుమార్తె వివాహం శ్రీనగర్‌లో చేసారు అది ఎలా జరిగిందో బాగా గుర్తు రావడం లేదు కాని నేను ఆ వివాహానికి అతిథిగా వెళ్లాను అప్పట్లో నేను శాఖాహారిని షేక్

అబ్దుల్లా తమ కుమార్తె వివాహం సందర్భంగా ఇచ్చిన విందు మరపురాని అనుభవం అతిథులంతా తివాచీలమీద కూర్చుని తమ ముందు పెట్టిన పదార్థాలు ఎవరికి వారే కుడిచేతితోనే తీసుకుని తమ ప్లేటులో పెట్టుకుని తినడం మొదటిసారిగా చూసిన నాకు చాలా ఎబ్బెట్టుగా అనిపించింది దానికి తోడు ఆ పదార్థాలన్నీ మాంసాహారమే అంతలో మామూలు అన్నం, పెరుగు వంటి పదార్థాలు కనిపించాయి ఆనందంగా వడ్డించుకుందామంటే ఆ తెల్లటి పదార్థంకూడా మాంసాహారమే అని తేలింది ఆ రాత్రి నాకు ఉపవాసమే! అందుమూలంగా ఆ సన్నివేశాన్ని అసలు మర్చిపోలేను

మహాత్మాగాంధీ ఢిల్లీలో భంగీకాలనీలో మకాం పెట్టి ప్రతి సాయంత్రం ఉపన్యాసాలు చెప్పేవారు నేను ఇంటికి వెళ్ళే దారిలోనే మహాత్ముని ఉపన్యాసం జరుగుతుంటే సైకిల్ దిగి ఆయన ఉపన్యాసాన్ని వినేవాణ్ణి ఆ తరువాత మహాత్ముడు బిర్లా భవనంలోనికి మకాం మార్చి ఆ ఆవరణలో ప్రార్థనా సమావేశాలు జరిపేవారు ఒకనాడు సాయంకాలం ఆఫీసునుంచి కన్నాట్‌సర్కస్ మీదుగా ఇంటికి వెళుతున్నాను హిందూస్తాన్ టైమ్స్ సాయంకాలం ప్రత్యేక సంచిక ప్రచురించి మార్కెట్‌లో అమ్ముతున్నారు గాంధీగారిని కాల్చివేశారు గాంధీ మరణం అని పేపరు కుర్రాళ్ళు అనడం వినిపించింది నా చెవులను నేనే నమ్మలేకపోయాను వెంటనే ఒక పేపరు కొని చదివాను అంతే నా సైకిల్‌ని బిర్లాభవన్‌కి మళ్ళించాను అప్పటికే వేలమంది శోకతప్త ప్రజలు ఆ రోడ్డు అంతా నిండిపోయారు అప్పుడే ప్రధానమంత్రి జవహర్‌లాల్‌నెహ్రూ ఆ భవనం గేట్లు మూయించి వాటిపై ఎక్కి ప్రజలకు బాపూజీ మరణవార్త తెలియజేస్తున్నారు పండిట్‌జీ కన్నీటితో గద్గద స్వరంతో ఆ ఘోరవార్త ప్రజలకు తెలియజేసారు అప్పటికే ఆ విషాదవార్త ఢిల్లీ అంతా దావానలంలా వ్యాపించింది నేను రాత్రి చాలా ఆలస్యంగా ఇంటికి చేరేసరికి అంతా దిగులుగా కూర్చుని ఉన్నారు వంటలు లేవు భోజనాలు లేవు ప్రజలంతా భోజనాలమాట మరచిపోయారు

మహాత్మాగాంధీని కాల్చిన వ్యక్తి హిందువు కావడం మూలంగా మతకలహాలకు తావు లేకపోయింది ఆ మరునాడు మహాత్ముని అంతిమ యాత్ర చూడడానికి ప్రజలు ఢిల్లీ చేరుకున్నారు ఆనాడు కూడా ప్రజలు భోజనాల మాట మరచిపోయారు మహాత్ముని అంతిమయాత్రా మార్గం యావత్తు ఒక జనసముద్రంలా ఉంది ఒక చోట నిలబడి ఆయాత్ర చూడడానికి నామనస్సు అంగీకరించలేదు మహాత్ముని మృతదేహాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళే వాహనం కూడా వెళ్ళాను ఆ జనారణ్యంలో మహాత్ముని చితికి దగ్గరగా వెళ్లి ఆ విషాద దృశ్యాన్ని చూసాను గుండె బరువెక్కిపోయింది ఆ

కార్యక్రమం పూర్తి అయ్యేసరికి చీకటిపడిపోయింది ఇంటికి చేరి స్నానం చేసి భోజనం చేసి మహాత్ముని గురించి ఆలోచిస్తూ పడుకున్నాను గాంధీయుగం అంతరించి పోయినదనిపించింది మహాత్ముడు మరికొంతకాలం స్వతంత్ర భారతదేశంలో బ్రతికి ఉంటే మహా క్షోభ అనుభవించేవాడు ఆయన మరణం అటు కాంగ్రెసు నాయకులకు, ఇటి గాంధేయవాదులకు కూడా ఒక విధమైన విడుదల అయింది చిత్రం ఏవిటంటే గాంధీమహాత్ముడు భారత స్వాతంత్ర్య సమరానికి నాయకత్వం వహించి దేశస్వాతంత్ర్యం సంపాదించిన ప్రారంభ దశలో మతోన్మాదుని కోపానికి గురై చంపబడడం భారత జాతికి కళంకం స్వతంత్ర భారతదేశంలో కాంగ్రెసు నాయకులు మహాత్ముని చాలా తొందరగా మర్చిపోయారు ఇక గాంధీ మహాత్ముని వారసులలో రెండవతరంవారిపై గాంధీజీయొక్క ప్రభావం కనిపించకుండా పోయింది

ఢిల్లీ జీవితం ఒడుదుడుకులు లేకుండా సాఫీగానే సాగిపోతోంది పార్లమెంటులోని కాంగ్రెసు పార్టీ ప్రారంభంలో ఇస్తామన్న రెండువందల రూపాయలు జీతాన్ని హెచ్చించే స్థితిలో లేదు సంసారం పెరిగిపోతోంది గవర్నమెంటులో ఉద్యోగం వచ్చే అవకాశాలు మృగ్యం ఆ సమయంలో మిత్రులు బలవంత్ సెహగల్, ప్రాణ్‌నాగపాల్ చదువులు పూర్తి చేసుకుని ఉద్యోగ ప్రయత్నాల్లో ఉన్నారు వారిలో బలవంత్ డా|| చోప్రా బావమరిది ఇద్దరూ జమ్మూకి చెందినవారే ఢిల్లీలో ఆరోజుల్లో ఇండియా కాఫీహౌస్ కన్నాట్‌సర్కస్ పరిధిలో ఉన్న కొన్ని రెస్టారెంట్లలో అందమైన అమ్మాయిలతో కూర్చోవడం వారికి పరిపాటి ఉద్యోగాలు రాకపోతే ఏదైనా వ్యాపారం చేద్దామనే ఆలోచనలో ఉన్నవారు కొద్దికాలం వారిద్దరూ కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీలో కూడా పనిచేసారు అది ఊరికే కాలక్షేపం కోసం పార్లమెంటు సభ్యుల్ని పరిచయం చేసుకోవడం కోసం చేసిన పని చివరకు అమెరికన్ ఇన్ఫర్మేషన్ సర్వీస్ ద్వారా అమెరికను పుస్తకాలు హిందీలో తర్జుమా చేసి ప్రచురించడం బాధ్యత తీసుకున్నారు వారు ప్రారంభించిన ప్రయివేటు కంపెనీలో నాకు కూడా భాగస్వామ్యం యిస్తామన్నారు అయితే ఆ రూపేణా నాకు ఏమీ ఆర్థిక సహాయం అందలేదు కొంతకాలం తరువాత ప్రాణ్ మరణించాడు బలవంత్ భార్యాపిల్లలతో హిమాచల్‌ప్రదేశ్‌లో కుక్కగొడుగులుపండించడంలోస్థిరపడ్డాడు

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిననాటి నుంచి పాకిస్తాన్‌తో పేచీలు రావణాసురుని కాష్టంలా రగులుతూనే ఉన్నాయి కాశ్మీర్‌లో ముస్లిములు అధిక సంఖ్యాకులు కాబట్టి దానిని పాకిస్తాన్‌లో కలుపుకోడానికి పాకిస్తాన్ ఆరోజు నుంచి ఈ రోజు వరకు ప్రయత్నిస్తూనే ఉంది హరిసింగ్ మహారాజు కాశ్మీర్

సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేయడానికి చాలా ఆలస్యం చేశాడు చివరకు పాకిస్తాన్ ప్రోత్సాహంతో దుండుగులు కాశ్మీర్‌పై దాడిచేయడానికి వస్తే మహారాజా హరిసింగ్ భారతదేశం శరణుజొచ్చాడు భారతసేనలు కాశ్మీర్‌ను కాపాడాయి కాని, పండిట్‌నెహ్రూ కాశ్మీర్ సమస్యను ఐక్యరాజ్యసమితికి తీసుకువెళ్లడంతో ఆ సమస్య అపరిష్కృతంగా ఉండిపోయింది కాశ్మీర్‌లో కొంతభాగం ఈనాటికి పాకిస్తాన్ ఆధీనంలో ఉంది దానినే ఆజాద్ కాశ్మీర్ అని పిలుచుకుంటారు ఆజాద్ కాశ్మీర్ స్థావరాలనుంచి పాకిస్తాన్ సైన్యాలు భారత్ ఆధీనంలో ఉన్న కాశ్మీర్‌పై దాడులు జరపడం పరిపాటి కాశ్మీర్‌లో పాకిస్తానీ దుండుగులతో జరిగే యుద్ధంలో పాల్గొనే భారత సైనికుల సదుపాయాలు చూడడానికి ఢిల్లీలో స్వచ్ఛంద సేవాసంస్థ ప్రారంభించబడింది దానికి భారతసేనా సహాయక సమితి అని పండిట్ నెహ్రూ నామకరణం చేశారు కాంగ్రెసు పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి అమ్ముస్వామినాథన్ అధ్యక్షురాలు పార్లమెంటులోని కాంగ్రెసుపార్టీ ఆఫీసుకి ఈ బాధ్యత కూడా అప్పగించారు కాశ్మీర్ రంగంలో పోరాడే భారతసైనికులకు ఈ సమితి ఎటువంటి సహాయం అందించగలుగుతుందో తెలుసుకోవడం ప్రథమ కర్తవ్యం దానికొరకు కాశ్మీర్ వెళ్లి ఒక రిపోర్టు తయారుచేయడానికి పండిట్‌జీ నన్ను నియమించారు

కాశ్మీర్‌లో యుద్ధం చేస్తున్న మన సైనికులను కలుసుకోవడానికి నన్ను శ్రీనగర్ పంపిస్తున్నట్టు అప్పటి కాశ్మీర్ రంగంలో సర్వసైన్యాధిపతి జనరల్ తిమ్మయ్యకు జాబు వ్రాసారు శ్రీనగర్‌లో జనరల్ తిమ్మయ్యను కలుసుకున్నాను, ఆయన ఉడి సెక్టార్‌లోని సైన్య శిబిరాలన్నిటికి నా రాక తెలియజేసారు తన జీపు యిచ్చి నాకు తోడుగా తన ఎ డి సి కేప్టన్‌ని పంపారు తిన్నగా యుద్ధం జరుగుతున్న బరమూల దగ్గర సొరంగంలో కూర్చున్న బ్రిగేడియర్ గురుదీప్‌సింగ్‌ని కలుసుకున్నాను అక్కడకు మన సైనికులు పాకిస్తానీ సైనికులు తుపాకులు కాల్చుకోవడం వినబడుతోంది ఆ బ్రిగేడియర్‌తో మాట్లాడి శ్రీనగర్‌కి తిరుగుప్రయాణంలో రెండుమూడు సైనిక స్థావరాలవద్ద ఆగి కమాండర్లతోను, సైనికులతోను మాట్లాడాను సైన్యానికి డిఫెన్సుశాఖ సదుపాయాలు చేస్తుంది అయినా ప్రభుత్వమే కాకుండా ప్రజాప్రతినిధులు కూడా సైన్యం యొక్క అవసరాలను గురించి పట్టించుకుంటుందనే భావం వారిలో కలుగజేయడానికే మా ప్రయత్నం సైనికులు తమకు ఆవనూనె ఎక్కువ కావాలని కోరారు వారికి యిచ్చే రమ్ము కోటా చాలదనే భావం వ్యక్తమయింది అసలు ఒక స్వచ్ఛంద సంస్థ తమ అవసరాల గురించి పట్టించుకుంటుందని అప్పుడే తెలిసినందున వారి కోర్కెలు త్వరలో తెలియజేస్తామన్నారు

శ్రీనగర్‌కి తిరుగు ప్రయాణంలో ఒక విచిత్రమైన సన్నివేశం ఎదురైనది మా జీప్ రాంపూర్ క్యాంపు వదిలేసరికి సాయంకాలం అయిపోయింది చీకటి పడేసరికి ఒక వంతెన వద్దకు చేరాం అక్కడున్న సెక్యూరిటీ సైనికుడు జీపు ఆపి ఆనాటి కోడ్ మాట చెప్పమన్నాడు ప్రతిరోజు కోడ్ మాట మారుతుంది మేము రాంపూర్ వదిలేముందు నాతో వచ్చిన కేప్టన్ అక్కడ ఆరోజు కోడ్ మాట ఏవిటో అడిగి తెలుసుకోవడం మర్చిపోయాడు లంచ్ సమయంలో ఒక చుక్క ఎక్కువై ఉంటుంది వంతెన దాటనివ్వనంటాడు అక్కడ కాపలా ఉన్న గార్డు కేప్టెన్ జీపు దిగి ముఖ్యమైన పనిమీద ఢిల్లీ నుండి వచ్చిన అతిథిని తీసుకువెళ్లాలని ఏవేవో చెప్పాడు అతడు ససేమిరా అంగీకరించలేదు రాంపూర్ వెళ్లి కోడ్ మాట కనుక్కురావడం సాధ్యంకాదు అప్పుడు నేను జీపు దిగి ప్రధాని నెహ్రూ ప్రతినిధిగా వచ్చాను కాబట్టి వంతెన పేల్చే ఆలోచన లేదని నేను జనరల్ తిమ్మయ్య అతిథినని చెప్పిన తరువాత మా జీపుని వెళ్లనిచ్చాడు ఆ సన్నివేశంలో కేప్టెన్, సెక్యూరిటీ సైనికుడు కూడా తమ విధి నిర్వహణలో తప్పుచేశారనిపించింది

ఢిల్లీ చేరి శ్రీమతి అమ్ముస్వామినాథన్‌కి, ప్రధానికి రిపోర్టు చేసాను భారతసేనా సహాయక సమితికి నిధులకోసం శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి సంగీత కచేరీలు ముఖ్యపట్టణాల్లో ఏర్పాటు చేస్తే బాగుంటుందని శ్రీమతి స్వామినాథన్‌కి సలహా యిచ్చాను ఆమె అంగీకరించింది శ్రీమతి సుబ్బులక్ష్మికి జాబు వ్రాసాను ఆమె భర్త వెంటనే జవాబు వ్రాస్తూ ఆమె ఆరోగ్యం అంత బాగా లేదు కాబట్టి సంగీత కార్యక్రమాలు సాధ్యం కాదని తమ విరాళంగా వెయ్యి రూపాయలు చెక్కు పంపించారు ఏ విధమైన ప్రశ్న అడగకుండా వెయ్యి రూపాయలు విరాళం పంపిన శ్రీమతి సుబ్బులక్ష్మి వితరణ మరువలేను

పార్లమెంటులోని కాంగ్రెసు పార్టీకి శ్రీమోహన్‌లాల్ సక్సేనా, శ్రీ వి.యన్. గాడ్గిల్, ప్రొఫెసర్ ఎన్.జి. రంగా కార్యదర్శులుగా ఉండేవారు వారిలో రంగాజీతో చాలా చనువుగా ఉండేవాణ్ణి ఢిల్లీలోని ప్రముఖ ఆంధ్రులతో మంచి సంబంధాలుండేవి ఆ రోజుల్లో ఢిల్లీలో తక్కువమంది ఆంధ్రులు ఉండేవారు కాబట్టి అందరితోనూ సంబంధాలు పెంచుకోవడానికి హెచ్చు అవకాశాలుండేవి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రయివేట్ సెక్రటరీ మథాయ్‌తో కూడా మంచి స్నేహం ఉండేది

పార్లమెంటులోనే కాకుండా ఢిల్లీ కాంగ్రెసు వర్గాలలో కూడా నేను చురుకుగా తిరిగేవాణ్ణి అప్పట్లో కాంగ్రెసు వలంటీరు దళంలో సభ్యుడిగా ఉండేవాణ్ణి రాధారమణగుప్త, సవితాబెహన్ ప్రోత్సాహంతో కాంగ్రెసు వలంటీరు దళంలో చేరాను అప్పట్లో ఢిల్లీలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు

కమిటీ సమావేశాలు నాకు బాగా గుర్తు ఎ ఐ సి సి మహాసభకు ప్రవేశద్వారం వద్ద నన్ను వాలంటీరుగా నిలబెట్టారు పాస్ లేకుండా ఎవరూ లోనికి వెళ్లకుండా చూడమన్నారు అంతే ఇక నా ప్రతాపం చూపించడం మొదలుపెట్టాను శ్రీ రాజగోపాలాచారి ఆ తరువాత మౌలానా ఆజాద్ లోపలికి వెళ్లారు మౌలానా ఆజాద్ వెనకాల ఆయన కార్యదర్శి వెళుతున్నాడు ఆయనకు పాస్ లేదని ఆపివేసాను మా మంత్రిగారు వెళ్లిపోతున్నారు కాబట్టి తాను కూడా వెళ్లాలన్నారు ససేమిరా వీలు లేదన్నాను లోపలికి వెళ్ళి ఒక పెద్దమనిషితో కబురుపెట్టాడు అంతలో పట్టణ కాంగ్రెసు కార్యదర్శి రాధారమణగుప్త పరుగున వచ్చి మౌలానా ఆజాద్‌గారి కార్యదర్శిని లోపలకు వెళ్లనివ్వమన్నాడు ఆయన పేర పాస్ తయారు చేయించుకు రమ్మన్నాను

ఇక నన్ను ముఖద్వారం వద్ద ఉంచితే ఇబ్బందులు వస్తాయని అనుమానించిన నాయకులు నన్ను మీటింగు హాలు గేటువద్దకు మార్చారు శ్రీ మల్లిపూడి పల్లంరాజు మధ్యాహ్నా సమావేశానికి వస్తూ ఆయన బాడ్జి మర్చిపోయారు గేటు వద్ద నన్ను చూడగానే ఆయన తన గదికి తిరిగి వెళ్లి బాడ్జి పెట్టుకుని వచ్చారు మిత్రులు అదంతా చాదస్తం అన్నారు ఏదైనా పని చేసేటప్పుడు పట్టువిడుపులు ఉండాలని వారి వాదం ఎన్ని విధాలుగా ఎందరు చెప్పినా నా పట్టుదల నాదే అదే లేకపోతే జీవితంలో ముందడుగు పడేదేకాదేమో

నాకు పిహెచ్ డి చేద్దామని సరదా పుట్టింది ఇక అప్పుడు యూనివర్సిటీలో చేరి మూడునాలుగేళ్లు రిసెర్చి చేయడానికి తగిన ఆర్థిక స్తోమత, తీరిక లేవు అందుమూలంగా ఢిల్లీలో ఉద్యోగం చేస్తూ ప్రయివేటుగా పిహెచ్ డికి రిసెర్చి చేయాలని నిర్ణయించాను అటువంటి సదుపాయం ఆంధ్రా యూనివర్సిటీలో లేదు అనేక యూనివర్సిటీలకు వ్రాసాను చివరకు బొంబాయి విశ్వవిద్యాలయం ఆ సదుపాయం కలిగించడానికి అంగీకరించింది షోలాపూర్ కళాశాలలో ఉన్న ఆచార్య రామమూర్తిని నా రిసెర్చికి గైడ్‌గా నియమించారు నేను యూనివర్సిటీకి కట్టవలసిన డబ్బు కట్టి రిసెర్చి స్కాలర్‌గా రిజిష్టరు చేయించుకున్నాను రిసెర్చి విషయం దాని వివరాలు యూనివర్సిటీలో అటెండెన్సు విషయాలపై నా గైడ్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి ఏడాదికి మూడుమాసాలు షోలాపూర్‌లో ఉండి ఆయనతో చర్చిస్తే చాలని ఆయన వ్రాసారు

పిహెచ్ డి డిగ్రీ బొంబాయి విశ్వవిద్యాలయం నుండి తీసుకోవాలనే సంకల్పంతో అన్ని ఏర్పాట్లు చేసి డబ్బు కూడా కట్టిన తరువాత నాకు మరొక బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది ఆ పిహెచ్ డి డిగ్రీ ఇంగ్లండులో చేస్తే

బాగుంటుంది కదా అనిపించింది ప్రొఫెసర్ లాస్కీ వ్రాసిన గ్రామర్ ఆఫ్ పొలిటిక్స్ అనే గ్రంథం లైబ్రరీలో చదివాను అప్పట్లో ఆయన లండను విశ్వవిద్యాలయంలో కింగ్స్ కళాశాలలో ఆచార్యులుగా ఉంటున్నారు 'ఆయన వద్ద శిష్యరికం చేయాలని ఆలోచన వచ్చింది ఆ మాట మిత్రులతో అన్నాను వాళ్లంతా నాకసలు అటువంటి ఆలోచన వచ్చినందుకే ఆశ్చర్యపోయారు నేను ఢిల్లీలో పార్లమెంటరీ కాంగ్రెసు పార్టీలో రెండువందల రూపాయల ఉద్యోగం చేస్తున్నాను భార్య, ముగ్గురు ఆడపిల్లలతో సంసారం నడుస్తోంది ఆర్థిక స్తోమత లేదు అయినా లండను వెళ్లి పిహెచ్ డి చేయాలనే ఆలోచన రావడం ఆశ్చర్యమే బొంబాయి విశ్వవిద్యాలయంలో పిహెచ్ డి కి రిజిష్టరు చేసావు కదా మళ్లా లండను యూనివర్సిటీ అంటావేమిటని మిత్రులు వారి సందేహాలతో నా సంకల్పాన్ని నీరు కార్చడానికి ప్రయత్నించారు వారంతా నా ఆర్థిక పరిస్థితులు బాగా ఎరిగిన మంచి మిత్రులే వారికందరికీ సమాధానాలు చెప్పడంతో నా సంకల్పం నిర్ణయంగా తయారైంది జయప్రకాశ్ నారాయణ్ అమెరికాలో చిల్లర పనులు చేస్తూ చదువు సాగించినట్లు అలాగే అనేకమంది ఆర్థిక స్తోమత లేకపోయినా విదేశాలలో చదువులు చదివిన వివరాలు తెలుసుకున్నాను లండనులో ఏదైనా పని చేసుకుంటూ చదువుకోవచ్చు ననుకున్నాను ఈ ఆలోచనలన్నీ క్రియారూపం దాలుస్తాయో లేదో ఇదమిద్ధంగా తెలియదు

  

# లండనులో నా చదువు

ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికి ఎగిరినట్టుని తెలుగులో సామెత ఇంగ్లండుదేశం వెళ్లి లండనులో అంతర్జాతీయ వ్యవహారాలమీద రిసెర్చి చేసి పిహెచ్ డి (డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ)డిగ్రీ తెచ్చుకోవాలని నాబోటి పేదవానికి ఆలోచన రావడానికి పై సామెత చక్కగా సరిపోతుంది ఏదైనా కష్టమైన ఊహ, క్లిష్టమైన ఆలోచన వచ్చినప్పుడు వాటిలోని యిబ్బందులను అధిగమించడానికి మానవుడు మానసికంగా అనేక దారులు వెదుకుతాడు పిహెచ్ డి చేయడానికి ఇంగ్లండులో అధమం మూడేళ్లు ఉండగలగాలి ముందు ఓడ ప్రయాణానికి డబ్బు కావాలి నా వద్ద ఏమీ లేదు వెళ్లాలనే దృఢ సంకల్పం, అపారమైన ఉత్సాహం మాత్రం ఉన్నాయి ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు రెండు వందల రూపాయలతో లండను వెళ్లి బారిష్టరు పరీక్ష యిచ్చి వచ్చారట జయప్రకాష్‌నారాయణ్‌గారు అమెరికాలో హోటళ్లలో కప్పులు కడిగి డిగ్రీ తీసుకు వచ్చారట ఇలా ఎంతో మంది మహానుభావుల జీవిత చరిత్రలు తరువాత తరాల వారికి ధైర్యసాహసాలను, ఉత్సాహాన్ని కలిగించి కార్యోన్ముఖుల్ని చేస్తాయి అంతేకాకుండా మద్రాసులో "స్వతంత్ర" వారపత్రిక సంపాదకులు శ్రీ ఖాసా సుబ్బారావు భుజం తట్టి ప్రోత్సహించారు

నన్ను ఇంగ్లండులో తమ పత్రిక ప్రతినిధిగా ఉంచుతూ జాబు యిచ్చారు శ్రీకోటంరాజు రామారావు సంపాదకత్వంలో మద్రాసులో నెలకొల్పిన "ఇండియన్ రిపబ్లిక్" అనే ఇంగ్లీషు దినపత్రికకు లండను నుండి వ్యాసాలు వ్రాయమన్నారు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ప్రొప్రయిటర్ రామనాధ గోయంకా లండనులోని తమ ప్రతినిధికి ఒక పరిచయ లేఖ యిచ్చారు

ఆ రోజుల్లో పాస్‌పోర్టులు రావడం చాలా కష్టంగా ఉండేది అయితే నా అడ్రసు 24, పార్లమెంటు హౌస్ అని ఉండడం, నేను పార్లమెంటులో కాంగ్రెసు పార్టీలో ఉద్యోగిని కావడం వల్ల ఢిల్లీ చీఫ్ కమీషనరు ఆఫీసులో ఏ విధమైన ఇబ్బంది లేకుండా పాస్‌పోర్టు వచ్చింది ఇల్లు అలకగానే పండుగ కాదన్నట్టు ఈ ఏర్పాటులన్నీ ఒక ఎత్తు, ఇంగ్లండు వెళ్లడానికి, అక్కడ కొంతకాలం ఉండడానికి కావలసిన డబ్బు సమకూర్చడం మరొక ఎత్తు అప్పు చేయడానికి కూడా స్తోమత లేదు అంతలో ఐచ్ఛికం అనండి దైవికం అనండి నా మిత్రుడు వి వి రమణ ఢిల్లీ రావడం అతడితో నా ఆలోచన చెప్పడం తటస్థించింది అనకాపల్లి వాస్తవ్యుడు రమణబాబు ఆ తరువాత పార్లమెటు సభ్యుడిగా కూడా

ఉన్నాడు

మిత్రుడు రమణ ఏర్పాటు చేస్తానన్న రెండువేల రూపాయలు మొదటిసారి అనుకున్న సమయానికి అందకపోయినా ఒక నెల రోజుల తరువాత అనకాపల్లి వెళితే చక్కటి భోజనం పెట్టి రెండు వేలు చేతిలో పెట్టాడు సైకిల్ సామాన్ల వ్యాపారానికి నేను లండను నుంచి తోడ్పడడం అని ఏదో ఏర్పాటు చేసాడు ఆ డబ్బుతో ఓడ టిక్కెట్టు కొని, ఒకటో అర సూట్లు, చొక్కాలు కుట్టించుకున్నాను

లండనులో ఉన్న రోజుల్లో వార్తా పత్రికలకు వార్తలు, వ్యాసాలు వ్రాస్తే భారతీయ పత్రికలు డబ్బు యిచ్చే అవకాశాలకోసం ప్రయత్నించాను ఢిల్లీలో ఉన్న జాతీయ పత్రికలకు లండనులో ప్రతినిధులు ఉన్నారు మద్రాసునుంచి ప్రచురించబడే 'హిందూ' కి కూడా లండను ప్రతినిధులున్నారు అయితే అప్పుడే "ఇండియన్ రిపబ్లిక్" అనే ఇంగ్లీషు వార్తాపత్రిక మద్రాసులో ప్రారంభం అయింది దానివెనుక డా పట్టాభి సీతారామయ్యగారు ఉన్నారు నేషనల్ హెరాల్డ్ పత్రికా సంపాదకునిగా ఖ్యాతి గడించిన కోటంరాజు రామారావుగారు దానికి సంపాదకుడు మా బాబాయి గోపాలకృష్ణమూర్తి గారితో నా ఆలోచన చెప్పాను ఆయన పుణ్యామా అంటూ ఆయనకు పట్టాభిగారితో ఉన్న పరిచయంతో పాటు నేను పట్టాభిగారితో జైలులో ఉన్న రోజులు జ్ఞాపకం చేసి నన్ను ఇండియన్ రిపబ్లిక్(ఇంగ్లీషు డెయిలీకి) లండను కరస్పాండెంట్‌గా నియమిస్తూ యాజమాన్యంనుంచి ఒక జాబు తెచ్చాడు

ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ ప్రత్యేక కార్యదర్శి శ్రీమత్తాయ్‌తో ఉన్న స్నేహంతో నా లండను ప్రయాణం గురించి ఆయనతో చర్చించాను నెహ్రూగారి వద్దనుండి ఒక ఉత్తరం తీసుకువెళ్లటం మంచిదని మత్తాయ్ సలహా యిచ్చాడు ఆ పరిచయ లేఖ యిప్పించే బాధ్యత తన నెత్తిన పెట్టుకున్నాడు లండనులో భారత హైకమీషనర్‌గా ఉన్న శ్రీకృష్ణమీనన్‌కి నన్ను పరిచయం చేస్తూ ప్రధాని నెహ్రూ ఒక లేఖ యిచ్చారు దానిలో ఆయన నా జైలుజీవితం, పార్లమెంటరీ కాంగ్రెసు పార్టీలో పని గురించి ప్రొఫెసర్ లాస్కీ వద్ద రిసెర్చి చేయాలని లండను వస్తున్నట్టు వ్రాసి అవసరమైన సహాయం చేయవలసిందని వ్రాసారు

బొంబాయి నుంచి బయలుదేరే పి అండ్ ఓ కంపెనీవారి ఓడలో లండను ప్రయాణానికి టిక్కెట్టు కొనుక్కున్నాను ఆ టిక్కెట్టు ఖరీదు 900 రూపాయలని గుర్తు మిగిలిన డబ్బులతో ఒక గాబర్డీన్ సూటు, చొక్కాలు కుట్టించుకున్నాను లండను వెళ్లేవరకు గాబర్డీన్ సూటు కుట్టించుకోవడంలో నేను చేసిన పొరపాటు అర్థం కాలేదు గాబర్డీన్ సూటు లండనులో వేసవిలో

వేసుకోవడానికే గాని చలిని ఆపడానికి పనికిరాదు ఇంగ్లండులో చలి ఎముకలను కొరుక్కు తినే చలి. దానిని తట్టుకోవడానికి తగిన దుస్తులు లేవు కాని ఖద్దరు ఉలెన్ బంద్ గల్లాకోటు నన్ను చాలా వరకు కాపాడింది

ఓడ టిక్కెట్టు పాస్‌పోర్టు, రికమండేషను ఉత్తరాలు ఉన్నాయి తప్ప లండనులో ఖర్చుకి డబ్బులేదు మిత్రుడు రాధాకృష్ణమూర్తికి నిఘంటువుల పిచ్చి లండనులో పాతపుస్తకాల షాపులో వెతికి బ్రౌన్‌దొర వ్రాసిన ఇంగ్లీషు తెలుగు నిఘంటువులు దొరికితే కొని పంపమని కొంత సొమ్ము యిచ్చాడు మిత్రుడు ప్రసాద్ వద్ద, మరికొందరు సహృదయులైన మిత్రుల వద్ద డబ్బు వసూలు చేసాను భార్యాపిల్లల్ని నర్సాపురంలో వాళ్ల పుట్టింట్లో వదలిపెట్టాను

ఢిల్లీలో మిత్రుడు బలవంత్ సైగల్, ప్రాణ్ నాగపాల్ నా ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చేసారు వెయ్యి రూపాయల వరకు ఓడ టిక్కెట్టు ఉంది కాబట్టి ప్రసాద్ రాధాకృష్ణమూర్తి వంటి మిత్రుల వద్ద వారు యివ్వగలిగిన వంద, రెండువందలు ప్రోగుచేసాను 1949 మార్చి26వ తేదీన 22,441 టన్నుల బరువున్న బ్రిటిష్ ఓడ S S అస్టూరియస్‌లో బొంబాయి నుంచి లండనుకి ప్రయాణం 24వ తేదీన న్యూఢిల్లీ నుంచి బొంబాయి రైలులో బయలుదేరినప్పుడు మిత్రులంతా వీడ్కోలు చెప్పడానికి స్టేషన్‌కి వచ్చారు నేను ఏదో సాహసయాత్ర చేస్తున్నాననని వారందరి భావం చేతిలో డబ్బు లేకుండా, భారతదేశం నుంచి డబ్బు వచ్చే అవకాశాలు లేవని తెలిసుండి, ఇంగ్లండులో పరిస్థితులు తెలియకుండా లండను ప్రయాణానికి బయలుదేరిన నేను క్షేమంగా తిరిగి వస్తాననే విషయంలో ఎవరి అనుమానాలు వారివి

26 శనివారం ఉదయం గం 7 30 కి బొంబాయి బల్లార్డ్ ఓడలరేవుకి చేరాను మెడికల్ పరీక్ష, కస్టమ్సు పరీక్ష ఏవిధమైన ఇబ్బంది లేకుండా జరిగిపోయాయి ఓడ మధ్యాహ్నాం 1 గంటకు బయలుదేరుతుంది కాని సామాన్లు ఉదయం ఏడు గంటలకు, ప్రయాణీకులు 8 గంటలకు రావాలన్నారు చిత్రం ఏవిటంటే చివరి నిమిషం వరకు ప్రయాణీకులు వస్తూనే ఉన్నారు ప్రయాణీకులు గమ్యం చేరేవరకు అవసరం లేని బరువు సామానులు ముందుగా ఓడ అధికార్లకు అప్పగించాలి వాటిని ఓడ దిగువ భాగంలో ఉంచుతారు ప్రయాణంలో ఉపయోగించుకునే సామాన్లు కూడా ఉంచుకోవచ్చు

కస్టమ్సు తతంగం అవగానే ఆ హాలులో ఒకమూల పేపరు చదువుతూ కూర్చున్నాను ఎదురుగా కనిపించే అస్టోరియస్ ఓడ ఆరు అంతస్తుల మహా భవనంలా ఉంది దానిని రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటిషు సైన్యాలకోసం

ఉపయోగించారట అది బ్రిటిష్ ప్రభుత్వ ట్రాన్సుపోర్టు శాఖవారిది 900 మంది ప్రయాణం చేయడానికి వసతి ఉంది ఆ తొమ్మిది వందలమంది ప్రయాణీకులు వారి వారి కుటుంబసభ్యులతోను, మిత్రులతోను బల్లార్డ్ రేవుకి వస్తున్నారు నాకు వీడ్కోలు చెప్పడానికి ఎవరూలేరు అందువల్ల మిగతావాళ్ళు చేసే హడావిడి చూస్తూ కూర్చున్నాను

ఓడలోని ఆరు అంతస్తుల లోను మొదటి అంతస్తులో ఓడ కేప్టన్, ఓడలో పనిచేసే ఆఫీసర్లు, కొన్ని వందల పనివాళ్లు ఉన్నారు వారంతా ఇంగ్లీషు వారే బి సి డి ఇ అంతస్తులలో ప్రయాణీకుల కేబిన్లు ఉన్నాయి నా కేబిన్ 'ఇ' డెక్‌లో ఉంది బెర్త్ నెంబరు 1043 అది కనుక్కునే సరికి నా తాతలు దిగారు ఓడ ఎక్కిన ప్రయాణీకులంతా తమ తమ గదులు కనుక్కోవడానికి నానా అవస్థలు పడుతున్నారు మధ్యాహ్నం 12 అయింది భోజన సమయం భోజనాలశాల అందంగా ఉంది కాని ఆభోజనం మాత్రం నాకు గొంతు దిగలేదు అలవాటులేని అవుపోసన అన్నట్టు ఎద్దుతోక సూపు అవుదూడ నాలుక నోట్లోపెట్టుకో లేకపోయాను అంతకు ముందు కొన్ని సంవత్సరాలనుంచి నేను శాకాహారిని కావడం గొప్ప ఇబ్బంది అయింది మాంసాహారులు కూడా ఎద్దులు ఆవులు తినడం అంటే బాధపడ్డారు అది ఓడలో ప్రథమ భోజనం మొదటి ఉపవాసం అంటే సమంజసంగా ఉంటుంది

ఒక బెంగాలీ యువకుడు నన్ను బెంగాలీలో పలుకరించి కలకత్తా నుంచి వస్తున్నావా? అన్నాడు కాదనేసరికి ఓడలో భారతదేశంలోని అన్నిరాష్ట్రాలవారు ఉన్నారని ఇంగ్లీషులో మాట్లాడ్డం మొదలుపెట్టాడు ఓడ అంతా సందడిగా ఉంది ప్రయాణీకులతోపాటు అధికారుల అనుమతితో ఓడమీదకు వచ్చినవారి బంధువులు, స్నేహితులతో అన్ని అంతస్తులు కిటకిటలాడిపోయాయి నేను డెక్ మీదకు వచ్చి నిల్చున్నాను ప్రయాణీకులు కానివారంతా పది నిమిషాలలో ఓడ దిగిపోవాలని కేప్టెన్ ఆజ్ఞ ఓడంతా ప్రతిధ్వనించింది అందరి మొఖాలు కందగడ్డలయ్యాయి ముద్దుల వర్షం కన్నీటి ధారలు మెట్లు లాగేశారు వందలమంది బైట నిలబడి గొడవ చేస్తున్నారు చేతులమీద గాలిలో ముద్దులు చేతులు ఊపడం, చేతి రుమాళ్ళు ఎగరవేయడం ఒక ఆంగ్ల వనిత బావురుమని ఏడుస్తోంది ఒక యువకుడు ఏడాదిపాటు నిన్ను గాలిలోనే ముద్దులు పెట్టుకుంటానని అరుస్తున్నాడు 1గంట అయింది ఓడ కదలింది పది నిమిషాలలో వేగం పుంజుకుంది మనుష్యులు కనిపించినంత వరకు ఏవో సౌజ్ఞలు చేసుకుంటూనే ఉన్నారు మరికొద్ది సేపట్లో అంతా లోపల సర్దుకున్నారు

నెమ్మదిగా ఓడ అంతా పరీక్షించాను సి డెక్ మీద మధ్యలో ఎన్‌క్వయిరీ,

పర్సర్ ఆఫీసు ఉన్నాయి ఓడ ప్రయాణికులకు పర్సర్ కీలకమైన వ్యక్తి 'బి' డెక్ మీద సినిమాహాలు లైబ్రరీ, రీడింగ్‌రూమ్, రిక్రియేషన్ రూమ్ ఉన్నాయి చిన్న హాస్పిటల్, కాంటీన్, క్షౌరశాల ఉన్నాయి భోజనశాలలు రెండు ఉన్నాయి ఉదయం 7గంటలకు కేబిన్‌లోనే టీ ఇస్తారు గం 8 - 8 45 మధ్య బ్రేక్‌ఫాస్ట్, 12 నుంచి 1గంట వరకు లంచ్ గం, 3-30 కి టీ, గం 6 నుంచి 7 వరకు డిన్నరు వీటన్నిటికి మొదటి సిట్టింగ్, రెండవ సిట్టింగ్ ఉన్నాయి ప్రయాణికులకందరికీ భోజనశాలలు నిర్ణయించి, దానిలో టేబిల్ నెంబరు, ఆ టేబిల్ వద్ద సీటు నెంబరు యిచ్చారు నాకు 4వ టేబిల్ మీద 1వ సీటు ఇచ్చారు నేను మొదటి సిట్టింగ్‌లో పేరు ఇచ్చాను ఇక ప్రయాణం పూర్తి అయ్యేవరకు అదే ఏర్పాటు అంతలో బాత్‌రూమ్ వద్ద ఏర్పాట్లు చూసే యువకుడు వచ్చి రోజూ స్నానం చేస్తావా? చేస్తే ఎన్ని గంటలకు అని అడిగాడు స్నానం ఉదయం గం 7 30 కి అని చెప్పాను

నాతోపాటు ఆ కేబిన్‌లో ప్రయాణం చేసేవారు గదికి చేరారు భాటియా అనే యువకుడు సొంత సొమ్ముతో లండనులో చదువుకోవడానికి వెళుతున్నాడు డా|| ఖర్గానిస్ ఇంగ్లండు, అమెరికా స్టడీ టూర్ మీద వెళుతున్నానన్నాడు ఒక గుజరాతీ వ్యక్తి, అతని యజమాని లండనులో ఉన్నాడట ఇతణ్ణి నౌఖిరీకి బొంబాయి నుంచి తీసుకుపోతున్నాడట ఇద్దరు సిక్ఖులు లండనులో బట్టల వ్యాపారం అక్కడ కంట్రోలు ఉంది గాబట్టి అక్కడే కూపన్లమీద బట్టలు కొని నల్లబజారులో లాభానికి అమ్ముతారట మిగిలిన రెండు సీట్లు ఖాళీ, నా పక్కమీద వేసిన దుప్పట్లు, తలగళ్ళు తువాళ్ళు ఓడవారివే మనిషికొక కప్పు గ్లాసు ఇచ్చారు ఆకేబిన్‌లోనే వేడినీళ్ళు, చన్నీళ్ళు వచ్చే ఏర్పాటున్న రెండు బేసిన్‌లు, మూడు అద్దాలు, రెండు కుర్చీలు చాలా సదుపాయంగాను, హాయిగాను ఉంది ఆ సముద్రాన్ని చూస్తుంటే అంత నీలపునీరు ఇంతకు ముందు ఎప్పుడూ చూడలేదు అనిపించింది ఆ రంగు చాలా హాయిగా ఉంది అంతా బార్ వద్ద నిలబడి బీర్ త్రాగుతున్నారు టీ, భోజనాలు కంపెనీ వారు ఉచితంగా ఇస్తారు వాటి ఖర్చు టిక్కెట్టులో తీసుకుంటారు కాని బీరు విస్కీ మొదలైన పానీయాలకు ప్రయాణీకులు డబ్బు ఇచ్చుకోవాలి

చాలామంది డెక్‌మీద పడక కుర్చీలలో పడుకున్నారు పిల్లలు నానా అల్లరి ఆడవాళ్ళు అప్పుడే రెండేసి వేషాలు మార్చారు విచిత్రమైన అలంకారాలు,దుస్తులతో పెరేడ్ చేస్తున్నట్టు తిరుగుతున్నారు మధ్యమధ్య మైక్ మీద ఏదోచెబుతున్నారు వాళ్ళు చెప్పేది అర్థం చేసుకోవడం కష్టంగా ఉంది ఓడలో కూర్చుంటే ఏదో ఊళ్లో ఉన్నట్టే ఉంది ఎటుప్రక్క చూచినా

సముద్రమే చాలా హాయిగా ఉంది ఓడ టిక్కెట్టు 67 పౌండ్లు ఇచ్చినా ఓడ చూస్తేనే కడుపు నిండింది ఎవరితోనూ మాట్లాడ బుద్ధివేయలేదు ఎవరి ప్రమేయంలో వాళ్ళున్నారు ఒక బెంగాలీ పెద్దమనిషి హార్మోనియం తెచ్చుకున్నాడు దాని మీద అందరికీ సంగీతం వినిపిస్తున్నాడు

ఓడ చాలా సాఫీగా వెళుతోంది సముద్రం నిశ్చలంగా ఒక పెద్ద సరస్సులా ఉంది ఐదవ రోజుతెల్లవారుఝామున గం 3 50 కి ఎవరో వచ్చి ఏడెన్ వచ్చాం అన్నారు బైటకు వచ్చి చూస్తే ఒక కొండ, దీపాల వరుస కనుపించాయి తెల్లవారి గం 5 30 ఓడ ఏడెన్ రేవుకి చేరింది సూర్యోదయం చూడ్డానికి అందంగా ఉంది ఓడ రేవులో సాయంకాలం 4గంటల వరకు ఉంటుంది కాబట్టి బైటకు వెళ్లాలనుకునేవారు తిరిగి 3 గంటలకు వచ్చేయాలన్నారు చిన్న పడవలు అనేకం వచ్చాయి వాళ్లు రకరకాల వస్తువులు అమ్ముతున్నారు వారంతా అరబ్బులు ఒక పడవవాణ్ణి అడిగితే ఏడెన్ జనాభా 80 వేలు అని, కొద్దిమంది హిందువులు పార్సీలు తప్ప మిగిలినవారంతా అరబ్బులే అని చెప్పాడు ఇండియా స్వాతంత్ర్యదేశం అయినా తమ దేశంలో ఇంకా బ్రిటిష్ పాలన సాగుతోందని, తాము వలస దేశం అని బ్రిటిష్ పాలన యెడల తన వైముఖ్యాన్ని చూపించాడు

9 గంటలకు నేను, భాటియా, శర్మ, చక్రవర్తి, డాక్టరు కలిసి బోటులో ఒడ్డుకు వెళ్లాం ఒక టాక్సీలో ఎక్కి పోస్టాఫీసుకు వెళ్లి ఉత్తరాలు పోస్టు చేసి పట్టణం చూద్దామని బయలుదేరాం టాక్సీ డ్రైవరు మమ్మల్ని బజారుకి తీసుకువెళ్లి అక్కడే తిరగండి, రెండు గంటల తరువాత వచ్చి ఓడవద్దకు తీసుకుపోతానన్నాడు ఊరు చూపించమన్నాం చూపించడానికి ఏమీ లేదేమో మరి ఆ డ్రైవరు డాక్టర్ని నానా మాటలు అన్నాడు నీవు చెడ్డవాడివి, నీతల బద్దలు కొడతాను, బలవంతంగానైనా నా డబ్బులు పుచ్చుకుంటానని పెద్ద గొడవ శర్మ మేమూ నీతలపగులగొడతామన్నాడు అందరూ అరబ్బులే చివరకు ఐదుగురికి 10 షిల్లింగులు ఇచ్చి వాణ్ణి వదలించుకొని బజారులో తిరిగాం

లెట్రిన్ కోసం ఒక మగ్గు కొన్నాను సరకులు అన్నీ చాలా చౌక శర్మ ఒక పుచ్చకాయ కొన్నాడు ఏడెన్ చాలా చిన్న పట్టణం అనిపించింది కొండల మధ్య ఉంది ఊరు ప్రజలు చాలా పేదవాళ్లుగా కనిపించారు తిరిగి తిరిగి మరొక టాక్సీలో ఓడ వద్దకు చేరాం ఏడెన్‌లో అప్పటికి మన రూపాయలు చెల్లుతున్నాయి ఏప్రిల్ ఆఖరితో వాటిని తీసివేసి పౌన్లు పెడతారట టాక్సీడ్రైవరు అరబ్బు బ్రిటిష్ వాళ్ల పరిపాలన పోవాలని, యూదుల్ని చావగొట్టాలని, బొంబాయికంటే ఏడెన్‌లో మంచి తిండి దొరుకుతుందని

సౌకర్యాలు హెచ్చు అని బడాయిపోయాడు; ఏడెన్‌లో మాట్లాడే ఇంగ్లీషు చాలా చిత్రంగా ఉంది ఏదో ఏడెన్ అందం చెప్పడమే గాని మాకు చూడ్డానికి ఏమీ కనిపించలేదు అడముఖాలు అసలే కనిపించలేదు తిరిగి ఓడలోకి చేరేసరికి గం 12 45 అయింది మొదటి సిట్టింగ్ భోజనానికి ఆలస్యమయింది రెండవ సిట్టింగ్‌లో టేబిల్ నిండిపోయింది కాబట్టి భోజనం పెట్టడానికి వీలు లేదన్నాడు భోజనం లేకుండా పడుకున్నాను

సాయంకాలం గం 4 30 కి భారతీయుల నూతన సంవత్సర సందర్భంగా భారతీయ ప్రయాణీకులకందరికీ టీ పార్టీ అన్నారు టీ పార్టీలో సాండ్‌విచెస్, బన్ను, పేరా, ఐస్‌క్రీం, టీ పార్టీ బాగానే జరిగింది టీ పార్టీకి వచ్చిన పార్శీ పెద్దమనిషి పేరాను చూచి అది ఏవిటి అన్నాడు పార్శీలు పాశ్చాత్యులను అనుకరించడం చూచి మేమంతా నవ్వుకున్నాం 4 గంటలకు బయలుదేరవలసిన ఓడ 6 గంటలకు కాని కదలలేదు

కలకత్తాలో 20 ఏళ్ల నుంచి క్రైస్తవ మిషనరీగా ఉన్న ఒక పెద్దమనిషితో మాట్లాడుతూ కూర్చున్నాను ఇంగ్లీషు వాళ్లలో కూడా అన్ని జాతులలోలాగే మంచివాళ్లు చెడ్డవాళ్లు ఉంటారని జాగ్రత్త చెప్పాడు మన అదృష్టం బాగుండి మనకు మంచి వాళ్లతో పరిచయం కలిగితే ఆ దేశం అంతా మంచిదే అనుకుంటాం దురదృష్టవశాత్తు ఆ దేశంలో మనకు చెడ్డవాళ్లు తారసపడితే ఆ దేశం అంతా చెడ్డదే అనుకుంటాం కాని సాధ్యమైనంత వరకు మన వ్యక్తిగత అనుభవాల్ని బట్టి ఒక దేశం యొక్క మంచిచెడ్డలు నిర్ణయించకూడదు అన్నాడు ఆయన చెప్పినదంతా శ్రద్ధగా విన్నాను దానిలోని నిజం తెలియడానికి కొన్ని సంవత్సరాలు పట్టింది

రాత్రి గం 8 30 సినిమా హాలులో నూతన సంవత్సర కార్యక్రమం నిజానికి అది భారతదేశంలో ఏ రాష్ట్రం వారి నూతన సంవత్సరమో ఎవరూ చెప్పలేదు అయినా ఆనాటి కార్యక్రమం చక్కగా జరిగింది భారతీయ ప్రయాణీకులంతా వచ్చారు చాలామంది ఆంగ్లేయులు కూడా వచ్చారు మిత్రుడు శర్మ భజన ఒక పార్సీ అమ్మాయి పియానోవాద్యం నేపాలీ రాకుమారి సినిమా తారల్ని అనుకరణ చేసింది శ్రీమతి మీనన్ అందమైన హిందీ పాట అహమ్మద్ ఉర్దూ కవిత మరొకతడి పిచ్చి ఫిడేలు వాద్యం ఇద్దరు పిల్లల భరతనాట్యం జనగణమన చక్కగా ఏర్పాటు చేసారు మధ్య భారతమాత ఆమెకు ఇరుప్రక్కలా ఐదేసిమంది అమ్మాయిలు దీపాలతో నిలబడ్డారు చాలా బాగుంది ఏ విధమైన సదుపాయాలు లేకపోయినా చాలా చక్కటి కార్యక్రమం ఏర్పాటు చేసినందుకు అంతా హర్షించారు

తెల్లవారి లేచేసరికి సముద్రం కల్లోలంగా ఉంది ఓడ అటూ ఇటూ

జోగుతోంది ఎర్ర సముద్రంలో ప్రవేశించామన్నారు కాని తేడా ఏమీ కనుపించలేదు మహాసముద్రానికి వివిధ ప్రదేశాలలో వివిధ పేర్లు పెట్టి ప్రజలు తమ వెర్రిని వెల్లడించుకుంటున్నారు తప్ప మరేమీ లేదనిపించింది ఆ సాయంకాలం సినిమా చూసాను చూచినదే అయినా ఓడలో వెళుతూ చూస్తే బాగానే ఉంది ఏప్రిల్ ఒకటవ తేదీ గాలి కొంచెం చల్లబడింది అంతా స్వెట్టర్లు తీసారు డెక్ ఖాళీ అయిపోయింది చల్లటిగాలి మూలంగా బట్టలు ఉతుక్కుని ఇస్త్రీ చేసుకోవడం పరిపాటి అయింది ఉద్యోగం దొరక్కపోతే లాండ్రీ పెట్టుకుని బ్రతకడానికి తగినంత నేర్పరితనం సంపాదిస్తున్నానని మిత్రులు వేళాకోళం చేస్తున్నారు ఇక మాతో ఉన్న సర్దార్జీ వ్యవహారానికి కావలసిన కొన్ని ముఖ్యమైన ఇంగ్లీషు మాటలు హిందుస్తానీలో వ్రాసుకుంటాను చెప్పమంటున్నాడు

తెల్లవారేసరికి రెండు ప్రక్కలా కొండల వరుసలు కనిపించాయి ఒక సన్నటి గల్ఫ్‌లో నుంచి వెళుతున్నామని ఊహించాం సూయజ్ కాలువ వద్దకు మధ్యాహ్నానికి కాని చేరమంటున్నారు పెద్దలు ఆరోగ్యం చెడింది వరుసగా నాలుగు విరోచనాలు కడుపులో నొప్పి ఏడెన్ నీళ్ళు మంచివి కావంటున్నారు అంతా అందరికీ కడుపు నొప్పి, విరేచనాలు ఉపవాసం మధ్యాహ్నం 3 గంటలకు ఓడ సూయజ్ కాలువ వద్దకు చేరింది

ఓడ సూయజ్ కాలువ వద్దకు చేరినదనే సరికి ఓడలోని ప్రయాణీకులు యావన్మందీ బైటకు వచ్చి చూస్తున్నారు అక్కడ అనేక ఓడలు నిలబడి ఉన్నాయి అనేక ఓడలు వరుసగా అటుప్రక్క నుండి వస్తున్నాయి రెండు ప్రక్కలా అనేక కొండల వరుసలు కనుపిస్తున్నాయి అక్కడ ఓడ మూడు గంటలు నిలబడి పోయింది వస్తువులు అమ్మడానికి వచ్చినవాళ్లు ముత్యాలు, అనేక రకాల తోలు సామాన్లు తెచ్చారు సూర్యాస్తమయం కావడంతో పోర్టు అధికారులు ఓడ ముందు పెద్ద హెడ్‌లైట్ తగిలించారు ఓడ ఆరు గంటలకు బయలుదేరింది గాలి చలి చలిగా ఉంది అయినా ఓడ సూయజ్‌లో ప్రవేశించడం చూస్తూ ముందు భాగంలో నిలబడ్డాను సూయజ్‌లోనికి ప్రవేశించడానికి ముందు ఎడమ ప్రక్కగా ఒక స్మారక స్తంభం వంటిది ఉంది దాని ముందు రెండు పులుల బొమ్మలు ఉన్నాయి కొంతదూరం చక్కటి ఇళ్లు కనిపించాయి కాలువకు రెండు ప్రక్కలా చక్కటి రోడ్డు, రైల్వే లైనుకూడా ఉన్నాయి సూయజ్ నుంచి ఈజిప్టు దేశానికి ముఖ్య పట్టణమైన కెయిరో వరకు రైలు ఉందట పూర్వం ప్రయాణీకులు సూయజ్ వద్ద ఓడ దిగి రైలులో కెయిరో వెళ్లి పిరమిడ్స్ చూచి కారులో పోర్టు సెయిడ్ వచ్చి ఓడ ఎక్కేవారట పిరమిడ్స్ చూచే అవకాశం లేకపోవడం దురదృష్టం అనిపించింది

ఓడ నడుస్తున్నట్టే లేదు గంటకు 8 మైళ్ళ వేగంతో వెళ్తుందన్నారు ఇరుప్రక్కలా ఇసుక ఒడ్డు ఓడ వేగంగా వెళితే ఒడ్డు తెగిపోతుందని భయం అందుమూలంగా నీళ్లు హెచ్చుగా కదలకుండా ఓడ నడుస్తోంది సూయజ్ కాలువ మాత్రం చాలా సన్నగా ఉన్నట్టు అనిపించింది రెండు ఓడలు ఒకేసారి వెళ్ళడానికి జాగా లేదు కాలువలో యిరుప్రక్కలా ఎరుపు ఆకుపచ్చ దీపాలు పెట్టారు ఓడ ఆ రెండిటి మధ్య నడవాలి దారిలో అక్కడక్కడ ఒకటి అర ఓడలు కట్టివేసి ఉన్నాయి అవి దీపాలకు అవతలిగా ఉన్నాయి కాబట్టి బాధ లేకపోయింది ఒక ప్రక్క ఆయిల్ కంపెనీల దీపాలు, దూరంగా రైళ్ల నడుస్తున్నాయి ఎడమ ప్రక్క నైలు నది వరదనీరు కుడిప్రక్క అంతా ఎడారి ఎర్రసముద్రం మధ్యధరా సముద్రాలనుకలుపుతూ సూయజ్ కాలువను త్రవ్విన ఫ్రెంచి ఇంజినీరు ఫెర్డినాండ్ డిలెప్ తెలివితేటలకు, సామర్థ్యానికి జోహారులర్పించాలి

ఫెర్డినాండ్ సూయజ్ కాలువను త్రవ్వక పూర్వం నౌకలు అన్నీ ఆఫ్రికా ఖండాన్ని చుట్టి కేప్ ఆఫ్ గుడ్ హోప్ మీదుగా ప్రయాణం చేసేవి సూయజ్ నౌకాయానానికి వరప్రసాదం ఫెర్డినాండ్ డిలెప్‌కి ఎర్రసముద్రం మధ్యధరా సముద్రం కలపాలనే బ్రహ్మాండమైన ఆలోచన1854 లోనే వచ్చింది కాలువ త్రవ్వడానికి అనుమతి అతడికి జనవరి 5, 1856 లో లభించింది 25, ఏప్రిల్ 1859 లో కాలువ త్రవ్వకం పని ప్రారంభించారు సూయజ్ కాలువ త్రవ్వడానికి దాదాపు పదకొండు సంవత్సరాలు పట్టింది సూయజ్‌లో ఓడలు ప్రయాణించడం నవంబరు1869 లో ప్రారంభమైంది సూయజ్ కాలువ పొడవు 100 మీటర్లు, లోతు 9 మీటర్లు కాల్వ దిగువ వెడల్పు 80 మీటర్లు ఓడలోని ప్రయాణీకులు ఓడ పది గంటలలో సూయజ్ కాలువ దాటుతుందన్నారు కాని మరునటి రోజు నిద్ర లేచి బైటకు చూస్తే యింకా ఓడ సూయజ్ కాలువలోనే ఉంది చిత్రం ఏమిటంటే 1886 లో సూయజ్ దాటడానికి ఓడలకు 36 గంటలు పట్టేది 1927 నాటికి ఆ సమయాన్ని 15 గంటల 6 నిమిషాలకు తగ్గించగలిగారు కాలువలో ఓడలు గంటకు 12 కిలోమీటర్ల వేగం కంటే హెచ్చుగా వెళ్లకూడదు మా ఓడ ఉదయం 8గంటలకు పోర్టు సెయిడ్ చేరింది

వందల కొలది పడవల మీద అనేక వస్తువులు అమ్మడానికి తెచ్చారు తాడుకు బుట్టకట్టి ఆ తాడు పైకి విసురుతాడు అది మనం పైకి లాక్కోవాలి సగం త్రాడు వానివద్ద సగం మన వద్ద మధ్య బుట్ట ఆ పద్ధతి చాలా ఆసక్తికరంగా ఉంది ఏడెన్‌లో సిల్కు, పోర్టు సెయిడ్‌లో చర్మంతో చేసిన వస్తువులు వార్తాపత్రికలు అమ్మేవారు ఓడలోకే వచ్చారు ఈజిప్టు గెజెట్ అనే

పత్రిక కొన్నాను భారతదేశం వార్తలే లేవు దేశ వార్తలు తెలియక వెర్రిగా ఉంది ఓడలో చెప్పే ప్రపంచ వార్తలలో కూడా భారతదేశం మాటలేదు పోర్టుసెయిడ్ రేవు అంతా అనేక దేశాలకు చెందిన ఓడలతో నిండిపోయి ఉంది ఉదయం 9 30 అయింది బైటకు వెళ్లడానికి అనుమతించరేమో అనుకుంటున్నారు అంతా అంతలో బైటకు వెళ్లడానికి అనుమతి ఇస్తూ ప్రయాణీకులు అంతా ఒంటిగంటకు తిరిగి రావాలని మైక్‌లో చెప్పారు అంతే వెంటనే ఈజిప్టు ప్రభుత్వం ఎమిగ్రేషన్ అధికారులతో మా పాస్‌పోర్టులమీద వారి దేశంలో ప్రవేశించినట్టు ముద్ర వేయించుకుని ఓడలోంచి బైట పడ్డాం

నేను, శర్మ, భాటియా, చక్రవర్తి పట్టణం చూడ్డానికి బయలుదేరాం ఎందుకైనా మంచిదని ఒక గైడ్‌ని తీసుకున్నాం పోర్టుసెయిడ్ పట్టణం సూయజ్ కాలువతో పాటు వచ్చినదన్నాడు వీధులు దిద్ది తీర్చినట్టున్నాయి షాపులు కూడా చాలా అందంగా ఉన్నాయి అంతా పరిశుభ్రంగా ఉంది ప్రజలంతా చాలా ఆరోగ్యంగాను, అందం గాను ఉన్నారు చాలామంది సూట్లు వేసుకున్నారు కొందరు పాదాలవరకు వచ్చే అంగరఖా వంటి దుస్తులు వేసుకున్నారు ఆడవాళ్లు అందంగా ఉన్నారు వారి ఘోషా చాలా చిత్రంగా ఉంది నల్ల బురఖా నల్ల గుడ్డ ముక్కు క్రిందనుంచి కట్టుకున్నారు తల మీద గుడ్డకు ముక్కు క్రింది గుడ్డకు మధ్య నుదిటి మీద నుంచి ముక్కు వరకు ఒక త్రాడు దానికి ఒక బంగారు గొట్టం వేయబడి ఉంది అంత మాత్రమే కనిపించినా వారు అందంగా వున్నారు

పోర్టుసెయిడ్ ఏడెన్ అంత అసహ్యంగా గాని, పేదగాగాని, చెడుగాగాని కనుపించలేదు కాని పోర్టుసెయిడ్ మధ్య ప్రాచ్యం యొక్క నిజస్వరూపం కాదనిపించింది పేదరికంలో మునిగి తేలే మధ్య ప్రాచ్యంలో అంత చక్కటి పట్టణం ఉండటానికి కారణం అది రేవు పట్టణం కావడమేననిపించింది ముందు తిన్నగా పోస్టు ఆఫీసుకు వెళ్లాం అక్కడ బ్రిటిష్ డబ్బు చెల్లదన్నారు మా గైడ్ ఈజిప్టు డబ్బు ఇచ్చాడు ప్రసాద్‌కి జాబు వ్రాసాను బస్సులు వున్నాయి గుర్రపు షార్టులు సామాన్య వాహనాలు, సామానులను తీసుకువెళ్లే బళ్లను కూడా గుర్రాలే లాగుతున్నాయి అరటిపళ్లు తూచి ఇస్తానన్నాడు పౌను 6 పెన్నీలు అన్నాడు రకరకాల వస్తువులు అమ్మేవారు ప్రాణాలు తీసారు వద్దు మొర్రో అన్నా వదలరు వస్తువులన్నీ మహా ప్రియం అవి అన్నీ ఓడల మీద వచ్చేవాళ్ల కోసమే అనిపించింది

చివరకు ప్రిన్సెస్ రెస్టారెంటులో భోజనం వారం రోజుల నుంచి ఇంగ్లీషు భోజనంతో చచ్చి వున్న నోటికి వాళ్లు యిచ్చిన చపాతి, అన్నం, కబాబ్ (మాంసం, వివిధమైన కాయకూరలతో చేసిన కూర) అమృతతుల్యంగా ఉంది

అంతా భోజనం హాయిగా చేసాం అయితే నలుగురికి1పౌను 7 షిల్లింగులు బిల్లు అంటే కాస్త బాధ కలిగింది చక్కటి భోజనం తరువాత తాంబూలం వేయాలనిపించింది కాని తమలపాకులు ఉన్నట్టు కనిపించలేదు తాంబూలం అంటే ఏవిటో వాళ్లకు తెలిసేట్టు చెప్పలేకపోయాం ఇండియన్ మార్కెట్ అని ఒక చోటికి తీసుకుపోయాడు గైడ్ ధరలు అన్ని చోట్ల ఒకేలా వున్నాయి ఏమీ కొనలేదు పోర్టుకి వచ్చి గైడుని పంపివేసి ఫెర్డినాండ్ డిలెప్ విగ్రహం చూడ్డానికి వెళ్లాం కొందరు ఓడలో వెడుతూ చూడవచ్చునన్నారు కాని అతడి విగ్రహం దగ్గరగా చూడవలసినదేనని నేను బలవంతం చేసాను

సూయజ్ కాలువ త్రవ్వించిన మహాస్రష్ట ఫెర్డి నాండ్ డిలెప్ విగ్రహం దగ్గరగా చూడ్డానికి బయలుదేరాం దారిలో ఆస్ట్రేలియా న్యూజిలాండు అని ఒక స్మారక విగ్రహం ఉంది రెండుగుర్రాలు, రౌతులు, ఒక గుర్రం పడిపోతున్నట్టు ఆ ప్రక్కనే రౌతు కాచుకున్నట్టు ఉంది ఒక సన్నటి దారి ఫెర్డినాండ్ విగ్రహం వద్దకు తీసుకు వెళుతుంది కాలువ ప్రక్క పల్లెకారులు పడవలలో తెచ్చిన చేపలు అమ్ముతున్నారు అక్కడ బోలెడు గొడవ 12 గంటలు అయింది విగ్రహం వద్దకు చేరాం

ఫెర్డినాండ్ విగ్రహం సూయజ్ కాలువకు ఎదురుగా ఉంది ఒకప్రక్క సూయజ్ కాలువ కొంచెం ముందుగా మధ్యధరా సముద్రం ఫెర్డినాండ్ తాను సాధించిన విజయాన్ని సగర్వంగా ప్రపంచానికి చూపెడుతున్నట్టు ఒక చేతితో సూయజ్ వైపు చూపెడుతూ, రెండవచేతిలో ఛార్టర్ పట్టుకుని నిలబడ్డాడు ఆ విగ్రహం చాలా పెద్దది దూరంగా వెళ్ళి పూర్తి విగ్రహాన్ని చూడవలసి వచ్చింది పెద్ద మీసాలు చక్కటి విగ్రహం ఆ విగ్రహం దిగువన ఆయన పేరు చెక్కారు నా హృదయం ఆనందంతో నిండిపోయింది చేయెత్తి నమస్కరించాలనిపించింది మనస్సులో ఆయనకు వేయి నమస్కారాలు చేసి ఆనందంగా ఓడ వద్దకు వచ్చేసాం

గం 1-20 కి బయలుదేరవలసిన ఓడ మూడు గంటలకు బయలుదేరింది ఓడలో నుంచే అనేకమంది ఫెర్డినాండ్ విగ్రహం ఫొటోలు తీస్తున్నారు పోర్టు సెయిడ్ వద్ద ప్రయాణీకులకు అమ్మడానికి చిన్న పడవలలో అనేక సరుకులు తెచ్చినవాళ్లు ప్రయాణీకులు కొనకపోయినా, బేరం కుదరకపోయినా పచ్చి బూతులు ఇంగ్లీషులో తిడుతున్నారు అసహ్యంగాను, అసభ్యంగాను తయారయింది మిత్రులంతా ఏవేవో పిచ్చిగా కొన్నారు గోపాల కృష్ణ కేబిన్‌కి తీసుకువెళ్ళి తాను కొన్నవి చూపించాడు అంతా ట్రావెలర్ చెక్కులు మారుస్తున్నారు నేను మార్చిన పౌను తప్ప నావద్ద ఉన్న ఐదు పౌనులేం ఖర్చు పెట్టలేదు వాళ్ళంతా ఒళ్లుబలి సినవాళ్ళు నేను డబ్బు లేకుండా సాహస

యాత్రచేస్తున్న పేదవాణ్ణి మిత్రుల వద్ద నుంచి తెచ్చిన సొమ్ము దుబారాగా ఖర్చు పెట్టడానికి మనస్కరించలేదు

కదలిన ఓడ తిన్నగా కొంత దూరం వెళ్ళిన తరువాత సముద్రంలోకి తిరిగింది ఓడ యింకెక్కడా ఆగకుండా ఇంగ్లండు చేరుతుందన్నారు అయితే ప్రయాణంలో మాత్రం ముందుంది మొసళ్ల పండుగ అన్నారు మధ్యధరా సముద్రం అల్లకల్లోలంగా ఉంటుందట బే ఆఫ్ బిస్కి ఇంకా ఘోరం అట అంతా అన్నట్టే సాయంకాలానికి ఓడ ఊగడం మొదలుపెట్టింది రాత్రి ఒక సమయంలో సముద్రపు నీళ్ళు కేబిన్‌లోకి వచ్చేసాయి సముద్రుడు చందమామతో సరసాలాడుతున్నట్టున్నాడు ఓడ అంచులు తగిలేటంత జోరుగా ఊగిపోతోంది నిద్రలో ఆకాశానికి, పాతాళానికి మధ్య గాలిలో తేలుతున్నట్టు ఊపుతోంది తెల్లవారి లేచి చూస్తే మధ్యధరా సముద్రం దాని మజా చూపెడుతోంది సులువుగా నడవడానికి కూడా వీలులేకుండా ఉంది అనేకమందికి వాంతులు, తలతిరుగుడు కడుపులో తిప్పింది బ్రేక్‌ఫాస్ట్ చేసి వెళ్ళి సముద్రుడు చేసే హడావిడి చూస్తూ డెక్ మీద కూర్చున్నాను

ఆ పరిస్థితి చూస్తే నాలో నాకే కడుపు చెక్కలయ్యేట్టు నవ్వువచ్చింది అంతా త్రాగిన వాడు తూలినట్టు తూలుతున్నారు నీళ్ళు 'బి' డెక్ మీదకు కూడా చిమ్ముతున్నాయి అంతా 'బి' డెక్ మీద లోపల గదులలో కూర్చున్నారు ఓడ ప్రయాణం కొంచెం బాధగా ఉండడం అదే మొదలు కొందరు సముద్ర పక్షులకు ఏమీ చలనం ఉన్నట్టే లేదు సర్దారులు రమ్ముత్రాగి పడుకున్నారు డోక్కునే వాళ్ళను చూస్తే మనకు కూడా కడుపులో త్రిప్పుతుందని పైనే కూర్చున్నాను కొద్దిగా భోజనంచేసి మళ్ళా పైకి వెళ్ళి సినిమా హాలులో కూర్చున్నాను ఓడ అంతా హాయిగా వేడి చేసారు అక్కడ ఐదుగురు ఆడపిల్లలు నాటకం వేస్తాం చూడమన్నారు ఒక చిన్న డాన్సు ఒక పాట, పద్యపఠనం బాగున్నాయి అవన్నీ వాళ్లకు బడిలో నేర్పినట్టున్నారు నేను ఒక్కణ్ణే ప్రేక్షకుణ్ణి నాటకం వేయనేలేదు మధ్యాహ్నం తిరిగే సరికి సముద్రం శాంతించింది అంతాతేరుకున్నారు సాయంకాలం టేబుల్ టెన్నిస్ డెక్ టెన్నిస్ ఆట చూడ్డానికి వెళ్ళాను అంతవరకు నేను 'ఎ' డెక్ మీదకు వెళ్ళనేలేదు డెక్ టెన్నిస్ అంటే రింగ్ టెన్నిస్ ఆట అయితే రింగు రబ్బరు కాదు నార రింగు స్కూలులో చదివే రోజుల్లో ఆడిన చెయ్యే కాబట్టి కోర్టులోనికి దిగితే బాగానే నడిచింది ఆట ఆ మరుచటి రోజు కూడా రింగ్ టెన్నిస్ ఆటలో గడిచిపోయింది

మరునాడు ఉదయం లేచేసరికి సముద్రం మహా నిశ్చలంగా ఉంది ఓడ నడుస్తున్నట్టే లేదు రెండు రోజుల క్రిందట అంత హడావిడి చేసిన సముద్రం

పెద్ద చెరువులా ఉంది చలి ఎక్కువయ్యింది ఓడలోపల 'బి' డెక్ చుట్టూ ఎనిమిదిసార్లు తిరిగితే ఒక మైలు అవుతుందట అలా ఒక మైలు నడిచివెళ్ళి భోజనం చేసి బైటకు వెళ్ళాను సూర్యుడు సముద్రంలో అస్తమిస్తున్న దృశ్యం లోకాద్భుతంగా ఉంది రక్తారుణకాంతులు అన్ని ప్రక్కలా వెదజిమ్ముతూ ఏదో మునిగిపోయినట్టు ఎంతో తొందరగా వెళ్ళిపోయాడు సూర్యుడు కవిహృదయాలు కదలిపోయాయి ఏడెన్, పోర్ట్‌సెయిడ్ ఖర్చులు తేల్చుకున్నాం ఆరాత్రి సినిమా హాలులో గుర్రపు పందాలు అంటే వెళ్ళాను చిన్న చిన్న బొమ్మ గుర్రాలు, అవి పరుగెత్తవలసిన దారి ఆ దారిలో అడ్డంకులు ఏర్పాటు చేసారు ఒక్కొక్క పందెంలో ఆరు గుర్రాలు అవి నిజానికి పరుగుపెట్టవు నెంబరు వచ్చిన గుర్రాన్ని ముందు పెడతారు అయితే అక్కడ వాతావరణం, పందాలు కాయడం, ఉరకలు వేసే ఉత్సాహం వర్ణనాతీతం నాలుగు రేసులు నడిపారు నేను మొదటి రేసు చూచి మిగిలిన మూడింటిలో పందాలు కాసాను నేను పందెం కాసిన ఒక్క గుర్రం కూడా గెలవలేదు ఆ గొడవ, హడావిడితో బోలెడు కాలక్షేపం

ఇంగ్లండు దగ్గర పడుతుందన్నారు మిత్రులు, నాకు మనస్సులో దుడుకు పట్టుకుంది లండనులో ఎక్కడకు వెళ్ళడం, మకాం ఎలాగ అనేక ఆలోచనలు వచ్చాయి మిగిలిన అందరికీ బంధువులు, మిత్రులు, అంతకు ముందే ఏర్పాటు చేసుకున్న మకాం ఉన్నాయి నాకు అవేం లేవు నీవు చాలా ఒంటరి తనం అనుభవిస్తావని ఓదారుస్తున్నాడు డాక్టరు జీవితంలో అనేక సంవత్సరాలు ఒంటరిగా గడిపినవాడికి లండను పెద్ద ఇబ్బంది కాదులే అన్నాను మొదటి రెండు మూడు రోజులకు రాయల్ హోటల్‌కి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాను ఆ రాత్రి నిద్రపట్టలేదు, ఇక రెండు మూడు రోజుల్లో సౌథాంప్టన్ రేవు చేరుతున్నామన్నారు ఆ ఊహను ధృవపరుస్తూ మూడవ రోజు మధ్యాహ్నానికి సౌథాంప్టన్ రేవు చేరుతున్నామని ఆ మరునాడు ఓడ దిగుతామని, అక్కడ నుంచి లండనులోని వాటర్‌లూ స్టేషన్‌కి రైళ్ళు ఉన్నాయని మైక్ లో అధికారికంగా హెచ్చరిక వచ్చింది

క్షౌరం చేయించుకుందామని బార్బర్ షాపుకోసం ఓడ అంతా గాలించాను అయినా మొదటి ప్రయత్నంలో కనుక్కోలేకపోయాను కాని చివరకు సాధించాను ఆ బార్బరు ఆపరేషనుకి వెళ్ళే డాక్టరులాగ వేషం వేసుకున్నాడు చాలా ముసలివాడు ఇంగ్లండు ఎందుకు వెళుతున్నావు, ఏమి చదువుతావు, ఎక్కడ ఉంటావని అనేక ప్రశ్నలు వేసాడు క్రాపువేసి షాంపూ చేసినందుకు 3 షిల్లింగుల 6 పెన్నీలు పుచ్చుకున్నాడు (ఆ రోజుల్లో1షిల్లింగుకి మన పైసలు 65)ఆ ఓడలోని క్షౌరశాలలో ఉన్న ఆధునిక

పరికరాలు చూచి ఆశ్చర్యపోయాను భోజనాల తరువాత అప్పుడే అంతా అడ్రసులు తీసుకుంటున్నారు పాపం నీకు లండనులో అడ్రసు లేదని మిత్రులు హేళన చేసారు కేర్ ఆఫ్ హైడ్ పార్కు అన్నాను

ఆ మరుసటి రోజు మధ్యాహ్నాం ఓడ తీరం ప్రక్కగా వెళుతోంది పోర్చుగల్ దేశానికి ముఖ్యపట్టణం లిస్బన్ కనుపించింది కాని దూరంగా ఉండిపోయింది ఆ రాత్రి నిద్రలో ఉండగా జిబ్రాల్టర్ దాటామన్నారు దూరంలో అనేక ఓడలు కనుపిస్తున్నాయి రాత్రి సినిమాకి వెళ్ళాను వికెడ్ లేడీలో మార్గరెట్ లాక్ ఉడ్, పెట్రీషియా రాక్ చూడముచ్చటుగా ఉన్నారు సినిమాపెద్ద హాయిగా లేదు రాత్రి భోజనం చేయాలనిపించలేదు ప్రయాణం ప్రారంభం నుంచి వింటున్న బే ఆఫ్ బిస్కే రానే వచ్చింది ఓడ కెరటాలతో పాటు ఎగురుతోంది కెరటాలు ఎదురుగావస్తే ఓడ ఎగురుతుంది ప్రక్కగా వస్తే ఊగుతుంది కెరటాలు తెరలు తెరలుగా వచ్చి 'బి' డెక్ అంతా తడిపివేసాయి నీళ్ళు ఇంకా పైకి ఎగురుతున్నాయి అదిచూచి పిల్లలు పరుగులు, కేరింతలు ఓడవాళ్ళు ఇచ్చే అన్ని వినోదాలకంటే ఇది చాల బాగుందన్నాడొక పెద్దమనిషి భోజనాల శాలలోని బల్లలు, కుర్చీలు అటూయిటూ కదిలిపోకుండా గొలుసులు వేసి బిగిస్తారు అలాగే డాన్సుహాలులోని పియానో తదితర పరికరాలు దొర్లిపోకుండా గొలుసులతో బిగిస్తారు నడవడం అసాధ్యం అయిపోయింది ఒక ప్రక్కగాలి మరొక ప్రక్క ఊపువల్ల కోసుగా నడవవలసి వచ్చింది ఎవరో కొద్దిమంది తప్ప మిగిలినవారంతా కక్కుకుంటున్నారు మరుసటి రోజు సౌథాంప్టన్ చేరే వరకు అంతేనన్నారు

నేను ఢిల్లీ వదలే ముందు మిత్రుడు డా॥పి.ఎన్ చోప్రా సముద్రప్రయాణంలో వాంతులు అరికట్టడానికి ఏదో హోమియో మందుపొట్లాలు యిచ్చారు ఆయన హోమియో వైద్యం లండను లోను, అమెరికాలో బోస్టన్ లోను చదువుకున్నాడు కాబట్టి ఆయనకు ఓడ ప్రయాణ అనుభవం ఉంది నాకు ఆమందు వేసుకోవలసిన అవసరం రాలేదు మధ్యాహ్నం చొక్కాలు ఇస్త్రీ చేసుకునేటప్పుడు తల బ్రహ్మాండంగా తిరగడం ప్రారంభించింది కడుపులో తిప్పింది వాంతి రావడానికి సిద్ధం అయింది నోటిలో నీళ్లు ఊరాయి కాని ఇంత నిమ్మకాయ పచ్చడి తిని పడుకున్నాను లేచి బైటకు వెళ్ళాను ఏమీ తగ్గలేదు సుగుణం ఏమిటంటే కడుపులో ఏమీ లేదు కాబట్టి వాంతికాలేదు ఇంకా చిన్న ఓడ అయితే ఏమయ్యేదో, అంతేకాకుండా బిస్కే చాలా ప్రశాంతంగా ఉంది నిజంగా కల్లోలంగా ఉంటే అసలు ఓడలో నిలబడలేమని కొందరంటున్నారు వాళ్ళు డాబులు చెబుతున్నారనిపించింది కాని దాని దూకుడు చూస్తే నిజమేనేమో

అనిపించింది కూడాను పైనించి వచ్చి పడుకున్నాను అంతే లంచికి టీకి కూడా వెళ్ళలేదు సాయంకాలం లేచి భోజనం చేసాను ఇంకా ఓడ ఊగుతూనే ఉంది పడుకుంటే భూమ్యాకాశాల మధ్య ఊగుతున్నట్టే!!

ఏప్రిల్ 10వ తేదీ ఉదయం లేచి పెట్టెలు సర్దుకుంటూ కూర్చున్నాను ప్రయాణీకులంతా అదే గొడవలో ఉన్నారు ఆ సామానులన్నీ బైట పడేసారు వాటిని గ్యాంగ్‌వే దగ్గరకు చేర్చారు ఓడ ఇంగ్లీషు ఛానల్‌లోకి వచ్చింది భారతీయ ఓడ ఒకటి ఎదురయింది కొంతసేపు నడిచి ఆదివారం చర్చి సర్వీస్‌కు వెళ్ళాను నెమ్మదిగా ఓడ నీడిల్స్ వద్దకు చేరింది అంతా బైట నిలబడి చూస్తున్నారు అక్కడ పైలట్ పడవ వచ్చింది ఒక అధికారి ఓడలో ఎక్కారు ఓడ చాలా నెమ్మదిగా నడుస్తోంది కుడి ప్రక్క ఐల్ ఆఫ్ వైట్ అక్కడ టెన్నిసన్ స్మృతి చిహ్నం ఉందన్నారు ఆ అందమైన లాన్స్‌లో కూర్చొని ఆ మహాకవి తన కవిత్వం వ్రాసాడట ఛానల్‌కి ఇరుప్రక్కలా చాలా అందంగా ఉంది బ్రహ్మాండమైన పచ్చిక మైదానాలు సన్నగా పొడుగ్గా చెట్లు గోపురాలవంటి ఇళ్ళు సముద్రంలో నడిచే విమానాలు నీటిమీద దిగి కొంత దూరం నడచి మళ్ళా పైకి వెళుతున్నాయి ఒక ప్రక్క సముద్రపు పిట్టల విచిత్రమైన అరుపులు మబ్బుగా ఉంది చాలా చల్లటి గాలి విసురుతోంది అది ఇంగ్లీషు వాతావరణం అని చమత్కరించారు తెలిసిన పెద్దలు ఆ సముద్ర విమానాలు, పిట్టల అరుపులు మనకు స్వాగతం ఇస్తున్నాయని కవిత్వం వెళ్ళబోసాడొకయువకుడు

సాయంకాలం 3 గంటలు అయింది ఓడ సౌథాంప్టన్ రేవు వైపుకి తిరిగింది మరొక గంటలో రేవు చేరుతున్నామని హెచ్చరిక చేసారు కొద్ది దూరం వెళ్ళిన తరువాత ఓడ ఇంజన్లు ఆపేసారు దానిని రెండు చిన్న పడవలు లాగుతున్నాయి రెండు ప్రక్కలా దృశ్యం చూడ్డానికి హృదయంగమంగా ఉంది అంతలో రేవులోకి చూపిస్తూ అదిగో క్వీన్ మేరీ అంటే అదిగో క్వీన్ మేరీ అన్నారు అది 84 వేల టన్నుల బ్రహ్మాండమైన ఓడ ఆ ఓడ ఛానల్ లో నుంచి మా ఓడ వచ్చిన దారిని రాదని చుట్టు తిరిగి వస్తుందని అన్నారు మూడు గొట్టాలతో కొట్టవచ్చినట్టుంది కాని ఊహించినంత బ్రహ్మాండం అనిపించలేదు ఓసి ఇదేనా క్వీన్ మేరీ అన్నారు కాని లోపల చాలా గొప్పగా ఉంటుందని పెద్దలు ఓదార్చారు ఇంకా రేవు నిండా అనేక ఓడలు దూరం నుంచి సౌథాంప్టన్ శ్రీనగర్‌లా ఉందనిపించింది చివరకు అస్టోరియస్‌ని రేవుకి చేర్చాడు

మరుసటి రోజు ఉదయం వరకు ఓడ దిగడం ఉండదనేసరికి అంతా నిరుత్సాహ పడిపోయారు ప్రయాణీకులకు స్వాగతం చెప్పడానికి వచ్చిన

వారితో రేవు కిటకిటలాడిపోతోంది ఆ గుంపుల్ని దూరంగా ఉంచడానికి బ్రిటిషు పోలీసు అంతలో ఓడ సిబ్బందికి బైటకు వెళ్ళడానికి అనుమతి యిచ్చారు వాళ్ళంతా వేషాలు మార్చి బిలబిలలాడుతూ వెళ్ళిపోయారు అంతలో ఇంగ్లండుదేశం లోనికి అనుమతిస్తూ బ్రిటిషు అధికారులు ఇచ్చే కార్డు మీద ముద్రవేయించుకోమన్నారు తీరావెళ్లేసరికి వందలమంది క్యూ అంత శ్రమపడితే ఆ అధికారి పాస్ పోర్టులోకి కూడా చూడకుండా బ్రిటిషు సొమ్ము ఎంత ఉంది విదేశీద్రవ్యం ఏమైనా ఉందా అని అడిగి కార్డు మీద ముద్రవేసాడు ఓసి ఇంతేనా అన్నారంతా అంతలో బారత హై కమిషనరు ఆఫీసు నుంచి ఎవరో వచ్చారని మైక్‌లో చెప్పారు వెళ్ళి చూసాను ఎవరో సుందరం అని ఒక బక్కపలచటి కుర్రాడు వచ్చాడు భారత హై కమిషనులో విద్యాశాఖకు చెందినవాడట అంతకు ముందు లండనులోని ఇండియా హౌస్‌కి తెలియజేసినవాళ్ళకు తాత్కాలికంగా మకాం ఏర్పాటు చేసారట ఆ వివరాలు చెప్పాడు నా పేరు కూడా చెప్పాను మకాం విషయంలో బెంగపడవద్దన్నాడు ఆ సుందరంతో కూర్చుంటే గొప్ప కాలక్షేపం వేదాలు, కీట్స్ కవిత్వం, జిన్నా ఉపన్యాసాలు అనేకమంది కవుల రచనలు అనర్గళంగా వల్లించాడు మంచి మాటకారి విదేశవ్యవహారాలలో ఉండతగ్గవాడని పించింది ఆత్మ విధ్వంసనానికంటూ ఆరు గ్లాసుల విస్కీ త్రాగాడు అసలు మధ్యాహ్నం 12-30కి ఓడలో బార్లు అన్నీ మూసివేసారు కాని రాత్రి 8 నుంచి 10 గంటల వరకు ప్రత్యేకంగా తెరిచారు ప్రయాణీకులంతా తెగ త్రాగారు బార్లు మూసి వేయగానే సుందరం మరునాడు ఉదయం వస్తానని హోటల్‌కి వెళ్ళిపోయాడు

ఓడ రేవుకి చేరగానే రకరకాల కంపెనీవాళ్ళు ఓడ మీదికి వచ్చారు ప్రయాణీకులకు అనేక ఉత్తరాలు వచ్చాయి నాకు జాబు ఉంటుందనుకోలేదు అంతలో ఒక కుర్రసేవకుడు నాకు రెండు ఉత్తరాలు ఇచ్చాడు ఆశ్చర్యపోయాను ఒక ఉత్తరం కృష్ణమూర్తి బాబాయి వద్ద నుంచి ఆశీర్వాదాలు పంపాడు రెండవది మిత్రుడు ప్రసాద్ వ్రాసాడు అప్పటికి ప్రసాద్ విదేశాలకు వెళ్ళకపోయినా లండను అతనికి కరతలామలకం నేను ఇంగ్లండు చేరిన తరువాత కూడా ఆ దేశంలో చూడవలసిన దృశ్యాలు, తెలుసుకోవలసిన విశేషాలు చాలా వరకు ప్రసాద్ ఢిల్లీ నుంచి వ్రాసేవాడు అటువంటి పరిజ్ఞానం నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చదువుకునేటప్పుడు నా సహాధ్యాయిగా ఉండే మా 'అన్న' సీతారాముడికి ఉండేది వాడూ ఎప్పుడూ దేశం వదలి వెళ్ళలేదు కాని మాటల్లో పారిస్ పట్టణం లండను పట్టణం కళ్ళకు కట్టించేవాడు ప్రసాద్ జాబులో బందరు మిత్రుడు కూనపరెడ్డి కృష్ణారావు లండనులో ఉన్నాడని అతడి అడ్రసు తెలియజేసాడు నేను లండనులో ఉన్నంతకాలం ప్రసాద్ పంపే సలహాలు అమూల్యంగా ఉండేవి దానిని

మిత్రులు బాక్‌సీట్ డ్రైవింగ్ అని వేళాకోళం చేసేవారు

మార్చి 26 వ తేదీన బొంబాయిలో బయలు దేరిన ఓడ ఏప్రిల్ 10 వ తేదీకి ఇంగ్లండు చేరింది ఆరాత్రికి ప్రయాణీకుల్ని సౌథాంప్టన్ రేవులో ఓడలోనే ఉంచారు ఏప్రిల్ 11 వ తేదీ ఉదయం గం 4-30 కే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకున్నాను గం 6-30 అయ్యేసరికి బ్రేక్‌ఫాస్ట్ పూర్తి చేసి గ్యాంగ్‌వే వద్దకు వచ్చి నిలబడ్డాం అంతా ఎవరి ఆలోచనల్లో వారు ఉన్నారు చాలా మందికి విదేశాలకు వెళ్ళడం అది ప్రథమ అనుభవం ఊహలు ఆలోచనలు, భవిష్యత్తును గూర్చిన బంగారు కలలు, వర్తమానానికి సంబంధించిన సమస్యలు ఓడ దిగడానికి అక్కడ నిలబడ్డవారి అందరి ముఖాల్లోను కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి మిత్రుడు భాటియా లండనులో ఉన్న అన్నగారి వద్దనుంచి వచ్చిన జాబుగురించి ఏదో చెబుతున్నాడు వాళ్ళ అన్న 15 ఏళ్ళ క్రితం ఇంగ్లండు వెళ్ళి డాక్టరుగా అక్కడ స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు ఆ వ్యవధిలో సోదరులు ఒకరిని ఒకరు చూచుకోవడం పడలేదు వాళ్ళ అన్న వాటర్‌లూ రైలు స్టేషన్‌కి వస్తానని వ్రాసాడు కాని గుర్తు పట్టడం ఎలా? అందుమూలంగా తన కారు నెంబరు పంపి స్టేషనులో దిగిన తరువాత బైటకు వచ్చి కారు నెంబరు చూసుకోమని రాసాడు నాకు అది చిత్రంగా అనిపించింది

ఎనిమిది గంటలకు ఓడలోనుంచి ప్రయాణీకులు దిగడం ప్రారంభమైంది ...దకు దిగి ఎదురుగా ఉన్న హాలులో పడి ఉన్న సామాన్లు వెతుక్కున్నాను ...స్టమ్స్ వద్ద పని నిమిషాలమీద అయిపోయింది ఆ హాలుకి ఎదురుగా వాటర్‌లూ స్టేషన్‌కి రైలు సిద్ధంగా ఉంది సౌథాంప్టన్‌నుంచి వాటర్‌లూ స్టేషన్‌కి మూడవ తరగతి రైలు టిక్కెట్టు 16 షిల్లింగుల 2 పెన్నీలు సామాన్లు నేనే మోసుకుని రైలులో పెట్టాను మనదేశంలో రైళ్ళు బ్రిటిష్ రైల్వేల వరవడిలో తయారైనా మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చేవరకు మన రైళ్ళలో ప్రయాణీకుల సౌకర్యాలు బ్రిటిషువారి రైళ్ళతో పోలిస్తే తీసికట్టే మూడవ తరగతిలో కూడా మెత్తటి సీట్లే బొంబాయి పూనా మధ్య నడిచే దక్కన్ క్వీన్‌లో సీట్లకంటే మెత్తగాను హాయిగాను ఉన్నాయి రెండేసి సీట్లు కలిపి ఒక సీటు అలా రెండు ఎదురుబదురుగా ఉన్నాయి వాటి మధ్య టేబిల్‌లా పనిచేయడానికి చెక్క అమర్చారు ఆ రైలులో ఒక చివరనుంచి మరొక చివరవరకు ఒక పెట్టెలో నుంచి మరొక పెట్టెలోనికి వెళ్ళడానికి వీలుగా ఉంది ఆ పెట్టెలలో కొన్ని పొగ త్రాగేవారికోసం, మరికొన్ని పొగ త్రాగనివారికోసం వేరుగా ఉన్నాయి సౌథాంప్టన్‌నుంచి వాటర్లూ స్టేషన్‌కి 70 మైళ్ళ దూరం ప్రయాణం చేయడానికి రెండు గంటలు పట్టింది రైలులో నుంచి బైటకు చూస్తే చాలా అందంగా

ఉంది. ఇంగ్లీషువారి ఇళ్ళు, అందునా పెద్దపట్టణాలకు బైట ఉన్న ఇళ్ళు లాన్స్‌తో చూడముచ్చటగా ఉన్నాయి.

రైలు వాటర్లూ స్టేషన్‌కి చేరింది. సామాన్లు పోర్టర్‌కి ఇచ్చి అతడితో బైటకి వచ్చాను. భారత హైకమిషన్ అధికారి సుందరం రాయల్‌హోటల్‌కి ఫోను చేయించాడు. టాక్సీలో ఎక్కి తిన్నగా రాయల్ హోటల్‌కి వచ్చాను. పోర్టర్‌కి అర క్రౌన్ (రెండున్నర షిల్లింగులు) ఇచ్చాను. టాక్సీకి 3 షిల్లింగులు 6 పెన్నీలు అయింది. నాలుగు షిల్లింగులు ఇచ్చాను. ఇంగ్లండులో టాక్సీల కోసం వాహనాలు ప్రత్యేకంగా తయారుచేస్తారనిపించింది. ఆ టాక్సీ జీప్‌ని, మామూలు కారుని కలిపి చేసినట్టు ఉంది. డ్రైవరు ప్రక్క సామాన్లు పెట్టుకోవడానికి ఖాళీ స్థలం ఉంది.

స్టేషన్‌నుంచి హోటల్‌వరకు దారిలో బ్రహ్మాండమైన భవనాలు, వందలాది టాక్సీలు, బస్సులు, అంతా గొడవగానే ఉంది. దారిలో ట్రాఫిక్ ఎర్ర దీపాల ఆజ్ఞలతో ఆగిపోవడాలు ఎక్కువ అనిపించింది. రాయల్ హోటల్‌లో 2146 నెంబరు గదిలో దిగాను. మంచం, కుర్చీ, బల్ల, బీరువా, వేడినీళ్ళు చల్లటినీరు వచ్చే వాష్‌బేసిన్‌లు ఉన్నాయి. అది సామాన్యమైన హోటల్ అనిపించింది. హోటల్‌కి చేరేసరికి ఒంటిగంట అయింది. ఎంత ఖర్చు అవుతుందో ఏవిటో తెలియక లంచ్ చేయలేదు. భారత హైకమిషనుకి వెళదామని బయలు దేరాను. హోటల్ బైటకు వచ్చి కుడి చేతిమీదుగా కొద్ది దూరం నడిచాను. బొంబాయి, కలకత్తా పట్టణాలను చూసినవారికి మొదటిసారిగా వెళ్లినా లండను సుపరిచితమైన పట్టణం లాగే అనిపిస్తుంది. దారిలో పోస్టాఫీసు కనిపిస్తే లోపలకు వెళ్లాను. డా.ఖర్కానిష్, షెక్టర్ కనిపించారు. వాళ్ళతో ఇండియా హౌస్‌కి వెళ్ళాను. అదొక బ్రహ్మాండమైన భవనం. అలవాటు లేనివాళ్ళు లోపలకు అడుగు పెట్టడానికి సందేహిస్తారు. లోపల ఎడమ ప్రక్కగా రవీంద్రనాథ్ ఠాగూర్ విగ్రహం ఉంది. సమాచారం చెప్పేచోట అడిగితే హైకమిషనర్ శ్రీ కృష్ణమీనన్ లండను చేరాడని చెప్పారు. ఇక జేబులో అడ్రసులు తీసి ఆయా ప్రదేశాలకు వెళ్ళడానికి దారులు అడుగుతున్నాను ఒక పెద్దమనిషిని. ప్రసాద్ వ్రాసిన కూనపరెడ్డి కృష్ణారావు అడ్రసు తీసి నెంబరు 5 టావిటన్ వీధి ఎక్కడ అని అడిగాను. ఆ ఇంట్లో ఉండే డాక్టర్ శర్మ ఇక్కడే ఉండాలే అన్నాడు ఆ పెద్దమనిషి. అతడు పైకి వెళ్లాడు. క్రిందకు వచ్చేవరకు కూర్చుని ఆయన్ని నిలబెట్టి కృష్ణారావుని ఎరుగుదువా అని అడిగాను. "మేమంతా కలిసి ఒకే ఇంట్లో ఉంటున్నా" మన్నాడుడా|| శర్మ. ఆ ఇల్లు చూపించమన్నాను. ఆయన, నేను కలిసి 5, టావిటన్ వీధికి బయలు దేరాం.

డా॥ శర్మ ఢిల్లీవాలా పసిపిల్లల జబ్బుల వైద్యంలో ప్రావీణ్యతకోసం లండను వచ్చాడు తల ముగ్గుబుట్ట పెద్దమనిషి తరహాగా ఉన్నాడు ఢిల్లీ విశేషాలు కాశ్మీర్ రాజకీయాలు అనేకం అడిగాడు వాళ్ళు ఉంటున్న ఇంటికి చేరేసరికి మిత్రుడు కూనపరెడ్డి కృష్ణారావు ఇంట్లోనే ఉన్నాడు నన్ను లండనులో చూసి ఆశ్చర్యపోయాడు అది తన జీవితంలో మరువలేని ఆశ్చర్యం అన్నాడు అనేక ప్రశ్నలు వేసాడు బందర్లో ఎరిగి ఉన్న కృష్ణారావుని లండనులో చూస్తే మనిషి చాలా మారినట్లు కనిపించాడు అక్కడ కూర్చుని కబుర్లాడుతుండగా దార్ అని మరొక కాశ్మీర్ మిత్రుడు వచ్చాడు అతడు బారిస్టర్ ఎట్ లా చదువుతున్నాడట ఆడపిల్లల ప్రమేయం ఎక్కువయిపోయి చదువు సాగడంలేదట సరదా కబుర్లు హోటల్‌లో ఎంతోకాలం ఉండడం సాధ్యం కాదు కాబట్టి తాము ఉంటున్న ఇంటికి మకాం మార్చమన్నారు గది ఖాళీగా ఉందని తెలుసుకుని మకాం మార్చాను ఆ రాత్రి ఎవరో అమ్మాయితో కార్యక్రమం ఉందని కృష్ణారావు వెళ్లిపోయాడు నేను, శర్మ, దార్ కలిసి అపోలో థియేటర్‌కి వెళ్ళి "Best Years of Your Life" అనే నాటకం చూసాం టిక్కెట్టు 7షిల్లింగుల 6 పెన్నీలట సీటు ఎక్కడో కొండంత ఎత్తున ఉంది ఆ అంతస్తు పైన ఇంకా రెండు అంతస్తులు ఉన్నాయట ఆ స్టేజి స్వాతు చాలా బాగుంది ఆ ప్రదేశాన్ని వెస్ట్ ఎండ్ అంటారని మిత్రులు చెప్పారు లండనులో నాటకాలకు ఉన్న ప్రజాదరణ అపారం అని లండనులో అడుగుపెట్టిన మొదటిరోజున వెస్ట్ ఎండ్‌లో నాటకం చూడగలగడం చాలా అదృష్టం అన్నారు మిత్రులు

నాటకం హాలునుంచి బైటకు వచ్చిన తరువాత ట్యూబ్ ట్రెయిన్‌లో తీసుకువెళతామన్నారు ఎడతెరిపి లేకుండా తిరిగే మెట్లతో క్రిందకు వెళుతున్న ఎస్కలేటర్లమీద మొదటిసారిగా కాలుపెట్టడం అందరికీ సులువు కాదు భూగర్భ రైల్వే స్టేషన్ నన్ను చాలా ఆకర్షించింది లండనులో ట్యూబ్ ట్రెయిన్‌లో ప్రయాణం చేయడం అంత హాయి మరొకటి లేదని మిత్రులు శర్మ, ధార్ బోధించారు ఎక్కడికైనా అనుకున్న సమయానికి వెళ్లాలంటే టాక్సీలు, బస్సులకంటే ట్యూబ్ ట్రెయిన్స్ చాలా సదుపాయం అన్నారు స్టేషన్‌లో దిగగానే రైలు తలుపులు వాటంతటవే తెరుచుకోవడం మళ్ళా అవే మూసుకోవడం చిత్రం అనిపించింది ముగ్గురం కలిసి నూర్జహాన్ అనే ఒక చౌకబారు ఇండియన్ రెస్టారెంటుకి వెళ్లాం రొట్టెలు, అన్నం పెట్టాడు బిల్లు ఎంత అయిందో నాకు తెలియలేదు గాని వారానికి ఒకసారి కూడా అటువంటి భోజనం చేయడానికి మన స్తోమత చాలదన్నారు ఆ హోటల్‌లో ఇద్దరు భారతీయులు ఇద్దరు ఇంగ్లీషు అమ్మాయిలతో భోజనం చేస్తున్నారు మొదటిసారి చూడ్డం వల్ల కాబోలు ఆశ్చర్యమనిపించింది రాత్రి 11 గంటలకు

ఇంటికి చేరాం గుమ్మంలో కూనపరెడ్డి కృష్ణారావు ఒక అమ్మాయితో కనిపించాడు అమెను దిగబెట్టి వస్తానని వెళ్లాడు లండను చేరినరోజునే అనుకోకుండా తటస్థపడ్డ మిత్రుల పుణ్యమా అంటూ ఆనందంగా హాయిగా లండనుతో పరిచయం అయింది

టావిటన్ వీధిలో 5 వ నెంబరు ఇంటి యజమానురాలు శ్రీమతి టిటర్‌టన్ చాలా ముసలావిడ సన్నగా పొడుగ్గా ఉంది నవ్వుతూ మాట్లాడుతుంది ఆ ఇంట్లో గదికి, బ్రేక్‌ఫాస్టుకి వారానికి మూడు గినీలు (మూడు పౌన్ల మూడు షిల్లింగులు మన డబ్బు 42 రూపాయలు అప్పటి విదేశమారకం విలువ ప్రకారం) బ్రేక్‌ఫాస్టు వద్ద కబుర్లతో 12 అయింది పికటల్లీ సర్కస్‌కి వెళ్ళి అమెరికన్ ఎక్స్‌ప్రెస్ ఆఫీసులో ఏడు పౌన్లు మార్చుకున్నాను పికడల్లీ సర్కస్ అంటే మనం ఎరుగున్న సర్కస్‌కాదు ఢిల్లీలో కన్నాట్ సర్కస్‌లాగ లండనులో పికడల్లీ సర్కస్ ఆ ప్రదేశం పేరు చాలా ఖరీదైన షాపులతో మంచి రద్దీగా ఉండే కేంద్రం లంచ్‌కి లయన్సు కార్నర్ హౌస్‌కి వెళ్ళాను ఈ కార్నర్ హౌస్‌లు లండనులో అనేక ముఖ్య ప్రదేశాలలో ఉన్నాయి అక్కడ భోజనం ఇతర రెస్టారెంట్లతో పోలిస్తే చౌక అంతే కాకుండా ఇంకా చౌకగా భోజనం చేయాలంటే మనం స్వయంగా వడ్డించుకునే సెక్షన్‌కి వెళ్ళవచ్చు అప్పుడే పౌన్లు మార్చాను కాబట్టి వెయిటర్ ఉన్న సెక్షన్‌లో కూర్చుని భోజనం చేసాను భోజనం అంటే మన అన్నం కూరలు కాదు ఇంగ్లీషు భోజనం సూపు, చేపతోగాని మాంసంతో గాని తయారు చేసిన ఒక పదార్థం, స్వీటు అది చౌక భోజనం ఖరీదైన భోజనాలకు ఖరీదైన రెస్టారెంట్లు ఉన్నాయి కాని అవి నేను వెళ్ళగలిగినవి కావు లయన్సు కార్నర్‌హౌస్‌వద్ద భోజనం కోసం క్యూలో నిలబడ్డ జనసమూహాలను చూస్తే ఆశ్చర్యం అయింది మొదటిసారిగా గమనించినదేవిటంటే భోజనంతోగాని, ఆ తరువాత గాని మంచినీళ్ళు లేకపోవడం

అక్కడనుంచి ఇండియా హౌస్‌కి వెళ్ళి బారత హైకమిషనర్ శ్రీ వి కె కృష్ణమీనన్‌ని చూసాను నెహ్రూ నన్ను పరిచయం చేస్తూ వ్రాసిన జాబు చూపించాను కాని ఆయనలో ఆప్యాయత కనిపించలేదు నెహ్రూ ఉత్తరం నాకు శ్రీరామ రక్ష అనుకుని లండను వస్తే కృష్ణమీనన్ చాలా ముబావంగా మాట్లాడ్డం కొంచెం నిరుత్సాహపరిచింది చివరకు తేలినదేమంటే ఆ ఉత్తరంలో నెహ్రూ 'మైడియర్ క్రిష్ణమీనన్' అనడానికి బదులు 'మైడియర్ హైకమిషనర్' అని సంబోధించారట నెహ్రూ తన విషయంలో చూపించని ఆప్యాయత తాను నా విషయంలో ఎందుకు చూపించాలనుకున్నాడేమో! ఒక నెల రోజులు ముందు రావలసింది అని విద్యాశాఖ అధికారి కుమారి కిచ్లూ

PRIME MINISTER,
INDIA



New Delhi
March 21, 1949

My dear High Commissioner,

This is to introduce to you B S N Murti, who is going to London to study in the London School of Economics and Politics He is an M A in History from the Andhra University and has suffered considerably for his political convictions For the last three and a half years he has been working as the Assistant Secretary of the Congress Party in the Central Legislature, in charge of its research section I am glad he is going to England for further studies which he hopes will bring him in touch with Professor Laski I hope you will give him every assistance

Yours sincerely,
Jawaharlal Nehru

His Excellency
Shri V K Krishna Menon,
India House,
Aldwych,
London, W C 2

ఏద్దకు పంపించారు లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో చేరి ప్రొఫెసర్ లాస్కీ వద్ద చదువుకోవడానికి అవకాశాలు లేవంది మిస్ కిచ్లూ అప్పటికే ఆలస్యం అయిపోయిందట లండన్ యూనివర్సిటీలో చదువుకునే అవకాశాలు ఉండవచ్చును ఈస్టరు సెలవుల తరువాత కనబడమంది లండను చదువుకోసం చేసిన ఊహాలన్నీ తలక్రిందులయ్యాయి

ఇంటికి చేరేసరికి ముగ్గురు మిత్రులు డిన్నర్‌కి వెళ్లారు నేను హైడ్ పార్కు చూడ్డానికి బయలుదేరాను హైడ్ పార్కు చాలా విశాలమైన ప్రదేశం చాలా అందమైన లాన్సు బోటింగ్ సరదా ఉన్నవారికి సర్పెంటైన్ సరస్సు ఉంది ఆ పార్కుకి ఒక మూల అక్కడక్కడ చెట్లవరసలు ఉన్నాయి ఆ పార్కు అన్ని పార్కులవంటిది కాదు దానికి బ్రిటిష ప్రజాస్వామిక సంస్కృతిలో ప్రముఖ స్థానం ఉంది సాధారణంగా చీకటి పడిన తరువాత జరిగే శృంగారలీలలకు కూడా ఆ పార్కును ప్రత్యేకంగా చెప్పుకుంటారు కాని ప్రతిరోజు మద్యాహ్నం నుంచి చీకటిపడేవరకు హైడ్‌పార్కు జనంతో కిటకిటలాడుతూ ఉంటుంది నోటిదురద ఉన్న ప్రతి వ్యక్తి ఒక మెట్లు అమర్చిన బల్ల భుజాన వేసుకుని ఆ పార్కులో ఎక్కడ జనం ఉంటే అక్కడ ఆ బల్లమీద నిలబడి ఉపన్యాసం మొదలుపెడతాడు అలా ఎంతమందో అనేక విషయాలమీద ఉపన్యాసాలు చెబుతుంటారు వినేవాళ్లు నవ్వుతారు, ఆక్షేపిస్తారు, ఏడిపిస్తారు ఉపన్యాసకులు కూడా వినేవారిని దూషిస్తారు పరస్పర దూషణలు గొడవ సర్వసామాన్యం బ్రిటన్‌లో రాజకీయ నాయకులు చాలామంది హైడ్‌పార్కు వద్ద సోప్ బాక్స్ ఉపన్యాసాల ద్వారా పైకి వచ్చినవారే అది గొప్ప కాలక్షేపం బ్రిటిష్ రాజకీయాలకు హైడ్ పార్కు జీవనాడి అని చెప్పాలి

గిల్డ్‌ఫోర్డు వీధిలో ఉన్న ఇండియన్ స్టూడెంట్సు యూనియన్‌లో మన భోజనం పెడతారని విని అక్కడికి బయలుదేరాను యూస్టన్ స్టేషన్‌లో దిగి తిన్నగా వెళితే కింగ్స్ క్రాస్ వచ్చింది దారి తప్పామని మళ్ళా వెనక్కు వెళ్ళి గాలించి మొత్తం మీద ఆ జాగా కనుక్కున్నాను ఏం లాభం అప్పటికే గం 8-30 అయింది కాబట్టి భోజనం లేదన్నారు అక్కడ నుంచి పికడల్లీ లయన్సు కార్నర్ హౌస్‌కి వెళ్ళి స్వయం సర్వీసు సెక్షన్‌కి వెళ్ళాను ఒక ట్రే తీసుకుని వెళ్ళి కావలసిన పదార్థాలను తీసుకుని సొమ్ము చెల్లించి ఒక టేబిల్ మీద పెట్టుకుని తిన్నాను బాగాను ఉంది చౌకగాను ఉంది బైటకు వచ్చేసరికి వీదిలో ప్రజలు తీర్థ ప్రజలా ఉన్నారు విశేషం ఏవిటంటే పదిరోజుల క్రితం ఏప్రిల్ 2 వ తేదీనుండి రెండవ ప్రపంచ యుద్ధం తరువాత మొదటిసారిగా విద్యుత్‌పై ఆంక్షలు తొలగించారట పెద్ద పెద్ద షాపులు కళ్ళు మిరిమిట్లు గొల్పేటట్లు విద్యుదలంకారాలు చేసారు ఆ దీపాలు చూడ్డానికి ప్రజలు

తండోపతండాలుగావచ్చారు

ఆ మరునాడు ఉదయం లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌కి వెళదామని బస్సు ఎక్కాను భారత హైకమిషన్‌లో మిస్ కిచ్లూ ఆ కాలేజీలో చేరడానికి అవకాశం లేదన్నా ఆ విషయం స్వయంగా నిర్ధారణ చేసుకుందామని తాపత్రయం బస్సు దిగి కొంచెం దూరం నడిచేసరికి ఫ్లీట్ స్ట్రీట్‌లో ఉన్నాను ఆ వీధి వార్తా సంస్థలకు, దానికి సంబంధించిన అనుబంధ సంస్థలకు ఆటుపట్టు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ లండను విలేఖరి సుందర్ కబాడీని వెతుక్కుంటూ వెళ్ళాను అతడు ఆ వీధిలో అందరికీ తెలిసిన వ్యక్తి అనిపించాడు అతణ్ణి కలుసుకుని ఎక్స్‌ప్రెస్ గ్రూపు పత్రికల యజమాని శ్రీ రామనాధ గోయంకా ఇచ్చిన ఉత్తరం చూపించాను ఆ రోజుల్లో శ్రీ గోయంకా మన పార్లమెంటులో కాంగ్రెసు సభ్యుడు పార్లమెంటు కాంగ్రెసు పార్టీ ఆఫీసులో పనిచేసేవాణ్ణి కాబట్టి ఆయనకు నేనంటే అభిమానం లండను వెళుతున్నావు కాబట్టి అక్కడ కబాడీని కలుసుకోమని గోయంకా ఉత్తరం ఇచ్చారు మద్రాసునుంచి ప్రచురించబడే 'స్వతంత్ర' వారపత్రిక సంపాదకుడు శ్రీ ఖాసా సుబ్బారావు నన్ను తమ పత్రికకు లండను విలేఖరిగా నియమిస్తూ ఒక ఉత్తరం ఇచ్చారు మద్రాసులో కొత్తగా శ్రీ కోటం రాజు రామారావు సంపాదకత్వంలో ప్రారంభమైన ఇంగ్లీషు దినపత్రిక 'ఇండియన్ రిపబ్లిక్' కి లండను ప్రతినిధిగా నియమిస్తూ వారు ఒక ఉత్తరం ఇచ్చారు గోయంకా ఉత్తరం చూసి భారతీయులకు పరిచయలేఖ లెందుకులెండి అన్నాడు సుందర కబాడి హిందూస్తాన్ స్టాండర్డ్ పేపరు ప్రత్యేక విలేఖరి తారాబాను కూడా అక్కడే ఉన్నాడు అంతలో హిందూ ప్రత్యేక విలేఖరి డాక్టర్ షెల్వాంకర్ వచ్చాడు కాస్సేపు ఇండియా కబుర్లు లండనులో భారత హైకమిషను బాగా పనిచేయడంలేదని వారి వాదం నలుగురం లంచ్‌కి వెళ్లాం పత్రికలవారికి మక్కా వలె పరిగణించబడే ఫ్లీట్ స్ట్రీట్‌లో చిన్న రెస్టారెంటులో కూర్చుని లంచ్ చేస్తుంటే బోలెడు ఆనందంగాను సంతృప్తిగాను ఉంది బ్రిటిష్ నాయకుల్ని కలుసుకుంటావా?అన్నాడు కబాడి తీరిగ్గా చూద్దాంలే అన్నాను షెల్వాంకర్ లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌కి తీసుకువెళ్లాడు వాళ్ళు ఆలస్యం అయిపోయింది కాబట్టి చేర్చుకోవడం వీలుపడదన్నారు ఇంటికి వచ్చేసాను

కృష్ణారావు బారిష్టరు పూర్తి చేసి LLM (న్యాయశాస్త్రంలో మాష్టర్స్ డిగ్రీ) కోసం థీసిస్ వ్రాస్తున్నాడు లండను యూనివర్సిటీలో ప్రొఫెసరు శ్వాషన్ బర్గర్ అతడి గైడ్ 'భారత రాజ్యాంగంలో శాసనాధికారాల పంపకం' అనే విషయం మీద థీసిస్ వ్రాస్తున్నాడు ఆ విషయం మీద కాస్సేపు చర్చించి శర్మ, కృష్ణ, నేను స్టూడెంట్సు యూనియన్‌కి భోజనానికి వెళ్లాం

భోజనం బాగానే ఉంది ఐతే పారిస్ వెళుతున్న శర్మ మాట్లాడే నకిలీ ఫ్రెంచి ఇంకా బాగుంది ఇంటికి చేరిన తరువాత కృష్ణ తన చేయి చూడమన్నాడు ఆ రోజుల్లో హస్త సాముద్రికం నాకు హాబీ బాగా చెప్పగలనని మిత్రులంతా అనేవారు వాళ్ళ చేతులు చూస్తూ కూర్చున్నాను

నేను లండనులో దిగిన ముహూర్తబలం ఎటువంటిదో కాని అదృష్టవశాత్తు ఒక వారం రోజులు వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది ఎండగా, వేడిగా, ఆనందంగా ఉంది సాధారణంగా లండనులో వాతావరణం చీకటిగా చలిగా, తడిగా ఉంటుంది సాయంకాలం నాలుగు గంటలకే చీకటి పడిపోతుంది ఉదయం తొమ్మిది వరకు వెలుగు రాదు ఎప్పుడూ తుంపరలు పడుతున్నట్టే ఉంటుంది బ్రిటిషు ప్రజలకు వారి వాతావరణ శాఖ చెప్పే సూచనలమీద బోలెడు నమ్మకం ఆ శాఖ వారు వర్ష సూచన అంటే గొడుగు, రెయిన్‌కోటు తీసుకువెళ్ళవలసిందే ఇక ఎండగా ఉంటుందంటే చొక్కాలు కూడా విప్పేసి సముద్రతీరానికి ప్రయాణం పట్టణంలో పార్కుల్ని నింపివేస్తారు మామూలుగా లండను పౌరులు ప్రకాశవంతమైన సూర్యరశ్మికి మొహం వాచి ఉంటారు మంచి ఎండ కాచిన రోజున వారికి పండగ చిత్రం ఏమిటంటే ఆ సంవత్సరం ఇంగ్లండులో వంద గంటలు సూర్య రశ్మి ఉన్నదట దానిని మెచ్చుకుంటూ 'లండను టైమ్సు' పత్రిక సంపాదకీయం కూడా వ్రాసింది

ఈస్టరు వెళితే గాని నా చదువు విషయం తెలియదు గాబట్టి ఆ వ్యవధిలో లండను మహానగరాన్ని చూచే కార్యక్రమం పెట్టుకున్నాను కృష్ణారావుకి తన మిత్రురాలు బానుమతితో తిరగడంతో సరిపోతోంది ఆమె కేరళ అమ్మాయి లండనులో లైబ్రేరియన్ కోర్సు చదువుతోంది చాలా చురుకైనది పెద్ద అందగత్తె కాదు కృష్ణ నలుపైనా అందగాడు ఆమెలో అతడికి ప్రత్యేకమైన ఆకర్షణ ఏమి కనిపించిందో నాకు అర్థం కాలేదు డాక్టరు శర్మ, నేను లండను పట్టణం చూడ్డానికి బయలుదేరాం ట్రెఫాల్గర్ స్క్వేయిర్, స్ట్రాండ్, వైట్‌హాల్ హార్స్‌గార్డ్స్ పెరేడ్ నెంబరు 10 డౌనింగ్ స్ట్రీటు హౌస్ ఆఫ్ కామన్సు చూచి వచ్చి థేమ్సు నది ఒడ్డున కూర్చున్నాం విక్టోరియా రేవు వద్ద క్లియోపాత్రా నీడిల్ అని ఒక రాతి స్తంభం ఉంది తాను డాక్టరుగా కంటే గైడ్‌గా బాగా రాణిస్తానని శర్మ చమత్కరించాడు మేము చూచినవన్నీ లండను వచ్చిన ప్రతివాడు చూచే ముఖ్యమైన ఆకర్షణలు ట్రెఫాల్గర్ స్క్వేయిర్ మధ్య నెల్సన్ స్తంభం ఉంది కాని అక్కడ ప్రత్యేక ఆకర్షణ పావురాలు కొన్ని వందలు ఉంటాయి వాటికి గింజలు వేయడం, వాటిని చేతులమీద భుజాలమీద ఎక్కించుకోవడం పిన్నలకు పెద్దలకు గొప్ప కాలక్షేపం నెంబరు 10 డౌనింగ్ స్ట్రీట్ అంటే

బ్రిటిషు ప్రధానమంత్రి అధికార నివాసం ఆ రూపేణా దానికి చాలా ప్రాముఖ్యత ఉంది కానీ తీరా చూడ్డానికి వెళితే డౌనింగ్ స్ట్రీట్ చాలా సామాన్యంగా ఉంది చిన్న సందు దానిలో పదవ నెంబరు ఇల్లు ప్రధాని నివాసం అది కూడా బైటనుంచి అతి సామాన్యంగా అనిపించింది గార్డులు డ్యూటీలు మారడం మాత్రం చాలా గొడవగా ఉంది వారి గుర్రాలు, వారి అలంకారాలు చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి ఇక థేమ్స్ నది గురించి బ్రిటిషువారు చాలా గొప్పగా చెప్పుకుంటారు కాని నాకు అది మా ఊళ్ళో ఉన్న కాలువలా అనిపించింది అందుకే చెట్టులేని చోట ఆముదం చెట్టు మహావృక్షం అంటారనిపించింది కార్నర్‌హౌస్‌లో భోజనం చేసి ఇంటికి చేరేసరికి బాను ఇంకా కృష్ణతోనే ఉంది ఆ తరువాత వాళ్ళు భోజనానికి వెళ్లారు

నేను కృష్ణతో ఫుడ్ ఆఫీసుకు వెళ్ళి ఐడెంటిటీ కార్డు రేషన్ కార్డు తెచ్చుకున్నాను అక్కడ నాపేరు వ్రాయడంలో పేచీ వచ్చింది రూలు ప్రకారం పూర్తి పేరు వ్రాయాలి నేను బియస్‌యన్ మూర్తి అని వ్రాయమన్నాను అక్కడ ఉన్న అమ్మాయి పూర్తి పేరు కావాలంది అయితే వ్రాసుకోమని పూర్తిపేరు చెప్పేసరికి అయ్యా బాబోయ్ మొదటిపేరే బాగుందని రూల్సు అంగీకరించకపోయినా అలాగే వ్రాసి ఇచ్చింది ఇక రేషన్ కార్డు రెండవ ప్రపంచ యుద్ధం ప్రబావం నుంచి అప్పటికి ఇంగ్లండు దేశం ఇంకా పూర్తిగా కోలుకోలేదు వారానికి ఒక కోడిగ్రుడ్డు రేషన్‌లో ఇచ్చేవాడు దానిని బట్టి పరిస్థితులు ఎంత క్లిష్టంగా ఉన్నాయో ఊహించవచ్చును అయినా ప్రజలలో ఉన్న క్రమశిక్షణ, ఓర్పు చూస్తే మతిపోయేది

ఇంకా రెండు మూడు రోజులు వాతావరణం వేడిగా ఉంటుందని వాతావరణ సూచన భారతదేశపు ఎండల్ని గుర్తు చేస్తున్నాయి లండను ఎండలు కాస్సేపు పడక వేద్దామనుకున్నాను కాని శర్మ వచ్చి వాతావరణం హాయిగా ఉంటే పడకేవిటి ఏదైనా పార్కుకు పోదాం పదమన్నాడు మా ఇంటివెనుక మేడమీగ ఆడవాళ్ళు చక్కర చెడ్డీలు, స్తనాలమీద చిన్న గుడ్డ కట్టుకుని సూర్య స్నానం చేస్తున్నారు భానుని కూడా ఆహ్వానించారు బాను, కృష్ణ, శర్మ, నేను రీజెంట్ పార్కుకి వెళదామనుకున్నాము కాని తీరా బస్సు వద్దకు వచ్చేసరికి రిచ్మండ్ పార్కు అన్నారు అక్కడకు వెళ్ళడానికి గంట పట్టింది లండను పట్టణం దాటి దూరంగా వెళ్ళిన కొద్దీ పరిసరాలు అందంగా ఉన్నాయి తీర్చిదిద్దినట్టున్న వీదులు మహా పరిశుభ్రంగా ఉన్నాయి నాతో బాటు ఉన్నవారి కెవరికీ దారి తెలియదు చివరకు పార్కుకి చేరాం అది అట్టే అంత అందంగా లేదు కాని పార్కు నిండా ఆడ మగ జతలుగా గడ్డిమీద పడుకుని కౌగలింతలు, ముద్దులు చిత్రం ఏవిటంటే వాళ్ళంతా పడుచువాళ్ళు

కూడా కాదు వాళ్ళలో భార్యాభర్తలు వివాహం నిశ్చయమైన యువతీ యువకులు స్నేహితులు, దారిలో కొట్టుకువచ్చిన బాపతు, అన్ని రకాలు ఉంటారని మిత్రులు చెప్పారు అలా పది పదిహేను నిమిషాలు దొర్లి ముద్దులు పెట్టుకుని లేచి వెళ్ళిపోతున్నారు చాలా జంటలు దగ్గర దగ్గరగానే పడుకున్నారు వాళ్ళని ఎవరూ పట్టించుకోవడంగాని వాళ్ళవైపు చూడడం గాని చేయడంలేదు మేమూ ఆ జంటలకు దగ్గరలోనే కూర్చున్నాం రాత్రి పడిన తరువాత ఇంటిముఖం పట్టాం

మరునాడు డా॥ బాజీ, డా॥ శాంతి వచ్చారు వారు హైదరాబాదు వాస్తవ్యులు అనేకమంది భారతీయ డాక్టర్లలాగానే ఎఫ్ ఆర్ సి యస్ ఎం ఆర్ సి పి చేయడానికి ప్రయత్నిస్తున్నారు వారు కూడా వారితో కబుర్లు క్రితంరోజున వేడి 75 డిగ్రీల వరకు వెళ్ళిందని గోలపెడుతున్నారు భాను తన హాస్టల్‌నుంచి వచ్చింది ఆమె కృష్ణ శర్మ నేను క్యూ గార్డెన్‌కి వెళ్ళాలని బయలుదేరాం సాండ్‌విచ్చెస్ క్రీం బన్సు లెమనేడ్ సీసాలు పుచ్చుకుని బస్సు ఎక్కాం క్యూ గార్డెన్‌కి వెనుక ప్రక్క దిగి లోపలకు వెళ్ళాం ఆ గార్డెన్ చాలా పెద్దది కన్నుల పండువుగా ఉంది ప్రపంచంలోని అన్ని దేశాలలో ఉండే అన్ని రకాల చెట్లు పెంచుతున్నారు వివిధ వాతావరణ పరిస్థితులతో పెరిగే చెట్లను వాటికి అవసరమైన వాతావరణాన్ని కృత్రిమంగా తయారుచేసి దానిలో పెంచుతున్నారు చక్కటి సరస్సులు, దానిననుసరించి ఉన్న నదిలో నావ షికార్లు, ఎన్నో చక్కటి పువ్వుల మొక్కలు, చాలా అందంగా ఉన్నాయి ఒక చెట్టు అంతా పువ్వులే దానిలోను రంగుల పువ్వులు ఎంతో ముచ్చటగా ఉన్నాయి ఇక పిల్లలుకాని పెద్దలు గాని పువ్వులు ముట్టుకోరు అయితే లాన్స్‌మీద ఆడ మగ జంటలు పడుకుని ఆలింగనాలు ముద్దులు పరిపాటి ఆ ప్రక్కనే కుటుంబాలతో పెద్దలు పిన్నలు కూర్చుంటే అక్కడే శృంగార చేష్టలు అప్పుడే భారతదేశంనుండి వెళ్ళిన నాకు అదంతా విచిత్రం అనిపించింది క్యూ గార్డెన్ చాలా అందంగా ఉంది ఆ పరిశుభ్రత చూచి తీరాలి అది వారి క్రమశిక్షణకు నిదర్శనం

సాయంకాలం గార్డెన్స్‌నుంచి బైటపడ్డాం వాళ్ళు ముగ్గురూ ఎక్కడో విందు ఉందని వెళ్లారు నేను తిన్నగా ఇంటికి వచ్చేసాను చాలా వేడిగా ఉంది చెమటలు పడుతున్నాయి భారతదేశంలో ఉన్నట్టే ఉంది వేడి 83 డిగ్రీలట మరొక రెండు డిగ్రీలు ఎక్కువైతే స్పృహ తప్పి పడిపోయేవాళ్ళు, చచ్చిపోయేవాళ్ళు కూడా ఉంటారట పేపరు చూస్తే ఆ మరుచటిరోజున దక్షిణ ఐర్లండ్ దేశం రిపబ్లిక్ అవుతుందని, ఆ సందర్భంగా బ్రహ్మాండమైన ఉత్సవం చేసుకుంటారని ఉంది ఒక దేశం వలస దేశంగా ఉండి సర్వ

స్వతంత్ర దేశం కావడం ఆ దేశ చరిత్రలోనే సువర్ణాక్షరాలతో వ్రాయవలసిన సన్నివేశం ఆ దేశ ప్రజలకు ప్రపంచానికి కూడా గర్వ కారణం భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన అర్ధరాత్రి న్యూ ఢిల్లీలో పార్లమెంటు భవనం ముందు నిలబడి అనిర్వచనీయమైన అనుభూతి పొందాను మరొక వలస దేశం బ్రిటిషు సామ్రాజ్యవాదంతో పోరాడి స్వాతంత్ర్యం సాధించిన చరిత్రాత్మక శుభ సందర్భంలో వారి ఆనందోత్సాహాల్లో పాలు పంచుకోవాలని అభిప్రాయం కలిగింది ఎప్పుడో ఒకప్పుడు ఐర్లండు చూడ్డం తప్పదు కాబట్టి ఆ చూడ్డం ఆ దేశం స్వతంత్ర దేశం అయిననాడు చూస్తే ఇంకా బాగుంటుందనిపించింది డబ్లిన్ వెళ్ళడానికే నిశ్చయించాను

మరుచటిరోజు ఉదయం మిత్రులతో నా డబ్లిన్ ప్రయాణం గురించి మాట్లాడాను ఐర్లండ్ రిపబ్లిక్ కావడం ఆ రాత్రి గం 12-02 నిమిషాలకట అయినా స్వాతంత్ర్యోత్సవాల కార్యక్రమం అంతా ఆ మరునాడు కాబట్టి ఏప్రిల్ 17 రాత్రి బండిలో డబ్లిన్ వెళ్ళడానికి నిర్ణయించాను యూస్టన్ స్టేషన్‌కి వెళ్ళి టిక్కెట్టు తీశాను 5 పౌన్లు 5 షిల్లింగులు ఆరాత్రి గం 8-40 కి ఐరిష్ మెయిల్‌లో డబ్లిన్‌కి బయలుదేరాను

తెల్లవారుఝాము 3 గంటలకు రైలు హోలీహెడ్ చేరింది చాలా చలిగా ఉంది ఇంగ్లండు నుంచి ఐర్లండు వెళ్ళడానికి అక్కడ సముద్రం దాటాలి మనదేశంలో రామేశ్వరంనుంచి సిలోన్‌లోని తలైమన్నార్ వెళ్ళడానికి ఓడలో సముద్రం దాటినట్టే హోలీహెడ్‌వద్ద ఓడ ఎక్కేముందు పాస్‌పోర్టులు చూపించమన్నారు అయితే భారతదేశం పాస్‌పోర్టును విదేశీ పాస్‌పోర్టుగా పరిగణించమన్నారు అప్పటికి మనదేశం స్వతంత్రదేశం అయినా ఇంకా బ్రిటిషు ప్రభుత్వంతో మన సంబంధాలు ఇదమిద్ధంగా నిర్ణయం కాలేదు కామన్‌వెల్త్‌లో ఉండడమా లేక ఇంగ్లండుతో తెగతెంపులు చేసుకోవడమా అనే విషయంలో తర్జన భర్జనలు జరుగుతున్నాయి అయినా ఐరిష్ అధికారులు భారతదేశపు పాస్‌పోర్టుకి బ్రిటిషు పోస్‌పోర్టుకి ఇచ్చే గౌరవమర్యాదలు ఇచ్చారు ఓడ ప్రయాణం రెండున్నర గంటలు మాత్రమే

తెల్లవారేసరికి లగారియా చేరాం అంటే ఐరిష్ గడ్డమీద అడుగుపెట్టామన్నమాట కింగ్‌స్టన్ స్టేషన్‌నుంచి డబ్లిన్‌కి రైలు ఆ రైలు అంత హాయిగా లేదు మనదేశంలోని రైళ్ళను గుర్తు చేసింది అక్కడ ప్రజలకు క్రమశిక్షణ ఉంది గాబట్టి బాధ లేకపోయింది ఉదయం గం 7-35 కి డబ్లిన్ చేరాం ఆ స్టేషన్‌లో హోటళ్ళ గురించి వివరాలు చెప్పే బ్యూరోకి వెళ్ళి రెండురోజులకు గది కావాలంటే ఓల్డ్ వియన్నా హౌస్‌లో కుదిర్చాడు చక్కగా గుర్రపు షార్టులో వెళ్ళాను చాలా అందమైన అమ్మాయి తలుపుతీసి

ఆహ్వానించింది బ్రేక్‌ఫాస్ట్ వద్ద ముగ్గురు బెంగాలీలు కనిపించారు వారు మాంచెస్టర్ నుంచి వచ్చారట ఆరోజే తిరిగి పోతున్నారు స్నానం చేసి అచకన్ చుడేదారీ పైజామా వేసుకుని బయలుదేరాను నా కూడా ఆ హోటల్‌లో ఉన్న మొయిల్ వాగనం అనే సిలోన్ తమిళ పెద్దమనిషిని కూడా తీసుకువెళ్ళాను పెరేడ్ జెండా వందనం గం 11-52 కి అన్నారు జనరల్ పోస్టాపీసుకి వెళ్ళాం పట్టణం అంతా అలంకరించారు జెండావందనం జరిగే జి పి ఒ వద్ద చాలా అందంగా అలంకరించారు వేలాది ప్రజలు డబ్లిన్ అందం అంతా అక్కడే చూసాననిపించింది

ఐరిష్ రిపబ్లిక్ అధ్యక్షుడు డివెలరా ప్రదానమంత్రి తదితర నాయకులు వచ్చారు జెండావందనం పెరేడ్ చాలా బాగున్నాయి ఆ ప్రజల ఆనందోత్సాహాలు వర్ణనాతీతం ఆ దేశ చరిత్రలో అత్యంత ముఖ్యమైన సమయంలో వారి ఆనందాన్ని పంచుకోగలగడం నా అదృష్టం అనిపించింది

ఐరిష్ స్వాతంత్ర్య పోరాటానికి, బారత స్వాతంత్ర్య పోరాటానికి ఎక్కడా సారూప్యం లేదు రెండు దేశాలు బ్రిటిష ప్రభుత్వంతో పోరాడి స్వతంత్రం సంపాదించడం వరకే పోలిక మనదేశంలో మహాత్ముని నాయకత్వంలో శాంతి అహింస సత్యాగ్రహం మనకు ఆయుధాలైతే ఐరిష్ ప్రజల ఉద్యమం చాలా తీవ్రమైనది ఆనాడు ప్రజల ఉత్సాహం నన్ను కదిలించివేసింది దానికి తోడు నాకు మరొక తీవ్రమైన బెడద ఎదురైంది వేలాది మంది ఆడ మగ పిల్లలు పెద్దలు నన్ను తేరబడి చూడ్డం సమస్య అయిపోయింది వాళ్ళకు నల్లమొఖాలు కొత్తలా ఉంది అంతే కాకుండా నేను వేసుకున్న డ్రస్సు వాళ్ళు ఎప్పుడూ చూచి ఉండరు అంతమంది అలా చూడ్డం నాకు చిరాకు అనిపించింది వెంటనే హోటల్‌కి తిరిగివచ్చి ఆ డ్రస్సు మార్చి సూటు వేసుకున్నాను రాత్రి తెల్లవార్లు నిద్ర లేనందున కాస్సేపు విశ్రాంతి తీసుకుని సాయంకాలం ఫోయినిక్స్ పార్కుకి వెళ్లాను ఆ పార్కు ఐరిష్ వారికి బ్రిటిషవారికి హైడ్‌పార్కు వంటిదట చాలా చలిగా ఉంది రాత్రి గం 11-30 వరకు బ్రహ్మాండమైన బాణా సంచా కాల్పులు జరిగాయి

మరునాడు డబ్లిన్ పట్టణాన్ని చూడ్డానికి బయలుదేరాను ముందుగా శాసనసబా భవనం చూసాను ఇంగ్లండు రావడానికి ముందు ఢిల్లీలో పార్లమెంటు భవనంతో సన్నిహిత సంబందాలు ఉండడం వల్ల ఐరిష్ శాసనసభా బవనంతో ప్రారంభించాను దిగువ సభకు 146మంది సభ్యులు ఎగువ సబకు 60 మంది సభ్యులు ప్రభుత్వ పక్షం స్పీకరుకి ఎడమ ప్రక్క కూర్చోవడం చిత్రం అనిపించింది ఏ సభలో ఏ కార్యక్రమం జరుగుతున్నదీ వివరాలు తెలియజేసే సూచిక చాలామంచి పద్ధతి అనిపించింది నేషనల్

మ్యూజియం దగ్గర ఇద్దరు బారతీయ యువకులు కనిపించారు మరికొన్ని ప్రదర్శనశాలలు చూసాను కాని అన్నిటికంటే ఐరిష్ స్వాతంత్ర్య సమర చరిత్ర అంతా బొమ్మల్లో చూపిస్తూ ఏర్పాటు చేసిన ప్రదర్శన అద్భుతంగా ఉంది అదంతా చూస్తుంటే నాకు కళ్ళనీళ్ళు తిరిగాయి ప్రభుత్వ బవనాలు, ఆర్ట్ గ్యాలరీ చూసాం అవన్నీ చూస్తూ ఉంటే మహామహులంతా ఐరిష్ వారే అనిపించింది ఫోర్ కోర్ట్స్, లఫేనది, ట్రినిటీ కాలేజీ చూసి హోటల్‌కి చేరాను ప్రజలు చాలా బలంగాను ఆరోగ్యంగాను ఉన్నారు కాని అది చాలా పేద దేశం పేదరికంలో మనదేశాన్ని పురుడిస్తుంది స్త్రీలు చాలా అందంగా కనిపించారు కాని చాలా సామాన్యమైన సహజ సౌందర్యం ఇంగ్లీషు వారికున్నముభావం, అహంబావం ఐరిష్ వారిలో కనిపించవు మనసిచ్చి మాట్లాడేవాళ్ళు అనే బావం కలిగింది

నేను డబ్లిన్‌నుంచి తిరిగి లండను వచ్చేసరికి లీడ్సు పట్టణంలో ప్రింటింగులో ఉన్నతవిద్య నభ్యసిస్తున్న హైదరాబాదు యువకుడు నారాయణరావు నేనుండే ఇంట్లో కనిపించాడు అతడితో కలిసి ఇండియా హౌస్‌కి వెళ్ళాను బారతదేశంనుంచి వచ్చిన విద్యార్థుల సమస్యలు చూసే శాఖకు అధిపతి డా|| జె యస్ బోస్లాని కలుసుకున్నాం నా చదువు విషయం గుర్తు చేసాను ఆయన లండను యూనివర్సిటీలో సీటు సంపాదించడానికి సర్వవిదాలా ప్రయత్నిస్తానన్నాడు మంచివాడిలా కనిపించాడు ఇండియా హౌస్‌లో బారతీయ భోజనం చౌకలో బాగుంది చదువు విషయం ఇదమిద్ధంగా తేలకపోవడం, దేశంనుంచి తెచ్చుకున్న కొద్ది డబ్బు హరించుకుపోవడంతో నాలో ఆదుర్దా, అలజడి ప్రారంబమయ్యాయి లండనులో తాత్కాలికంగా ఏదైనా పార్ట్‌టైమ్ ఉద్యోగం చేద్దామనే ఆలోచన కూడా వచ్చింది ఉన్నత విద్యలకోసం వచ్చి చిల్లర ఉద్యోగాలలో చిక్కుకోవడం మంచిది కాదని మిత్రుల సలహా హైకమిషన్‌లో ఏదైనా పార్ట్‌టైమ్ ఉద్యోగం ఇప్పించమని బారత హైకమిషనర్ శ్రీ కృష్ణమీనన్‌ని అడిగాను ఆయన నా కోర్కెను విని ఆశ్చర్యపోయాడు 'లండను వచ్చి నెలరోజులు కూడా కాకమునుపే ఆర్థిక ఇబ్బందులు ఉద్యోగం అంటున్నావు, చదువుకునే ఆలోచన లేదా?' అన్నారు

నేను భారతదేశంనుంచి బయలుదేరే ముందే లండనులో ఏదైనా పనిచేస్తూ చదువుకోవాలనే ఉద్దేశంతో ఉన్నట్టు చెప్పాను శ్రీ కృష్ణమీనన్‌కి నేను చాలా తక్కువ డబ్బుతో లండను వచ్చినట్టు, ఇక బారతదేశంనుంచి నాకు డబ్బు వచ్చే అవకాశం లేదని స్పష్టం చేసాను కొద్దిగా సానుభూతితో మాట్లాడారు లండనులో పార్ట్‌టైమ్ ఉద్యోగాలు ఉండవన్నారు ఇండియా హౌస్‌లో

ఉద్యోగం ఇవ్వడానికి అభ్యంతరం చెప్పలేదు కాని అది రోజంతా చేయవలసిన ఉద్యోగం అన్నారు ఇక రిసెర్చి ఎప్పుడు చేస్తావన్నారు కాలేజీ లైబ్రరీలు కూడా ఉదయం నుంచి సాయంకాలం వరకు పనిచేస్తాయి కాబట్టి రిసెర్చి చేస్తూ ఉద్యోగం చేయడం సాధ్యపడదన్నారు ఉద్యోగంలో చేరితే ఇక రిసెర్చి మాట మర్చిపోవలసిందే అంటూ "నీవు విదేశాలలో స్థిరపడ్డ భారతీయుల లిస్టులో చేరతా" వన్నారు ఆర్థిక ఇబ్బందులు ఎదురైనప్పుడు బారత ప్రభుత్వంలో తన పరపతిని ఉపయోగించి అప్పు అయినా ఇప్పిస్తానని ఓదార్చారు

ఇక ఇండియా హౌస్‌లో ఉద్యోగం సాధ్యపడదని తెలిసిన తరువాత పత్రికా విలేఖరిగా పార్ట్‌టైమ్ ఉద్యోగం కోసం ప్రయత్నించాను అప్పట్లో లండనులో రాయిటర్ ప్రెస్ ట్రస్టు ఆఫ్ ఇండియా వార్తాసంస్థకు శ్రీ జి పార్థసారథి మేనేజరుగా ఉండేవారు శ్రీ ఖాసా సుబ్బారావు, శ్రీ కోటంరాజు రామారావు మద్రాసులో తమ పత్రికలకు నన్ను లండను ప్రతినిధిగా నియమిస్తూ ఇచ్చిన ఉత్తరాలను చూచి శ్రీ పార్థసారథి నా సేవలు ఉపయోగించుకోవడానికి సుముఖత చూపించారు షార్టుహాండ్ వ్రాయగలవా అని ఆయన ప్రశ్న నాకు రాదన్నాను న్యూస్ ఏజెన్సీలో షార్ట్‌హాండ్ వ్రాయలేకపోతే ప్రయోజనం లేదన్నారు అక్కడకూడా చుక్కెదురే అయింది బ్రిటిష జర్నలిస్టుల సంఘంలో సభ్యత్వం సంపాదించినా దానివల్ల నాకు ఆర్థికంగా వచ్చే ఉపకారం లేదు శ్రీ ఖాసా కాని, శ్రీ కోటంరాజు గాని బారతదేశంనుంచి విదేశీమారకంలో డబ్బు పంపగలుగుతారనే నమ్మకంలేదు

పనీ పాటు లేనందున లండను మహా పట్టణం అంతా కాలినడకను, ట్యూబ్‌రైళ్ళలోను సర్వే చేయడం మొదలుపెట్టాను కొద్దిరోజుల్లో ఇంగ్లీషు పౌరులకు కూడా తెలియనంత బాగా లండను పట్టణం పరిచయమైపోయింది ఏమీ తోచకపోతే వెళ్ళి నేషనల్ ఆర్ట్ మ్యూజియంలో కొన్ని గంటలపాటు గడిపేవాడిని ఒక్కొక్క ఆర్టు స్కూలును గూర్చి దానిలో నిష్ణాతులైన ఉపన్యాసకులు పెయింటింగ్స్‌ను చూపిస్తూ వాటిలోని అందాలు మనకు తెలిసేటట్టు ఉపన్యసిస్తారు ఆ ఉపన్యాసాలు విన్న తరువాత మళ్ళా ఆ పెయింటింగ్స్ చూస్తే అవి మనకు మరింత అందంగా కనిపిస్తాయి ఆ ఆర్ట్ మ్యూజియంలో లియనార్డో డవిన్సి గీసిన వర్జిన్ ఆఫ్ ది రాక్స్ అద్భుతమైన పెయింటింగ్ నాకు అది మోనోలీసా కంటె అందంగా కనిపించింది డవిన్సి గీసిన వర్జిన్ బొమ్మ ఎన్నిసార్లు చూసానో ఆ బొమ్మలకు ఎదురుగా ప్రేక్షకులు కూర్చోవడానికి బల్లలు ఉంటాయి మనకు నచ్చిన బొమ్మ ఎదురుగా ఎంతసేపైనా అలా చూస్తూ కూర్చోవడమే!

మిత్రుడు కూనపరెడ్డి కృష్ణారావు లండను చదువు పూర్తి అయిపోతోంది తన మిత్రురాలు భానుమతితో కలిసి అమెరికా వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు కొంచెం వ్యవధి ఉండగానే తన ఆలోచన వాళ్ళ నాన్నగారి చెవిని వేయాలని నిర్ణయించుకున్నాడు ఉత్తరం వ్రాయడం వల్ల ప్రయోజనం ఉండదని టెలిఫోనులో మాట్లాడడానికి అంతర్జాతీయ టెలికమ్యూనికేషన్ కేంద్రానికి నన్ను తీసుకొని వెళ్ళాడు లండను నుంచి బందరులో ఉన్న వాళ్ళ నాన్నగారు అచ్చయ్యనాయుడుగారితో మాట్లాడాలి బందరు పోస్టాఫీసుకి ఫోను చేసి పి పి అచ్చయ్యనాయుడుగారిని పిలవమని చెప్పాడు అప్పుడు లండను నుంచి బారతదేశంలో ఎవరితోనైనా మాట్లాడాలంటే నిమిషానికి ఒక పౌను (రు 13) బందరు పోస్టుమాస్టరు నెంబరు నిమిషాలమీద వచ్చింది అచ్చయ్యనాయుడుగారి కోసం కబురుపెట్టినందున ఆయన రావడం ఆలస్యమైంది "నాయుడుగారూ మీ పెద్దబ్బాయి లండను నుంచి మిమ్మల్ని పిలుస్తున్నాడు మీతో మాట్లాడతాడట మాట్లాడండి" అని పోస్టుమాస్టరు ఆయనకు ఫోను ఇచ్చాడట అచ్చయ్యనాయుడుగారు పూర్వకాలపు వాడు అమ్మో అంతదూరంలో ఉన్నవాడితో నేను మాట్లాడడం ఏమిటి మీరే మాట్లాడండని పోస్టుమాస్టారిని కోరాడట చివరకు వాళ్ళ రెండవ అబ్బాయి ఫోనులో వచ్చాడు కృష్ణారావు విసుగుతో ఫోను నాన్నకివ్వమని కసురుకున్నాడు అయినా నాయుడుగారు ఫోనులో మాట్లాడలేదు ఇక తప్పనిసరిగా కృష్ణారావు తన అమెరికా ప్రయాణం గురించి, అర్జంటుగా కావలసిన డబ్బు గురించి వాళ్ళనాన్నకు చెప్పమని రామారావుతో చెప్పాడు

కృష్ణారావు బానుమతి వివాహం చేసుకుంటారని మిత్రులంతా అనుకోసాగారు వాళ్లు అమెరికా వెళ్ళాలని నిర్ణయించుకున్న తరువాత భాను ప్రోద్బలం పుణ్యమా అంటూ కృష్ణారావు బాల్‌రూమ్ డాన్సింగ్ నేర్చుకోవడానికి నిర్ణయించాడు నేను ఖాళీగా ఉన్నాను కాబట్టి డాన్సు క్లాసులకు వెళ్ళడానికి నేను తోడు అతడితోపాటు నేను కూడా డాన్సు పాఠాలు నేర్చుకున్నాను మేము వెళ్లిన స్కూలులో లాటిన్ అమెరికన్ డాన్సులు ప్రత్యేకత అందుమూలంగా నాకు మొదటినుంచి లాటిన్ అమెరికన్ డాన్సులంటే సరదా ఆతరువాత వాటిలో ప్రావీణ్యత అబ్బింది అయితే స్కూలులో మగ మాష్టారివద్ద డాన్స్ నేర్చుకోవడానికి, నిజమైన డాన్స్ హాలులో అమ్మాయితో కలిసి సంగీతానికి అనుగుణంగా అమ్మాయి కాళ్ళు త్రొక్కకుండా డాన్స్ చేయడానికి బోలెడు తేడా ఉంది ఆ విషయం ఒక రాత్రి ప్రత్యక్ష అనుభవంతో తెలిసింది

ఎరాల్ హిల్ అనే వెస్టిండీస్ మిత్రుడు మా మకాంలో ఉండేవాడు అతడు

రాయల్ అకాడమీ ఆఫ్ డ్రమెటిక్ ఆర్ట్సులో నటన నేర్చుకుంటున్నాడు నేను డాన్సు నేర్చుకుంటున్నానని విని ఒక రాత్రి నిజమైన డాన్సుకి ఆహ్వానించాడు మాతో అతడి మిత్రురాలు ఉంది ఆమెతో డాన్సు చేయమన్నాడు నాకు ముచ్చెమటలు పోశాయి అంతవరకు డాన్సు చేసేవారిని చూచి వ్యాఖ్యానించడం, దూరంనుంచి చూసి ఆనందించడం అనహ్యాంచుకునే నేనే డాన్సుహాలులో ఒక అమ్మాయిని పట్టుకుని డాన్సు చేయడానికి నిలబడ్డాను ఏదో డాన్సు అయిందనిపించాను ఆమెను ఇంటివద్ద దిగబెట్టి వచ్చిన ఎరాల్ "నీమిత్రుడు అలా బిగుసుకుపోయి డాన్సు చేసాడేవి" టని తన మిత్రురాలు అన్నదని చెప్పి విరగబడి నవ్వాడు

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ లండను వచ్చినట్టు ఆయన క్లారిడ్జస్ హోటల్‌లో దిగినట్టు వార్త ఆయనతో మత్తాయ్ కూడా వచ్చాడన్నారు మత్తాయ్ నాకు మంచి మిత్రుడు అతని ద్వారా పండిట్‌జీని కలుసుకుని నా పరిస్థితి చెప్పుకుందా మనుకున్నాను ఆయనకు వ్యవధి లేనందున సాధ్యపడలేదు బ్రిటిష్ ప్రధాని సర్ విన్‌స్టన్ చర్చిల్‌తో సమావేశానికి 10 డౌనింగ్ స్ట్రీట్‌కి వెళతారని తెలిసి అక్కడికి వెళ్ళాను ముందు సిలోన్ ప్రదాని సేనానాయకే వచ్చారు నెహ్రూ కృష్ణమీనన్‌తో కలిసి సరిగ్గా11గంటలకు వచ్చారు రెండు నిమిషాలు ఆలస్యంగా పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ ఖాన్ వచ్చారు ఆయన సూటు వేసుకుని జిన్నా టోపీ పెట్టుకున్నాడు ఇక నెహ్రూ పండితుడు పూర్తిగా సూటులో ఉన్నారు కొద్దిగా దూరంగా నిలబడి నమస్కారం పెట్టాను ఇండియా హౌస్‌కి వెళ్ళాను డాక్టరు ఖోస్లాని కలుసుకుని లండనులో చదువుకోవడానికి ఉన్న అవకాశం గురించి మాట్లాడాను ఆయన సమాధానం ఆశాజనకంగానే ఉంది కాని నేను ఎదుర్కోవలసిన అసలు సమస్య లండనులో చదవటానికి కావలసిన ఆర్థిక వనరులు ఎక్కడ నుంచి వస్తాయి అనేది నేను లండను ఆలస్యంగా చేరడంవల్ల ప్రొఫెసర్ లాస్కి వద్ద చదువుకుందామనే ఆశ అడుగంటింది భారత హైకమిషన్ ఆఫీసులో కాని మరొకచోట కాని పార్ట్‌టైమ్ ఉద్యోగం చేసి చదువు సాగిద్దామని నిర్మించుకున్న ఆశాసౌధాలు కూలిపోయాయి దానికితోడు లండను యూనివర్శిటీలో కూడా అంతవరకు ప్రవేశం లభించలేదు

ఒక విధమైన నిస్పృహ, ఆందోళన ప్రారంభమైంది ఆ పరిస్థితిలో అమెరికా వెళ్ళడం మంచిదని మిత్రులు సలహా చెప్పడం మొదలుపెట్టారు లండనులో సాధ్యపడని పార్ట్‌టైమ్ ఉద్యోగాలు అమెరికాలో హెచ్చుగా ఉంటాయన్నారు పగలంతా చదువుకుని సాయంకాలం లిఫ్టు నడిపినా బోలెడు డాలర్లు సంపాదించవచ్చునని ఊరించారు భారత దేశం నుంచి

డబ్బులు వచ్చే అవకాశాలు లేనందున ఎక్కడ ఆర్థిక సహాయం దొరికితే అక్కడకు వెళ్ళి చదువుకోవడం ఉత్తమం అనే ఆలోచన వచ్చింది మార్గాంతరం కనిపించనందున చదువు నిమిత్తం అమెరికా వెళ్ళడానికి నిర్ణయించాను లండనులోని అమెరికన్ ఎంబసీకి వెళ్ళి వీసా కోసం దరఖాస్తు పెట్టాను

అమెరికా వెళ్ళదల్చుకున్న వారంతా సంపూర్ణ ఆరోగ్యవంతులై ఉండాలనే నియమం ప్రకారం అమెరికన్ ఎంబసీవారే ఎక్స్‌రే తీయించారు అదేసమయంలో ప్రభుత్వ ఆరోగ్యశాఖవారు లండన్‌లోని పౌరులందరికీ ఉచితంగా ఎక్స్‌రే తీస్తున్నారు సంచార ఎక్స్‌రే వాహనం టావిటన్ వీధికి వచ్చినప్పుడు ఎక్స్‌రే తీయించుకున్నాను చిత్రం ఏమిటంటే అటు అమెరికన్ ఎంబసీ నుంచి ఇటు పాడింగ్‌టన్ హాస్పిటల్ నుంచి మరొకసారి వచ్చి ఎక్స్‌రే తీయించుకోవాలని జాబులు వచ్చాయి దానితో ఈ సారి ఆరోగ్య విషయంలో ఆందోళన రెండవసారి ఎక్స్‌రే తీయించుకున్న తరువాత పాడింగ్‌టన్ హాస్పిటల్ నుంచి వచ్చిన జాబుతో నా గుండెలో రైళ్ళు పరుగులెత్తాయి తమ హాస్పటల్ లోని ఎక్స్‌రే విభాగంలోని నిపుణులను కలుసుకోమని ఆ జాబులో ఉంది ఏదో కొంప మునిగిందనుకున్నాను ఏ సాహసం చేయడానికైనా ఆరోగ్యంగా ఉండడం అత్యంతావశ్యకం అని వేరే చెప్పనక్కరలేదు హాస్పిటల్‌వాళ్ళు ఏమి చెబుతారో అనే ఆందోళనతో వెళ్ళాను అదృష్టవశాత్తు ఎక్స్‌రే ఫలితాలు సంతృప్తికరంగానే ఉన్నాయి అయితే నన్ను మళ్ళా పిల్చి గాబరా పెట్టి చంపారెందుకయ్యా అన్నాను ఆ డాక్టరు నా ఎక్స్‌రేని ఫ్రేమ్‌లో బిగించి దాని వెనుక దీపకాంతి ప్రసరింపజేసి దానిలోని మంచిచెడ్డలు నాకు వివరించాడు

నా ఊపిరితిత్తులలో ఏవో మచ్చలున్నాయట అవి వ్యాధికి సంబంధించినవనే అనుమానంతో రెండవ ఎక్స్‌రే తీసారట ఆ మచ్చలు వ్యాధి పూర్తిగా నయం అయిపోయిన తరువాత మిగిలినవే కాని వ్యాధి లక్షణాలు కావని ధైర్యం చెప్పారు కాని నేను ఏనాడు దగ్గుతో బాధపడలేదుకదా అటువంటప్పుడు నయం అయిన క్షయవ్యాధి మచ్చలు ఎక్కడ నుంచి వచ్చాయనే సందేహం వ్యక్తం చేసాను క్షయవ్యాధి ఉండడానికి దగ్గుకి సంబంధం లేదన్నాడు అయితే నా ఊపిరితిత్తులు సంపూర్ణ ఆరోగ్యంగా ఉన్నాయని భరోసా యిస్తూ ఎవరికి అనుమానం వచ్చినా తమ హాస్పటల్‌ని సంప్రదించమని చెప్పారు నా ఊపిరితిత్తుల విషయంలో ఎప్పుడైనాసరే రెండుసార్లు ఎక్స్‌రే తీస్తేకాని ఎవరికి సంతృప్తి కలగదని కూడా హెచ్చరించారు

అమెరికన్ ఎంబసీలో సరిగా అదే జరిగింది వాళ్ళు రెండవసారి ఎక్స్‌రే తీసి నా ఊపిరితిత్తులు అమెరికా వెళ్ళడానికి తగినంత ఆరోగ్యంగా ఉన్నాయని నిర్ణయించారు ఆ అడ్డంకి తీరిన తరువాత నా వీసా అప్లికేషన్ పై ఎంబసీ అధికారితో చర్చలు అప్పటికి భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి రెండేళ్ళు కూడా కానందున భారత రాజకీయాలు అమెరికన్‌లకు అంత బాగా తెలియవు దానికితోడు వారికి కమ్యూనిజం అన్నా కమ్యూనిస్టులన్నా వెర్రి వ్యతిరేకత లండను వచ్చేముందు ఢిల్లీలో పార్లమెంటులోని కాంగ్రెసు పార్టీలో ఉద్యోగం చేసేవాడినని అప్లికేషన్‌లో వ్రాయడం ప్రాణాంతకం అయింది అమెరికన్ ఎంబసీ అధికారికి కాంగ్రెస్ పార్టీ అంటే అర్థం కాలేదంటే నమ్మలేకపోయాను "నీవు కమ్యూనిస్టువు కాదు కదా" అని పదేపదే అడిగాడు అప్పుడు నెహ్రూ మొదటిసారిగా అమెరికా వెళ్ళబోతున్నారు ఆయనకోసం అమెరికన్ అధ్యక్షుడు లండన్‌కు ప్రత్యేక విమానం పంపించబోతున్నారు ఇదంతా ఆ అధికారికి గుర్తు చేసి నెహ్రూగారి పార్టీలో పనిచేసానన్నాను కాంగ్రెస్ పార్టీ కమ్యూనిస్టు పార్టీకాదు కదా అని రెట్టిస్తే అతడి అజ్ఞానానికి ఆశ్చర్యపోయాను

రాజకీయాల విషయంలో అంత అదుర్దా చూపించిన అధికారి నేను అమెరికాలో ఎలా బ్రతుకుతాను, దానికి కావలసిన నిధులు ఎలా వస్తాయనే ప్రశ్న అడగలేదు అయితే అమెరికా వెళ్ళి చదువుకోవాలనే నా ఆలోచన మొగ్గలోనే తుంచివేయబడినది కొద్ది వ్యవధి తరువాత అమెరికన్ ఎంబసీ నుంచి వీసా తీసుకోవడానికి రావలసినదిగా జాబు వచ్చింది దానికి ఫీజు మూడు పౌన్లు చెల్లించాలి అప్పుడు నా వద్ద ఆ మూడు పౌన్లు లేవు. వీసా ఫీజుకి మూడు పౌన్లు లేని వాణ్ణి అమెరికా ఎలా వెళ్ళడం అనే ఆలోచన వచ్చేసరికి ఒక కుదుపుతో నా కలలు కరిగిపోయాయి నేను అమెరికన్ ఎంబసీకి వెళ్ళి వీసా తీసుకోనే లేదు

పండిట్ నెహ్రూ ఇండియా హౌస్‌లో ఇంగ్లండులో ఉన్న భారతీయుల్ని కలుసుకోవడానికి సమావేశం ఏర్పాటు చేసారు ఇంకా విద్యార్థి అవతారం ఎత్తకపోయినా జర్నలిస్టు అసోసియేషన్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ సభ్యునిగా ఆ సమావేశానికి వెళ్ళాను సమావేశానికి ముందు నెహ్రూకి నమస్కారం పెడితే ఆయన నన్ను గుర్తుపట్టి ఏ యూనివర్సిటీలో చదువుతున్నావన్నారు అప్పుడు కృష్ణమీనన్ కల్పించుకుని లండను యూనివర్సిటీలో సీటుకోసం ప్రయత్నిస్తున్నట్లు చెప్పారు ఆ రాత్రి ఇండియా లీగ్ పండిట్‌జీకి సన్మానం చేసారు కమ్యూనిస్టులు, ఫార్వర్డు బ్లాక్ కార్యకర్తలు భారతదేశం బ్రిటిషు కామన్వెల్తులో ఉండకూడదని కాగితాలు పంచిపెట్టారు

నేను లండను వెళ్ళేటప్పటికి రెండవ ప్రపంచయుద్ధంలో విజయాని దోహదం చేసిన చర్చిల్ బ్రిటిష్ ప్రధానిగా ఉన్నారు ఆయన ప్రతిష్టను గూ అనేక కథలుగా చెప్పుకునేవారు ముఖ్యంగా ఆయన ప్రపంచంలో గొ ఉపన్యాసకునిగా ప్రఖ్యాతి కెక్కారు ప్రపంచంలో అంత గొ ఉపన్యాసకుడు లేడు అనేవారు 1937లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జరిగ అంతర కళాశాలల వక్తృత్వ పోటీలలో యూనివర్సిటీ చాంపియన్ షిప గెల్చుకున్న నాకు గొప్ప ఉపన్యాసాలు వినడం సరదా నేను బంద హిందూ కాలేజీలో చదువుకునేటప్పుడు బాగవతులవారి అబ్బా మాట్లాడుతుంటే జలపాతం గుర్తుకు వచ్చేది మహా ప్రవాహం మాట్లాడేవాడు అదే మంచి ఉపన్యాస లక్షణం అనుకునే వాళ్ళం ఒకనా లండనులో చర్చిల్ ఉపన్యాసం వినడానికని వెళ్ళాను ఆయన ప్రతిమా తూచితూచి ఆగి ఆగి చాలా తాపీగా ఉపన్యసించారు విన్నవారంతా గొ ఉపన్యాసం అన్నారు నాకు చాలా నిరాశ కలిగించింది అయితే చర్చి మాట్లాడిన పద్ధతే నిజంగా గొప్ప ఉపన్యాస లక్షణం అని తరువ తెలుసుకున్నాను బ్రిటిష లేబరు పార్టీ నాయకుడు బెవిన్ మాట్లాడితే రా వర్షం కురిసినట్టే ఆయన ట్రేడ్ యూనియన్ నాయకుడు

ఆచార్య ఎన్ జి రంగా లండను వచ్చి మూడు రోజులు ఉన్నారు మూడు రోజులు ఆయనతో కాలక్షేపం అయిపోయింది రంగాజీకి లండను క్ర కాకపోయినా నన్ను కూడా పెట్టుకుని తిరిగారు విండ్సర్ పేలస్ మదాంతుస్సాడ్ ఇంకా అనేక ప్రత్యేక ఆకర్షణలు చూసాం మదాంతుసా ప్రదర్శనశాలలో ప్రపంచనాయకుల నిలువెత్తు బొమ్మలు సజీవంగా ఉన్న తయారుచేసి ఉంచుతారు రంగాగారికి లండను, పరిసర ప్రాంత చూపించడానికి గైడ్‌గా పనిచేసాను

ఆచార్య రంగా లండను నుంచి బారత దేశం తిరిగివెళ్ళి నాయు తనకున్న అభిమానానికి నిదర్శనంగా నన్ను అఖిల భారత కిసాన్ కాంగ్రె ఫారెన్ రిలేషన్సు సొసైటీ ఆఫ్ ఇండియా అనే తన రెండు సంస్థల తరఫ లండనులో జరిగే ఇంపీరియలిజంని వ్యతిరేకించే ప్రజల కాంగ్రెసు (Congr of people against Imperialism) సమావేశానికి ప్రతినిధిగా పంపారు సమావేశాలు లండనులో 1949 అక్టోబరు 8,9,10తేదీలలో జరిగాయి డెలిగేట్ ఫీజు రంగా గారే కట్టారు ఆ సమావేశం మూడు రోజ ఇంగ్లండులోని ఫెబియన్ సొసైటీ నాయకులు నోయల్ బేకర్, గోర్డన్ వా వంటి హేమా హేమీలను కలుసుకునే అవకాశం కలిగింది మన దేశా స్వతంత్రం రాకముందు పండిట్ నెహ్రూ కూడా ఆ సమావేశాలకు ప్రతిని

వెళ్ళారు నాకు అటువంటి అవకాశం దొరికినందుకు ఎవరెస్టు ఎక్కినంత ఆనందం అయింది ఆ సమావేశానికి భారతదేశం నుంచి శ్రీ రామమనోహర్ లోహియా కూడా వచ్చారు వలసరాజ్యాల ప్రజలు ఇంపీరియలిస్టు దేశాల యుద్ధాలలో భాగస్వాములు కాలేరు అనే విషయం ఆ సమావేశంలో చర్చించారు భారత స్వాతంత్ర్య పోరాటంలో ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో మన దేశ నాయకులు చెప్పినది కూడా అదే కావడం వల్ల నేను ఆ విషయాన్ని గట్టిగా సమర్థించాను ప్రపంచ మహాసభలలో పాల్గొనడం నాకు అదే ప్రథమ అనుభవం నాకు ఆచార్య రంగా ఇచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నాను

ఆ సమావేశం జరుగుతున్న సమయంలోనే నాకు లండను విశ్వవిద్యాలయంలో స్కూలు ఆఫ్ ఓరియంటల్ అండ్ ఆఫ్రికన్ స్టడీస్ కళాశాలలో సీటు వచ్చే అవకాశాలున్నాయని భారత హైకమిషన్‌లో విద్యాశాఖాధికారి డా|| ఖోస్లా ద్వారా తెలుసుకున్నాను లండను విశ్వవిద్యాలయంవారి నిబంధనలు విచిత్రం అనిపించింది నేను భారత దేశంలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి ఏ(ఆనర్సు) ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణుడనయ్యాను అప్పుడు అమలులో ఉన్న పద్ధతి ప్రకారం ఆంధ్రా యూనివర్శిటీ ఆనర్సులో ఉత్తీర్ణులైన వారికి ఒక ఏడాది తరువాత ఎం ఏ డిగ్రీ ఇచ్చేవారు అయితే లండను విశ్వవిద్యాలయం వారు నన్ను ఎం ఏ డిగ్రీకి రిజిష్టరు చేయమన్నారు నేను లండను పి హెచ్ డి డిగ్రీ కోసం రిసెర్చి చేయడానికి వెళ్ళాను కాని సీటు వచ్చింది ఎం ఏ డిగ్రీ కోసం రిసెర్చి చేయ డానికి నాకు చాలా నిరుత్సాహం కలిగింది అయినా నాకు ప్రొఫెసర్‌గా నియమించబడ్డ డి జి ఇ హాల్ ఇచ్చిన ప్రోత్సాహం, ధైర్యం కొంత ఉపశమనం కలిగించింది ఒక ఏడాది రిసెర్చి చేసిన తరువాత విశ్వవిద్యాలయం దృష్టిలో నా పురోగతి సంతృప్తికరంగా ఉంటే పి హెచ్ డి డిగ్రీ చేయనిస్తారని ప్రొఫెసర్ ధైర్యం చెప్పారు

ఆ యూనివర్సిటీ నిబంధనలలో మరొక విచిత్రం ఉంది విదేశాలనుంచి వెళ్ళిన విద్యార్థులకు ఆ దేశంలో ఏ యూనివర్సిటీలో ఎంత పెద్ద చదువు కోసం రిజిష్టరు చేసినా లండను యూనివర్శిటీ వారి మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులు అయితీరాలి ఆ నిబంధన నాకు అవమానకరం అనిపించింది ఐతే దానికి కూడా ఒక మార్గాంతరం లేక పోలేదు ప్రొఫెసర్ హాల్ యూనివర్శిటీ అధికారులకు ఒక రిపోర్టు పంపుతూ నేను మెట్రిక్యులేషన్ పరీక్షకు కూర్చోవలసిన అవసరంలేదని, ఆ నిబంధన నుంచి నాకు మినహాయింపు యివ్వవచ్చునని వ్రాసారు దానికి యూనివర్శిటీ అంగీకరించింది ప్రొఫెసర్

హాల్ ఇండియన్ ఎడ్యుకేషన్ సర్వీస్‌లో ఉంటూ 20 ఏళ్ళు రంగూన్ విద్యాలయంలో చరిత్రశాఖ అదిపతిగా పనిచేశారు కాబట్టి ఆయనకు మన దేశంలోని విద్యా ప్రమాణాలు తెలుసు అయితే విదేశాల నుంచి వెళ్ళిన ప్రతివిద్యార్థి లండను యూనివర్శిటీ మెట్రిక్యులేషన్ పరీక్షకు ఎందుకు కూర్చోవాలో నాకు అర్థం కాలేదు బ్రిటిష్ యూనివర్సిటీలలో సీటు సంపాదించిన ప్రతి విద్యార్థికి ఇంగ్లీషు బాషలో ప్రావీణ్యత ఉండాలని వారి బావం విద్యార్థి ఏ దేశం వాడైనా యూనివర్శిటీ ప్రమాణాలలో ఏవిధమైన మార్పు ఉండదు ఇంగ్లీషు బాషలో ప్రావీణ్యతను పరీక్షించడానికి వారికి మెట్రిక్యులేషన్ పరీక్ష గీటురాయి అయి ఉంటుంది

ఇక రిసెర్చి ఏ విషయం మీద చేయాలనే మీమాంస వచ్చింది నేను లండను వెళ్ళే ముందు ఊహించుకున్న విషయాలన్నీ పనికిరావని తేల్చారు చివరకు ఆగ్నేయ ఆసియా వ్యవహారాలు పెద్ద రాజ్యాల రాజనీతికి సంబందించిన విషయం మీద రిసెర్చి చేస్తానన్నాను అప్పుడు ప్రొఫెసర్ హాల్ 1893 నుంచి 1904 వరకు సయాంతో ఇంగ్లీషు ఫ్రెంచి సంబంధాలు అనే విషయం మీద రిసెర్చి చేయమని సలహా యిచ్చారు భారతదేశంతోపాటు ప్రపంచంలో అనేక చిన్న పెద్ద దేశాలు సామ్రాజ్యవాద దేశాల పాలనలో ఉండిపోయిన కాలంలో ఆగ్నేయ ఆసియాలో చిన్న దేశం అయిన సయాం(థాయ్‌లాండ్) స్వతంత్ర దేశంగా ఎలా నిలబడిగలిగింది, అది ఎలా సాద్యమైనది అనే విషయం చరిత్రకారులకు చాలా ఆసక్తిదాయకంగా ఉంటుందని ప్రొపెసర్ బావించారు శ్రీ కృష్ణమీనన్ డా॥బోస్లా కూడా అంగీకరించారు వెంటనే ఐదు గినీలు రిజిస్ట్రేషన్ ఫీజుకట్టి లండను యూనివర్శిటీలో ఓరియంటల్ అండ్ ఆఫ్రికన్ స్టడీస్ కళాశాలలో విద్యార్థిగా చేరాను

నిజానికి నేను కాలేజీలో పూర్తిసమయం విద్యార్థినే అయినా నేను ప్రొఫెసర్ హాల్‌ని వారానికి ఒకసారి కలుసుకుంటే చాలన్నారు సాధారణంగా ప్రతి మంగళవారం ఉదయం కాలేజీకి వెళ్లి ప్రొఫెసర్‌ని కలుసుకుని ఒకటి రెండు గంటలు రిసెర్చి కార్యక్రమం చర్చించేవాణ్ణి చదవవలసిన పుస్తకాలు ఉన్నందున ముందు వాటి జాబితా తయారుచేసి, అవి చదవేటప్పుడు వాటిలో మనకు ఉపయోగించే విషయాలు నోట్సుగా వ్రాసుకోవడం ప్రధమ కర్తవ్యం నోట్సు వ్రాసుకోవడం ఆ నోట్సును మనకు కావలసినప్పుడు ఉపయోగించుకునేటట్టు ఇండెక్స్ తయారు చేయడం ఒక ప్రత్యేక కళ

లండనులో టావిటన్ వీధిలో ఐదవ నెంబరు ఇల్లు విదేశాలనుంచి వచ్చిన విద్యార్థుల కోసం శ్రీమతి టిటర్టన్ అనే ఆమె నడిపేది ఆమె బర్త బైటకురాగ

నేను ఎప్పుడు చూడలేదు పేదరికం అనారోగ్యంతో బాధపడుతూ ఉండేవాడు వారికి ఒక్కడే కుమారుడు పీటర్ నేను ఆ ఇంట్లో ఉన్న రోజుల్లో పీటర్ బ్రిటిష సేనలతో జర్మనీలో ఉండేవాడు ప్రతి బ్రిటిష పౌరుడు 18 ఏళ్ళు నిండగానే రెండేళ్లు దేశరక్షణ దళాల్లో పనిచేయాలి ఆ నిబంధన నుంచి తప్పించుకోవడం ఎవరికీ సాధ్యంకాదు రాజవంశానికి చెందిన వారికి కూడా ఆ సేవ తప్పదు బ్రిటన్‌లో నౌకాదళం సీనియర్ రక్షణ శాఖ కాబట్టి రాజవంశీయులంతా నౌకా దళంలో చేరతారు ప్రతి పౌరునికి నిర్బంధ సైనిక శిక్షణ, సేవ నిర్ణయించడం చాలా మంచి పద్ధతని వారి నమ్మకం పీటరు లండను వచ్చినప్పుడు జర్మనీలో అతడి సాహసాలు, అమ్మాయిలతో తిరుగుళ్ళు గురించి చెప్పేటప్పుడు వాళ్ళ అమ్మ ఇచ్చే సలహా నన్ను ఆశ్చర్య పరచేది ప్రతిసారి ఒకే అమ్మాయితో బైటకు వెళ్ళవద్దని ఆమె సలహా ఎక్కువమంది అమ్మాయిలతో తిరగడం క్షేమం అనేది చిత్రం ఏవిటంటే ఆ దేశంలో తల్లి దండ్రులు తమ కుమార్తెలకు కూడ అదే సలహా యిస్తారు అంటే మొదటి చూపులోనే ప్రేమ పుట్టుకు రావడాన్ని వారు అంతగా ప్రోత్సహించరు

ఆ ఇంట్లో ఉన్నవారంతా నియమిత సమయంలో బ్రేక్‌ఫాస్టుకి వెళ్ళాలి డైనింగ్ హాలులోకి పూర్తిగా డ్రెస్ చేసుకోకుండా వెళ్ళకూడదు నైట్ డ్రెస్సుతో వెళ్ళడం నిషిద్ధం సమయానికి తయారుకాలేకపోతే అధమం డ్రెస్సింగ్ గౌను అయినా వేసుకోవాలి సాధారణంగా ఆ దేశంలో ఎవరూ ఉదయం స్నానాలు చేయరు కాబట్టి వారికి పెద్ద ఇబ్బంది ఉండేదికాదు కాని ఉదయం స్నానం చేస్తే కాని బ్రేక్‌ఫాస్టు చేయడం అలవాటులేని నాకు కొంత యిబ్బందిగా ఉండేది, చలి దేశాలలో ప్రజలు రాత్రి పడుకోబోయే ముందు వేడినీళ్ళ స్నానం చేసి పడుకుంటారు ఉదయం లేవగానే ముఖం కడుక్కుని డ్రెస్ చేసుకొని బైటకు వెళతారు ఉదయం వేడి నీళ్ళ స్నానంచేసి చలిలోకి వెళితే నిమోనియా వస్తుందని వాళ్ళ భయం నన్ను కూడా అలా భయపెట్టడానికి ప్రయత్నించారు కాని ఉదయం స్నానం చేయకపోతే రోజంతా శరీరం అపరిశుభ్రంగా ఉందనిపిస్తుంది కాబట్టి ఉదయస్నానమే చేసేవాణ్ణి హాయిగా ఉండేది

విదేశాలలో ఉదయస్నానం అంటే ఒక విషయం గుర్తుకు వస్తుంది నేను లండను లో చదువుకుంటూ పత్రికా ప్రతినిధిగా ఉండేవాణ్ణి శ్రీమతి విజయ లక్ష్మి పండిట్ ఆ రోజుల్లో అమెరికాలో భారత రాయబారిగా ఉండేది ఒకసారి ఆమె లండను వచ్చినప్పుడు భారతీయ పత్రికా విలేఖరుల సమావేశం ఏర్పాటు చేసారు ఆమె అనేక విషయాలు చెప్పిన తరువాత అంతా లేచి కోట్లు వేసుకోబోయే సమయంలో మిత్రుడు తమాంకర్ శ్రీమతి పండిట్‌ని

రాజకీయాలతో సంబందంలేని ఒక ప్రశ్న వేసాడు దానితో అంతా కోట్లు అక్కడే పెట్టి ఆమె సమాదానం వినడానికి కూర్చున్నాం "విజయలక్ష్మీజీ మీ అందం, వర్చస్సు ఎలా కాపాడుకుంటారు" అని ప్రశ్న ఆమె చమత్కారంగా "నేను ఎలిజబెత్ ఆర్డెన్ పంపే మాక్సఫాక్టర్ క్రీములు ఉపయోగించకపోవడమే దానికి కారణం" అంది, ఒక క్షణం ఆగి ఎలిజబెత్ తన స్నేహితురాలని, ఆమె ప్రతి సంవత్సరం తనకు బహుమానంగా పంపే క్రీముల పెట్టె తన కుమార్తెలకు పంపించి తాను ప్రతిరోజు నిద్రలేవగానే చల్లటి నీళ్ళతో షవర్ స్నానం చేస్తానంది లక్నోలో ఉన్నా మాస్కోలో ఉన్నా వాషింగ్టన్ లండను ఏ పట్టణంలో ఉన్నా ఎంత చలిలో అయినా చల్లని నీళ్లతో ఉదయస్నానం చేయడమే తన సౌందర్య రహస్యం అంది అంత గడ్డ కట్టుకుపోయే చలిలో చల్లటి నీళ్లతో స్నానం చేయడానికి నేను సాహసించ లేకపోయాను

అక్కడ బైటకు వెళ్ళేటప్పుడు పూర్తిగా డ్రెస్ చేసుకోవడం తప్పదు ఆ ఇంటిలో మెయిడ్‌గా పనిచేసే ఆమె మాకు సలహాలు చెప్పేది సాక్సు టై లేకుండా సందు చివర ఉన్న పోష్టాపీసులో ఉత్తరం వేయడానికి కూడా వెళ్ళకూడదనేది సాక్సు వేసుకుంటే బూటు వేసుకోవలిసిందే టై కట్టుకుంటే కోటు వేసుకోవడం తప్పదు ఇక బైట నడిచేటప్పుడు చేతులు ఊపుకుంటూ నడిచేవాణ్ణి నాతో ఎవరు నడుస్తున్నా చేతులు ఊపుతూ నడవడం మంచిదికాదని గోలపెట్టేవారు ఎంత ప్రయత్నించినా చేతులు ఊపడం మానలేకపోయాను చివరకు రెండు చేతులు పంట్లాం జేబులోనో కోటుజేబుల్లోనో పెట్టుకుని నడవవలసి వచ్చేది ఆరోజుల్లో బ్రిటిషువారి జీవన విదానంలో చాలా నియమాలు నిషేదాలు ఉండేవి చేతిరుమాలు అడ్డు పెట్టుకోకుండా తుమ్మకూడదు ఆవలించకూడదు, తేన్చడం, తినేటప్పుడు శబ్దం చేయడం నిషేదం తుమ్మడం అంటే గుర్తుకు వచ్చింది నేను ఆంద్రాయూనివర్శిటీలో చదువుకునేటప్పుడు ప్రొపెసర్ శ్రీనివాసన్ మాకు హిస్టరీ చెప్పేవారు ఆయన లండను స్కూలు ఆఫ్ ఎకనామిక్స్‌లో చదువుకున్నాడు ఆయన చేతిరుమాలులో చీది అది కోటు జేబులో పెట్టుకునేవాడు మాకు ఆ అలవాటు అసహ్యం అనిపించేది, కాని ఇంగ్లండు వెళ్ళిన తరువాత ఆ అలవాటు చాలా ఆరోగ్యకరమైనదని అర్ధం అయింది

ఇక ప్లీజు ఎక్స్‌క్యూజ్ మీ అనే పదాలు ప్రతి సందర్భంలోను ఉపయోగించాలి బ్రేక్‌ఫాస్టు వద్ద ఉప్పు కావాలంటే ప్రక్కన కూర్చున్నవారిమీదుగా చేయచాచి తీసుకోకూడదు ఆ ఉప్పు యిలా ఇవ్వండి ప్లీజ్ అనాలి మనమే తీసుకోవాలంటే క్షమాపణ చెప్పుకోవాలి

ఒకప్పుడు మనకు కూడా ఈ మర్యాదలన్నీ ఉండేవి మన కాలు ఎవరికైనా తగిలితే నమస్కారం పెట్టి చేతులతో కళ్లకు అద్దుకునే వారు రానురాను ఆ మర్యాదలు పోతున్నాయిలెండి ఇక ప్లీజు అనడం వాళ్ళకు చిన్నతనంనుంచి నేర్పిన విద్య వాళ్ళకు సహజంగా, సునాయాసంగా ప్లీజు అనడం వస్తుంది మనకు అటువంటి మాట అలవాటు లేనందున సులభంగా వచ్చేది కాదు పాల బూత్‌కి వెళ్ళి అరలీటరు పాలు యివ్వమని అడిగితే అక్కడ అమ్మాయి ప్లీజ్ అనేది అప్పుడు నేను ప్లీజ్ అనేవాణ్ణి మొదట్లో ఆ పద్ధతులు, అలవాట్లు నియమ నిబంధనలు కొంచెం ఇబ్బందికరం అనిపించినా కాలక్రమేణా అలవాటైపోతే హాయిగా ఉండేది

ఈ సందర్భంలో థాంక్స్ చెప్పడం కూడ తెలుగువాళ్ళకు అలవాటు లేదని వేరే చెప్పాలా ఇంగ్లీషు చదువుకున్నవారి మాట వేరు తెలుగులో థాంక్స్ అంత సులువుగా వచ్చే మాటలేదు మనకి ఎవరైనా ఏదైనా సహాయం చేస్తే మన కృతజ్ఞతలు తెలియజేయడానికి అనేక పద్ధతులు ఉన్నాయి కాని ప్రతి చిన్నదానికి థాంక్యూ అనడం మన పద్ధతి కాదు అయితే అవతలివాడు థాంక్స్ అని చెబితే మనం ఏమి చెప్పాలనేది కొంచెం యిబ్బంది పెట్టేది కొందరు మనం థాంక్స్ చెపితే తిరిగి థాంక్సు అంటారు మరి కొందరు నోమెన్షన్ అంటారు ఇది చాలా వరకు అమెరికను ప్రభావం అయి ఉండాలి కొందరు థాంక్స్ చెబితే ఏమి అనరు ఎవరి పద్ధతివారిది

లండను యూనివర్శిటీ స్కూల్ ఆఫ్ ఆఫ్రికన్ అండ్ ఏషియన్ స్టడీస్ లో రిసెర్చి చేయడానికి సీటు రావడం, అక్కడ చేరిపోవడం జరిగిపోయాయి డిగ్రీ తీసుకుని జయప్రదంగా భారత దేశానికి తిరిగి రావాలంటే మూడేళ్ళు నిర్విరామంగా నిరంతర కృషి అవసరం కాని నా ఆర్థిక పరిస్థితులు నానాటికి తీసికట్టు అవుతున్నాయి భారతదేశం నుంచి తీసుకువెళ్ళిన కొద్ది మొత్తం హారతికర్పూరంలా హరించుకుపోతోంది దేశం నుంచి ఒక్క పైసా వచ్చే అవకాశంలేదు కషంలో చిక్కుకున్న ఈగలా ఉంది నాపరిస్థితి దానికి తోడు 5 వ నెంబరు టావిటన్ వీధిలోని ఇంట్లో వారానికి గదికి, బ్రేక్‌ఫాస్ట్‌కి మూడు గినీలు యిచ్చి అక్కడ ఉండడం నాబోటివారికి నిజంగా సాహసమే అని అర్థం అయ్యే సరికి ఆలస్యం అయిపోయింది నేనున్న ఇంటి యజమానురాలు శ్రీమతి టిటర్టన్ లండనులోని అందరి లాండ్ లేడీస్ కంటే చాలా ఖచ్చితమైన మనిషిగా చెప్పుకునేవారు వారానికి ఒకసారి డబ్బు కట్టవలసినదే ఎవరికీ ఏవిధమైన దయా దాక్షిణ్యాలు చూపించకపోవడం ఆమె ప్రత్యేకత అని చెప్పుకునేవారు ఆమె ఎంత నిర్దాక్షిణ్యంగా విద్యార్థులనుంచి డబ్బు వసూలు చేసినా ఆమె డబ్బు అడిగే పద్ధతి ముచ్చటగా ఉండేది బిల్లు వ్రాసి కవర్లో పెట్టి

[illegible] అంటించి హాలులో బల్లమీద పెట్టేది అది చూచుకుని వెంటనే డబ్బు కట్టాలి ఏ కారణం వల్లనైనా ఒక వారం కట్టకపోతే బిల్లు మీద ఎర్రసిరాతో వ్రాసి ఉండేది కవరు అంటించి ఉండేది కాబట్టి లోపల ఏ సిరాతో వ్రాసేదో మూడవ వ్యక్తికి తెలియదు నేను వారం వారం డబ్బుకట్టడంలో వెనకపడిపోతున్నాను దానితో బాకీ పెరిగిపోతోంది ఎంత మర్యాదగా అడిగినా నాకు బాధగానే ఉండేది

ఇంటికి తిరిగిరాగానే హాలులో బల్లమీద కవరు కనపడితే గుండెల్లో రైళ్లు పరుగెత్తేవి ఆ బిల్లు తీసుకుని వంటగదికి వెళ్ళి యజమానురాలిని కలుసుకుని డబ్బు సర్దుబాటు కాలేదని చెప్పి బైటపడే వాణ్ణి చిత్రం ఏమిటంటే మళ్ళా వారం పూర్తిఅయ్యే వరకు ఆమె అడిగేదికాదు

మిత్రుడు కూనపరెడ్డి కృష్ణారావు అతడి మిత్రురాలు బానుమతి మీనన్ అమెరికా వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు కృష్ణ లండను యూనివర్శిటీలో ఎల్ ఎల్ ఎం పూర్తిచేసాడు సాదారణంగా నేను వాళ్ళిద్దరితోను తిరిగేవాడిని ఇద్దరు అబ్బాయిలు ఒక అమ్మాయి తిరగడం బాగోదని మరొక అమ్మాయిని తమ హాస్టలు నుంచి తీసుకువస్తానంది బాను ఆ మాట వింటే శ్రీనాదుడు "తిరిపెమున కిద్దరాండ్రా" అన్న పద్యం గుర్తుకు వచ్చింది అప్పటి నాఆర్థిక స్తోమత ఒక అమ్మాయిని కూడా తిప్పడానికి సరిపోదని వాళ్ళకి తెలుసు డబ్బు ఖర్చు లేకుండా సరదాగా మనతో తీసుకు వెళ్ళడానికి తన స్నేహితురాలిని తీసుకువస్తానంది అయితే వాళ్ల హాస్టలులో ఏదో పార్టీకి వెళ్ళిన సందర్భంలో చూచిన చైనీస్ అమ్మాయిని తీసుకు రమ్మన్నాను ఆమె తన మిత్రుడితో "స్టడీ"గా ఉంది కాబట్టి వీలు లేదంది తన ఫ్రెంచి మిత్రురాలిని తీసుకు వచ్చింది

సందర్భం వచ్చింది కాబట్టి "స్టడీ"గా వెళ్ళడం అంటే ఏమిటో చెప్పాలి అమ్మాయి అబ్బాయి చాలా మాసాలుగా చాలా మందితో తిరిగి చివరకు ఆ యిద్దరు మరెవరితోను వెళ్ళడం మానేసారు వారిద్దరే తిరుగుతారు అది డేటింగ్ లో చివరిమెట్టు ఆ రోజుల్లో డేటింగ్ అనే పద్ధతి మన దేశంలో ఉండేదికాదు అసలు యూనివర్శిటీ ఆవరణలో కాని బైటకాని అమ్మాయితో మాట్లాడ్డం అంటే గొప్ప సాహసం చేయడమే అంతేకాదు, ఆ మరునాడు గోడలమీద ఎక్కడం తద్యం అటువంటి వాతావరణంలో నుంచి లండను వెళ్ళి ఆడవాళ్ళు మగవాళ్ళు కలిసి తిరగడం సినీమాలకు డాన్సులకు, భోజనాలకు కలిసివెళ్ళడం చూస్తే కొంత గడబిడిగానే ఉంటుంది ఒక అబ్బాయి ఒక అమ్మాయిని భోజనానికి పిల్చి సినీమాకు తీసుకు వెళ్ళినా డాన్సుకి తీసుకువెళ్ళినా దానిని డేటింగ్ అనేవారు అయితే ఒక జంట కార్యక్రమం

నిర్ణయించుకున్న తరువాత అకస్మాత్తుగా మరొక మిత్రుడు వస్తే అతడికి తోడుగా ఆ అమ్మాయి తన మిత్రురాల్ని తెస్తుంది దానిని బ్లైండ్ డేట్ అనేవారు. బాను తీసుకువచ్చిన ఫ్రెంచి అమ్మాయి నాకు బ్లైండు డేటు అన్నారు ముక్కు మొఖం తెలియని అమ్మాయితో రోజంతా కబుర్లాడుతూ పార్కుల లోను ప్రదర్శన శాలల్లోను తిరగడానికి బోలెడు ఓపిక తీరిక, మాటకారితనం కావాలి ఆ రోజు తరువాత మళ్లా ఆ అమ్మాయిని కలుసుకోలేదు అది నిజంగా బ్లైండ్ డేట్ అయింది

ఆర్థిక ఇబ్బందులు సరదాలు ఎలా ఉన్నా చదువుకి ప్రథమ తాంబూలం ప్రొఫెసర్ హాల్ నా రిసెర్చికి కావలసిన సదుపాయాలు చేసుకోవడంలో తోడ్పడ్డారు ముందుగా అనేక గ్రంధాలు చదవడం, వాటినుంచి నాకు కావలసిన నోట్సు రాసుకోవడం ప్రారంభించాను లండనులోని బ్రిటిష మ్యూజియం లైబ్రరీ నా పాలిట వరప్రసాదం అయింది ఆ లైబ్రరీలోనే కూర్చుని కారల్ మార్క్స్ దాస్ కాపిటల్ వ్రాసారని చెప్పుకుంటారు విజ్ఞాన సముపార్జనా పిపాస ఉన్న వారికి బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీ జీవనది వంటిది సాదారణంగా ఆ లైబ్రరీలో లభ్యంకాని గ్రంధం ఉండదు అందుకే అక్కడ కూర్చుని ప్రపంచంలోని ఏ భాషలోనైనా, ఏ విషయం మీదనైనా రిసెర్చి చేయవచ్చునంటే అతిశయోక్తి లేదు ఇక ఆ లైబ్రరీలో పని చేసే సిబ్బంది సామర్ధ్యం విషయ పరిజ్ఞానం విద్యార్థులకు తోడ్పడాలనే ఆకాంక్ష నిరుపమానం మనకు కావలసిన గ్రంధం వారిని అడిగి తెచ్చుకోవాలి ఐదు నిమిషాల్లో ఆ పుస్తకం మనకు అందిస్తారు మామూలుగా అయితే గ్రందం వివరాలు దాని నెంబరు స్లిప్ మీద వ్రాసి ఇవ్వాలి అలా చేయగలగడానికి క్రొత్త వారికి సిబ్బంది తోడ్పడతారు నిజంగా ఆ లైబ్రరీలో కూర్చుని చదువుకోవడం ఒక గొప్ప అనుభూతి అదృష్టమనే చెప్పాలి

ఇక ప్రభుత్వ రికార్డులు చూడాలంటే పబ్లిక్ రికార్డు ఆఫీసులో కూర్చుని చూడాలి దానిని లైబ్రరీ అనరు అక్కడ కూడా సిబ్బంది, లైబ్రరీయన్లు అత్యంత సమర్థులు 1890లో బ్రిటిష విదేశాంగ మంత్రి ఫలానా విషయం మీద ఫైలు మీద ఏమి వ్రాసాడో తెలుసుకోవాలంటే ఆ మాట లైబ్రరీయన్‌కి చెప్పడమే పది నిమిషాలలో దానికి సంబంధించిన సమాచారం మన ముందు ఉంచుతారు అక్కడ ఉన్న సమాచారం అంతా ఒరిజినల్ ప్రభుత్వ రికార్డులు నేను రిసెర్చి చేసేటప్పుడు 50 ఏళ్ళ ముందు రికార్డులు మాత్రమే చూడ్డానికి అనుమతించేవారు 50 ఏళ్ళ లోపు రికార్డులు చూడనివ్వరు అయితే ఆ తరువాత 50 ఏళ్ళ నియమాన్ని 35 ఏళ్లకు తగ్గించారు అంటే ఆధునిక విషయాలమీద బ్రిటిష యూనివర్శిటీలో రిసెర్చి చేయడం సాధ్యం కాదు ముఖ్యంగా

వార్తాపత్రికల సహాయంతో థీసిస్ తయారుచేసే అమెరికన్ పద్దతిని బ్రిటిషు ప్రొఫెసర్ హర్షించరు పబ్లిక్ రికార్డు ఆఫీసు లోని రీడింగ్ రూమ్ లోనికి వెళ్ళేటపుడు నోట్సు వ్రాసుకోవడానికి తెల్ల కాగితాలు, పెన్సిల్ తప్ప మరేమి తీసుకువెళ్ళనివ్వరు ఫౌంటెన్ పెన్స్, బాల్ పెన్సు నిషేదం ఆ నిషేదానికి కారణం విద్యార్థులు రికార్డుల మీద పెన్‌తో ఏవిదమైన మార్కులు పెట్టినా ఆ రికార్డుల యొక్క పవిత్రత పోతుందని వారి బయం ఆ రికార్డులను వారు ఎంత జాగ్రత్తగా చూస్తారో వింటే ఆశ్చర్యంగా ఉంటుంది మనం అడిగిన వాల్యూమ్ వాళ్ళ మనిషే తెచ్చి మనం కూర్చున్న టేబిల్ మీద పెడతాడు ఆ గదిలో నుంచి మరొక గదిలోకి మన సీటు మారిస్తే వాళ్ళకు చెప్పాలి మళ్లా వాళ్ళే ఆ వాల్యూం మరొక గదిలో పెడతారు మనల్ని మాత్రం తీసుకువెళ్ళనివ్వరు చదువుకోవడం అయిపోయిన తరువాత కూడా మనం ఆ వాల్యూమ్‌ని తీసుకువెళ్ళి కౌంటర్ దగ్గర ఇవ్వ కూడదు వెళ్ళిపోతున్నానని వాళ్ళకు చెబితే చాలు వాళ్ళే తీసుకుపోతారు కొన్ని వందల సంవత్సరాలనాటి ప్రబుత్వ రికార్డులు వారు జాగ్రత్తపెడతారు నేను చూడలేదు గాని వారు చెప్పిన సమాచారం ప్రకారం బూగర్భంలో ఐదుమైళ్ళు పొడవున రికార్డులు బద్రపరచడానికి అత్యంత ఆదునికమైన ఏర్పాట్లున్నాయట రిసెర్చి చేసేవారికి బ్రిటిషు పబ్లిక్ రికార్డు ఆఫీసు అత్యంత అద్భుతమైన అనుభవం

ఇండియా హౌస్ లైబ్రరీ కూడా చాలా ముఖ్యమైనదే అయితే దాని ప్రత్యేకత బారతదేశం నా రిసెర్చిలో బారతదేశానికి స్థానం లేకపోయినా తరచు ఆ లైబ్రరీకి వెళ్ళేవాడిని ఇండియా హౌస్ లైబ్రేరియన్ మిస్ వినిఫ్రెడ్ థారన్ ఆమెను గురించి మరొకసారి వ్రాస్తాను విదేశవ్యవహారాల శాఖ వారి లైబ్రరీ అంత పెద్దది కాకపోయినా నాకు బాగానే ఉపయోగపడింది సయాం గురించి కొన్ని రిపోర్టులు దుమ్ముకొట్టుకుపోయి ఉన్నవాటిని బైటకు తీసి, వాటిలోని చక్కటి విషయాలు ఉపయోగించుకున్నాను యూనివర్సిటీ లైబ్రరీ నాకు కొద్దిగా మాత్రమే ఉపయోగించింది

లండనులో చదువు సాగిపోతోంది ప్రొఫెసర్ హాల్ మంచి మేధావి నా రిసెర్చికి కావలసిన సలహాలు సంప్రదింపులకోసం ఆయన్ని ప్రతి మంగళవారం కలుసుకునే ఏర్పాటు చేసుకున్నాం గంటా రెండు గంటలు ఆయనతో చర్చించేవాణ్ణి నేను కాలేజీకి వెళ్ళేది వారానికి ఒక రోజు మాత్రమే మిగిలిన సమయం అంతా లైబ్రరీలలో కూర్చుని చదువుకోవడం, నోట్సు రాసుకోవడమే కాలక్షేపానికి, వినోదానికి జేబులో డబ్బు ఉండాలే గాని లండనులో అవకాశాలు కోకొల్లలు డబ్బు ఖర్చుపెట్టకుండా ఆనందించడానికి మ్యూజియంలు, ఆర్టుగ్యాలరీలు ఉండనే ఉన్నాయి మిత్రుడు కృష్ణారావు,

భాను అమెరికా వెళ్ళిపోయిన తరువాత లండను వీధుల్లో ఒంటరిగా తిరిగేవాణ్ణి కాలక్షేపానికి నేను ఉండే ఇంటికి దగ్గరలో ఉన్న క్వేకర్ సెంటరుకి వెళ్ళడం మొదలుపెట్టాను క్వేకర్లు క్రిష్టియన్ మతంలో భాగమే గాని దాని ప్రత్యేకత, విశిష్టత దానికున్నాయి హిందూమతంలో నుంచి బౌద్ధ, జైనమతాలు ఆవిర్భవించినట్లే, క్రైస్తవ మతంలో పెరిగిపోతున్న మూడాచారాలు వ్యక్తిపూజ, విగ్రహారాదన మొదలైన వాటికి వ్యతిరేకంగా కాల్విన్ మహాశయుడు ఉద్యమం లేవదీసి క్వేకర్ సిద్ధాంతాలు రూపొందించాడు క్వేకర్లు చర్చికి వెళ్ళరు ఒక హాలులో సమావేశమై నిశ్శబ్దంగా ప్రార్ధనలు చేసుకుంటూరు ప్రార్ధనల ఆర్భాటం, తంతు ఉండదు వారి వ్యక్తిగత జీవితాల్లో కూడా నీతి నియమాలు, సంఘసేవ ముఖ్యమైనవి

లండనులో టావిటన్ వీధిలో ఉన్న క్వేకర్ సెంటరుకి వాళ్ళ ప్రార్థనలు చూడాలనే ఉత్సుకతతో ఒకసారి వెళ్లాను చాలా ప్రశాంతంగా ఉంది ఆ సెంటరులో సాయంకాలం వినోదానికి ఆటలు, పాటలు కాలక్షేపానికి కబుర్లు చెప్పుకోవడానికి అవకాశం ఉండేది అయితే ఆ సెంటరుకి వచ్చేవారు చాలావరకు విదేశీయులు ఇంగ్లీషువారు చాల తక్కువమంది ఉండేవారు హెచ్చుగా యూరోపియన్ దేశాలనుంచి వచ్చిన అమ్మాయిలు ఇండియా ఆఫ్రికా, వెస్ట్ ఇండీస్ దేశాలనుంచి వచ్చిన అబ్బాయిలు ఉండేవారు లండనులో యూరోపియన్ దేశాలనుంచి వచ్చిన అమ్మాయిలు చాలా హెచ్చు సంఖ్యలో ఉండేవారు వారంతా ఇంగ్లీషు భాష నేర్చుకోవడానికి వచ్చినవారే వారు ఇంగ్లీషు నేర్చుకునే పద్ధతి చిత్రంగా ఉంటుంది వారు బడికి వెళ్ళరు ఇంగ్లీషు కుటుంబాలలో పనిమనుషులుగా చేరి వారి ఇంట్లోనే ఉంటూ ఇంగ్లీషు మాట్లాడ్డం నేర్చుకుంటూరు పనిమనుషులు లేని లండను గృహిణులకు యూరోపియన్ అమ్మాయిలు వరప్రసాదం నిజానికి ఆ అమ్మాయిలు అంతా పేదవారు కాదు పనిమనిషిగా ఉండనక్కరలేదు కాని మకాం ఇచ్చి, భోజనం పెట్టి బాష నేర్చుకోవడానికి అవకాశం ఇచ్చే ఆ పద్ధతి ఉభయతారకంగా ఉండేది వీరు సామాన్యంగా లండనులో ఆరు మాసాలనుంచి ఒక ఏడాది వరకు ఉండి అవసరమనిపిస్తే తిరిగి వచ్చేవారు ఆవిధంగా ఇంగ్లీషు నేర్చుకున్నవారికి వారి దేశాలలో చక్కటి ఉద్యోగావకాశాలుంటాయని వారు చెప్పేవారు యూరోపియన్ దేశాలనుంచి వచ్చినవారే కాక ఐర్లండునుంచి కూడా చాలామంది యువతులు లండను వచ్చి అనేక పనులలో చేరతారు

రెండవ ప్రపంచ యుద్ధంలో అసంఖ్యాకంగా మానవ మారణహోమం జరిగినందున ఇంగ్లండులో మగవారి జనాభా తగ్గిపోయింది ఇళ్ళలో సేవకులు, చిన్న రైలు స్టేషన్లలో కూలీలు, పేపర్లు అమ్మడానికి మనుష్యులుకూడా

కరువయ్యారు భారతదేశాన్ని బ్రిటిషువారు పాలించిన రోజుల్లో రాష్ట్ర గవర్నర్లుగా చేసినవారు కూడా ఇంగ్లండులో తమ ఊరికి రైలులో వెడితే తమ పెట్టెలు తామే మోసుకోవడం అతి సామాన్యమైన విషయం లండనులో అనేక ప్రదేశాలలో దినపత్రికలు ఒక చోట పెడితే ప్రజలు వాటి దర అక్కడ పడవేసి పేపరు పట్టుకుపోయేవారు సాయంకాలం ఆ పేపర్లు పెట్టిన వికలాంగుడు వచ్చి ఆ డబ్బులు, మిగిలిన పేపర్లు పట్టుకుపోతాడు అలా పడవేసిన డబ్బులు ఎవరూ ముట్టుకునేవారు కాదు పేపర్లు కూడా ఎవరూ డబ్బులు వేయకుండా తీసుకునేవారు కాదు నాకు అదంతా చూస్తే ఆశ్చర్యంగాఉండేది ఎవరిపనులు వారు స్వయంగా చేసుకోవడం బ్రిటిషువారికి వెన్నతో పెట్టిన విద్య అలా పనులు చేసుకోవడంలో ఎంతో గౌరవం, దర్జా ఉందని వారి పెద్దల ఉద్బోధ

ఇంగ్లండులో నేను చూచిన మొదటి క్రిస్టమస్ ఒక అపూర్వ అనుభవం ఇంకా క్రిస్టమస్ నెల రోజులు ఉందనగా లండను నగరంలోని అన్ని షాపులు అద్భుతంగా అలంకరించి పండుగ కోసం షాపింగ్ చేసే ప్రజల్ని ఆకర్షించడానికి పోటీ పడుతున్నాయి అన్ని రంగాలలోను ప్రత్యేక ఆకర్షణలు లండన్ అంతా కన్నులపర్వంగా సర్వశోభాయమానంగా ఉంది క్రైస్తవులకు క్రిస్టమస్ పెద్ద పండుగ కావడం వల్ల అంత పెద్ద ఎత్తున పండుగ ఏర్పాట్లు చేసారు మనదేశంలో దీపావళి పండుగ కొందరికి దివ్యదీపావళి అయితే మరికొందరికి ఉత్త అమావాస్య మాత్రమే అవుతుంది లండన్‌లో ఒంటరిగా ఉన్న నాపై క్రిస్టమస్ ప్రభావం ఏమీలేదు కాని క్వేకర్ సెంటర్ పుణ్యామా అంటూ నాకు ఇంగ్లీషు కుటుంబంతో క్రిస్టమస్ డిన్నర్ చేసే అవకాశం దొరికింది ఒక ఇంగ్లీషు కుటుంబం క్వేకరు సెంటరుకి జాబు వ్రాస్తూ ఎవరైనా విదేశీ విద్యార్థిని క్రిస్టమస్‌నాడు తమ ఇంటికి భోజనానికి పంపమని కోరారు ఆ లేఖ నోటీసుబోర్డులో పెట్టారు అది చూచి వారి ఇంటికి అతిథిగా నేను వెళ్ళడానికి నా అంగీకారం తెలియజేసాను

డిసెంబరు 25 వ తేదీన రైలులో బయలుదేరి వారి గ్రామం చేరాను నిజంగా అది గ్రామమే అయితే ఇంగ్లండులో గ్రామాలు కూడా ప్లాను ప్రకారం నిర్మించిన గృహాలతో చూడముచ్చటగా ఉంటాయి నేను లండను చేరిన తరువాత ప్రప్రథమంగా ఒక ఇంగ్లీషు కుటుంబాన్ని కలుసుకోవడానికి ఒక గ్రామం వెళ్ళాను పెద్ద ఇబ్బంది లేకుండా వారి ఇల్లు కనుక్కున్నాను ఇల్లయితే చిన్నదేగాని ఎంతో చక్కగా తీర్చిదిద్దారు ఆ కుటుంబం కూడా చాలా చిన్నది భార్య భర్త, ఒక కుమార్తె ఆమె పేరు మారియన్ ఆ అమ్మాయి లండనులో కామన్వెల్తు ఆఫీసులో ఉద్యోగం చేస్తుంది 23 ఏళ్ళు ఉంటాయి అవివాహిత చాలా అందగత్తె ఆమె పియానో వాయించింది పాశ్చాత్య సంగీతంతో నాకు

ప్రథమ పరిచయం ఆ అమ్మాయి పియానో కచేరీలు ఇచ్చే స్థాయికి చేరకపోయినా చాలా పరీక్షలలో ఉత్తీర్ణురాలైన దిట్ట షొపెన్ మొజార్ట్, బిథోవిన్, షూల్బ్స మొదలైన సంగీత స్రష్టల రచనలు పియానోపై వాయించి పాశ్చాత్య సంగీతంలోని మెలకువలు అందాలు చెప్పింది హాలులో క్రిస్టమస్ చెట్టు దానిచుట్టూ క్రిస్టమస్ కార్డులు, ఆ చెట్టు కొమ్మలకు కట్టిన బహుమతులు, అలంకారాలతో అందంగా ఉంది బహుమతులు క్రిస్టమస్‌నాడు విప్పరట క్రిస్టమస్ మరుచటిరోజును బాక్సింగ్ డే అంటారు అది బహుమానాలు ఇచ్చిపుచ్చుకునే రోజు కాబట్టి దానిని బాక్సింగ్ డే అన్నారు కాని ఆ బాక్సింగ్‌కి మహమ్మదాలీ బాక్సింగ్‌కి ఏమీ సంబంధం లేదని ఆ ఇంటి యజమాని చమత్కరించాడు

ఆరోజు ఆనందంగా గడిపి టీ అయిన తరువాత రైలుకి బయలుదేరాను ఆ కుటుంబం అంతా రైలుస్టేషను వరకు వచ్చి నన్ను సాగనంపారు ఆ తరువాత వారిని చాలాసార్లు కలుసుకున్నాను నేను ఇంగ్లండులో బాగా ఎరిగిన కొద్ది కుటుంబాలలో అది ఒకటి మారియన్ లండనులో ఉద్యోగం చేసేది కాబట్టి అప్పుడప్పుడు కలుసుకునేవాళ్ళం నన్ను ఒక్క పైసా ఖర్చుపెట్టనిచ్చేది కాదు ఏదో నేను ఎం ఏ చదివానంటే వారికి గొప్ప అనిపించింది ఇక పిహెచ్ డి కోసం చదువుతున్నానంటే వాళ్ళకి సంభ్రమాశ్చర్యాలతో బాటు బోలెడు గౌరవం దానికి కారణం తెలుసుకోవడానికి ఎంతో కాలం పట్టలేదు ఆ దేశంలో మెట్రిక్యులేషన్ కంటే పై చదువులు చదివేవారు చాలా తక్కువ కాలేజీ చదువులకు వెళ్ళేవారే తక్కువ ఇక యూనివర్సిటీకి వెళ్ళి రిసెర్చి డిగ్రీలు పుచ్చుకోవడం అంటే వారికి చాలా గొప్ప చిత్రం ఏమిటంటే పైచదువులు చదివేవారికందరికి ఆ చదువు అయిన తరువాత ఏమి చేయాలో నిర్దిష్టమైన ధ్యేయం ఉంటుంది

రిసెర్చి ఉగ్రీ పుచ్చుకున్నాడంటే ప్రొఫెసరు అవ్వాలి డిగ్రీలు తీసుకుంటే సివిల్ సర్వీసు పరీక్షలు, విదేశ వ్యవహారాలకు సంబంధించిన పరీక్షలు ట్రెయినింగ్ అదంతా బ్రిటిషు పౌరునికి మరో ప్రపంచం అక్కడ జీవనోపాధికి డిగ్రీలు అవసరం లేదు కాలక్షేపం కోసం పెద్దచదువులు చదవడం వారికి అలవాటు లేదు అది మనదేశపు ప్రత్యేకత పిహెచ్ డి అయిన తరువాత ఇండియా వెళ్ళి ఏమిచేస్తావని వారు ఎంతో ఉత్సుకతతో అడిగిన ప్రశ్నకు నావద్ద సరియైన సమాధానం లేనందువల్ల కొంత ఇబ్బందిగా ఉండేది అనుకోకుండా మొదటి క్రిస్టమస్‌నాడు ఏర్పడిన మా మిత్రత్వం నేను లండనులో ఉన్నంతకాలం మాత్రమే కాకుండా ఆ తరువాత కూడా కొనసాగడం నాకు అత్యంత ఆనందదాయకమయింది

నా లండను చదువు మాట దేవుడెరుగు లండనులో నా బ్రతుకు నానాటికి బారమయిపోతోంది లండనులో ఏదైన పార్ట్టైం ఉద్యోగం చేయడానికి నేను సిద్ధంగా ఉన్నా అవకాశాలు కనిపించలేదు టావిటన్ వీదిలోని ఐదవ నెంబరు ఇంటి యజమానురాలు శ్రీమతి టిటర్టన్ ఎంత చండశాసనురాలైనా నా విషయం లో మాత్రం ఆమె చాలా సానుబూతితో సహనంతో ప్రవర్తించింది అప్పటికే 35 వారాలు గడిచిపోయాయి ఆమెకు నేను రు 1500ల మేరకు బాకీపడిపోయాను నాకు మనశ్శాంతి కరువయింది నాకుకాని ఆమెకుకాని నా పరిస్థితికి పరిష్కార మార్గం కనిపించలేదు నేను ఆమె ఇంట్లో ఉన్న ప్రతి వారానికి నా పద్దు 50 రూపాయలు పెరిగిపోతోంది ఆమె బ్రేక్ఫాస్ట్ పెడుతోంది కాబట్టి ఏ లయన్సు కార్నర్ హౌస్లోనో పరమచౌక భోజనం ఒక పూట చేసి కాలక్షేపం చేస్తున్నాను కానీ కాలేజీకి వెళ్ళినా లైబ్రరీలో కూర్చున్నా ఆర్థిక సమస్య లాండ్లేడీ అప్పు బ్రహ్మ రాక్షసిలా ప్రత్యక్షమయ్యేది

ఇక ఉపేక్షించడానికి వీలులేని పరిస్థితి వచ్చింది శ్రీమతి టిటర్టన్తో మాట్లాడి ఒక పదకం వేసాను తక్షణం నేను ఆమె యిల్లు వదలిపెట్టి ఏదైనా చిన్న గది చూచుకోవడం మొదటి బాగం నేను ఆమె ఇల్లు వదలడానికి ఆమెను ఒప్పించాను సాదారణంగా బాకీ తీరిస్తే కాని ఇల్లు వదలనివ్వరు కాని నా పరిస్థితి ఆమెకు స్పష్టంగా తెలియజేసిన తరువాత నేను బాకీ తీర్చకుండానే మరొక గదికి మారడానికి ఆమె అంగీకరించింది నేను తనకు యివ్వవలసిన డబ్బు ఇచ్చేస్థితిలో లేనని ఆమెకు అర్థం అయ్యింది కాని ఒకసారి ఇల్లు వదిలితే మళ్ళా కనబడతాడో లేదో అని అనుమానం ఆమె మనస్సులో ఏమనుకుందో తెలియదు కాని నేను మరొక చోటికి మకాం మార్చినా బాకీ తీర్చడానికి ప్రయత్నిస్తాననే నమ్మకం కలిగించాను అంతే కాదు ఏదైనా చిన్నగది వెతుక్కోవడానికి ఒక ఫోను ఆమె వద్దనే పుచ్చుకున్నాను లండను అంతా తిరిగి చివరకు బ్రిటిష మ్యూజియంకి దగ్గరలో మ్యూజియం వీదిలో 46వ నెంబరు ఇంట్లో ఒక గది అద్దెకు తీసుకున్నాను ఆ ఇంటి యజమాని ఒక బెంగాలీ ఆయన ఒక ఇంగ్లీషు ఆమెను వివాహం చేసుకుని లండనులో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు నేను గది తీసుకున్న ఇల్లు ఆయన అద్దెకు ఇవ్వడానికే ఉపయోగిస్తాడు ఆయన మకాం మరొకచోట ఆ గదులలో ఉన్నవారికందరకీ ఒకటే బాత్రూమ్ రెండు లెట్రిన్సు ఉన్నాయి ఆ గదికి అద్దె వారానికి 30 షిల్లింగులు మాత్రమే ( 20 రూపాయలు) సదుపాయాలు ఏమీ లేకపోయినా లండను నడిబొడ్డులో ఉంది అదొక్కటే గొప్ప సదుపాయం బ్రేక్ఫాస్ట్ రాత్రి భోజనానికి ఆ చిన్న గదిలోనే వంటపెట్టేశాను ఇక వంట అంటారా! నలబీమ పాకం తయారు చేయలేకపోయినా ఉన్నంతలో చక్కటి

భోజనం తయారుచేయగల సమర్థత లేకపోలేదు అప్పటికి లండనులో బియ్యం పప్పులు బాగానే దొరికేవి ఈ వంట వ్యవహారం చదువుకి అడ్డురాకుండా మధ్యాహ్న భోజనం బైటనే చేసేవాడిని

ఆర్థిక సంక్షోబాన్ని ఎదుర్కోవడానికి వేసిన పథకంలో రెండవ భాగంగా శ్రీమతి టిటర్‌టన్‌ని భారత హైకమిషనర్ వద్దకు వెళ్లమన్నాను నేను ఆమెకు బాకీ పడినట్టు చెప్పమన్నాను ఆమె నా సలహా విని ఆశ్చర్యపోయింది అలా హైకమిషనరుతో చెబితే నాకేమైనా అపకారం జరుగుతుందేమోనని సందేహించింది నా ప్రోత్సాహంతో ఇండియా హౌస్‌కి వెళ్ళి నేను వంద పౌన్లు పైగా బాకీ పడ్డానని చెప్పింది హైకమిషనర్ శ్రీ కృష్ణమీనన్ నాకుకబురుపెట్టి "ఏమిటి నీవు ఆర్థిక ఇబ్బందులలో ఉన్నావా?" అన్నారు "ఉన్న ఇబ్బందులే అవి" అన్నాను హైకమిషనులో విద్యాశాఖాధికారిగా ఉన్న డా॥ జగన్నాధ బోస్లే వద్దకు వెళ్ళమన్నారు ఆయన కూడా నా కథంతా విన్నారు ఏదైనా సహాయం చేయడానికి ప్రయత్నిస్తానన్నారు టూవిటన్ వీధిలో ఇల్లు వదలిపెట్టినా ప్రతివారం అక్కడికి వెళ్ళి శ్రీమతి టిటర్‌టన్‌ని కలుసుకుని టీ త్రాగి ఇంకా డబ్బు సర్దుబాటు కాలేదని చెప్పేవాణ్ణి అంతేకాదు, అప్పుడప్పుడు ఆమెవద్ద ఒకటి అరా పౌను తీసుకునేవాణ్ణి విసుక్కుంటూ వంద పౌన్లు పైగా అప్పు ఉంటే యింకా డబ్బు అడుగుతున్నావా! అనేది ఆ పాతబాకీలో కలుపుకోమనేవాణ్ణి చివరకు ఆ పౌను పుచ్చుకుంటేకాని వదిలేవాణ్ణి కాదు

ఆ రోజులు తల్చుకుంటే ఒక సన్నివేశం గుర్తుకు వస్తుంది ఒక సాయంకాలం గదిలో కూర్చుని చదువుకుంటున్నాను నా ప్రక్కగదిలో ఉంటున్న ఇంగ్లీషు యువకుని కోసం ఒక అమ్మాయి వచ్చింది అతగాడు బైటకు వెళ్ళాడు అలా వచ్చిన వారు కూర్చోవడానికి ఆ ఇంట్లో జాగాలేదు నా గది తలుపు కొట్టింది తన మిత్రుడు వచ్చేవరకు నా గదిలో కూర్చుంటానంది నేను కాదనలేకపోయాను ఏవో కబుర్లు, ఆమె ఇటాలియన్ కొంత సేపటికి నా ప్రక్కగదిలో ఆ యువకుడు వచ్చిన శబ్దం వినిపించింది ఆయనగారు వచ్చాడు వెళ్ళిమన్నాను అబ్బే! ఫరవాలేదంది అంటే నా నెత్తిమీద అనుకోని భారం పడిందన్నమాట ఆమెకు భోజనం పెట్టించాలి సినిమా అయినా చూపించాలి నేను కూడా లండనులో చదువుకునే విదేశీ విద్యార్థులలా ఒళ్ళు బలిసినవాడననుకుని ఉంటుంది ఆ అమ్మాయి నా పరిస్థితి కషంలో పడ్డ ఈగలా ఉంది అప్పుడు ఆమెను తీసుకుని దగ్గరలో ఉన్న శ్రీమతి టిటర్టటన్ ఇంటికి వెళ్ళాను ఇద్దరికీ భోజనం పెట్టమన్నాను ఆశ్చర్యంగా నా వైపు చూచి నా కూడా అమ్మాయి ఉండడం వల్ల ఏమీ అనకుండా భోజనం పెట్టింది ఆ

తరువాత లోపలకు వెళ్ళి ఒక పౌను యివ్వమన్నాను అప్పుడు నా మీద విరుచుకుపడింది చేతిలో డబ్బు లేకుండా గర్ల్ ఫ్రెండ్‌ని ఎందుకు పిల్చావంది అసలు విషయం విని మూలుక్కుంటూ నా బాకీకి మరొక పౌను కలిపింది

డా॥ బోస్సాను ఇండియా హౌస్‌లో కలుసుకుంటూనే ఉన్నాను ఆయన చాలా సానుభూతి చూపించేవాడు నా మీద ఆయనకు అవ్యాజానురాగం కలిగింది ఆమాట అన్నాడు కూడాను లండనులో నార్త్ బ్రూక్ సొసైటీకి డా॥ బోస్లా కార్యదర్శి నాకు ఆ సొసైటీ పూర్వాపరాలు తెలియవు, కాని ఒకనాడు డా॥ బోస్లా నన్ను పిలిచి ఒక కమిటీ ముందు హాజరు పరిచాడు ఆ కమిటీలో ఉన్న ముగ్గురూ భారతీయులే నా ఆర్థిక యిబ్బందులను విని నాకు 112పౌన్లు నార్త్ బ్రూక్ సొసైటీ నుంచి అప్పు యిప్పించడానికి అంగీకరించారు దానికి ఒక షరతు పెట్టారు నేను శ్రీమతి టిటర్‌టన్‌కి ఇవ్వవలసిన డబ్బులో సగం యిచ్చి పూర్తి బాకీకి చెల్లు వ్రాయించాలన్నారు ముందు కమిటీ సభ్యులే ఆ విషయం ఆమెతో చెప్పాలనుకొన్నారు కాని వంద పౌన్లు పైగా బాకీ పెంచగలిన మూర్తికే ఆపని అప్పగించమన్నారు ఆమెకు 60పౌన్లు యివ్వడానికి అంగీకరించారు మిగిలిన 60 పౌన్లు నేను లండనులో ఉండి చదువుకోవడానికి ఉపయోగించమన్నారు నార్త్ బ్రూక్ సొసైటీ వారికి నేను వ్రాసి యిచ్చిన కాగితంలో నేను భారతదేశానికి తిరిగి వచ్చిన ఏడాది తరువాత నుంచి నెలకు రు 50 చొప్పున బాకీ తీర్చాలని ఉంది కాని ఆ సొమ్ము ఎప్పుడు తిరిగి యిచ్చినట్టు గుర్తులేదు అది వారు నాకు చేసిన ఆర్థిక సహాయం

ఇక శ్రీమతి టిటర్‌టన్ వద్దకు వెళ్లి ఆకమిటీ వారు పెట్టిన షరతు గురించి చెప్పాను ఆమెకు 60 పౌన్లు నగదుగా వెంటనే వస్తున్నాయి కాబట్టి వారు పెట్టిన షరతుకు అంగీకరించమన్నాను మరొక విధంగా డబ్బు వచ్చే అవకాశం లేదు కాబట్టి ఆమెకు కొద్దోగొప్పో డబ్బులు వచ్చే అవకాశాన్ని వదలుకోవద్దన్నాను చచ్చినవాడి పెళ్ళికి వచ్చిందే కట్నం అనే సామెత ఇంగ్లీషులో చెప్పాను ఏ మాత్రం అభ్యంతరం పెట్టకుండా ఆమె తనకు 60పౌన్లు వెంటనే నగదుగా ఇస్తే నా బాకీ చెల్లు వ్రాసి ఇవ్వడానికి అంగీకరించింది ఆమె వ్రాసిన జాబు నావద్ద భద్రంగా ఉంచుకున్నాను 60 పౌన్లవరకు ఆమెకు నష్టం కలిగించినా ఆమె నాయందు చూపిన మంచితనం ఎప్పటికీ మరువలేను ఆమెను భారతీయ విద్యార్థులు కర్కోటకురాలు అనేవారు కాని నాకు ఆమె ఏడాది పైగా ఆశ్రయమిచ్చి ఆదుకున్న పుణ్యాత్మురాలు "నీవంటివాళ్ళు నా ఇంట్లో ఉండడం నాకు చాలా ఆనందం" అని ఆమె జాబులో వ్రాసింది "నాబోటి వాళ్ళు నీ ఇంట్లో ఉంటే నీవు దివాళా

తీయడం తథ్యం" అని చమత్కరించాను ఎంత కాలం బాకీ తీర్చలేకపోయినా నేను మొఖం చాటువేయనందుకు ఆమె ఎంతో సంతోషించింది

డా॥ జగన్నాథ కోస్లా పుణ్యమా అంటూ నార్త్ బ్రూక్ సొసైటీ ఆర్థిక సహాయంతో లాండ్ లేడీ టిటర్టన్ బాకీ తీర్చివేసాను స్వయంగా ఒక పూట చెయ్యి కాల్చుకుంటున్నాను కాబట్టి డబ్బు కోసం ఇబ్బంది పడడం తగ్గింది సరిగ్గా అదే సమయంలో శ్రీ కోటంరాజు రామారావు మద్రాసులో నడిపే ఇండియన్ రిపబ్లిక్ పేరు మీద 20 పౌన్లు పంపారు లండనులో ఆ పత్రిక ప్రతినిధిగా ఉన్నందుకు నాకు అందిన ప్రతిఫలం అదే ఆతర్వాత నాకు వారివద్దనుంచి ఏవిధమైన ప్రతిపలం ముట్టలేదు "మనసు గుర్రములోరి మనిషీ" అన్నట్టు భోజనానికి వెదుక్కోవలసిన అవసరం తగ్గేసరికి మనస్సు కొద్దిగా వినోదాల మీదకు మళ్ళింది లండను వంటి మహాపట్టణంలో వినోదాలకు కొరతలేదు దానికి తోడు మిత్రుడు ప్రసాద్ డిల్లీనుంచి జాబు వ్రాస్తూ పాల్‌ముని నటించిన "డెత్ ఆఫ్ ఎ సేల్స్ మాన్" నాటకం చూశారా ? అని సిబెల్ దారండైక్, డేమ్ ఇవాన్స్ గ్రీర్ గార్సన్ మొదలైన ప్రఖ్యాత నటీమణుల నాటకాలు చూడమని సర్ లారెన్స్ ఒలీవియర్ అలెక్ గినెస్ రెడ్‌గ్రేవ్ నటించిన షేక్స్పియర్ నాటకాలు చూసి తీరాలని సలహాలు యిచ్చేవాడు

థియేటర్స్‌కి లండను మక్కావంటిది వెస్ట్ ఎండ్‌లో ప్రతి పది అడుగులకు నాటకం హాలు ఒకే నాటకం ప్రతిరోజు రెండు ప్రదర్శనల చొప్పున వారాలు, నెలలు, సంవత్సరాలు నడుస్తుంది ప్రజాదరణ బాగుండి వరుసగా కొన్ని సంవత్సరాలు ప్రదర్శించిన నాటకాలు ఉన్నాయి అన్ని థియేటర్లు ఉన్నా మనం చూడాలనుకున్న ప్రదర్శన చూడ్డం అంత సులువు కాదు ఖరీదైన సీట్లు ముందుగా రిజర్వు చేసుకునే సదుపాయం ఉన్నా తక్కువ దర సీట్లకు ప్రదర్శననాడు కాని టిక్కెట్లు అమ్మరు కొన్ని గంటలు ముందుపోయి క్యూలో నిలబడవలసిందే లండనులో థియేటర్‌కి వెళ్ళడం అంటే ఒక ఆసక్తికరమైన విషయం గుర్తుకు వస్తుంది షేక్స్పియర్ నాటకాలు ప్రదర్శించడానికి సెట్టింగులకు, డ్రెస్‌లకు వేలాది పౌండ్లు ఖర్చు అవుతాయి లండనులోను, ఇంగ్లండులోను ప్రదర్శనలు అయిన తరువాత దానిని అమెరికాలో ప్రదర్శించడం పరిపాటి సర్ అలెక్ గినెస్ షేక్స్పియర్ వ్రాసిన హేమ్లెట్ నాటకాన్ని ప్రదర్శించాలని ఏర్పాట్లు చేసాడు ప్రారంభానికి ముందురోజున పాత్రికేయుల కోసం ప్రత్యేక ప్రదర్శన వేసాడు ఆ నాటకంలో హేమ్లెట్ వేషం గినెస్ వేస్తూ చిన్న గడ్డం తగిలించుకున్నాడు తెల్లవారేసరికి పత్రికలలో హేమ్లెట్‌కి గడ్డం పెట్టడం సమంజసం కాదని ఆ ప్రదర్శనను దుయ్యబట్టారు హేమ్లెట్‌కి గడ్డం ఉండేది కాదని పత్రికలవారి వాదం గినెస్ పత్రికావిమర్శకుల

సమావేశం ఏర్పాటు చేసి చారిత్రకాదారాలతో హేమ్లెట్‌కి చిరుగడ్డం ఉండేదని బావించి అలా పెట్టానన్నాడు విమర్శకులు అంగీకరించలేదు వాద ప్రతివాదాలు విమర్శకుల ప్రబావం పలితంగా అలెక్ గినెస్ ఆ ప్రదర్శనను రెండు వారాలలో తీసివేయవలసి వచ్చిందంటే నమ్మండి

ఇక లండనులో సినీమాలు చూచేవారి సంఖ్య తక్కువనే చెప్పాలి బ్రిటిషు ఫిల్ము కంపెనీలు తయారుచేసే పిల్ములు అనేక దేశాలకు ఎగుమతి అవుతాయి కాని లండనులో వాటికి ప్రజాదరణ తక్కువ అయితే పెద్ద సినిమా హాల్సు కాక చిన్నచిన్నవి నగరం నిండా ఉంటాయి కొన్నింటిలో న్యూస్‌రీల్సు మాత్రమే ప్రదర్శిస్తారు మరికొన్నింటిలో పాత ఫిల్ములు, విదేశీ పిల్ములు ప్రదర్శిస్తారు అవన్నీ చాలావరకు కాలక్షేపానికి పనికివస్తాయి అవి ఉదయం పది గంటలనుంచి అర్ధరాత్రివరకు ఉంటాయి ఒకసారి టిక్కెట్టు కొనుక్కుని లోపలకు వెళ్ళి ఎంతసేపు కూర్చున్నా ఎవరూ కాదనరు ఫిల్ము మధ్యలో వెళితే అది పూర్తి అయ్యేవరకు మాత్రమే కాకుండా మళ్ళా ఫిల్ము అంతా చూడవచ్చు దానిని రెండుసార్లు చూడ్డానికి మనకు ఓపిక ఉండాలి గాని హాలు వాళ్ళు బైటకు పొమ్మనరు ప్రేక్షకులలో ప్రేమికుల శృంగార చేష్టలు సినిమా హాలులో ఉన్నంత థియేటర్ లలో కనుపించవు థియేటర్ మర్యాదలు వేరు

బాలే ప్రదర్శన సంప్రదాయాలు, మర్యాదలలో ప్రత్యేకత ఉంది డ్రెస్ సర్కిల్ టిక్కెట్టు కొనుక్కున్నవారు నిజంగా బ్లాక్ టై డ్రెస్ సంప్రదాయాన్ని పాటించాలి గ్యాలరీ టిక్కెట్టుకి వెళ్ళే ప్రేక్షకుడు బాలే ప్రదర్శనను అర్థం చేసుకుని ఆనందించడం తనకు తప్ప మరెవ్వరికీ తెలియదనుకుంటాడు ఆరోజుల్లో గ్యాలరీ టిక్కెట్టు రెండు షిల్లింగులు నేను లండనులో ఉన్నంతకాలం ఎక్కువగా అభిమానించింది బాలే ఆ తరువాత థియేటర్ సినిమాకు చివరి స్థానం బాలే నృత్యనాటకాలు స్వాన్‌లేక్, జిజిల్, స్లీపింగ్ బ్యూటీ మొదలైనవి ప్రపంచ ప్రఖ్యాతికెక్కినవి లండనులో సాడ్లర్ వెల్స్ బాలే కంపెనీవారు అనేక ప్రదర్శనలు ఇచ్చేవారు వాటికి సీజన్ ఉండేది ఒకే ప్రదర్శన దానిలో పాల్గొనే ముఖ్య పాత్రధారుల మార్పుతో కొన్ని రోజులు ఉండేది అలాగే మిగిలినవన్నీ ముందు బాలే డాన్సు, సంగీతం, దానిలోని మెలకువలు తెలుసుకోడానికి ఒక మాజీ బాలే డాన్సర్ నడిపే క్లాసులకి వెళ్ళాను ఆ క్లాసు తరువాత బాలే ప్రదర్శన చూస్తే గొప్ప ఆనందంగా ఉండేది

గ్యాలరీ టిక్కెట్టుకి వెళ్ళే బాలే ప్రియులలో అభిమాన సంఘాలు ఉండేవి వాటిని సంఘాలనేకంటే వ్యక్తులనడం సమంజసం ప్రదర్శనలో ఇంటర్‌వెల్ సమయంలో ఆ అభిమానుల వాగ్యుద్ధాలు ఆసక్తికరంగా ఉండేవి మార్గెట్

ఫాంటెన్ సాడ్లర్ వెలల్స్ కంపెనీవారి ప్రయిమా బాలరీనా డోనా అంటే వారి ముఖ్య నర్తకి అని అర్థం ఆమె నాట్యం చేసే పాత్రలు నాట్యం చేయడానికి మరొకరిద్దరు ఉండేవారు వారికందరికీ అభిమానులుండేవారు అనతికాలంలోనే నేను ఫాంటెన్ అభిమానినయ్యాను ఆయా బాలరీనాల నైపుణ్యం, శక్తిసామర్థ్యాల గురించి తలతిరిగిన బాలే ప్రియులతో చర్చించేవాణ్ణి బ్రిటిషువారు అంగీకరించకపోయినా బాలేలో అగ్రతాంబూలం రష్యనులదే పవలోవా, ఉలనోవా, ప్లెసిస్కాయా మొదలైన ప్రఖ్యాత బాలరీనాలు రష్యన్లే చిత్రం ఏమిటంటే బాలే ప్రదర్శనలో మగవారికి స్త్రీలకున్న ప్రాముఖ్యత లేదు

లండనులో బాలే సీజన్‌కి మనిషికి 12 టిక్కెట్లు మాత్రమే అమ్మేవారు అవి కొనుక్కోవడానికి ఒక రాత్రంతా క్యూలో ఉండవలసి వచ్చేది ముందు సాయంకాలం క్యూలో నిలబడి మన స్థానం భద్రపడిన తరువాత భోజనానికి వెళ్ళి ఆ రాత్రంతా క్యూలో దుప్పటి కప్పుకుని కూర్చోవడమే తెల్లవారగానే ఆ హాలుకి చెందిన వ్యక్తి వచ్చి క్యూలో ఉన్నవారికందరికీ నెంబరువేసిన కాగితాలు ఇచ్చేవాడు వాటిమీద నెంబర్లతోపాటు టైము కూడా వేసి ఉండేది అంటే ఆ కాగితంలో ఉన్న సమయానికి వచ్చి మన నెంబరు ప్రకారం ఒక క్యూలో నిలబడితే అప్పుడు టిక్కెట్లు దొరికేవి అదొక చిన్న యజ్ఞం అయితే ఆ ప్రదర్శనలు చూస్తే కలిగే ఆనందం అనిర్వచనీయం భోజనానికి డబ్బులు వెతుక్కోవలసిన పరిస్థితిలో వినోద కాలక్షేపానికి నాకు డబ్బు ఎక్కడినుంచి వచ్చిందని ఆశ్చర్యపడకండి థియేటర్‌కి గాని, బాలేకి గాని వెళ్ళాలంటే ఆనాడు ఏకాదశి పాటించి ప్రదర్శన తరువాత ఒక కప్పు కాఫీ త్రాగి కడుపులో కాళ్ళుపెట్టుకుని పడుకోవడమే!

లండను మహానగరంలో ఉండేవారికి కొట్టవచ్చినట్లు కనిపించే ప్రత్యేకత అక్కడి పోలీసు వ్యవస్థ ఇంగ్లండులో పోలీసుని ముద్దుగా బాబీ అంటారు సామాన్య ప్రజలకు ఆపదలో ఆదుకునే మిత్రుడు, దారితప్పినవారికి గైడు ఒక్కమాటలో చెప్పాలంటే అతడు సంచార సమాచార కేంద్రం లండన్ వాస్తవ్యులు కాని ఇరుగుపొరుగు పట్టణాలు గ్రామాలనుంచి వచ్చినవారు కాని, విదేశ పర్యాటకులు గాని తమకు ఏవిధమైన సహాయం కావాలన్నా ముందుగా వెతుక్కునే వ్యక్తి పోలీసు పిల్లల విషయంలోను, వృద్ధులు, వికలాంగుల విషయంలో పోలీసులు తీసుకునే ప్రత్యేక శ్రద్ధ చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది ఇక ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన స్కాట్లండు యార్డు పోలీసుల గురించి కథలు కథలుగా చెప్పుకుంటారు వారు నేరాలు చేసినవారి పట్ల యమదూతలు

లండనులో ప్రత్యేకత సంతరించుకున్న మరొకరకం వ్యక్తి టాక్సీ డ్రైవరు వారిలో చాలామంది రెండవ ప్రపంచ యుద్ధంలో సామాన్య సైనికులుగా అనేక

యుద్ధరంగాల్లో తిరిగి ఉన్నవారై ఉంటారు వారి అనుభవాలు చెప్పకుండా వదలరు అయితే వినేవారికి ఒక ఇబ్బంది ఉంది వారు మాట్లాడేది ఇంగ్లీషు బాషే అయినా మనకు అర్థం కాదు వారు మాట్లాడే ఇంగ్లీషును కాక్నీ అంటారు దానిలో ఒక ప్రత్యేకమైన యాస ఉంటుంది మొదటిసారిగా విన్నవారికి అది ఇంగ్లీషు అనిపించదు అలవాటు అయితే అదే అర్థం అవుతుంది నేను లండనులో ఉన్న రోజుల్లో మిత్రుడు విరల్‌బాబు ఒకసారి లండను వచ్చాడు అప్పుడు ఇద్దరం కలిసి లండను వీధుల్లో తిరిగాం మూర్తి లండనులో ఇంగ్లీషువాళ్ళతో తెలుగు మాట్లాడేవాడని మిత్రులతో చమత్కరించేవాడు దానిలో ఆశ్చర్యపడ వలసిందేమీ లేదు ఇద్దరం కార్నర్ కాపీ షాపుకి వెళ్ళినప్పుడు అక్కడ కాఫీ అందించే ఇంగ్లీషు అమ్మాయితో రెండు కప్పులు కాపీ ఇవ్వవే అనేవాణ్ణి ఇద్దరం కనిపిస్తున్నాం, కాఫీ అన్నాను కాబట్టి ఏ విధమైన అనుమానం లేకుండా రెండు కాఫీలు తెచ్చి ఇచ్చేది

ఇంగ్లీషు బాషలో యాస, ఉచ్ఛారణలో బేదాలు వినాలంటే స్కాట్లండులో గాని, మిడ్‌లాండ్స్ కాని వెళ్ళాలి ఇంగ్లండు, స్కాట్లండు, వేల్సు, ఐర్లండు కలిసి గ్రేట్ బ్రిటన్ అయింది వారి అందరి భాష ఇంగ్లీషే అయితే ఆయా ప్రాంతాలలో ప్రజలు మాట్లాడే తీరులో భేదాలు ఉన్నాయి మిత్రుడు మల్లంపల్లి రామలింగేశ్వర ప్రసాద్ బందరులో నా సహాధ్యాయి, ఆప్తమిత్రుడు యం యస్ బి ప్రసాద్ యొక్క తమ్ముడు ఆ రోజుల్లో అతణ్ణి ముద్దుగా పాపాయి అని పిల్చేవారు ఆయనగారు షెఫీల్డు యూనివర్సిటీలో సిరమిక్స్‌లో డాక్టరేట్ డిగ్రీ చదవడానికి వచ్చాడు ఒకసారి లండను వచ్చి నన్ను షెఫీల్డు రావాల్సిందిగా ఆహ్వానించాడు లండను వీధుల్లో తిరిగి విసిగిపోయిన నేను చాలా ఆనందంగా అతడి ఆహ్వానాన్ని స్వీకరించాను షెఫీల్డులో కొన్ని రోజులు హాయిగా గడపడానికి వెళ్ళాను ప్రసాద్ ఆ పట్టణంలో ఒక లాండ్‌లేడీ ఇంట్లో ఉంటున్నాడు ఒక వారం రోజులపాటు నాకోసం ఆ ఇంట్లోనే ఒక గది అద్దెకు తీసుకున్నాడు షెఫీల్డులో లాండ్‌లేడీ భోజనాలు కూడా పెట్టేది

ఆ ఇంటి యజమానురాలు వయస్సు మళ్ళినది ఆమె భర్తకు ఇంట్లో పెద్ద పరపతి ఉన్నట్టు అనిపించలేదు లాండ్‌లేడీస్ భర్తలు అంతా ఇంతేనేమో అనిపించింది ఆమెకు ఒక కుమారుడు, ఇరవై ఏళ్ళ కుమార్తె, మరో ఇద్దరు చిన్న వయసు ఆడపిల్లలు ఉన్నారు పెద్దపిల్ల క్షురకర్మ నేర్చుకొంటోంది యజమానురాలు కూడా రాత్రివేళల్లో బార్‌మెయిడ్‌గా పనిచేసేది బ్రేక్‌ఫాస్ట్ సాయంకాలం భోజనం, పెట్టేది మిత్రుడు ప్రసాద్ కాలేజీకి వెళ్ళేవాడు నా కాలక్షేపం ఇంటి యజమానురాలు, ఆమె ఇద్దరు కుమార్తెలు లిండా, జిలియన్‌లతోనే పిక్నిక్‌లకు, బజారుకి బస్సులలో వెళ్ళేవాళ్ళం వాళ్ళు మాట్లాడే

బాష చిత్రంగా ఉండేది అక్కడి ప్రజలు బస్సుని బుస్సు అంటారు మచ్ అనే ఇంగ్లీషు మాటను ముచ్ అంటారు అమాంతంగా ఒక మిడ్‌లాండ్స్ అమ్మాయి "ఐ లవ్ యు వెరీ ముచ్" అంటే మనకు మతిపోతుంది అంతా బుస్ ఈజ్ కుమింగ్ అనే అంటారు వాళ్ళ బాష ఎలాగున్నా అర్థం మాత్రం ఒకటే ఆ వారం రోజులు హాయిగా గడిపేసాను సాయంకాలం 6 గంటలకు భోజనం చేయవలసినదే ఏ కారణం వల్లనైనా ఆలస్యం అయితే ఇక అంతే సంగతులు డిన్నర్ అయిన తరువాత క్లబ్‌కి వెళ్ళి నేను ప్రసాద్ గోల్ఫ్ ఆడుకునేవాళ్ళం వెలుతురు 8 గంటలవరకు ఉండేది ఇంటికి వచ్చి డ్రాయింగ్ రూములో కూర్చుని కబుర్లు అప్పుడు సప్పర్, ఏదో కేక్ లేక బిస్కెట్లతో కాఫీ లేక ఓవల్‌టిన్ ఇచ్చేది నేను షెఫీల్డు వదిలే రోజున ఆ ఇంటిల్లపాదీ రైలు స్టేషనుకి వచ్చి సజల నయనాలతో ముద్దుల వర్షంతో వీడ్కోలు చెప్పారు

నేను మరొకసారి షెఫీల్డుకి వెళితే తన అతిథిగా ఉండాలని యజమానురాలు కోరింది ఆ మాటే రామకు చెప్పింది ప్రసాద్‌ని ఆ ఇంట్లో అంతా రామ అని పిల్చేవారు అయితే నేను రెండవసారి షెఫీల్డు వెళ్లేసరికి ప్రసాద్ లాండ్‌లేడీ ఇల్లు వదిలిపెట్టి యూనివర్సిటీ హాస్టలులోకి మారాడు నాకోసం కూడా హాస్టలులో ఒక గది ఏర్పాటు చేసాడు హాస్టలులో భోజనానికి వెళ్ళాలంటే అంతా నల్లగౌన్లు వేసుకోవాలి మొదటిరోజున భోజనానంతరం నేను, ప్రసాద్ అతడి పాత లాండ్‌లేడీ ఇంటికి వెళ్లాం నాకు హాస్టలులో గది ఏర్పాటు చేసినందుకు ప్రసాద్‌ని కోప్పడి ఆ మరుసటి రోజున నా మకాం తన ఇంటికి మార్పించింది రైలు ఖర్చులు తప్ప నేను షెఫీల్డులో ఒక్క పైసా కూడా ఖర్చుపెట్టలేదు అన్ని ఖర్చులు ఆ ముసలావిడవే! అక్కడ చదువుకునే భారతీయ విద్యార్థుల అనుభవంలో ఆ యజమానురాలు బ్రహ్మ రాక్షసి, పిసినారి కాని నన్ను అతిథిగా తన ఇంట్లో పెట్టుకుని సర్వ మర్యాదలు చేయడం అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసింది ఆమాట వారు నమ్మలేకపోయారు కాని ప్రసాద్ చెప్పిన తరువాత మూర్తిగారు అదృష్టవంతుడన్నారు నిజంగా నేను అదృష్టవంతుణ్ణే అనిపించింది రెండవసారి వెళ్ళినప్పుడు కూడా హాయిగా ఆనంధంగా గడిపాను నా తిరుగు ప్రయాణం ఆదివారం ఉదయం ఆ ఇంట్లో ఆదివారంనాడు బ్రేక్‌ఫాస్ట్ వండడం ఆచారం లేదు అయినా నాకోసం బ్రేక్‌ఫాస్ట్ తయారుచేసి రైలులో మధ్యాహ్నం తినడానికి సాండ్‌విచెస్ తయారు చేసి అత్యంత ఆదరంతో ప్రేమగా లండను పంపారు

లిండా, జిలియనులను తీసుకుని ఒకసారి ఆమె లండను వచ్చింది వారికి నాగదిలో భోజనం ఏర్పాటు చేసాను టొమాటో కందిపప్పు వండాను

ఆపిల్లలిద్దరూ చెమటలు కార్చుకుంటూ మంచినీళ్ళి త్రాగుతూ చేతితో కలుపుకుని అన్నం తిన్నారు వాళ్ళకు అదంతా కొత్త అనుభవం వాళ్ళకు చేతితో అన్నం తినడం అలవాటు లేనందున నాలుగేసి మెతుకులు తీస్తారు దానికి తోడు కారం అసలు నోట్లో పెట్టుకోలేరు ఆ పిల్లలు ఇద్దరూ నావంట తినడం చూస్తే నాకు ఎంతో ముచ్చటయింది ప్రసాద్ పుణ్యమా అంటూ షెఫీల్డులో రెండుసార్లు హాయిగా సెలవులు గడపడానికి అవకాశం వచ్చింది నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చదువుకునే రోజుల్లో నాకు సీనియర్‌గా ఉండే శ్రీ సర్వేశ్వర్రావు నేను లండనులో చదువుకునేటప్పుడు కేంబ్రిడ్జి యూనివర్సిటీలో రిసెర్చి చేస్తూ ఉండేవాడు ఆయన అతిధిగా కేంబ్రిడ్జి వెళ్ళి గడిపిన రెండురోజులు మరపురాని అనుభవం

ఇంగ్లండులోని ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల మధ్య విద్యాప్రమాణాల నుంచి క్రీడల వరకు అన్ని రంగాలలోను పోటీ ఉండేది ఆ దేశంలో ఒక కుటుంబంలో తాతగారు ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో చదువుకుంటే వంశపారంపర్యంగా ఆ కుటుంబ సభ్యులలో విశ్వవిద్యాలయం స్థాయికి చేరినవారు ఆక్స్‌ఫర్డ్‌లోనే చదువుతారు వారికి కేంబ్రిడ్జి అంటే చులకన బావం ఆ వైరుధ్యం చూచి తీరాలి ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిడ్జి కూడా చిన్న పట్టణాలు అవి యూనివర్శిటీ పట్టణాలు ఆయా విశ్వవిద్యాలయాలకు చెందిన కళాశాలలు ఉపాధ్యాయులు విద్యార్థులు తప్ప ఆ గ్రామంలో మరేమీ ఉన్నట్టు అనిపించదు అక్కడ విద్యార్థి నల్లగౌను వేసుకు తిరుగుతారు అందు మూలంగా వారి ప్రాబల్యం హెచ్చుగా కనిపిస్తుంది ఆ రెండు యూనివర్శిటీలలో దేనిలో చదివినా గొప్ప గౌరవంగా బావిస్తారు లండను యూనివర్శిటీకి మూడవ స్థానమే అంతేకాకుండా లండను మహానగరంలో చదువుకునే విద్యార్థికి ప్రత్యేకమైన యూనివర్శిటీ వాతావరణం ఉండదనే చెప్పాలి

ఒకసారి మిత్రుడు బారువా ఆహ్వానం మీద కేంబ్రిడ్జి వెళ్ళాను రెండు రోజులు గడిపాను బారువాని అస్సాం టీతోటల సంఘం వారు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో టీ మీద పరిశోధనలు చేయడానికి పంపారు బారువా చాలా సౌమ్యుడు స్నేహశీలి కేంబ్రిడ్జిలో ఎక్కడ చూచినా నల్లగౌనుల్లో ఉన్న విద్యార్థులే సామాన్యంగా అన్ని దేశాలలోను ఇంగ్లండులోని అన్ని పట్టణాలలోను శనివారం రాత్రి వినోద కార్యక్రమాలకు ప్రత్యేకిస్తారు కాని కేంబ్రిడ్జి విద్యార్థులకు శుక్రవారం రాత్రి ప్రత్యేక కార్యక్రమాలు లండను నుంచి అమ్మాయిలు శుక్రవారం సాయంకాలానికి కేంబ్రిడ్జి వస్తారు వారి బాయ్ ఫ్రెండ్స్‌తో డాన్సులు ఆ రాత్రి వారి మిత్రులు ఉన్న గదులలోనే గడిపి ఆ

మరునాటి ఉదయం వెళ్ళిపోతారు. బారువా తాను ఉన్న లాండ్ లేడీ ఇంట్లోనే నాకు మకాం ఏర్పాటు చేసారు. ఆ రాత్రంతా విద్యార్థులు వారి స్నేహితురాండ్ర గొడవతో సరిపోయింది.

పక్షపాతం చూపించడం యిష్టంలేక ఆక్స్ ఫర్డ్ యూనివర్శిటీని కూడా చూడ్డానికి వెళ్ళాను. నా అదృష్టం బాగుండి డా॥సర్వేపల్లి రాధా కృష్ణ పండితుడు ఆసమయంలో ఆక్స్‌ఫర్డ్‌లో ఉన్నారు. ఆయన చాలా కాలం ఆ విశ్వవిద్యాలయం విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉండేవారు. సాధారణంగా ఆయన యూనివర్శిటీలో ఉంటే భారతీయులు ఎవరు వెళ్ళినా ముందు ఆయన దర్శనం చేసుకోవడం ఆచారం. నేను వెళ్ళినపుడు ఆయన అక్కడ ఉన్నారని తెలుసుకొని ఆయన్ని కలుసుకోవడానికి వెళ్ళాను. ఎంతో ఆప్యాయంగా, ఆదరంగా నా మంచి చెడ్డలు, లండనులో నా చదువు గురించిన వివరాలు తెలుసుకున్నారు. యూనివర్శిటీ చూపిస్తాను రమ్మని డా॥ రాధాకృష్ణ పండితుడు స్వయంగా నాతో వచ్చి లైబ్రరి, కొన్ని కాలేజీలు చూపించారు. రాధాకృష్ణన్ గారే స్వయంగా గైడ్‌గా వ్యవహరించడం చూచి నేనే నమ్మలేకపోయాను.

రెండు యూనివర్శిటీల మధ్య ఉన్న పోటీకి పరాకాష్ట ప్రతీ సంవత్సరం జరిగే బోట్ రేస్. ఆ రెండు యూనివర్శిటీల టీములు ప్రతి సంవత్సరం లండను వచ్చి థేమ్సు నది మీద పట్నీవద్ద ఒక మైలు దూరం పడవల పందెం నిర్వహిస్తారు. అది జాతీయ పరపతి ఉన్న పోటీ. ఆ ఉత్సాహం వర్ణనాతీతం. చూచితీరాలి. ఆ రెండు విశ్వవిద్యాలయాల్లోను చదువుకున్న పాత విద్యార్థులు - ఎంత గొప్ప పదవులలో ఉన్నవారైనా సరే అంతా పందెం జరిగే మైలుదూరం నది ఒడ్డున నిలబడి తమ టీముకి మద్దతు యిస్తూ కనిపిస్తారు. తమ టీములకు ప్రోత్సాహాన్ని యిచ్చే వారిని గుర్తు పట్టడం కష్టం కాదు. ఒక సంవత్సరం బారువా లండను వచ్చి నన్ను కూడా పడవల పందెం చూడ్డానికి తీసుకువెళ్ళాడు. కాని పాపం, ఆసంవత్సరం కూడా కేంబ్రిడ్జి టీము ఓడిపోయింది. ఎవరు గెల్చినా ఎవరు ఓడినా ఆ పడవల పందెం ఆ వాతావరణం, ఉత్సాహం, నాకు మరువరాని అనుభవం.

నా రిసెర్చి ఏ విధమైన అడ్డంకులు లేకుండా జరిగిపోతోంది. ఒక నాడు ప్రొఫెసర్ హాల్‌తో చర్చించే సందర్భంలో నా రిసెర్చికి సంబంధించిన విషయంపై వివరాల సేకరణలో నేను సాధించిన ప్రగతి సమీక్షించి యిక థీసిస్ వ్రాయడం ప్రారంభించమన్నారు. వివరాల సేకరణ ఎంతకాలమైనా చేయవచ్చు కాని ఆ వివరాలను ఒక మూసలో పోసి వాటికి రూప కల్పన చేస్తే తప్ప రిసెర్చి నిర్దిష్టమైన దారిలో ఉన్నది లేనిది తెలియదన్నారు. అనేక

లైబ్రరీలలోను విదేశ శాఖల రికార్డులలోను చదివిన గ్రంధాల నుండి వ్రాసుకున్న నోట్సు వివరాలు తెలుసుకుని ఇక వ్రాయడం ప్రారంబించ వచ్చునని నిర్ణయించారు అప్పటి నుంచి విషయసేకరణ, వ్రాత కూడా జరగవచ్చునన్నారు

నేను రిసెర్చి చేసే విషయం సయాం (దాయిలాండ్) తో ఇంగ్లీషు, ఫ్రాన్సు దేశాల సంబందాలు, అయినా ఆ కాలంలో ఆగ్నేయ ఆసియా దేశాలతో చైనా యొక్క సంబందాలు బ్రిటిషు ప్రెంచి సామ్రాజ్య విస్తరణతో ముడిపడి ఉన్న విషయాన్ని విస్మరించలేము అప్పటి చైనా చక్రవర్తులకు ఆసియాలోని అనేక చిన్న దేశాల రాజులు కప్పం కట్టేవారు దానినే బుంగీ మాస్ అనేవారు అది వెండిపువ్వుల రూపంలో ఉండేది ఆ పువ్వులతో పాటు వారి వారి దేశాలలో ఉత్పత్తి అయ్యే వస్తువులు ఒక ఓడలో చైనా తీసుకువెళ్ళి చక్రవర్తికి సమర్పించుకునేవారు వారికి సకల మర్యాదలు చేసి వారి తిరుగు ప్రయాణంలో చక్రవర్తి చాలా విలువైన బహుమానాలు యిచ్చి పంపేవారు ఈ సామ్రాట్టు సామంత రాజుల సంబందం ఉబయ తారకంగా ఉండేది చైనాకు పరపతి చిన్న దేశాలకు రక్షణ లబించేది చైనా తనచుట్టూ చిన్న రాజ్యాలవలయం ఏర్పరచుకుని వాటి రక్షణ బారాన్ని వహించేది ఆ రోజుల్లో ధాయిలాండ్ బర్మాతో సహా అనేక రాజ్యాలు చైనా చక్రవర్తులకు బుంగామాస్ పంపేవి ఆ పరిస్థితిలో ఇంగ్లండు ఫ్రాన్సు దేశాలు సామ్రాజ్య విస్తరణ ప్రయత్నంలో తమలో తాము కొట్లాడుకొనడమే కాక అటు చైనాతోను, ఇటు చిన్న దేశాలతోను కూడా పేచీలు పెట్టుకొనేవి

ప్రొఫెసర్ హాల్ వ్రాయడం ప్రారంభించమన్నారు కదా అని ఒక రాత్రి కూర్చుని చైనా ధాయిలాండ్ సంబందాల గురించి ఒక చాప్టర్ వ్రాసాను దానిని ప్రొఫెసర్‌కి సగర్వంగా సమర్పించాను నేను చాలా బాగా చేశాననుకున్నాను కాని నేను వ్రాసిన చాప్టర్ చదివిన ప్రొఫెసర్ ఆలోచనలు వేరుగా ఉన్నాయని త్వరలో తేలిపోయింది మామూలుగా వారానికి ఒక రోజున కలుసుకుని విషయాలన్నీ చర్చించుకునే సాంప్రదాయానికి విరుద్ధంగా ఆయన నాకు ఒక జాబు వ్రాస్తూ నేను వ్రాసిన కాగితాలు తిప్పి పంపించారు ఆ ఉత్తరం నా పాలిట, నాలండను చదువు పాలిట అశనిపాతం అనిపించింది అది చదవగానే నా గుండెలో రాయిపడింది నిరాశ నిస్పృహ, నీరసం ఆవహించాయి

ఆ జాబులో ఉన్న విషయం ఏమిటంటే నేను పిహెచ్ డి కోసం చదవాలనే సంకల్పం మానుకుని ఎం ఏ డిగ్రీ తీసుకుంటే బాగుంటుందని చున అటువంటి నిర్ణయానికి ఎందుకు వచ్చారో అర్థం కాలేదు నేను ఆంధ్ర

విశ్వవిద్యాలయంలో బి ఏ ఆనర్సు డిగ్రీ తీసుకున్నాను ఆ తరువాత ఎం ఏ డిగ్రీ కూడా ఇచ్చారు నాకు ఎం ఏ డిగ్రీలు సేకరించే సరదా లేదు డాక్టరేటు తీసుకోవాలనే పట్టుదల మాత్రం దృఢంగా ఉంది ప్రొఫెసర్ హాల్‌ని చూడ్డానికి కాలేజీకి వెళ్ళాను అదృష్టవశాత్తు ఆయన ఉన్నారు ఆయన వ్రాసిన ఉత్తరం విషయం ప్రస్తావించాను తన నిర్ణయానికి ఆయన రెండు కారణాలు చెప్పారు మొదటిది నేను వ్రాసిన చాప్టర్‌లోని ఇంగ్లీషు భాష. ఆ భాష ఆయనకు నచ్చలేదు అంటే భాషా పరిజ్ఞానం చాలదని కాని వ్రాసే శక్తి లేదనికాని కాదట బ్రిటిషు యూనివర్సిటీలలో డాక్టరేటుకి అర్హత పొందే శైలిలో లేదట నేను వ్రాసిన ఇంగ్లీషు చిత్రం ఏమిటంటే ప్రొఫెసర్ హాల్ నా ఇంగ్లీషు శైలికి అభ్యంతరం చెప్పడానికి కారణం నా భాష చాలా అందాలతోను అలంకారాలతోను కూడి ఉన్నదని, ఆ భాష, ఆ శైలి పత్రికలలో వ్యాసాలు వ్రాయడానికి పనికివస్తుంది గాని లండను యూనివర్సిటీలో పిహెచ్ డి థీసిస్‌కి నిషిద్ధం అన్నారు

ఆయన చెప్పినదంతా విని నేను ఆశ్చర్యపోయాను లండను వెళ్ళడానికి ముందు ఢిల్లీలో అనేక జాతీయ ఇంగ్లీషు పత్రికలలో వ్యాసాలు వ్రాసేవాడిని హిందూస్తాన్ టైమ్సు ఫ్రీ ప్రెస్ జర్నల్, నేషనల్ హెరాల్డ్ వంటి పత్రికలు నా ఇంగ్లీషు వ్యాసాలు కళ్ళనద్దుకుని ప్రచురించేవి వాటి ఆధారం మీదే శ్రీయుతులు ఖాసా సుబ్బారావు, కోటంరాజు రామారావు వంటి ప్రముఖ పత్రికా సంపాదకులు నన్ను లండనులో తమ ప్రతినిధిగా నియమించడానికి అంగీకరించారు చక్కటి ఇంగ్లీషు వ్రాయగలనని కొద్దిగా గర్వంగా కూడా ఉండేది కాని ప్రొఫెసర్ హాల్ నాకు గర్వభంగం చేసారు నేను పత్రికలకు వ్రాసే ఇంగ్లీషు మర్చిపోయి దానిని విద్యారంగంలో రిసెర్చి థీసిస్‌కి పనికివచ్చే విధంగా వ్రాయడం నేర్చుకోవాలన్నారు ఆయన చెప్పేది వింటే నాకు మతిపోయింది ఒక శైలినుంచి మరొక శైలికి మార్చడం సాధ్యమా అనిపించింది పిహెచ్ డి స్థాయి చాలా హెచ్చు కావడం వల్ల దాని మాట మర్చిపోయి లండను యూనివర్సిటీ ఎం ఏ డిగ్రీ తీసుకువెళ్ళమని సలహా చెప్పారు దానికి తోడు నేను ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నాను కాబట్టి పిహెచ్ డి కంటె ఎం ఏ డిగ్రీ తీసుకుంటే తొందరగా చదువు పూర్తి చేసి దేశం వెళ్ళిపోవచ్చునన్నారు ఆయన ఎన్ని చెప్పినా ఆ సలహాలు నాకు నచ్చలేదు నేను లండను వెళ్ళింది ఎం ఏ డిగ్రీ తీసుకోవడానికి కాదు అదే మాట ఆయనతో చెప్పాను మరొక ఛాన్సు ఇవ్వమని ప్రాధేయపడ్డాను ప్రొఫెసర్ ఫిలిప్సుని కలుసుకోమని సలహా చెప్పారు

ప్రొఫెసర్ ఫిలిప్సు మా కాలేజీ ప్రిన్సిపాల్ ఇండియన్ హిస్టరీ ప్రొఫెసర్

ఆయన నా చదువు ప్రారంభంలో మాకు మెథడాలజీ మీద ఉపన్యాసాలు చెప్పేవారు ఒక రోజు థీసీస్‌లో ఎటువంటి భాష వ్రాయాలి అనే విషయం మీద జరిగిన చర్చలో నేను మాట్లాడుతూ వారు చెప్పిన పద్ధతిలో థీసిస్ వ్రాస్తే చిన్నపిల్లల కథల పుస్తకంలా ఉంటుందనే బావం వ్యక్తం చేసాను సరిగ్గా అలాగే అన్నాను నా సహాధ్యాయులంతా ఆశ్చర్యపోయారు అయితే ఏడాది తిరగకుండా ఆ సమస్య నాకే ఎదురైంది ప్రొఫెసర్ ఫిలిప్సుని కలుసుకొని నా పరిస్థితి చెప్పుకొన్నాను నాకు కొద్ది వ్యవధి ఇచ్చి అప్పుడు తుది నిర్ణయం తీసుకోమన్నాను ఆయన అంగీకరించారు ప్రొఫెసర్ హాల్ థీసిస్‌కి పనికివచ్చే బాష ఎలా ఉండాలో విపులీకరించారు స్వతహాగా ఆయన చాలా మంచివాడు నేనంటే ప్రత్యేక అబిమానం ఆ సమస్య పరిష్కారం కావడంతో స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నాను

సామాన్యంగా ఒక ప్రొఫెసర్‌వద్ద రిసెర్చి చేసే విద్యార్థి మరొక ప్రొఫెసర్‌ని సలహాలు అడగడు అయితే నావిషయంలో నా ప్రొఫెసరే ఒకరోజున నన్ను వెళ్లి లండను స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో అంతర్జాతీయ సంబందాల శాఖ ప్రొపెసర్‌ని కలుసుకుని ఆయన సలహాలు తీసుకోమని పంపారు ఆయన టెలిఫోను చేసి నాకు ఇంటర్వ్యూ ఏర్పాటు చేసారు అలా చేయడానికి చాలా విశాలమైన హృదయం విద్యార్థి మీద అపారమైన అబిమానం ఉండాలి ప్రొఫెసర్ రాబిన్‌సన్ నేను రిసెర్చి చేస్తున్న విషయం, అంతవరకు నేను చదివిన గ్రందాలు చేసిన కృషిని తెలుసుకుని జర్మన్ డిప్లొమేటిక్ డాక్యుమెంట్లు చదివావా? అని అడిగారు నా రిసెర్చి ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాలకు సంబందించిన విషయం మీద కాబట్టి జర్మనీతో సంబంధం ఏమిటో అర్థం కాలేదు అయినా ఆయన డగ్‌డేల్ వ్రాసిన గ్రంథం నాలుగు బాగాలు చదవమన్నారు ఆయన సలహా విషయంలో పెద్దగా ఉత్సాహం లేకపోయినా ఆయన మీది గౌరవంతో ఆ గ్రంథాలు చదివాను ఏ పుట్టలో ఏపామున్నదో అన్నట్టు ఆగ్రంధాలలో దొరికిన ఒక జాబు ఆదారంగా నేను చేసిన రిసెర్చికి ప్రాముఖ్యత, ప్రత్యేకత సమకూరాయి

డగ్‌డేల్ ఎడిట్ చేసిన జర్మన్ డిప్లమాటిక్ డాక్యుమెంట్సులో 1893 లో బ్రిటన్‌లో జర్మన్ రాజదూత తమ విదేశ కార్యాలయానికి జాబు వ్రాస్తూ ఆ సంవత్సరంలో ఫ్రెంచి నౌకలు సయాం సముద్రంలో స్తంబన కార్యక్రమం చేపట్టడం గురించి వివరించాడు ఫ్రెంచి నౌకాదికారి సయాం చుట్టుపట్ల ఉన్న విదేశీ నౌకలన్నీ తాము గీచిన గిరి బైటకు వెళ్లాలని హెచ్చరించాడు అప్పుడు అక్కడ ఉన్న బ్రిటిషు నౌకలు ఫ్రెంచివారు నిర్ణయించిన పరిది బైటకు వెళ్ళినవని జర్మన్ రాజదూత వ్రాసాడు ఆ గ్రందంలో ఆ జాబు చదివిన ఒక

బ్రిటిషు నౌకాధికారి అడ్మిరల్ బల్లార్డ్ 1924 జనవరి 20 వతేదీ లండను టైమ్సు పత్రికలో ఎడిటర్‌కి వ్రాసిన ఒక లేఖలో 1893 లో ఫ్రెంచి నౌకలు సయాంను బ్లాకేడ్ చేసినప్పుడు తాను బ్రిటిషు నౌకలో ఉన్న ఉద్యోగినని తమ నౌకలు ఫ్రెంచి హెచ్చరికను ఖాతరు చేయలేదని జర్మన్ రాజదూత రాజకీయ కారణాలవల్ల అసత్యవార్త వ్రాసాడని తెలియజేసాడు వెంటనే యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్ళి 1924 జనవరి 20వతేదీ లండను టైమ్సు చూసాను

లైబ్రరీలో పనులు నిముషాలమీద అవుతాయి ఆ జాబులోని వివరాలు వ్రాసుకుని, 1893 లో సయాం సముద్ర ప్రాంతాల్లో ఉన్న బ్రిటిషు నౌకాధికారి బ్లాకేడ్ విషయంలో అడ్మిరాలిటీకి పంపిన రిపోర్టులో ఏమి వ్రాసాడో చూడ్డానికి బయలుదేరాను పబ్లిక్ రికార్డ్సు ఆఫీసులో కేప్టెన్ మెక్‌క్లౌడ్ రిపోర్టు క్షణాలమీద నా ముందు ఉంచారు దాని ప్రకారం జర్మన్ రాజదూత వ్రాసిన మాట నిజం అని తేలింది బ్రిటిషు నౌకలు ఫ్రెంచివారి హెచ్చరికను పాటించి వారి పరిధినుంచి బైటకు వెళ్ళిపోయాయి అయితే అడ్మిరల్ బల్లార్డ్ మాట ఏమిటి?ఆయన అబద్ధం ఆడుతున్నాడని స్పష్టం అయింది ఈ వర్తమానాన్ని తీసుకుని ప్రొఫెసర్ హాల్ వద్దకు వెళ్ళాను నా నోట్సు అంతా చూసి బల్లార్డ్ అబద్ధం చెబితే అలా వ్రాయమన్నారు బ్రిటిషు నౌకాధికారి అబద్ధం చెప్పాడని వ్రాయడానికి సందేహించవద్దన్నారు అయితే నీతర్వాత ఎవరైనా వచ్చి "మూర్తి వ్రాసినది నిజం కాదని చెప్పడానికి అవకాశం ఇవ్వకుండా జాగ్రత్త పడ" మని సలహా ఇచ్చారు ఈవిషయం మీద నేను థీసిస్‌లో వ్రాసిన భాగమే నా రిసెర్చిలో అప్పటివరకు ఉన్న పరిజ్ఞానానికి కొత్త సమాచారం అందించిన ప్రత్యేకతను సంపాదించింది అంతవరకు ప్రచురించబడని క్రొత్త విషయం చెబితేగాని బ్రిటిషు యూనివర్సిటీలలో పిహెచ్.డి ఇవ్వరు ఈ విషయంలో అమెరికను యూనివర్సిటీలకు బ్రిటిషు యూనివర్సిటీలకు చాలా బేదం ఉంది

నా రిసెర్చి అవిచ్ఛిన్నంగా సాగిపోతోంది పిహెచ్.డి థీసిస్ లో వ్రాసే ఇంగ్లీషుకి పత్రికలకు వ్రాసే బాషకు భేదం ఉంటుందని ప్రొఫెసర్ హాల్ చెప్పినప్పటినుండి నేను పత్రికలకు వ్రాయడం మానివేసాను యునైటెడ్ కింగ్‌డమ్ జర్నలిస్టుల సంఘంలో సభ్యత్వం ఉన్నప్పటికి భారత దేశంలోని పత్రికలకు వ్రాయడం చాలా వరకు తగ్గించాను జర్నలిస్టుల సంఘంలో సభ్యత్వం పుణ్యమా అంటూ పాత్రికేయుల సమావేశాలకు, ప్రదర్శనలకు, ప్రత్యేక కార్యక్రమాలకు ఆహ్వానాలు వచ్చేవి వెళ్లేవాణ్ణి వాటిలో బ్రిటిషుప్రదాని చర్చిల్ పత్రికా సమావేసాలు ఎప్పుడూ వదిలేవాణ్ణికాదు బ్రిటన్ లోని బారతీయ పాత్రికేయునిగా ఇండియా హౌస్‌లో ఏకార్యక్రమం జరిగినా ప్రత్యేక ఆహ్వానాలు, భారత దేశంనుంచి ఏనాయకుడు వచ్చినా

పాత్రికేయులతో సమావేశం తప్పనిసరిగా ఉండేది పాత్రికేయునిగా వెళ్ళిన రెండు ప్రదర్శనలు మరువరానివి ఒకటి రాంగోపాల్ భరతనాట్య ప్రదర్శన అప్పటికి ఇంకా విదేశాలలో భరత నాట్యానికి భారతీయ సంగీతానికి ప్రజాదరణ లేదు

ఉదయశంకర్ ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన రష్యన్ బాలరీనా పవలోవాతో కలసి నాట్యప్రదర్శనలు ఇచ్చేవారని చెప్పుకునేవారు కాని రాంగోపాల్ నాట్యప్రదర్శనలు చూడ్డం ఒక క్రొత్త అనుభవం తన నాట్యంలోని ప్రతి చిన్న విషయాన్ని చక్కటి ఇంగ్లీషులో ప్రేక్షకులకు వివరించేవాడు హస్తముద్రలు, గ్రీవాభేదాలు అడుగులో చూపులోని ప్రత్యేకతలు హావ భావ ఆహార్య సంగీత విషయాలకు సంబంధించిన వివరాలు ముందుగా ప్రదర్శిస్తూ వివరించి ఆ తరువాత నాట్యం చేసేవాడు భరత నాట్యాన్ని విదేశాలలో అర్థం చేసుకుని అభిమానించేటట్టు చేయడానికి రాంగోపాల్ పునాదులు వేసాడని చెప్పాలి ఆ దేశంలో పాత్రికేయుల్ని ప్రత్యేక ప్రదర్శనలకు ఆహ్వానించినపుడు రెండుపాస్‌లు పంపడం ఆచారం ఉంటే భార్యను లేకపోతే గరల్ ఫ్రెండ్‌ని తీసుకు వెళ్ళాలని ఆహ్వానంలోని పరమార్థం తాను దూర సందు లేదు మెడలో డోలొకటి అన్నట్టు అటువంటి సాంస్కృతిక కార్యక్రమాలకు గరల్ ఫ్రెండ్‌ని తీసుకు వెళ్ళడం నాకు మోయలేనిభారం కాని అప్పుడప్పుడు స్విట్జర్లాండ్ నుంచి వచ్చిన స్నేహితురాలు జోన్‌ని ఐరిష్ మిత్రురాలు షార్లెట్‌ని ఆ కార్యక్రమాలకు తీసుకు వెళ్లే వాణ్ణి ఆ సందర్భంలో అయ్యే ఖర్చులు వాళ్లే పెట్టుకునేవారు

జోన్ ఇంగ్లీషు నేర్చుకోవడానికి స్విట్జర్లాండు నుంచి లండను వచ్చింది ధనిక కుటుంబానికి చెందిన అమ్మాయి పెద్ద అందగత్తె కాదు కాని, మంచి సంస్కారం ఉన్న అమ్మాయి ఆమె జెనీవా నుంచి బోలెడు రకాల చాకలెట్ బార్లు తెచ్చేది కాని వాటిలోని కాఫీచాకలెట్ బార్ రుచి వర్ణనాతీతం షార్లెట్ మంచి క్వేకర్ ఇంతకు ముందు చెప్పినట్టు క్వేకర్లు క్రైస్తవులలో ఒక ప్రత్యేక శాఖ ఆ అమ్మాయి పెదవులకు రంగు కూడా వేసుకునేదికాదు నీతి ప్రవర్తనకు వారు చాలా ప్రాముఖ్యత యిస్తారు ఆమె ఉపాధ్యాయవృత్తి చేసేది పాశ్చాత్యసంగీతంలో దిట్ట నేను ఆ సంగీతంలోని అందాలు తెలుసుకుని దానిని ఆనందించడానికి ఆమెతోడ్పడేది ప్రత్యేక ఆహ్వానాలుంటే ఆమెను తీసుకువెళ్ళేవాణ్ణి ఫిలార్మనిక్ ఆర్కెస్ట్రాప్రదర్శనలు, ఒపేరాలు ఆమెతో చూస్తే ఆ సంగీతం చక్కగా అర్థమయ్యేది ఒపేరాలు చూస్తూ ఉంటే మన రంగస్థల నాటకాలు గుర్తుకు వస్తాయి ఇటాలియన్ ఒపేరానటుడు టిటోగొబ్బి పాడుతుంటే జొన్నవిత్తుల శేషగిరిరావు పాడినట్టుండేదంటే

నమ్మండి

పాత్రికేయునిగా వెళ్ళిన మరపురాని మరొక ప్రదర్శన బ్రిటిష పారిశ్రామిక ప్రదర్శన ఒలింపియాలోను ఎరల్స్ కోర్టులోను బ్రహ్మాండమైన ప్రదర్శన ఏర్పాటు జేశారు ఒకనాడు విదేశీకొనుగోలుదారు బాడ్జీపెట్టుకుని వెళ్ళాను మరొకనాడు ప్రదర్శన చూడ్డానికి రాజకుటుంబ సభ్యులు రావడంవల్ల వారు లోపల ఉన్నంత సేపు సామాన్య ప్రజలకు లోపలకు వెళ్ళడానికి అనుమతిలేదు రాజకుటుంబ సభ్యులు ఉన్నంతసేపు పాత్రికేయులకు మాత్రమే ప్రవేశం అంతకుముందు రోడ్డుప్రక్కన నిలబడి గుర్రపు బగ్గీలలో వెళ్ళే రాజకుమార్తెలను చూసాను కాని ప్రప్రధమంగా చాలా దగ్గరగా ప్రిన్సెస్ ఎలిజబెత్, మార్గరెట్‌లను చూచే అవకాశం దొరికింది అప్పటికింకా ఎలిజబెత్ రాజకుమార్తె మాత్రమే భవిష్యత్తులో బ్రిటిష మహారాణి అవుతానని కలలోకూడ ఊహించి ఉండదు ఆమెకంటె ఆమె చెల్లెలు మార్గరెట్ అందకత్తె అని చెప్పుకునేవారు అక్కాచెల్లెళ్ళిద్దరికి మెడలో ఒక ముత్యాలహారం తప్ప మరొక అలంకారంలేదు పెద్ద అందకత్తెలనిపించలేదు కాని రాజకుమార్తెలు కదా! వారిని రోజూ చూచే అవకాశం రాదు పారిశ్రామిక ప్రదర్శన అంతకుముందే చూసాను కాబట్టి రాజకుమార్తెలను పలకరించి వారి అందచందాలు చూస్తూకాలక్షేపం చేసాను బ్రిటిష ప్రజలకు వారి రాజకుటుంబ సభ్యులపై ఉన్న గౌరవం, భక్తి ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి ప్రపంచంలో రాజరికాలు, రాజులు నామరూపాలు లేకుండా పోయే రోజులలో కూడా బ్రిటిష రాజులకు రాణులకు ఆ దేశంలో అపారమైన గౌరవ మర్యాదలు

సింహాసనానికి అర్హత ఉన్న వారే రాజకుమారులు, రాజకుమార్తెలు అని పిలవబడతారు మిగిలిన రాజవంశీయుల్ని డ్యూక్‌లు, ఎరల్స్ అని పిలుస్తారు ఇక పెద్దకుటుంబాలకు చెందిన ధనిక వర్గాలనుంచి లార్డ్స్ వస్తారు ఈ వర్గాలలోని సభ్యులకు సామాన్య బ్రిటిష ప్రజలకు సంబంధం చాలాతక్కువ వారి సంఖ్యకూడా చాలా తక్కువ ఒకప్పుడు జర్మన్ చక్రవర్తి, రష్యన్ చక్రవర్తి, యూరోపులో అనేక మంది రాజ కుటుంబాలతో బ్రిటిష మహారాణి విక్టోరియాకు చాలా దగ్గర సంబంధాలు ఉండేవి ఫ్రెంచి విప్లవం తరువాత కథవేరు ప్రస్తుతం కొద్దిగా రాజరికాలు ఉన్నా అవి అలంకారాలు మాత్రమే బ్రిటిష రాజరికం కూడా నామమాత్రంగా మిగిలిన అలంకారం అనేచెప్పాలి

నా చిన్నతనంలో మన దేశంలో డార్బీ టిక్కెట్లు అమ్మేవారు అవి బ్రిటిషువారు మనదేశాన్ని పాలించే రోజులు సంవత్సరానికి ఒకసారి ఇంగ్లండులో జరిగే డార్బీ గుర్రపు పందాలకు మనదేశంలో టిక్కెట్లు అమ్మడం

ఆశ్చర్యం అనిపిస్తుంది అనేక సంవత్సరాల తరువాత నేను లండనులో చదువుకోవడానికి వెళ్ళినపుడు డార్బీలో జరిగే గుర్రపుపందాలు చూడాలని సరదా కలిగింది లండనులో రైలుటిక్కెట్టుతోపాటు రేసులు చూడ్డానికి కూడా టిక్కెట్టు కొనుక్కుని రైలుఎక్కితే ఆ రైలు తిన్నగా గుర్రపుపందాలు జరిగేప్రదేశానికి తీసుకు పోతుంది పందాలు కాసే ఆర్థిక స్తోమత లేదు కాబట్టి సరదాగా ఆ జాతిగుర్రాలను పందాలలో వాటి సామర్థ్యం నైపుణ్యాన్ని చూచి ఆనందించాను

ఆర్థికంగా ఎన్ని యిబ్బందుల్లో ఉన్నా పందాల్లో గెల్చి డబ్బు సంపాదించాలని లాటరీలో డబ్బు సంపాదించాలని ఎప్పుడూ ప్రయత్నించలేదు లాటరీ అంటే గుర్తుకు వచ్చింది ఇంగ్లండులో లాటరీలు లేవు కాని ఫుట్‌బాల్ పూల్సు పుణ్యమా అంటూ ఆదేశంలో వారానికి ఇద్దరు లక్షాదికార్లు అయ్యేవారు లాటరీ పూర్తిగా చాన్సు కాని ఫుట్‌బాల్ పూల్సులో గెలవడానికి బోలెడు తెలివితేటలు కావాలి దానిలో అదృష్టం వంతు లేకపోలేదు కాని మన ప్రయత్నంకూడా హెచ్చుగా కావాలి

ఇంగ్లండులో ప్రతి బుదవారం, శనివారం దేశవ్యాప్తంగా ఫుట్ బాల్ ఆటలు జరుగుతాయి ఆ ఆటలలో గెలుపు ఓటములు చెప్పగలిగి ఉండాలి ఆరోజు జరిగిన అన్ని ఆటల పలితాలు సరిగ్గా ఊహించగలిగితే లక్షల పౌన్లు గెలవవచ్చు దానికి సంబందించిన ఫారం రెండు షిల్లింగులు ప్రతివ్యక్తి ఎన్ని పారాలైనా పూర్తి చేయవచ్చు బుదవారం శనివారం ఉదయం ఆ దేశంలోని అసంఖ్యాక స్త్రీ పురుషులు ఫుట్‌బాల్ గురించే ఆలోచిస్తారంటే అతి శయోక్తి లేదు అదిఉబయ తారకం ఆటయందు సరదాతోపాటు వారి అదృష్టాన్ని పరీక్షించుకోవడంలోని ఆనందం ఆ సాయంకాలం వరకు ఉంటుంది ఒక ప్రక్క గుర్రపుపందాలు మరొకప్రక్క ఫుట్‌బాల్ పూల్సు సామాన్య బ్రిటిషుపౌరునికి గొప్ప కాలక్షేపం నేను మిత్రులకు సలహాలు చెప్పేవాణ్ణి కాని ఎప్పుడూ ఆ ఫారాలు పూర్తి చేసేవాణ్ణికాదు

దినదిన గండం నూరేళ్లాయుష్షు అన్నట్టు నా లండను చదువు జరిగిపోతోంది ఒడిదుడుకులను తట్టుకోగలగడానికి అవసరమైన గుండె ధైర్యం పట్టుదల కార్యదీక్ష ఉండడం నా అదృష్టం సామాన్యంగా ఎం ఏ చదివినవాడు ఇంగ్లండులో ఏ యూనివర్శిటీలోనయినా రెండుమూడేళ్ళ మద్య పిహెచ్ డి తీసుకోగలుగుతాడు అయితే నా విషయంలో కొంచెం ఆలశ్యమయింది ప్రొపెసర్ హాల్ సమర్థవంతమైన సారద్యంలో బండి నడిపించాను నా రీసెర్చి విషయానికి సంబందించిన సమాచార సేకరణ పూర్తి అయింది చాప్టర్లు వ్రాయడం ప్రారంబించాను ఆ పరిస్థితిలో కొత్త

సమస్య ఎదురైంది నాకు ఎంత మంచి ఇంగ్లీషు వచ్చినా అది భారతదేశంలో నేర్చుకున్న ఇంగ్లీషు బ్రిటిషు విద్యార్థి వ్రాసినట్టు ఉండకపోవచ్చు ఇంతకుముందు చెప్పినట్టు ఆ దేశంలోని యూనివర్శిటీలలో చదువుకునేవారు ఏ దేశంవారైనా యావన్మంది అక్కడి విద్యాప్రమాణాలకు సరితూగాలి అందుమూలంగా నేను వ్రాసిన థీసిస్ చాప్టర్లు ఇంగ్లీషు భాషలో నిష్ణాతులైన వారిచేత చదివించమని ప్రొఫెసర్ హాల్ సలహా ఆయన సలహా మేరకు నా థీసిస్ చదివే ఇంగ్లీషు వ్యక్తి కోసం పెద్దగా వెతుక్కోవలసిన పనిలేకపోయింది

మిస్ విన్‌ఫ్రెడ్ థారన్ లండనులోని ఇండియాహౌస్‌లో లైబ్రేరియన్ అని చెప్పానుకదా! అప్పటికే ఆమె ఏభై పడిలో ఉంది సన్నగా పొడుగ్గా ఉండేది ఆమెను కలుసుకున్న వారు ఆమె అందచందాలు చూడరు ఆమె విశాల హృదయం, మంచితనం క్రైస్తవులకు సహజమైన సేవాభావం, ఎప్పుడూ నవ్వుతూ ఉండే ఆమె వ్యక్తిత్వానికి ముగ్ధులు కాకుండా ఉండలేరు ఇండియా హౌస్‌లో ఆమె గది ఎప్పుడూ ఇండియా కాఫీ సౌరభంతో ఘుమఘుమలాడేది తమ బాధలు చెప్పుకోడానికి వచ్చిన భారతీయ విద్యార్థులకు ఆమె మాతృమూర్తి చక్కటి కాఫీ ఇచ్చి వారి బాధలు ఓపికగా వినేది ఆమెకు భారతదేశం అన్నా భారతీయులన్నా బోలెడు అభిమానం ఇక లండనులో చదువు సాగించడానికి నేను పడే పాట్లు చూచి నేనంటే ప్రత్యేక ఆదరాభిమానాలు చూపించేది నా థీసిస్ చదివిపెట్టమని ఆమెను కోరాను నా అదృష్టం బాగుండి ఆమె వెంటనే అంగీకరించింది కాని నిజానికి ఆమెకు లైబ్రరీలో చదవడానికి తగిన తీరిక దొరకదు ఇంటివద్ద అసలు కుదరదు ఆమె తండ్రికి సేవ చేయడం, ఇల్లు, తోట, మొక్కల పెంపకం చూచుకోవడంతో ఆమెకు తీరికలేని పని అయినా నాయందు ఉన్న అభిమానంతో నేను వ్రాసిన చాప్టర్లు చదవడానికి అంగీకరించింది

ఆమె లండను ప్రక్కనే ఉన్న ఎసెక్స్ కౌంటీలోని రాంఫర్డ్ గ్రామంలో ఉంటుంది ప్రతిరోజు రైలులో లండను వస్తుంది ఒక గంట ప్రయాణం ఆ ప్రయాణ సమయంలో మిస్ థారన్ నా థీసిస్ చదివి దానిలోని భాషకు మెరుగులు దిద్దేది భాషను మెరుగు పరచడమే ఆమె బాధ్యత ఆమె ఆ పని అద్భుతంగా చేసిపెట్టింది థీసిస్ తయారయింది ఇంక దానిని టైపు చేయించి యూనివర్శిటీకి సమర్పించాలి వ్రాత ప్రతి ఐదువందల పేజీలవరకు ఉంది థీసిస్ టైపు చేయడానికి ప్రత్యేక నైపుణ్యం కావాలి ముఖ్యంగా ఫుట్‌నోట్సు తలనొప్పి వ్యవహారం థీసిస్ టైపు చేసిపెట్టడానికి లండనులో ప్రత్యేక వ్యక్తులు ఉన్నారు అయితే వారి చార్జీలు చాలా ఎక్కువగా ఉంటాయన్నారు నాకు కొంచెం ముఖపరిచయం ఉన్న మా ప్రిన్సిపాల్ ఫిలిప్సు సెక్రటరీని

టైపు చేసిపెట్టమని అడిగాను ఆమె కొంతబాగం తాను టైపు చేయడానికి అంగీకరించింది మిగలింది టైపింగ్ వృత్తిగా పెట్టుకున్న ఇంగ్లీషు మహిళకు అప్పగించింది

లార్డ్సలో ఇంగ్లండు ఆస్ట్రేలియా దేశాల మద్య క్రికెట్ టెస్ట్ జరుగుతుంటే చూడ్డానికి వెళ్ళాను లార్డ్స క్రికెట్ గ్రౌండ్ లండను పట్టణానికి నడిబొడ్డులో ఉంది అది ప్రపంచంలోని క్రికెట్ ఆటగాళ్ళకు మక్కా అక్కడ ఆడడం గొప్ప అక్కడ ఏదైనా సాదించి రికార్డు పుస్తకాలలోనికి ఎక్కితే మరీ గొప్ప కాని చిత్రం ఏమిటంటే ఆ గ్రౌండ్ సంప్రదాయాలకు నిలయం తప్ప చూడ్డానికి గొప్పగా ఉండదు ఆట ఆడే స్థలం చుట్టూ గడ్డిమీద కూర్చుని ఆటచూడవచ్చు క్రికెట్‌పిచ్చి ఉన్న వాళ్ళకు మాత్రం లార్డ్స బార్‌లో అడుగుపెడితే క్రికెట్ ఆటలో శాశ్వత కీర్తి ప్రఖ్యాతులు సంపాదించిన హేమా హేమీలతో భుజాలు రాసుకోవచ్చు టెస్టు మ్యాచ్ ఐదురోజులు చూడనిదే నాకు సంతృప్తి ఉండేది కాదు

లండనులో ఉన్నవారికి రెండు టెస్టులు చూచే అవకాశం ఉంటుంది ఒకటి లార్డ్స టెస్టు, రెండవది ఓవల్ టెస్టు ఓవల్ గ్రౌండ్స్ ఎసెక్సు కౌంటీ క్రికెట్ వారిది ఆ ప్రదేశం లండనుకి దగ్గర కావడం వల్ల అక్కడి ప్రేక్షకులు కూడా చాలావరకు లండనునుంచే వెళతారు మిగిలిన టెస్టు సెంటర్లు చూడలేకపోయినా నేను మాత్రం రెండు టెస్టులు చూచేవాణ్ణి క్రికెట్ దేశాలనుంచి వచ్చిన అన్ని టీములు ఆడిన టెస్టుమ్యాచ్‌లు చూచే అవకాశం దొరికింది దక్షిణాఫ్రికానుంచి క్రికెట్ టీము ఇంగ్లండు, ఆస్ట్రేలియా దేశాలలో ౦ర్యటించేది నిజం చెప్పాలంటే ఆరోజుల్లో దక్షిణాఫ్రికా టీము క్రికెట్ ఆడే ౨న్ని దేశాలలోను ఉత్తమమైనది దక్షిణాఫ్రికా ప్రభుత్వ జాతి వివక్షతా విదానం పలితంగా ఆ దేశపు క్రికెట్ టీములు ప్రపంచ క్రికెట్ రంగానికి దూరమైపోయాయి బారతదేశం పాకిస్తాన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, వెస్టిండీసునుంచి వచ్చిన క్రికెట్ టీములు ఇంగ్లండులో ఆడే టెస్టులలో లార్డ్స, ఓవల్ టెస్టులు చూడకుండా వదలలేరు బందరులో హిందూకళాశాలలో చదువుకునే రోజుల్లో ఆ కళాశాల పూర్వ విద్యార్థి, బారతీయ క్రికెట్ ఆటగాళ్ళలో మేటి అయిన సి కె నాయుడు స్వయంగా క్రికెట్ ఆటలోని మెలుకువలు నేర్పారు కాని ఎప్పుడూ క్రికెట్ ఆడకపోయినా దానియందు మమకారం నానాటికి పెరిగిందే తప్ప తగ్గలేదు

ఇకపోతే టెన్నిస్ ఆ రోజుల్లో ఇంగ్లండులోని వింబుల్డన్ పోటీలు అనదికార ప్రపంచ పోటీలుగా పరిగణించబడేవి వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో గెలవడం ఎవరెస్టు ఎక్కినట్లే ప్రపంచ టెన్నిస్ ఆటగాళ్ళకు ఆ

పోటీలు అగ్ని పరీక్ష ఈ ఆటలు చూడడానికి టిక్కెట్లు దొరకడం అంత సులభం కాదు చాలావరకు క్లబ్బులకు టిక్కెట్లు పంచుతారు ఇక ఆట జరిగే రోజున అమ్మే టిక్కెట్లు చాలావరకు నిలబడి చూడ్డానికే పరిమితం అలాగే అవస్థపడి వెళ్ళి టిక్కెట్లు సంపాదించి నిలబడి చూచేవాణ్ణి నిలబడి చూడ్డంలో గొప్ప ఆనందం ఉందనిపించేది ఏకోర్టులో మనకు నచ్చిన ఆట జరుగుతుంటే ఆ కోర్టు వద్దకు వెళ్ళడానికి సర్వ స్వతంత్రం ఉండేది కూర్చుని ఆ స్వేచ్ఛ ఉండేది కాదు కొద్దో గొప్పో టెన్నిస్ ఆడేవాణ్ణి కాబట్టి ఆ ఆటలోని అందాలు చూడ్డానికి వింబుల్డన్ బ్రహ్మాండమైన అవకాశం కల్పించేది కాని భారతీయునిగా చాలా నిరాశ కలిగేది భారత టెన్నిస్ ఆటగాళ్ళు ఎప్పుడూ వింబుల్డన్ గెలవలేదు అయితే మన ఆటగాళ్ళు చివరి 16 మందిలోకి వచ్చారు క్వార్టర్‌ఫైనల్సుకి వచ్చారని సంతోషించడం మాత్రం మిగిలేది మన ఆటగాళ్ళు ఎవరు ఫైనల్సుకి చేరకపోవడం గొప్ప ఆశాభంగం, నిరుత్సాహం కలిగించేది

నా థీసిస్ టైపు కొట్టడం పని పూర్తి అయిపోయింది ప్రొఫెసర్ ఫిలిప్స్ సెక్రటరీకి ఇచ్చిన భాగం టైపుచేసి ఇచ్చింది ఇక టైపింగ్ ఖర్చులే కాకుండా ఐదు కాపీలు బైండు చేయించడానికి, పరీక్షఫీజుకోసం బోలెడు డబ్బులు కావాలి నా వద్ద డబ్బులేదు భారత హైకమిషనువారి పుణ్యమా అంటూ వచ్చిన డబ్బుతో గుట్టుగా కాల క్షేపం చేస్తున్నాను పరిస్థితి క్లిష్టంగా ఉంది ఈనగాచి నక్కల పాలు చేయవలసిన పరిస్థితి వస్తుందేమోనని ఆందోళన థీసిస్ పూర్తి చేసాననే ఆనందం లేకుండా పోయింది నాకు కావలసిన మొత్తం లండనులో నా మిత్రులెవరూ ఆదుకోవడానికి వీలైనది కాదు చాలా డబ్బు కావాలి దారి తెన్ను కనుపించలేదు ఏమీతోచక కొన్ని రోజులు లండను వీధులలో తిరిగాను అప్పుడు ఒక చక్కటి ఆలోచన వచ్చింది నా ఆర్థిక అవస్థ ప్రొఫెసర్ హాల్‌తో మొరపెట్టుకున్నాను గత మూడేళ్ళనుంచి నా రీసెర్చికి ఆచార్యత్వంవహించిన ప్రొఫెసర్ హాల్ నా ఆందోళన చూసి బాధపడ్డారు మా కళాశాలలో విద్యార్థుల సంక్షేమం, మంచి చెడ్డలు చూసే బాధ్యత ఒక ప్రొఫెసర్‌కి అప్పగించారు ఆయన ప్రొఫెసర్ కార్న్ కన్ ఆయన్ని కలుసుకుని నాగోడు ఆయనతో చెప్పుకోమని ప్రొఫెసర్ హాల్ సలహా ఇచ్చారు

ప్రొఫెసర్ కార్న్ కన్ మా కాలేజీలో ఫొనిటిక్స్ బోధిస్తారు చాలా కలివిడిగా ఉంటారు ఆయన్ని అంతకుముందు ఎప్పుడూ కలుసుకోకపోయినా నేను ఆయన్ని చూడ్డానికి వెళ్ళినప్పుడు ఆయన నన్ను అత్యంత ఆదరపూర్వకంగా ఆహ్వానించారు విద్యార్థుల మంచి చెడ్డలు చూడ్డం ఆయనకు యివ్వబడిన అదనపు బాధ్యత ఆయన్ని చూడగానే విద్యార్థులు తమ సమస్యలు సగం మర్చిపోతారు ఆయనతో మాట్లాడిన తరువాత ఇక

సమస్యే ఉండదు మిగిలిన వాళ్ళమాట ఎలా ఉన్నా నా విషయంలో అది అక్షరాలా నిజం అయింది ముందు టైపుచేసి సిద్ధంగా ఉన్న దీసిస్ ఆ టైపిష్టునుంచి తెప్పించాలి

ఆయన ఒక్క నిమిషంకూడా వృధా చేయకుండా ఆ టైపిష్టుకి టెలిఫోను చేసారు ముక్తసరిగా మూడు మాటలు చెప్పారు ఆయన మాటలు నేను ఎన్నటికి మర్చిపోలేను

"మా కళాశాల విద్యార్థి థీసిస్ టైప్ అయి నీవద్ద ఉన్నవట ఆ కాగితాలు వెంటనే కాలేజీకి పంపించు టైపింగ్ ఖర్చులు విషయం తరువాత చూద్దాం" అని ప్రొపెసర్ కార్న్ కన్ టెలిఫోన్ పెట్టేసారు నేను ఆశ్చర్యంగా ఆయన వైపు చూసాను చిరునవ్వు నవ్వి ఆ సమస్య తీరిపోయినదన్నారు టైపుచేసిన ఆమెకు ప్రతిఫలం ఎవరు ఇచ్చారో నాకు తెలియదు కాని ఆ సాయంకాలానికి చక్కగా టైపు చేయబడిన నా థీసిస్ కాగితాలు నాకు చేరాయి

ప్రొపెసర్ కార్న్ కన్ మూడు పౌన్లు ఇచ్చి ముందు థీసిస్ ఐదు కాపీలు బైండు చేయించమన్నారు కాపీలు తయారు అయ్యాయి వాటిని యూనివర్శిటీకి సమర్పించడానికి 35 పౌన్లు పరీక్షఫీజు కట్టాలి అప్పుడు నేనున్న ఆర్థికపరిస్థితిలో 35 పౌన్లు సంపాదించటం నాకు ఊహకు అందని సమస్య ఈసారి ప్రొఫెసర్ హాల్ ఆర్తత్రాణ పరాయణునిలా రంగంలో దిగారు లండను యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌ని కలుసుకొని నా కథంతా చెప్పి పరీక్షఫీజు కట్టడానికి 35 పౌన్లు లేక నానా బాద పడుతున్నట్టు చెప్పారు హాల్ గారు వైస్ ఛాన్సలర్‌తో ఇంకా ఏమి చెప్పారో నాకు తెలియదు కాని ఆ సాయంకాలానికి 35 పౌన్లు తెచ్చి నా చేతిలో పెట్టి ఆ మరునాడు పరీక్షఫీజు కట్టి థీసిస్ నాలుగు కాపీలు యూనివర్శిటీకి ఇవ్వమన్నారు నా ఆనందానికి అవధులు లేవు, ఆయనకు హృదయపూర్వకంగా నమస్కారంపెట్టి ఆ సొమ్ము ఎలా వచ్చినదని అడిగాను

లండనుయూనివర్శిటీ వైస్ చాన్సలర్ వద్ద తన ఇష్ట ప్రకారము అదికార పూర్వకంగా ఖర్చుపెట్టడానికి కొంత మొత్తం ఉంటుందట అప్పటికి విద్యాసంవత్సరం పూర్తి కాబోతున్నందున ఆ మొత్తంలో చాలా వరకు అర్హులైన విద్యార్థులకోసం ఖర్చుపెట్టారు ఏదో నా అదృష్టం బాగుండి దానిలో నా అవసరానికి కావలసినంత సొమ్ము మిగిలి ఉంది వైస్ ఛాన్సలర్ ఆ మొత్తాన్ని నా కోసం ప్రొఫెసర్ హాల్‌కి ఇచ్చారు అది నాకు సంజీవనిలా పని చేసింది పరీక్ష పీజు కట్టి బైండు చేయబడిన థీసిస్ నాలుగు కాపీలు యూనివర్శిటీ వారికి అందించాను కాని ఇల్లు అలుక గానే పండుగ కాదుకదా

అన్ని యూనివర్శిటీల్లో వలెనే లండను యూనివర్శిటీలో కూడా PhD

థీసిస్ ముగ్గురు ప్రొఫెసర్‌లు చదువుతారు వారిలో ఒకరు వైట యూనివర్శిటీ ప్రొఫెసర్ నా థీసిస్ ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రొఫెసర్‌కి పంపారు మిగిలిన ఇద్దరిలో ఒకరు ప్రొఫెసర్ హాల్ మూడవ పరీక్షకునిగా ప్రొఫెసర్ విలియమ్స్‌ని నిర్ణయించారు వారు థీసిస్ చదివి ఒక అభిప్రాయానికి వచ్చినతరువాత విద్యార్థితో ముఖాముఖి చర్చ జరుపుతారు అప్పుడు వారు పూర్తిగా సంతృప్తి పడితే డిగ్రీ ఇస్తారు ఇంత తతంగం ఉంది దానికి చాలా కాలం పడుతుంది అయితే నా ఆర్థిక పరిస్థితులను ఎరుగున్న ప్రొఫెసర్ హాల్ నా పరీక్ష సాధ్యమైనంత తొందరగా జరిపించాలని మిగిలిన వారికి నచ్చ జెప్పారు ఎంత తొందరగా చేయాలన్నా 400 పేజీలు పైగా ఉన్న గ్రంధం పరీక్షించే దృష్టితో విమర్శనాత్మకంగా చదవడానికి వ్యవది కావాలి దానికితోడు యూనివర్శిటీ యొక్క పరపతి ప్రతిష్ట కూడా దృష్టిలో పెట్టుకోవాలి ఆయూనివర్శిటీ ప్రమాణాలకు సరిపోతే తప్ప Ph D కి అర్హత లేని థీసిస్‌కి డిగ్రీ ఇచ్చి తమను తాము అవమాన పరచుకోరు నా శాయశక్తులా ప్రయత్నించి థీసిస్ తయారు చేసాను ఇక ఫలితం పరీక్షకుల చేతిలో ఉంది ఆ ఫలితంకోసం ఎదురు చూస్తూ కాలక్షేపం చేస్తున్నాను

చదువు సమస్య పూర్తి అయినట్టే ఇక దేశానికి తిరుగు ప్రయాణసన్నాహాలు ప్రారంభించాను వంద పౌన్లు వరకు అవసరమవుతుందన్నారు ఏదో సామెత చెప్పినట్టు ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికి ప్రయాణమైనట్టుంది భారత హైకమిషనర్ కృష్ణమీనన్‌ని కలుసుకుని నా పరిస్థితి వివరించాను నా కథంతా విని నన్ను అభినందించారు కాని నాకు కావలసింది అభినందనలు కాదు తిరుగు ప్రయాణానికి ఓడ టిక్కెట్టు సామాన్యంగా ఏది చెప్పినా కుండబద్దలు కొట్టినట్టు చెప్పే శ్రీ కృష్ణమీనన్ సలహా చెప్పడానికి తటపటాయించారు నాకు అంతుచిక్కలేదు చివరికు ఆయన తేల్చినదేమిటంటే నన్ను లండను నుండి బొంబాయికి భారత ప్రభుత్వ ఖర్చుతో పంపించే ఏర్పాటు చేయాలన్నారు నేను అడిగినదికూడా అదేకదా! ఆయన ఎందుకు అంత సందేహిస్తూ చెబుతున్నారో అర్థం కాలేదు

భారత హైకమీషనర్ శ్రీ కృష్ణమీనన్ నన్ను ప్రభుత్వ ఖర్చుతో ఇంటికి పంపించడం అంత గౌరవప్రదమైన చర్య కాదని సందేహిస్తున్నట్టు చెప్పారు లండనునుంచి బొంబాయికి ఓడ టిక్కెట్టు కొనిపెట్టి ప్రభుత్వం ఆ సొమ్ము వడ్డీతో సహా కొద్ది వ్యవది తరువాత చెవులు వడేసి వసూలు చేస్తుంది కష్టపడి చదివి చివరకు దేశం తిరిగి వెళ్ళడానికి చేతిలో డబ్బు లేని స్థితి రావడం విని ఆయనకూడా చాలా బాధపడ్డాడు ఆయన కాని, నేను కాని చేయగలిగినదేమీ

కనిపించలేదు ఢిల్లీలో విద్యాశాఖకు వ్రాసి టిక్కెట్టుసొమ్ము తెప్పిస్తానన్నారు అంతవరకు లండనులో ఖాళీగా ఉండాలి కేంద్ర ప్రభుత్వంనుంచి అనుమతి రావడానికి కొంత సమయం పట్టవచ్చు దానికి తోడు లండను యూనివర్సిటీ నిర్వహించవలసిన నా పరీక్ష కూడా ఉంది అప్పటికి నేను లండను వచ్చి మూడేళ్ళు దాటిపోయినందున లండనులో మంచి స్నేహితులు ఉన్నారు. కాలక్షేపం సమస్యకాదు, కాని గదికి అద్దె భోజనాలు, బాలే, థియేటర్ ప్రదర్శనలకు కావలసినడబ్బు పెద్ద సమస్య అయింది మనస్సు అంత బాగా లేదు అటువంటి పరిస్థితిలో ఒక చక్కటి పార్టీకి ఆహ్వానం వచ్చింది

ఆ పార్టీ నేనెరుగున్న అమ్మాయి స్నేహితురాలి 21వ జన్మదినం సందర్భంగా ఏర్పాటు చేయబడినది అంతవరకు నాకు నిజంగా 21వ పుట్టినరోజు ఇంగ్లీషు అమ్మాయిలకు ఎంత ముఖ్యమో తెలియదు ఆనాడు ఆమె తల్లితండ్రులు ఆమెకు సింహద్వారం తలుపు తాళం చెవి ఇస్తారు అంటే ఆమెకు సంపూర్ణ స్వాతంత్ర్యం యిస్తారన్నమాట నిజానికి అమ్మాయిలు 16వ ఏటనుండి బాయ్ ఫ్రెండ్స్‌తో తిరుగుతూ ఉంటారు ఎవరితో వెళ్ళింది, ఏమి చేసినది ఇంటికి తిరిగి వచ్చిన తరువాత తల్లితో చెబుతారు ఆశ్చర్యపడనక్కరలేదు తన బాయ్‌ఫ్రెండ్ ముద్దుపెట్టుకుంటే ఆవివరం కూడా చెబుతారు నేను లండనులో చదువుకునే రోజుల్లో ఆడపిల్లలు మగపిల్లలు కలుసుకున్న రోజునుంచి ముద్దులు పెట్టుకోవడం ఉండేదికాదు మొదట్లో కలిసి తిరగడం తరువాత చేతులు పట్టుకు తిరగడం, ఆతరువాత నెక్కింగ్ వగైరా సరదాలు, అప్పుడు ముద్దులు ఆతరువాత సినీమాహాళ్ళలో ముద్దులు, పార్కులలోగడ్డిలో దొర్లడం, అంత వరకు సెక్స్ ప్రమేయం ఉండేది కాదు

బాయ్ ఫ్రెండ్‌తో డాన్సుకి వెళ్ళినా, సినిమాకు వెళ్ళినా అమ్మాయిలు రాత్రి పదిలోపుగా ఇంటికి చేరాలి డోర్‌బెల్ నొక్కవలసినదే సింహద్వారంతలుపు ఇంట్లో వాళ్ళుతీయాలి ఆ తలుపు తాళం ఆమెకు ఇవ్వరు ఆ అర్హత ఆమెకు 21వ జన్మదినంనాడు వస్తుంది ఆ తరువాత ఆమె ఎక్కడకు వెళ్ళినా ఎన్ని గంటలకు తిరిగివచ్చినా ఎవరూ ఆమెను ప్రశ్నించరు అయినా అమ్మాయిలు ఎవరి జాగ్రత్తలో వారు ఉంటారు వాళ్ళంతా విచ్చలవిడిగా తిరుగుతారని మన దేశంలో అంతా అనుకునేవారు కాని వాళ్ళ సమాజాన్ని, కుటుంబవ్యవస్థను పరిశీలనగా చూసిన తరువాత వాళ్ళ ప్రవర్తనలో విశృంఖలత్వం లేదనిపించింది వారికి కూడా కొన్ని నియమాలు ఉన్నాయి అయితే ఆడపిల్లలకు మగపిల్లలకు తల్లిదండ్రులు చెప్పే సలహా సాధ్యమైనంతమందితో తిరగమని (safty in numbers ) చిత్రం ఏమిటంటే వాళ్లు తిరగడం మొదలు పెట్టినతరువాత కూడా ఏచిన్న విషయంలో అభిప్రాయభేదం వచ్చినా, ఏచిన్న

విషయం నచ్చకపోయినా ఎవరిదారి వారిది ఆ రూపేణా వాళ్ళలో వ్యక్తిత్వం, విచక్షణ పెరుగుతాయి వారు సెక్స్‌కి మనం ఇచ్చినంత ప్రాముఖ్యత ఇవ్వనిమాట నిజం

నేను పార్టీకి వెళ్ళిన ఇంటిలో అలంకారాలు ఆతిధ్యం ఆటలు పాటలు ఆనందం నిజంగా పండుగలాగే ఉంది వచ్చిన అతిధులలో అనేక దేశాల వారున్నారు పుట్టిన రోజు ఆశీర్వాదాలు ముద్దులతోనే కాని అక్కడ స్నేహంయొక్క పరిదుల్ని బట్టి వివక్షత ఉంటుంది పరిచయస్తులైతే కరచాలనం ఇంకొంచెం బాగా ఎరిగినవారు బుగ్గల మీద ముద్దుపెట్టుంటే ఇంకా కొంచెం ఎరిగిన వారు పెదాలమీద ముద్దు పెట్టుకుంటారు ఎలిజబెత్ రాణీ అయితే చేతివరకే పరిమితం బ్రహ్మాండమైన సప్పర్ సాధారణంగా ఇంగ్లీషు కుటుంబాలలో సాయంకాలం ఆరుగంటలకే డిన్నర్ అయిపోతుంది పడుకోబోయేముందు తీసుకునేది సప్పర్ అతి సామాన్యంగా ఉంటుంది కాని ఆనాడు పుట్టినరోజు పండుగ కాబట్టి చాలా పదార్ధాలు చేసారు ఆ తరువాత తల్లితండ్రులు తాళం ఇవ్వడం, హాయిగా అంతా కూర్చున్న తరువాత అతిదులంతా వారివారి బాషలో పాటలు పాడాలన్నారు అక్కడ ఉన్న అతిధులలో భారతీయుణ్ణి నేను ఒక్కణ్ణే ఏది పాడినా ఫరవాలేదు కాని పాడడం రావద్దూ!నాకు పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయింది

నాచిన్నతనంలో గోంగూర పాటలు నాయుడు బావ పాటలు హుషారుగా పాడేవాణ్ణి కాని నేను పాడేవాణ్ణి అనటం అతిశయోక్తి, ఏదో సరదా పాటలు అయితే లండనులో పదుగురుమద్య కూర్చుని తగుదునమ్మా అని పాడడానికి ప్రయత్నించడం సాహసమే పదిమందిలో నన్ను పాడమని బలవంతము చేయవద్దని వ్రాసినకవి గుర్తుకు వచ్చాడు ముఖ్యంగా మా అన్నయ్య గుర్తుకు వచ్చాడు ఆయనకు హార్మోనియం వాయించడంవచ్చు నాటకాల్లో వేషాలు వేసేవాడు సంగీత జ్ఞానంఉండేది నా చిన్నతనంలో నాకు కూడా సంగీతం నేర్చుకోవాలని సరదాగా ఉండేది పాడటం నేర్పమని మా అన్నయ్యను అడిగేవాణ్ణి దానికి ఆయనకు బేడ బెల్లం జిలేబి గురుదక్షిణ ఇచ్చేవాణ్ణి అప్పుడు సా పా సా అనమనేవాడు ఆతరువాత ఏదైనా పద్యం పాడమనేవాడు నేను ఒక చరణం పాడేసరికి "నీకెందుకురా సంగీతం"అని హార్మోనియం మూసివేసేవాడు అంతే నాకు ఎప్పుడూ ఒక పాటకాని, పద్యంకాని పాడే అవకాశం, అవసరం రాలేదు కాని లండనులో ఆరాత్రి వాళ్ళంతా తెలుగు పాటపాడాలన్నారు తప్పలేదు నాయుడోళ్లింటికాడ అనే పాటలో మొదటిచరణం పాడాను వాళ్ళంతా ఆనందించారు

చెట్టు లేని చోట ఆముదము చెట్టు మహావృక్షం అనిఊరికే అన్నారా!

అటువంటి పార్టీలలో అందరికీ వినోదం కలిగించటానికి పనికివచ్చే ఒకటిరెండు మ్యాజిక్‌లు వచ్చునాకు అప్పటికే అంతా మంచి మూడ్‌లో ఉన్నారు వాళ్ళకు ఇండియన్ రోప్ ట్రిక్కు చూపెడతానన్నాను వాళ్ళదృష్టిలో రోప్ ట్రిక్కు అంటే నేలమీద పెట్టిన త్రాటిని పైకి పంపి దానిమీద కూర్చొనగలగడం, అది అసంభవం కాబట్టి దానిని జోక్‌గా ఉపయోగిస్తారు అయితే నేను రోప్‌ట్రిక్ చూపెడతానంటే వాళ్ళంతా ఆశ్చర్యపోయారు, సరే పురికొసవంటి త్రాడు తెప్పించాను ఒక అబ్బాయిని పిల్చి దానిని మధ్యకు కత్తిరించమన్నాను ఆరెండు ముక్కలు అందరికీ చూపించి ముడివేసాను అప్పుడు ఇద్దరు అమ్మాయిల్ని పిల్చి ఆముడి వేసిన త్రాడును పట్టుకు నిలబడమన్నాను బోలెడు హడావిడిచేసి మొత్తంమీద రెండు ముక్కలుగా కత్తిరించిన త్రాటిని ఒకటిగా చేసి చూపించాను వాళ్ళంతా ఆనందించారు ఆనాటి పార్టీకివచ్చిన అతిధులను ఆనందపరచటంలో నేనూ కూడ శక్తివంచన లేకుండా తోడ్పడ్డాను అప్పుడు ఆటలు అటువంటి పార్టీలలో ఆసమయంలో ఆడుకునే ఆటలు చాలా వరకు దాగుడుమూతలు దొంగను వెతకడం ఆటలవంటివే ఉంటాయి అదంతా పార్టీలోభాగం, అప్పుడు ఎవరి ఇళ్ళకు వాళ్ళు తిరుగుప్రయాణం నేను లండనులో ఉన్న రోజులలో అటువంటి పార్టీలు ఎక్కువ చూచే భాగ్యం కలగలేదు చూచిన కొద్దివాటి పుణ్యమా అంటూ ఇంగ్లీషుకుటుంబ వ్యవస్థలోని సున్నితమైన సంబంధాల గురించి తెలుసుకుని అర్థం చేసుకునే అవకాశం కలిగింది

లండను నుంచి తిరుగు ప్రయాణానికి టిక్కెట్టు డబ్బు భారత ప్రభుత్వంనుంచి వచ్చినదో లేదో కనుక్కోవటానికి లండనులోని భారత హైకమిషను చుట్టూ తిరగడం, నాథీసిస్ చదివి దాని మంచి చెడ్డలు నిర్ణయించి మౌలిక పరీక్ష ఎప్పుడు పెడతారో అడగడానికి ప్రొఫెసర్ హాల్ చుట్టూ తిరగడంతో సరిపోతోంది ఒకనాడు ప్రొఫెసర్‌హాల్‌ని చూడ్డానికి వెళితే త్వరలో పరీక్ష జరిపిస్తానని భరోసా చెప్పి తమ ఇంటికి భోజనానికి ఆహ్వానించారు ఆయన లూటన్ అనే చిన్న గ్రామంలో మకాం ప్రతిరోజు ఆయన రైలులో లండనువచ్చి వెళతారు ఆయన నిర్ణయించిన రోజున రైలులో లూటన్ వెళ్లాను, మా ప్రొఫెసర్ రైలుస్టేషనులో నాకోసం ఎదురుచూస్తూ ఉన్నారు వారి ఇంటికి తీసుకు వెళ్ళడానికి ముందు లూటన్ వీధుల్లో త్రిప్పి ఊరు చూపించారు అది ఎంత చిన్న గ్రామమయినా చూడముచ్చటుగా ఉంది దానికితోడు ప్రొఫెసర్ హాల్ ఎంతో ఉత్సాహంగా, సరదాగా తమ గ్రామం, ప్రజలు, ఆచార వ్యవహారాల గురించి చెప్పారు దానితో ఆగ్రామం ఇంకా అందంగా కనిపించింది

ఆయనతో కబుర్లాడుతున్నప్పుడు ఇంగ్లీషు వారి విషయంలో నామనస్సులో ఉన్న కొన్ని అభిప్రాయాల గురించి ఆయన్ని అడిగాన ఇంగ్లీషువారు చాలా రిజర్వుడుగా ఉంటారని ఎవరైనా పరిచయం చేస్తేకాని ప్రక్క ఇంటివారిని కూడా పలకరించరని నేను విన్నవిషయాలు వివరించాను ఆయన నవ్వారు నేను మూడేళ్ళు పైగా ఆయన్ని కలుసుకుంటున్నా అలా నవ్వడం ఎప్పుడూ చూడలేదు ఆయన చెప్పిన సమాదానం ఎప్పటికీ మర్చిపోలేను బ్రిటిష్ వారు ద్వీపకల్పంలో నివసిస్తారు కాబట్టి వారిలో బైటవారంటే ఒకవిదమైన అనుమానం బయం ఉండడం సహజం అట అందుమూలంగా వారు కావాలని తమ ప్రవర్తనలో చుట్టూ ఒక విదమైన రక్షణకవచాన్ని ఏర్పరచుకుంటారు అదే వారు రిజర్వుడుగా ఉండడంలో ప్రతిబింబిస్తుంది ప్రధమంలో పరిచయం చేస్తే కాని మాట్లాడక పోయినా, ఆ తరువాత కూడా ముబావంగా ఉన్నా వారిచుట్టూ మానసికంగా ఏర్పరచుకున్న రక్షణ కవచాన్ని చేదించగలిగితే చాలా చక్కటి వ్యక్తి కనిపిస్తాడు మంచి మిత్రులు అవుతారు ఈవిషయంలో అమెరికన్లకు ఇంగ్లీషు వారికి బోలెడు తేడావుంది అమెరికన్ మనల్ని కలుసుకోగానే మన ఆప్త మిత్రునిలా ప్రవర్తిస్తాడు అది తాత్కాలికం, ఇంగ్లీషువారితో మిత్రత్వం జాగ్రత్తగా పెంచుకోవాలి అప్పుడు నిజంగా ఆప్తమిత్రులవుతారు అంటూ ప్రొఫెసర్ హాల్ నాసందేహ నివృత్తి చేసారు

వారి ఇంటికి చేరాం అంతకు ముందు రెండే ఇంగ్లీషు గృహాలకు వెళ్ళాను ఒక క్రిస్టమస్ భోజనానికి మారియన్ వాళ్ళ ఇంటికి, నాథీసిస్ చదివిపెట్టిన మిస్ వినిఫ్రెడ్ ధారన్ ఇంటికి మాత్రమే వెళ్ళాను ప్రొఫెసర్గారి ఇల్లుమూడవది ఇల్లు చిన్నదైనా అన్ని సదుపాయాలతోను హాయిగా ఉంది ఇంగ్లీషు వారికి తమ ఇల్లే తమ కోట అంటూ ఉంటారు అదినిజమే అనిపించింది ఇంట్లో ఆయన, బార్య, చిన్నకుమారుడు డేవిడ్ ఉన్నారు హాల్ జూనియర్ అని పిలవడం తనకు నచ్చదని తనపేరు డేవిడ్ అని కుండ బ్రద్దలు కొట్టినట్టు చెప్పాడు ప్రపంచంలో పిల్లలంతా తండ్రి గొప్పవాడైతే ఆయన పేరు చెప్పుకుని బ్రతకడానికి తాపత్రయ పడతారు కాని డేవిడ్ హాల్కి మాత్రం తన తండ్రి యూనివర్శిటీ ప్రొఫెసర్ అని చెప్పుకోవడం ఇష్టం లేదట ఆశ్చర్యపోయాను

వేసవి సెలవుల్లో వర్క్ క్యాంపులకు వెళ్ళి బంగాళాదుంపల బస్తాలు మోసి డబ్బు సంపాదిస్తాడట పైచదువులు చదవడం ఇష్టంలేక మెట్రిక్యులేషన్ తరువాత లక్షలాది ఇంగ్లీషు కుర్రవాళ్ళలాగ డేవిడ్ కూడా సాంకేతిక విద్యాభ్యాసం చేస్తున్నాడు అతడి కబుర్లు వింటూ చిరునవ్వు నవ్వుతూ

డేవిడ్ ఇంగ్లీషు యువతరం ప్రతినిధి అన్నారు ప్రొఫెసర్ ఆ తరాల బేదం ఆ తండ్రీ కొడుకుల్లో కొట్టవచ్చినట్టు కనిపించింది శ్రీమతి హాల్ ఇరవైఏళ్ళు భర్తతో పాటు రంగూన్‌లో ఉన్నందున రుచికరమైన కర్రీ తయారుచేసి చక్కటి భోజనం పెట్టింది సాయంకాలం వరకు అక్కడ గడిపి టీ అయిన తరువాత లండనుకి ప్రయాణం అయ్యాను ప్రొఫెసర్, ఆయన బార్య, కుమారుడు నన్ను రైలు ఎక్కించడానికి స్టేషన్‌కి వచ్చారు వారి ఆప్యాయతకు ముగ్ధుణ్ణి అయ్యాను

నా తిరుగు ప్రయాణం ఖర్చుకి కావలసిన డబ్బు కంటే నాపరీక్ష ముందు వచ్చింది ప్రొఫెసర్ హాల్ నాకు కబురుపెట్టి నాథీసిస్ చదవడం పూర్తి అయినదని మౌఖిక పరీక్షకు ఏర్పాటు చేస్తున్నానని చెప్పారు ఆ సందర్భంలో పిహెచ్ డి థీసిస్‌పై జరిగే మౌఖిక పరీక్షలో ప్రొఫెసర్లు అవలంబించే పద్ధతి గురించి చెబుతూ వారు విద్యార్థి వ్రాసిన థీసిస్ లో ఉన్న ముఖ్యమైన విషయాలపై వివరణ తెలుసుకోవడానికి ప్రయత్నిస్తారన్నారు విద్యార్థికి తెలియని విషయాలు ప్రస్తావించి అతణ్ణి బాధించడం పరీక్షకుల లక్ష్యం కాదట అందుమూలంగానే సాధారణంగా డిగ్రీ ఇవ్వదల్చుకుంటే మౌఖిక పరీక్షకు ముందే విద్యార్థికి ఫలితం చెబుతారు అలా చేయడంవల్ల విద్యార్థికి మానసిక ఆందోళన లేకుండా నిశ్చలమైన మనస్సుతో పరీక్షకుల ప్రశ్నలకు సమాధానం చెప్పగలుగుతాడు చదివినవారంతా నాథీసిస్ బాగా ఉందన్నారని, డిగ్రీ ఇవ్వవలసినదిగా యూనివర్శిటీకి సిఫారసు చేయడానికి పరీక్షకులు నిర్ణయించినట్టు శుభవార్త ప్రొఫెసర్ ముందే నాచెవిని వేసారు

మౌఖిక పరీక్షలో నన్ను ఎక్జామినర్స్ ముప్పతిప్పలు పెట్టారనుకోండి వారి సందేహాలు, వారికి తెలిసిన విషయాల గురించి నేను వ్రాసిన వివరాలు ఇంకా అనేక నిశితమైన, సున్నితమైన చారిత్రక విషయాలు చర్చించారు అప్పటికే నాథీసిస్ బాగుందనే నిర్ణయానికి వచ్చారు కాబట్టి ఆముగ్గురు ప్రొఫెసర్స్ నాథీసిస్ అచ్చు వేయించేటట్టయితే చేయవలసిన మార్పులు, చేర్పుల గురించి అమూల్యమైన సలహాలు ఇచ్చారు ప్రారంభంలో అంతా కాఫీలు తీసుకున్నాం నన్ను వారు పరీక్షించారనేకంటే మేము నలుగురం కూర్చుని చర్చించామనడం సమంజసంగా ఉంటుంది నాచదువుకి సంబంధించినంతవరకు చివరి అవశిష్టంకూడా తీరిపోయింది లండను యూనివర్శిటీవారు తమ నిర్ణయం తరువాత తెలియజేస్తారన్నారు నేను ఇక లండను వదలవచ్చు కాని బారత ప్రభుత్వంనుంచి నా తిరుగు ప్రయాణం గురించి ఏవిధమైన వార్తలేదు భారత హైకమీషనర్ శ్రీ కృష్ణమీనన్ స్వయంగా విద్యామంత్రి మౌలానా అబ్దుల్ కలామ్ అజాద్‌కి జాబు వ్రాశారు

అయినా ప్రభుత్వ నిర్ణయంలో జాప్యం చదువు సమస్య తీరిపోయింది కాబట్టి లండను ఎంత తొందరగా వదులుదామా అని ఆదుర్దాగా ఉంది

లండనులో ఖర్చులేని కాలక్షేపానికి క్వేకర్ సెంటర్‌కి వెళుతూనే ఉన్నాను నాచదువు విజయవంతంగా పూర్తి అయిన సందర్భంలో నాఐరిష్ మిత్రురాలు, మంచి క్వేకర్ ఛార్లెట్ క్వేకర్ సెంటర్‌లో మిత్రులందరికీ టీపార్టీ ఇచ్చింది పార్టీ చిన్నదే అయినా అది అనిర్వచనీయమైన ఆనందానుభూతి మిత్రులందరి అభినందనలతో భారతదేశం తిరిగి వెళ్ళడానికి పడే అవస్థలు తాత్కాలికంగా మర్చిపోయాను సామాన్యంగా ఆ సెంటర్‌కి వచ్చే యూరోపియన్ యువతీ యువకులకు అందునా ముఖ్యంగా జర్మన్‌లకు భారతదేశం అంటే ఉన్న అభిప్రాయాలు విని ఆశ్చర్య పోయేవాణ్ణి వారికందరికీ భారతీయులంతా శాఖాహారులని, హెచ్చుమంది ఆధ్యాత్మిక చింతనాపరులని, ఇంకా ఏవేవో విచిత్రమైన సత్యదూరమైన అభిప్రాయాలు ఉండేవి వారిమాటలు విన్న తరువాత భారతీయుల గురించి వారికి ఉన్న అభిప్రాయాలు నిజంకాదని చెప్పడానికి బాధగా ఉండేది భారతదేశంలో శాఖాహారులకంటే మాంసాహారులే అధిక సంఖ్యలో ఉంటారని చెబితే వారు నమ్మలేకపోయారు భారతీయులంతా ఋషులు, మునులు, స్వాములు కాదని చెబితే వారు నిరుత్సాహపడిపోయేవారు మనదేశం విషయంలో వారికున్న అపోహాలు వాటిలోని అతిశయోక్తులను తొలగించడానికి ప్రయత్నిస్తే బాధగా ఉండేది వారు ఎక్కువ సంఖ్యలో భారతీయుల్ని కలుసుకుంటే అసలు రంగు బైటపడుతుందని చెప్పేవాణ్ణి

ఆపార్టీలో ఒక ఇంగ్లీషు నర్సుతో పరిచయం అయింది ఆమె లండనులోని ఒక ప్రభుత్వ హాస్పిటల్‌లో ఉద్యోగం చేస్తోంది ఆమెకు కూడా భారతదేశం, భారతీయుల గురించి విచిత్రమైన అభిప్రాయాలు ఉండేవి నన్ను ఒక సాయంకాలం శాఖాహార భోజనానికి ఆహ్వానించింది అంతవరకు శాఖాహారం లండనులో ఇండియన్ రెస్టారెంటులలో తప్ప మరెక్కడా దొరకదనుకునేవాణ్ణి కాని ఆమె నన్ను బ్రిటిషు శాఖాహార రెస్టారెంటుకి తీసుకు వెళ్ళింది మూడేళ్ళకు పైగా ఆ మహా నగరంలో తిరిగినా అటువంటి రెస్టారెంటు రోజూ నేనుతిరిగే ప్రాంతాలలోనే ఉన్నదనే విషయం నాకు తెలియదు రెస్టారెంటు కిటకిటలాడిపోతోంది భోజనం చేసేవారంతా ఇంగ్లీషువారే భారతీయులు దాని చుట్టు ప్రక్కలకు కూడా వెళ్ళరు దానికి కారణం భోజనం మొదలు పెట్టగానే తెలిసిపోయింది అక్కడ పదార్థాలన్నీ ఉడక పెట్టి పెడతారు తాలింపులు పెట్టడం, మషాలాలతో కూరగా వండడం అనే పద్ధతిలేదు చిత్రంఏమిటంటే అప్పటికే ఇంగ్లండులో శాఖాహారుల సంఘాలున్నాయని, వారంతా చాలా

పట్టుదలగా ఆ అలవాటుని అమలుపరుస్తారని వారి భోజనావసరాలు తీర్చడానికి రెస్టోరెంట్లు ఉన్నాయని భారతీయులకు తెలియదు తెలిసినా ఆ భోజనం మనవాళ్ళు చేయలేరని నాకు అర్థమైపోయింది

ఆ నర్సమ్మ పుణ్యమా అంటూ నాకు బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది నేను ఇంగ్లండులో ఉన్నంతకాలం జలుబు రొంపతో బాదపడేవాడిని వాతావరణం ఎప్పుడూ చల్లగాను తేమగాను ఉండడంవల్ల నేను ఎప్పుడూ జలుబుతో బాదపడేవాణ్ణి నామిత్రురాలు డాక్టర్లని చూడమని సలహా చెప్పింది నిజానికి రొంపకి డాక్టర్ని చూడడం నాకు నచ్చలేదు పనీ పాటు లేకుండా ఖాళీగా ఉన్నాను కాబట్టి, మిత్రులంతా బలవంతం చేస్తే రాయల్ చెవి, ముక్కు, గొంతు హాస్పిటల్‌కి వెళ్ళి డాక్టరుకి చూపించాను ఆయన పరీక్ష చేసి ముక్కులో చిన్న ఎముక ముక్క తీసివేయాలన్నాడు అంటే ఆపరేషను, హాస్పిటల్‌లో పడుకోవడం కార్యక్రమం అన్నమాట నాజీవితంలో అంతవరకు విశాఖపట్నం కింగ్ జార్జి హాస్పిటల్‌లో చిన్న ఆపరేషను చేయించుకోవడం తప్ప హాస్పిటల్‌లో పడుకోలేదు నాముక్కు ఆపరేషన్ అయినతరువాత వారం పదిరోజులు హాస్పిటల్‌లో ఉండాలన్నారు

అప్పట్లో బ్రిటిష్ లేబర్ ప్రభుత్వంలో ఆరోగ్యమంత్రిగా ఉన్న బెవాన్ పుణ్యమా అంటూ ఇంగ్లండులోని వారికందరికీ వైద్యం ఉచితం లండనులో చదువుకోవడానికి వెళ్ళిన నాకు కూడా ఉచిత వైద్య సదుపాయాలు ఉండేవి నేను ఉండే ప్రదేశంలో ఉన్న డాక్టరు వద్ద నాపేరు రిజిష్టరు చేయించుకున్నాను ఇక టానిక్కులు విటమిన్ మాత్రలతో పాటు ఏమందులు కావలసివచ్చినా ఆ డాక్టరువద్ద వ్రాయించుకొని ఆచీటీతో పట్టణంలో ఏమందుల షాపుకి వెళ్ళినా ఉచితంగా మందులు ఇచ్చేవారు ఆ షాపులవారు ప్రభుత్వంవద్ద తరువాత సొమ్ము వసూలు చేసుకుంటారు అదేవిధంగా హాస్పిటల్‌లో చికిత్సలు ఆపరేషన్లు అన్నీ ఉచితం కళ్ళద్దాలు కూడా ఉచితంగా ఇచ్చేవారు కాని కట్టుడు పళ్ళకు మాత్రం ఎవరికి వారే ఖర్చు భరించాలి అప్పట్లో ఇంగ్లండులో ఉన్న ఉచిత వైద్య సదుపాయాలు చూస్తే నాకు మతిపోయేది ప్రజా సంక్షేమం ముఖ్యంగా వైద్య సహాయం తమ పౌరులకు అందించడంలో బ్రిటిష ప్రభుత్వం బ్రహ్మాండమైన ప్రగతి సాధించింది రామరాజ్యమంటే అదేనేమో అనిపించేది డాక్టరు పరీక్షలన్నీ పూర్తిచేసి ఆపరేషన్‌కి సిద్ధమై హాస్పిటల్ లో చేరమన్నాడు

నిజానికి నాకు లండనులో ఏమీ పనిలేదు భారతదేశానికి తిరుగు ప్రయాణంకోసం ఎదురు చూస్తున్నాను ఆపరిస్థితిలో ఆపరేషన్ చేయించుకోవడమే మంచిదనిపించింది ఇండియాహౌస్ లైబ్రేరియన్ మిస్

ధారన్‌తో సంప్రదించాను. ఆమె చక్కటి సలహా చెప్పింది. నాసామాన్లు సర్ది ఆ సూట్‌కేస్ ఎవరైనా మిత్రుని గదిలో పెట్టి నేను అంతవరకు 46, మ్యూజియం వీధిలో అద్దెకుంటున్న గదిని శాశ్వతంగా వదిలివేయమంది ఆవిడ. ఇంటి అద్దె సమస్య తీరుతుంది. కాని తిరుగు ప్రయాణం రోజువరకు ఎక్కడ ఉండడం అనే ప్రశ్న వచ్చింది. ఒక 10 రోజులు హాస్పిటల్‌లో ఉన్నతరువాత మరొక నెలరోజుల వరకు డార్బీషైర్‌లోని చిన్న గ్రామంలో తన మిత్రుల ఇంట్లో ఉండడానికి ఏర్పాటు చేస్తానంది. అంతే, ఆమెచెప్పిన ధైర్యంతో నాసూటేకేస్ ఒక మిత్రుని గదిలో పెట్టాను. సామాన్లు అని పెద్దగా చెప్పుకోవడానికి ఏమీలేవు. ఒక చిన్న సూట్‌కేస్‌లో బట్టలు సర్దుకుని మ్యూజియం వీధిలోని ఇంటి యజమాని శ్రీ ఘోష్‌కి చెప్పి ఆగది వదలి పెట్టాను, అంతవరకు ఎక్కడ తిరిగినా ఏదో టైముకి గదికి చేరేవాణ్ణి. అదికూడా వదలివేసాను. అప్పుడు నిజంగా లండనులో రోడ్డున పడ్డట్టు అనిపించింది. గది అద్దె కొద్దిగా ఇవ్వవలసి ఉంటే చేతిలో డబ్బు లేనందున ఘోష్ పరవాలేదులే అన్నాడు. తిన్నగా రాయల్ చెవి, ముక్కు, గొంతు హాస్పిటల్‌కి వెళ్ళాను.

హాస్పిటల్ భవనం చాలా విశాలమైన ప్రదేశంలో నిర్మించబడింది. ఖరీదైన హోటల్‌లా ఉంది తప్ప నేను భారత దేశంలో ఎరుగున్న హాస్పిటల్స్‌లా లేదు. అప్పుడు ఆ హాస్పిటల్‌లో ఉన్నవారిలో భారతీయుణ్ణి నేను ఒక్కణ్ణే. అయినా మూడేళ్ళు పైగా లండనులో ఉండడం మూలంగా జాతి, రంగు వివక్షత మర్చిపోయాననే చెప్పాలి . బ్రిటిష పాలకులు భారతదేశాన్ని ఎంతకాలం పరిపాలించినా సామాన్య బ్రిటిష్ పౌరునికి నల్లమొఖాలు క్రొత్తగానే ఉంటాయి. మనకు కూడావారితో కలసి అరమరికలు లేకుండా తిరగడానికి సంకోచం, బెంకు ఉంటుంది. కాని నాకు ఆబాధ ఏమీలేదు. ఎదుటి వారిలో జాతి వివక్షతా లక్షణాలు ఉండడానికి అవకాశం ఉంటుందని కూడా పట్టించుకోకుండా ప్రవర్తించేవాణ్ణి. హాస్పిటల్ సిబ్బంది, అక్కడ ఉన్నరోగులు చాలా ఆదరపూర్వకంగా పలుకరించారు. నేను యూనివర్శిటీలో చదువుకోవడానికి వచ్చానని తెలియడం, ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడగలగడం వారికందరికీ నాయందు విముఖత లేకుండా చేసాయనుకున్నాను.

ముక్కు ఆపరేషను ఏమంత హాయి అయిన అనుభవంకాదు. నిజానికి ఏఆపరేషను అయినా అంతే అనుకోండి. కాని ఆపరేషను అయిన మరునటి ఉదయానికి కాని స్పృహ రాలేదు. అద్దంలో మొఖం చూచుకుంటే ఘోరంగా ఉంది. అయితే అక్కడ ఉన్నవారిలో చాలా మంది అలాగే ఉన్నందున నలుగురితోపాటు నారాయణ అనుకున్నాను. ఒక్కరోజు బాధ అనిపించింది.

ముక్కు లోపలి ఎముక ముక్క తీయడంవల్ల బాధ ముక్కుకి కట్టిన కట్టు చూచుకుంటే మరింత బాధ ఇక ఆ మరుసటి రోజునుంచి మామూలే హాస్పిటల్ వార్డులలో తిరిగి రోగులను పలకరిస్తూ కబుర్లాడుతూ కాలక్షేపం ఉదయం టీ తో రోజు ప్రారంభమయ్యేది ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజల కంటే ఇంగ్లీషువారు ఎక్కువ టీ త్రాగుతారు వారి దేశంలో టీ ఉత్పత్తికాదు భారత దేశం నుంచి, సిలోన్ (శ్రీలంక) నుంచి దిగుమతి చేసుకుంటారు ఉదయం లేవగానే ఒక కప్పు టీ త్రాగడం నాకు ఇంగ్లండు దేశంలో అయిన అలవాటు ఇక బ్రేక్‌ఫాస్ట్, లంచ్ డిన్నరు మూడుపూట్ల హాయిగా డైనింగ్ హాలులో పెట్టేవారు మంచినీళ్ళకు బదులు హాస్పిటల్ భోజనంతో బీరు ఇవ్వడం నాకు ఎంతో ఆశ్చర్యంగా ఉండేది ఆపరేషను మందులు, బీరుతో సహా భోజనాలు అన్నీ ప్రభుత్వంవారి ఖర్చే అదంతా చూస్తే ఇంటికంటే హాస్పిటల్ పదిలమనిపించింది

హాస్పిటల్‌లో చేరిన నాల్గవ రోజున నాకు లండను యూనివర్శిటీ రిజిస్ట్రారు వద్దనుంచి ఒక జాబు వచ్చింది దానిలో నేను పరీక్షలో ఉత్తీర్ణుణ్ణి అయినట్టు నా థీసిస్ పిహెచ్‌డి డిగ్రీ కోసం యూనివర్శిటీ అనుమతి పొందినందున నాకు పిహెచ్‌డి డిగ్రీ ఇవ్వడానికి అంగీకరించినట్టు తెలియజేశారు చాలా సంతోషించాను నాలండను చదువు విజయవంతంగా పూర్తి అయింది అయితే ఆశుభవార్త లండను హాస్పిటల్‌లో వినడంవల్ల నిరుత్సాహపడ్డాను కాని ఆ వార్త యొక్కప్రభావం నా ముఖంమీద కనబడుతూ ఉంటే హాస్పిటల్‌లో ఉన్న ఒక మధ్య వయస్కుడు వచ్చి ఏమిటి శుభవార్త అని పలుకరించాడు చెప్పాను, అతడికి నిజంగా పిహెచ్‌డి డిగ్రీ అంటే ఏమిటో దాని విలువ ఏమిటో తెలియకపోయినా అతగాడు కూడా సంతోషించాడు సామాన్యంగా అటువంటి విజయాలు సాధించినప్పుడు పాశ్చాత్య దేశాలలో షాంపేన్‌తో పండుగ చేసుకుంటారు నేను పండుగ చేసుకోలేకపోయినా ఆవార్త విన్నందుకే సంతోషించాను కాని నాహాస్పిటల్ మిత్రుడు మాత్రం ఊరుకోలేదు అందరికీ చెప్పాడు వారంతా వచ్చి నన్ను అభినందించారు విచిత్రమైన పరిస్థితి

ఆ విచిత్రం అక్కడితో ఆగలేదు నా మిత్రుడు అంత మంచివార్త విన్న సందర్భంలో పండుగ చేసుకోవాలన్నాడు హాస్పిటల్‌లో బీరు తప్ప షాంపేస్ ఎక్కడ నుంచి వస్తుందన్నాను అంతే కాకుండా అక్కడ ఉన్న రోగులు బీరు తప్ప మరే ఇతర మద్యం సేవించకూడదని నిబంధన అయినా అతగాడు నన్ను బాత్‌రూమ్‌కి రమ్మన్నాడు అక్కడ నాకళ్ళను నేను నమ్మలేకపోయాను బాత్‌టబ్‌లో ఒక కేసు షాంపేన్ చిన్న చిన్న సీసాలు ఉన్నాయి అంటే

అతగాడు ప్రతిరోజు హాస్పిటల్‌లో షాంపేన్ త్రాగుతున్నాడన్నమాట అంతవరకు అతడి వృత్తి ఏమిటని అడగలేదు కాని అప్పుడే చెప్పాడు తన కుటుంబానికి బ్రూయరీ (మద్యం తయారు చేసేచోటు) పరిశ్రమ ఉందని నా విజయానికి అభినందిస్తూ షాంపేన్ సీసా విప్పాడు సామాన్యంగా షాంపేన్ ఐస్‌బకెట్‌లో పెట్టి చల్లగా చేస్తారు చల్లబడిన తరువాత దాని మూత తీయడం నురగలతో పొంగే ద్రవాన్ని ప్రత్యేక గ్లాసులలో పోసుకుని త్రాగడం అంతా పెద్ద తతంగం కాని ఆహాస్పిటల్‌లో అటువంటి తతంగానికి అవకాశం లేనందున ఆ బాత్ రూమ్‌లోనే చల్లబడని షాంపేన్‌తో నా లండను చదువు విజయోత్సవం చేసుకున్నాం

ఆమరుచటి రోజు భారత హైకమీషన్‌లో లైబ్రేరియన్ నాశ్రేయోభిలాషి మిస్ దారన్ హాస్పిటల్‌లో ఉన్న నన్ను చూడ్డానికి వచ్చింది నా డిగ్రీ విషయంలో వచ్చిన శుభవార్త విని చాలా సంతోషించింది నా విజయంలో ఆమెకు కూడా భాగం ఉంది నాథీసిస్ అంతా చదివి దానిని యూనివర్శిటీ వారి అభిమతానికి అనువుగా రూపుదిద్దిన ఘనత ఆమెదే! ఇక నాలుగైదు రోజుల్లో నన్ను హాస్పిటల్ నుంచి పంపివేస్తారు ఆ తరువాత ఎక్కడికి వెళ్ళాలనేది సమస్య ఆ విషయంలో ఏవో ఏర్పాట్లుచేసి ఆమాట నాచెవిని వేయడానికి వచ్చిందామె హాస్పిటల్ వదలి తిన్నగా రైలు స్టేషన్‌కి వెళ్ళి రైలులో మిస్టరుటన్ అనే చిన్న గ్రామానికి వెళ్ళమంది అక్కడ స్టేషన్‌లో శ్రీమతి వేరా విల్‌కాక్స్ నాకోసం ఎదురు చూస్తూ ఉంటుంది ఆమెను గుర్తుపట్టడం ఎలాగో చెప్పింది నేను ఒక నెలరోజులు మిష్టర్‌టన్ లో విల్‌కాక్స్ ఇంట్లో వారి అతిథిగా గడపడానికి మిస్ థారన్ ఏర్పాటు చేసింది

శ్రీమతి వేరా రెండవ ప్రపంచ యుద్ధంలో భారత దేశంలో నర్స్‌గా పనిచేసిందట ఆమె భర్త జార్జి గ్రామర్ స్కూలులో సైన్సు మాష్టరట నాఆపరేషను తరువాత తిరిగి ఆరోగ్యం కోలుకోవడానికి ఆగ్రామం, అందునా శ్రీమతి వేరా శ్రద్ధ చాలా అనువుగా ఉంటాయని ఆ ఏర్పాటు చేసానంది మిస్ థారన్ మిష్టర్‌టన్ గురించి జార్జి వేరావిల్‌కాక్స్‌ల గురించి ఆమె బోలెడు చెప్పింది ఆమెకు హృదయపూర్వకంగా నాకృతజ్ఞతలు తెలియజేశాను ఆమె చాలా చాదస్తంగా నాకు ప్రయాణజాగ్రత్తలు స్టేషన్‌లో వేరాను గుర్తుపట్టడం గురించి చెప్పి వెళ్ళిపోయింది హాస్పిటల్‌లో మిత్రులంతా సోమరసెట్ కౌంటీని గురించి దానిలోనిమిష్టర్‌టన్ గురించి వాటి అందాలు తమకు తెలిసినంతవరకు వివరించారు మిస్‌థారన్ వచ్చి వెళ్ళిన మరుసటిరోజు ఒక జాబు వ్రాసింది అదిచూచి ఆశ్చర్యపోయాను దానిలో నాలుగు పౌండునోట్లు ఉన్నాయి తానుచేసిన ఏర్పాటు ప్రకారం రైలులో మిష్టర్‌టన్ వెళ్ళడానికి

నావద్ద రైలుఖర్చులకు డబ్బులేదని ఆమెకు ఇంటికి వెళ్ళగానే గుర్తుకువచ్చిందట వెంటనే నాలుగు పౌన్లు ఉత్తరంలో పెట్టి పంపుతూ మరికొన్ని జాగ్రత్తలు చెప్పింది లండను నుంచి మిష్టర్‌టన్‌కి రానుపోను రైలు టిక్కెట్టు ఒక్కసారే కొని తిరుగు ప్రయాణం టిక్కెట్టుముక్క జాగ్రత్తపెట్టుకోమంది టిక్కెట్టుకి రెండుపౌన్లు ఖర్చు అవుతాయని మిగిలిన రెండు పౌన్లు ఖర్చులకోసం ఉంచుకోమని వ్రాసింది లండను లో అటువంటి ప్రేమమూర్తిని క లుసుకోగ లగ డ ం నా అద ృష్ట ం అనిపించింది

హాస్పిటల్ నుంచి బైటపడి తిన్నగా రైల్వే స్టేషన్‌కి బయలుదేరాను ఆనాడు లండనులో బ్రహ్మాండమైన మంచుకురిసింది నేను లండనులో మూడేళ్ళకు పైగా ఉంటున్నా అక్కడ మంచు కురవడం చాలా అరుదు ఇంగ్లండుదేశంలో ఉత్తరాన, మధ్యభాగంలోను ఎక్కువగామంచు కురుస్తుంది కానిదక్షిణ భాగం సముద్రానికి దగ్గరలో ఉండటంమూలాన మంచుకురవదు మంచుకురవటం చూడాలని నాకు ఎంతో సరదా ఢిల్లీలో ఉన్నప్పుడు సిమ్లాలోను ముస్సోరిలోను మంచు కురుస్తోందని వార్త రాగానే అది చూడ్డానికి ప్రయాణమయ్యేవాణ్ణి నేను వెళ్లేసరికి దూరపుకొండలమీద దట్టంగా మంచు ఉండడం కనిపించేది కాని మంచు కురిసే సమయంలో దానిలో నడిచే ఆనందం ప్రప్రదమంగా లండనులో పొందాను నేను అక్కడ ఉన్న మూడేళ్ళు అందరినీ అడిగేవాణ్ణి లండనులో మంచు కురవదేమని చివరకు నాసరదా తీర్చటానికా అన్నట్టు ఆనాడు లండనులో మంచు కురిసింది రోడ్లన్నీ మంచుతో నిండిపోయి ఉన్నాయి మంచు కురుస్తున్నప్పుడు దానిలో నడవడం ఒక అనిర్వచనీయమైన అనుభూతి

ఇంగ్లండులో మంచుకురిస్తే ఇళ్ళ యజమానులు ఎవరి ఇంటిముందు వారు మంచును తొలగించుకోవాలి రాజవీదుల్లోని మంచును ప్రభుత్వయంత్రాలు తొలగిస్తాయి రోడ్లమీద పడ్డ మంచు కరగడం మొదలుపెడితే అంతా బురద అయిపోయి దానిలో కాలు పెట్టబుద్ధి వేయదు మంచు కురుస్తున్నప్పుడు మాత్రం ఎముకలు కొరికేచలి ఏది ఏమైనా మంచులో నడవాలనే సరదా తీరింది ఆ మంచులో నడుస్తూ రైలు స్టేషన్‌కి చేరాను నిజానికి ఆనాడు లండనులో మరెక్కడికి వెళ్ళడానికి అవకాశం లేదు మిస్ దారస్ పుణ్యమా అంటూ నావద్ద ఉన్న నాలుగు పౌన్లలోను రెండు పౌన్లుపెట్టి మిష్టర్‌టన్‌కి రానుపోను టిక్కెట్టు కొన్నాను రైలులో వెళుతుంటే ఆనాడు కురిసిన మంచు రైలుకట్ట కిరువైపులా కనుచూపు మేరవరకు దట్టంగా కప్పివేసి కన్నుల పండువలా ఉంది మిష్టర్‌టన్ చేరేసరికి చీకటిపడింది ఇంగ్లండులో ఎప్పుడూ చీకటిగానే ఉంటుంది కాబట్టి చీకటి పడిందని వేరే

చెప్పనక్కరలేదు రైలు దిగి వేరా విల్‌కాక్స్ కోసం చూసాను ఆమె ప్రయాణికులు బైటకు వెళ్లే గేటువద్ద నిలబడి ఉంది నన్ను చూడగానే హలో అంది ఒకరిని ఒకరం గుర్తుపట్టడం చాలా సులభమయింది ఆస్టేషన్‌లో విదేశీయులు సాధారణంగా దిగరు కాబట్టి నేను ఆరోజున వస్తున్నట్టు ఆమెకు తెలుసు కాబట్టి గుర్తుపట్టడం చాలా సులువు అయింది స్టేషన్నుండి వాళ్ళ ఇంటికి నడచి వెళ్ళాం ఇంటివద్ద జార్జి సంతోషంగా ఆహ్వానించాడు

హాలులో కూర్చుని కబుర్లాడుకుంటున్నాం అంతలో ఒకపిల్లి నా ఒడిలోకి దూకింది మరొకటి నాకాలు నాకుతోంది అదిచూచి వేరా తన పిల్లుల సంసారం గురించి ఎంతో ఉత్సాహంగా చెప్పుకుంటూపోతోంది ఆ ఇంట్లో ఉన్నది భార్యా భర్తలు, ఒకపసివాడు బోలెడుపిల్లులు మాత్రమే వారికి సంతానంలేదు కొన్ని నెలల పిల్లవాడు పీటర్‌ని వారు పెంచుకుంటున్నారు ఇక పిల్లుల్ని పెంచడం వేరాకు హాబీ అట వారి ఇంట్లో పుట్టిన పిల్లిపిల్లల్ని ఆ ఊళ్లో ఉన్న కుటుంబాలకు ఇస్తుందట అలా ఎన్ని పిల్లల్ని ఎవరెవరికి ఇచ్చిందో వివరాలు చెప్పుకు పోతోంది అప్పుడు జార్జి సౌమ్యంగా భారతీయులు అంత ఎక్కువగా పిల్లుల్ని పెంచరు అసలు మూర్తికి పిల్లులంటే ఇష్టం అవునో కాదో తెలుసుకో ముందు అని ఆమెను హెచ్చరించాడు నాకు నవ్వువచ్చింది

వేరా గలగల ప్రవహించే గంగ అయితే జార్జి నిండుగా హుందాగా ప్రవహించే యమున అనిపించారు నేను వారికి మిస్‌దారన్ ద్వారా పరిచయం చేయబడ్డ అజ్ఞాత వ్యక్తిని కాని వారి ఆప్యాయత, ఆదరణ స్నేహభావం, అనుపమానం వారి వ్యక్తిత్వాలలోని భేదం నేను ఆ ఇంటికి చేరిన కొద్దిసేపట్లో తెలిసిపోయింది జార్జినిండుకుండ సైన్సుమాష్టరు ప్రాపంచిక విషయాలలో మంచి అనుభవం ఉన్నవాడు ఇక వేరా ఉత్సాహానికి అవధులులేవు కాలక్షేపానికి మెదడిస్టుచర్చి వ్యవహారాలలో పాల్గొంటుంది ఆచిన్న గ్రామంలో జరిగే మంచిపనులన్నిటిలోను ఆమె ఉంటుంది వారిద్దరు సహృదయులు (ఇటీవలనే జార్జి మరణవార్త మిస్ దారన్ ద్వారా విని చాలా విచారించాను పీటర్‌ని పెంచుకున్న తరువాత వారికి సంతానం కలగడం ఆ కుటుంబం మంచిచెడ్డలు ఈరోజు వరకు తెలుస్తూనే ఉన్నాయి )

మిష్టర్‌టన్ చాలా చిన్న గ్రామం అది ఇంగ్లండులో సోమర్‌సెట్ కౌంటీలో ఉంది ఆ దేశంలో జనాభానుబట్టి చిన్నా పెద్ద గ్రామాలని విభజన చేయడం తప్ప, ప్రజా సౌకర్యాలు అందరికీ కల్పించబడ్డాయి చక్కటి రోడ్లు విద్యుత్, రక్షిత మంచినీరు ప్రతి గ్రామానికి ఉన్నాయి వేరావాళ్ళ ఇంట్లో ఉన్న దిగుడుబావి చూచి ఆశ్చర్యపోయాను అది పాడుపడి ఉంది ఊరుదాటి

కొద్దిదూరం వెళితే పొలాలు అప్పటికింకా వ్యవసాయం పూర్తిగా యంత్రాలతో చేయడం ప్రారంభం కాలేదు మనం ఎద్దుల్ని ఉపయోగించినట్టు వారు గుర్రాలను ఉపయోగించడం పరిపాటి వ్యవసాయం అంటే చాలావరకు కూరగాయలు పెంచడం, పళ్ళ తోటలు తప్ప మరే ఇతర వ్యవసాయ కార్య కలాపాలు చూచే అవకాశం దొరకలేదు మిష్టర్‌టన్ గ్రామంలో ఇళ్ళు దూరం దూరంగా ఉన్నాయి అక్కడక్కడ సైకిళ్ళు తప్ప మరే ఇతర వాహనాలు కనుపించలేదు కార్లుకొద్దిగా ఉన్నట్టు అనిపించింది ఆ గ్రామానికి వార్తా పత్రిక రాదని చెప్పారు పేపరు కావాలంటే దగ్గరలో ఉన్న పట్టణానికి వెళ్ళాలి జార్జిబడికి వెళితే వేరా నేను, పీటర్‌ని తోపుడు బండిలో పెట్టి గ్రామం నలుమూలలా తిరిగేవాళ్ళం వారి ఇంట్లో ఉన్న మంచిగ్రంధాలు చదువుతూ కాలక్షేపం చేసేవాణ్ణి ఆ గ్రామంలో సినిమాహాలు ఉన్నట్టు ఎవరూ అనగా వినలేదు ఆదునిక నాగరికతకు దూరంగా ఉన్నామనిపించింది కాని వీధిలోకి వెళితే కనిపించినవారంతా ఆనందంగా పలుకరించేవారు అక్కడ ప్రజలలో పెద్దపట్టణాలలో వలె పరిచయం చేస్తేకాని పలకరించకపోవడం అనే బాధ లేదు ఆగ్రామస్థులకందరికీ విల్ కాక్స్‌ల ఇంటికి ఎవరో భారతీయుడు అతిథిగా వచ్చాడని తెలుసు, అంతే నేను ఎక్కడ కనిపించినా ఎంతో ఆప్యాయంగా ఆప్త మిత్రుల్లాపలకరించేవారు లండను మహానగరంలో ఎవరి దారిని వారు వెళ్ళడం చూడ్డానికి అలవాటుపడ్డ నాకు ఆ గ్రామంలో అందరూ పలకరించడం హాయి అనిపించింది

మిష్టర్‌టన్‌లో వేరా జార్జి దంపతుల ఆదరాభిమానాలతో నాకు చక్కటి విశ్రాంతి లభించింది కాని నా తిరుగు ప్రయాణం విషయంలో లండనునుండి వార్త లేకపోవడం మనశ్శాంతిని పాడుచేస్తోంది విదేశాలలో ఆర్థిక ఇబ్బందులలో చిక్కుకున్న విద్యార్థిని భారతదేశానికి పంపివేయడానికి ప్రభుత్వ అనుమతి రావడానికి వారాలు మాసాలు, పట్టడం చూస్తే ప్రభుత్వ యంత్రాంగం ఎంత తీరిగ్గా నెమ్మదిగా కదులుతుందో అర్థమయింది మిస్ దారన్ పుణ్యమా అంటూ ఏర్పాటు చేసిన ఆతిధ్యం, విశ్రాంతి హాయిగానే ఉన్నాయి అయితే వేరా మాత్రం నేను వాళ్ళ ఇంట్లో ఎంతకాలం ఉన్నా తమకు సంతోషమే అని రోజూ చెబుతూనే ఉంది అంతలో టార్కి (సముద్రతీర పట్టణం) నుంచి నా మిత్రురాలు బార్బరా జాబు వ్రాస్తూ నేను ముక్కు ఆపరేషను చేయించుకున్నందుకు పరామర్శిస్తూ, ఆసమయంలో సముద్రపుగాలి నా ఆరోగ్యానికి మంచిది కాబట్టి టార్కీ వచ్చి వారింట్లో కొన్ని రోజులు ఉండమని ఆహ్వానించింది ఆహ్వానం ఆనందాన్నిచ్చినా ఎందుకో అంగీకరించ బుద్ధి కాలేదు బార్బరా లండనులో విద్యార్థినిగా ఉన్నప్పుడు స్నేహితురాలు కాని ఆమె తల్లిదండ్రులు కుటుంబంతో

పరిచయం లేకుండా ఆఅమ్మాయి ఆహ్వానాన్ని పురస్కరించుకొని వాళ్ళ ఇంటికి వెళ్ళబుద్ధి కాలేదు అదేమాట బార్బరాకు వ్రాసాను

ఇక మిస్టర్‌టన్‌లో హాయిగా కాలక్షేపం అవుతోంది చక్కటి గ్రంథాలు చదువుకుంటూ ఎంతకాలమైనా గడపవచ్చని గ్రహించాను ఆపరేషను తరువాత నా ఆరోగ్యం చక్కగా ఉంది జార్జి స్కూలుకి సెలవు రోజుల్లో దగ్గరలో ఉన్న టాంటన్ వెళ్లి పట్టణ వాతావరణంలో తిరిగివచ్చేవాళ్ళం సోమర్‌సెట్ కౌంటీకి దగ్గరలో డార్బీషైర్ పట్టణం ఉంది అది ప్రకృతి సౌందర్యానికి మచ్చుతునక అప్పుడప్పుడు నేను, జార్జి సైకిళ్ళమీద వెళ్ళి డార్బీషైర్‌లో కొన్ని భాగాలు చూసి వచ్చేవాళ్ళం నేను మిస్టర్‌టన్‌లో ఉన్నన్ని రోజులు వేరా చేసిన హడావిడి అంతా ఇంతా కాదు నేను వారి ఇంటికి అతిథిగా వెళ్ళడం ఆమెకు కోతికి కొబ్బరికాయ దొరికినట్టుయింది తమ ఇంటికి ఒక భారతీయ అతిథి వచ్చాడు కాబట్టి వచ్చి కలుసుకోమని తమ మిత్రులనందరినీ ఆహ్వానించేది ఇంతకుముందే చెప్పినట్టు ఇంగ్లండులో పిహెచ్‌డి డిగ్రీ పుచ్చుకోవడం అంటే ఆ దేశపు ప్రజల దృష్టిలో బ్రహ్మాండమైన విషయం అందునా ఒక భారతీయుడు లండను యూనివర్సిటీలో పిహెచ్‌డి సాధించాడంటే మరీ గొప్ప ఆమె మిత్రులు వచ్చి నన్ను పలకరించి, కబుర్లాడి వెళ్ళేవారు వారిలో కొందరు వృద్ధులు ఎప్పుడో భారత దేశంతో వారికున్న సంబంధాలు పరిచయాలు, అనుభవాలు గుర్తు చేసుకొనేవారు భారతదేశం స్వాతంత్ర్యానికి అర్హత పొందకుండానే స్వతంత్రమైనదనే వారు ఆ చిన్న గ్రామంలోకూడా ఉండడం చూచి ఆశ్చర్యపోయాను పెద్ద చదువు చదువుకున్న భారతీయుడు తమ గ్రామంలో కొన్ని వారాలు గడపడం తమ అదృష్టంగా భావించిన వెఱ్ఱివాళ్ళు కూడా లేకపోలేదు

వేరా మెథడిస్టు చర్చికి వెళ్ళేది ఆమెకు ఆ కౌంటీలో క్రైస్తవ మతాచార్యులు, ప్రచారకులు చాలామంది మిత్రులు ఉన్నారు వారినందరినీ తన ఇంటికి ఆహ్వానించేది నన్ను కలుసుకోవడానికి వారిని హైటీకి పిలిచేది హైటీ అంటే ఏమిటని ఆశ్చర్యపోకండి అమెరికన్లు బ్రేక్‌ఫాస్ట్‌ని, లంచిని కలిపి బ్రంచ్ అన్నట్టే ఇంగ్లీషువారు టీ పార్టీని డిన్నర్‌ని కలిపి హైటీ అనేవారు ఆ పార్టీ అయిన తరువాత ఇక రాత్రి భోజనం అవసరం ఉండదు చాలామంది క్రైస్తవ మతాచార్యులు చాలా ఆసక్తికరమైన విషయాలను చర్చించేవారు మతపరమైన సిద్ధాంతాలు చర్చించడానికి వారు కుతూహలంగా ఉండేవారు వారు చెప్పేదంతా వినడంతప్ప నేను చాలా అరుదుగా చర్చలో పాల్గొనేవాణ్ణి ఎప్పుడో నరసాపురం మిషన్ మిడిల్ స్కూలులో థర్డ్‌ఫారం వరకు చదువుకున్న రోజుల్లో చదివిన బైబిలు పరిజ్ఞానం తప్ప క్రైస్తవమతం గురించి

ఎక్కువ తెలియదు. అయినా మిషన్ స్కూలులో చదువుకునే రోజుల్లో అనుభవాలు చెప్పి వారిని సంతోషింపజేసేవాణ్ణి. నేస్మిత్ దొర మా ప్రిన్సిపాల్. కొప్పర్తి భానుమూర్తిగారు హెడ్‌మాస్టరు. మిడిల్ స్కూలుకి ప్రిన్సిపాలు ఏమిటో అర్థం కాని రోజులు అవి.

ప్రార్థన సమయానికి స్కూలుకి వెళ్ళకపోతే అందరిముందూ చచ్చేటట్టు బెత్తంతో కొట్టేవాడు దొరగారు. ఏడు ఎనిమిది తరగతులకు నేస్మిత్ దొర ఇంగ్లీషు పాఠం ఇంగ్లీషులోనే చెప్పి వెళ్ళిపోయేవాడు. ఇక మా అవస్థ చూడండి. భానుమూర్తి గారి పుణ్యమా అంటూ దొర చెప్పిన ఇంగ్లీషు పాఠం తెలుగులో చెప్పేవారు. దొరగారు అడిగిన ప్రశ్నలకు ఇంగ్లీషులోనే సమాధానం చెప్పాలి. లేకపోతే బడితపూజ. దొరగారికి తెలుగువచ్చు. ఆయన ప్రతిరోజు గడీబజారులో దేవుని బిడ్డలకు సువార్త ప్రచారం చేసేవాడు. కాని ఇంగ్లీషు క్లాసులో ధర్మప్రచారం వాళ్ళకు కూడా ఇంగ్లీషు తప్ప తెలుగురాదని ఆయన భావం. ఇవన్నీ చెప్పుకుని నవ్వుకునేవాళ్ళం. చిన్నతనంలో నరసాపురంలో క్రైస్తవులలో ప్రొటెస్టెంట్‌లు, కేథలిక్కులు, మెథడిస్టులు, బాప్టిస్టులు, సెవెంత్‌డే అడ్వెంటిస్టులు ఇంకా అనేక రకాలవారు ఉండేవారు. వారంతా క్రైస్తవ మతానికి చెందినవారని వారిలో కొందరు హిందువులను క్రైస్తవ మతంలోకి మార్చడానికి ప్రయత్నిస్తారు తప్ప సిద్ధాంతపరంగా వారిలో ఉండే విభేదాలు కాని, హిందూమతంతో వారికి ఉన్న విభేదాలు గాని చిన్నతనంలో తెలిసేది కాదు.

కాని మిస్టర్‌టన్‌లో విల్‌కాక్స్‌ల ఇంట్లో కూర్చుని మత విషయాలు చర్చిస్తూ ఉంటే నా వాదం విలక్షణంగా ఉండేది. ప్రపంచంలో దేవుణ్ణి నమ్మేవారు, నమ్మనివారు అని రెండు వర్గాలు. దాదాపు ప్రపంచ జనాభాలో సగం మందికి దేవునిమీద నమ్మకం లేదు. మిగిలిన సగం మందికి దేవునిమీద భక్తి విశ్వాసాలున్నా వారు వివిధ మతాలకు చెందినవారు కావడం వల్ల వారిలో అనైక్యత, పరస్పర విభేదాలు పొతుకుపోయాయి. ఒకరి మతానికంటే మరొకడి మతం గొప్పదని పోటీలు పడి మత మార్పిడులు చేయించడానికి తాపత్రయపడుతున్నారు. ఆ మతాచార్యులకు అర్థమయ్యే భాషలో నా అభిప్రాయాలు స్పష్టంగా చెప్పేవాణ్ణి. దేవునియందు నమ్మకం ఉన్నవారంతా ఒకటై దేవుడు లేడనేవారిలో నమ్మకం పుట్టించడానికి ప్రయత్నించడం ఒక మార్గం. అంతే కాకుండా ఇంగ్లండు దేశంలో యావన్మందీ క్రైస్తవులే అయినా వారిలో రానురాను మత విషయంలో నిర్లక్ష్యం, నిరాసక్తత పెరిగిపోతోంది. అది నేను ప్రత్యక్షంగా చూసాను. ఆ విషయం అక్కడివారికి కూడా తెలుసు. అటువంటి వారిని చర్చికి వెళ్ళేటట్టు చేసి మతంలో శ్రద్ధ తీసుకునేటట్టు చేయకుండా కొన్నివేల మైళ్ళదూరం ఉన్న భారతదేశానికి వెళ్ళి

అప్పటికే దేవుణ్ణి నమ్మిన పేద బలహీన వర్గాలకు చెందిన హిందువులను హరిజన, గిరిజనులను క్రైస్తవులుగా మార్చడంలో నాకు అర్థం కనిపించడం లేదనేవాణ్ణి. ప్రజలను ఒక మతంలోనుంచి మరొక మతంలోనికి మార్చడం వల్ల దేవునియందు విశ్వాసం పెంచడానికి బదులు దేవుని నమ్మినవారితో గుడుగుడు కుంచం ఆడుకుంటున్నారని చెపితే ఆ క్రైస్తవ మతాచార్యులకు నచ్చేదికాదు. దేవునిమీద నమ్మకం ఉన్నవారు నమ్మకం లేనివారిని నమ్మించడానికి ప్రయత్నించాలి కాని నమ్మినవారిని ఒక మతంలోనుంచి మరొక మతంలోనికి మార్చడం వల్ల దేవునికి వారు చేసే ఉపకారం ఏమీ ఉండదు. వారికి నా అభిప్రాయాలు నచ్చకపోయినా ఆ రోజుల్లో అవి విలక్షణమైనవని అంగీకరించేవారు. దేవునియందు నమ్మకం లేనివారిని మార్చడం అసాధ్యం కాబట్టి నమ్మినవారిని తమ మతంలోనికి మార్చుకోవడం సులభం అని వారి వాదం. వేరా ఈ చర్చలు ఆసక్తితో వింటూ కూర్చునేది.

అప్పటికే నేను లండనునుంచి మిష్టర్‌టన్ వచ్చి నెలరోజులు దాటిపోయింది. ఇంకా భారతదేశానికి తిరుగు ప్రయాణానికి సంబంధించిన వార్త లేదు. వేరా, జార్జి విల్‌కాక్స్‌ల ఆతిథ్యం హాయిగా ఉంది. కాని అలా వారి నెత్తిన ఎంతకాలం కూర్చోవడం అనే సమస్య బాధించడం మొదలుపెట్టింది. మిస్ థారన్ ఏర్పాటు చేసిన గడువు దాటిపోయింది. ఇక ఆ గ్రామం వదలి వెళ్లాలి. కాని ఎక్కడికి వెళ్ళడం అనే ఆలోచనతో సతమతమయ్యాను. అంతలో టార్కీనుంచి మరొక ఆహ్వానం వచ్చింది. మిత్రురాలు బార్బరా టార్కీ వచ్చి తమ ఇంటివద్ద కొన్ని రోజులు ఉండి తమ ఆతిథ్యం స్వీకరించవలసిందిగా నన్ను ఆహ్వానిస్తూ వాళ్ళ అమ్మగారితో జాబు వ్రాయించింది. టార్కీ వెళ్ళడానికి నిర్ణయించాను. జార్జి, వేరా నన్ను మిష్టర్‌టన్‌లో మరికొంతకాలం ఉండమని బ్రతిమిలాడారు. వారి మంచితనానికి ముగ్ధుడనయ్యాను,. కాని మనసు మార్చుకోలేదు. మిష్టర్‌టన్‌నుంచి టార్కీకి బస్సులో వెళ్లాలి. బార్బరా కుటుంబంవారి ఆహ్వానాన్ని అంగీకరిస్తూ నేను ప్రయాణం చేసేరోజు, బస్సు టైము వివరాలు వ్రాసాను.

నెలరోజులు పైగా హాయిగా, ఆనందంగా మిష్టర్‌టన్ లో గడిపి వేరా, జార్జివద్ద సెలవు తీసుని బస్సు ఎక్కాను. ఆ దంపతులు బస్సువద్దకు వచ్చి ప్రేమపూర్వకంగా వీడ్కోలు ఇచ్చారు. ఎందుకో హృదయం బరువెక్కింది. ఆప్తమిత్రుల్ని విడిచిపెట్టి వెళుతున్నందుకు బాధ కలిగింది. ఆ బస్సు ప్రయాణం చాలా ఆసక్తికరంగా ఉంది. నేను ఇంగ్లండులో అంత ఎక్కువగా బస్సుప్రయాణాలు చేయలేదు. కాని మిష్టర్‌టన్ నుండి టార్కీకి ప్రయాణం చాలా హాయిగా ఉంది. దారిపొడవునా ప్రకృతికూడా కన్నులపండువగా

ఉంది ఆ దృశ్యాలు చూస్తూ ఆనందంగా ప్రయాణం చేసి టార్కీ బస్సుస్టాండుకి చేరేసరికి మిత్రురాలు బార్బరా నన్ను ఆహ్వానించడానికి అక్కడ ప్రత్యక్షమయింది సంతోషంగా కబుర్లాడుకుంటూ వాళ్ళ ఇంటికి నడిచివెళ్ళాం టార్కీ పెద్ద పట్టణం కాదు చిన్న గ్రామం కాదు అయితే దాని ప్రత్యేకత ఇంగ్లండు దేశంలో దక్షిణంగా సముద్రతీరంలో ఉండడమే

సామాన్యంగా ఋతువులతో సంబంధం లేకుండా ఎప్పుడూ చలిగాను తడిగాను ఉండే లండనువాసులకు టార్కీ బ్లాక్ పూల్ వంటి సముద్రతీర పట్టణాలు స్వర్గతుల్యంగా ఉంటాయి సంపన్నులైన ఇంగ్లీషు కుటుంబాలు చలికాలంలో ఇంగ్లండులోని చలి బారినుండి తప్పించుకోవడానికి ఫ్రెంచి, ఇటాలియన్ రవెరాలకు పర్యాటనకు వెళతారు ఫ్రాన్సు ఇటలీ దేశాల దక్షిణ సముద్ర తీర ప్రాంతాలు బ్రిటిష్ వినోద పర్యాటకులతో నిండివుంటాయి అలా దేశం వదలి వెళ్ళలేని మధ్యతరగతి కుటుంబాలు ఇంగ్లండులోని దక్షిణ బాగంలో ఉన్న సముద్ర తీరపట్టణాలకు వెళతారు

టార్కీ ఇంగ్లీషు వినోదపర్యాటకులకు అత్యంత ఆకర్షణీయమైన పట్టణం ఆ పట్టణంలో పెద్ద హోటళ్ళకంటే కుటుంబాలు నిర్వహించే చిన్న అతిదిగృహాలు హెచ్చు అటువంటి అతిదిగృహం నడుపుతారు బార్బరా తల్లిదండ్రులు వారిది రెండస్తులమేడ దానిలో నాకోసం ఒక గది ప్రత్యేకించారు ఆ రాత్రి భోజనాల అనంతరం వారి కుటుంబ సభ్యులు నేను హాలులో టెలివిజన్ ముందు కూర్చుని కబుర్లు ఆ ఇంట్లో యాజమాన్యం తల్లిదనే విషయం నిమిషాలమీద తెలిసిపోయింది తండ్రి అన్నగారు నామమాత్రులు అతిదిగృహం నడపడంలో తోడ్పడడం తప్ప నిర్ణయాలు తీసుకోవడంలో వారికి ఏవిధమైన ప్రమేయంలేదని తేలింది

నేను టార్కీలో వారి ఇంట అతిదిగా నాఇష్టం వచ్చినన్నిరోజులు ఉండవచ్చునని ఆ తల్లి నిర్ణయించింది నేను అక్కడ ఉన్నన్నాళ్ళు నామంచి చెడ్డలు చూడ్డానికి ఆసక్తికరమైన ప్రదేశాలు చూపించటానికి నాకు తోడుగా బార్బరాను నియమించింది నాఆపరేషను పూర్తిగా నయం కావడానికి సముద్రపు గాలి బాగా తోడ్పడుతుంది కాబట్టి ఎక్కువకాలం సముద్రతీరాన, సముద్రంమీద గడపడం మంచిదని సలహా ఇచ్చారు నిజానికి మిష్టర్‌టన్‌లో వేరా చేసిన సేవల పలితంగా నేను ఆపరేషను నుంచి పూర్తిగా కోలుకొన్నాను ఆ తల్లి కూతురు సముద్రంమీద బోటు షికార్లకు తీసుకు వెళ్ళేవారు నావికుణ్ణి నేను, ప్రయాణికులు వారిద్దరూ! సముద్రంమీద బోటుషికారు చాలా సాహసంతో కూడిన వినోదం అయినా ఎక్కువ సేపు నేను సముద్రం మీద గడిపేవాణ్ణి

ఇక ఆ ఇంట్లో నాకు రాజభోగాలు ఐదునక్షత్రాల హోటళ్ళలో కూడా ఆ సౌకర్యాలు ఉండవనిపించింది హంసతూలికా తల్పంలో నిద్ర తెల్లవారేసరికి టీ ట్రేతో బార్బరావచ్చి నిద్రలేపేది అలా పక్కలోనుంచి లేవకుండానే టీత్రాగేవాణ్ణి డైనింగ్ హాల్‌కి వెళ్ళడానికి బద్ధకంగా ఉంటే బ్రేక్‌ఫాస్ట్‌కూడా పక్కమీదనే బూట్లు పాలిష్ చేసి గదిబైట ఉండేవి బట్టలు ఉతకడం సూటు ఇస్త్రీ చేయడం ఆ ఇంటి సభ్యులే చేసేవారు చేతిలో డబ్బులేకపోయినా ఆకుటుంబ సభ్యులంతా నాయందు అత్యంత ఆదరం, ప్రేమ అనురాగం చూపించి టార్కీలో నేను గడిపిన పదిరోజులు జీవితమంతా గుర్తు పెట్టుకునేవిగా చేసారు ఆ అనుభూతి అనిర్వచనీయం బార్బరా నన్ను వెంటబెట్టుకుని టార్కీ అంతా త్రిప్పింది సముద్రం వద్దకు వెళ్ళేటప్పుడు వాళ్ళ అమ్మగారుకూడా వచ్చేది హాయిగా ఆనందంగా ఉంది అంతలో లండను నుంచి మిస్‌ధారన్ జాబు వ్రాస్తూ భారత దేశానికి తిరుగు ప్రయాణం విషయంలో డిల్లీనుండి జాబు వచ్చినది కాబట్టి వెంటనే లండను తిరిగి రమ్మనమంది అంతవరకు ఆకాశమార్గాన విహరించే నేను ఒక్కసారిగా నేలకు దిగాను లండను నుంచి బయలుదేరేటప్పుడు మిస్‌ధారన్ ఇచ్చిన నాలుగు పౌండ్లలో మిగిలిన రెండు పౌండ్లు మాత్రమే నావద్ద ఉన్నాయి నేను లండను నుంచి మిష్టర్‌టన్‌కి కొన్న రాను పోను రైలు టిక్కెట్టులో సగం ముక్క ఎక్కడో పోయింది గత నెలాపది రోజులనుండి ఒక్క పెన్నీకూడా ఖర్చుపెట్టవలసిన అవసరం లేకపోయింది కాబట్టి లండను చేరడానికి ప్రయాణం ఖర్చుకి ఇబ్బంది లేకపోయింది బార్బరా కుటుంబ సభ్యులంతా నాకు వీడ్కోలు చెప్పడానికి బస్సుస్టాండ్‌కి వచ్చారు ఆడవాళ్లకు ముద్దులు, మగవారికి కరచాలనం నేను బస్సు ఎక్కాను బార్బరా వాళ్ళ అమ్మ ఏడుపు బరువైన హృదయంతో టార్కీ వదలిపెట్టాను

లండనులో భారత హైకమీషనర్ శ్రీ కృష్ణమీనన్‌ని కలుసుకున్నాను నా తిరుగు ప్రయాణానికి 90 పౌన్లు (అప్పట్లో వాటి విలువ రు 1315) అప్పుగా ఇవ్వవలసినదిగా డిల్లీనుంచి అనుమతి వచ్చినట్టు చెప్పారు నేను లండనులో నానా అవస్థలుపడి లండను విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్ డి డిగ్రీ పుచ్చుకున్నందుకు నన్ను అభినందించి ప్రభుత్వం ఇవ్వమన్న 90 పౌన్లు ఇప్పించారు ఒక వారం రోజుల్లో లండను నుంచి బొంబాయికి వెళ్ళే ఓడ ఉన్నదని తెలుసుకుని దానికి టిక్కెట్టు కొనుక్కున్నాను ఓడ టిక్కెట్టు ఖరీదు 90 పౌన్లు అంటే ప్రభుత్వం ఇచ్చిన సొమ్ము టిక్కెట్టుకి సరిపోయింది చేతిలో చిల్లిగవ్వలేదు ఆవారం రోజులు భారత మిత్రులతో వారి గదుల్లో గడిపేసాను మిస్‌దారన్‌ని ఇండియా హౌస్ లైబ్రరీలో కలుసుకుని నాహృదయపూర్వక కృతజ్ఞతలు చెప్పుకుని ఆమెవద్ద సెలవు తీసుకున్నాను టావిటన్ వీదిలో

ఐదవ నెంబరు ఇంటియజమానురాలు శ్రీమతి టిటర్‌టన్‌కి కృతజ్ఞతలు చెప్పుకున్నాను స్కూల్ ఆఫ్ ఆఫ్రికన్ అండ్ ఓరియంటల్ స్టడీస్‌కి వెళ్ళి ప్రొఫెసర్ హాల్‌ని కలుసుకుని ఆయన వద్ద సెలవు తీసుకున్నాను ప్రొఫెసర్ కార్న్రకన్ నాప్రయాణానికి ముందురోజు డిన్నర్, థియేటర్‌కి ఆహ్వానించారు

మూడున్నర సంవత్సరాలక్రితం నేను లండనులో దిగినరోజు రాత్రి థియేటర్‌కి వెళ్ళాను వదిలిపెట్టే ముందురోజు థియేటర్‌కి వెళ్ళడం యాదృచ్ఛికం చాలా సంతోషించాను ఆ సాయంకాలం చక్కటి భోజనంచేసి థియేటర్‌చూచి కబుర్లాడుతూ థేమ్స్ నది ఒడ్డున నడుస్తున్నాము భారత ప్రభుత్వం ఇచ్చినసొమ్ము ఓడ టిక్కెట్టుకి సరిపోయింది కాబట్టి ప్రయాణంలో ఖర్చుపెట్టుకోడానికి ఉంచుకోమని పదిపౌండ్లు ఇచ్చాడు ఆయన సహృదయతకు స్నేహభావానికి ముగ్ధుడనయ్యాను నిజంగా ఆయన ఆసొమ్ము ఇవ్వకపోతే ఆమరునాడు ఓడవద్దకు ఎలా చేరేవాడినో తెలియని పరిస్థితి ఆయన మాట్లాడుతున్నప్పుడు నాకు చాలాకాలంనుంచి ఉన్న అనుమానం బైట పెట్టాను. కార్న్రకన్ ఇంగ్లీషు భాషాస్వరూపంతో పాటు ఉచ్చారణ స్వభావాన్ని గురించి కూడా బోధిస్తాడు కాబట్టి ఆక్స్‌ఫర్డ్ ఉచ్చారణ అని ఏమైనా ఉందా? అని అడిగాను ఇంగ్లీషుభాష అనేక దేశాల్లో అనేకవిధాలుగా ఉచ్చరిస్తారు నిజానికి ఇంగ్లీషు భాషకు పుట్టినిల్లయిన ఇంగ్లండులోనే వివిద ప్రాంతాల్లో మాట్లాడే భాషా ఉచ్చారణలో భేదం ఉంటుంది లండను పట్టణంలో టాక్సీడ్రైవరు మాట్లాడే పద్ధతికి, బ్యాంకు మేనేజరు మాట్లాడే విధానానికి తేడా ఉంటుంది కొందరు మిత్రులు నొక్కి, తుంచి, ఇంగ్లీషు మాట్లాడతారు

ఎన్ని సంవత్సరాలు ఇంగ్లీషు చదువుకున్నా ఎవరి ఉచ్ఛారణ వారిది అందుమూలంగా ఇంగ్లండులో చదువుకుని వెళ్ళిన తరువాత ఇంగ్లీషు తెలుగు వాడిలాగే మాట్లాడుతున్నావంటారని అనుమానంవచ్చి ఇంగ్లీషు ఉచ్చారణ గురించి ప్రొఫెసర్ కార్న్రకన్‌ని అడిగాను నేను చెప్పినదంతా విని ఆయన విరగబడి నవ్వాడు ఉచ్చారణ మీద మాతృబాష యొక్క ప్రభావం ప్రాదేశిక ప్రబావం ఉండక తప్పదన్నారు ఆక్స్‌పర్డ్ యూనివర్సిటీలో చదువుకునే విద్యార్థులలో స్కాట్లాండ్‌నుంచి వేల్స్ నుంచి, ఐర్లండ్ నుంచి వచ్చినవారు ఇంగ్లీషును వేరు వేరు విదాలుగా ఉచ్ఛరిస్తారంటూ ఆక్స్‌ఫర్డ్ ఉచ్చారణ అని ప్రత్యేకంగా ఏమీ లేదు పొమ్మన్నాడు కొందరు విదేశీ విద్యార్థులు నొక్కి, తుంచి ఇంగ్లీషు మాట్లాడ్డం అలవాటు చేసుకుని అది ఆక్స్‌ఫర్డ్ ఉచ్చారణ అని భ్రమిస్తారన్నారు

1952 జూన్ 15 వతేదీ ఉదయం కొద్దిమంది తెలుగు మిత్రులు లండను

రైలుస్టేషన్ వద్ద నాకు వీడ్కోలు చెప్పడానికి వచ్చి నాతోపాటు టిల్‌బరీ ఓడరేవువరకు వచ్చారు, టిల్‌బరీలో రైలు దిగేసరికి అక్కడ మిస్ దారన్‌ని చూచి ఆశ్చర్యపోయాను నాతోపాటు లండను వచ్చిన మిత్రుడు బాటియాకూడా నాకు వీడ్కోలు చెప్పడానికి వచ్చాడు, వారందరివద్ద సెలవు తీసుకుని ఓడ ఎక్కాను ఆఓడ బారత ప్రబుత్వానికి చెందిన జలజవహార్ ఆ రోజుల్లో బారతదేశం ఇంగ్లండు దేశాలమధ్య జలజవహార్ జలఆజాద్ అని రెండు ప్రయాణికుల ఓడలు నడిచేవి, అవి చిన్నవి కావడంవల్ల ప్రయాణానికి ఎక్కువ రోజులు పట్టేది బ్రిటిష్ ఓడలు 14 రోజుల్లో బొంబాయినుంచి లండను తీసుకువెళితే జలజవహార్ అదే ప్రయాణానికి 21రోజులు తీసుకుంటుంది ఓడలో ప్రయాణికులంతా బారతీయులే వారిలో చాలామంది ఇంగ్లండులోను, అమెరికాలోను చదువులు పూర్తి చేసుకుని భారతదేశానికి తిరిగివెళుతున్నవారే నేను మొదటి సారిగా కులదీప్ నయ్యర్‌ని ఆ ఓడలో కలుసుకున్నాను, ఆయన అమెరికాలో జర్నలిజంలో పై చదువులు చదివి బారతదేశానికి తిరిగి వస్తున్నాడు ఆప్రయాణం21రోజులలోను మేము మంచి మిత్రులమయ్యాం ఆ నాటినుంచి ఆ మిత్రత్వం నిత్యనూతనంగా సాగుతూనే ఉంది ప్రొఫెసర్ కార్నకన్ ఇచ్చిన పదిపౌన్లు చాలా జాగ్రత్తగా ఖర్చు పెడుతూ బొంబాయి చేరాను

  

# వియత్నాంలో నా యత్నం

వియత్నాంలో నా యత్నం (ఉద్యోగం) ప్రారంభించడానికి ముందు భారతదేశంలో నేను పడిన పాట్లు వివరించాలి 1952 జూలైలో ఇంగ్లండునుంచి భారతదేశానికి తిరిగి వచ్చాను అవి ఇంకా ఇంగ్లండులో చదువులు చదివిన వారికి మన దేశంలో ఉద్యోగాలు సులువుగా దొరికే రోజులే గాని నా దురదృష్టం వల్ల నా లండను యూనివర్సిటీ డాక్టరేట్ డిగ్రీకి విలువ లేకుండా పోయింది మరొక దారిలేక పార్లమెంటులోని కాంగ్రెసు పార్టీ ఆపీసులో అసిస్టెంటు సెక్రటరీ రిసెర్చి ఉద్యోగంలో చేరాను నేను ఇంగ్లండు వెళ్ళడానికి ముందు కాంగ్రెసు పార్టీ ఆపీసు సెక్రటరీగా ఉన్న మిత్రుడు వి విరల్ బాబు ఆపార్టీ ఆఫీసులో చాలా శక్తివంతమైన వ్యక్తిగా ఉన్నాడు పార్టీ కార్యదర్శిగా పార్లమెంటు సభ్యుడు శ్రీ బలవంతరాయ్ మెహతా ఉండేవారు వారిద్దరు కలిసి నాకు కాంగ్రెసు పార్టీలో ఉద్యోగ అవకాశం కలిగించారు పార్టీ సెక్రటరీ జనరల్‌గా ఒరిస్సా నాయకుడు డా|| మెహతాబ్ ఉండేవారు పార్టీ నాయకత్వం విరల్ బాబు ప్రోత్సాహంతో పార్లమెంటులోని కాంగ్రెసు పార్టీ సభ్యుల ఉపయోగం కోసం అన్ని విషయాలపై ముఖ్యంగా ప్లానింగ్‌కి సంబంధించి చిరుపుస్తకాలు అచ్చువేయించడానికి నిర్ణయించారు ఆ పుస్తకాల తయారీలో నేను విరల్ బాబుకి తోడ్పడేవాణ్ణి

అదే సమయంలో "నెహ్రూ విదేశనీతి" అనే గ్రంథాన్ని ఆంగ్ల బాషలో వ్రాసాను నేను లండను నుంచి తిరుగుప్రయాణం చేసేటప్పుడు ఓడలో మంచి మిత్రుడైన కులదీప్ నయ్యర్ ఆ గ్రంథం చదివి దానిలో మార్పులు చేర్పులు చేయడంలో తోడ్పడ్డాడు కులదీప్ కుటుంబంతో మిత్రత్వం దినదిన ప్రవర్ధమానం అయింది నెహ్రూ విదేశనీతి అనే పుస్తక ప్రచురణ సందర్భంలో ఒక సన్నివేసాన్ని నేను ఎన్నడూ మరువలేను ఆ పుస్తకం నెహ్రూగారికి అంకితమిద్దామనే ఆలోచనతో ఒక డిల్లీ ఆర్టిస్టు చేత పండిట్‌జీ బొమ్మ లైనుడ్రాయింగు వేయించాను ఆయన పుట్టినరోజు నవంబరు14 వ తేదీన ఆ బొమ్మపై పండిట్‌జీతో సంతకం చేయించి దానిని బ్లాక్ చేయించి అచ్చు వేయించాను మొట్టమొదటి కాపీ నెహ్రూజీకి బహూకరించడానికి తీసుకువెళ్ళాను ఆయన దానిలోని తన బొమ్మను చూచి ఆ పుస్తకం అంతకుముందే చూసానన్నారు అయ్యా! మీరు ఆ పుస్తకాన్ని చూడ్డానికి అవకాశం లేదు ఇదే ప్రెస్‌లోనుంచి వచ్చిన మొదటి కాపీ అని ఆయనకు

నచ్చజెప్పడానికి నా తాతలు దిగారు అయితే ఆయన తన బొమ్మ చూచి పుస్తకాన్నే చూసానని భ్రమ పడ్డారు

నేను కొరియాపై వ్రాసిన పుస్తకాన్ని కాంగ్రెసు పార్టీ వారే ప్రచురించారు పార్టీ కార్యదర్శి బి శివరావు గారు ముందుమాట వ్రాసారు కాని నేను కామన్‌వెల్తుపై వ్రాసిన గ్రంథాన్ని పార్టీ పక్షాన అచ్చువేయించడానికి శ్రీ నెహ్రూ అంగీకరించలేదు పార్టీ సభ్యులకోసం ప్రచురించే ప్రచురణలన్నీ ఆయా మంత్రిత్వశాఖలు చదివి అనుమతించేవారు విదేశ వ్యవహారాలపై ఏదివ్రాసినా ముందుగా పండిట్‌జీ స్వయంగా చదివేవారు కామన్వెల్తుపై వ్రాసిన పుస్తకంలోని విషయాలతో ఆయన అంగీకరించలేకపోయారు కామన్వెల్తు ఆయన అల్లారు ముద్దు బిడ్డ ఆ విషయమై ఏవిధమైన విమర్శను ఆయన సహించలేకపోయేవారు పార్టీ సెక్రటరీ జనరల్ మెహతాబ్ ఆ పుస్తకాన్ని ప్రయివేటుగా అచ్చువేయించుకోడానికి అంగీకరించారు అది అచ్చు అయిన తరువాత మా గురువులు ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు ఆ పుస్తకాన్ని "హిందూ" పత్రికలో రివ్యూ చేసారు ఆ రివ్యూ చదివి నేను ఎంతో సంతోషించాను

అప్పట్లో శ్రీ బలవంతరాయ్ మెహతా పార్లమెంటులో కాంగ్రెసు పార్టీ కార్యదర్శి అఖిలభారత కాంగ్రెసు కమిటీ జనరల్ సెక్రటరీగా ఉండేవారు ఆయన దృష్టిలో నేను చేయని పని లేదు నేను లండను నుంచి తిరిగివచ్చి కాంగ్రెసు పార్టీ ఆఫీసులో పనిచేసే రోజుల్లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసన సభకు ఉప ఎన్నిక వచ్చింది అప్పుడు డా బెజవాడ గోపాలరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు ఆయన బలవంతరాయ్‌గారికి జాబు వ్రాస్తూ ఆంధ్రాలో జరిగే ఉపఎన్నికకు అభ్యర్థిని నిర్ణయించమన్నారు ఏర్పడిన ఖాళీ రాయలసీమలో కాంగ్రెసు అభ్యర్థి మరణం మూలంగా ఏర్పడింది కాంగ్రెసు పార్టీ తరపున ఎవరు నిలబడ్డా విజయం ఖాయం అంతే బలవంతరాయ్‌జీకి వెంటనే నేను గుర్తుకివచ్చాను నన్ను పిలిచి వెంటనే ఆంధ్రా వెళ్ళి నామినేషన్ పడవెయ్యమన్నారు నమ్మండి నమ్మకపోండి ఆ పరిస్థితినుంచి బైటపడడానికి బ్రహ్మప్రళయం అయింది బలవంత్‌రాయ్‌జీతో నేను కాంగ్రెసు సభ్యుణ్ణి కాదని, ఎన్నిక కోసం ఖర్చుపెట్టడానికే కాకుండా నియోజకవర్గానికి వెళ్ళడానికి కూడా నావద్ద పైసా లేదని చెప్పాను ఆయన వింటేనా! కాంగ్రెసు ఆఫీసుకి వెళ్ళి చక్రవర్తిని కలుసుకుంటే అన్ని సమస్యలు అతడే తీరుస్తాడన్నారు అప్పుడు నా ఆర్థిక పరిస్థితి ఆయన దృష్టికి తీసుకురావలసి వచ్చింది ఇంగ్లండు చదువుకి తిరుగు ప్రయాణానికి ప్రభుత్వం వద్ద అప్పు చేసాను కాబట్టి ఆ అప్పులు తీర్చాలి అంతే కాకుండా అప్పట్లో శాసనసభ్యులకు నెలకు

వందరూపాయలు జీతం. నా అవసరాలకు నెలకు వెయ్యి రూపాయలు కావాలి. కాబట్టి శాసనసభ్యునిగా వచ్చే వందరూపాయలు చాలనందున అవినీతికి పాల్పడవలసి వస్తుందని మనసు విప్పి చెప్పాను. దానితో నన్ను శాసనసభ్యుణ్ణి చేయాలన్న ఆలోచన ఆయన విరమించుకున్నారు.

ఢిల్లీలో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డ్ అఫైర్స్ అనే సంస్థకు సెక్రటరీ జనరల్‌గా డా. అప్పాదొరై ఉండేవారు. ఆయనకు భారతదేశంలోని రాజకీయపార్టీల వ్యవస్థతో ఇంగ్లండు, ఆస్ట్రేలియా అమెరికను దేశాలలోని పార్టీల వ్యవస్థతో పోలికపై ఒక ప్రత్యేక అధ్యయనం చేయించాలని ఉండేది. ఆమాట శ్రీ అప్పాదొరై ఏదో మాటల సందర్భంలో శ్రీ బలవంతరాయ్ చెవిన వేసారు. మా మూర్తి ఇంగ్లండులో రిసెర్చి చేసి డాక్టరేటు తెచ్చుకున్నాడు కాబట్టి ఈ అంశంపై అధ్యయనం చేయడానికి తగినవాడని శ్రీ బలవంత్‌రాయ్ తన అభిప్రాయాన్ని శ్రీ అప్పాదొరైకి చెప్పారు. ఆ విషయమై వివరంగా ఒక నోట్ డా. అప్పాదొరైకి ఇచ్చాను. దాని ఆధారంగా మరొకరితో ఆ అధ్యయనం చేయించుకున్నారు. నేను ఆ విషయం అంతగా పట్టించుకోలేదు.

భారత స్వాతంత్ర్య సమర చరిత్రను వ్రాయించడానికి భారతప్రభుత్వం విద్యాశాఖ హేమా హేమీలతో ఒకనిపుణుల ఎడిటోరియల్ బోర్డు నియమించింది. దానిలో ప్రముఖ రాజకీయవేత్తలు, చరిత్రకారులు, మేధావులు ఉన్నారు. ఆబోర్డులో శ్రీ బలవంత్ రాయ్ మెహతాకూడా ఒక సభ్యుడు. ఒకరోజు నన్ను పిల్చి స్వాతంత్ర్య సమర చరిత్ర వ్రాయడానికి చరిత్రకారులు కావాలంటున్నారని నన్ను రిసెర్చి ఆఫీసరు ఉద్యోగానికి ప్రయత్నించమని సలహా ఇచ్చారు. ఆబోర్డుకి కార్యదర్శి ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధుడు, పార్లమెంటుసభ్యుడు శ్రీ సురేంద్ర మోహన ఘోష్, బలవంత్‌రాయ్ సలహా మేరకు శ్రీ ఘోష్‌ని ఆయన ఇంటివద్ద కలుసుకున్నాను. ఆయన ఉద్యోగాలు లేవు పొమ్మన్నాడు. ఆమాటవిన్న బలవంత్‌రాయ్ శ్రీ ఘోష్‌కి టెలిఫోన్ చేయడంతో ఆయన నన్ను పిల్చి ఉద్యోగం యిచ్చారు. అప్పటికే ఇద్దరు రిసెర్చి ఆఫీసర్లు బోర్డు ఆఫీసులో పనిచేస్తున్నారు. శ్రీ ఘోష్ నన్నుసీనియర్ రిసెర్చి ఆఫీసరుగా నియమించారు. ప్రభుత్వ ఆజ్ఞల ప్రకారం దేశంలోని అన్ని రాష్ట్రాలలోను స్వాతంత్ర్య సమరచరిత్ర బోర్డులు నియమించవలసి ఉంది. కాని రాష్ట్రప్రభుత్వాలు ఆ విషయంలో పెద్ద ఉత్సాహం చూపలేదు.

బోర్డు ఆఫీసులో ముగ్గురు రిసెర్చి ఆఫీసర్లు, ఆఫీసు కార్యదర్శి ఉండేవాళ్ళం. డా. చోప్రా ఒక కాశ్మీర్ పండిట్. నేను రిసెర్చి ఆఫీసర్లం. మాపనిని పర్యవేక్షించడానికి బోర్డు డైరెక్టర్లలో ఒకరైన ప్రముఖ చరిత్రకారులు డా. మజుందార్ ఆఫీసుకి వస్తూ ఉండేవారు.

బోర్డు కార్యదర్శి శ్రీ ఘోష్ అవివాహితుడు ఆయన శ్రీ అరవిందఘోష్ శిష్యుడు ప్రతి సంవత్సరం పుదుచ్చేరి వెళ్ళి శ్రీ అరవిందాశ్రమంలో కొన్నిరోజులు గడిపివచ్చేవారు బాసు దంపతులు ఢిల్లీలో ఆయన ఇంట్లోఉండి ఆయన మంచి చెడ్డలు చూస్తూ ఉండేవారు బాసు మా ఆఫీసు కార్యదర్శి అతడి కుమారుడి పుట్టినరోజు పండుగ బ్రహ్మాండమైన రాజకీయ సమావేశంగా ఉండేది కేంద్రమంత్రులు, పార్లమెంటు సభ్యులు ప్రభుత్వాధికారులు ఆకుర్రవాని పుట్టినరోజుకి హాజరయ్యేవారు బాసు దంపతులు నాకు మంచి మిత్రులు అయ్యారు మొట్టమొదటి సారిగా వారిఇంట్లోనే బెంగాలీ భోజనం రుచిచూసాను బెంగాలీలకు చేపలు తినడం ఇష్టం అని విన్నాను కాని శ్రీమతి బాసు కందిపప్పులో చేపతలకాయలు వేసి వండితే నాకు మతిపోయేది

స్వాతంత్ర్య సమర చరిత్ర బోర్డులో డా॥ మజుందార్ తోపాటు ప్రముఖ చరిత్రకారుడు డా॥ సేన్ మహామహోపాద్యాయ పోద్దార్, రాజకీయ నాయకులు ఆచార్య నరేంద్రదేవ్ శ్రీమతి కమలాదేవి చట్టోపాద్యాయ శ్రీ బలవంతరాయ్ డైరెక్టర్లుగా ఉండేవారు వారి సమావేశాలలో చర్చలు చాలా నిశితంగా ఉండేవి ఉదాహరణకు 1885లో జరిగిన సిపాయిల తిరుగుబాటుకు ప్రధమ స్వాతంత్ర్య సమరంగా పరిగణించడం సమంజసం అవునా కాదా అనే విషయంలో బోర్డు డెరెక్టర్లలో తీవ్ర బేదాభిప్రాయాలు ఉండేవి చరిత్రకారులు 1885 లో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమాన్ని సిపాయిల తిరుగుబాటు అంటే రాజకీయనాయకులు దానిని ప్రదమ స్వాతంత్ర్య సమరంగా అభివర్ణించారు బోర్డు సభ్యులు అంతా రాష్ట్రాలలో కూడా స్వాతంత్ర్య సమరచరిత్ర బోర్డులు నెలకొల్పాలని అభిప్రాయపడ్డారు రాష్ట్రాలనుంచి ఆశించిన స్పందన రానందున అన్ని ప్రభుత్వాలకు ఈ విషయంలో సలహా యివ్వడానికి నన్ను వెళ్ళమన్నారు ఆ ప్రయాణం పలితంగా అనేక రాష్ట్ర ప్రభుత్వాలు బోర్డులను నియమించాయి ఆ ప్రయాణంలో పూనా వెళ్ళి మహామహోపాద్యాయ పోద్దార్ని కలుసుకున్నాను ఆయన అప్పటికే చాలా వృద్ధులు శ్రీ పోద్దార్ వద్ద కూర్చుని చరిత్రపాఠాలు వినడం ఒక దివ్యానుభూతి

నేను వెళ్ళినది ఆఫీసు పనిమీదనే అయినా మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ రవిశంకర్ శుక్లాని గవర్నర్ డా॥పట్టాభిసీతారామయ్య గారిని కలుసుకోవడం మరువరాని అనుభవాలు ముఖ్యమంత్రిని చూడ్డానికి వెళ్ళి నా కార్డు పంపాను నన్ను ఆయన గదిలోనికి పంపారు తీరా లోపలకు వెళ్ళినతరువాత చూస్తే ముఖ్యమంత్రి పరుపుమీద కూర్చున్నారు ఆ దగ్గరలో కుర్చీ లేదు అయినా ఆయనే నేలమీద కూర్చుంటే నేను కుర్చీకోసం చూడకూడదు నేను సూట్లో

ఉన్నాను నా ఇబ్బంది గమనించిన ముఖ్యమంత్రి ఒక కుర్చీ తెప్పించారు నా కోసం ముఖ్యమంత్రి శుక్లా నేను పార్లమెంటు కాంగ్రెసు పార్టీ ఆఫీసులో పనిచేసేటప్పుడు పార్లమెంటు సభ్యుడుగా వుండేవారు అప్పటినుంచి ఆయన నాకు తెలుసు నా విజిటింగు కార్డుచూచి పిహెచ్ డి లండను ఎప్పుడయ్యావని ఆశ్చర్యపోయారు డా॥ శంకర దయాళ్ శర్మ శుక్లాగారి ప్రభుత్వంలో విద్యాశాఖామాత్యులు వారిని కలుసుకుని బోర్డునియామకం విషయం చర్చించమన్నారు ఆపని పూర్తిచేసుకున్న మరునాడు గవర్నరు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారిని చూడ్డానికి వెళ్ళాను రాజభవనానికి టాక్సీలో వెళ్ళి టాక్సీని ఉండమన్నాను శ్రీ పట్టాభిగారితో నేను వెల్లూరు జైలులో ఉన్నప్పటి పరిచయం బందరులోను డిల్లీలోను ఆయనతో ఉన్న సాన్నిహిత్యంతో ఆయన్ని చూడ్డానికి వెళ్ళాను

ఆయన మొదటి సలహా టాక్సీని పంపివేయమని రాజభవన్‌లో అనేక వాహనాలు ఉన్నాయి కాబట్టి టాక్సీతో పనిలేదన్నారు ఉదయం 11 గంటల ప్రాంతంలో పట్టాభిగారు తాను పెందలాడే భోజనం చేస్తాను కాబట్టి నన్ను తమ అబ్బాయితో భోజనం చేయమని సలహా యిచ్చారు ఇంగ్లండులో ఉండివచ్చావు కాబట్టి భోజనం ఆలస్యంగా చేయడం అలవాటు అయిఉంటుందని ఆ సలహా యిచ్చానన్నారు నిజంగా నేను ఆలస్యంగా భోజనం చేస్తాను కాని ఆయనతోనే భోజనం చేసాను మద్యాహ్నం వరకు కబుర్లు చెప్పుకున్నాం అప్పుడు పట్టాభిగారు గవర్నరు జెండాతో ఉన్న జీపులో నాతోపాటు నేనున్న హోటల్ వరకు వచ్చి దిగబెట్టి వెళ్ళారు గవర్నరుగారు స్వయంగా తీసుకువచ్చి దిగబెట్టి వెళ్లారు కాబట్టి నేను చాలా ముఖ్యమైన వ్యక్తిని అయివుంటానని హోటల్ వారంతా భావించారు అంతేకాకుండా ఆమరుచటిరోజు రాజభవన్ సేవకుడు నా హోటల్ గదిబైట నిలబడి ఉండడంతో నా ప్రాముఖ్యత యింకా పెరిగింది

బారత స్వాతంత్ర్య సమరచరిత్ర వ్రాయడంలో తోడ్పడడానికి వివిధ రాష్ట్రాలలో విబాగాలు నెలకొల్పడం పనిపూర్తి చేసాను కాని ఆయా రాష్ట్రవిబాగాలు అప్పటిలో ప్రారంబించబడినా అవేవి చురుకుగా పనిచేయలేకపోయాయి డాక్టరు మజుందారు సలహామేరకు నేను కేంద్రప్రభుత్వ హోం శాఖలో కూర్చుని వారి ఫైల్స్ చూచి నోట్సు వ్రాయడం పనిలో నిమగ్నమయ్యాను నాకు లండను యూనివర్సిటీలో పిహెచ్ డి కోసం రీసెర్చి చేసేరోజుల్లో వారి ప్రభుత్వం రికార్డు ఆఫీసులో కూర్చుని పాత ఫైల్సు చూచిన అనుబవం పనికివచ్చింది అయితే డిల్లీలో హోం శాఖ ఆఫీసులో కూర్చుని పాతఫైల్స్ చదివి నోట్సు వ్రాసుకోవడం ఒక యజ్ఞం చేసినట్టే ఉద్యమం

గురించి, రాజకీయ నాయకుల విషయంలో దొరికిన సమాచారం విషయంలో చాలా జాగ్రత్త తీసుకోవలసివచ్చేది కేంద్ర ప్రభుత్వ హోం శాఖ ఆఫీసులోకి అడుగుపెట్టడానికి అనుమతి కావాలి ఇక దానిలోని పాతఫైల్స్ చూడ్డానికి అనుమతి మంత్రి యివ్వవలసిందే జవహర్‌లాల్ నెహ్రూ, ఆజాద్ వల్లబాయి పటేల్ ప్రభృతుల ఆశీర్వాదాలతో ప్రారంభమైన ప్రణాళిక కావడం వల్ల పోలీసు అధికారులు మాకు సర్వవిధాలా సహకరించేవారు ఒకసారి హోంశాఖ భవనంలోని రహస్యపోలీస్ విబాగంలో అడుగుపెడితే మళ్ళా సాయంకాలంవరకు బైటకు రావడానికి వీలు లేదు పోలీసు అధికారుల పర్యవేక్షణలో ఫైల్స్ చదవడం కావలసిననోట్సు వ్రాసుకోవడం చేసేవాణ్ణి దురదృష్టం ఏమిటంటే అప్పటిలో తయారుచేసిన నోట్సుని ఉపయోగించుకోకుండానే నేను ఉద్యోగంనుంచి నిష్క్రమించాను

1954 సం॥ జెనీవాలో బ్రిటిష్ సోవియట్ దేశాల సంయుక్త అధ్యక్షతలో జరిగిన అంతర్జాతీయ సమావేశంలో శాంతి పరిరక్షణ కోసం బారతదేశం కెనడా, పోలెండు దేశాలను నియమించారు ఈ సందర్భంలో భారత దేశం మిలిటరి ఆఫీసర్లను సివిల్ ఉద్యోగులను వియత్నాం పంపడానికి డిల్లీలో ఏర్పాట్లు జరుగుతున్నాయి నిజానికి వియత్నాం కమిషనులో పనిచేయడానికి బారతదేశంనుంచి పంపడంకోసం కొత్తగా ఉద్యోగాలు వేయడంలేదని తెలిసింది ఇండియన్ ఫారెన్‌సర్వీసు, ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు ఆఫీసర్లను మాత్రమే నియమిస్తున్నారని విన్నాను ఏదో ఆగ్నేయ ఆసియా చరిత్రలో లండను యూనివర్శిటినుంచి డాక్టరేటు డిగ్రీ తీసుకున్నందున వియత్నాం కంబోడియా, లావోస్ దేశాలలో నెలకొల్పిన అంతర్జాతీయ కమిషన్లలో భారత దేశంనుంచి వెళ్ళేవారిలో నాకు అవకాశం వస్తుందేమోనని ఆశపడ్డాను కాని అంతకుపూర్వమే ప్రబుత్వం సర్వీసులో ఉన్న ఉద్యోగులను మాత్రమే ఆయా కమిషన్‌లలో పనిచేయడానికి పంపుతున్నారని విని నిరుత్సాహపడ్డాను అయినా ఆశ చావలేదు పండిట్ నెహ్రూ ప్రత్యేక కార్యదర్శి ఎం ఒ మథాయ్ మిత్రుడు కావడం వల్ల అతడిని చూచి నా ఆలోచన అతడి చెవినవేసాను ప్రధానమంత్రిని చూడమని సలహా ఇచ్చాడు నెహ్రూజీని చూడ్డానికి నాకు అవకాశం కల్పించాడు అయితే నేను పార్లమెంటులోని కాంగ్రెస్‌పార్టీలో ఉద్యోగం మానివేసిన తరువాతకూడా నెహ్రూగారిని అప్పుడప్పుడు కలుసుకునేవాణ్ణి నాగురించి రెండు ముక్కలు చిన్న కాగితంపై వ్రాసి శ్రీనివాసన్ ప్రదాన మంత్రికి పంపాడు నన్ను చూచి పలకరించి ఇంగ్లండులో ఆగ్నేయ ఆసియాపై డాక్టరేటు తీసుకున్నావు కదా వియత్నాం కమిషనులో వెళ్ళరాదా? అన్నారు అయ్యా! వద్దించేవారు మీరేకదా అన్నాను అయితే ఒక దరఖాస్తు పెట్టు అన్నారు ఆయనకు నమస్కారం పెట్టి

సెలవు తీసుకున్నాను

వియత్నాంలో ఉద్యోగం కోసం పెట్టి దరఖాస్తుతో పాటు ఒక రాజకీయ నాయకుడి రికమెండేషన్ ఉత్తరంకూడా దానికి జోడించమని నెహ్రూగారి అనుయాయులు సలహా యిచ్చారు అయితే బలవంతరాయ్ మెహతా వద్దనుంచి మాత్రం ఉత్తరం తీసుకోవద్దని మథాయ్ సలహా యిచ్చారు చిత్రం ఏమిటంటే బలవంతరాయ్‌కి నేను పండిట్ నెహ్రూని చూచిన విషయం చెప్పగానే తాను రికమండేషన్ ఉత్తరం యిస్తానన్నారు అయన యిచ్చిన ఉత్తరంతో నా దరఖాస్తుని జోడించి విదేశాంగ శాఖలో ఇచ్చాను దాని ఫలితం భగవంతునిపై ఉంచి నా పనిలో నిమగ్న మయ్యాను

అనుకోకుండా ఒకరోజున విదేశాంగ శాఖనుంచి జాబు వచ్చింది కామన్‌వెల్త్ కార్యదర్శి శ్రీ యం జె దేశాయిని కలుసుకోవలసిందని ఉంది నిర్ణయించబడిన రోజున సౌత్ బ్లాక్‌లో శ్రీ దేశాయిని చూడ్డానికి వెళ్ళాను ఆయన నాలుగు సామాన్య ప్రశ్నలు అడిగి వియత్నాం వెళ్ళడానికి సిద్ధంగా వున్నావా అన్నారు మిగిలిన ఉద్యోగాలన్నీ IAS, IFS ఉద్యోగులకు ఇవ్వడానికి నిర్ణయించినట్టు, పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరు ఉద్యోగానికి నన్ను నియమించడానికి నిర్ణయించినట్టు శ్రీ దేశాయి చెప్పారు ఉద్యోగంకోసం నిర్వహించిన ఇంటర్వ్యూ అయిపోయింది ఇక ఉద్యోగనిర్వహణలో కొన్ని మెలుకువలు చెప్పారు జీతబత్యాల విషయంలో వివరాలు విదేశంగ శాఖ అడ్మినిస్ట్రేటివ్ డివిజన్‌లో కనుక్కోమన్నారు కేంద్ర ప్రభుత్వంలో ప్రధమ తరగతి ఉద్యోగంలో నన్ను ఉత్తర వియత్నాంలో హనోయ్‌లో నియమించారు అక్కడ భోజనం, మకాం కారు, ఏడాదికొకసారి నరసాపురం వరకు విమాన ఖర్చులు ప్రభుత్వమే భరిస్తుందన్నారు జీతం, ఫారెన్ అలవెన్సులు మిగుల్చుకోవచ్చు జీతం మరికొంత హెచ్చించమని అడిగాను ఫలితం లేకపోయింది వారు నిర్ణయించిన కండిషన్లతో నన్ను ఉద్యోగంలో నియమిస్తూ ఆర్డరు ఇచ్చారు వియత్నాంలో యింకా యుద్ధ పరిస్థితులు నెలకొని వున్నందున ఉద్యోగులు ఎవరూ కుటుంబాలను తీసుకువెళ్ళడానికి వీలులేదన్నారు లండను చదువు పూర్తిచేసి భారత దేశం తిరిగివచ్చిన తరువాత దొరికిన మొదటి ప్రభుత్వ ఉద్యోగం అది

నాకు వియత్నాం కమిషన్‌లో పబ్లిక్ రిలేషన్సు ఆఫీసర్‌గా ఉద్యోగమయితే దొరికింది కాని అసలు జెనీవా అంతర్జాతీయ సమావేశాలయొక్క పుర్వాపరాలు వియత్నాంలో నెలకొల్పిన ఇంటర్నేషనల్ కంట్రోలు కమిషను యొక్క స్వరూప స్వభావాలగురించి ఏమీ తెలియదు నిజానికి వియత్నాం కంబోడియా, లావోస్ దేశాలగురించి భారతదేశంలోనే

చాలామందికి తెలియదు లావోస్ ముఖ్యపట్టణమైన వియంటియాన్ పట్టణానికి లావోస్ కమిషనులో పనిచేయడానికి వెళ్ళే IFS ఆపీసర్ రాష్ట్రగవర్నర్‌ని కలుసుకోవడానికి వెళ్ళి తాను పొలిటికల్ అడ్వైజరుగా లావోస్ దేశం వెళుతున్నానని చెబితే ఆ గవర్నరుగారికి ఆ దేశం ఎక్కడుందో అంతుచిక్కలేదట అందుకే వియత్నాం, కంబోడియా లావోస్ దేశాలలో జెనీవా అగ్రిమెంటు పలితంగా నియమించిన కమిషన్లలో పనిచేయడానికి వెళ్ళే ఆపీసర్లకందరకీ డిల్లిలోని విదేశాంగశాఖవారు అయాదేశాలను గురించిన సమాచారం యిచ్చారు అదంతా శ్రద్ధగా చదివి హెనోయ్ వెళ్ళడానికి సిద్దం అయ్యాను బారత ప్రభుత్వం డిల్లీ నుంచి ప్రత్యేక విమానాల్లో మిలటరీ, సివిల్ ఆఫీసర్లను వియత్నాం కంబోడియా, లావోస్ దేశాలకు పంపించారు నేను విమానంలో హెనోయ్ పట్టణం చేరాను అక్కడ ఆపీసర్లకు మెట్రోపోల్ హోటల్‌లో మకాం ఏర్పాటు చేసారు ఆ హోటల్ హెనోయ్‌లో ప్రెంచివారు ఆ దేశాన్ని పాలించేరోజులనాటి అవశేషం ఆ హోటల్‌లో సదుపాయాలన్నీ బాగానే వున్నాయి

జెనీవా అగ్రిమెంటు ప్రకారం ఇండో చైనా దేశాలుగా వ్యవహరింపబడే వియత్నాం, కంబోడియా లావోస్ దేశాలలో అంతర్జాతీయ కంట్రోల్ కమిషన్లలో అద్యక్ష దేశం ఇండియా దానితో పాటు పోలెండు, కెనడా దేశాలు సభ్యదేశాలు పోలెండునుంచి, కెనడానుంచి కూడా మిలిటరీ, సివిల్ అదికారులు వచ్చారు శ్రీ యం జె దేశాయ్ ICS వియత్నాం కమిషన్‌కి సెక్రటరీ జనరల్, బారత ప్రతినిధి వర్గానికి చైర్మన్ అలాగే కంబోడియా కమిషన్‌కి శ్రీ జి పార్ధసారది లావోస్ కమిషన్‌కి శ్రీ జగన్నాద్ ఖోస్లా అధ్యక్షులుగా నియమించబడ్డారు నేను ఇంటర్నేషనల్ కంట్రోల్ కమిషన్‌కు పబ్లిక్ రిలేషన్సు ఆఫీసర్‌గా నియమించబడగా డా|| రంజీ షహాని హెనోయ్‌లోని బారత ప్రతినిది వర్గానికి పబ్లిక్ రిలేషన్సు ఆపీసరుగా నియమించబడ్డారు డా|| షహాని ప్రెంచి భాషను అనర్గళంగా మాట్లాడగల సమర్ధుడు ఆయనకు పూర్వాశ్రమంలో ఫ్రెంచి మహిళ భార్యగా ఉండేదట పూర్వాశ్రమంలో ఫ్రాన్స్ దేశంలో కుట్టించుకున్న సూట్లు వేసుకునేవాడు ఆయన అంత పాత సూట్లు వేసుకోవడం భారత ప్రతినిధివర్గ అద్యక్షులు శ్రీ దేశాయ్‌కి నచ్చలేదు ఆయన షహానికి అనేక సార్లు కొత్తసూట్లు కుట్టించుకోమని సలహా యిచ్చారు డా|| షహానికి ఆసలహా నచ్చలేదు చిత్రం ఏమిటంటే ఆయన వేసుకునే పాతసూట్లు శ్రీ దేశాయ్‌కి నచ్చకపోవడంతో డా|| రంజీ షహాని ఉద్యోగం ఎంతో కాలం నిలబడలేదు బారత ప్రతినిది వర్గానికి డా|| షహాని సేవలు అవసరంలేదని శ్రీ దేశాయి డిల్లీకి వ్రాయడంతో శ్రీ షహాని ఉద్యోగానికి కొద్ది కాలంలోనే స్వస్తిచెప్పారు నిజానికి మూడు ఇండోచైనా దేశాలలోని కమిషన్‌లలో

నియమించబడిన ఆఫీసర్‌లలో నేను షహాని మాత్రమే అంతకుపూర్వం ప్రభుత్వ ఉద్యోగాలు చేయనివాళ్ళం మా ఉద్యోగాలు ఆడ్‌హాక్ కావడంవల్ల మమ్మల్ని ఏ రోజునైనా ఉద్యోగంలోనుంచి తీసివేయడానికి ప్రభుత్వానికి అధికారం ఉందనే సత్యం స్పష్టమైంది

శ్రీ దేశాయ్‌తో పనిచేయడం గొప్ప అనుభవం పనిలో ఆయన్ని మెప్పించడం చాలా కష్టం ఆఫీసర్‌లంతా ఒకే హోటల్‌లో ఉన్నందున ఆయన రాత్రి 10 గంటల తరువాతకూడా ఆఫీసు కాగితాలు హోటల్‌కి పంపేవారు ఆయన IAS ఆఫీసర్ ట్రైనింగ్ వ్యవస్థకు ప్రిన్సిపాల్‌గా ఉండేవారట మాతో హెనోయ్‌లో ఉన్న IAS, IFS ఆఫీసర్లందరూ ఆయన వద్ద ట్రైనింగ్ అయినవారే కావడంవల్ల ఆయనంటే వారికందరికీ అపారమైన భక్తి ఆయన ముందు మాట్లాడ్డానికి జంకేవారు ఆయన గొప్పతనానికి భయపడనివాణ్ణి నేనొక్కణ్ణే, దానికి కారణం ఆయన గొప్పతనం తెలియక పోవడమే అయితే ఆయనతో పనిచేసిన కాలంలో ఒకటి రెండు చీవాట్లు కట్టేసరికి నాకు కూడా ఆయన సమర్థత తెలిసింది రాత్రి 10గంటల తరువాత హోటల్ గదులకు ఆఫీసు కాగితాలు పంపడం గురించి శ్రీ దేశాయ్‌ని అడిగాను ఆయన చెప్పిన కారణంవిని ఆశ్చర్యపోయాను మరుచటి రోజు ఆఫీసు సమయంలో కాగితాలు ంపితే ఆఫీసర్లు తీరికగా ఆఫీసుకి వచ్చిన తరువాత చదువుతారు తాను ఏసుకి వచ్చేసరికి వచ్చిన కాగితాలకు సమాధానాలతో సిద్ధంగా ఉండరు ని రాత్రికి పంపిన కాగితాలు ఆఫీసరు ఒకసారి చదివి మరునాడు ఆఫీసుకి వచ్చేసరికి దానికి సమాధానం తయారుచేస్తాడన్నారు

శ్రీదేశాయ్ నాకుపంపే కాగితాలపై తాను సంతకం చేసిన సమయం కూడా వ్రాసి పంపేవారు ఆయన పంపిన కాగితంపై వెంటనే చర్యతీసుకోవాలని ఆయన భావం అయితే ఒకసారి నేను కూడా ఆయన కాగితం పంపిన సమయం, దానికి నేను సమాధానం తయారు చేసినసమయం వ్రాసిపంపాను దానికి ఆయన పని తొందరగా చేసినందుకు ధన్యవాదాలు అని వ్రాసి తిరిగి పంపారు ఎన్ని పేజీలు నోట్సు పంపినా ఆయన ప్రతి అక్షరం చదివేవారు ఆయన సంతకం గొంగళి పురుగులా ఉండేది ఎన్ని పేజీలు ఉన్నా ఎక్కడో ఆయన వ్యాఖ్యలతో సంతకం ఉండేది శ్రీదేశాయ్‌కి చుట్టలు కాల్చడం సరదా ఆచుట్టలు మద్రాసు స్పెన్సర్ కంపెనీనుంచి తెప్పించుకునేవారు ఆయనకు చుట్టలు కాల్చే అలవాటు ఉందని తెలిసిన అభిమానులు ఖరీదైన చుట్టల పెట్టెలు బహూకరించేవారు

1954 ఏప్రిల్ 26 తేదీన ఇండోచైనాలో శాంతి స్థాపన అవకాశాలు చర్చించడానికి ఒక అంతర్జాతీయ సమావేశం జెనీవాలో ప్రారంభమైంది ఆ

సమావేశంలో కంబోడియా, డెమోక్రాటిక్ రిపబ్లిక్ ఆప్ వియత్నాం ఫ్రాన్స్ లావోస్ పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా, స్టేట్ ఆప్ వియత్నాం, సోవియట్ యూనియన్, బ్రిటన్, అమెరికా పాల్గొన్నాయి 1954 జూలై 20 వతేదీన వియత్నాంలో పోరాటం ఆపడానికి అంగీకరిస్తూ ఫ్రెంచి యూనియన్ సైన్యానికి వియత్నాం సైన్యానికి మద్య ఒక అంగీకారం కుదిరింది దాని ప్రకారం ఉభయపక్షాలు యుద్ధం ఆపడానికి అంగీకరించాయి వియత్నాం17వ సమాంతర రేఖవద్ద తాత్కాలికంగా విభజించడానికి అంగీకరించారు 17వ సమాంతరరేఖకి దక్షిణ బాగం ఫ్రెంచి సైన్యాదికారంలోను, ఉత్తరబాగం పీపుల్స్ ఆర్మీ ఆప్ వియత్నాం ఆదీనంలోనూ ఉంటాయి ఈ యుద్ధ విరమణ అంగీకారం ప్రకారం ఇరుపక్షాల సైన్యాలు 17 వ సమాంతర రేఖకు యిరుప్రక్కల నిర్ణయించిన బాగాలలోనికి ఉపసంహరించుకోవాలి వియత్నాంలో సార్వత్రిక ఎన్నికలద్వారా దేశానికి ఐక్యతను సాదించేవరకు ఉత్తరాన పరిపాలన పీపుల్స్ ఆర్మీ దక్షిణాన ఫ్రెంచి సైన్యాదీనంలోను ఉంటుంది

జెనీవా అగ్రిమెంటుమీద సంతకాలు చేయడానికి ముందే జూన్17, 1954 న ఫ్రెంచి ప్రభుత్వం న్గోడిన్ డియమ్‌ని దక్షిణ వియత్నాం ప్రభుత్వానికి ప్రధానమంత్రిగా నియమించింది వెంటనే అమెరికన్ అద్యక్షుడు ఐసెన్ హోవర్ దక్షిణ వియత్నాంకి తమ పూర్తి మద్దతు ప్రకటించారు డియమ్ అక్టోబరు 26, 1955న స్టేట్‌ఆఫ్ వియత్నాంని రిపబ్లిక్‌గా ప్రకటించి దానికితాను ప్రథమ అద్యక్షుణ్ణని ప్రకటించుకున్నారు అమెరికను మద్దతుతో డియమ్ దక్షిణవియత్నాంలో ఫ్రెంచివారి అధికారానికి స్వస్తిపలికాడు

జెనీవా అగ్రిమెంటు పుణ్యమా అంటూ అంతవరకు కొండలలోను, కోనలలోను కాలక్షేపం చేసే వియత్నాం ప్రజా సైన్యాలు వారినాయకుడు హోఛిమిన్ ఆధ్వర్యంలో హెనోయ్‌లో ప్రవేశించారు ఉత్తరవియత్నాంలో పరిపాలనా సౌలభ్యం కోసం హోఛిమిన్ అధ్యక్షుడుగా ప్రభుత్వం ఏర్పాటయింది వియత్నాం "తాత్కాలికంగా" 17వ సమాంతర రేఖవద్ద విభజించబడింది 17 వసమాంతర రేఖకు ఇరుప్రక్కల రెండు స్వతంత్ర రాజ్యాలు ఏర్పాటయ్యాయి

వియత్నాం సమస్యకు పునాదులు 1884లో ఫ్రెంచివారు ఇండో చైనాను ఆక్రమించడంతో వేయబడ్డాయి ఫ్రెంచివారు వియత్నాంను మూడుబాగాలుగా విభజించారు ఉత్తరాన టాంకిన్‌కి హెనోయ్ ముఖ్యపట్టణంగాను, మద్యప్రాంతంలోని అన్నాంకి హుయే ముఖ్యపట్టణంగాను, దక్షిణాన కొచ్చిన్ చైనా మీకాంగ్ డెల్టాతో పాటు సైగాన్ పరిపాలనా ముఖ్యకేంద్రంగా విభజన

జరిగింది కాని వియత్నాంలో ఫ్రెంచి వలసపాలనకు మొదటినుంచి వ్యతిరేకత ఉండేది ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో జపాను సైన్యాలు వియత్నాంని ఆక్రమించుకున్న సమయంలోనే "వియట్‌మిన్" ఉద్భవించింది 1943లో జియప్ ఆద్వర్యంలో పీపుల్స్ ఆర్మీ ప్రారంభించబడింది

ద్వితీయ ప్రపంచయుద్ధంలో జపాను ఓడిపోవడంతో అమెరికా, సోవియట్ యూనియన్, బ్రిటన్ దేశాలు 1945లో పోట్స్ డామ్ సమావేశంలో వియత్నాంను 16వ సమాంతర రేఖవద్ద విభజించి దానికి దక్షిణభాగంలో బ్రిటన్, జపాను సైన్యాల లొంగుబాటును, దానికి ఉత్తరాన చైనా జపాను సైన్యాల లొంగుబాటును అంగీకరించాలని నిర్ణయించారు అయితే బ్రిటిష్ సైన్యాలుకాని సైన్యాలుకాని వెంటనే రంగంలో దిగలేదు అంతలో 1945 సెప్టెంబరు 2వ తేదీన వియట్‌మిన్ హెనోయ్ ముఖ్యపట్టణంగా వియత్నాంకి అంతటికి వర్తించే విదంగా డెమోక్రాటిక్ రిపబ్లిక్ ఆఫ్ వియత్నాం ప్రభుత్వాన్ని నెలకొల్పింది అయితే బ్రిటిష్ సైన్యాధికారి జపాను వారు నిర్బంధించిన ఫ్రెంచివారిని విడిపించి వారికి 16వ సమాంతర రేఖకు దక్షిణాన అధికారం అప్పగించి బ్రిటిష్ వియత్నాంనుంచి నిష్క్రమించారు అక్కడ ఉత్తర వియత్నాంలో చైనా సైన్యాదికారులు వియటుమిన్‌కి పాలనా వ్యవహారాలు అప్పగించి తటస్తంగా ఉండిపోయారు

ఫ్రెంచిప్రభుత్వం వియత్నాంలో టాంకిన్ అన్నాం కొచ్చిన్ చైనాతో కలిపి వియత్నాం స్టేట్ అనే పేరుతో ఫ్రెంచి యూనియన్‌లో భాగంగా ఏర్పాటుచేసింది దానికి మాజీ వియత్నాం చక్రవర్తి బావొదాయ్ నాయకులు కాని చైనా మద్దతుతో వియటుమిన్ అమెరికా మద్దతుతో ఫ్రాన్సు హోరా హోరి యుద్ధం చేసాయి ఆ యుద్ధాన్ని ఆపి శాంతి నెలకొల్పడానికే జెనీవా సమావేశం ఏర్పాటు చేయబడింది జెనీవా సమావేశానికి ముందురోజున వియత్నాం పీపుల్స్ ఆర్మీ ఉత్తరాన డియన్‌బియన్ ఫూయుద్ధంలో ఫ్రెంచి సైన్యాలపై అఖండ విజయం సాదించింది

జెనీవా సమావేశంలో ఉత్తర దక్షిణ వియత్నాం ప్రభుత్వాలమధ్య సంబంధాలు స్పష్టంగా వ్రాయబడ్డాయి జెనీవా అంగీకారాన్ని నిర్వహించడంలో తోడ్పడడానికి ఇండియా, కెనడా పోలెండు దేశాలకు బాధ్యత అప్పగించారు అంగీకారం ప్రకారం ఇరుపక్షాలు విదేశీయుద్ధ స్థావరాలు నెలకొల్పకూడదు యుద్ధసామగ్రి కాని సైన్యాలను కాని దిగుమతి చేసుకోకూడదు యుద్ధఖైదీలను 30 రోజులలో విడుదల చేయాలి ఇరుపక్షాలు యుద్ధసమయంలో ఎదుటి పక్షాన్ని సమర్థించారనే నెపంమీద ఎవరిపైనా కక్ష సాదింపు చర్యలు తీసుకోకూడదు ఇంటర్‌నేషనల్ కంట్రోల్ కమిషన్‌కి

అప్పగించిన బాధ్యతలలో విదేశీయుద్ధ పరికరాలు దేశంలోనికి రాకుండా చూడడం ముఖ్యమైనవి దానిని సమర్థవంతంగా నిర్వహించడానికి వీలుగా ఉత్తరాన 7, దక్షిణాన 7మొత్తం 14ఫిక్స్డు పాయింట్లు నిర్ణయించారు ఆగష్టు 11, 1954న నియమించబడిన ఇంటర్నేషనల్ కమిషను తమ బృందాలను జనవరి 1955 నాటికి నెలకొల్పగలిగింది ప్రతిబృందంలోను భారతీయ, కెనేడియన్ పోలిష్ మిలటరీ ఆఫీసర్లు ఉంటారు వాటిని ఫిక్స్డు టీములనేవారు అవికాక మిగిలిన కార్యక్రమాలు నిర్వహించడానికి మొబైల్ టీమ్సు ఉండేవి వాటిని అవసరాన్ని బట్టి కమిషనులోని మూడు దేశాల అధికార్లతో నియమించేవారు ప్రతి బృందంతోను ఒక ఫ్రెంచి ఒక వియట్మిన్ ఆఫీసరు ఉండేవారు కమిషనులో కార్యకలాపాలకు, చర్చలకు ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు అధికారిక భాషలుగా గుర్తింపబడ్డాయి వియట్మిన్ అధికారులకు ఫ్రెంచి భాష వచ్చును కాని కమిషనులోని భారతీయులకు ఫ్రెంచి భాష రానందున జెనీవానుంచి ఫ్రెంచి, ఇంగ్లీషు భాషా దుబాసీలను హెనోయ్కి దిగుమతి చేసుకునేవారు వారిలో పురుషులు స్త్రీలు కూడా ఉండేవారు వారి జీతాలు అంబాసిడరు జీతం కంటే హెచ్చుగా ఉండేవి జెనీవా దుబాసీలవద్ద నా ఫ్రెంచి భాషా పరిజ్ఞానానికి మెరుగులు దిద్దడానికి ప్రయత్నించి విఫలమయ్యాను

హోచిమిన్ నాయకత్వంలో వియత్నాం ప్రజాసైన్యాలు హెనోయ్ పట్టణంలో ప్రవేశిస్తారని తెలియడంతో పట్టణంలోని ప్రజలలో కలవరం పుట్టింది పెద్దవ్యాపారులు, ధనవంతులు కమ్యూనిస్టులు హెనోయ్లో పరిపాలన చేస్తారు కాబట్టి తమ ఆటలు సాగవనే నమ్మకంతో హెనోయ్ వదలి దక్షిణ వియత్నాం ముఖ్యపట్టణం సైగాన్కి వెళ్ళిపోయారు ఫ్రెంచివారి ఆధ్వర్యంలో నిర్వహించబడే వ్యాపారాలు, బార్లు, డాన్సింగ్ హాల్సు మూతపడ్డాయి వాటితో పాటు వ్యభిచారగృహాలుకూడా మూసివేసారు వాటిలో ఉండే వందలాది మహిళలు జీవనోపాధి వెతుక్కుంటూ సైగాన్ పట్టణం చేరారు ఇదంతా వియత్నాం ప్రజాసైన్యం హెనోయ్ పట్టణంలో అడుగు పెట్టడానికి ముందే జరిగింది అయితే చివరి నిమిషం వరకు అసందిగ్ధంగా ఉండిపోయినవారికి కూడా జెనీవా అగ్రిమెంటు ప్రకారం హెనోయిలో ఉండడం ఇష్టం లేకపోతే కమిషను సహాయంతో హెనోయ్ వదలిపెట్టి వెళ్ళిపోవడానికి అవకాశం కల్పించబడింది కాని కమ్యూనిస్టులు హెనోయ్లో కూర్చుని ఉత్తర వియత్నాంని పాలిస్తే ఆపాలనలో తాము హెనోయ్లో ఉండడం క్షేమంకాదని, సాధ్యంకాదని ఊహించిన వారంతా ఉత్తర వియత్నాం వదలిపెట్టిపోయారు జెనీవా అగ్రిమెంటు అమలులోనికి వచ్చిన తరువాత 30 రోజులవరకు ఉత్తర వియత్నాం నుంచి దక్షిణానికి కాని

దక్షిణ వియత్నాం నుంచి ఉత్తర వియత్నాంకికాని మకాం మార్చదలచుకున్న వారికి ఆ ప్రభుత్వం దారిఖర్చులు ఇచ్చి వారికి ప్రయాణ సౌకర్యం కల్పించాలని ఆ అగ్రిమెంటులో ఉంది దానిని అమలుపరచే బాధ్యత కమిషను అధికారులది చాలావరకు జెనీవా అగ్రిమెంటు అమలులోనికి రావడానికి ముందే ప్రజలు తమకు నచ్చిన ప్రాంతాలకు వెళ్ళిపోయారు అలా ముందుగా జాగ్రత్తపడనివారు కమిషను అధికారులకు సమస్యగా తయారయ్యారు ఉత్తరవియత్నాం అధికారులు దక్షిణానికి వెళ్ళాలనేవారిని అంత సులభంగా వదలేవారు కాదు ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలనుంచి క్రైస్తవులు దక్షిణ వియత్నాం వెళ్ళడానికి చేసిన ప్రయత్నం కమిషనులో అధికారులకు అగ్ని పరీక్ష అయింది కమిషనులో ఉన్న కెనడా అధికారుల కమ్యూనిస్టు వ్యతిరేకత అందరికి తెలిసినదే ఇక పోలిష్ అఫీసర్లు ఉత్తరవియత్నాంకి పూర్తి మద్దతు ఛైర్మన్ స్థానంలో ఉన్న భారతీయ అధికారులు తమ తెలివితేటలు ఉపయోగించి మధ్యవర్తిత్వం నెరపవలసి వచ్చేది

ఫ్రెంచి వలసపాలన పుణ్యమా అని వియత్నాంలో ధనికవర్గాలు లాసజీవతానికి అలవాటుపడిపోయారు ఉత్తర వియత్నాంలోని నైట్‌క్లబ్బులు, ాన్సుహాల్స్, వ్యభిచారగృహాలు హోచిమిన్ సైన్యాలు స్వాధీనం ేనుకోవడంతో హెనోయ్‌లో అవన్నీ మూతపడ్డాయి వారంతా దక్షిణ వియత్నాంలోని వివిధ పట్టణాలకు వెళ్ళిపోయారు వారిలో చాలామంది సైగాన్ నగరంలో నివాసమేర్పరచుకున్నారు దానితో సైగాన్ నగరం విలాసజీవితానికి కేంద్రమయింది

సైగాన్ పట్టణంలో చోలాన్ చైనాటౌన్ క్రింద పరిగణింపబడేది అక్కడ అన్నీ చైనీస్ రెస్టారెంట్లే బ్రహ్మాండమైన చైనీస్ భోజనం దొరికేది ఒకరోజు చోలాన్‌లో అమెరికన్ మిత్రుడు జో నెర్బోన్‌తో తిరుగుతుంటే ఒక రెస్టారెంటు బైట పంజరంలో మొసలి, కోతి మొదలైన జంతువులు కనిపించాయి నా అమెరికన్ మిత్రునికి చైనీస్ భాష వచ్చును ఆపంజరంలో ఉన్న జంతువులతో ఏమి చేసిపెడతాడో అడగమన్నాను విదేశీయులు భోజనానికి వచ్చారనుకుని ఆయజమాని మొసలిపిల్లతో సూప్ చేసిపెడతానని కోతిమెదడు తన రెస్టారెంట్ ప్రత్యేకత అని చెప్పడం ప్రారంభించాడు నాకు మొసలి సూప్ కొత్త కాదు కాని కోతి మెదడు ఎలా వండుతాడో అడగమన్నాను అది వండరు దానిని పచ్చిదిగానే తింటారట అతడు దానిగురించి చెబుతుంటే నాకు జుగుప్స, అసహ్యం కలిగింది

సైగాన్‌లో నాకు చాలా ఆశ్చర్యం కలిగించిన విషయం పోలీసుశాఖ నిర్వహించే వ్యభిచారగృహాలు ఆ వ్యభిచారగృహాల బైట పోలీసువారు

కాపలా ఉంటారు లోపలకు వెళ్ళడానికి టిక్కెట్లు కూడా వారే అమ్ముతారు ఆతరువాత లోపలకు వెళ్ళి బీరుత్రాగుతూ చుట్టూచేరిన అమ్మాయిలలో మీకు నచ్చిన వారిని ఎంచుకోవచ్చు అయితే ఈ పరిస్థితి ఎంతోకాలం కొనసాగలేదు దక్షిణవియత్నాం అధ్యక్షుడు న్గోడిన్ డియం వదినగారికి ప్రభుత్వం వ్యభిచారగృహాలు నిర్వహించటం నచ్చలేదు ఉత్తరవియత్నాంలో హోచిమిన్ వ్యభిచారగృహాలను నిషేదించగా లేనిది తాముకూడా ఎందుకు చేయలేమని ఆలోచించింది అంతే దక్షిణ వియత్నాంలో వ్యభిచారగృహాలు నిషేదించబడ్డాయి వేలాదిమంది స్త్రీలు వీదినపడ్డారు ఆ గృహాలు ఎత్తివేసేముందు ఆవృత్తి మీద ఆదారపడ్డ మహిళలకు ప్రత్యామ్నాయ జీవనోపాది చూపించకపోవడంతో వారు వీదినపడ్డారు ఫ్రెంచి పాలనాపద్ధతి ప్రకారం ఉద్యోగులు మద్యాహ్నసమయంలో "సియాస్తా" (పగటి నిద్ర) తీసుకునే సమయంలో వ్యభిచారులు హోటళ్ళకు వెళ్ళేవారు ఈ విషయం పసికట్టిన అద్యక్షుడు సైగాన్‌లోని హోటల్ యజమానులకు వ్యభిచారులను హోటల్స్ లోనికి రానివ్వకూడదని ఆజ్ఞలు జారీచేసారు

ఈ సందర్భంలో ఒక సన్నివేశం మర్చిపోలేను అప్పట్లో లావోస్ కమిషన్ అద్యక్షుడుగా శ్రీ సేన్ ఐ.సి.యస్. ఉండేవాడు ఆయన భార్య అందాల బరిణె లావోస్ ముఖ్యపట్టణం వియన్‌టియాన్ అమెకు పల్లెటూరుగా అనిపించింది అందువల్ల అవకాశం ఉన్నప్పుడల్లా సైగాన్ వచ్చి ఒకటి రెండురోజులు నైట్‌క్లబ్బులు డాన్సుహాల్స్ లో ఆనందించి వెళ్ళేవారు ఒక రాత్రి అంబాసడర్ సేన్ ఆయనబార్యా డాన్సు హాల్ నుంచి హోటల్‌కి తిరిగివచ్చారు ఆమె లావోషియన్ స్త్రీలు వేసుకునే డ్రస్సులో ఉంది హోటల్ వద్ద డ్యూటీలోఉన్న పోలీస్ అదికారి సేన్‌తో ఉన్న స్త్రీ హోటల్‌లోనికి వెళ్ళడానికి వీలులేదన్నాడు అంబాసిడరు సేన్‌కి బ్రహ్మాండమైన కోపం వచ్చింది ఆమె తన బార్య అని తాను పలానా అని పోలీసు అదికారిని నమ్మించడానికి ప్రయత్నించి విఫలమయ్యాడు అప్పుడు సైగాన్‌లో అదేహోటల్ లో మకాంచేసిన నా గదిలో టెలిఫోన్ మ్రోగింది నేను అప్పుడు వియత్నాం కమిషన్‌లో డెప్యూటి సెక్రటరీ జనరల్‌గా పనిచేస్తున్నాను నేను క్రిందికివచ్చి సేన్ గారితో ఉన్న ఆమె ఆయన బార్యే అని చెబితేకాని ఆ పోలీసు అదికారి ఆ దంపతులను హోటల్‌లోనికి వెళ్ళనివ్వలేదు

హెనోయ్‌లో వియెట్‌మిన్ ప్రభుత్వం స్థాపించడంతో ఉత్తర వియత్నాంలో సాంఘిక జీవనసరళిలో అనేక మార్పులువచ్చాయి కమిషను అదికారులు తమ కార్యకలాపాలు నిర్విరామంగా నిర్వహిస్తున్నారు బారతీయులు, కెనెడియన్లు పోలిష్ అదికారులు తమ విదినిర్వహణానంతరం

ఎవరి జాతీయులతో వారు కాలక్షేపం చేసేవారు కమిషను సమావేశాలు, ఆఫీసుపని తరువాత హోటల్‌లో ఎవరిదారి వారిది హెనోయ్‌లో సరస్సు చూట్టూ తిరగడం తప్ప మరొక ఆకర్షణలేదు అందుమూలంగా ఆకర్షణీయమైన కాలక్షేపానికి కమిషను ఆఫీసర్లు తరచు దక్షిణవియత్నాం ముఖ్యపట్టణం సైగాన్‌కి వెళ్ళేవారు అంతేకాకుండా కమిషను యావత్తు అప్పుడప్పుడు తమ సమావేశాలకోసం సైగాన్‌కి తరలివెళ్ళేది. ఉత్తరాన హెనోయ్ నుంచి దక్షిణాన సైగాన్‌కి వెళ్ళడానికి కమిషను ఒక విమానాన్ని అద్దెకు పుచ్చుకుంది ఆ విమానం ఎయిర్ ఫ్రాన్సువారిది అది ప్రతిరోజు హెనోయ్‌లో బయలుదేరి లావోస్‌లోని వియన్‌టియాన్ కంబోడియాలోని నాంపెన్ పట్టణాలమీదుగా సైగాన్ వెళ్ళేది వియత్నాం కమిషను నుంచి వెళ్ళినట్టే లావోస్, కంబోడియా కమిషన్లలో పనిచేసే బారతీయ, కెనేడియన్, పోలీష్ ఆఫీసర్లుకూడా కమిషన్ విమానంలో సైగాన్ వెళ్ళేవారు

సైగాన్ పట్టణానికి అప్పటికి ఇంకా ఫ్రెంచి వాసన వదలలేదు హోటల్ ముందుబాగంలో కూర్చుని బీరుత్రాగుతూ కబుర్లు ఆడి భోజనం చేసి అనంతరం సియాస్తా (మధ్యాన్న నిద్ర) తీసుకుని సాయంకాలం మళ్ళా కబుర్లతో కాలక్షేపం రాత్రి పడగానే డాన్సుహాల్స్ కి ప్రయాణం సైగాన్‌లో చాలా డాన్సుహాల్స్ ఉండేవి వాటిన్నిటిలోను మనం డాన్సు చేయవచ్చు అది పాశ్చాత్య డాన్సు సాధారణంగా డాన్స్ చేయడం రానివారు ఉండేవారు కాదు కాని డాన్సుచేయడం రాకపోయినా డాన్సుహాల్‌కి వెళ్ళి ఒక అమ్మాయిని తోడుగాపెట్టుకుని మిగతావాళ్ళు డాన్సు చేస్తూఉంటే చూచి ఆనందించవచ్చు ఆ డాన్సుహాల్సులో ఉండే వియత్నాం అమ్మాయిలు అంతా పాశ్చాత్యడాన్సుల్లో సిద్ధహస్తులు ప్రతి యజమానికి కొంతమంది అమ్మాయిలు తనహాలులో డాన్సుపార్ట్‌నర్సుగా వ్యవహరించడానికి ఉంటారు హాలులోనికి వెళ్ళి కూర్చోగానే డ్రింకు ఆర్డరు చేసిన తరువాత డాన్సు పార్ట్‌నర్‌గా అక్కడ నిలబడ్డ అమ్మాయిలలో మనకు ఇష్టం వచ్చిన అమ్మాయిని ఎన్నుకోవచ్చు ఆ అమ్మాయి మీతోపాటు కూర్చుని మీరు ఏ డ్రింకుత్రాగితే అదే త్రాగుతుంది ఆమె మీతో డాన్సు చేస్తుంది సామాన్యంగా గంటలప్రకారం వారిని ంచుకుంటారు ఆ అమ్మాయిలకు వియత్నామీస్ బాష, కొద్దిగా ఫ్రెంచి తప్ప ంగ్లీషు రాదు కాబట్టి వారితో మాట్లాడ్డానికి వియత్నామీస్ కాని ఫ్రెంచికాని చ్చిఉండాలి నిజానికి డాన్సు చేయడం చేతకానివారికి సైగాన్ పట్టణంలో ండా కాలక్షేపానికి కరువే!

సైగాన్ లోని వ్యబిచారగృహాలు మూతపడడంతో ఆ గృహాలలో ఉండేవారిలో చాలామంది నాంపెన్ వియంటియాన్ పట్టణాలకు

తరలివెళ్ళారు కాని కంబోడియా లావోస్ దేశాలు వారి వృత్తిని ప్రోత్సాహించి వారికి జీవనో పాది కల్పించడానికి తగినంత పెద్దదేశాలు కావు నాంపెన్ పట్టణంలోని డాన్సుహాల్స్‌లో ఉండే కంబోడియా అమ్మాయిలతో వియత్నామీస్ అమ్మాయిలు పోటీ పడలేకపోయారు నాంపెన్ పట్టణంలో సాయంకాలం కాలక్షేపానికి డాన్సుకోసం వెళ్ళడానికి ఒక ప్రత్యేకత ఉంది మీకాంగ్ నదిపైన నిలబెట్టిన పెద్దపడవలను బ్రహ్మాండంగా అలంకరించి వాటిని డాన్సు హాల్సుగా ఉపయోగించుకుంటారు ఇక డాన్సు పార్టనర్లుగావచ్చే కంబోడియన్ అమ్మాయిలు మత్తెక్కించే మంచిగంధం వాసనకొడతారు అది వారి ప్రత్యేకత వారు మంచిగందంతో నలుగు పెట్టుకుని స్నానం చేస్తారట అందుమూలంగా వారు ఆకర్షణీయమైన సువాసనలు వెదజల్లుతూ ఉంటారు వారితో డాన్సు చేయడం చక్కటి అనుభూతి

ఉత్తర వియత్నాం హోచిమిన్ అధ్యక్షతన పరిపాలనా బాధ్యతలు స్వీకరించినా ముఖ్యపట్టణమైన హెనోయ్‌లో కూడా వ్యాపార వ్యవహారాలు ఏమిలేవు షాపులన్నీ అయ్యవార్లంగారి నట్టిల్లులా ఖాళీగా ఉండేవి దక్షిణవియత్నాం ముఖ్యపట్టణమైన సైగాన్‌లో దొరకని వస్తువులేదు సైగాన్‌లో బారతీయ వ్యాపారులు అన్ని వ్యాపార రంగాలలోను ఉండేవారు కాని కమ్యూనిస్టులు పరిపాలనలోనికి వచ్చిన తరువాత వారంతా దక్షిణ వియత్నాంకి వెళ్ళిపోయారు హెనోయ్‌లో ఫోటో కాపీలు తీయడానికి కావలిసిన కాగితం కూడా దొరికేది కాదు అదికూడా సైగాన్ నుంచి తెచ్చుకోవాలి కాని ఉత్తర వియత్నాం ప్రజలు 17వ అక్షాంశ రేఖదాటి దక్షిణానికి వెళ్ళడం నిషేదం వారు సైగాన్‌లో కనబడితే ఇక ఇంటికి తిరిగి రావటం ఉండదు ఆ పరిస్థితులలో హెనోయ్‌లోని వ్యాపారులు అంతర్జాతీయ కమిషన్‌లోని పోలిష్ ఇండియన్ సిబ్బందిమీద ఆధారపడేవారు

ఉత్తర వియత్నాంలో చెలామణీ అయ్యే కరెన్సీ డాంగ్‌లు వాటికి విలువ ఉండేదికాదు అవి ఉత్తర వియత్నాంలో తప్ప మరెక్కడా చెల్లేవి కావు అయితే దక్షిణ వియత్నాంలో చెలామణీలో ఉన్న కరెన్సీ పియస్త్రా దానికి ఫ్రెంచి ఫ్రాంక్ తోను అమెరికన్ డాలరుతోను సంబంధం ఉండేది అయితే యుద్ధకాలంలో ఉత్తర వియత్నాం సేనలు అపారమైన ప్రియస్త్రా నిల్వలు సంపాదించుకున్నారు హెనోయ్‌లోని వ్యాపారస్తులు భారతీయ సిబ్బందికి కాని పోలిష్ సిబ్బందికి కాని పియస్త్రాలిచ్చి తమకు కావలసిన సరుకులు సైగాన్ నుంచి తెప్పించుకునేవారు ఆ పద్ధతి పుణ్యమా అంటూ హెనోయ్‌లో వ్యాపారం అబివృద్ధి చెందింది కాని ఆ విదంగా సైగాన్‌నుంచి తమకు కావలసిన సరుకులు తెచ్చినవారి సహాయానికి ప్రతిఫలం ఇవ్వడం వారికి

గొప్ప సమస్య అయింది చేసిన సహాయం యొక్క ప్రాముఖ్యతనుబట్టి తృణమో పణమో బంగారం వారికి ముట్టచెప్పేవారు ఈ పద్ధతి కొంతకాలం జరిగింది

ఉత్తర వియత్నాంలో పియాస్త్రా నిల్వలు ఉన్నాయని తెలుసుకున్న దక్షిణ వియత్నాం పాలకులు పాత పియస్త్రాలను సైగాన్‌లో నిర్ణీత ప్రదేశాలలో మార్చుకుని కొత్త పియస్త్రాలు పొందవచ్చునని ప్రకటించారు దాని వల్ల దక్షిణ వియత్నాం ప్రజలకు వచ్చిన యిబ్బంది ఏమీలేదు ఆ ప్రభుత్వం తీసుకున్న చర్య ఉత్తర వియత్నాంవద్ద ఉన్న పియస్త్రా నిల్వలను నిరుపయోగం చేయడానికి సంకల్పించింది వారు ఊహించిన విధంగానే ఉత్తర వియత్నాం పాలకవర్గంలో కలకలం బయలుదేరింది తమవద్దనున్న పియస్త్రా నిల్వలు ఈ చర్యతో నిరుపయోగం అయిపోతాయి అలాకాకుండా చేయాలంటే తమవద్ద నున్న పియస్త్రాలను సైగాన్ లో మార్చుకోవాలి అది ఎలా సాద్యం అవుతుందని విషయంలో తర్జన భర్జనచేసి వారొక ప్లాను వేసారు అంతర్జాతీయ కమిషన్‌లో ఆర్థిక వ్యవహారాలు పర్యవేక్షించడానికి ఒక బారతీయ అదికారి ఉన్నారు అప్పట్లో రామచంద్రన్ కమిషన్ ఆర్థిక వ్యవహారాల అధికారి బారతీయుడే అయినా అతడు జెనీవా సమావేశానికి అధ్యక్షత వహించిన బ్రిటిష్, రష్యన్ విదేశాంగ మంత్రులకు మాత్రమే బాద్యుడు కమిషన్ చైర్మన్‌గా ఉండే బారత రాయబారికి కూడా అతడిపై ఏ విదమైన అధికారం లేదు ఈ మతలబు తెలిసిన వియట్ మిన్ నాయకులు తమ పియస్త్రాలను సైగాన్ లో మార్చి పెట్టమని రామచంద్రన్‌ని అడిగారు ఆ పని నకు సాద్యంకాదని రామచంద్రన్ వాళ్ళకు చెప్పి ఎందుకైనా మంచిదని ఆ షయం కమిషన్ చైర్మన్ చెవిన వేసాడు

శ్రీ రామచంద్రన్ బారత ప్రభుత్వంలో డిఫెన్సు అక్కౌంట్సు కంట్రోలరుగా ఉండేవాడు అతడు మళయాలీ స్నేహశీలి, చాలా మంచివాడు అతడు ట్రాన్స్‌పర్ అయిన తరువాత కమిషన్ అక్కౌంట్స్ కంట్రోలర్‌గా శ్రీమూర్తి వచ్చారు ఆయన బారత ప్రభుత్వ ఫైనాన్స్ శాఖలో జాయింట్ సెక్రటరీగా ఉండేవాడు అప్పటికి నేను డెప్యూటి సెక్రటరీ జనరల్ (అడ్మినిస్ట్రేషన్) స్థానంలో ఉన్నాను నేను అనుమతించిన ఖర్చుకి మూర్తి గారు ఏవో అభ్యంతరాలు వ్రాసేవారు నా గదిలోనుంచి ఆయన గదిలోకివెళ్ళి అబ్యంతరం చెప్పారు, దానికి నేను చెప్పవలసిన సమాదానం కూడా చెప్పమనేవాణ్ణి మూర్తిగారు తెలంగాణా ఆంధ్రుడు మంచిమిత్రుడు

వియట్‌మిన్ నాయకులు తమ తెలివితేటలు అన్నీ ఉపయోగించి తమవద్దనున్న పాత పియస్త్రాలకు కొత్త పియస్త్రాలు సంపాదించారు ఈ పని

వారు ఎలా సాధించారనే విషయం భారత ప్రతినిధి వర్గంలో చర్చనీయాంశం అయింది రామచంద్రన్ యిచ్చిన సూచనమేరకు భారత ప్రతినిధివర్గంలోని "ఏక్యూ" అధికారి కల్నల్ రణసింగ్ రంగంలోకి దిగి ఆ రహస్యాన్ని ఛేదించాడు ఉత్తర వియత్నాం నాయకులు తమపని చేయడానికి భారత ప్రతినిధి వర్గంలోని సైనికాధికారుల సహాయం అర్థించారు వారిలో కొందరు ట్రంకు పెట్టెలలో కరెన్సీ తీసుకువెళ్ళి అక్కడ భారతీయ వ్యాపారస్తులద్వారా పాత పియస్ట్రాలు మార్చి కొత్తవి తెచ్చిపెట్టారు అంతసహాయం చేసిపెట్టినవారికి ఉత్తర వియత్నాం ముట్టచెప్పగలిగిన ప్రతిఫలం బంగారం మాత్రమే ఈ కరెన్సీ మార్పిడిలో సహాయంచేసిన ఆఫీసర్లు కల్నల్ రణసింగ్ ముందు తాము చేసిన పనిని అంగీకరించారు ఇదంతా పైకి చెప్పుకుంటే మన పరువు పోతుందనే ఉద్దేశంతో దానిలో పాత్ర ఉన్న మిలిటరీ అధికారులను భారతదేశానికి పంపివేసారు అయితే వారంతా భారతదేశానికి వెళ్ళేముందు తమకు ముట్టిన బంగారాన్ని భారత దేశం ఎలా తీసుకువెళ్ళాలనేది వారికి పెద్ద సమస్య అయింది ఆ సమస్యనుకూడా వారు పరిష్కరించారు దానికోసం వారు అవలంభించిన పద్ధతులు చెప్పుకుంటే కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతున్నట్టవుతుంది

ఈ సందర్భంలో ఒక సన్నివేశం మాత్రం మరపురాదు ఉత్తర వియత్నాం తమవద్దనున్న పియస్ట్రాలను మార్చేసుకున్నారనే విషయం తెలిసిన దక్షిణ వియత్నాం నాయకులు ఆశ్చర్యపోయారు దాని ఫలితంగా అంతవరకు కమిషన్ విమానాన్ని కస్టమ్సు పరిధినుంచి తప్పించిన నిర్ణయం సైగాన్ విమానాశ్రయంలో మార్పు చేసారు కమిషన్ అధికారులకు కస్టమ్సు పరిశీలనను ప్రవేశపెట్టారు దానితో ఒక భారత సైనికాధికారిని సైగాన్ విమానాశ్రయంలో బంగారం తీసుకు వెళుతున్నాడన్న నేరంపై విమానాశ్రయంలో ఉంచి సైగాన్‌లోని కమిషన్ అధికారికి టెలిఫోన్‌చేసి విషయం విశదపరిచారు భారత సైనికాధికారికి విమానాశ్రయాధికారులు జరిమానా విధించారు భారత ప్రతినిధి విమానాశ్రయానికి వచ్చి భారత సైనికాధికారిని కలిసి వాళ్ళు విధించిన జరిమానా విషయం చెప్పాడు వెంటనే ఆ అధికారి తన టార్చిలైటులో ఉన్న బంగారుముక్కలు యిచ్చి వాటిని అమ్మి తన జరిమానా కట్టమన్నాడు

వియత్నాం కమిషన్‌కి ప్రథమ చైర్మన్ శ్రీ దేశాయ్ భోజనానికి ముందు మార్టీనీలు త్రాగేవారు భోజనానంతరం ఆయన జావాడానస్ చుట్ట వెలిగించేవారు ఆయన ముందు నా తోటి ఆఫీసర్లు ఎవరూ సిగరెట్టు కూడా త్రాగేవారు కాదు అయితే నేను భోజనానికి వెళ్ళినరోజున మాత్రం అహ్మద్

రెండు చుట్టలు టేబుల్‌మీద పెట్టేవాడు శ్రీ దేశాయి రెండవచుట్ట ఎవరికని అడిగితే మూర్తిగారు కూడా చుట్టకాలుస్తారని చెప్పేవాడు చుట్టసగం కాల్చిన తరువాత ఆయన మేడమీదకు వెళ్ళిపోయేవారు ఆ అలవాటు కనిపెట్టి ఆయన చుట్ట నగం కాల్చేసరికి మేమే ఆయనవద్ద సెలవు తీసుకొనేవాళ్ళం శ్రీ దేశాయి తరువాత అంతవరకు కంబోడియా కమిషన్ ఛైర్మన్‌గా పనిచేసిన శ్రీ జి పార్థసారధి వియత్నాం కమిషన్ ఛైర్మన్‌గా వచ్చారు శ్రీ పార్థసారధి సిగిరెట్లు కాల్చేవారు ఆయన సిగిరెట్లు కాలుస్తూ చూరువైపు చూస్తూ ఆలోచించేవారు ఆయన ఎదుట కూర్చున్న మనిషివైపు చూడకుండా మాట్లాడడం చూస్తే సర్దార్ పణికర్ గుర్తు వచ్చేవారు శ్రీ పార్థసారధి ఎప్పుడూ తన పాత పాత్రికేయ వృత్తిలోకి వెళ్ళిపోవాలని కలలుకనేవారు ఇండోచైనాలో ప్రారంభమైన ఆయన ఉద్యోగం చివరివరకు విదేశాంగ శాఖ ఉద్యోగాలలోనే గడిచిపోయింది ఆయన యునైటెడ్ నేషన్స్ లో భారత శాశ్వత ప్రతినిధిగా పదవి నిర్వహించి తరువాత శ్రీమతి ఇందిరాగాంధీ సలహాదారు అయ్యారు

ఇక నేను వియత్నాంలో ఉద్యోగం చేసిన మూడేళ్ళలోను మూడవ ఛైర్మన్‌గా శ్రీ టి యన్.కౌల్, ఐ సి ఎస్ హెనోయ్ వచ్చారు శ్రీ కౌల్ చాలా సరదా పురుషుడు ఆయనకు రష్యన్ బాష మాట్లాడం చాలా బాగా వచ్చును ఆయనకూడా పైప్, చుట్టలు కాల్చేవారు మొట్ట మొదటిసారిగా హాంకాంగ్ నుంచి చాలా ఖరీదైన హవానా చుట్టలు తెప్పించి నన్ను కాల్చిచూడమన్నారు కమిషన్ కి హాంకాంగ్ లో డ్యూటీ ఫ్రీ అక్కౌంట్ ఉండేది పంచ్ బ్రాండ్ హవానా చుట్టలు డ్యూటీ లేకుండా ఒక్కొక్కటి నాలుగు రూపాయలు ఉండేవి ఒకసారి హవానా పంచ్ చుట్ట కాలిస్తే మిగిలిన చుట్టలన్నీ చప్పగా ఉండేవి ఎవరైనా డచ్ చుట్టలు, ఇండియన్ చుట్టలు యిస్తే అవి రాజుని చూచిన కళ్ళతో మొగుణ్ణి చూస్తే మొత్తబుద్ధి వేసినట్టుండేవి నేను కౌల్ గారిని చూడ్డానికి వెళ్ళినప్పుడల్లా చుట్టకాలుస్తూనే వెళ్ళేవాణ్ణి ఆయన సీరియస్‌గా మొహంపెట్టి "నాముందుకు చుట్ట కాలుస్తూ రావద్దన్నాను కదా" అని అశ్వద్ధామ హతః అన్నట్టు "జేబులో మరొక చుట్టలేకుండా" అనేవారు జేబులో ఉన్న చుట్ట ఆయనకు అందించేవాణ్ణి చుట్టకాల్చడం అలవాటున్నదని తెలిసిన ఇంగ్లీషు మిత్రురాలు ఇటీవల భారతదేశం వస్తూ నా కోసం రోమియోజూలియట్ బ్రాండ్ హవానా చుట్టలు 10 బహుమానంగా తెచ్చింది అవి లండన్ విమానాశ్రయంలో డ్యూటీ ఫ్రీ షాపులో కొంటే ఒక్కొక్క చుట్ట 60 రూపాయలు ఖరీదు పడిందని విని ఆశ్చర్యపోయాను అప్పటికి నేను చుట్టలు కాల్చడం మానివేసానులెండి

శ్రీ టి యన్ కౌల్ వియత్నాం కమిషను ఛైర్మన్‌గా ఉన్న రోజుల్లో

హెనోయ్‌లో సోవియట్ అంబాసిడర్ ఇండియన్ ఆఫీసర్లను డిన్నర్‌కి ఆహ్వానించారు అప్పుడు నేను డెప్యూటీ సెక్రటరీ జనరల్‌గా ఉండేవాణ్ణి సోవియట్ ఎంబసీ అధికారి వచ్చి ఇండియన్ ఆఫీసర్ల ప్రోటకోల్ ఏవిటి అని అడిగాడు నిజానికి ఆ సమస్య అంతకుముందు ఎప్పుడూ రాలేదు మిగిలిన అందరి విషయంలో భోజనం వద్ద ఎవరు ఎక్కడ కూర్చోవాలనే సమస్య లేదు అయితే నేను కేడర్ ఆఫీసర్ని కానందున నా స్థానం ఎక్కడ అనే సమస్య వచ్చింది ఇండియన్ డెలిగేషన్‌లో ఒక మిలిటరీ ఆఫీసరు మేజర్ జనరల్ ర్యాంకుతో డెప్యూటీ లీడర్‌గా ఉండేవారు సివిలియన్లను మిలిటరీవారిని కలిపినా వారి స్థానాలకు పోటీ లేదు కాని నా విషయంలో సమస్య వచ్చింది శ్రీ కౌల్ దాన్ని ఒక్క నిమిషంలో తేల్చివేసారు మేజర్ జనరల్ భారత డెలిగేషన్‌కి డెప్యూటీ లీడర్ అలాగే డెప్యూటీ సెక్రటరీ జనరల్‌గా నాకు కూడా సెక్రటరీ జనరల్ తరువాత స్థానం ఇవ్వాలన్నారు సోవియట్ ప్రోటకోల్ అధికారి కూడా ఆ నిర్ణయంతో ఏకీభవించారు

ప్రోటకోల్ అంటే వియత్నాంలో నేను చూచిన ఒక సన్నివేశం ఎప్పుడూ మర్చిపోలేను హెనోయ్‌లో ఇండోనేషియన్ కాన్సులేట్ జనరల్ ఆఫీసు ఉండేది కాన్సల్ జనరల్ ఆయన భార్య పిల్లలు మాకందరికీ మంచి మిత్రులు ఆయన ఎప్పుడైనా భారతీయ ఆఫీసర్లను భోజనానికి పిలిస్తే భోజనాలవద్ద సివిల్ మిలిటరీ ఆఫీసర్ల స్థానాలు నిర్ణయించడానికి ఒక వినూత్నమైన పద్ధతి అవలంభించేవారు భోజనానికి వెళ్ళేముందు అతిధులందరికీ ఒక్కొక్కరకం పుష్పం అందించేవారు లోపల భోజనశాలలో ఏర్పాటు చేసిన స్థానాలముందు అతిధులకు ఇచ్చినటువంటి పువ్వులు ఉండేవి ఎవరి చేతిలో ఉన్న పువ్వు వంటి పువ్వు ఉన్న స్థానం అతడిదన్నమాట అది ఒకరకమైన పువ్వులలాటరీ

వియత్నాం అంతర్జాతీయ కమిషన్‌కి పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు ఉద్యోగంలో చేతినిండా పని ఉండేది కాదు అదేమాట అప్పటి కమిషను అధ్యక్షులు శ్రీ యం జె దేశాయ్‌తో అన్నాను ఆయన ఆశ్చర్యంగా చూచి ఇంగ్లండులో రిసెర్చి చేసావు కదా వియత్నాంపై ఒక పుస్తకం వ్రాయవచ్చుగా అన్నారు సామాన్యంగా ఉద్యోగంలో ఉండగా ఆవిషయంపై పుస్తకం వ్రాసి ప్రచురించడాన్ని ప్రభుత్వం అనుమతించదు అయితే కమిషను అధ్యక్షుడు, భారత విదేశాంగ శాఖ కార్యదర్శి పదవి నిర్వహించిన అధికారి అటువంటి సలహా ఇవ్వడంతో వియత్నాంపై పుస్తకం వ్రాయడంలో నిమగ్నమయ్యాను నా గ్రంథం పూర్తికావడానికి ముందే శ్రీ దేశాయ్ వియత్నాంనుంచి డిల్లీ వెళ్ళిపోయారు ఆయన విదేశాంగ శాఖకు సెక్రటరీ జనరల్ అయ్యారు

వియత్నాం కమిషన్‌కి శ్రీ టి యన్ కౌల్ అధ్యక్షులుగా వచ్చారు ఆయన కూడా ఐ సి యస్ అధికారి నేను వ్రాసిన గ్రంథంలోని భాగాలను శ్రీ కౌలుకి ఇచ్చేవాడిని ఆయన వాటిని చదివి దానిలోని విషయాలపై తన అభిప్రాయాలు, సూచనలు చేసేవారు ఆయనతో వచ్చిన గొప్ప ఇబ్బంది ఏవిటంటే ఆయన చేతివ్రాత ఆయన వ్రాసిన అభిప్రాయాలు సూచనలు నేను చదవలేకపోయేవాణ్ణి చిత్రం ఏవిటంటే తన చేతివ్రాత తానే చదవలేకపోయేవారు తన చేతివ్రాత తన కార్యదర్శిచేత చదివించుకొనేవారు బాలకృష్ణ కౌల్‌గారి పర్సనల్ అసిస్టెంటు కౌల్‌గారు ఏఉద్యోగంలోఉన్నా బాలకృష్ణ ఆయనతో ఉండేవాడు బాలకృష్ణ ఒక్కడే కౌల్‌గారి చేతివ్రాత చదవగలిగేవాడు

వియత్నాంమీద నేను వ్రాసే పుస్తకంలో పూర్తి చేసిన చాప్టర్లు ఢిల్లీలో శ్రీ దేశాయికి పంపేవాణ్ణి అదంతా ఆయన చదివేవారో లేదో తెలియదుకాని అంతకుముందు వియత్నాం కమిషనులో విదేశాంగ శాఖలో పనిచేస్తున్న వెల్లోడి ఆ చాప్టర్లు నాకు పంపేవాడు పుస్తకం వ్రాయడం వేరు, దానిని ప్రచురించడం నిజంగా యజ్ఞమే నేను వియత్నాంనుంచి ఢిల్లీ వచ్చిన తరువాత ఆ పుస్తక ప్రచురణకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి ప్రథమంగా పుస్తకం ముసాయిదా విదేశాంగ శాఖ అనుమతి పొందాలి నేను వియత్నాం కమిషనులో పనిచేస్తూ వియత్నాంపై పుస్తకం వ్రాసాను కాబట్టి విదేశాంగ శాఖ అనుమతి ఉండాలన్నారు శ్రీ దేశాయి శ్రీ కౌల్ అంతకుముందే ఆ ముసాయిదా చదివారనే వాదం పనిచేయలేదు ఢిల్లీలో విదేశాంగమంత్రిత్వ శాఖలో కుమారి ముత్తమ్మకు ఆ ముసాయిదా ఇచ్చాను ఆమె పుస్తక ప్రచురణకు అనుమతించడానికి చాలా ఆలస్యం చేసింది నాకు అప్పట్లో విదేశాంగశాఖలో చాలామంది తెలిసినవారున్నారు గాని వారికందరికీ ఆమెతో మాట్లాడడమంటేనే భయం మొత్తంమీద ముత్తమ్మగారి అనుమతి పొందగలిగాను అప్పుడు ఇక ప్రచురణకర్త కోసం వెదుక్కోవలసి వచ్చింది బొంబాయిలో ఏషియా పబ్లిషింగ్ హౌసువారు ఆ రోజుల్లో మంచి ప్రచురణకర్తలు అని పేరు వియత్నాం కంబోడియా కమిషన్లలో పనిచేసిన శ్రీ పార్థసారథి చేత రికమెండేషను ఉత్తరం వ్రాయించి పుస్తకం ముసాయిదాను బొంబాయి పంపాను ఏషియా పబ్లిషింగ్ హౌసువారు ఆ గ్రంథాన్ని బొంబాయినుండే గాక లండను, న్యూయార్కునుంచి కూడా ప్రచురించారు ఆ గ్రంథానికి ఇంగ్లాండులోను, అమెరికాలోను మంచి ప్రాచుర్యం వచ్చింది

వియత్నాంలో ఉద్యోగంలో ఉండగా ఢిల్లీ వచ్చి విదేశాంగ శాఖలో సెక్రటరీ జనరల్‌గా ఉన్న శ్రీ దేశాయిని కలుసుకున్నాను పబ్లిక్ రిలేషన్సు

ఆఫీసరుగా పెద్దపనిలేదంటున్నావు కాబట్టి కమిషనులో డెప్యూటీ సెక్రటరీ జనరల్ ఉద్యోగంలో చేరమన్నారు ఆఉద్యోగం అంతవరకు ఫారెన్‌సర్వీసు, అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు వారు నిర్వహించారు కాని శ్రీ దేశాయి గారికి నాయందున్న అభిమానం పుణ్యమా అని ఆ ఉద్యోగం నాకు యిచ్చారు ఆ ఉద్యోగం కొంతకాలం చేసేసరికి మొహం మొత్తింది వియత్నాం కమిషనులో ఎంతకాలం ఉద్యోగం చేసినా దానికి శాశ్వత ప్రాతిపదిక ఉండదు అప్పట్లో నా ఆలోచనలు రెండు విధాలుగా ఉండేవి ఇక ఆవయస్సులో ఏదైనా ప్రభుత్వ ఉద్యోగం శాశ్వత ప్రాతిపదిక మీద సంపాదించుకోలేకపోతే నాకు ఉద్యోగం దొరికే అవకాశం ఉండదు అదే సమయంలో అసలు ఉద్యోగం చేయకుండా పుస్తకాలు వ్రాసుకుని బ్రతకలేమా అని మరొక ఆలోచన ఈ ఆలోచనలకు తోడు నా ఎడమ కిడ్నీ పనిచేయడం మానివేసింది డాక్టర్లు పరీక్షలు చేసి దానికి ట్విస్టెడ్ కిడ్నీ అని పేరు పెట్టి ఆరునెలల కంటే బ్రతకడానికి అవకాశం లేదని నిర్ణయించారు ఆ పరిస్థితులలో భారతదేశం వెళ్ళిపోవడమే మంచిదనిపించింది నేను వియత్నాం కమిషనులో ఉద్యోగం వదలి భారత దేశానికి తిరిగి రావడానికి చేసిన నిర్ణయం వెనుక ఇంత కథ ఉంది అయితే కమిషను అధ్యక్షులు శ్రీ టి యస్ కౌల్ మాత్రం నా నిర్ణయాన్ని హర్షించలేదు ఎలాగైనా నన్ను వియత్నాంలో మరికొంతకాలం ఉంచడానికి ఆయన ప్రయత్నించారు శ్రీ కౌల్‌గారు బ్రహ్మాండమైన వీడ్కోలు పార్టీని ఏర్పాటు చేసారు ఆయన నన్ను ఆకాశానికి ఎత్తివేస్తూ ఉపన్యసించారు భారతదేశంలో జీవనోపాధికి ఏ విధమైన ఏర్పాటు లేకుండా చేతిలో ఉన్న ఉద్యోగాన్ని వదలడాన్ని ఆయన హర్షించలేదు శ్రీ కౌల్‌కి నాయందున్న అభిమానం ఆయన కూడా వియత్నాం కమిషనునుంచి ఇరాన్‌కి ఎంబాసిడరుగా బదిలీ అయి ఢిల్లీలో ఉన్నప్పుడు చవి చూసాను ఆయన నా అడ్రసు తెలుసుకుని తనను కలుసుకోమని జాబు వ్రాసారు నన్ను కూడా పెట్టుకుని విదేశాంగశాఖలోను, కామర్సు మంత్రిత్వశాఖలోను కార్యదర్శులుగా ఉన్న తన తోటి ఐ సి యస్ అధికార్లకు నన్ను పరిచయం చేసి నా సేవలు ఉపయోగించుకోమని వాళ్ళకు చెప్పారు వాళ్ళెవరూ ఉద్యోగం ఇవ్వకపోతే ఇరాన్ వచ్చి తనవద్ద కూర్చుని మధ్యప్రాచ్యం మీద ఒక పుస్తకం వ్రాయమని సలహా ఇచ్చారు ఆయన మంచితనం గురించి వ్రాయడానికి నాకు మాటలు చాలవు

వియత్నాం అంతర్జాతీయ కంట్రోలు కమిషన్ పబ్లిక్ రిలేషన్సు ఆఫీసర్‌గా ఉన్నపుడు ఊహించని యిబ్బంది ఎదురైంది పబ్లిక్ రిలేషన్సు ఆఫీసర్‌గా పత్రికలవారికి పార్టీలు యివ్వడం వృత్తిధర్మంగా ఉండేది ఇప్పటికీ ప్రపంచవ్యాప్తంగా పత్రికా విలేఖరులకు మందు పార్టీలు యివ్వడం పరిపాటి

ఆ రోజుల్లో వియత్నాంలో ప్రపంచలోని అన్ని పత్రికల ప్రతినిధులు ఉండేవారు వారంతా దక్షిణాన సైగాన్‌లో ఉండేవారు ముఖ్యమైన వార్తలుంటే హెనోయ్ వచ్చేవారు కమ్యూనిస్టుల పాలనలోపాశ్చాత్య పత్రికా విలేఖరులకు హెనోయ్‌లో కాలక్షేపం అయ్యేదికాదు అయితే తూర్పు యూరోపు దేశాలు, సోవియట్ రష్యా పత్రికా ప్రతినిధులు హెనోయ్‌లో ఎక్కువ కాలం గడిపేవారు

ఒకసారి పత్రికలవారిని హెనోయ్‌లో "కాక్ టెయిల్" పార్టీకి ఆహ్వానించాను పార్టీ చాలా హుషారుగా జరుగుతున్న సమయంలో ఒక రష్యన్ మహిళా పత్రికా ప్రతినిధి పార్టీకి వచ్చింది ఆమెను ఏమి సేవిస్తారని అడిగాను ఆమె కాక్ టెయిల్ కావాలంది ఇక్కడ ఒక రహస్యం చెప్పాలి అవడానికి కాక్ టెయిల్ పార్టీ అయినా ఆ పార్టీలలో విస్కీ, బ్రాందీ, బీరు జిన్ను మొదలైన డ్రింకులు యివ్వడం త్రాగడం ఆచారం సాధారణంగా కాక్ టెయిల్స్ తయారుచేయరు ఆమెకు అదే విషయం చెప్పాను తనను కాక్ టెయిల్ పార్టీకి పిలిచినందున కాక్ టెయిల్ తప్ప మరే డ్రింకు అక్కరలేదంది అటువంటి పరిస్థితి మేమెవరమూ ఊహించలేదు ఆమెకు టానిక్ కలిపిన జిన్న్ వెర్మూత్ త్రాగడానికి యిచ్చాను ఆమె ససేమి తనకు కాక్ టెయిల్ తప్ప మరే డ్రింకు అక్కరలేదంది అంతర్జాతీయ కమిషన్ పరువు, నా మర్యాద దక్కాలంటే మెకు కాక్ టెయిల్ యిచ్చి తీరాలి

మిత్రులు బాలేశ్వరప్రసాద్, ప్రాక్సీ ఫెర్నాండెజ్ ఐ ఎ ఎస్ లో ఉత్తీర్ణులై ారతదేశంలో జిల్లా కలెక్టర్ల పదవులు నిర్వహించడమే కాకుండా డ్రింకుల ఎరించిన మంచి పరిజ్ఞానం ఉన్నవారు ఆ రష్యను మహిళచేసే గొడవ విన్న ప్రాక్సీ వెంటనే రంగంలోకి దిగి బ్రహ్మాండమైన పంచ్ తయారుచేసాడు ప్రత్యేకమైన కాక్ టెయిల్ గ్లాస్‌లో పోసి ఆమెకు అందించిన తరువాత కాని మా ప్రాణాలు స్థిమితపడలేదు ఆ తరువాత మా ప్రాక్సీ తయారు చేసిన పంచ్ ఆ మహిళామణికి తలకెక్కడంతో మరొక విధమైన సమస్య ఎదురైంది దానిని పరిష్కరించడం పెద్ద కష్టం కాలేదు. ఆమెను రష్యను ఎంబసీ అధికారితో పంపివేసాం

సాధారణంగా కాక్ టెయిల్ పార్టీలకు విదేశీ ఎంబసీ అధికారులను పిలిస్తే వారంతా అంబాసిడరు పార్టీనుంచి వెళ్ళపోగానే నిష్క్రమించడం ఆచారం తమ దేశస్థుల పార్టీలలో తాగి తందనాలు త్రొక్క వచ్చును కాని విదేశీయుల పార్టీలకు వెళ్ళినప్పుడు తాము ఆచరించవలసిన మర్యాదలు కొన్ని ఉన్నాయి వాటిలో మోతాదుకు మించి త్రాగకపోవడం మొదటిది హోచిమిన్ తన అధ్యక్ష భవంతిలో యిచ్చే పార్టీలు అద్భుతంగా ఉండేవి అయన ఒక షెర్రీగ్లాసు చేతిలో పట్టుకుని అతిథులనందర్నీ పలుకరిస్తూ తిరిగేవారు అయన పార్టీలలో

రష్యన్ ఓడ్కాకు ప్రధమస్థానం ఉండేది ఆ పార్టీలకు కమిషన్ ఛైర్మన్‌తో పా
వెళ్ళి ఆయనతో పాటు తిరిగి వచ్చేవాళ్ళం శ్రీ దేశాయి కమిషన్ ఛైర్మన్
ఉన్న రోజుల్లో ఆయన రెండు మార్టినీలు మాత్రమే సేవించేవారు
టి ఎన్ కౌలు ఛైర్మన్‌గా ఉన్నప్పుడు అన్ని రకాల డ్రింక్సు ఉండేవి అం
కౌల్ గారు పూర్వాశ్రమంలో మాస్కోలో భారత రాయబారి కార్యాలయం
ఫస్టు సెక్రటరీగా పనిచేసారు కాబట్టి ఆయనకు ఓడ్కా రుచి తెలుసు

సైగాన్‌లో ఏ మంచి రెస్టారెంటుకు వెళ్లినా చక్కటి ఫ్రెంచి వై
దొరికేవి వైన్సు యొక్క మంచి చెడ్డలు నిర్ణయించడానికి మంచి అనుభ
కావాలి ఏ సంవత్సరంలో ఫ్రాన్స్‌లో వర్షాలు తక్కువ పడ్డాయో
సంవత్సరంలో తయారైన తెల్ల వైన్ చాలా ప్రశస్తం అప్పుడు ద్రాక్షపళ్ళ
నీటిశాతం తక్కువ ఉంటుంది ఆ సంవత్సరాలు గుర్తుపెట్టుకో గలగ
చక్కటి తిండికి అలవాటుపడ్డ ప్రతివ్యక్తి వైన్సు తదితర డ్రిం
విషయంలోకూడా చక్కటి పరిజ్ఞానం కలిగి ఉంటాడు కన్యాశుల్కం
బ్రాహ్మల్లో కూడా సిద్దులుంటారన్నట్టు కమిషన్‌లో ఉ
భారతీయులలోకూడా సిద్దులు ఉండేవారు

హెనోయ్‌లో ఆఫీసర్స్ అంతా మెట్రోపోల్ హోటల్‌లో ఉండేవా
సిబ్బంది అంతా మరొక హోటల్‌లో ఉండేవారు మెట్రోపోల్ హోటల్
భోజన సమయంలో డ్రస్ చేసుకోవాలి, సిబ్బంది ఎవరూ మా హోటల్
భోజనం చేయడానికి వీలులేదు అది మిలిటరీ ఆఫీసర్ పెట్టిన ఆంక్ష మిత్ర
లక్ష్మన్నమాతో పనిచేసేవాడు ఆయన ఉండే హోటల్‌కి నేను వెళ్ళి భోజ
చేయవచ్చును కాని నేనుండే హోటల్‌కి ఆయన్ని భోజనానికి పిలవడా
వీలులేదు ఈ ఆంక్ష నాకు చాలా బాధ కలిగించేది లక్ష్మన్నగారు ఆంధ్రను
అవకాయ ఊరగాయ తెచ్చుకుని నన్ను భోజనానికి పిలిచేవాడు అం
గదిలోకి భోజనం తెప్పించుకుని మేమిద్దరం అవకాయ భోజనం చేసేవా
లక్ష్మన్నగారు పదహారణాల తెలుగువాడు మంచి మిత్రుడు నా కెంద
ప్రజలను హోదాను బట్టి విభజించటంలోని పరమార్థం అర్థం కాలే
మిత్రులంతా అది చాలా అవసరం అని నాతో వాదించేవారు నిజా
లక్ష్మన్నగారిని నా హోటల్‌కి పిలిచినా మేము తినే భోజనం ఆయ
నచ్చదు ఎంచేతనంటే ఆఫీసర్లు కప్పకాళ్ళు, నత్తలు మసిల్ అనే ఒక
జీవాలను తినేవారు మాతోఉండే జగత్ సింగ్ కప్పకాళ్లు అని చెబితే వా
చేసుకునేవాడు అయితే నత్తలకు గ్రీన్ సాస్ మసిల్‌కి వైట్ సాస్ ఉంటే
రుచించవు వాటికితోడు దేనితో రెడ్ వైన్, దేనితో వైట్ వైన్ తీసుకోవాల
పెద్ద మీమాంస ఆయన్ని ఈ గొడవలతో బాధించకుండానే అం

హోటల్‌కి వెళ్లి తెలుగులో కబుర్లు చెప్పుకుని భోజనం చేసివచ్చేవాణ్ణి

నేను వియత్నాంలో అంతర్జాతీయ కంట్రోల్ కమిషన్‌లో పౌర సంబంధాల అధికారిగా ఉన్నప్పుడు జరిగిన సన్నివేశం మరువరాని అనుభవం పత్రికావిలేఖరులు ఒక ప్రత్యేకమైనజాతివారు తాలింపులో కరివేపాకు వంటివారు సువాసనకు అవసరమేకాని తినే సమయంలో తీసి అవతలపారేస్తారంటాడు మా మిత్రుడు దానిలో కొంత అతిశయోక్తి కూడా ఉండవచ్చు కాని పత్రికావిలేఖరులకు సమాజంలో ఒక ప్రత్యేక స్థానం ఉంది వారితో పోల్చిచూస్తే పౌరసంబంధశాఖలలో పనిచేసినవారు తాలింపుకికూడా పనికిరారనిపిస్తుంది అయితే వియత్నాంలో నేను ప్రెస్ ఆఫీసర్‌గా ఉండగా నేను అక్కడ చేస్తున్న మంచిపనిని ప్రపంచానికంతటికీ తెలియజేయాలని ఒక అమెరికన్ పాత్రికేయుడు చేసిన ప్రయత్నం ఫలితంగా నా ఉద్యోగం ఊడినంత పని అయింది విదేశాలలో పనిచేసే ప్రత్యేక విలేఖరులు వారి వృత్తిలో నిష్ణాతులు వృత్తిరీత్యా సమాచార సేకరణలో పోటీపడడం తప్ప మిగతా సమయాలలో అంత మంచి మిత్రులు జీవితంలో అరుదుగా దొరుకుతారు అయితే వారి మంచితనం కూడా అప్పుడప్పుడు అవతలివానికి ప్రాణసంకటం కావచ్చు అదే జరిగింది ఒకసారి వియత్నాంలో

అంతర్జాతీయ కంట్రోలు కమిషను సభ్యులు, అధికారులు హైఫాంగ్ ఉత్తర వియత్నాం సముద్రతీర పట్టణం) నుంచి ఫ్రెంచి సేనల నిష్క్రమణాన్ని రిశీలించడం కోసం అక్కడ మకాం చేసారు ఆ కార్యక్రమం పూర్తి కాగానే మిషను ఛైర్మన్ శ్రీ దేశాయి పత్రికావిలేఖరుల సమావేశంలో కమిషను ార్యక్రమాన్ని వివరించారు సీనియర్ పాత్రికేయుడు, అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ అమెరికా ప్రత్యేక విలేఖరి జాన్ విల్‌కాక్స్ ఉత్తర వియత్నాంలోనికి విదేశీ సైన్యాలు మందుగుండు సామాగ్రి వస్తున్నాయనే వార్తపై ప్రశ్నలవర్షం కురిపించాడు ఆనాటి ముఖ్య విషయాలకు జాన్ అడిగిన ప్రశ్నలకు సంబంధం లేనందున హెనోయ్ వెళ్ళిన తరువాత తిరిగ్గా మా ప్రెస్ ఆఫీసరు మూర్తిని అడిగితే నీ సందేహాలు తీరుస్తాడని జాన్‌తో శ్రీ దేశాయి అన్నారు శ్రీ దేశాయి ఆదేశం ప్రకారం నేను జాన్ సందేహాలన్నీ తీర్చాను కాని ఒక వారం రోజులు తిరగకుండా జాన్ మంచితనం పుణ్యమా అంటూ నా ఉద్యోగం ఊడినంత పని అయింది

ఒక మధ్యాహ్నం కమిషనులోని కెనేడియన్ అంబాసిడరు బ్రిగేడియర్ లెట్ చాలా ఆందోళనపడుతూ ఛైర్మన్ శ్రీ దేశాయి ఇంటికి వెళ్ళి కెనడా విదేశాంగ మంత్రివద్దనుంచి వచ్చిన ఒక సందేశాన్ని ఆయనకు చూపించారు బ్రిగేడియర్ లెట్ చాలా శాంత స్వభావుడు కమిషను సమావేశాల్లో గాని, బైటగాని ఆయన

ఉద్రేకం చెందటం ఎవరూ చూడలేదు అటువంటి పెద్దమనిషి ఉద్రేకంతో వణికిపోవడం చూసి ఏదో చెడు శంకించారు అంతా కెనడానుంచి వచ్చిన సందేశంలో ఉన్న విషయం చూసి శ్రీ దేశాయి దిగ్భ్రాంతి చెందారు బ్రిటిష్ విదేశాంగమంత్రి సర్ ఆంథొని ఈడెన్ లండనులో కామన్సు సభలో ఉత్తర వియత్నాంలోనికి జెనీవా ఒప్పందానికి విరుద్ధంగా విదేశీ సైన్యాలు మందుగుండు సామగ్రి రావటంగురించి చేసిన ఉపన్యాసాన్ని వియత్నాం కమిషను ప్రెస్ ఆఫీసరు బి యస్ మూర్తి ఖండించాడని న్యూయార్కు టైమ్సు పత్రిక ప్రముఖంగా ప్రకటించినదట బ్రిటిష్ విదేశాంగమంత్రి సోవియట్ విదేశాంగమంత్రి జెనీవా సమావేశానికి సంయుక్త అధ్యక్షులు ఇండో చైనాలోని అంతర్జాతీయ కమిషనులు వారి అదుపాజ్ఞలలో నడుస్తున్నాయి అటువంటి పరిస్థితిలో కమిషనులోని ఒక చిన్న ఉద్యోగి అందునా భారతీయుడు బ్రిటిష్ విదేశాంగమంత్రిని తప్పుపట్టడమా అని కెనడా ఆదుర్దా

శ్రీ దేశాయి ఆశ్చర్యంనుంచి తేరుకొని నాకు కబురుపెట్టారు నేను జాన్‌తో చెప్పిన విషయాలు ఆయనకు వివరించాను కెనడా విదేశాంగమంత్రి సందేశం చూసేసరికి దేశాయిగారికి నెత్తిన పిడుగు పడ్డట్టయింది విషయం అంతు చిక్కలేదు చివరకు న్యూయార్కు టైమ్సులో పుర్తిపాఠం చూస్తేకాని ఏమీ చెప్పలేమని నిర్ణయించారు రెండురోజుల్లో ఆ పత్రికలు రానే వచ్చాయి అవి ముందుగానే చూచి మిత్రులతో సంప్రదించిన తరువాత నేను నా మిత్రులు అదంతా వడ్లగింజలో బియ్యపుగింజ అని తేల్చాం శ్రీ దేశాయిగారు సాయంకాలం మార్టీనీలు సేవించేవేళ ఆ పత్రికలు తీసుకువెళ్ళి చూపించాను ఆవివరాలు చదివిన తరువాత ఆయన మనసుకూడా కుదుటపడింది ప్రెస్ ఆఫీసరు పేరుకి బదులు ఛైర్మన్ పేరుపెడితే ఏగొడవా లేకపోయేదని నిర్ణయించారు ఆ విషయమే కెనేడియన్ అంబాసిడరుకి కూడా చెప్పారు కాని బ్రిగేడియర్ లెట్ ఆవిషయం కమిషను సమావేశంలో చర్చించి తీర్మానం చేయాలని పట్టుబట్టారు ఆసమయంలోనే సైగాన్‌లో ఉన్న ఎ పి ఏ ప్రత్యేక విలేఖరి జాన్ హెనోయ్ రావడంతో అసలు రహస్యం తెలిసిపోయింది

ప్రెస్ ఆఫీసర్లు ఎంతసేపూ పాత్రికేయులకు సేవలు చేయడమే గాని ఎప్పుడూ పత్రికలలో వారి పేరుకూడా పడదు కాబట్టి ఒకసారి కమిషను ప్రెస్ ఆఫీసరు మూర్తికి ప్రాముఖ్యమివ్వడానికి ప్రయత్నించానన్నాడు జాన్ నేను వారం క్రితం జాన్‌కి చెప్పిన వివరాలు తనవద్ద ఉంచుకున్నాడు ఆ మరునాడే కామన్సు సభలో ఈడెన్ ఉపన్యసించారు ఆయన రాజకీయంగా మాట్లాడారు ఏదో ప్రెస్ ఆఫీసరు మూర్తికి పెద్ద ఉపకారం చేయాలనే ఉద్దేశంతో జాన్‌కి నేను చెప్పిన విషయాలకు, ఈడెన్ ఉపన్యాసానికి ఉన్న వైరుధ్యాన్ని

చూపుతూ అసోసియేటెడ్ ప్రెస్‌కి వార్త పంపాడు ఈ సమాచారం ప్రపంచంలోని ప్రముఖ పత్రికలన్నీ ప్రచురించాయి న్యూయార్క్ టైమ్సు పత్రిక మాత్రం ఒక అడుగు ముందుకువేసి బ్రిటిష్ విదేశాంగ మంత్రి చెప్పిన విషయాన్ని భారతీయ ప్రెస్ ఆఫీసరు ఖండించాడని హెడ్‌లైను పెట్టింది దానితో సంచలనం పుట్టింది కెనేడియన్ ప్రతినిధివర్గం ప్రెస్ ఆఫీసరుకు ఉద్వాసన చెప్పాలన్నారు ఈడెన్ ఉపన్యసించడానికి ఒక వారం ముందే నేను చెప్పిన విషయాలు ఖండన ఎలా అవుతుందో వారు ఆలోచించలేదు శ్రీ దేశాయిగారు మాత్రం ప్రెస్ ఆఫీసర్ని అడిగిన ప్రశ్నలే తనను అడిగితే తానూ అవే సమాధానాలు చెప్పేవాణ్ణి కాబట్టి నేను ఏమీ తప్పు చేయలేదని నిర్ణయించారు జాన్ అమెరికను కావడం, అతడు బ్రిగేడియర్ లెటకు అసలు విషయం చెప్పడంతో కెనేడియన్ ప్రతినిధి వర్గం కూడా తగ్గారు నాకు చావుతప్పి కన్ను లొట్టపోయినంతపని అయింది "బాబూ, సరసానికైనా సమయం సందర్భం ఉండాలంటారు మాదేశంలో" అని నేను జాన్‌తో చమత్కరించినా అతడి మంచితనాన్ని హర్షించకుండా ఉండలేకపోయాను ప్రపంచవ్యాప్తంగా ప్రచురించబడిన ఆ వార్త పుణ్యమా అంటూ ఇంగ్లండులోను, అమెరికాలోను ఉన్న నా మిత్రులంతా అభినందనలు పంపారు

నేను హెనోయ్ వెళ్ళి మూడేళ్ళవుతోంది అంతర్జాతీయ కమిషనుకి జెనీవా ఒప్పందం నిర్ణయించిన బాధ్యత చాలావరకు తీరిపోయింది శ్రీయుతులు యం జె దేశాయి, పార్థసారథి వియత్నాం కమిషను అధ్యక్షపదవులు నిర్వహించి బారతదేశం తిరిగివెళ్ళారు శ్రీ దేశాయి భారత విదేశాంగ శాఖలో సెక్రటరీ జనరల్ అయ్యారు శ్రీ పార్థసారథి చైనా దేశానికి భారత రాయబారిగా వెళ్ళారు శ్రీ టి యన్ కౌల్ వియత్నాం కమిషనుకి అధ్యక్షులు భారత ప్రతినిధివర్గానికి నాయకులుగా ఉన్నారు

కమిషను ఉద్యోగం వదిలిపెట్టి భారతదేశం వెళ్ళపోవడానికి నేను తీసుకున్న నిర్ణయం ఛైర్మన్ కౌలుకి చెప్పాను ఆయన నన్ను మరికొంతకాలం ఉండమని సలహా ఇచ్చాడు నేను అంగీకరించలేదు ఆయనతో నేను చైనా, ష్యా మీదుగా భారతదేశం వెళ్దామనుకుంటున్నానని చెప్పాను ఆయనతో )దేశాంగ శాఖలో పనిచేసిన కొందరు నేను ప్రయాణం చేయాలనుకున్న ;శాలలో ఉన్నారు వారికందరికీ శ్రీ కౌల్ నన్ను పరిచయం చేస్తూ జాబులు వాసారు వారిలో పరంజపాయ్ పెకింగ్‌లోను, విష్ణు అహూజా మాస్కోలోను, ెర్లిన్‌లో భారత కాన్సెల్ జనరల్‌గా ఉన్న సోంధి ఉన్నారు హెనోయ్‌లో ఉన్న చైనీస్ ఎంబసీకి వెళ్ళి చైనాకు వీసా తీసుకున్నాను సోవియట్

రాయబారిని కలుసుకుని నా ప్రయాణం గురించి చెప్పాను ఇక హెనోయ్‌లో ఉద్యోగం వదిలి రష్యాయాత్రకు సన్నద్ధం కావడంలో నిమగ్నమైపోయాను

ఇక్కడ నాకు సన్నిహితులయిన మిత్రులగురించి చెప్పడం మధురస్మృతులుగా భావిస్తాను వియత్నాం కమిషనులో భారతదేశం తరఫున పనిచేయడానికి వచ్చిన సివిలియన్ ఆఫీసర్లంతా I A S అధికారులే మిలిటరీ ఆఫీసర్లలో మేజర్ కంటే తక్కువ అధికారులు లేరు వారికి మేజర్ జనరల్ నాయకుడు మిగిలినవారు బ్రిగేడియర్‌లు, లెఫ్టినెంటు కర్నల్స్, మేజర్లు వీరు కాక సామాన్య సైనికులు అధికారులకు సేవలు చేయడానికి ఉండేవారు సివిలియన్లలో కూడా గుమాస్తాలు టైపిస్టులు ఉండేవారు బారత ప్రతినిధి వర్గంలో రాజకీయ సలహాదారులుగా ఉండేవారిలో చాలామంది అప్పటికే జిల్లా కలెక్టర్లుగా పనిచేసినవారే వారందరితో నాకు చాలా మంచి సంబంధాలు ఉండేవి వారిలో బాలేశ్వరప్రసాద్ కరియప్ప, ప్రాక్సిఫెర్నాండెజ్ నాకు చాలా మంచి మిత్రులయ్యారు వీరు కాక అయ్యంగార్ అని ఒక ఆఫీసరు ఉండేవాడు అతడు ఏకేడర్‌కీ చెందినవాడు కాదు అతణ్ణి బారతప్రభుత్వం భారతీయ అదికారుల ప్రవర్తనపై ఒక కన్నువేసి ఉంచడానికి హెనోయ్ పంపినట్టు తరువాత తెలుసుకున్నాను

అయ్యంగార్ కొంచెం స్థూలకాయుడు తమిళనాడు పోలీసు శాఖనుంచి ఎన్నికచేసి పంపారు మామూలు బాషలో చెప్పాలంటే అయ్యంగార్ సి ఐ డి పనికోసం పంపబడ్డ అధికారి అతడు అందరితోను చాలా చనువుగా ఉండేవాడు కమిషనులో ఉన్నవారికందరికీ అయ్యంగార్ నిజస్వరూపం తెలియకుండా అధికారులు జాగ్రత్తపడేవారు అతడు మాత్రం కమ్యూనిస్టులను విమర్శించడంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవాడు లంచ్‌కిముందు బీరుత్రాగుతూ హోటల్ లౌంజ్‌లో కూర్చుని గాజు గ్లాసులు తన పిడికిలితో ముక్కలు చేసి నోట్లో వేసుకుని కరకర నమిలి వేసేవాడు మాకందరికీ ఆశ్చర్యంగా ఉండేది ఇంకా మమ్మల్ని ఆశ్చర్యంలో ముంచడానికి గాజుపెంకులు నమిలిన తరువాత గ్లాసుడు మంచినీళ్ళు త్రాగేవాడు అయ్యంగార్ ఆ గాజుపెంకుల్ని గళ్ళాపట్టుతో లోపలకు వెళ్ళకుండా చేయగలిగేవాడని మామిత్రుల అభిప్రాయం ఎంత జటిలమైన రాజకీయ సమస్యకైనా పరిష్కారం కనుక్కోగలిగిన రాజకీయ సలహాదారులకు అయ్యంగార్ కొరుకు పడలేదు

కర్నాటకకు చెందిన I A S అధికారి బొళ్ళిర చెంగప్ప కార్యప్ప (బి సి కరియప్ప) కమిషనులో బారత ప్రతినిధి వర్గానికి అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు, రాజకీయ సలహాదారు అప్పటికి కరియప్ప అవివాహితుడు అతడు ప్రతిరోజు లంచ్ అయినవెంటనే పదినిమిషాలైనా పడుకుంటేనేకాని

పనిచేయలేకపోయేవాడు అంత చిన్న వయస్సులో అదేం అలవాటని ఎవరు విమర్శించినా అతడు పట్టించుకునేవాడు కాడు ఆయనగారు డ్రాయర్లు నేతగుడ్డతో కుట్టించుకునేవాడు నేను చాలా ఖర్చుపెట్టి డ్రాయర్లు కొంటే కరియప్ప నన్ను విమర్శించేవాడు డ్రాయర్లతోనే తిరగరాదా? అనేవాడు కర్నాటకలోని కూర్గు ప్రాంతానికి చెందిన కరియప్ప మంచి స్నేహపాత్రుడు కమిషను ఉద్యోగం అయిపోయిన తరువాత బొంబాయిలో వివాహం చేసుకుని అనేక ఉన్నత ఉద్యోగాలు చేసాడు

బాలేశ్వర ప్రసాద్ సుబాష్ చంద్రబోస్ తయారుచేసిన జాతీయ సైన్యంలో పనిచేసి స్వాతంత్ర్యానంతరం I A S లోకి వచ్చాడు బీహార్ రాష్ట్రంలో చాలా పెద్ద కుటుంబానికి చెందినవాడు వియత్నాం రావడానికి ముందు బీహార్‌లో చెయిబాసా జిల్లా కలెక్టర్‌గా చేసాడు అతడితో షాపింగ్‌కి వెళ్ళడం చాలా సరదాగా ఉండేది ఎక్కువకాలం మన్నే వస్తువులు కొనేవాడు కాదు ఫేషన్సు మారిపోతుంటే ఎక్కువ కాలం మన్నే వస్తువులను చూస్తూ పారవేయలేము కాబట్టి తక్కువకాలం మన్నే వస్తువులను మాత్రమే ఖరీదు చేసేవాడు అవి ాడైపోతే మళ్ళా అప్పటికి ఫేషన్‌లో ఉన్న వస్తువులు క్రొత్తవి కొనేవాడు ుంచి మిత్రుడు కమిషను ప్రారంభంలో భారతీయ ప్రతినిధివర్గంలో ఉండి ర్వాత కమిషనుకి డెప్యూటీ సెక్రటరీ జనరల్ అయ్యాడు ఒక రోజు హైఫాంగ్ సముద్రతీరానికి సరదాగా కమిషను కారులో నేను, బాలేశ్వర్ ప్రయాణిస్తుండగా కారు రోడ్డువదిలి ప్రక్కనున్న కాలువలోనికి వెళ్ళి కలక్రిందులైంది ఆ ప్రమాదంలోనుంచి నేను బాలేశ్వర్ క్షేమంగా బైటపడడం ూా అదృష్టం

బాలేశ్వర్ వియత్నాం కమిషనునుంచి బర్మాలో భారతరాయబారిగా వెళ్ళాడు అతడు జీవితంలో చాలా ఆలస్యంగా వివాహం చేసుకున్నాడు ార్యకూడా బీహార్ ప్రభుత్వంలో విద్యాశాఖలో పెద్ద ఆఫీసరు మొదట్లో ఎవరి ఉద్యోగాలు వారు చేసుకున్నా భర్తకు రాయబారిగా ఉద్యోగం వచ్చేసరికి ఆమె తన ఉద్యోగానికి సెలవుపెట్టి రంగూన్ వెళ్ళింది ఆ తరువాత బాలేశ్వర్ ఢిల్లీకి లెఫ్టినెంట్ గవర్నరుగా నియమించబడ్డాడు ఆరోజుల్లో ఢిల్లీ రాజభవనంలో గవర్నరుగారి మిత్రుడిగా నాకు శాశ్వత ఆహ్వానం ఉండేది చక్కటి బీరు బ్రహ్మాండమైన భోజనం చుట్టలు కాల్చుకుంటూ కబుర్లు చాలా హాయిగా ఉండేవి

వియత్నాం కమిషను లో భారతదేశ ప్రతినిధి వర్గానికి పొలిటికల్ అడ్వయిజర్‌గా ఉన్న మరొక I A S మిత్రుడు ఫ్రాక్సీ ఫెర్నాండెజ్ అతడిపేరు పి జె పెర్నాండెజ్ ప్రభు కాని అంతా ఫ్రాక్సీ అనే పిలిచేవారు అతడి స్వస్థలం

కూర్గు మాతో వియత్నాంలో అనేకమంది IAS ఆఫీసర్లు పనిచేసారు కాని ప్రాక్సీ అందరిలో తెలివైనవాడు దానికితోడు చాలా సరదా పురుషుడు పేకాటలో దిట్టు రాత్రి తెల్లవార్లు బ్రిడ్జి ఆడి ఉదయం కమిషనుకి వచ్చి ఛైర్మన్‌కి బ్రహ్మాండమైన సలహాలు ఇచ్చేవాడు ప్రాక్సీ కర్నాటక కేడర్ IAS ఆఫీసరు వియత్నాం రావడానికి ముందు ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వంలో అండర్ సెక్రటరీగా ఉండేవాడు అప్పటికే వివాహం అయింది సరదాగా కబుర్లు చెప్పుకునేటప్పుడు ప్రాక్సీ వివాహం గురించి వివరాలు విని ఆశ్చర్యపోయాను కులతత్వం హిందూ సమాజానికి పట్టిన రుగ్మత అనుకునేవాణ్ణి కాని ఆ జబ్బు క్రైస్తవులలో కూడా ఉన్నదని ప్రాక్సీ వద్ద మొదటిసారిగా విన్నాను

ప్రాక్సీ పుట్టుకతో విజయవంతమైన జూదరి అయి ఉంటాడనిపించింది సామాన్యంగా కూడా రాత్రి భోజనాల తరువాత హెనోయ్‌లో సరస్సు చుట్టూ నడుస్తున్నపుడు కరెన్సీనోటుతీసి దానినెంబరులోని చివరి అంకె సరాబేరా చెప్పమనేవాడు సరిగా చెప్పగలిగితే దానికి రెట్టింపు డబ్బులు ఇచ్చేవాడు ఆ భార్యా భర్తలు స్నేహశీలురు ప్రాక్సీ వియత్నాం వదిలిన తరువాత బెంగుళూరులో కర్నాటక ప్రభుత్వంలో అనేక ఉద్యోగాలు నిర్వహించాడు నేను మద్రాసులో ఉద్యోగం చేసే రోజుల్లో బెంగుళూరు టూర్‌మీద వెళ్ళినప్పుడల్లా వాళ్ళ ఇంట్లోనే మకాం చేసేవాణ్ణి కేంద్రప్రభుత్వంలో ఆర్థికశాఖకు కార్యదర్శిగా పనిచేసాడు ఢిల్లీలో కూడా ప్రతి క్రిస్టమస్‌కి నేను ఫెర్నాండెజ్ ఇంటికి ప్రత్యేక ఆహ్వానితుణ్ణి ఆ పార్టీలు బ్రహ్మాండంగా ఉండేవి

డెప్యూటీ సెక్రటరీ జనరల్‌గా ఉన్న నావద్ద ఇద్దరు ప్రయివేటు కార్యదర్శులు పనిచేసేవారు ఒకరు ఆఫీసు వ్యవహారాలు, రెండవవారు స్వంత వ్యవహారాలు చూసేవారు ఇంగ్లండులో చదువు పూర్తి చేసుకుని భారతదేశం తిరిగిరావడానికి ఓడప్రయాణ ఖర్చులకోసం భారత ప్రభుత్వం ఇచ్చిన అప్పు తీర్చి వేసాను అది పోగా నా అక్కౌంట్‌లో ఉన్న డబ్బంతా విదేశీ మారక ద్రవ్యంగా మార్చి వియత్నాంనుంచి చైనా రష్యా, పోలెండు, జర్మనీ, ఫ్రాన్సు ఇంగ్లండు మీదుగా భారతదేశం తిరిగిరావాలని ఆలోచన వచ్చింది నా పెర్సనల్ సెక్రటరీ విదేశీమారక ద్రవ్యం కోసం తన ప్రయత్నాలు తాను చేస్తే నేను కూడా నా ప్రయత్నంలో ఉన్నాను నా అమెరికన్ మిత్రుడు జో నెర్బోన్‌కి సైగాన్‌లో స్విస్ ఎయిర్‌లైన్సులో పనిచేసే వియత్నమీస్ స్నేహితురాలు ఉండేది అతడితో నా సమస్య చెప్పాను నెర్బోన్ తన స్నేహితురాలితో చెప్పాడు ఆమె కొంత విదేశీ మారక ద్రవ్యం ఇచ్చింది సైగాన్‌లో లండను అబ్జర్వరు పత్రికా ప్రతినిధిగా ఉన్న మిత్రుడు డెనిస్ బ్లడ్‌వర్త్ తనకు పారిస్

లండను బ్యాంకులలో ఉన్న అక్కౌంట్లనుండి నేను రెండువందల పౌన్లు తీసుకునే ఏర్పాటు చేసాడు అయితే తనవద్ద ఆ బ్యాంకుల చెక్కుపుస్తకాలు లేనందున నాకు తెల్లకాగితాలమీద ఉత్తరాలు వ్రాసి ఇచ్చాడు మిత్రుడు బాలేశ్వరప్రసాద్ తనకు విదేశాలలో ఉన్న అక్కౌంట్లనుంచి కొన్ని పౌండ్లు ఇచ్చాడు పదివేల రూపాయల విలువైన డాలర్లు, పౌండ్లు సమకూర్చాను

ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకున్నాను కాని అదే సమయంలో వియత్నాంలోను చైనాలోను బ్రహ్మాండమైన వరదల మూలంగా రైలు మార్గానికి గండ్లుపడి రైళ్ళ రాకపోకలకు అంతరాయం వచ్చినదని వార్తలు అందాయి అదృష్టవశాత్తు నా ప్రయాణం రోజుకి వారం రోజుల ముందే రైళ్ళు రాకపోకలు పునరుద్ధరించబడ్డాయని వార్త అందింది ఇక మిగిలింది రైలుటిక్కెట్టు కొనుక్కోవడం టిక్కెట్టు కోసం వెళితే మరొక యిబ్బంది ఎదురైంది అవసరమైన కాగితాలు అన్ని ఉన్నాయి కాని ఉత్తర వియత్నాం వదలడానికి ఆ ప్రభుత్వం అనుమతి వీసా ఉంటేకాని టిక్కెట్టు అమ్మనన్నారు సరే అదికూడా తెప్పించి రైలు టిక్కెట్టు కొనుక్కున్నాను హెనోయ్ నుంచి పెకింగ్‌కు రైలు టిక్కెట్టు, భోజనం కూపన్‌లు, అవసరమైన చోట పడవ, స్టీమరు చార్జీలు కలిపి 2,58,005 డాంగులు ప్రయాణ సన్నాహాలు పూర్తి అయ్యాయి

ప్రయాణం దగ్గర పడినకొద్ది హెనోయ్‌లో మిత్రులు అదుర్దా వ్యక్తం చేయడం మొదలుపెట్టారు నేను వెళ్ళబోయే దేశంలో మాట్లాడే భాషలు రాకుండా, మిత్రులు లేకుండా ఏమి యిబ్బందులు పడతానో అని వారి బాధ ఊరికే సరదాగా ఆరుమాసాలపాటు వినోదపర్యటన చేయడానికి కమ్యూనిస్టు దేశాలే దొరికాయా అని కొందరు ఆప్తుల ఆక్షేపణ ముఖ్యంగా కమిషను చైర్మను భారత రాజదూత శ్రీ టి ఎన్ కౌల్ అసలు ఈ ప్రయాణంలో పరమార్థం ఏమిటని పదేపదే ప్రశ్నించేవారు

ఈ ప్రయాణానికి నన్ను ప్రోత్సహించిన కారణాలు అనేకం ఉన్నాయి వాటిలో నా విజ్ఞానతృష్ణకు ప్రథమ తాంబూలం హెనోయ్ ముఖ్యపట్టణం గా ఉత్తర వియత్నాంలో 1954 లో హోచిమిన్ నాయకత్వంలో కమ్యూనిస్టు పాలన ప్రారంభం కావడాన్ని ప్రత్యక్షంగా చూసాను కమ్యునిస్టు దేశాలైన చైనా, సోవియట్ రష్యాలలో రాజకీయ పరిస్థితులు, ఆర్థిక, పారిశ్రామిక ప్రగతి సాధించడానికి వారు అవలంబించిన పద్ధతులు, సాంఘిక వ్యవస్థ, ముఖ్యంగా విద్యారంగంలో వారి అనుభవాలు తెలుసుకోవాలనే అభిలాష, తపన నా ప్రయాణ నిర్ణయానికి దోహదం చేసాయి వియత్నాం కమ్యునిస్టు రాజ్యస్థాపన కళ్ళారా చూచిన తరువాత అంతకు ముందు పదేళ్ళనాడు కమ్యునిస్టు విప్లవం

సాధించి చైనాను నూతన శక్తిగా రూపొందించిన మావో నాయకత్వంలో ప్రజలు ఎలా బ్రతుకుతున్నారో చూడాలనిపించింది ప్రపంచంలో కమ్యూనిస్టు ఉద్యమాలకు నాంది పలికి మార్క్స్ ఏంజెల్స్ కలల పంటగా కమ్యూనిస్టు దేశంగా 40 ఏళ్ళనుంచి అఖండ విజయాలు సాధించిన సోవియట్ రష్యాను చూడాలనుకోవడంలో ఆశ్చర్యం లేదు ముఖ్యంగా ఆ సమయంలో సోవియట్ రష్యా నాయకత్వంలో వచ్చిన మార్పులు, స్టాలిన్ వ్యతిరేక ఉద్యమం నన్ను ఎక్కువగా ఆకర్షించాయి

అదే సమయంలో యూరోపియన్ కమ్యూనిస్ట్ దేశాలలో కలకలం అలజడులు పోలెండు నిజంగా మార్పు చెందుతుందా అనే విషయం స్వయంగా తెలుసుకోవాలనే ఉత్సుకత ఇక రెండవ ప్రపంచ యుద్ధం పుణ్యమా అంటూ వియత్నాం ఉత్తర, దక్షిణ భాగాలుగా విభజించడం, రెండు రకాల ప్రభుత్వాలు ప్రజల యిక్కట్లు చూసినట్టే యూరప్‌లో తూర్పు పశ్చిమ భాగాలుగా విభజించబడిన జర్మనీని కూడా చూడాలనిపించింది. వినోదపర్యాటకుల పాలిటి కల్పతరువు పారిస్‌లో కొన్ని రోజులు గడపకుండా లండను వెళ్ళడం సాధ్యంకాదు పారిస్ యొక్క వశీకరణ శక్తి అటువంటిది ఇక లండను నగరం నాకు కొట్టిన పిండే అక్కడ నాలుగేళ్ళ చదువుకున్నాను పాతమిత్రులు, స్మృతులు, అనుభవాలు, అనుభూతులు మరొకసారిగుర్తు చేసుకుని ఆనందించాలని సంకల్పం లండను విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా చాలా ఆర్థిక యిబ్బందులు పడవలసివచ్చింది కాని ఈసారి డబ్బు కోసం ఇబ్బంది పడకుండా హాయిగా లండనులో కొన్ని రోజులు గడపాలనుకున్నాను నేను వియత్నాం గురించి వ్రాసిన గ్రంథాన్ని లండను పబ్లిషరు ద్వారా అచ్చువేయించాలనే సంకల్పం నేను లండను వెళ్ళాలనుకోవడానికి మరొక కారణం అది విని తాటిచెట్టు ఎందుకు ఎక్కావంటే దూడ గడ్డికి అన్నట్టు ఉందన్న మిత్రులు లేకపోలేదు

నేను హెనోయ్ వదిలే సమయానికి ముందే శ్రీ టియన్ కౌలు సెలవు మీద ఢిల్లీ వెళుతున్నారు అందుమూలంగా కొద్ది రోజులు ముందుగానే నాకు వీడ్కోలు విందు ఏర్పాటు చేసారు ఆసందర్భంలో చక్కటి డ్రాగన్ చెక్కడంతో ఉన్న వెండి సిగరెట్ కేసు బహూకరించారు నేను లంకపుగాకు చుట్టలు , దొరచుట్టలు, పైపు కాలుస్తాను కాని ఎప్పుడు సిగరెట్టు కాల్చనని శ్రీ కౌలుకు తెలును అయినా సిగరెట్టు కాల్చవు కాబట్టే సిగరెట్టు కేసు ఇచ్చానన్నాడు నాకు అర్థం కాలేదు ఈనాటివరకు ఆ కేసు మిత్రుల స్నేహ చిహ్నంగా నావద్ద ఉంది కాని అది ఇవ్వడంలోని పరమార్థం మాత్రం నాకిప్పటికీ అంతుచిక్కలేదు

ఇక వీడ్కోలు విందులు, పార్టీల పరంపర కమిషనులో పనిచేసే వియత్నమీస్ సిబ్బంది టీపార్టీ ఇచ్చి ఆ దేశంలో ప్రసిద్ధికెక్కిన లేకర్ పెయింటింగ్ బహూకరించారు దానిమీద పెయింట్ చేసిన చేప అత్యంత ఆకర్షణీయమైనది అప్పటికి ఉత్తర వియత్నాం ప్రభుత్వంతో డిప్లమాటిక్ సంబంధాలు పెట్టుకున్న కమ్యూనిస్టుకంటే ఇతర దేశాలు భారతదేశం, ఇండొనీషియా మాత్రమే ఇండొనీషియన్ కాన్సల్ జనరల్ వీర్ద వర్డోయో, ఆయన సతీమణి జుబేదా వారి ఇద్దరు కుమారులు నాకు ఎంతో ఆప్తులు అయ్యారు ఆయన నాకు ప్రత్యేకంగా వీడ్కోలు విందు చేసారు చక్కటి డచ్చి చుట్టల పెట్టె కానుకగా ఇచ్చాడు ఆవిందు మరపురాని అనుభవం తూర్పు జర్మనీ మిత్రులు ఇచ్చిన విందులో తెల్లవారు యూము వరకు డాన్సులు చేస్తూనే ఉన్నాం ఇక మరుసటిరోజు ప్రయాణం అనగా మిత్రులకందరికీ నేను పార్టీ ఇచ్చాను

  

# రైలు ప్రయాణం - నా అభిరుచి

ఎంతో ఆసక్తితో ఎదురు చూచిన ప్రయాణం రోజు రానేవచ్చింది ఆ ఉదయం 5 గంటలకే నిద్రలేచి కమిషను సెక్రటేరియట్‌లో పనిచేసే భారతీయ సిబ్బంది కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు పూర్తిచేసాను అది కమిషనులో నేను చేసిన తుది అధికారిక కార్యకలాపం ప్రయాణానికి పనికివచ్చే బట్టలు తప్ప మిగిలిన సామాన్లు బారతదేశం పంపించే ఏర్పాట్లు అంతకు ముందే పూర్తిచేసాను రెండు సూటుకేసులు, ఒక 16MM మూవీ కెమెరా, ఒక చేతి కెమెరా నాతో తీసుకు వెళ్ళడానికి నిర్ణయించాను హెనోయ్ నుంచి బయలుదేరే రైలు మామూలుగా ఉదయం 10 గంటలకు బయలుదేరుతుంది కాని దారిలో వరదవల్ల రైలు మార్గం మీద గండ్లు పడినందున రైలు ఉదయం 8 గంటలకే బయలుదేరుతుందన్నారు మిత్రులతో కలసి ఒక అరగంట ముందే స్టేషనుకి చేరాం భారత ప్రతినిధివర్గం నుంచి మిలిటరీ ఆఫీసర్లు, మిత్రులు బాలేశ్వరప్రసాద్, టి ఆర్ యస్ మూర్తి, ఇండొనేషియన్ కాన్సల్ జనరల్ వీర్ణవర్ణయో ఆయన భార్య, అనేక మంది వియత్నమీస్ మిత్రులు, సిబ్బంది నాకు వీడ్కోలు చెప్పడానికి స్టేషనుకి వచ్చారు రైలు ఎక్కడానికి అరగంట ముందు రావడాన్ని చూచిన మిత్రులు "విమానాశ్ర యానికి ఆలస్యంగా వెళితే విమానం మీకోసం ఆగుతుందికదా రైలు ప్రయాణానికి యింత ముందు రావాలా" అని హాస్యమాడారు

మిత్రులంతా అలా అంటూంటే వాళ్ళకు డా॥ సేన్ కధ చెప్పవలసి వచ్చింది డా॥ సేన్ కలకత్తా లో మెకనన్ మెకంజి కంపెనీ ఓడలలో డాక్టరు నేను లండను చదువుకునే టప్పుడు ఆయన స్కాట్లాండ్‌లో సుఖరోగాలమీద ప్రత్యేక శిక్షణ పొందుతున్నాడు ఆయన సోదరి ప్రతిమ స్విట్జర్లాండులో చదువుకుంటోంది వారిద్దరూ లండనులో నాగదిలో కలుసుకునేవారు ఆయన తిరుగు ప్రయాణంలో రైలు అందుకోవడానికి రెండు గంటల ముందునుంచీ స్టేషనుకి వెళ్ళాలని ఆదుర్దాపడేవాడు ఎలాగో ఆయన్ని సముదాయించి ధైర్యం చెప్పినా అధమం అరగంట ముందుగా స్టేషనుకి చేరితేకాని హాయిగా ఊపిరి పీల్చుకునే వాడుకాదు "అయ్యో నువ్వు ప్రపంచం అంతా ఓడల్లో తిరిగావు కదా, రైలు ప్రయాణం అంటే యింత గాభరా ఏమిటి" అని అడిగితే చిరునవ్వు నవ్వి "మూర్తిగారు లేకపోతే నాకు ఈరైలు అందేదేకాదు" అనేవాడు ప్రతిమ నేను విరగబడి నవ్వేవాళ్ళం రైలు ప్రయాణీకుల్లో డా॥ సేన్‌ది ఒక తత్వం

ఈతత్వానికి వ్యతిరేకంగా ప్రయాణం చేసే మిత్రులూ ఉన్నారు కొందరు రైలు బయలుదేరే ఆఖరు క్షణంలో వస్తే మరికొందరు రైలు వెళ్ళిపోయిన తరువాత వస్తారు మనకు రోజూ ఈ రెండు రకాల ప్రయాణీకులు తటస్థపడతారు అయినా ఆలస్యంగా బయలుదేరడానికి, ఆలస్యంగా రావడానికి రైళ్ళకున్న స్వాతంత్ర్యం మనకులేదు కాబట్టి రైలుబయలుదేరే వేళకు కొంచెం ముందుగా స్టేషనుకి వెళ్ళడం మంచిదనే తత్వం నాది

సూట్ కేసులు రైలులో ఫస్టుక్లాసులో పెట్టించి స్టేషనుకు వచ్చిన మిత్రులందరికి వీడ్కోలు చెప్పాను రైలు సరిగా 8 గంటలకు బయలుదేరింది ఆ రైలు పెట్టెలు చూస్తే పూర్వం నేను బందరులో చదువుకున్న రోజులు జ్ఞాపకం వచ్చాయి అప్పుడు నరసాపురం నుంచి బందరు వరకు మీటర్ గేజి రైలుమార్గం ఉండేది పెట్టెలు చిన్నవి పాతవి ప్రయాణం ఒక రోజు పట్టేది హెనోయ్ నుంచి నేను ఎక్కిన రైలు ఆ పాతరోజుల్ని గుర్తుచేసింది పెట్టెలు చిన్నవి, ఫస్టుక్లాసులో కూడా బల్లలే వియత్నాంలో అప్పటి రైలు మార్గం చూస్తే నాకు ఆశ్చర్యం అయింది మనదేశంలో బ్రిటిషు పాలకులు తమ స్వప్రయోజనాలకోరకైనా బ్రహ్మాండమైన రైలు మార్గాలు నిర్మించారు కాని ఇండోచైనా దేశాలను పాలించిన ఫ్రెంచివారు వారివలస రాజ్యాలలో రైలుమార్గాలు నిర్మాణానికి ప్రాముఖ్యత యిచ్చినట్టు కనుపించదు వియత్నాం స్వాతంత్ర్యం కోసం ఫ్రెంచి సైన్యాలతో యుద్ధం చేసినప్పుడు కూడా ఇరుపక్షాలు తమ సేనల రవాణాకు రైలు మార్గాలమీద ఆధారపడినట్టు లేదు వియత్నాం ప్రజాసైన్యానికి చెందిన సామాన్య సైనికుడు ఎన్ని రోజులైనా ఎంతదూరమైనా కాలినడకను వెళ్ళగలడు పెద్ద పెద్ద ఫిరంగులను కూడా అడవులు కొండ మార్గాలలో సైనికులే లాక్కువెళ్ళి యుద్ధం చేసారు ఆధునిక వాహనాలు, యుద్ధసామగ్రి సహాయం లేకుండా వియత్నాం ప్రజా సైన్యం డిన్‌బిన్‌ఫూ వద్ద ఫ్రెంచి వారిని ఓడించి స్వాతంత్రం సంపాదించింది 30 సంవత్సరాలు స్వాతంత్ర్యం కోసం పోరాడి విజయం సాధించిన తరువాత వారికి రోడ్లు, రైలు మార్గం, వంతెనలు బాగుచేసుకోవడానికి తీరిక దొరికింది చాలావరకు ఈ కార్యక్రమంలో ఉత్తర వియత్నాం ప్రభుత్వానికి చైనా ప్రభుత్వం సహాయం లభించింది చైనా ఇంజనీర్లు మేస్త్రీలు వంతెనలు, రోడ్లు పునర్నిర్మాణానికి, రైలు మార్గం బాగుచేయడానికి వియత్నామీస్ తో కలిసి పనిచేయడం సామాన్య దృశ్యం

కమ్యూనిస్టు మిత్రరాజ్యాలు ఉత్తరవియత్నాంకి అమెరికా, బ్రిటను, ఫ్రెంచి దేశాలు దక్షిణ వియత్నాంకి చేసిన సహాయం చూచిన తరువాత చిన్న దేశాలకు ఆర్థిక సహాయం అందజేయడంలో అమెరికా వంటి దేశాలు

కమ్యూనిస్టుల వద్ద నేర్చుకోవలసినది చాలా ఉందనిపించింది తూర్పు జర్మనీ ఉత్తర వియత్నాంకి 100 పడకల హాస్పిటల్ ఇవ్వడానికి నిర్ణయించింది భవనాలు జర్మనీ ప్రభుత్వం నిర్మించింది ఆ హాస్పిటల్‌కి కావలసిన మందులు పోలెండు యిచ్చింది అధునాతన వైద్య పరకరాలు చెకోస్లవేకియా బహూకరించింది ఇక డాక్టర్లు, సర్జన్లు, నర్సులు, సాంకేతిక వైద్యనిపుణులు తూర్పు జర్మనీ ప్రభుత్వం పంపింది వీరందరికి మకాం ఏర్పాటు చేయడమే వియత్నాం ప్రభుత్వం బాధ్యత వారికి జీతాలు వారి దేశంలో యిస్తూ వియత్నాంలో పనిచేసినందుకు ప్రత్యేక అలవెన్సులు కూడా ప|| జర్మనీ ప్రభుత్వం యిచ్చేది ఆ హాస్పిటల్‌లో కావలసిన మొత్తం డాక్టర్లు, నిపుణులు, నర్సులు, వియత్నాం ప్రభుత్వం నియమించింది ఒక ఏడాది పాటు జర్మన్ డాక్టర్లు, నర్సులు వియత్నమీస్ డాక్టర్లతో నిపుణులతో నర్సులతో కలిసి పనిచేసి తమతమ బాధ్యతలలో నైపుణ్యంలో తగిన ట్రైనింగ్ యిచ్చి ఏడాది తరువాత హాస్పిటల్ వియత్నమీస్‌కి వదలిపెట్టి వెళ్ళిపోయారు ఆ జర్మన్ డాక్టర్లును నర్సులను కలుసుకొని వారు అందించే సహాయం యొక్క పద్ధతి వింటే చాలా ఆనందంగా ఉండేది అదే విధంగా ఫ్యాక్టరీలు, పరిశ్రమలు నిర్మించడంలో సోవియట్ యూనియన్ సహాయం కూడా యిదే పద్దతిలో ఉండేది పశ్చిమ దేశాల ఆర్థిక సహాయం ఎలా పనిచేస్తుందో మనకు తెలుసు మనవాళ్ళు వారి దేశం వెళ్లి ట్రైనింగ్ అయి వస్తారు అది వ్యక్తికి మాత్రమే పరిమితం ఆ సంస్థ అంతటికీ విస్తరించదు అనేక ప్రణాళికలపై మన నిపుణులు విదేశాలు వెళ్ళడం చూస్తున్నాం వీరంతా దేశానికి, వారు పనిచేసే సంస్థకు ఎంతవరకు ఉపయోగపడుతున్నారనేది వేరే విషయం నా ఆలోచనలు అలా ధనిక మిత్రరాజ్యాలు నూతనంగా స్వతంత్రమైన పేదదేశాలకు చేసే సహాయం, వాటి ఫలితాల మీదకు పోయింది

నేను ప్రయాణం చేసే రైలులో రెండే తరగతులున్నాయి వియత్నాం చాలా పేద దేశం అనేక సంవత్సరాలు విరామంలేని స్వాతంత్ర్య పోరాటం లో నిమగ్నమైన ప్రజలలో స్వాతంత్ర్య సముపార్జనతో నూతన ఉత్సాహం, కార్యదీక్ష, ఆనందం గోచరిస్తాయి వియత్నాం ప్రజా సైన్యం సాధించిన విజయం ఫలితంగా ఉత్తర వియత్నాంలో పరిపాలన ప్రారంభించకముందే ధనికవర్గాలు, పెద్ద వ్యాపారస్తులు, దక్షిణ వియత్నాంకు తరలిపోయారు కమిషను నెలకొల్పబడ్డ తరువాతకూడా కమ్యూనిస్టు పాలనలో ఉండడానికి యిష్టంలేని వారిని సురక్షితంగా దక్షిణ వియత్నాం పంపించారు దానిలో ఉత్తర వియత్నాంలో హోచిమిన్ నాయకత్వంలో నమ్మకమున్నవారు మాత్రమే మిగిలారు ఆ పరిస్థితి ప్రభుత్వానికి కూడా మంచిదే అయింది ఉత్తర దక్షిణ

వియత్నాంలను మూడేళ్ళు చూచిన తరువాత తేడాలు స్పష్టంగా తెలిసాయి ఉత్తరాత్యులు కొంచెం మోటుగాను, ధృఢంగాను ఉంటారు లావు పొటివారు అరుదు కార్యశూరులు, కష్టపడి పనిచేసే స్వభావం చాలా సామాన్యమైన వేషం, మగవారు షరాయి, నగం చేతుల కంటిమెడ చొక్కా, అవికూడా చాలావరకు రంగుబట్టలే ఇక స్త్రీల దుస్తులు కమీజు నడుం దగ్గర నుంచి క్రిందివరకు రెండు భాగాలుగా ఉంటుంది స్త్రీలు చాలా నాజూగ్గా ఉంటారు ఇండోచైనా దేశాల ప్రజలందరు మంగోలియన్ లక్షణాలు కలవారే అందుమూలంగా చంద్రబింబాలవంటి మొఖాలలో అందం వార్ణించగలిగితే తప్ప వారిలో అందం చూడలేం ఐతే వారి వయస్సు ఊహించడం మనతరం కాదు ఇక దక్షిణ వియత్నాం స్త్రీ పురుషులపై ఫ్రెంచి సాంస్కృతిక ప్రభావం హెచ్చుగా కనబడుతుంది వారు చాలావరకు విలాస జీవితానికి అలవాటు పడ్డట్టు కనబడతారు అవినీతి, సామాజిక విలువల పతనం అప్పటికే కొట్టవచ్చినట్టు కనుపించేవి వియత్నాంలోని ప్రజలంతా వరి అన్నం తింటారు అన్నం పుల్లలతో తినడం వారు చైనానుంచి నేర్చుకుని ఉంటారు వారి ప్రత్యేకత నుక్మాం అది ఒకరకమైన ఉప్పు చేపల రసం ఘోరమైన వానన కొడుతుంది దానిని పీపాలతో నిలవ చేసుకుంటారు అది లేనిదే ఆ దేశస్థులకు ముద్ద దిగదు

వియత్నమీస్ భాష సంగీత ప్రధానమైనది వారు ఇంగ్లీషు అక్షరాలను తమ లిపిగా ఉపయోగిస్తారు కాని వారు వ్రాసే అక్షరాల నెత్తిన పెట్టే గుర్తులతో ఆ భాషకు సంగీత స్వరస్థాయిలు వస్తాయి అభాష నేర్చుకోవడానికి నేను చేసిన ప్రయత్నం తల్చుకున్నప్పుడల్లా నవ్వు వస్తుంది వియత్నాంలో అధమం మూడేళ్ళు ఉంటాం కదా అని నాకు ఆ భాష నేర్పడానికి ఒక మాష్టర్ని పెట్టుకున్నాను లిపి ఇంగ్లీషు అక్షరాలే కాబట్టి బాధలేదు ఇక మాటలు నేర్పడం మొదలుపెట్టాడు బి ఎ కలిపితే బ దాని అర్థం మూడు ఆ బ నెత్తిమీద ఒక గీత గీస్తే బా అవుతుంది దానికి అర్థం అవ్వ ఆ బా నెత్తిమీద ఒక పొల్లు చేరిస్తే బా ఆ అవుతుందన్నారు దాని అర్థం వేరు ఈ భాష వ్రాయడం సులువు కావచ్చు కాని మాట్లాడ్డం మొదలెడితే నానా ఇబ్బందులకు గురై అనూహ్యమైన పరిణామాలకు దారి తీయడం తథ్యం దానితో ఆ భాష నేర్చుకునే ప్రయత్నానికి స్వస్తి చెప్పాను ఉత్తర వియత్నాంలోను దక్షిణ వియత్నాంలోను మాట్లాడే భాష ఒకటే కాని ఉత్తరాది వారు మాట్లాడింది దక్షిణాత్యులకు అర్థంకావడం కష్టం అనేవారు ఏదో తెలంగాణా, రాయలసీమ, సర్కారు జిల్లాల తెలుగులో ఉన్న మాండలిక భేదాలు వియత్నమీస్ భాషలో కూడా ఉన్నాయన్నమాట బ్రిటిషు వలన దేశాలలో ఇంగ్లీషులాగే, ఫ్రెంచి వలన దేశాలలో ఫ్రెంచి భాష సామాన్యులకు కాకపోయినా, మధ్యతరగతి

ఉన్నత తరగతులలో బలంగా ఉంది ఫ్రెంచి భాషతో ఆరోజుల్లో వియత్నాంలో కాలక్షేపం చేయడం సులభంగా ఉండేది వియత్నమీస్ భాష నేర్చుకోలేక పోయాను కాబట్టి ఫ్రెంచిభాషతోనే మూడేళ్ళు గడిపాను

రైలు గంటసేపు ప్రయాణం చేసి ఆగింది అంతకుముందు మికాంగ్ నదికి వచ్చిన వరదలవల్ల రైలు మార్గం మీద పడ్డ గండ్లు అక్కడనుంచి ప్రారంభమయ్యాయి హెనోయ్‌నుంచి వచ్చిన రైలు దిగి పడవలలో ఎక్కమన్నారు హెనోయ్‌నుంచి వచ్చిన రైలు దిగి చుట్టూ చూస్తే వరదలలో ఉన్న మికాంగ్ నది మహా సముద్రంలా ఉంది కనుచూపు మేరవరకు రైలు మార్గం కనుపించడం లేదు ప్రపంచంలోని అన్ని నదులకు లాగానే మీకాంగ్ నదికి వరదలు రావడం కొత్తకాదు కాని ఆ సంవత్సరం వరదలు చాలా ఉధృతంగా రావడం వల్ల ఉత్తర వియత్నాంకి అపారమైన నష్టం వాటిల్లింది ఇక రైలు మార్గానికి జరిగిన నష్టం సరేసరి 5 కిలోమీటర్ల రైలు మార్గం వరదలలో కొట్టుకుపోయింది వరద నీరు తగ్గకపోయినా దాని పుణ్యమా అంటూ నదిమాత్రం పరవళ్ళు త్రొక్కడం లేదు రైలు ప్రయాణీకుల్ని నాటు పడవల్లో ఎక్కమన్నారు వియత్నాం ప్రభుత్వం అప్పటికి మోటారు లాంచీలు కూడా ఏర్పాటు చేయగలిగిన స్థితిలో లేదు పడవ ప్రయాణం వియత్నమీస్‌కి పెద్ద సమస్య కాదు అది వారి అలవాటే నాటు పడవ మీద ప్రయాణం నాకూ అలవాటే వశిష్ట గోదావరి తీరాన ఉన్నవారికి నావలలో రేవు దాటడం సామాన్య అనుభవం కదా అయితే ఆ రైలులో ప్రయాణం చేసిన విదేశీయులు ఆ పడవ ఎక్కడానికి పడ్డ అవస్థ వర్ణనాతీతం వారికది అలవాటు లేని అవుపోసన నానా అవస్థపడి ఆడమగ ప్రయాణీకులు పడవలు ఎక్కారు

ఆ రైలు కదిలిన తరువాత ఫస్టుక్లాసు పెట్టెలో ప్రయాణం చేసేవారిని పరిశీలనగా చూసాను రష్యను దంపతులు, పోలిష్ బార్యాభర్తలు, ఒక చైనీస్ కుటుంబం నలుగురు చైనీస్ ఇంజనీర్లు వీరంతా పెకింగ్, ఆపై గమ్యాలకు ప్రయాణం చేసేవారే ఒక శిఖు మేజరు, పోలిష్ డాక్టరు, ఇద్దరు భారతీయ సైనికులు, ఒక పోలిష్ దుబాషి డాంగ్ డాంగ్‌వరకు ప్రయాణం చేస్తున్నారు వారిలో భారతీయులతో తప్ప మిగిలిన ఎవరితోను మాట్లాడడానికి వారి బాషలు నాకు రానందున సాధ్యం కాలేదు దానికి తోడు కులాసాగా కబుర్లు చెప్పుకునే మూడ్‌లో లేను ఏవిటో మూడేళ్ళు వియత్నాంలో గడిపి ఆ దేశం అక్కడి మిత్రుల్ని వదలి రావడంతో మనస్సంతా అదోలా ఉంది ఆ అనుబవాలు, స్మృతులు ముసురుకొచ్చాయి

ఇలా ఆలోచనలలో ఉండగానే రైలు డాంగ్ డాంగ్ స్టేషను చేరింది అది వియత్నాంలో ఆఖరి స్టేషను అదే రైలు చైనా సరిహద్దు వరకు వెళుతుంది

ప్రయాణీకులకు డాంగ్ డాంగ్ లో కస్టమ్స్ పరీక్ష ఉంటుంది కాని నేను అంతకు ముందు కమిషను ఉద్యోగం చేసాను కాబట్టి నాకు కస్టమ్సు పరీక్షలేదన్నారు నాదగ్గర మిగిలిన వియత్నమీస్ డబ్బును 13 చైనీస్ యుయాన్లుగా మార్చాను సాయంకాలం 7గంటలకు (పెకింగ్ సమయం రాత్రి 8 గంటలకు) వియత్నాంనుంచి చైనా వెళ్లే మార్గంలో మొదటి చైనీస్ రైలు స్టేషను పెన్సియాంగ్ చేరాం

హెనోయ్‌లో ఉదయం 8 గంటలకు బయలుదేరిన రైలు రాత్రి 7గంటలకు పెన్సియాంగ్ చేరింది ఆ స్టేషను చైనా వియత్నాం దేశాలకు రైలు మార్గంలో సరిహద్దు అక్కడ రైలు మారాలి దానికి తోడు కస్టమ్స్, హెల్త్, పోలీసు విబాగాల అధికార్లకు ప్రయాణీకులు తమ అంతర్జాతీయ ప్రయాణానికి సంబంధించిన పాస్‌పోర్టు, అంతర్జాతీయ ఆరోగ్య పత్రం చూపించడం, కస్టమ్స్ ఫారాలు పూర్తి చేయడం మొదలైన లాంఛనాలు కూడా ఉంటాయి విదేశాలకు వెళ్ళినవారికి ఈ తతంగం అంతా అనుభవైకవేద్యం అయినా పాస్‌పోర్టు, వీసాలకు సంబంధించిన నియమాలు అన్నిదేశాలకు ఒకేరకంగా ఉన్నా ఆరోగ్యం, కస్టమ్స్ విషయాలలో దేశానికి దేశానికి కొన్ని భేదాలు ఉంటాయి

## చైనా చైతన్యం

నేను రైలు దిగగానే చైనీస్ పోలీసు వచ్చి నా పాస్‌పోర్టు తీసుకున్నాడు ఆరోగ్య అధికారి వచ్చి అంతర్జాతీయ ఆరోగ్యపత్రం తీసుకున్నాడు కస్టమ్స్ అధికారి ఒకఫారం ఇచ్చి అది పూర్తిచేయమన్నాడు విమానాశ్రయాల వద్ద ఈ అధికారులంతా ఒకేచోట కూర్చుంటారు ప్రయాణీకులు వారివద్దకు వెళ్ళి తమ ప్రయాణపత్రాలు చూపించాలి కాని రైలు ప్రయాణీకుల విషయంలో ఈపద్ధతిలో కొంచెం మార్పు ఉంటుంది అధికారులే ప్రయాణీకుల వద్దకు వస్తారు పెన్సియాంగ్ స్టేషనులో ముగ్గురు చైనీస్ అధికారులతో కూడిన బృందాలు ప్రయాణీకులు రైలుదిగగానే వారి పని ప్రారంభించారు ఆ బృందాలలో ఇంగ్లీషు, రష్యను భాషలు వచ్చిన వారు ఉన్నారు కాబట్టి నాకు ఇబ్బంది లేకపోయింది పోలీసు అధికారి చక్కటి ఇంగ్లీషు మాట్లాడాడు ...ఫస్టుక్లాసు వెయిటింగ్ గది చాలాపెద్దది అది పరిశుభ్రతకు మచ్చుముక్కలా ...ంది వాళ్ళ పుణ్యమా అంటూ టీ యిచ్చారు నారైలు టిక్కెట్టు ఒక యువతి ...నవ్వుతో పరీక్షించింది నాకు చైనా ప్రభుత్వం వీసా యిచ్చింది కాబట్టి ...లీసు వారితో గొడవలేదు కాని కస్టమ్సు అధికారులతో వ్యవహారం వేరు ...రు ప్రపంచం అంతటా ఒకే విధంగా ఉంటారు క్కాఠిన్యం కస్టమ్స్ వారికి ...గ్గుతో నేర్పిన విద్య నేను పూర్తి చేసిన కస్టమ్సు ఫారం తీసుకున్న

అధికారిలో కూడా ఆ కాఠిన్యం కనుపించింది నేను డాంగ్ డాంగ్ లో 13 చైనీస్ యుయాన్లు మార్చి 163 యుయాన్లు నావద్ద ఉన్నట్లు వ్రాయడం అతడికి అర్థంకాలేదు ఆ డబ్బు చూడాలన్నాడు చూపించాను 150 యుయాన్లు నీకు ఎలా వచ్చాయన్నాడు అవినేను హెనోయ్‌లో తీసుకున్నానని చెప్పాను నిజానికి అలా చేయకూడదు అది అంతర్జాతీయ నిబంధనల ప్రకారం నిషిద్ధం కాని నేను యదార్థాన్ని కస్టమ్స్‌ఫారంలో వ్రాసినందున అంత కఠినంగా కనుపించే అధికారి చిరునవ్వుతో అంగీకరించాడు "నీవద్ద ఏవైనా పుస్తకాలు, వ్రాతప్రతులు ప్రెస్ కటింగ్స్, ఫోటోలు ఉన్నాయా" అని అడిగాడు ఆ దేశం కస్టమ్సు నిబంధనల ప్రకారం అవిధమైనవి విదేశీ ప్రయాణీకులు వారి దేశంలోనికి తీసుకువెళ్ళకూడదట నావద్ద ఫొటోగ్రఫీ మీద ఉన్న రెండు పుస్తకాలు చూపించాను అవి నాకు సైగాన్‌లో అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ అమెరికా ఫొటోగ్రాఫరు మూయి స్నేహపూర్వకంగా బహూకరించాడు కస్టమ్సు అధికారి వాటిని చూడకుండానే పరీక్ష పూర్తి అయిందన్నాడు అక్కడితో ప్రయాణ లాంఛనాలు పూర్తి అయ్యాయి నేను పెకింగ్ వెళ్ళడానికి ఏవిధమైన అడ్డంకులు లేవు

పెకింగ్‌నుంచి రైలు వచ్చింది అప్పుడు సమయం రాత్రి గం 9-30 రైలు ఎక్కాను నేను హెనోయ్‌నుంచి వచ్చిన రైలు దిగినప్పుడు సామాను తెచ్చిన లైసెన్సుకూలీ సామాన్లు పెకింగ్ వెళ్ళే రైలుపెట్టెలో పెట్టి అతనికి నేను ఇచ్చిన కూలీకి రశీదుకూడా యిచ్చాడు ఆశ్చర్యపోయాను అది చైనీస్ పద్ధతి నేను ఎక్కిన ఫస్టుక్లాసు పెట్టెలో నాలుగు బెర్తులు ఉన్నాయి కాని దానిలో నేను ఒక్కణ్ణే ప్రయాణీకుణ్ణి ఆపెట్టె చాలా పరిశుభ్రంగాను అందంగాను ఉంది ప్రతి బెర్తుమీద చిరుతుంగచాపలు వేసి ఉన్నాయి భోజనానికి రెస్టారెంటు కారులోకి వెళ్ళాను మెనూ ఇంగ్లీషు భాషలోకూడాఉంది కాని ప్రయాణ బడలిక మూలంగా భోజనం సహించలేదు రైలు టిక్కెట్టుతో పాటు భోజనం కూపన్లు కొన్నాను కాబట్టి ఏదో భోజనం అయిందనిపించి కంపార్టుమెంటుకి వచ్చి పడుకున్నాను చైనాలో నా ప్రయాణం ప్రారంభమైంది

వియత్నాం - చైనా సరిహద్దు నుంచి పెకింగ్‌కి రైలు ప్రయాణం మూడు రోజులు పడుతుంది పెన్సియాంగ్ వదలిన తరువాత రైలు దక్షిణ చైనాలో వెళుతుంది ఆ ప్రాంతం అంతా వరి పండిస్తారు రైలులో కూర్చుని బైటకు చూస్తూ ఉంటే వరిపొలాలు, మట్టిగోడలతో కట్టుకున్న చిన్నచిన్న ఇళ్ళు కనిపించాయి డాబాలతోఉన్న ఇంటి కప్పుల మీద మట్టి వేసి వ్యవసాయం చేస్తున్న జాడలు కనిపించాయి అదిమరీ విచిత్రం అనిపించింది అయితే రైలులో నా సందేహాలు తీర్చడానికికాని నా ఆశ్చర్యాన్ని చెప్పుకోడానికి కాని

ఎవరూ దొరకలేదు ప్రయాణీకులైతే చాలామంది ఉన్నారు కాని వారితో మాట్లాడడానికి నాకు బాష రాకపోవడం పెద్ద ఇబ్బంది అయింది సౌజ్ఞలతో మాట్లాడ్డానికి ప్రయత్నించినా అవతల వ్యక్తి చెప్పేది మనకు అర్థం కాదు ఆ పరిస్థితి నరక సదృశం బాష రాకుండా విదేశాల్లో ఒంటరిగా ప్రయాణం చేయడం నిజంగా దుస్సాహసం ఏదో శాస్త్రం చెప్పినట్లు దిగితేకాని లోతు తెలియదుగా! అలా కళ్ళప్పగించి బైటి దృశ్యాలను చూస్తూ కూర్చున్నాను ఎక్కడ చూచినా నిర్మాణ కార్యకలాపాలు కనిపించాయి

7 వ శతాబ్దంలో హర్షచక్రవర్తి మనదేశాన్ని పాలించే రోజుల్లో చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ అంతకుముందు 5 వ శతాబ్దంలో రెండవ చంద్రగుప్తుని కాలంలో మనదేశానికి వచ్చిన ఫాహియాన్ భారతదేశాన్ని గురించి వ్రాసారేకాని చైనా గురించి వ్రాయలేదు నేను ప్రయాణం చేసే సమయానికి చైనా ప్రభుత్వం విదేశీ యాత్రికులు తమ దేశానికి రావడాన్ని పెద్దగా హర్షించే స్థితిలో లేదు అందుమూలంగా కమ్యూనిస్టు చైనా గురించి ఇంగ్లీషు భాషలో ఒకటి రెండు పుస్తకాలు మాత్రమే ఉన్నాయి అవి కూడా నేను పెకింగ్ చేరిన తరువాత కొనుక్కున్నాను ఇదంతా మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు కాని అది నిజం అంతవరకు వియత్నాంలో మిత్రులవద్ద విన్నది, ఎప్పుడో చదివిన చైనా చరిత్ర తప్ప ప్రయాణం చేసే సమయానికి నాకు తెలిసినది తక్కువనే చెప్పాలి దాని పుణ్యమా అంటూ నా ప్రయాణంలో చూచిన ప్రతిదీ క్రొత్తగాకనిపించి సంభ్రమాశ్చర్యాలలో ముంచి ఆనందపరిచేవి

ఆరోజు చాలా వేడిగా ఉంది రైలు పెట్టెలోని ఫాన్ కూడా దాని ఇష్టప్రకారం తిరిగింది ఆ రోజంతా ఎవరితో మాట్లాడకుండా గడిచిపోయింది మరుసటిరోజు హోరున వర్షం మధ్యాహ్నం గం 3-30 లకు రైలు ఊచాంగ్ చేరింది అధునాతనంగా ఉన్న ఒక చైనా యువతి వచ్చి చక్కటి ఇంగ్లీషులో పలకరించేసరికి ప్రాణం లేచివచ్చినట్టనిపించింది ఆమె ఇన్ టూరిస్టు సంస్థ ప్రతినిధి చైనాలోను, సోవియట్ యూనియన్‌లోను విదేశీ ప్రయాణాలకు సంబంధించిన వ్యవహారాలు ఇన్ టూరిస్టు సంస్థ నిర్వహిస్తుంది అది మనదేశంలో టూరిస్టు డిపార్టుమెంటువంటిది కాని ఆసంస్థ ట్రావెల్ ఏజంటు, ప్రభుత్వ టూరిస్టుశాఖ యొక్క విధులు కలిపి నిర్వహిస్తుంది పెన్నియాంగ్ నుంచి వచ్చిన రైలులో దిగిన విదేశీ ప్రయాణీకుల్ని యాంగ్ట్సీనదిని దాటించి హాంకౌలో పెకింగ్ వెళ్ళే రైలులో ఎక్కించడం ఆ అమ్మాయి బాధ్యత

ఊచాంగ్ రేవులో పెద్ద స్టీమరులో యాంగ్ట్సీ నది దాటి హాన్‌కౌ వెళ్ళాలి స్టీమరు జనంతో క్రిక్కిరిసి ఉంది అంతకుముందు వియత్నాంలో సైగాన్

పట్టణంలోను, హెనోయ్‌లోను చైనీస్‌ని చూసాను కాని విదేశాలలో స్థిరనివాసం ఏర్పరచుకున్న చైనీస్‌కి, చైనాలోని చిన్న పట్టణాలలో నివసించే వారికి వేషంలో తేడా ఉండడం సహజం మావో పరిపాలనలో ఉన్న చైనాలో ప్రజలంతా నీలిరంగు లాగులు నీలిరంగు చొక్కాలతో "నీలిచీమల" లా ఉన్నారని పించింది స్టీమరు సముద్రములోకి దూసుకువెళ్ళే ఓడలా వెళ్ళింది యాంగ్ట్సీ నది గంటకు 3 మైళ్ళ వేగంతో ప్రవహిస్తుంది ఆ నదిలో మధ్యతరహా చిన్న తరహా నౌకలు నడుస్తాయి నదిదాటి స్టీమరు దిగేసరికి హాన్‌కౌలో ఉన్నాం ఈ ప్రాంతాన్ని చైనా ప్రభుత్వం మంచి పారిశ్రామిక కేంద్రంగా అభివృద్ధి పరుస్తోంది చైనాలోని ప్రధమ ఇనుము స్టీలు సంస్థ ఊహాన్‌లో ప్రారంభించబడింది

హాన్‌కౌ రైలు స్టేషనుకి వెళ్ళడానికి టాక్సీ కోసం ఎదురుచూస్తుండగా అశేష ప్రజానీకాన్ని చూసాను ఆపట్టణం చాలా పెద్దదిలా అనిపించింది అయితే చరిత్రలో చైనా బలహీనంగా ఉన్నప్పుడు పాశ్చాత్యుల ఒత్తిడికి లొంగి వారి కోసం వదలిన పట్టణాల్లో హాన్‌కౌ ఒకటి అందుమూలంగా ఆ పట్టణం పోగొట్టుకున్న చైనీస్ కళా స్వరూపం పూర్తిగా పునరుద్ధరించ బడలేదు కుండపోతగా వర్షం కురుస్తోంది రైలుకి యింకా వ్యవధి ఉన్నా ఎక్కడకీ వెళ్ళడానికి వీలులేక పోయింది పెకింగ్ వెళ్ళే రైలు సిద్దంగా ఉంది పోర్టర్లు తమకు యిచ్చిన సొమ్ముకి రసీదులు యిచ్చారు పెన్సియాంగ్‌లో చాలా తక్కువ ఖర్చుతో రైలు ఎక్కాను కాని హాన్‌కౌలో ఖర్చు ఎక్కువ అయింది స్టీమరు ఖర్చులు గైడ్, టాక్సీ, పోర్టరు ఖర్చులు కలసి తడిసి మోపైడైంది సాయంకాలం గం 6-30కి రైలు కదిలింది

రైలు కదలడానికి ముందు స్టేషనులో శ్రీ దీక్షిత్ కనుపించాడు అతడు మనదేశంనుంచి పెకింగ్ వెళుతున్నాడు పెకింగ్‌లో భారత ప్రభుత్వం నిర్వహించబోయే ఎగ్జిబిషన్ సందర్భంలో అక్కడకు వెళుతున్నాడు దీక్షిత్ ప్రభుత్వ టెలిఫోను శాఖలో ఉద్యోగి తన సామాను తీసుకుని నా పెట్టెలోకి వచ్చేసాడు ఆ రైలు పెట్టె అంతకుముందు ప్రయాణం చేసిన దానిలోగే ఉంది ప్రతి పదినిమిషాలకు టీ రైలు పెట్టెలో సంగీతం వస్తుంది కాని వినాలని లేకపోతే మనమే ఆపివేయవచ్చు మా పెట్టెలో ఉన్న కండక్టరు గార్డు యువకుడు ఉత్సాహవంతుడు కొద్దిగా ఇంగ్లీషు మాట్లాడగలడు అతడికి విదేశీ ప్రయాణీకుల ఫోటోలు, విదేశీ కరెన్సీ సేకరించడం హాబీ అట కాని సర్వీసు మాత్రం చెప్పకోతగినంత సంతృప్తిగా లేదు దీక్షిత్ ఏదో మాట్లాడేస్తున్నాడు ఈసారి మాట్లాడ్డానికి తోడు దొరికినందుకు సంతోషించాను

తెల్లవారి లేచి రైలులోనుంచి చూస్తే మరొక చైనాలో ఉన్న భావం

కలిగింది యాంగ్ట్సీ నది దక్షిణాన వరిపొలాలు ఉత్తరానికి వచ్చేసరికి మొక్కజొన్న పంట ప్రముఖంగా కనుపించింది కనుచూపుమేర దూరం అంతా సమతల ప్రదేశం చిన్నవి, సన్న పీలికలుగా ఉన్న పొలాలు మట్టి ఇళ్ళతో ఉన్న పేద గ్రామాలను పొదలు, చిన్న చిన్న చెట్లు మరుగుపరుస్తున్నాయి, ఇళ్ళు మట్టితో కట్టినవి కావచ్చు కాని అందంగా ఉన్నాయి కొంతమేర ప్రత్తిపంట కనుపించింది ఆతరువాత కొండచెరియలలో కట్టిన ఇళ్ళతో కూడిన గ్రామాలు, అలాచూస్తూ ఎంతసేపైనా విసుగు చెందకుండా రైలుప్రయాణం చేయవచ్చుననిపించింది

ఆ ఉదయం బ్రేక్‌ఫాస్ట్ వద్ద ఇంగ్లీషు మాట్లాడే విదేశీయుడు కనుపించాడు ఆయన ఇంగ్లీషు, చైనీస్ భాషలు రెండూ అనర్గళంగా మాట్లాడుతున్నాడు ఆయన్ని చూడగానే పేదకు పెన్నిధి దొరికినట్లు ఆనందించాను ఆయన పేరు డాక్టరు జార్జి హాటెమ్ కావడానికి అమెరికన్ కాని చాలా ఏళ్ళుగా చైనాలో ఉండిపోయి చైనా పౌరసత్వం తీసుకున్నాడు చైనీస్ పేరు డా॥ మాహైఫీ చైనాదేశం యొక్క ప్రగతి ప్రభుత్వ విధానాలు ప్రజాభిప్రాయాలు ఇంకా అనేక విషయాలమీద చక్కగా మాట్లాడుతూ గడిపేశాను ప్రయాణం చేసినట్టేలేదు

సాయంసమయానికి మా ముందు బ్రహ్మాండమైన నది ప్రత్యక్షమయింది అదే పసుపు నదిగా పేర్కొనబడే హోయాంగ్ హో ఇది చైనాలో యాంగ్ట్సీ నది తరువాత పెద్ద నది 3,000 మైళ్ళు పొడవు హోయాంగ్ హో లోని నీళ్ళు నిజంగా పచ్చగా క్రీం కాఫీ రంగులో ఉంటాయని చాలా మంది వర్ణించారు మేటవేసిన జాగాలు పసుపు పచ్చగా ఉంటాయి కొండలలో ప్రవహిస్తూ వచ్చే పసుపునది చైనీస్‌కి అత్యంత ప్రీతిపాత్రమైన డ్రాగన్‌ని గుర్తుచేస్తుంది చైనీస్ చిత్రకళలో డ్రాగన్ చిహ్నానికి అత్యంత ప్రాముఖ్యత ఉంది అది పసుపునది నడిచే తీరులోనుంచి తీసుకుని ఉంటారని భావుకుల ఊహ ఈనదిని చైనాదేశపు దుఃఖ సాగరంగా అభివర్ణించడం సంప్రదాయం క్రీ పూ 2,300 నుంచి ఈ శతాబ్దంలో 1938 వరకు ఈ నది హోపె, షాన్ టుంగ్ కియాంగ్సు రాష్ట్రాలగుండా ఏడుసార్లు తన పథాన్ని మార్చింది ప్రతి సంవత్సరం చైనాలోని నదులన్నిటిలో వరదలు రావడం పరిపాటి కాని ప్రభుత్వాధికారుల కృషి, ప్రజల సహకారంతో సాధ్యమైనంతవరకు వరదలు రాకుండా చేయడంలో ...రదలు వస్తే వాటివల్ల అపార నష్టం రాకుండా చేయడంలో చాలా వరకు ...ృతకృత్యు లయ్యారు 1949లో 1కోటి60 లక్షల ఎకరాలు వరదలకు ...రయితే 1952 నాటికి 30 లక్షలు ఎకరాల కంటే తక్కువ విస్తీర్ణం వరదలకు ...రి అయింది ఈ సమస్యపై నిరంతర కృషి జరుగుతూనే ఉంది హోయాంగ్ ...ో మీద పెద్ద రైలువంతెన నిర్మించారు రైలు ఆ వంతెనమీద వెళుతూంటే

వరదలలో ఉన్న హోయాంగ్ హో సర్వశోభాయమానంగా ఉంది

రాత్రి పడింది పెకింగ్ దగ్గర పడుతోందన్న ఉత్సాహంలో కబుర్లు కట్టిపెట్టి దిగే సమయం కోసం ఎదురుచూస్తున్నాను శ్రీ టి యస్ కౌల్ పెకింగ్‌లో శ్రీ పరంజపాయ్‌కి నన్ను స్టేషన్ వద్ద కలుసుకోవలసినదని జాబు వ్రాసారు పెకింగ్‌లో నేను పాయ్ అతిధిగా ఉండడానికి ఏర్పాట్లుచేసారు కాని ఆయన స్టేషన్‌కి వస్తాడో లేదో అని అనుమానం తప్పకుండా వస్తాడని ధైర్యం అతడు రాకపోతే ఏమిచేయడం అని ఆందోళన లక్ష్మివారం ఉదయం ప్రారంభమైన రైలు ప్రయాణం శనివారం రాత్రి 10-30 గంటలకు పెకింగ్‌లో పూర్తి అయింది రైలు పెకింగ్ స్టేషన్‌లో ఆగిన కొద్ది క్షణాల్లో పరంజపాయ్ "మీరే మూర్తిగారు అయి ఉంటారని" పలకరించేసరికి ప్రాణం లేచివచ్చింది ఇక అనుమానాలకు, ఆందోళనకు తావులేదు నా రైలు యాత్రలో మొదటి మజిలీకి చేరాను

పెకింగ్‌లో నాకు ఆతిధ్యం యిచ్చిన శ్రీ పరంజపాయ్ చైనాలో పదకొండు సంవత్సరాలనుంచి ఉంటున్నాడు మాండరిన్ చైనీస్ భాష చైనీయులవలే మాట్లాడగలడు మన దేశంలో ఉన్నట్టే చైనాలో కూడా భాషాపరంగా భేదాలు ఉన్నాయి మాండరిన్ మేధావులు, ఉన్నత కుటుంబీకులు మాట్లాడే రాజభాష అంటే క్వీన్స్ ఇంగ్లీషు వంటిదన్నమాట అయితే వారి భాషాలిపి యింత వరకు బొమ్మలతోనే ఉంటుంది అందుమూలంగా కొన్ని అక్షరాలు నేర్చుకుని వాటి సహాయంతో మాటలుకూర్చి అక్షరాస్యులు అయ్యామనుకోవడం ఆదేశంలో సాధ్యంకాదు ఎంత మేధావి అయినా భాషను నేర్చుకోవడానికి నిరంతర కృషి చేయవలసినదే పదకొండేళ్ళ తరువాత కూడా వారానికి మూడుసార్లు చైనీస్ ప్రొఫెసర్ వద్ద మిత్రుడు పాయ్ ట్యూషన్లు చెప్పించుకోవడం చూచి ఆశ్చర్యపోయాను పాయ్ అప్పుడు పెకింగ్‌లో భారత రాయబారి కార్యాలయంలో చైనీస్ ఇంగ్లీషు దుబాసిగా పనిచేసేవాడు ఆ తరువాత పెద్దల అనుగ్రహం సంపాదించి మన కేంద్రప్రభుత్వంలో జాయింట్ సెక్రటరీ, అటుపిమ్మట భారత రాయబారిగా కూడా వెళ్ళాడు పరంజపాయ్ యువకుడు, ఒంటరిగా ఉంటున్నాడు మంచి సరదా పురుషుడు

మొదటి రోజు సాయంకాలం పరంజపాయ్‌తో కలసి పెకింగ్ పట్టణంలో చూడదగ్గ ముఖ్య ప్రదేశాలు ఒక చుట్టు తిరిగి వచ్చాం ఆ పట్టణంలో 20రోజులు ఉన్నతరువాత పెకింగ్ చాలా అందమైన పట్టణమనే అభిప్రాయానికి వచ్చాను చూడవలసినది, తెలుసుకోవలసినది ఎంతో ఉంది భాష రాకపోవడం గొప్ప ఇబ్బంది అయింది అంతేకాకుండా నన్ను కూడా

పెట్టుకుని త్రిప్పి ఆ పట్టణం చూపించడానికి పాయ్‌కి వ్యవధి లేకపోవడం వల్ల నేనే ధైర్యం చేసి ఒంటరిగా తిరగవలసి వచ్చింది పెకింగ్‌లో ఇళ్ళు సన్న సందులలో ఉంటాయి ఆ సందుల్ని హూతుంగ్ అంటారు వీధిలోకి కిటికీలు ఉండవు కాని లోపల నిర్మించిన ఇళ్ళు పెద్దవిగాను అందంగాను ఉన్నాయి ఇక ఆ పట్టణం నిర్మాణంలో ఒక విశిష్టత ఉంది మన దేశంలో ఢిల్లీ పట్టణం పాండవులనాటి ఇంద్రప్రస్థ నగరం నుంచి నేటి న్యూఢిల్లీ వరకు ఏడుసార్లు నిర్మించారని చారిత్రకులు చెబుతారు పూర్వపు ఢిల్లీ పట్టణ అవశేషాలు ఈనాటికీ ఉన్నాయని చెబుతారు ఐతే పెకింగ్ పట్టణం యొక్క ప్రత్యేకత ఏమిటంటే అది ఐదుపట్టణాల కూటమి కావడం ఈ ఐదు పట్టణాలు ఒకదానిలో ఒకటికాని ఒకదాని ప్రక్క మరొకటి కానీ ఉండడం విశేషం టాంగ్ వంశస్థులు (క్రీశ 618-907) ప్రధమంగా నిర్మించిన స్థలంలోనే అనేక మార్పులకు గురి అయినా పెకింగ్ పట్టణం నేటికి నిలిచి ఉంది గత 800 సంవత్సరాలలో ఈపట్టణాన్ని నాలుగుసార్లు పునర్నిర్మించారు

మింగ్ చక్రవర్తులు ఈపట్టణాన్ని చతురస్రంగా నిర్మించారు దానిని లోపలి పట్టణం లేక టార్‌తార్ పట్టణం అంటారు తరువాతి కాలంలో దానిని మంచూ పట్టణం అనడం కూడా ఆచారం అయింది ఈలోపలి పట్టణంలో ...త్యంత ఆకర్షణీయమైన రాజప్రాసాదాలు, దేవాలయాలతో కూడిన ...ర్వభౌమ పట్టణం ఉంది ఈ సార్వభౌమ పట్టణానికి నడిబొడ్డుగా ...వేశనిషిద్ధ పట్టణం పర్బిడెన్ సిటీ ఇది చైనా చక్రవర్తులకోసం ...పత్యేకించబడిన పట్టణం దీనిలో రోడ్లు ఉండవు ఈరోజు వరకు ...విధమయిన వాహనాలైనా దాని చుట్టూ తిరిగి వెళ్ళవలసిందే చైనాను ...ంచూస్ 1644లో జయించినపుడు ఈపట్టణాన్ని తమకోసం ఉంచు కొని ...క్కడ ఉన్న చైనీస్ సేవకుల్ని పరివారాన్ని అపట్టణపు గోడల బైటికి ...ంపివేసారు అదే ఈనాటికీ బైటిపట్టణం లేక చైనీస్ పట్టణంగా ...గణింపబడుతోంది 19వ శతాబ్దంలో పాశ్చాత్యులకు చైనా తలఒగ్గవలసి ...్చినపుడు వారి వసతికోసం నిర్మించినదే లిగేషన్ పట్టణం ఈ ఐదు ...ట్టణాల కలయిక ప్రస్తుతపు పెకింగ్ పట్టణం ఈపట్టణాలకన్నింటికి ...త్యేకమయిన గేట్లు నిర్మించారు

పెకింగ్ పట్టణం యూరోపులో రోమ్ పట్టణంలా చాలా ఆకర్షణీయంగా ...టుంది నూతన వధూవరులకు హనీమూన్ పట్టణంగా పనికి ...ందనిపించింది పట్టణ పరధిలోనే సరస్సులు పార్కులు అత్యంత ...ణీయమయిన కట్టడాలు చైనీస్ కళానైపుణ్యానికి, నిర్మాణ సామర్థ్యానికి ...మృతునకలు అనవచ్చు శీతాకాలంలో పట్టణంలోని సరస్సులన్నీ మంచుతో

గడ్డకట్టుకుపోయి యువతీయువకులకు స్కేటింగ్ సదుపాయాన్ని కల్పిస్తాయట

స్వర్గతుల్య శాంతి ద్వారం (టీన్ అన్ మెన్) చారిత్రాత్మకమైన కట్టడం దీనిని 1420లో మింగ్ చక్రవర్తి సార్వభౌమ పట్టణానికి దక్షిణ మధ్యద్వారంగా నిర్మించాడు ఇక్కడే అక్టోబరు1 1949 నాడు చైనా రిపబ్లిక్ అవతరణ మహోత్సవం జరిగినదంటే, ఈచారిత్రక నిర్మాణానికి నేటి చైనాపాలకులు యిచ్చే ప్రాముఖ్యత అర్థం అవుతుంది పీహై పార్కు, దానిలోని సరస్సు బోటింగ్ సదుపాయాలు ఆకర్షణీయంగా ఉన్నాయి ఇక కోల్ హిల్ పార్కు ఎప్పుడో 1644లో ఆఖరి మింగ్ చక్రవర్తి ఈపార్కులోని ఒక చెట్టుకి ఉరిపోసుకు చచ్చిపోయాడట ఆచెట్టు ఈనాటికి ఉంది దానిని చూచిన తరువాత శత్రుదాడిని ఎదుర్కోవడానికి మరో మార్గం లేనట్టు చైనా చక్రవర్తి చెట్టుకి ఉరివేసుకు చనిపోయాడంటే ఆనాటి చక్రవర్తుల ధైర్యసాహసాలమీద ఎవరికైనా ఏవగింపు పుడుతుంది ఆపార్కు యిప్పుడు పిల్లల కోసం ప్రత్యేకించారు

పరంజపాయ్ చైనాలో చాలా ఏళ్ళనుంచి ఉన్నందున తీరిక సమయాల్లో అతడితో మాట్లాడుతూ కూర్చుంటే ఆ దేశప్రజల ఆచార వ్యవహారాలు, ఇటువాట్లు రాజకీయాలగురించి విషయాలు తెలిసేవి ఒక్కణ్ణి సాహసించ గలిగినంతవరకు పెకింగ్‌లో వీధులలో తిరిగాను ఆ పట్టణంలో చూడదగ్గ ప్రదేశాలు అందమైన కట్టడాలు అనేకం ఉన్నాయి కాని ఆ అందాలన్నీ ఒంటరిగా చూడ్డం తప్ప ఎవరితోనూ కాస్సేపు కూర్చుని మాట్లాడ్డానికి అవకాశాలు చాలా తక్కువ అయితే భారత రాయబార కార్యాలయానికి వెళితే మాత్రం బోలెడు కాలక్షేపం అంబాసిడర్ శ్రీ ఆర్ కె నెహ్రూ కౌన్సిలర్ శ్రీ బహదూర్‌సింగ్ ఆయన నేను ఒకే బ్రాండు చుట్టలు కాలుస్తామని తెలిశాక మా 'చుట్టరికం' పెరిగింది ఆ రోజుల్లో మావో నాయకత్వంలో చైనా సాధిస్తున్న ప్రగతిని గూర్చి ఆయన చక్కగా వివరించాడు

అంబాసిడర్ శ్రీ నెహ్రూతో చాలాసేపు చర్చించాను చైనా నాయకుల్ని కలుసుకోలేకపోయిన లోటును ఆయన తీర్చాడు నేను వ్యక్తం చేసిన ప్రతి అభిప్రాయాన్ని ఆయన పాశ్చాత్యులు చైనా విషయంలో చేసే అభాండాలుగా కొట్టివేసాడు పెకింగ్‌లోని మన రాయబార కార్యాలయంలోని వారంతా కలిసి తరచు పట్టణంలోని రెస్టారెంట్లకు వెళ్ళి చైనీస్ భోజనం చేస్తూ ఉంటారు ఆనాడు బహదూర్‌సింగ్ నన్ను తన అతిథిగా తీసుకువెళ్ళాడు విదేశాలలో చైనీస్ భోజనానికి, పెకింగ్‌లో చైనీస్ భోజనానికి ఏవిధమైన సంబంధం కాని, సారూప్యం కాని లేదు విదేశాలలో భారతీయ భోజనంలాగే విదేశాలలో చైనీస్

భోజనం కూడా కలగూరగంప మనదేశంలో ప్రతి రాష్ట్రానికి భోజనంలో ఒక ప్రత్యేకత ఉన్నట్టే చైనాలోకూడా ప్రతి రాష్ట్రానికి వంటకాలలో ప్రత్యేకత ఉంది అయితే ఆదేశంలో అన్ని రాష్ట్రాలలోను తినే పద్ధతి మాత్రం ఒకటే వారంతా రెండు పుల్లల్తో (చాప్ స్టిక్) భోజనం చేస్తారు జపాన్, ఆగ్నేయ ఆసియా దేశాలన్నిటిలోను, పుల్లలతోనే తింటారు పుల్లలతో భోజనం చేయడం అంత సులభం కాదు చైనీయులు అన్నం పుల్లలతో తినడం చూచి తీరాలి అన్నంతో ఉన్న పింగాణి గిన్నె ఒకచేతితో నోటివద్ద పెట్టుకుని రెండవ చేతిలోని పుల్లలతో నోటిలో కుక్కుకుంటారు మనలా కూరలు తదితర పదార్థాలు కలుపుకు తినడం వారి పద్ధతి కాదు ఆ పుల్లలతో ఎంత తిన్నా తిన్నట్టు అనిపించదు అందుకే అమెరికన్లు ఫోర్కు, స్పూన్‌లు ఉపయోగిస్తారు చైనాలో వాటిని అమెరికన్ చాప్‌స్టిక్స్ అంటారు

పెకింగ్‌లో ఆ దేశంలోని అన్ని రాష్ట్రాల భోజనం ఆయా రాష్ట్రాల ప్రత్యేక రెస్టారెంట్లలో తయారు చేస్తారు కాని వారికందరికీ కూడా శాకాహారం అంటే తెలియదు చైనీస్ అన్నిరకాల జంతువుల్ని తింటారు వారు పాముల్ని తింటారని మనం విడ్డూరంగా చెప్పుకుంటాము కాని యిష్టమైనవారికి ఆ పాములు (విషసర్పాలు కావులెండి) ఊరగాయ బ్రహ్మాండంగా ఉంటుంది పెకింగ్ వెళ్ళడానికి ముందే సైగాన్‌లోని చైనాటౌన్ ఛోలాన్‌లో చైనీయుల వంటకాలు రుచి చూసాను కాబట్టి నాకు పెద్ద ఆశ్చర్యం అనిపించలేదు కోతి మెదడు, నెమలిసూపు, ఎన్నో ఏళ్ళనాటి కోడిగ్రుడ్లు, పాముల ఊరగాయ, ఇంకా ఎన్నో ప్రత్యేక పదార్థాలు దొరుకుతాయి చైనీయుల భోజనంలో పందిమాంసం, బీఫ్ కొన్ని రాష్ట్రాలలో ప్రముఖంగా ఉంటాయి పెకింగ్ డక్ ప్రపంచ ప్రఖ్యాతికెక్కినది

సాదారణంగా చైనీయుల భోజనంతో పసుపుపచ్చగా ఉండే వైన్ తీసుకుంటారు అది గోరువెచ్చగా ఉండగా తీసుకోవాలి దానిలో పెద్ద నిషా ఉండదు కాని నిషా కావాలంటే మావుతాయ్ అనే చైనీస్ రైస్ వైన్ పెట్టింది పేరు అది ఘోరమైన వాసన కొడుతుంది ముక్కుమూసుకుని మావుతాయ్ గొంతులో పోసుకుంటే అది వెళ్ళినంత దూరం మండిపోతుంది దానిని పింగాణీ సీసాలలో ఉంచుతారు చైనా బైట మావుతాయ్ దొరకదు అది ప్రయాణం చేయడానికి ఇబ్బందులు చాలా ఉన్నాయి అందుకనే విదేశాలలో చైనా స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంగా ఆ రోజుకి అందేటట్టు విమానంలో పంపుతారు అదీ మావుతాయ్ మహత

ఆరాత్రి భోజన సమయంలో పెకింగ్ విశ్వవిద్యాలయంలో చైనీస్ భాష నేర్చుకుంటున్న వోరా దంపతులను కలుసుకున్నాను వారి ఆహ్వానంపై

మరునాడు పెకింగ్ విశ్వవిద్యాలయానికి వెళ్ళాను నేను ఒక్కణ్ణే యూనివర్సిటీకి బస్సులో వెళ్ళాను పాయ్ ఏబస్సు ఎక్కడ ఎక్కాలో చెప్పి దిగవలసిన చోటు వివరాలు చైనీస్‌లో వ్రాసి ఇచ్చాడు అది ఆ బస్సు కండక్టరుకి చూపిస్తే అతడు యూనివర్సిటీ ముందు దింపాడు అక్కడ ఒక పోలిష్ విద్యార్థి నన్ను వోరా గదికి తీసుకువెళ్ళాడు వోరా ఢిల్లీలో ఆకాశవాణిలో చైనీస్ భాషా విబాగంలో పనిచేస్తున్నాడు అతణ్ణి చైనీస్ నేర్చుకోవడానికి బారత ప్రభుత్వం పెకింగ్ విశ్వవిద్యాలయానికి పంపింది ఆయన భార్యాసమేతంగా పెకింగ్ వచ్చాడు విద్యాప్రకాష్ దత్తు ఆయన భార్య కూడా అక్కడ చైనీస్ భాష నేర్చుకుంటున్నారు ఛటర్జీ కూడా అదే వ్యాపకంలో ఉన్నాడు వారినందరినీ కలిసి భోజనం చేసిన తరువాత చైనాలో విద్యావిధానం గురించి వివరాలు తెలుసుకున్నాను

పెకింగ్‌లో మిత్రుడు పరంజ పాయ్ ఇంటిసందులోనే పెకింగ్ పీపుల్స్ డెయిలీ పత్రికా కార్యాలయం కూడా ఉంది వారి ఆఫీసు ప్రారంబం కావడానికి ముందే ఆ భవనంలోనుంచి ఉపన్యాసాలు బిగ్గరగా వినిపించేవి అలా ప్రతిరోజూ జరుగుతూ ఉంటే నాకు అనుమానం వచ్చి పత్రికా కార్యాలయంలో ఆ ఉపన్యాసాలు చర్చలు ఏమిటి అని అడిగాను పాయ్ చిరునవ్వు నవ్వి చైనాలోని అన్ని కార్యాలయాల్లోను దినచర్యలో ప్రధమ భాగంగా ఈ చర్చలు, ఉపన్యాసాలు ఉంటాయన్నాడు అది దిద్దుబాటు కార్యక్రమంలో బాగం ఉద్యోగులంతా తమ ఉద్యోగ ధర్మ నిర్వహణానికి ముందు వ్యక్తులయొక్క తప్పొప్పులను చర్చిస్తారు తప్పులు దిద్దుకోవడానికి సూచనలు,సలహాలు ఇవ్వబడతాయి క్షమాపణలు, భవిష్యత్తులో జాగ్రత్తల హామీలు పూర్తి అయిన తరువాత ఆనాటి కార్యక్రమాన్ని గూర్చిన చర్చలు జరుగుతాయి

ప్రభుత్వ అధికారులు తలపెట్టిన కార్యక్రమాన్ని ప్రజలు సిబ్బంది తమ నిర్ణయంగా భావించేటట్లు చేయడం చైనా ప్రభుత్వం అవలంభించిన పరిపాలనానీతి దీనిలోని అందం ఏమిటంటే ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని ప్రజలే తమకు తామై ప్రభుత్వాన్ని ఆ నిర్ణయం చేయమని కోరినట్లు వారికి అనిపించేటట్లు చేయడం ప్రభుత్వం నిర్ణయం తీసుకుంటుంది కాని దానిని నిర్ణయంగా కాకుండా అలాచేస్తే బాగుంటుందనే సలహాగా ప్రజల ముందు ఉంచుతుంది దానిపై చర్చలు జరుగుతాయి ప్రజలలో పార్టీ కార్యకర్తలు తీసుకువచ్చే మానసిక పరివర్తన ప్రాబల్యంతో ప్రజలే ఆ నిర్ణయాన్ని కోరతారు అప్పుడు ప్రజల కోరికపై ప్రభుత్వం ఆ నిర్ణయాన్ని ప్రకటిస్తుంది ఈ పద్ధతి మూలంగా ప్రజలకు తాము ప్రభుత్వ విధాన నిర్ణయంలో

బాగస్వాములమన్న బావన, సంతృప్తి మద్దతు ఉంటుంది ఈ పద్ధతిలో ప్రబుత్వం తమ నిర్ణయాలు ప్రజల నెత్తిన రుద్దుతున్నారనే ఆలోచనకు తావులేదు

అప్పటి చైనా ప్రదాని చౌ ఎన్ లే ని 1954 లో వియత్నాంలో చూచినప్పటినుంచి చైనీయుల పేర్ల విషయంలో సందేహం నన్ను పీడిస్తూ ఉండేది పెకింగ్‌లో పాయ్‌కి చైనా బాషనేర్పడానికి వచ్చే ప్రొఫెసర్‌తో నా సందేహం వ్యక్తం చేసాను ఆయన చెప్పిన వివరం ప్రకారం చైనీయులు కూడా ఆంధ్రులలాగే ఇంటిపేరు మొదట వ్రాసుకుని తమ పేరు తరువాత వ్రాసుకుంటారని తేలింది అంటే చౌ అన్నది ఆయన ఇంటిపేరన్నమాట వారి ఇంటిపేరులు వంశపారంపర్యంగా వస్తాయి చాలావరకు గ్రామం, పదవులు వృత్తులు వారి ఇంటిపేర్లకు ఆధారం చౌ అన్నది ఒక రాజ్యం పేరు సూజు అన్నది చౌ రాజ వంశానికి విద్యామంత్రి బిరుదు హౌ అనేది ఇంగ్లాండులోని మార్క్విస్‌కి సమానం తావొ అంటే కుమ్మరి సామాన్యంగా చైనీయులు యింటిపేరు ఒక మాటలోనే ఉన్నా సొంతపేర్లు రెండు మూడు మాటలలో ఉంటాయి అన్నీ అలా ఉండనక్కరలేదు ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన రచయితలు షున్ చౌఎన్ లే, మావొ సే తుంగ్ సరేసరి మింగ్ ాంశస్తులు చైనాను పరిపాలించే కాలంలో 3000 వరకు ఇంటిపేర్లు ఉండేవట ాని ప్రస్తుతం ఉపయోగంలో ఉన్న ఇంటి పేర్లు చాలా తక్కువ చైనాలో ప్రజావిప్లవం విజయవంతం అయ్యే నాటికి చాలామందికి వారి యజమానులు పెట్టిన అవమానకరమైన పేర్లుతప్ప వేరే స్వంత పేర్లు ఉండేవికాదు కాని 1953 జనాబాలెక్కలలో ప్రతిపౌరునికి స్వంతపేరు ఉండాలని ప్రభుత్వం ిర్ణయించడంతో ప్రతి పౌరుడు తన ఆత్మగౌరవాన్ని ప్రతిబింబించే పేర్లు ెట్టుకున్నారు ఇదంతా విన్న తరువాత నాసందేహం తీరినా వారి పేర్లతో ందరగోళం మాత్రం తప్పలేదు

పెకింగ్ పట్టణంలో ఉన్న అనేక రమణీయ సుందర దృశ్యాలు అవకాశం చ్చినప్పుడల్లా చూసాను కాని పెకింగ్ చుట్టు ప్రక్కల ఉన్న చారిత్రక ర్మాణాలు చూడలేక పోయాననే బాద, చూచితీరాలనే పట్టుదల హెచ్చింది నా దేశం పేరు చెబితే మనకు ముందుగా గుర్తు వచ్చేది 'గ్రేట్ వాల్ ఆఫ్ నా' ఈ గోడ ప్రపంచ మహాద్భుతాలలో ఒకటిగా పేరు పొందింది నాతో ) మింగ్ చక్రవర్తుల గోరీలు చైనా గోడ చూపించడానికి పాయ్‌కి తీరిక పోవడం గొప్ప యిబ్బంది అయింది అతడి పుణ్యామా అంటు తమ బసీ కార్లలో ఒకదానిని నాకు ఏర్పాటు చేసాడు మామూలుగా టాక్సీలో ళ్ళేకంటే ఈ పద్ధతి చాలా చౌక అన్నారు దీనిలో వచ్చిన యిబ్బంది

ఏమిటుంటే ఆ డ్రైవరికి ఒక్క ఇంగ్లీషు ముక్క రాకపోవడం పాయ్ నన్ను ఎక్కడికి తీసుకువెళ్ళాలో, ఏమి చూపించాలో చక్కటి చైనీస్ భాషలో డ్రైవర్‌కి చెప్పాడు అతడు అన్నింటికి చక్కగా తల ఊపాడు కాని పెకింగ్ వదలి కొద్ది దూరం వెళ్ళే సరికి ఆ డ్రైవరుకు దారి తెలియదని అర్థం అయింది దారిలో కనిపించిన వారిని అడుగుతూ మింగ్ గోరీల వద్దకు చేర్చాడు మింగ్ చక్రవర్తులు చైనాను 1368-1644 మధ్య పరిపాలించారు

అలా పాలించిన 14 మంది మింగ్ చక్రవర్తులలోను 13 మందిని పెకింగ్‌కి 20 మైళ్ళ దూరంలో ఉన్న టిమెన్ షోషాన్ కొండ ప్రాంతంలో సమాధి చేసారు వారి సమాధులు 25 మైళ్ళ విస్తీర్ణంలో ఉన్నాయి నిజానికి ఆ సమాధులు తరతమ భేదాలతో ఒకే పద్ధతిలో నిర్మించబడి ఉన్నాయి అయితే ఆ ప్రదేశానికి వెళ్ళి ఇరుప్రక్కలా రాతితో చెక్కబడిన విగ్రహాలు, స్థంభాలు, రాతి వంతెనలు, ఆర్చీలు, రాతి జంతు విగ్రహాలు చూడముచ్చటగా ఉంటాయి ఎంతసేపు చూచినా చూడాలనిపించే ప్రకృతి సౌందర్యం మధ్య మానవ శిల్పకళా నైపుణ్యానికి ప్రత్యక్ష నిదర్శనాలుగా నిలచిన ఆ విగ్రహాలు ఆ ప్రశాంత వాతావరణం హాయి అనిపించింది అక్కడ నుంచి చైనా గోడ చూడ్డానికి వెళ్ళడం తరువాత కార్యక్రమం వెనుకకు తిరిగి వచ్చే దారిలో ఒక మలుపు తిరిగితే ఆ రోడ్డు మహాకుడ్యం వద్దకు తీసుకు వెళుతుందట కాని డ్రైవరు ఆమలుపు మర్చిపోయాడు త్రిప్పి త్రిప్పి మళ్ళా పెకింగ్ తీసుకు వచ్చాడు చైనా గోడా వద్దు, ఏమీవద్దు ఇంటికి పోదాం పద అని చెప్పాలని చాలా ప్రయత్నించాను కాని డ్రైవరు వింటేనా? నా సౌంజ్ఞలు కూడా పని చేయలేదు అతడి పట్టుదల పెరిగింది నన్ను ఆ గోడవద్దకు తీసుకువెళ్ళలేక పోతే అతడికి మొహంచెల్లదు ఎలాగైతేనేమి మొత్తం మీద ఆ మహాకుడ్యం వద్దకు చేర్చాడు

అప్పటికి మధ్యాహ్నం 1 గంట అయింది విసుగు చిరాకు డ్రైవరుమీద వచ్చిన కోపం అన్నీ కలిసేసరికి ఆ మహాద్భుతాన్ని చూచి నేను ఆనందించలేక పోయాను ఫోటోలు కూడా తీయాలనిపించలేదు మూడ్ పూర్తిగా పాడైంది మన మానసిక పరిస్థితి ఎలా ఉన్నా మనల్ని ఉత్తేజితులను చేయగల మహాద్భుతం మన్వంతరాల కాలం చైనా ఉత్తర సరిహద్దుగా ఉపయోగింపబడిన మహాకుడ్యం ఈ గోడపొడవు 1684 మైళ్ళు దీనిని క్రీస్తుపూర్వం 5నుంచి 3వ శతాబ్ద మధ్యకాలంలో నిర్మించారు అప్పుడు ఉత్తర చైనాలో ఉన్న అనేక రాజ్యాలు శత్రువుల బారినుంచి కాపాడుకోవడానికి తమ ఉత్తర సరిహద్దులలో గోడలు నిర్మించారు క్రీస్తుపూర్వం 221 లో ఛిన్ వంశస్తులు చైనాను ఒక కేంద్ర ప్రభుత్వం క్రిందకు తెచ్చిన తరువాత ఈ గోడ లన్నింటిని కలిపి పెద్ద గోడగా చేసారు ఆ తరువాత

పరిపాలకులు ఈ గోడను బాగుచేస్తూ వచ్చారు కాని 15,16 శతాబ్దాలలో మింగ్ వంశపు చక్రవర్తులు ఈ గోడను బాగుచేసి పటిష్టం చేసారు ప్రస్తుతం మనకు దర్శన మిచ్చే మహాకుడ్యం మింగ్ చక్రవర్తులు రూపు దిద్దినదే!

సామాన్యంగా ఈ గోడను చూడ్డానికి ప్రజలు వెళ్ళే ప్రదేశం పెకింగ్‌కు 25మైళ్ళు దూరం పెకింగ్‌కు ఉత్తరాన ఎన్‌షన్ పర్వతశ్రేణిలో రక్షణ కొరకు నిర్మించిన ఈ గోడ 19నుంచి 39 అడుగులు ఎత్తు 16నుంచి32 అడుగులు వెడల్పు ఉంటుంది క్రింద బాగం రాతి తోను పైభాగం ఇటుకలతోను నిర్మించారు ఈ మహాకుడ్యం పైన పిట్టగోడలు ఆర్చిలు చిన్న చిన్న శిఖరాలు నిర్మించారు చాలా వరకు ఈ గొప్ప గోడ ప్రస్తుతం శిధిలాలుగానే మిగిలి పోయింది పదమూడవ శతాబ్దం ఆరంభంలో చెంఘీజ్ ఖాన్ దానిని దాటి వచ్చేవరకు అది చైనాను కాపాడుతూనే ఉంది ఈ నాటికి ఆ మహాకుడ్యాన్ని నిర్మాణశిల్పంలో గొప్పగా చెప్పుకుంటారు ప్రాకార మధ్యప్రాంత ప్రజలందరినికలిపి ఉంచిన సాంస్కృతిక చిహ్నంగా చైనీయులు గర్వపడతారు

చైనాలో కమ్యూనిస్టు ఉద్యమ విజయం ఫలితంగా ప్రజలు హాస్యం, యిగా నవ్వుకోవడం మర్చిపోయారు ఆదేశ రాజకీయ పరిస్థితి ువంటిది మేధావులతో పాటు అందమైన అమ్మాయిలు కూడా ువయ్యారు ఆగ్నేయ ఆసియా దేశాలలో ఉన్న చైనా స్త్రీలను చూచిన -రికి పెకింగ్‌లో కనిపించిన స్త్రీలంతా కావాలని తమను తాము ందవికారంగా చేసుకుంటున్నారని అనిపిస్తుంది ఒకప్పుడు చైనా మహిళలు ుదానికి మారుపేరుగా ఉండేవారు కాని చైర్మన్ మావో సెతుంగ్ పాలనలో ుదానికి మేధస్సుకు పెద్ద విలువలేదు దానికి తోడు వారికి అందుబాటులో ప్ప దుస్తులు అలంకరణ పరికరాలు వారి అందాన్ని కప్పిపుచ్చడానికి హదకారి అయ్యాయి పార్టీ నాయకులలో ఉన్న కొద్దిమంది ుదర్యోపాసకులు 1955 ప్రారంభంలో మహిళలు పెదవులకు ువేసుకుని, చక్కటి దుస్తులు దరించి ఆకర్షణీయంగా ఉండాలని ్సాహించారు కాని తోటివారంతా మగదుస్తులు వేసుకుని కాలక్షేపం చేస్తూ ు కొద్ది మంది అలంకరించుకుని సీతాకోక చిలుకల్లా తిరగడం భావ్యం ుకుని కాబోలు అంతా అతిసామాన్యంగా కనిపించారు

పాశ్చాత్యుల ప్రభావం మూలంగా అలవాటైన బాల్‌రూం డాన్స్‌కు ్రహంలేదు సామాన్య ప్రజలకు అందుబాటులో ఉన్న వినోదం పెకింగ్ ా, సాంప్రదాయ సంగీతం, నృత్యకళాప్రదర్శనలు కాని నాకు పెకింగ్‌లో ్యం యిచ్చిన పరంజపాయ్ ఇంట్లోమాత్రం స్టీరియో సంగీతంతో బాల్

రూం డాన్సులు జరిగేవి ఆ పార్టీలకు చైనా యువతులు కూడా వచ్చేవారు నేను పెకింగ్‌లో ఉన్న సమయంలోనే శ్రీలంక నుంచి ఒక ప్రతినిధి వర్గం రావడం తటస్థించింది సింహళదేశస్తులు మంచి సరదా పురుషులు మడికట్టుకు కూర్చున్న పెకింగ్ హోటల్‌లోనే డిన్నర్ డాన్సు పార్టీ పెట్టి ఆనందించారు దానికి నేను వెళ్లాను అదే సమయంలో భారతదేశం పెకింగ్‌లో ఏర్పాటు చేయబోయే ఎగ్జిబిషన్ కోసం దేశం నుంచి వచ్చిన అధికారులు కూడా పెకింగ్‌లో ఉన్నారు వారిలో పాయ్‌కి తెలిసిన యిద్దరు మిత్రులు అతణ్ణి చైనీస్ డాన్సుకి ఆహ్వానించారు

"మూర్తిగారు నాకు అతిథిగా ఉన్నాడు ఆయన్ని కూడా భోజనానికి తీసుకు వస్తానని" పాయ్ చెప్పాడు గిద్వాని, ఈలింగ్, పాయ్, నేను భోజనానికి వెళ్ళాం ఆ రెస్టారెంట్ షాంగై ప్రాంత వంటకాలకు ప్రఖ్యాతి కెక్కినది గిద్వాని ఆయన మిత్రుడు తమతో ఇద్దరు చైనీస్ యువతులను ఒక స్వీడిష్ యువతిని విందుకు తీసుకు వచ్చారు ఆయువతులందరు ఇంగ్లీషు మాట్లాడగలిగినవారు కావడంతో భోజనం ఆనందంగా ముగిసింది అక్కడ నుంచి మేమంతా పాయ్ ఇంటికి వెళ్ళి స్టీరియో సంగీతంతో డాన్సు చేస్తూ గడిపాం

ఆ రాత్రి భోజనానికి వచ్చిన యువతులలో స్వీడిష్ యువతి [illegible] పెకింగ్‌లో స్వీడిష్ రాజదూత కార్యాలయంలో ఉద్యోగిని చాలా అందగత్తె తన దేశపు డిప్లొమాటిక్ సర్వీసులో ఉన్నందున అప్పటికే దేశాలు తిరిగింది అవివాహిత మంచి మాటకారి ఆమెను ఈలింగ్ తన [illegible] ఆహ్వానించాడు అయితే నలుగురు పురుషులు, ముగ్గురు యువతులు ఉండడంతో ఒక మగ మహారాజు చుట్టకాల్చు కుంటూ డాన్సు చేసే వారిని చూస్తూకూర్చోవలసివచ్చింది అలా చూస్తూ కూర్చోవడం ఈలింగ్ వంతు కావడంతో ఆయన కుతకుతలాడి పోయాడు

కరెన్‌తో మాట్లాడుతూ పెకింగ్ ఒపేరా చూడాలని నేను చేసిన విఫల ప్రయత్నాలు తెలియజేసాను ఆ కార్యక్రమానికి టిక్కెట్లు దొరకడం దుర్లభం మన రాజదూత కార్యాలయంలో అంతా ప్రయత్నించి విఫలులయ్యారు కొన్ని వారాల వరకు టిక్కెట్లు రిజర్వు అయిపోయి ఉంటాయి నాకు అంత వ్యవధిలేదు చైనా వచ్చి పెకింగ్ ఒపేరా చూడకుండా వెళ్ళడం సమంజసం అనిపించలేదు ఇదంతా విన్న కరెన్ ఆ కార్యక్రమానికి నేను టిక్కెట్లు తెప్పిస్తానంది పెకింగ్‌లో ప్రతి కార్యక్రమానికి కొన్ని సీట్లు విదేశ రాజదూతల కోసం ప్రత్యేకించి ఉంచుతారట ఏరోజుకి టిక్కెట్లు దొరుకుతాయో టెలిఫోను చేస్తానంది చిత్రం ఏమిటంటే పెకింగ్ ఒపేరాకు [illegible]

కొన్నానని ఆమరునాడే కరెన్ టెలిఫోను చేసింది ఆ కార్యక్రమానికి వెళ్ళేముందు నేను తనఇంట్లో భోజనం చేయాలని షరతు పెట్టింది నేను కారు ఏర్పాటు చేయలేనంటే తానే ఏర్పాటు చేస్తానంది ఇదంతా విన్న వోరా దంపతులు ఆమె ఇంటికి వెళ్ళేనాడు పువ్వులు తీసుకువెళ్ళాలన్నారు అప్పటికే ఏడు ఏళ్ళు నేను విదేశాలలో ఉన్నాను కాని ఎవరికీ ఎప్పుడూ పువ్వులు తీసుకువెళ్ళలేదు వోరాదంపతులే చక్కటి కారనేషన్లు కొన్నారు ఇక తప్పలేదు

కరెన్ ఇంటికి వెళ్ళి ఆమెకు కార్నేషన్లు అందించే సరికి కరుడు కట్టిన విదేశాంగశాఖ అధికారిణికూడా ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బైపోయింది కబుర్లాడుతూ భోజనం చేసేముందు కారు అక్కర్లేదని పంపివేసింది ఇద్దరం రిక్షాలో ఒపేరాకు వెళ్ళాం యూరోపియన్ దేశాలలో ఒపేరా అంటే సంగీతనాటకం ఇటాలియన్లు ఒపేరా సంగీతములో నిష్ణాతులు అయితే యూరిపియన్ ఒపేరాకు పెకింగ్ ఒపేరాకు పేరులోతప్ప సారూప్యం తక్కువ నిజానికి పెకింగ్ ఒపేరా గ్రామీణ నాటక కళ దీనిలో జానపదగానం కథలు, గాదలు పిల్లిమొగ్గలు మరెన్నో 18వ శతాబ్దంలో పెకింగ్‌లో ప్రదర్శించబడింది చక్రవర్తులు, వారికుటుంబ సభ్యులు, అధికారులు అప్పటినుంచి దానిని పెకింగ్ ఒపేరా అని పిలిస్తున్నారు ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన ఈ ప్రక్రియలో అనేకరకాల నాటకాలు ప్రదర్శిస్తారు అర్థం కాకపోతే అసంగీతం గోలగా ఉంటుంది అసహజం అనిపిస్తుంది కానిప్రజలు విరగబడి చూస్తారు కథ గుర్తులేదు కాని చైనీయులు సాంప్రదాయ సిద్ధంగా ఉపయోగించే రెండు తీగల ఫిడేలు తాళాలు, సంగీతం, వేషధారణ ముచ్చటుగా ఉన్నాయి హాలునిండా ఉన్న ప్రేక్షకులలో మేమిద్దరమే కావలసిన దానికంటే హెచ్చుగా వస్త్రధారణ చేసినట్టు అనిపించింది

ఒపేరా నుంచి కరెన్‌ను ఇంటివద్ద దిగబెట్టడానికి ఇద్దరం నడిచే వెళ్ళాం మరొక రాత్రి నాఅతిథిగా పెకింగ్ డక్ తినడానికి ఆమెను తీసుకువెళ్ళాను నాతో పాయ్‌ని తీసుకువెళదామన్నాను ఆమె అంగీకరించలేదు ఆ స్టారెంట్‌కి వెళ్ళడానికి ముందు పెకింగ్‌డక్ అంటే ఏమిటో, దానిని ఎలా ర్డరు చెయ్యాలో, దానిని ఎలా తినాలో మొదలైన వివరాలన్నీ పాయ్ చైనీస్ టవానివద్ద తెలుసుకోవలసి వచ్చింది ఆవివరాలన్నీ తెలుగులో వ్రాసుకుని ర్యంగా కరెన్‌తో పెకింగ్‌డక్ దొరికే ప్రత్యేక రెస్టారెంటుకి వెళ్ళాను అది ఒక హాసయాత్ర అనిపించింది

ఆ బాతుల్ని గత 200 ఏళ్ళుగా పెకింగ్‌లోని సమ్మర్ ప్యాలెస్ దగ్గరున్న డ్ స్ప్రింగ్‌కొండ మీద పెంచుతున్నారు ఆ బాతుల్ని మొదట వాళ్ళు

చేయడానికి ఆ తరువాత క్రొవ్వు పట్టడానికి ప్రత్యేకంగా పెంచుతారు వాటిని మూడునెలల వయస్సులో తినడానికి ఉపయోగిస్తారు కాల్చిన బాతు మాంసం చక్కగా సన్నగా చెక్కి సోయాసాస్, ఉల్లి కాడలతో మనముందు పెడతారు వాటితోపాటు మన చపాతీలకంటే పల్చగా ఉండే రొట్టెలు యిస్తారు ఆబాతు మాంసాన్ని సాస్‌లో ముంచి రొట్టెమీద పెట్టి చుట్టి దానిని తినాలి పెకింగ్‌వెళ్ళిన ప్రతివారు పెకింగ్‌డక్ తినడం తమ వినోదపర్యనలో భాగంగా భావిస్తారు ఇది కడుపునిండే తిండికాదు భారతదేశం నుంచి చైనా వచ్చి పెకింగ్‌లో స్వీడిష్ అమ్మాయితో పెకింగ్‌డక్ తినడం ఏదో అనూహ్యమైన అనుభూతి అనిపించింది

పెకింగ్‌లో భారత రాయబారి కార్యాలయంలో ఉన్న మిత్రులు, చైనీస్ బాష నేర్చుకునే భారతీయులు తప్ప నాతో మాట్లాడ్డానికి చైనా దేశస్తులెవరూ దొరకకపోవడం చాలా నిరుత్సాహాన్ని కలిగించింది అప్పటి రాజకీయ పరిస్థితులు, చైనీస్ గురించి చైనీస్‌తో మాట్లాడ్డానికి నేను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి మిత్రులు నన్ను చైనా ఈశాన్య ప్రాంతంలో బారీ పరిశ్రమల నిర్మాణం జరుగుతున్న ముక్డెన్ చైనాలో అత్యంత అధునిక పాశ్చాత్య నాగరికతా కేంద్రంగా పరిగణించబడే షాంఘై పట్టణం, హూయాన్ సాన్ సమాధి ఉన్న సియాన్ మొదలైన ప్రదేశాలను చూచిరమ్మని ప్రోత్సాహించారు కాని నాకు ఉక్కుఫ్యాక్టరీలు అర్థం కావు నాకు సరదా ఉన్న విషయాలు మాట్లాడ్డానికి పెకింగ్ లోనే ఎవరూ దొరక్కపోతే యిక దేశం లోపలికి ప్రయాణంచేస్తే దారి తప్పిన ప్రయాణీకుణ్ణి అవుతాననిపించింది ఇక చైనా వదలడం మంచిదని నిర్ణయించుకున్నాను

చైనావంటి దేశాన్ని మూడు నాలుగు వారాల వ్యవదిలో చూచి, అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం అవివేకం కొద్దివారాలపాటు ఆ దేశంలో తిరిగితే దాని నైసర్గికస్వరూపం తప్ప మరేమీ తెలియదు కొద్ది నెలలైనా ఉండేటట్టు రావాలన్నారు మిత్రులు ఐతే ఏళ్ళతరబడి ఆదేశంలో ఉన్నవారికికూడా చైనా అర్థం కావడం కష్టం ఎక్కువ కాలం ఆదేశంలో ఉన్న విదేశీయులకు చైనా గురించి తమకు చాలా తక్కువ తెలిసిందనీ, తెలుసుకుని అర్థం చేసుకోవలసినది చాలా ఉన్నదనే భావం కలుగుతుంది ఈ విషయం పెకింగ్‌లో నేను కలుసుకున్న విదేశీయులంతా వ్యక్తం చేసారు

ఎట్టకేలకు నాతో మాట్లాడ్డానికి సుముఖత చూపించిన ఒక చైనీస్ మేధావిని కలుసు కోవడం తటస్థించింది మన రాజదూత కార్యాలయంలో ప్రెస్ ఆఫీసరుగా ఉన్న శ్రీ గూహా తన ఇంట్లో యిచ్చిన విందు సందర్భంగా ప్రొఫెసర్ సెంగ్ వెదకబోయిన తీగె కాలుకి తగిలినట్టు తగిలాడు ఆయన

మిగిలిన అతిదుల కంటే ముందుగా రావడంవల్ల ఆయనతో తీరికగా మాట్లాడే అవకాశం దొరికింది ఆగ్నేయ ఆసియాలో చైనీస్ ప్రభుత్వం విధానం లక్ష్యం ఏవిటని ఆయన్ని అడిగాను అక్కడ నుంచి అమెరికను పరపతి లేకుండా చేసి అమెరికన్లను ఆగ్నేయ ఆసియా నుంచి గెంటివేయడం చైనా ప్రభుత్వం లక్ష్యం అన్నాడు అప్పుడు ఏమి జరుగుతుంది? అమెరికన్ల స్థానాన్ని చైనీస్ తీసుకుంటారా అన్నాను ఆ ప్రశ్నకు ఆయన బాధపడ్డాడు ఆసియాలో శాంతిని కాపాడి ఆసియా దేశాల స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడమే చైనాధ్యేయం అన్నాడు

చైనా అమెరికాల మధ్య ఉన్న పేచీలు, విభేదాలు ఆరెండు దేశాలకు సంబంధించిన విషయాలు కదా వాటిని ఆసియా దేశాల సమస్యలుగాను అభిప్రాయాలుగాను చిత్రించడం సమంజసం కాదనే భావం వ్యక్తంచేసాను అది వినేసరికి ప్రొఫెసర్ సెంగ్‌కి మతిపోయింది ఒక భారతీయుని నుంచి అటువంటి ప్రశ్నలు వస్తాయని తాను ఎప్పుడు ఊహించలేదన్నాడు ఆయన దృష్టిలో అమెరికా చైనా సంబంధాలు దూర ప్రాచ్య సమస్యలకు కీలకం కాని సమస్యలు పరిష్కారం కావడానికి చాలా కాలం పడుతుంది తైవాన్ ఫార్మోజా) విషయంలో ఎవరూ తొందర పడడంలేదు అమెరికా ఆసియా యొక్క ముఖ్యశత్రువు అది చైనా చుట్టూ శత్రురాజ్యాల కూటములను నెలకొల్పుతోంది అమెరికన్ చైనీస్ మధ్య అవగాహన కల్గించడంలో భారత దేశం చాలా ముఖ్యమైన పాత్రవహించగలదు అన్నాడు

శక్తివంతమైన, బలమైన చైనా ఆసియా దేశాలపై తన ప్రభావాన్ని ధముగా చూపిస్తుందనే నాసందేహాన్ని వ్యక్తం చేసాను చైనా సాధిస్తున్న గతి తమ దేశాలు ఎందుకు సాధించలేక పోతున్నాయని ఆసియా దేశాల లు తమ ప్రభుత్వాలపై ఒత్తిడి తీసుకు వస్తారు జపాను ఆగ్నేయ ఆసియా లతో వ్యాపార సంబంధాలు మెరుగుపడతాయి రాజకీయంగా నూతనంగా తంత్ర్య సముపార్జన చేసిన ఆసియా ఆఫ్రికా దేశాలు సోషలిష్టు దేశాలు ఉతీరతాయి ఆ పరిణామానికి చైనా తోడ్పడుతుందన్నాడు

అప్పటి చైనా ప్రభుత్వం మిశ్రమప్రభుత్వం అని అనేకమంది కోవడాన్ని గుర్తుచేసాను 1954లో చైనా రాజ్యాంగం ఆమోదించేవరకు మప్రభుత్వమే ఉండేది కాని రాజ్యాంగంలోని మొదటి ఆర్టికల్ ప్రకారం శ్రామిక వర్గనాయకత్వంలో నెలకొల్పబడిన ప్రజారిపబ్లిక్ ప్రతిపక్షాలు డా ఈ అధికారణాన్ని ఆమోదించాయి దీని మూలంగా కమ్యూనిస్టు ర్టీయొక్క నాయకత్వాన్ని శాశ్వతంగా అంగీకరించాయి ఎన్నికలలో మరే తర పార్టీకూడా కమ్యూనిస్టు పార్టీ స్థానాన్ని ఆక్రమించుకోలేవు నిజానికి

యితర పార్టీలు కమ్యూనిస్టు పార్టీకి సభ్యుల్ని తయారు చేయడంలో తోడ్పడతాయిఅన్నారు

చైనాలో మేధావుల బలం ఏమిటని నా ప్రశ్న. చైనాలో 50 లక్షల మేధావులు ఉన్నారు. వారిలో 20 లక్షల మందిని ప్రభుత్వం తమ ప్రక్కకు త్రిప్పుకోగలిగింది. మిగిలిన 30 లక్షల మందిని మార్చవలసి ఉంది. ప్రభుత్వానికి తలనొప్పి తెప్పించడానికి తప్ప మేధావులు మరెందుకు పనికిరారు. చైనా సాయుధ విప్లవం సాధించి రాజకీయ అధికారాన్ని చేపట్టింది. విప్లవం విజయవంతమై దేశం సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడాలంటే మేధావుల్లో కూడా విప్లవం రావాలి. దాని కోసం ఛైర్మన్ మావో ఉద్యమం ప్రారంభించారు. కేంద్రీకృత ప్రజాస్వామిక వ్యవస్థ, కమ్యూనిస్టు పార్టీనాయకత్వం చైనాలో సోషలిస్టు రాజ్యస్థాపనకు అత్యంత ఆవశ్యకమన్నారు. ఆయన ఇంకా అనేక విషయాల మీద తన అభిప్రాయాలు వ్యక్తం చేసాడు. ముఖ్యంగా సోవియట్‌యూనియన్ చేస్తున్న సహాయం ప్రణాళికలలో జరిగిన పొరపాట్లు పేర్కొన్నాడు

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో సోవియట్ యూనియన్ చైనాకు అమూల్యమైన సహాయ సహకారాలను అందించిన విషయం ప్రపంచానికంతటికి తెలుసు. కాని చైనాప్రణాళికలో రెండు శాతం మాత్రమే సోవియట్ యూనియన్ సహాయం ఉందని ప్రొఫెసర్ సెంగ్ అన్నారు. అప్పటికి పోలెండులోను హంగరిలోను నియంతృత్వ ధోరణికి వ్యతిరేకంగా వచ్చిన ఉద్యమాలు చైనామీద ఏవిధమైన ప్రభావం చూపించలేదన్నారు

ఆ రాత్రి విందుకంటే ప్రొఫెసర్ సెంగ్‌తో మాట్లాడ్డం నాకు ఎక్కువ ఆనందాన్ని సంతృప్తిని కలిగించాయి. చిత్రం ఏమిటంటే ఆయన ఏపార్టీకి చెందని వ్యక్తిగా పరిగణించబడినా పాలకపక్ష పార్టీ వ్యక్తి ఎవరూ వ్యక్తం చేయలేని విధముగా పార్టీ అభిప్రాయాలు చెప్పగల సమర్థుడని మామిత్రులు చమత్కరించారు

ఆరాత్రి విందుకు అమెరికన్ పత్రిక "నేషనల్ గార్డియన్"ప్రతినిధి శ్రీ బెల్ ఫోర్ట్‌కూడా వచ్చాడు. ఆయన కమ్యూనిస్టు. తనను అమెరికాలో ప్రభుత్వం అరెస్టు చేయడాన్ని గురించి అనేక సరదా కబుర్లు చెప్పాడు. చివరకు పెకింగ్‌లో తన మకాం అడ్రసు మర్చిపోయాడు. మిత్రుడు పాయ్ తన పదకొండేళ్ళ అనుభవంతో బెల్ ఫోర్ట్ బసచేసిన జాగా తెలుసుకుని అతణ్ణి ఇంటికి చేర్చగలిగాడు

పెకింగ్ నుండి మాస్కో వెళ్ళడానికి ప్రయాణసన్నాహాలు ప్రారంభించాను. చైనా నుండి రష్యాకు విమానంలో కాని రైలులో కాని

వెళ్ళవచ్చును విమానంలో అయితే అప్పటిలో24 గంటలు రైలులో అయితే సుమారు 10రోజులు పట్టేది ప్రయాణం 1954 నుండి పెకింగ్ మాస్కో మధ్య ఎక్కిన రైలు మారవలసిన పనిలేకుండా రైలు ప్రయాణ సౌకర్యం ఏర్పడింది ఆప్రయాణం దూరం 5620 మైళ్ళు ప్రయాణానికి పట్టే సమయం 207 గంటలు చైనానుంచి సోవియట్ యూనియన్‌కు మూడు సరాసరి విమాన సర్వీసులు ఉన్నాయి పెకింగ్ నుండి షెన్యాంగ్ హార్బిన్ మీదుగా ఛీటాకు, సెయిన్ సాటూ, ఉలన్‌బటూర్ మీదుగా ఇర్కుట్సుకు సియాన్ లాన్ చౌమీదుగా ఆల్మాఆటా వరకు వెళ్ళి అక్కడ నుండి విమానాలు మాస్కో కు వెళతాయి ప్రయాణఖర్చులకు సంబంధించిన వరకు రైలుకి విమానానికి పెద్ద తేడాలేదు అప్పుడు పెకింగ్‌లో బారత రాయబారిగా శ్రీ ఆర్ కె నెహ్రూ ఉండేవారు ఆయన సలహా మీద పెకింగ్ నుండి మాస్కోకు రైలులో వెళ్ళడానికి నిర్ణయించాను

విదేశీ ప్రయాణీకుల మంచిచెడ్డలు చూడ్డానికి ప్రయాణ సౌకర్యాలు చూడ్డానికి ఇన్ టూరిస్టు సంస్థ ఉంది వాళ్ల ఆఫీసుకు వెళ్ళి పెకింగ్ - మాస్కో రెలు టిక్కెట్టు కొన్నాను ఆప్రయాణానికి మొదటి తరగతి టిక్కెట్టు 100 ాన్లు వారానికి రెండుసార్లు (మంగళవారం శనివారం) రైలు ఉండేది ివారం వెళ్ళే రైలులో టిక్కెట్టు రిజర్వు చేయించుకున్నాను పెకింగ్‌లో ఉన్న మూడు వారాల వ్యవధిలోను తెలుసుకున్న మిత్రుల వద్ద సెలవు తీసుకుని శనివారం సాయంకాలం6 30 గంటలకు నేను మిత్రుడు పాయ్, వాళ్ళ చైనీస్ ేవకుడు లావ్ ఛాంగ్ సామానుతో పెకింగ్ రైలుస్టేషనుకు వెళ్ళాం రైలులో ంబెర్త్ చూచుకుని ఆపెట్టెలో నాసామాను పెట్టుకుని వెనక్కు వెళ్ళి గేటులో న్న పోలీసు అధికారికి నాపాస్ పోర్టు, రైలుటిక్కెట్టూ చూపించాను వితీసుకుని అతగాడు ఆఫీసులోకి వెళ్ళిపోయాడు రైలు బయలుదేరేవేళ గం 15 7 గంటలు అయిపోయింది 7-10 అయింది నాపాస్‌పోర్టుతో ఆ ోలీసు అధికారి తిరిగిరాలేదు నాకు మతిపోయింది తలతిరిగిపోయింది ందుకైనా మంచిదని గబగబా వెళ్ళి రైలుపెట్టెలో నుంచి సామాను దించి ళ్ళా గేటువద్దకు పరుగెత్తాం గం7-15 అయిపోయింది రైలు వెళ్ళిపోయింది ు దిక్కుతోచక అక్కడే నిలబడి పోయాను అప్పుడు వచ్చాడు ఆ పోలీసు ికారి నా పాస్‌పోర్టుతో నాకు అతడి బాషరాక పోయినా మాండలిన్ చైనీస్ ర్గళంగా మాట్లాడగలిగిన పాయ్‌తో అసలు విషయం తెలియజేసాడు నేను లులో మాస్కో వెళ్ళడానికి వీలులేదని చావు కబురు చల్లగా చెప్పాడు ినికి కారణం నాకు చైనా విదేశాంగ శాఖవారు ఇచ్చిన వీసాలో నేను చాలోనికి పెన్సియాంగ్ వద్ద ప్రవేశించి నానింగ్ వద్ద నిష్క్రమించాలని న్నదట పెన్సియాంగ్ వియత్నాంనుంచి చైనాకు రైలులో ప్రయాణం చేస్తే

చైనా సరిహద్దు గ్రామం విమానంలో ప్రయాణం చేస్తే హెనోయ్ నుండి నానింగ్ మీదుగా కాంటాన్‌కి వెళ్ళాలి వీసాలో చైనానుండి నిష్క్రమించవలసిన దారి వివరించలేదు కాబట్టి చైనా వదలడం కూడా ప్రవేశించిన గ్రామం వద్దనే చేయాలని పోలీసువారి నిర్ణయం

సోవియట్ యూనియన్ రాజదూత కార్యాలయంలో ఇచ్చిన వీసాలో కూడా నేను విమానంలో ప్రయాణం చేస్తాననుకుని రష్యాలో ప్రవేశించే విమానాశ్రయం ఇర్కుట్స్క్ అని వ్రాసారు మాస్కోకు రైలులో వెళితే చైనాకు రష్యాకు సరిహద్దు గ్రామం వోత్‌పూర్ కాబట్టి ఆ పేరు వీసాలోలేనందున ఆ ప్రయాణం నిషిద్ధం మాస్కో వెళ్ళాలనుకుంటే చైనా నుండి వోత్‌పూర్ వద్ద నిష్క్రమించాలని వీసాలో మార్పు చేయించుకోమన్నాడు ఇక దానికి తిరుగులేదు అంతేకాకుండా రైలు వెళ్ళిపోయింది నాకు బ్రహ్మాండమైన కోపం వచ్చింది పాయ్ పోలీసు అధికారితో ఎంత వాదించినా ప్రయోజనం లేదనిపించింది కాని అప్పుడు మా సమస్య, ఆదుర్దా అంతా రైలు టిక్కెట్టు గురించి ఇన్ టూరిస్టు ఆఫీసుకు పాయ్ టెలిఫోను చేసాడు ఆఫీసు మూసి వేసారు ఆ మరునాడు ఆదివారం కావడం వల్ల ఆఫీసు తెరవరు నేను మాస్కో వెళ్ళడానికి రైలు మంగళవారం సాయంకాలం శనివారం నేను ప్రయాణం చేయలేక పోవడంలో నాతప్పు లేదని వ్రాసి యివ్వమన్నారు రైల్వే అధికారులు కాని పోలీసు అధికారులు మాత్రం నా వీసా సరిగాలేదని వాదించారు ఇక ఏమైనా వారి నిర్ణయం ప్రకారం సోమవారం విదేశాంగ శాఖకు వెళ్ళివీసాలో మార్పు చేయించుకుని మంగళవారం మాస్కోకు ప్రయాణం చేయాలని నిర్ణయించుకున్నాను ఒక్కరోజులో వీసాలో మార్పు టిక్కెట్టు మార్పు చేయించుకోవాలి దానికితోడు నేను శనివారం బయలుదేరే రైలులో వస్తున్నట్టు మాస్కోలోని మిత్రులకు వ్రాసాను ప్రయాణాలలో మార్పు తెలియజేయడానికి వ్యవధి తక్కువ ఈసమస్యలన్నింటితోను వికలమైన మనస్సుతో నిరుత్సాహంగా ఇంటి మొఖం పట్టాం

సోమవారం ఉదయం ఇన్‌టూరిస్టు ఆఫీసుకి వెళ్ళాను నాకు టిక్కెట్టు ఇచ్చిన అధికారి అనారోగ్యంవల్ల ఆరోజు ఆఫీసుకి రాలేదు అసలు వీసా సరిగా లేకపోతే టిక్కెట్టు అమ్మకూడదు ఆవిషయం ఆనాడు ఆఫీసులో ఉన్న అధికారితో చెప్పినా అతడు అంతగా పట్టించుకోలేదు కాని అతడి పుణ్యమా అంటూ టిక్కెట్టు మంగళవారం వెళ్ళే రైలుకి పనికి వచ్చేటట్టు మాత్రం మార్చిపెట్టాడు ఇక మిగిలింది వీసాలో చేయవలసిన మార్పు విదేశాంగ శాఖ కార్యాలయానికి వెళ్ళాను ఇంగ్లీషు మాట్లాడే యువతి వచ్చి సోవియట్ రాజదూత కార్యాలయంవారు ఇచ్చిన వీసాలో మాస్కోకి విమానం మీద వెళ్ళే

పద్ధతిలో యాకుట్స్సునిక్ అని ఉంది కాబట్టి అది మారింది వోత్‌పూర్ అని వ్రాయించి పట్టుకురమ్మంది అంతేకాకుండా నా వీసాలో మార్పులు చేయమని కోరుతూ బారత రాయబారి కార్యాలయం నుంచి ఉత్తరం కావాలంది నేను ఎంత వాదించినా ప్రయోజనం లేకపోయింది తమ రూల్సు ప్రకారం ఇదంతా తప్పనిసరి అని వాదించింది అదృష్టవశాత్తు సోవియట్‌యూనియన్ రాజదూత కార్యాలయంలో పని ఒక్కనిమిషంలో అయిపోయింది భారత రాయబారి కార్యాలయం వారు చైనా ప్రభుత్వం అడిగిన ఉత్తరం వ్రాయడానికి బోలెడు తర్జన బర్జన జరిపిన తరువాత కాని అంగీకరించలేదు చివరకు పెకింగ్‌నుండి మాస్కోకు రైలులో వెళ్ళడానికి సరి అయిన వీసా తెచ్చుకోవడానికి ఒక యజ్ఞం చేసినంత పని అయింది

మంగళవారం సాయంకాలం మాస్కోప్రయాణం ఆ ఉదయం బ్రిటిష పార్లమెంటు సభ్యుడు శ్రీ మేహూని కలుసుకుని చైనాలో విప్లవానంతరం వచ్చిన మార్పులు దేశ ప్రగతి చైనా బ్రిటిష, సంబంధాల గురించి చర్చించాను మధ్యాహ్నం పాయ్ ఇంట్లో చిన్న మహారాష్ట్ర సమ్మేళనం భోజనానికి కాకా కలేల్కర్ ఆయన కోడలు చైనీయుని వివాహం చేసుకున్న ఒక మహారాష్ట్ర యువతి మరి నలుగురు మహారాష్ట్రులు వచ్చారు అంతమంది మహారాష్ట్రులు చైనాను సందర్శించడం నాకు ఆశ్చర్యం కలిగించింది భారత దేశంలో గొప్పపండితుడుగా, సంఘ సేవాతత్పరునిగా ప్రఖ్యాతి కెక్కిన కాకా కలేల్కర్‌ని కలుసుకోవడం నా అదృష్టం అనిపించింది ఆయనతో కలిసి భోజనం చేసాను జాతీయ అంతర్జాతీయ విషయాల మీద చర్చించాం ఆయన చైనా పర్యటనలోని అనుభవాలు, చైనా ప్రగతి వారి సమస్యలను గూర్చి కాకా సాహెబ్ అభిప్రాయాలు వినే భాగ్యం కలిగింది వీసా సమస్య మూలంగా నా మాస్కోప్రయాణం వాయిదా పడినందుకు మొదటి సారిగా చాలా ఆనందించాను అంతటిలో పంజాబీ నాటక రచయితగా ప్రఖ్యాతి కెక్కిన బలవంత్ గార్గి వచ్చాడు అతడు మాస్కోనుండి విమానంలో ప్రయాణం చేసాడట తన మాస్కోఅనుభవాలు చెప్పాడు పెకింగ్ నుంచి మాస్కో రైలులో ప్రయాణం చేయడం ఒక గొప్ప సాహసము అన్నాడు

ఆ సాయంకాలం నేను, పాయ్ లాన్ ఛాంగ్ 7గంటలకు రైలుస్టేషనుకు వెళ్ళాం అంతకు ముందు తెలియకపోయినా పాయ్ నాకు అత్యంతాబిమానంతో స్నేహపూర్వకంగా ఆతిధ్యం యిచ్చి నేను పెకింగ్‌లో గడిపిన మూడువారాలు అత్యంత ఆసక్తిదాయకంగా చేయడానికి తోడ్పడ్డాడు పాయ్ చైనీస్ సేవకుడు వంటలో నల భీముల్ని తలతన్నినవాడు చాలా సమర్ధుడు వారికిద్దరికి వీడ్కోలు చెప్పాను గం7 15 కి ఏవిధమైన సమస్య

లేకుండా నా మాస్కో ప్రయాణం ప్రారంభమైంది

పెకింగ్-మాస్కోరైలులో ఐదవ నెంబరు పెట్టెలో ఐదవ నెంబరు బెర్తు నాది డీలక్స్ కంపార్టుమెంటులో ప్రయాణం నాకు ఇచ్చిన బెర్తు ఒకే ప్రయాణీకునికి ప్రత్యేకించిన కూపేలా ఉంది దానిలోనే వాష్‌రూం కూడా ఉంది కిటికీల తెరలు అలంకారం కోసం వ్రేలాడ గట్టిన అల్లికలు, చివరకు దీపం అన్నీ నీల వర్ణంలో ఉన్నాయి ఆ డీలక్స్ తరగతిలో ముగ్గురు పోలిష్ అధికార్లు, ఒక రష్యను నేను మాత్రమే ప్రయాణం చేస్తున్నాం భోజనం గొడవలేదు నేను కూర్చున్న సీటును నిద్రపోవడానికి వీలుగా మార్చి పక్క వేసివెళ్ళాడు కండక్టరు గార్డు తలగడలు, దుప్పట్లు తువాళ్ళు సబ్బు, దువ్వెన సర్వం ఆపెట్టెలో ఉన్నాయి ఆ పక్కవేయడం ఆశ్చర్యంగా చూసాను అతడు వెళ్ళి పోయిన తరువాత తీరికగా ఆలోచిస్తూ పడుకున్నాను చైనీయులు గర్వంగా చెప్పుకునేమాట గుర్తుకు వచ్చింది ఒకసారి పెకింగ్‌లో మకాం చేసిన వారికి ఆ పట్టణం వదలబుద్ధి పుట్టదట ఒకవేళ వదలినా దానిని మర్చిపోవడం సాధ్యంకాదట అది నిజమేననిపించింది చైనాకు అగ్రరాజ్యాల జాబితాలో చేరే సర్వలక్షణాలు ఉన్నాయి ఆ దేశాన్నిగూర్చి తెలుసుకోవలసింది చాలా ఉంది ముఖ్యంగా భారతీయులు చైనా సాధిస్తున్న ప్రగతి, వారి క్రమశిక్షణ, కార్యదీక్ష తెలుసుకు తీరాలి అనిపించింది అయితే నేను పెకింగ్ దాటి చైనాలో మరేప్రదేశం చూడలేక పోవడం చాలా నిరాశ కలిగింది మరొకసారి ఎక్కువ కాలం గడపడానికి చైనావస్తే బాగుంటుందనిపించింది అలా ఆలోచిస్తూ నిద్రపోయాను

మరునాడు నిద్రలేచి బైటకి చూస్తే చుట్టూ ఫ్యాక్టరీలే రైలు ముక్డెన్ స్టేషనులో ఆగింది ఎవరోఅన్నట్టు చైనాదేశానికి ముక్డెన్ బ్రిటిషువారికి మాంచెస్టరు వంటిది పారిశ్రామికంగా చైనాసాధిస్తున్న ప్రగతి అక్కడ కళ్ళారా చూడవచ్చును బ్రేక్‌ఫాస్టుకి డైనింగ్ కారులోకి వెళ్ళాను అక్కడ బేరర్లు అంతా చైనీస్, రష్యనుభాషలు మాత్రమే మాట్లాడు తున్నారు నాముందుంచిన మెనుకార్డులో కన్నుపొడుచుకున్నా ఇంగ్లీషు మాట లేదు నాకు కావలసిన పదార్థాలు అడగడానికి నానాఅవస్థ పడవలసి వచ్చింది చెకోస్లవేకియా దేశానికి చెందిన ఒక యువదంపతుల జంట వియత్నాంనుంచి వస్తున్నారు స్విట్జర్లాండు నుంచి ప్రపంచ యువజనోత్సవాలకు వచ్చిన దంపతులు ఆ రైలులో ప్రయాణం చేస్తున్నారు వారికి కొద్దిగా ఇంగ్లీషు భాషాపరిచయం ఉండడంవల్ల బ్రతికిపోయాను వారి సహాయంతో డైనింగ్ హాలు సమస్య తీరింది

రెండవ రోజు సాయంకాలం గం 2-50కి రైలు చైనా సరిహద్దు పట్టణం

మంచోలి చేరింది అక్కడ మళ్ళా పాస్ పోర్టు, కస్టమ్సు పరీక్షలు నిజానికి కస్టమ్సు లాంఛనప్రాయంగానే జరిగింది సాయంకాలం గం4-20 అంటే గం 11-20మాస్కో సమయం మంఛోలి వదిలాం 25 నిమిషాల వ్యవధిలో సోవియట్ యూనియన్‌లో మొదటి రైలు స్టేషను ఓత్‌పూర్ చేరింది రైలు ఈసారి రష్యను కస్టమ్సు పాస్‌పోర్టు తతంగం పాస్‌పోర్టులు అధికారులు తీసుకుని రైలు దిగమన్నారు కస్టమ్సుఫారాలు పూర్తిచేసాను స్టేషన్ భవనం చాలా పెద్దది విదేశీ మారక ద్రవ్యానికి సంబంధించిన అధికారి నానా యిబ్బందులు పెట్టాడు దానికి కారణం నాకు రష్యను భాష అతడికి ఇంగ్లీషు రాక పోవడమే అంతలో ఒక చైనీస్ పెద్ద మనిషి వచ్చి మా సమస్యలను ఒకనిమిషంలో సర్దివేసాడు అక్కడ50 అమెరికను డాలర్లు మార్చి500 రష్యను రూబుల్సు తీసుకున్నాను అతడు వందరూపాయలకు 207 రూబుల్సు యిస్తానన్నాడు ఒక పౌండుకి 27-6 రూబుల్సు అదంతా వింటే పెకింగ్ నుంచి ఓత్‌పూర్ వరకు వచ్చి అక్కడ పౌన్లు మార్చి రూబుల్సుతో మాస్కోకి రైలు టిక్కెట్టు కొనుక్కుంటే బోలెడు చౌకగా ప్రయాణం చేసి ఉండేవాణ్ణి ినిపించింది కాని అదంతా గతజల సేతుబంధనం అని సమాధాన రచుకున్నాను

ఓత్‌పూర్‌లో మూడు గంటలు ఉన్నాం మమ్మల్ని తీసుకు వచ్చిన రైలు చక్రాలు మార్చారని ఈ రైలు ఎక్కిన తరువాత విని ఆశ్చర్య పోయాను చక్రాలు మార్చడం అంటే ముందు అర్థంకాలేదు చైనీస్ రైల్వేలైను వెడల్పు4 అడుగుల 8 1/2 అంగుళాలు అది సాదారణంగా ప్రపంచంలోని చాలా రైల్వేలు ఉపయోగించే గేజ్ (పరిమాణం) సోవియట్ యూనియన్‌లో రైల్వేలు ఉపయోగించే గేజ్ 5 అడుగులు, అందుమూలంగా ప్రయాణీకులు స్టేషను భవనంలో కూర్చుని ఉండగా పెకింగ్‌నుంచి వచ్చిన రైలు పెట్టెలను క్రేన్స్ సహాయంతో రష్యను గేజిపైనున్న చక్రాలపైకి మార్చి అదే రైలును మాస్కోవరకు తీసుకువెళతారు అక్కడ చక్రాలు, ఆక్సిల్సు మార్పు చేసి గేజ్‌లో ఉన్న తేడాని అధిగమిస్తారు అటువంటి ప్రక్రియ ఆస్ట్రేలియాలో విక్టోరియా రాష్ట్రంలోని మెల్బోరన్ దగ్గర డైనాన్ వద్ద కూడా జరుగుతుంది సిడ్నీనుంచి ఆడిలైడ్ వరకు ప్రయాణం చేసే గూడ్సు రైలుబళ్ళను డైనాన్ వద్ద చక్రాలు, ఆక్సిల్స్ మార్చి గేజ్ మార్పు చేస్తారు అయితే సోవియట్ యూనియన్‌లో ఈ మార్పు ఓత్‌పూర్ వద్ద ప్రజలు ప్రయాణం చేసే రైళ్ళకు చేస్తే ఆస్ట్రేలియాలో గూడ్సురైళ్ళకు మాత్రమే చేస్తారు

మాస్కో టైము ప్రకారం గం 2-45 కి రైలు ఓత్‌పూర్ స్టేషను వదిలిపెట్టింది అంటే పెకింగ్ టైము రాత్రి గం 7-45 అన్నమాట

గడియారాలు ఏ టైము చూపించినా సూర్యుడు మాత్రం నిరంతర గమనం నిర్విరామంగా చేస్తూనే ఉంటాడు కాబట్టి అప్పటికే బాగా చీకటి పడిపోయింది రాత్రి భోజన సమయం అయింది డైనింగ్ కారులో నిర్వహణ బాధ్యతలు చైనీస్‌నుంచి రష్యన్లు తీసుకున్నారు అక్కడి కార్యక్రమాల్ని మహిళలే నిర్వహిస్తున్నారు ఒక సుగుణం ఏవిటంటే తినుబండారాల వివరాలు ఉన్న కార్డులో ఇంగ్లీషు భాష ఉండడం బేరర్లు ఇంగ్లీషు మాట్లాడలేకపోయినా మనకు కావలసిన పదార్థాలు కార్డుమీద చూపించి మన పబ్బం గడుపుకోవచ్చు ఈ రైలు ప్రయాణం ప్రారంభించడానికి ముందే మిత్రులు రైలు ప్రయాణంలో భోజన విషయంలో వచ్చే ఇబ్బందులు వివరించారు తొమ్మిది రోజులు ప్రయాణంలో రైలులో పెట్టే భోజనంలో తాజా పదార్థాలు ఉండవు కాబట్టి పళ్ళు తదితర తినుబండారాలుకూడా తీసుకువెళ్ళమని సలహా ఇచ్చారు ఈ సలహా వెనుక మరొక ముఖ్యమైన కారణం ఉంది పెకింగ్, మాస్కో రైలులో భోజనం చాలా ఖర్చుతో కూడిన వ్యవహారం అందుమూలంగా చాలామంది ప్రయాణీకులు ఆ ప్రయాణంలో అన్నిపూట్ల భోజనాలు చేయరు వారంతా తమ కూడా అనేక రకాల తినుబండారాలు తెచ్చుకుంటారు రైలులోని డైనింగ్ కారులో ఎంత జాగ్రత్తగా తక్కువగా తిన్నా, రోజుకి 30, 40 రూబుల్సుకి తక్కువకాదు నేను మాత్రం కూడా ఏమీ తెచ్చుకోలేదు హాయిగా అన్ని భోజనాలు డైనింగ్ కారులో చేసాను ఒత్‌పూర్‌లో రూపాయికి రెండు రూబుల్స్ ఇచ్చాడు కాబట్టి నేను తినే భోజనాల ఖర్చు రూపాయలలో లెక్క పెట్టుకుని సంతృప్తి పడడం మొదలుపెట్టాను

విదేశీ ప్రయాణాలు చేసేటప్పుడు ఖర్చు మన రూపాయల్లో లెక్కపెట్టుకోవడం మనందరికీ అలవాటు అదొక విచిత్రమైన మనఃప్రవృత్తి అమెరికన్ డాలర్లలోను, బ్రిటిష్ పౌన్లలోను ఖర్చుపెట్టేటప్పుడు ఆ ఖర్చును, ధరలను రూపాయలలోకి మార్చుకుంటే గుండె పగులుతుంది కాని ఆ బాధ కొన్ని రోజులు మాత్రమే ఉంటుంది ఆ తరువాత ఖర్చుల్ని రూపాయలలోనికి మార్చడం మర్చిపోతాం అప్పుడు మనస్సుకి శాంతి నాకు ఆ బాధ లేదనే చెప్పాలి అప్పటికే ఏడేళ్ళ విదేశాలలో గడపడం వల్ల ఖర్చులు రూపాయలలోనికి మార్చుకోవడం మానుకుని చాలా కాలమైంది

రైలు సైబీరియాలో వెళుతున్నట్టు వాతావరణలో మార్పు వల్ల తెలుసుకున్నాను ఆ రాత్రి చాలా చలి వేసింది మిత్రులు సైబీరియాను గూర్చి అనేక ఛలోక్తులు విసిరారు రైలు సైబీరియా లో ప్రవేశించింది వాతావరణం చల్లబడింది రాత్రుళ్ళు ఎముకలు కొరికేచలి దారిలో ఒక స్టేషన్ లో రైలు

ఆగినప్పుడు దిగి మళ్ళా రైలు ఎక్కేటప్పుడు కండక్టరు గార్డు వచ్చీరాని ఇంగ్లీషులో సైబీరియా 'న్యాత్‌గూడ్' అని నవ్వాడు అంటే సైబీరియా మంచిది కాదని అర్ధమట సైబీరియా సంవత్సరములో అనేక మాసాలు మంచుతో కప్పబడి ఉంటుంది వాతావరణ వ్యత్యాసాలమాట అటుంచి సైబీరియా అనేసరికి రష్యను జార్ చక్రవర్తుల పాలనలో ప్రజలు పడ్డ కష్టాలు గుర్తుకు వస్తాయి బ్రిటిషువారు భారతదేశాన్ని పరిపాలించే రోజుల్లో అపాయకరమైన నేరస్తుల్ని అండమాను దీవులకు యావజ్జీవ కారాగార వాసానికి పంపేవారు అలాగే బ్రిటిషు దీవుల్లో నేరాలు, హత్యలు చేసిన వారిని ఆస్ట్రేలియా ఖండానికి యావజ్జీవ ఖైదీలుగా పంపేవారు అలా ఖైదీలుగా వెళ్ళిన ఇంగ్లీషువారికి ఆస్ట్రేలియా దేశాన్ని అభివృద్ధి చేసిన ఖ్యాతి దక్కింది అలాగే రష్యను చక్రవర్తులనాడు ఖైదీలుగా యావజ్జీవ శిక్షలు అనుభవించడానికి సైబీరియా వెళ్ళిన రష్యన్లు సైబీరియా సర్వతోముఖాభివృద్ధికి పునాదులు వేసారు రష్యను విప్లవం విజయవంతమైన తరువాతకూడా కమ్యూనిస్టు ప్రభుత్వం తమ సిద్ధాంతాలను వ్యతిరేకించిన వేలాదిమందిని సైబీరియాలో లేబర్ క్యాంపులకు పంపడం వారిలో చాలామంది సైబీరియాలోనే తమ శేష జీవితాలు గడపడం ఇప్పుడు చరిత్రగా మిగిలింది

రైలులో కూర్చుని చూస్తూ ఉంటే బైట ప్రదేశం ఆసక్తి దాయకంగానే ఉంది రైలు కట్టకు ఇరుప్రక్కలా దట్టమైన అడవులు కాని ఎంత దూరం చూచినా రెండు మూడురకాల వృక్షాలే కనుపించాయి మైళ్ళ తరబడి ఖాళీ ప్రదేశాలు ఇళ్ళు కనుపించలేదనే చెప్పాలి అక్కడక్కడ చెదురుమదురుగా ఒకటి అరా ఇళ్ళు కనిపించాయి అవి పూర్తిగా కర్రతో నిర్మించిన చిన్న చిన్న ఇళ్ళు ఆవుల మందలు, బాతులు, కోళ్ళు తప్ప మరేం కనుపించలేదు సైబీరియాలో జీవితం చాలా కష్టంగా ఉంటుందని చూస్తేనే అర్ధమవుతుంది స్త్రీలు చాలా కష్టపడి పనిచేస్తూన్నట్టు అనిపించింది ఈ ప్రాంతంలో ప్రొద్దు తిరుగుడు పువ్వు తప్ప మరొకరకం పువ్వు కనుపించలేదు

ఒక స్టేషనులోరైలు ఆగినప్పుడు ఒక రష్యను యువతి నేను కూర్చున్న పెట్టెవద్దకు పరుగున వచ్చి చక్కటి నవ్వుతో పలకరించింది రైలు కదలగానే మిత్రుడికి వీడ్కోలు యిచ్చినట్టు నేను కనిపించినంత దూరం చెయ్యి ఊపుతూనే ఉంది ఆప్రాంతంలోని స్త్రీ పురుషులకు నల్ల ముఖం చూడ్డం క్రొత్తగా ఉంటుంది అందుమూలంగా ఆ ఉత్సుకత, ఆప్యాయత జపాన్‌లోను చైనాలోను సన్నగా, నాజూగ్గా అందంగా, ఆకర్షణీయంగా ఉన్న స్త్రీలను చూసిన తరువాత రష్యను స్త్రీలు చాలా మోటుగా కనుపించారు అప్పటికి యింకా హెచ్చు మందిని చూడనందున

నిశ్చితాభిప్రాయానికి రాలేకపోయాను కాని ఏదో శాస్త్రం చెప్పినట్టు అన్నం ఉడికిందోలేదో చూడ్డానికి అన్నం అంతా పట్టుకుని చూడనక్కరలేదు కదా!

ఆనాడు కాలక్షేపానికి ఆ రైలులో ప్రయాణం చేస్తూన్న చైనీస్ ప్రొఫెసర్ యాదృచ్ఛికంగా కలిసాడు ఆయన పెకింగ్ వైద్య కళాశాలలో గత 20 ఏళ్ళుగా పనిచేస్తున్నాడు చైనా సగటున ప్రతి సంవత్సరం300 మంది డాక్టర్లను తయారు చేస్తుంది వారిని అదికార్లు తమ యిష్టం వచ్చిన చోటుకి పంపుతారు సాధారణంగా ప్రొఫెసర్లు అదికార్లు నిర్ణయించిన జాగాలకు వెళ్ళేటట్టు క్రొత్తగా తయారైన డాక్టర్లను ప్రోత్సహిస్తారు నూటికి 10 నుంచి20 శాతం డాక్టర్లు తమకు యిచ్చిన నియామకాలను వ్యతిరేకిస్తారు ఒకవేళ అంగీకరించినా బలవంతం మీద మ్రొక్కుబడికి వెళతారు చైనాలో వైద్య నిపుణులు, వైద్య కళాశాలల్లో ఉపాధ్యాయుల కొరత ఉన్నదన్నరు చైనాలో మలేరియా మరికొన్ని రక్త సంబంధమైన వ్యాధులు పెద్ద సమస్యగా పరిణమించినదన్నారు కొద్దిమంది డాక్టర్లు ప్రైవేటు ప్రాక్టీసుయందు అభిలాష చూపెడుతున్నారని ఇటీవల వైద్య సహకారసంఘాలు కూడా ప్రారంభిస్తున్నారని అన్నారు

ఆరాత్రి రైలు పెట్టెను వేడి చేసారు చాలా హాయిగా ఉంది అప్పటి రోజుల్లో వేడినీళ్ళు రైలు పెట్టెలలోని గొట్టాలద్వారా పంపి పెట్టెల్ని వేడి చేసేవారు రైలు ఛీటా స్టేషన్ చేరింది మాస్కోనుంచి రష్యా పసిఫిక్ తీరపట్టణమైన వ్లాడి వాస్టక్ వరకు ఉన్న ట్రాన్స్ సైబీరియన్ రైల్వేను ఛీటా వద్ద పెకింగ్ నుంచి మాస్కో వెళ్ళే రైలుమార్గం కలుస్తుంది ఇక్కడనుంచి రైలు ట్రాన్స్‌సైబీరియన్ రైలుమార్గం మీదే మాస్కోవరకు ప్రయాణం చేస్తుంది ట్రాన్స్ సైబీరియన్ రైలు మార్గం 1890 లో నిర్మించబడింది దాని ఫలితంగా మాస్కోనుంచి 5800మైళ్ళ దూరంలో ఉన్న వ్లాడివాస్టక్, తొమ్మిది రోజుల్లో చేరడానికి సాధ్యపడింది ఈ రైలుమార్గం పడడానికి ముందు ఈప్రయాణానికి ఒక ఏడాది పట్టేదట ఛీటా ఒకప్పుడు ఫార్ ఈస్టరన్ రిపబ్లిక్ అని పిలువబడే ప్రాంతానికి ముఖ్యపట్టణం ఈ ప్రదేశం 1922 లో రష్యాలో కలుపుకోబడింది 7 లక్షల చదరపు మైళ్ల విస్తీర్ణంగల ఛీటా ప్రాంతం పశు సంపదకు గొర్రెలకు ప్రసిద్ధికెక్కినది

సూర్యాస్తమయ సమయానికి రైలు బైకల్ సరస్సు ప్రక్కనుంచి ప్రయాణం చేస్తోంది నిజానికి బైకల్ ప్రపంచంలోని అన్ని సరస్సులలోను విశిష్టత, ప్రత్యేకత సంతరించుకున్న మంచినీటి మహా సముద్రం సైబీరియాలోని ఆదిమ జాతుల వారికి అది పవిత్ర సాగరం బైకల్ సరస్సు పొడవు 400 మైళ్ళు 15 నుంచి 50 మైళ్ళు వెడల్పు ఇంత వరకు చేసిన పరిశీలనల ఫలితంగా దాని

లోతు 5820 అడుగులని నిర్ధారించారు. 330 పెద్ద, చిన్న నదులు బైకల్ సరస్సులో నుంచి బైటకు ప్రవహిస్తాయి. పెద్దనదులలో అతివేగంగా ప్రవహించే అంగర నది పొడవు 1125 మైళ్ళు. వేగం పుణ్యమా అంటూ ఇది ఏకాలంలోను మంచుతో గడ్డకట్టుకోదు. సంవత్సరం పొడవునా బాతులు ఈనదిలో ఈతలు కొడుతూనే ఉంటాయి.

బైకల్ సరస్సులో 500 కంటె హెచ్చు రకాల వృక్ష సంపద 1000 రకాల జంతు జీవాలు ఉన్న వని,వాటిలో సగానికి పైగా వృక్షజాతులు,75శాతం జంతువుల రకాలు ఈ సరస్సు యొక్క ప్రత్యేకత అని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. ఈ సరస్సు లో దొరికే ప్రత్యేకమైన చేప ఒముల్. ఈసరస్సులో ప్రపంచంలో ఎక్కడాలేని మంచినీటి సీల్ కనుపిస్తుంది. దీనిలోని కొన్ని చేపలు అరమైలు లోతులో ఉంటాయని వాటిలో సగానికి సగం క్రొవ్వు ఉంటుందని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. బైకల్ సరస్సులో నీళ్ళు విపరీతమైనంత చల్లగా ఉంటాయి. చలికాలంలో ఈ సరస్సుపై 3 అడుగుల దళసరిగా మంచు గడ్డ కట్టుకుని ఉంటుంది. ఆకాలంలో ఒముల చేపల వేటకు వచ్చిన మత్స్య కారులు వేడి చేసిన పాకలలో రోజుల తరబడి ఉండి మంచుకి రంధ్రాలు చేసి చేపల్ని పడతారట. బైకల్ సరస్సు ప్రపంచంలో భౌగోళికంగాను. జంతుశాస్త్ర రీత్యా అత్యంత ప్రాముఖ్యమైన అద్భుతం అనడం అతిశయోక్తి కాదు. ప్రపంచ వ్యాప్తంగా వైజ్ఞానిక శాస్త్రజ్ఞులకు బైకల్ చాలా ఆసక్తి కరమైనది. సోవియట్ సైన్సు అకాడమీ ఆధ్వర్యంలో ఇక్కడ ఒక పరిశోధనా సంస్థను నెల కొల్పి ఏళ్ళ తరబడి పరిశీలనలు చేస్తున్నారు.

ఈసరస్సు గత 2కోట్ల సంవత్సరాల క్రిందట ఏర్పడినదని. అది ఈనాటికి అలాగే ఉన్నదని నమ్మకం. సరస్సు యొక్క తూర్పు తీరంలో మంచుతో నిండిన పర్వత శిఖరాలు, మంగోలియా వరకు వ్యాపించి ఉన్న పాయన్ పర్వత శిఖరాలు కనుపిస్తూ ఉంటాయి. ఆప్రకృతి దృశ్యం అత్యంత మనోజ్ఞం. రైలు బైకల్ సరస్సు కొంత భాగాన్ని చుట్టి ప్రయాణం చేస్తోంది. సరస్సు చుట్టూ ఉన్న అడవులతో నిండిన ఎత్తైన పర్వతాలలో 50 సొరంగాల గుండా రైలు వెళుతోంది.

తెల్లవారేసరికి రైలు ఇర్కుట్స్క్ స్టేషన్ చేరింది. అప్పటికి రైలులో 5 రాత్రుళ్ళు గడచి పోయాయి. మాస్కో చేరడానికి మరొక 4 రాత్రుళ్ళు ప్రయాణం ఉంది. రైలు ఇంకా సైబీరియాలోనే ఉంది. ఇర్కుట్స్క్‌లో విమానయానకేంద్రం కూడా ఉంది . ఈపట్టణం తూర్పు సైబీరియాలో అత్యంత పురాతనమైన రష్యన్ సాంస్కృతిక కేంద్రం. సైబీరియాలోని అన్ని పట్టణాలు 17వ శతాబ్దంలో సైబీరియాలోకి ప్రవేశించిన రష్యన్లు నిర్మించినవే. 1581లో

తాత్తారులను ఓడించడానికి ఎర్మాక్ యూరల్‌పర్వతాలు దాటి వచ్చి ఇర్టిష్ నదీతీరంలో ఉన్న సిబిర్ కోటను వశపరచుకొని తార్తారులపై బొచ్చుతో ఉన్న జంతు చర్మాల కప్పము విధించాడు ఆరోజుల్లో ఆ ప్రాంతాల్లో నివశించే ఆసియా వాసుల నుంచి బొచ్చు చర్మాల (ఫర్ )కప్పము తీసుకోవడానికి సైబీరియా అంతా రష్యన్లు నివాస స్థానాలు ఏర్పరచుకున్నారు యాకుత్ తెగవారినుంచి అనేక రకాల బొచ్చు చర్మాలు తీసుకోవడానికి, వారిని అదుపులో ఉంచడానికి యాకుట్స్కునిక్ నిర్మించబడింది ఈ ప్రాంతాన్ని రష్యను చక్రవర్తుల అధీనంలో ఉంచడంతో పాటు ఈ స్థావరాలు యూరోపియన్ రష్యాకు ఉత్తర పసిఫిక్ తీరానికి మధ్య రహదారి సౌకర్యాలుగా పనిచేసేవి ఇర్కుట్స్క్ 1652లో నిర్మించబడింది చాలా ఏళ్ళు ఇది బంగారు గనులకు ప్రసిద్ధి

ప్రస్తుతం సైబీరియాలో పెద్ద పట్టణాలన్నీ ట్రాన్స్ సైబీరియా రైలు మార్గం మీద ఉన్న రైలు జంక్షన్లు ఈరైలు మార్గం పుణ్యమా అంటూ సైబీరియాలో రష్యనుల జనాబా చాలా పెరిగి పోయింది బ్రేక్‌ఫాస్ట్ చేసి నాతో తెచ్చుకున్న హవానా చుట్టలలో ఆఖరిది కాలుస్తూ కూర్చున్నా పెకింగ్‌లో మంచి పుగాకు దొరకలేదు ఇక విదేశాలలో తయారైన దొర చుట్టలు కన్ను పొడుచుకున్నా కనబడలేదని వేరే చెప్పాలా

ఏదో అలా ఆలోచిస్తూ రైలులోనుంచి బైటకు చూస్తూ కూర్చున్నాను పెకింగ్ వైపు వెళ్ళే గూడ్సు రైళ్ళు లెక్కపెట్టడం సాధ్యంకాలేదు ప్రతి 5 నిమిషాలకు చైనాకు, కొరియాకు వియత్నాంకు, సైబీరియాలోని అనేక ప్రాంతాలకు సోవియట్ రష్యా పంపుతున్న వివిధ యంత్రాలతో నిండిన గూడ్సు రైళ్ళు వెళుతున్నాయి ఒక్కొక్క రైలుకి రెండు మూడు ఇంజన్లు తగిలించారు దారిలో ప్రతి స్టేషన్ లోను అనేక రైలు వాగన్సు, రైలు ఇంజన్లు కనిపించాయి మిత్రదేశాలకు సోవియట్ యూనియన్ చేస్తున్న సహకార, సహాయాలకు ఆ గూడ్సు రైళ్ళు ప్రత్యక్ష నిదర్శనం అనిపించింది

రైలు ఆగిన ప్రతిచోట స్త్రీలు పాలు, గ్రుడ్లు, టొమాటోలు, ఒకటీ అర దోసకాయ రైలు వద్దకు తీసుకువచ్చి అమ్ముతున్నారు ఒక ముసలావిడ ఉడకబెట్టిన కోడిని అమ్మడానికి తీసుకువచ్చింది ఐదు రోజులనుంచి తాజా కూరలుగాని తదితర తాజా భోజన పదార్థాలుకాని దొరకని కారణంగా ప్రయాణీకులు అమ్మకానికి వచ్చిన పదార్థాలను ఎగబడి కొనుక్కున్నారు ఆ సాయంకాలానికి రైలు సైబీరియా ముఖ్య పట్టణమనదగిన నోవో సిబిరిస్క్ స్టేషను చేరింది అది చాలా పెద్ద స్టేషను ప్రయాణం ప్రారంభించిన తరువాత మొదటిసారిగా తాజా పళ్ళు కనుపించాయి ద్రాక్షా కిలో 18 రూబుల్సు అనే

సరికి పళ్ళు తినాలనే సరదా నీరుకారిపోయింది రైలు దిగి స్టేషను లోను, కాస్త బైట తిరిగివచ్చాను అది చాలా పెద్ద పట్టణం అనిపించింది ఇది ఓబ్ నదీ తీరాన ఉంది ట్రాన్స్ సైబీరియన్ రైల్వేనిర్మాణంలో ఓబ్ నదిపై వేసిన వంతెన నిర్మించిన కార్మికులు ఈ పట్టణం నిర్మించారు ఇక్కడ కొత్తగా నిర్మించిన రైలు స్టేషను 1941 లో పూర్తి అయింది ఈ పట్టణం యూరల్ పర్వతాలకు 1300 మైళ్ళు తూర్పుగా ఉంది

సైబీరియాలో నోవో సిబిరిస్క్‌తో పాటు అనేక పట్టణాలు సోవియట్ రష్యాయొక్క పారిశ్రామిక అభివృద్ధికి స్థావరాలుగా రూపొందాయి రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మను సైన్యాలు ఓల్గానది వద్ద తమ పారిశ్రామిక సంపద శత్రువుల చేతిలో పడకుండా పరిశ్రమలను యూరల్ పర్వత శ్రేణికి తూర్పుగా ఉన్న సైబీరియాలోకి తరలించారు దాని పలితంగా 1913లో 6 శాతం రష్యను పరిశ్రమలు మాత్రమే ఉండే సైబీరియాలో 1944 నాటికి రష్యాలోని మొత్తం పరిశ్రమలలో 85 శాతం ఓల్గానదికి తూర్పుగా ఉన్నాయి సైబీరియా సోవియట్ రష్యా యొక్క భద్రతకు అంతర రక్షణ శిబిరంగా తయారయింది ఇక్కడ దేశంలోని 75శాతం బొగ్గు, 80శాతం జల సంపద, 80శాతం కలప, శాతం తగరం నిక్షేపాలు ఉన్నాయి పశ్చిమ యూరోపియన్ రష్యా నుంచి ర్పు ఆసియన్ రష్యాకు మార్చబడిన పరిశ్రమలతోపాటు లక్షలాది ప్రజలు డా వలస వెళ్ళారు ఇది రెండవ ప్రపంచ యుద్ధం తరువాత సోవియట్ రష్యాలో సంభవించిన అత్యంత అద్భుతమైన పరిణామం

ఇదంతా వినడానికి బాగానే ఉంది కాని రైలు లో వెళుతుంటే ఇరుప్రక్కలా కూడా ఏవిదమైన అభివృద్ధి సూచనలు కనబడకపోవడం ఆశ్చర్యమనిపించింది పోలిష్ మిత్రుడు కల్నల్ లెర్నర్ని అదే ప్రశ్న అడిగాను పారిశ్రామిక వైజ్ఞానిక అభివృద్ధి పథకాలు రైలు కట్ట ప్రక్క నిర్మించేటంత వెర్రి వాళ్లుకాదు రష్యనులన్నాడు సైబీరియాలో అత్యంత ప్రాముఖ్యమైన పారిశ్రామిక సమూహం యూరల్ పర్వతశ్రేణిలో ఉన్న మాగ్నిటో గోర్స్క్ ఇనుము ఉక్కు ప్రదేశం సైబీరియా లోపలిభాగంలో ప్రపంచంలోకెల్లా హెచ్చు బొగ్గు నిల్వలున్న కుజ్‌నెట్స్క్ బేసిన్ 1930 ప్రాంతంలో క్లీవ్‌లాండ్ చికాగో నుంచి అమెరికన్ ఇంజనీర్లు సాంకేతిక సహాయ కాంట్రాక్టుపై సైబీరియాలోకి వెళ్ళి యూరల్ పర్వతశ్రేణి వెనుక ఉక్కుఫ్యాక్టరీలు నిర్మించడంలో రష్యన్లకు తోడ్పడ్డారు తరతరాలుగా సైబీరియా ఏవిధమైన మార్పులేకుండా ప్రకృతి ప్రసాదించిన సంపదలను తనలో నిక్షిప్తం చేసుకుని నివురుకప్పిన నిప్పులా ఉండిపోయింది కాని గత కొద్ది సంవత్సరాలలో సైబీరియా పూర్తిగా మారిపోయింది ఆ మార్పు వర్ణనాతీతం ఆ కొత్త

ఉత్సాహంలో వారు పెద్ద మిల్లులు ఫ్యాక్టరీలు నెలకొల్పారు కొత్తరహదారులు, రైలు మార్గాలు విమానాశ్రయాలు నిర్మించారు లోహాలతో నిండిన భూమిలో కొత్తగనులను త్రవ్వారు సైబీరియాలో వాతావరణం మారలేదు కాని ప్రజల మానసిక తత్వం పూర్తిగా మారిపోయింది

ఇంతవరకు రైలు ప్రయాణం హాయిగా ఆనందంగా జరిగిపోయింది వినేది అంతా క్రొత్తకావడంవల్ల చాలా ఆసక్తిదాయకంగా ఉంది ఒక వారంరోజులు రైలులో కలసి ప్రయాణం చేయడంవల్ల బాషవచ్చినా రాకపోయినా కొందరు సన్నిహితులయ్యారు రైలులో గట్టిబల్ల, మెత్తటిబల్లలతో ఉన్నసీట్లవిషయంలో ప్రయాణికుల విమర్శ సరదాగా ఉంది మెత్తటి సీట్లటిక్కెట్టు కొన్నవారంతా వారిదృష్టిలో ఒల్లుబలిసిన వర్గం క్రిందలెక్క చాలామంది రష్యను మిత్రులు ప్రొద్దుతిరుగుడు గింజల్ని పళ్ళతో కొరుక్కుతింటూ కూర్చున్నారు అవి మన గుమ్మడి గింజలకంటే చాలా చిన్నవిగా ఉంటాయి వాటికి రుచి పచి ఉండదు అంతలో ఒక మధ్య వయస్కురాలు మన సమోసాలలా ఉన్న తినుబండారం పెట్టెలలో అమ్మడానికి తీసుకువచ్చింది ఆమెతో అంతా వేళాకోళాలాడుతున్నారు భాషతెలియక పోయినా ఆ సరసాలు కొంచెం సభ్యత హద్దులు దాటుతున్నాయని అర్థం అయింది

మిత్రులతో కూర్చుని కబుర్లాడుతుంటే వారిలో సైబీరియాను గూర్చిబాగా తెలిసిన మిత్రుడు సైబీరియాలోని అడవులు వృక్షసంపద, కొన్నితెగలయొక్క ఆచార వ్యవహారాలు ఎంతో ఉత్సాహంగా చెబుతున్నాడు ఎప్పుడూ పచ్చగా ఉండే అడవుల్ని సైబీరియాలో టైగా అంటారు ఈసైబీరియన్ టైగాలో గచ్చకాయ రంగు ఉడత చర్మం, ఎర్రనక్క, వెండి రంగు నక్కల బొచ్చు చర్మం యింకా అనేక రకాల అందమైన, అమూల్యమైన ఫర్స్ దొరుకుతాయి

దక్షిణ ప్రాంతంలో కొన్ని కలగలుపు అడవులు ఉన్నాయి వాటిని ఉస్సురి టైగా అంటారు దీనిలో అనేక రకాల వృక్షసంపద ఉంది పశ్చిమభాగంలో అడవులు క్రమేపి స్టెప్పీలకు స్థానం యిస్తాయి ఈస్టెప్పీలు పశ్చిమంనుంచి తూర్పువరకు విస్తరించి ఉన్నాయి ఈ స్టెప్పీభూభాగం, అరణ్యాలు సుమారు 3,100 మైళ్ళ పొడవు కొన్నివందలమైళ్ళ వెడల్పు విస్తీర్ణంలో ఉన్నాయి సోవియట్ యూనియన్‌లో వ్యవసాయం చేసే భూభాగంలో పదింట ఏడు భాగాలు ఈ స్టెప్పీ- అడవిప్రాంతాల్లోనే ఉంది ఇది ఆదేశపు ధాన్యాగారం సైబీరియాలో సారవంతమైన వ్యవసాయ యోగ్యమైన స్టెప్పీభూములు అపారంగా ఉన్నాయి ఇక్కడ హెచ్చుగా గోధుమ పండిస్తున్నారు గతమూడేళ్ళలో 86,450,000 ఎకరాలు సాగులోకి తీసుకు రాబడిందట ఒకప్పుడు వెనుకబడ్డ ప్రదేశంగా పరిగణింపబడ్డ సైబీరియా

సోవియట్ పరిపాలనలో సంపూర్ణంగా మార్పు చెందింది దానికి ప్రత్యక్షనిదర్శనం త్వరితగతిని పురోగమిస్తున్న పారిశ్రామిక రంగం సాంస్కృతిక కేంద్రాలు, విశ్వవిద్యాలయాలు విజ్ఞాన కేంద్రాలు అక్కడ వ్యవసాయం బారీఎత్తున యంత్రాలతో నిర్వహించబడుతుంది

సైబీరియాలోని స్టెప్పీలలో నివసించే ఖజక్ జాతి వారంతా మంచి గుర్రపు రౌతులు వారికి గుర్రపు పాలతో తయారుచేసిన కూమిస్ అనే మదుపానం అత్యంత ప్రియమైనది వీరు కావడానికి మహమ్మదీయులేకాని వారు మత సిద్ధాంతాలను అంతగా పట్టించుకోరు వీరు మంగోలియన్ శాఖకు చెందినవారు చైనాలోని కజక్ జాతివారు, సైబీరియాలోని కజక్‌లు బంధువులు ఈజాతి స్త్రీలు రష్యాను జార్ చక్రవర్తులు పాలించే రోజులలోకూడా బురఖా వేసుకుని ఎరగరు ఆ జాతిలో స్త్రీలు చాలా స్వతంత్రంగా జీవిస్తారు, వీరు తయారు చేసే కూమిస్ ఆరోగ్యదాయకంగా ఉంటుంది ఇక్కడి ఆడగుర్రాలు రోజుకి సుమారు 10 లీటర్ల పాలు యిస్తాయి ఆపాలను ఒకటి రెండురోజులు పులవబెట్టి ఆజాతి వారంతా మద్యంగా సేవిస్తారు దానిలో 4 శాతం వరకు అల్కహాల్ ఉంటుంది ఆప్రాంతాలలో నివసించే వారంతా పరిపూర్ణ రోగ్యవంతులుగా ఉండానికి ఈ కూమిస్ సేవించడమే కారణమని వారి గట్టి మ్మకం

సామాన్యంగా సైబీరియా పేరు వినేసరికి ప్రపంచంలోని ప్రజలందరికీ చీమలు దూరని ట్టైగా చిట్టడవులు, చిత్తడి నేలలు, చెట్టుచేమా లేని తండ్రాలు సుదీర్ఘమైన చలికాలం గడ్డకట్టిన మంచు గుర్తుకువస్తాయి కాని ఇప్పుడు అదంతా మారిపోయింది ఈనాడు సైబీరియా సోవియట్ రష్యాకు ాన్యాగారం, భారీపరిశ్రమల నిలయం ఖనిజ సంపదకు హైడ్రో విద్యుత్ శక్తికి లవాలం ఒకటేమిటి అన్నిరంగాలలోను సైబీరియా సర్వతోముఖాభివృద్ధికి ంగారుబాటలు వేయబడ్డాయి సైబీరియాగుండా రైలు పయాణిస్తున్నంతసేపూ రష్యన్లు ఈప్రాంతాన్ని బ్రహ్మాండంగా అభివృద్ధి రచుకోవడానికి ఉన్నఅవకాశాలను గురించిన ఆలోచన ఇది వారికి ండంత బలం

వాతావరణంలో మార్పు కనిపించింది ఆరోజు కొంచెం వేడిగా ఉంది ుతే, అందరూ ఉలెన్‌సూట్లు తీసివేసి వేసవి డ్రస్సులలోకి మారారు రైలు స్క్ స్టేషన్‌లో ఆగినప్పుడు మొట్టమొదటి పుచ్చకాయ కనిపించింది ాస్కోనుంచి వ్లాడివాస్టక్ వెళ్ళే రైలుకూడా స్టేషన్‌లో ఉంది మొత్తం ండురైళ్ళలోని ప్రయాణీకులు పుచ్చకాయలు కొనుక్కుని ప్లాట్‌ఫారం మీదే తినేస్తున్నారు రైలు కదలిన తరువాత ఒక మిత్రుడు పుచ్చకాయల మీద

ఉపన్యాసం యిచ్చాడు రష్యాలోని పుచ్చ పువ్వులలో ఆడ మగ అంశలు ఒకే పువ్వులో కలిసి ఉంటాయట కాని అమెరికాలో పుచ్చ పాదులో ఆడ మగ పుష్పాలు వేరు వేరుగా ఉంటాయట మనదేశంలో కూడా అలాగే ఉంటాయి అతి తీవ్రంగా ఉండే చలికాలంలో కూడా పుచ్చకాయల్ని బద్రపరచడంలో రష్యన్లు సిద్ధహస్తులు వాటిని వెలుగు తగలని ప్రదేశంలో 40 నుంచి 60 డిగ్రీలు వేడి ఉండే చోట ఉంచడమే దానిలో రహస్యం అన్నాడు రష్యను మిత్రుడు

రైలులో నుంచి బైటకు చూస్తే యిన్ని రోజులూ కనిపించని వ్యవసాయ పొలాలు కళ్ళబడ్డాయి స్కూలుకి వెళ్ళేపిల్లలు అప్పుడప్పుడు ఒకకారు కూడా కనిపించాయి ఆ రాత్రికి సైబీరియా వదలిపెట్టి యూరోపియన్ రష్యాలో ప్రవేశిస్తామని మిత్రులు అన్నారు ఏషియన్ రష్యాకి యూరోపియన్ రష్యాకి సరిహద్దు యూరల్ పర్వతాలని ఒకబావం ప్రబలంగా ఉంది కాని భూగోళ శాస్త్ర వేత్తల అభిప్రాయం ప్రకారం యూరేషియా అంతా విబజించడానికి వీలులేని ఒకే ఖండం దానికి నిజంగా బౌగోళిక విబజన హద్దులు లేవు కాని మానవ తెగలు జాతుల విబజనకు సంబంధించినంత వరకు వారి దృష్టిలో ఆసియా యూరల్ పర్వతాల వద్ద ప్రారంబంకాదు నిజానికి అది యూరోపియన్ రష్యాగా పరిగణించబడే ప్రాంతం లోపల ఓల్గా నదివద్ద ప్రారంభం అవుతుంది

యూరోపియన్ రష్యాకు ఏషియన్ రష్యాకు సరిహద్దు ఏది అయినప్పటికి ఆ రాత్రికి స్వెర్డ్లావ్స్క్ వద్ద రైలు సైబీరియా వదలి యూరల్ పర్వతాలు దాటుతుంది అంటే మరొక రెండురోజుల్లో మాస్కో చేరతామన్న మాట ఇంతవరకు పెకింగ్ మాస్కో టైమ్‌లతో సతమత మయ్యాం ఆ రోజు రైలు మాస్కోకి దగ్గిర పడుతున్నందున కాబోలు14 గంటలు పగలు ఉంది రైలు స్టేషను లోను, పట్టాలమీద, కాబిన్లలోను అందరూ స్త్రీలే పని చేస్తున్నట్టు కనిపించింది మగవారు చేసే అన్నిపనులు, బరువు పనులతో సహా స్త్రీలే చేస్తున్నారు సైబీరియాలో స్త్రీలు కష్టజీవులనిపించింది

ఓంస్క్, టోంస్క్ చాలా పురాతన పట్టణాలు, స్టాలిన్ ఓంస్క్ దగ్గర తన దేశబహిష్కరణ సందర్భంలో కొంతకాలం గడిపాడు దోస్తవ్‌స్కీ టోంస్క్ జైలులో నాలుగేళ్ళు ఉన్నాడు అప్పటిలో ఆ పట్టణాన్ని గురించిచెబుతూ అది ఘోరమైన చిన్న పట్టణమన్నాడు ఇప్పుడు అవి కళకళ్ళాడుతున్న పెద్ద పట్టణాలు ఇక స్వెర్డ్లావ్‌స్క్‌కి ఇంకా చక్కటి చరిత్ర ఉంది ఈ పట్టణం 1720 లో జారీనా కేథరిన్ ది గ్రేట్ కాలంలో నిర్మితమైంది మహాకవి పుష్కిన్ కొంతకాలం ఇక్కడ తన దేశబహిష్కరణ కాలాన్ని గడిపాడు ఇక్కడే ఆఖరి జార్ చక్రవర్తి రెండవ నికలస్ అతడి కుటుంబసభ్యులు హత్య చేయబడ్డారు ఈ

పట్టణంపేరు ఎకటెరిన్ బర్గ్ అని ఉండేది లెనిన్ యొక్క ఆప్తమిత్రుడు నూతన సోవియట్ ప్రభుత్వం కేంద్ర ఎగ్జిక్యూటివ్ కమిటీ ప్రథమ అధ్యక్షుడు అయిన జాకబ్ స్వెర్డ్ లావ్ గౌరవార్థం 1919లో ఆయన మరణానంతరం ఆ పట్టణానికి ఆ పేరు పెట్టారు ఈ పట్టణానికి దక్షిణంగా సైబీరియాకు ప్రదేశద్వారంగా అభివర్ధించబడే చెల్యాబిన్స్క్ పట్టణం ఉంది అక్కడ ఉన్న ట్రాక్టరు ఫ్యాక్టరీ స్టాలిన్ గ్రాడ్ ఫ్యాక్టరీ తరువాత సోవియట్ యూనియన్‌లో అత్యంత ప్రాముఖ్యమైంది దానికి దగ్గర లోనే ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన స్టీలుపట్టణం మాగ్నిటోగోర్స్క్ ఉంది ఇక్కడ ప్రపంచంలో కల్లా పెద్దదైన ఇనుప ఫౌండ్రీ, బ్రహ్మాండమైన స్టీలుమిల్లు ఉన్నాయి

తెల్లవారేసరికి రైలు మాలొటూవ్‌స్క్ స్టేషను చేరింది అయితే ఆ స్టేషన్ పేరు మార్చి వేసారని దానికి పెరమ్ అని పేరు పెట్టారని మిత్రులు చెప్పారు మరొక పెద్దస్టేషన్ కిరావ్, మొదటిసారిగా తాజా ఆపిల్స్ కనిపించాయి స్టేషన్ బైట టాక్సీలు కూడా ఉన్నాయి దారిలో ఉన్న అన్ని రైలు స్టేషన్‌లలోను సోవియట్ నాయకులు లెనిన్ స్టాలిన్ విగ్రహాలు వేరువేరుగా కాని, ఇద్దరూ కలసి ఉన్నవి కాని ఉన్నాయి అయితే ఆ యిద్దరి ఫోటోలు ఎక్కడా ...నిపించలేదు అలా స్టేషన్‌లో తిరుగుతుంటే ఒక రష్యన్ విదేశీ ...యాణీకులకు ఒక నోటు పుస్తకం, లెనిన్ బొమ్మతో ఉన్న మెడాలియన్ ...చ్చాడు ఏదో ఉడతాభక్తిగా తమ దేశంలో ప్రయాణిస్తున్న విదేశీయులకు తన ...హ్వానాన్ని తెలియజేసాడు అంతా ఆనందించారు ఇక ప్రయాణం పూర్తి అవుతున్నందుకు అంతా సంతోషిస్తున్నారు మరునటి రోజు ఉదయానికి మాస్కో చేరతామని కండక్టరు గార్డు చెప్పినవార్త నిజంగా శుభవార్త అనిపించింది

అప్పటికే ఎనిమిది రోజులు రైలులో గడిపాం ప్రయాణం కాస్తవిసుగు ...నిపించింది 650 ఏళ్ళక్రితం మార్కోపోలో నేలబాటను ఒంటె మీద ...ధ్యధరా సముద్రం నుంచి మధ్య ఆసియాగుండా ప్రయాణం చేసి పెకింగ్‌లో ...బ్లైఖాన్ కోటకు వెళ్ళాడట అతడికి లేని విసుగు నీకెందుకని చమత్కరించాడు ...స్లవేకియన్ మిత్రుడు ఏదో అలా అనిపించింది కాని ఆ అనుభవం ...తంలో మరువరాని మధురానుభూతి విమానంలో కాకుండా రైలులో ...మని సలహా చెప్పిన శ్రీ ఆర్ కె నెహ్రూను మనస్సులో అభినందించాను ...లు ప్రయాణంలో తెలుసుకున్న కొత్త విషయాలు ప్రత్యక్షంగా చూసిన ... ప్రజల జీవనవిధానం, అనేక ఆలోచనలు మనసులో ...సురుకున్నాయి సైబీరియా అంటే ఉన్న అభిప్రాయాలు తారుమారు ...య్యాయి భవిష్యత్తు వారిది అని పించింది, అక్కడి ప్రజలంతా హాయిగా

ఆడుతూ పాడుతూ నవ్వుకుంటూ తమ జీవితాన్ని ఆనందోత్సాహాలతో గడుపుతున్నారు కష్టపడి పని చేయడంలో అక్కడి స్త్రీ పురుషులు వారికి వారేసాటి జానపద సంగీతంలో వారి జీవనసరళి ప్రతిఫలిస్తుందని ఒక రష్యను మిత్రుడు కొన్ని జానపద గేయాలు పాడి వినిపించాడు సైబీరియాలో విజ్ఞానం, పరిశ్రమ చెట్టాపట్టాలు వేసుకు నడుస్తున్నాయి అలా ఏన్నో ఆలోచనలు

ఎంత అందంగా వర్ణించగలిగినా ఎన్ని వివరాలు చెప్పగలిగినా స్వయంగా అనుభవించిన ఆనందానికి న్యాయం చేయడం కష్టం ఒకప్రక్క పెకింగ్ మాస్కో రైలు ప్రయాణం పూర్తి అవుతోందని సంతోషం మరో ప్రక్క మాస్కోలో దిగిన తరువాత ఎక్కడకు వెళ్ళాలి అనే సమస్య కొంచెం కలవరపెట్టసాగింది వియత్నాం వదిలే ముందు శ్రీ టి ఎస్ కౌల్ పెకింగ్‌లో పరంజపాయ్‌కి, మాస్కోలో విష్ణు అహూజాకు జాబులు వ్రాసారు పాయ్ రైలు వద్దకు వచ్చి కలుసుకుని ఆతిథ్యం ఇచ్చి మళ్ళా రైలు ఎక్కించాడు మాస్కోలో నాకు ఇబ్బంది ఎదురవుతుందని పెకింగ్ వదిలే ముందే తెలుసు మొదట పెకింగ్ నుంచి శనివారం బయలుదేరే రైలుకి టిక్కెట్టు కొనుక్కుని మాస్కోలోని అహూజాకు మిత్రుడు విల్ ఫ్రెడ్ బుర్ఛట్‌కి పలానా రైలులో వస్తున్నట్టు జాబులు వ్రాసాను అయితే ఆ రైలులో ప్రయాణం చేయడం కుదరనందున మంగళవారం రైలులో పెకింగ్ వదిలాను ఆ మార్పు వారికిద్దరికీ తెలియచేయ లేకపోయాను అందుమూలంగా వాళ్ళెవరూ రైలుస్టేషనుకి రావడానికి అవకాశం లేదు మాస్కోలో ఏదైనా హోటల్‌లో ఏర్పాటు చేయమని కూడా ఎవరికీ వ్రాయలేదు నాకు బాష రాదు రేపు రైలు దిగి ఏంచేయాలి అనేబావం కొంచెం బాధపెట్టడం మొదలు పెట్టింది సామాన్య వినోద పర్యాటకులు ఇల్లు వదలిన క్షణం నుంచి తిరిగి ఇంటికి చేరేవరకు అన్ని ఏర్పాట్లు చేసుకుని ప్రయాణం హాయిగా ఆనందదాయకంగా ఉండేటట్టు చేసుకుంటారు కాని నాప్రయాణం దానికంతటికీ విరుద్ధంగా ఉంది ఆక్షణంలో ఆ సమస్యను గూర్చి ఆలోచించడంలో అర్థం లేదనిపించింది గిరీశం అన్నట్టు అటునుంచి నరుక్కురావడానికి నిశ్చయించాను

రాత్రి సరిగా నిద్రపట్టలేదు తెల్లవారుఝామున 3గంటలకే మెలకువ వచ్చేసింది ఇక నిద్రపట్టలేదు తెలతెలవారుతుండగా రైలు ఓల్గా నదిని దాటింది ఓల్గా యూరోపియన్ రష్యాలో చాలా బాగాన్ని పచ్చటి బంగారు త్రాడులా చుట్టి ఉంది పొడవు వెడల్పుల మాట అటుంచి రష్యన్ల హృదయాలలో ఓల్గానదికి ఒక ప్రత్యేక స్థానం ఉంది వారి సాహిత్యంలో కవితలలో కూడా ఓల్గా చోటుచేసుకుంది ఆ నదీమతల్లి పేరు అనేక మంది రష్యను బాలికలకు

పెట్టుకుంటారు రష్యన్లు నదులను పూజించరు కాని ఆరాధిస్తారు, అభిమానిస్తారు ఆ నదిని ప్రాతఃకాలంలో చూస్తూ ఉంటే వియత్నాంలో కమిషను దుబాసీగా పనిచేసిన ఓల్గా గుర్తుకువచ్చింది అనది పేరునే కాకుండా దాని గంభీరతను, లోతును అందాన్ని పుణికిపుచ్చుకున్న అందాలరాణి ఓల్గా

అప్పుడే దూరంలో టెలివిజన్ యాంటీనాలు కనుపిస్తున్నాయి అంటే మాస్కోకి దగ్గరపడుతున్నామన్నమాట ఇక ఆలోచనలకు తావు యివ్వకుండా సూట్ కేసులు సర్దడం మొదలుపెట్టాను ఆలోచనలు, అనుభవాలు స్మృతులు తప్ప ఇన్నిరోజుల ప్రయాణంలో పెట్టెలలో సర్దడానికి క్రొత్తవస్తువులేమీ లేవుగా! ప్రతి చిన్న ఇంటిలోను టి వి ఉన్నచిహ్నాలు కనిపిస్తున్నాయి ఇళ్ళకప్పులన్నీ టి వి యాంటీనాలతో కప్పబడినట్టు అనిపించింది స్విస్ మిత్రుడు నన్ను స్విట్జర్లాండు రమ్మని పట్టుబడుతున్నాడు, కల్నల్ లెర్నర్ ప్రయాణంలో చాలా సహాయపడ్డాడు పోలెండు వచ్చినపుడు తనను తప్పకుండా కలుసుకోవాలంటున్నాడు

మాస్కో పట్టణ పరిసరాలగుండా రైలు వెళుతోంది అంతకు ముందు మాస్కోను చూచిన మిత్రులు ఆ పట్టణ సౌందర్యం మీద తమ అభిప్రాయాలు చెబుతున్నారు మిగిలిన దేశాలకు లేని ప్రత్యేకత రష్యాకు ఉంది ఈదేశంలో యూరోపియన్ బాగం ఆసియా బాగం కలిసి దానికి ప్రత్యేకమైన ఆకర్షణను యిస్తుంది చైనా నుంచి మాస్కో వెళ్ళేవారికి మాస్కో బ్రహ్మాండమైన యూరోపియన్ పట్టణంలా కనిపిస్తుంది యూరోపునుంచి మాస్కో వచ్చేవారికి అది ఏషియన్ పట్టణంలా కనుపిస్తుందట

ఉదయం 10 గంటలకు రైలు మాస్కో స్టేషన్‌కి చేరింది అనుకున్నట్టే నన్ను కలుసుకోవడానికి ఎవరూ స్టేషన్‌కి రాలేదు అప్పుడు మిత్రుడు లెర్నర్‌ని అడిగాను ఏ హోటల్‌కి వెళుతున్నావని లెనిన్‌గ్రాడ్‌స్కాయా అన్నాడు

## రష్యాలో రాజభోగం

రైలుస్టేషన్ బయటికి వచ్చి టాక్సీలో కూర్చుని లెనిన్ గ్రాడ్‌స్కాయా ...న్నాను నేను మొదటిసారిగా మాస్కో మహాపట్టణాన్ని చూస్తున్నానన్న ...ందంలో అటూ యిటూ చూచే లోపుగా టాక్సీ హోటల్ ముందు ఆగింది ...త తొందరగా వచ్చినందుకు ఆశ్చర్యంతో వెనకకు తిరిగి చూస్తే రైలుస్టేషన్ ...టల్ ఎదురుగానే ఉందని గ్రహించాను లోపలకు వెళ్ళి మనం ...మూలుగా అలవాటుపడ్డ రిసెప్షన్ దగ్గరకు వెళ్ళాను అక్కడ దానిని సర్వీస్ ...్యరో అంటారట అక్కడ ఒక అరడజనుమంది అందమైన రష్యన్ యువతులు ఉన్నారు హోటల్‌లో దిగిన వారికందరికీ అన్ని అవసరాలకు ఆ

సర్వీస్ బ్యూరో శరణ్యం నాటకం, బాలే టికెట్లు, రైలు, విమానం టిక్కెట్లు వీసాలు ఒకటేవిటి ప్రయాణీకులకు కావలసిన అన్ని పనులు చేసిపెట్టడానికి ఆ బ్యూరోలో ఒక్కొక్క విభాగానికి ఒక్కొక్క అమ్మాయి ఉంది ఈ వివరాలన్నీ తెలియకపోయినా వాళ్ళందరిలోను అందంగా ఉన్న అమ్మాయివద్దకు వెళ్ళి నాకు హోటల్‌లో ఒకగది కావాలని ఇంగ్లీషులో అన్నాను ఇక చూడండి అక్కడి కలకలం ఒక నల్లనివాడు ఇంగ్లీషులో ఏదో అంటున్నాడని వారంతా ఆశ్చర్యపోయారు వాళ్ళ ఆదుర్దా చూస్తే నాకు నవ్వు వచ్చింది నేను గది కావాలని అడిగిన అమ్మాయి మొహం ఎర్రగా అయిపోయింది వెంటనే నాకు ఏమీ సమాధానం చెప్పకుండా టెలిఫోనులో ఎవరితోనో మాట్లాడ్డం మొదలు పెట్టింది

ఐదు నిమిషాల తరువాత లోపల నుంచి ఒక అమ్మాయి వచ్చి మీకేం కావాలని ఫ్రెంచి భాషలో అడిగింది ఆమె యక్ష ప్రశ్నలు వేసింది నన్ను సోవియట్ యూనియన్‌లో ఎవరైనా ఆహ్వానించారా? ప్రభుత్వానికి గాని, పార్టీకిగాని ఏదైనా సాంస్కృతిక సంఘానికి కాని అతిథా? అని అడిగింది నన్ను ఎవరూ ఆహ్వానించలేదు నన్ను నేనే ఆహ్వానించుకున్నా నన్నాను ఆ అమ్మాయికి అర్థం అయినట్టులేదు హోటల్‌లో గది యివ్వడానికి వీలులేదంది మీ ప్రభుత్వం నేను మీ దేశం రావడానికి అనుమతి యిస్తూ నాకు వీసా ఇచ్చింది ఇక డబ్బులంటావా రూబుల్సు, పౌండ్లు, డాలర్లు ఏవి కావాలన్నా ముందు చెల్లిస్తాను ఒక గది యిప్పించమ్మా అని నాకు చేతనైన ఫ్రెంచిలో బ్రతిమాలాను ససేమి గది యివ్వడానికి వీలులేదంది తమ రూల్సు ప్రకారం ఒక విదేశీ ప్రయాణీకుడు కూడా స్థానికుడు ఎవరూ లేకుండా వచ్చి గది యివ్వమంటే యివ్వడం సాధ్యంకాదంది నాకు ఏమి చేయడానికి పాలుపోలేదు ఇక ఆఖరు ప్రయత్నంగా నేను ఎంతో సరదాపడి మీ దేశం చూడ్డానికి వస్తే హోటల్‌లో గది ఇవ్వనని నన్ను చాలా నిరుత్సాహ పరుస్తున్నారన్నాను ఆ అమ్మాయి మొఖంలో ఒకచిన్న వెలుగు నువ్వు టూరిస్టువా? అంది అవును అన్నాను బోలెడు ఆశతో అయితే భారతరాజదూత కార్యాలయం సిఫారసు చేస్తేకాని నీకు గది యివ్వడానికి వీలులేదంది అంతబాగా రాని భాషలో మాట్లాడ్డం పది రోజుల రైలు ప్రయాణంలో వచ్చిన విసుగు, గది ఇవ్వడానికి వాళ్ళుచేసే హంగామా అన్నీ కలసి నాకు నిజంగా కోపం తెప్పించాయి కాని అనువుకాని చోట అధికుల మనరాదనే హెచ్చరిక గుర్తు చేసుకుని ఆ అమ్మాయికి నచ్చచెప్పడానికి ప్రయత్నించాను సోవియట్ ప్రభుత్వం నన్ను తమ దేశం రావడానికి అనుమతి యిచ్చింది నేను బిల్లు ముందే కట్టడానికి సిద్ధంగా ఉన్నాను ఇక నాకు గది ఇవ్వడానికి మా ఎంబసీ నుంచి జాబు యొక్క అవసరం ఏవిటని

అడిగాను

అంతా విని మీ ఎంబసీ చెబితేగాని గది ఇవ్వడానికి రూల్సు అంగీకరించవని ఆఖరి మాటగా చెప్పింది 'రావుల్ తప్పిన గజేంద్రుడు' గుర్తుకు వచ్చాడు ఇక ఆ అమ్మాయితో వాదించే ఓపిక లేక తల్లీ మా ఎంబసీకి టెలిఫోను చేసి విష్ణు అహూజాని పిలవమన్నాను అప్పటికి పగలు 11 గంటలు అయినందున ఎంబసీ పనిచేస్తోంది విష్ణు అహూజా ఫోనులో మాట్లాడుతున్నాడు ప్రయాణంలో మార్పు తమకు ముందుగా ఎందుకు తెలియజేయలేదని ఆయన నామీద విరుచుకుపడ్డాడు ఎంబసీ ద్వారా ఏర్పాటు చేస్తే తప్ప ఈ దేశంలో హోటల్ గది ఇవ్వరన్నాడు బాబూ ఇదంతా ఇప్పుడే తెలుసుకున్నాను మిగిలిన వివరాలు మనం కలుసుకున్నప్పుడు మాట్లాడుకోవచ్చు, ముందు నాకు ఒక గది ఇవ్వమని వీళ్ళకు మంచి రష్యన్‌లో చెప్పమని కోరాను విష్ణు అహుజా అతడిభార్య అమీనా కూడా రష్యన్ అనర్గళంగా మాట్లాడతారు కృశ్చేవ్ బారతదేశం వచ్చినపుడు శ్రీమతి అహుజా రష్యన్ హిందీ దుబాసిగా వ్యవహరించింది అహుజా ఏమిచెప్పాడో తెలియదు కాని ఆ సర్వీస్ బ్యూరోలో ఉన్న అమ్మాయిలంతా నవ్వుల పువ్వులు కురిపించారు ఒక్కక్షణంలో గది ఏర్పాటు చేసారు నాకు మాత్రం హోటల్‌లో గది సంపాదించేసరికి యజ్ఞం చేసినంత పని అయింది గది ...న్నదే కాని బాత్‌రూంతో కలసి ఉన్నందున హాయిగా కనిపించింది ఏదో ...ంచ్ అయినదనిపించి విశ్రాంతి తీసుకున్నాను

సాయంకాలం సర్వీస్ బ్యూరోకి వచ్చాను మాట్లాడ్డానికి ఎవరూలేరు ఎంతో సరదాపడి మాస్కో వచ్చాను రష్యన్ భాష ఒకముక్క కూడా రాదు ఒక వారం పదిరోజులు మాస్కోలో గడిపి ఆ మహాపట్టణం చూచి పోలెండు వెళదామనుకున్నాను పది రోజుల మాట అటుంచి పది నిమిషాలు కూడా ఎలా గడపడమా అనే సమస్య సరే ఆ మరునాడు ఎంబసీకి వెళ్ళి విష్ణు అహూజాని కలుసుకుని ఆతరువాత కార్యక్రమం నిర్ణయిద్దామని సమాధానపడ్డాను మాస్కోలో రెడ్‌స్క్వేర్ గురించి చాలా గొప్పగా విన్నాను ...ాబట్టి ఆ సాయంకాలం సరదాగా అక్కడికి వెళ్ళి వద్దామనిపించింది ...దృష్టవశాత్తు బ్యూరోలో ఇంగ్లీషు వచ్చిన అమ్మాయి ఉంది ప్రపంచ ...ఖ్యాతి కెక్కిన మాస్కో మెట్రో (భూగర్భ రైలు మార్గం) లో వెళ్ళి రెడ్‌స్క్వేర్ ...ండాలని ఉందని ఆ అమ్మాయికి చెప్పి ఎలా వెళ్ళాలో చెప్పమన్నాను ఓస్ ...ిం కష్టంకాదు అని బైటకు వచ్చి అల్లంత దూరంలో ఒక బవనం చూపించి ...ి ప్రక్కనున్న సందులోకి వెళ్ళితే మెట్రోస్టేషన్ ఉంటుంది దాని లోపలికి ...ళ్ళ రైలులో రెడ్‌స్క్వేర్ చూచిరమ్మని చెప్పింది ఆమె చెప్పిన గుర్తులు

వివరాలు వింటే అదేం కష్టం కాదనిపించింది బాష రాకుండా ఒంటరిగా మాస్కో పట్టణంలో బయటకు అడుగు పెట్టాను ఆమె చెప్పిన చోటుకే వెళ్ళాను రైలు స్టేషను కనిపించింది విదేశీ మొహం కావడంవల్ల ఎవరూ అడ్డుపెట్టలేదు బుకింగ్ కిటికీలా ఉన్న చోటుకి వెళ్లి రెడ్ స్క్వేర్‌కి వెళ్ళాలని ఇంగ్లీషులో అన్నాను లోపలికి వెళ్ళమని సౌంజ్ఞ చేసాడు లోపలకు వెళితే అక్కడ అనేకమంది ప్రయాణీకులు సామాన్లతో బల్లలమీద కూర్చుని ఉన్నారు వారిలో చాలా మంది గ్రామీణ ప్రయాణీకుల్లా కనిపించారు నేను మెట్రోలో రెడ్‌స్క్వేర్‌కి వెళ్ళాలనుకుని మామూలు రైలుస్టేషన్ లోనికి ఎలా వచ్చానో అంతు చిక్కలేదు ఎవరినీ అడగడానికి లేదు ఏమీతోచక అర్థంకాక ఒక బల్లమీద కూర్చున్నాను చివరకు విసిగిపోయి తిరిగి హోటల్‌కి పోదామనుకున్నాను

అంతలో కళ్ళు మిరుమిట్లు కొలిపే అందమైన అమ్మాయి వచ్చి "నేను మీకు సహాయం చేయగలనా?" అని చక్కటి ఇంగ్లీషులో అడిగింది ఆమె దారి తప్పిన నాకు వెలుగు ప్రసాదించడానికి వచ్చిన దేవతామూర్తి అనిపించింది నా సాహస యాత్ర గురించి వివరించాను ఆమె చిరునవ్వు నవ్వుతూ మెట్రోస్టేషన్‌కి ప్రక్క గుమ్మంలోనుంచి వెళ్ళాలని చెబుతూ తనతో తీసుకువెళ్ళింది రైల్వేస్టేషన్ అధికారులు నాగురించి తనకు టెలిఫోన్ చేసారని చెప్పింది మెట్రోస్టేషన్‌లో ప్రవేశించాం అంతకుముందు లండను, పారిస్ భూగర్భ రైల్వేలలో ప్రయాణం చేసాను కాని మాస్కో భూగర్భ రైల్వే యొక్క ప్రత్యేకత దాని స్టేషన్లు అన్నీ చలువరాతి కట్టడాలు మామూలు విద్యుద్దీపాలు కాకుండా శాండిలియర్సు అమర్చారు మాస్కో వెళ్ళినవారికందరికీ మెట్రోస్టేషన్‌లు తప్పకుండా చూచి తీరవలసిన ఆకర్షణలు అక్కడ టిక్కెట్టులో కూడా ప్రత్యేకత ఉంది ఎంత దూరం వెళ్ళినా 50 కోపెక్స్ (50 పైసలు అప్పుడు) టిక్కెట్టు ఆమె నాకు ఒక టిక్కెట్టు తీసియిచ్చి వెళ్ళమంది రెడ్‌స్క్వేర్ స్టేషన్ అని నాకు ఎలా తెలుస్తుందని అడిగాను రైలు ఏడుసార్లు ఆగిన తరువాత ఎనిమిదవ స్టాప్‌లోదిగి బైటకు వస్తే రైడ్‌స్క్వేర్ అంది హోటల్‌కి తిరిగి రావడానికి కూడా ప్రయాణ వివరాలు అడిగి తెలుసుకున్న తరువాత ఆమెకు దన్యవాదాలు చెప్పి రైలు ఎక్కాను

మాస్కో మహాపట్టణంలో మెట్రోలో వెళ్ళి రెడ్‌స్క్వేర్ చూచి వచ్చాను చాలా ఆలస్యంగా వెళ్ళినందున ఆనాటికి నాసరదా మెట్రోలో ప్రయాణం చేయడంతో తీరిపోయింది సోవియట్ రష్యా చరిత్ర మాస్కోలోని ఆకర్షణలను గూర్చి చదువుతూ కూర్చున్నాను మాస్కో రావడానికి ముందు చదవడం, మిత్రులవద్ద వినడం వల్ల ఆ దేశం గురించి కొద్దో గొప్పో పరిజ్ఞానం ఉన్నదనే

చెప్పాలి నిజానికి సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్ కూటమి ప్రపంచంలో పెద్దది సోవియట్ యూనియన్ ఒక ఖండానికే కాకుండా రెండు ఖండాలలో వ్యాపించి ఉంది అది ప్రపంచ చరిత్రలో ప్రప్రథమ సోషలిస్టు దేశం భౌగోళికంగా 8,708 070 చదరపు మైళ్ల విస్తీర్ణం ఉన్న సోవియట్ రష్యాను మరే దేశంతోను పోల్చడంలో అర్థం ఉండదు భూగోళంలో 6వ వంతు విస్తీర్ణంలో యూరపు ఖండంలో సగం, ఆసియాలో మూడవ వంతు వరకు విస్తరించి ఉంది సోవియట్ రష్యా యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా కంటే మూడు రెట్లు పెద్ద దేశం భారతదేశం చైనా విస్తీర్ణం కలిసినా రష్యాకు తీసికట్టే బ్రిటన్ ఫ్రాన్సు, ఇటలీ, స్పెయిన్ దేశాలన్నీ కలిపినా మొత్తం విస్తీర్ణం కంటే 14 రెట్లు ఎక్కువ ఇలా లెక్కలతో పోలికలు చూసేకంటే సోవియట్ యూనియన్‌కి భౌగోళికంగా ప్రథమస్థానం అంటే సరిపోతుంది

ఇంత బ్రహ్మాండమైన దేశంలో 200,000,000 (20 కోట్లు) మంది ప్రజలు నివసిస్తారు వారు ప్రపంచ జనాభాలో ఐదవ వంతు ఈ జనాభాతో యూరోపు, అమెరికా ఖండాలలో ఏదేశం కూడా సాటిరాదు కాని ప్రపంచ జనాభాలో మాత్రం చైనా, భారత దేశం తరువాత సోవియట్ రష్యాది మూడవ స్థానం ఈ 20 కోట్ల జనాభాలో సోవియట్ ప్రభుత్వ లెక్కల ప్రకారం 11 కోట్ల 70 లక్షల మంది కార్మికులు మేధావి వర్గాలు కూడా కార్మికుల విభాగంలోనికి వస్తారు 8 కోట్ల 30 లక్షల మంది కర్షకులు సోవియట్ యూనియన్‌లో 2 కోట్ల 50 లక్షల మంది ముస్లిములు, 25 లక్షల మంది యూదులు ఉన్నట్టు అంచనా అందుమూలంగానే ఆ దేశం ప్రపంచంలో చాలా ముఖ్యమైన ముస్లిం దేశాలలో ప్రముఖమైనది యూదుల జనాభాకు సంబంధించినంత వరకు ఇజ్రాయిల్ తరువాత సోవియట్ రష్యాదే రెండవ స్థానం సోవియట్ యూనియన్‌లో రష్యను జాతీయులు 10 కోట్ల మంది ఉంటారు మిగిలిన జనాభాలో అనేక జాతులు ఉన్నాయి

సోవియట్ యూనియన్ 15 సోషలిస్టు రిపబ్లిక్స్ యొక్క కూటమి ఈ కూటమికి పునాదులు 1923లో వేయబడ్డాయి ప్రథమంగా ఈ కూటమిలో నాలుగు రిపబ్లిక్స్ ఉండేవి 1936లో రూపొందించిన క్రొత్త రాజ్యాంగం ప్రకారం పదకొండు రిపబ్లిక్స్ అయ్యాయి క్రమేపి అవి 16 అయ్యాయి అయితే 1940లో యూనియన్‌లో చేరిన కరేలో-ఫిన్నిష్ రిపబ్లిక్‌ను రష్యాతో కలిపివేసినందున ప్రస్తుతం 15 రిపబ్లిక్స్ ఉన్నాయి వీటిలో 9 యూరప్‌లోను 6 ఆసియాలోను ఉన్నాయి సోవియట్ యూనియన్‌లో సభ్యదేశాలుగా ఉన్న 15 రిపబ్లిక్స్ స్వచ్ఛందంగా కలిసి ఐక్య సంఘటిత శక్తిగా సామ్యవాద స్థాపనకు కృషి చేస్తాయని రాజ్యాంగంలో ఉంది 1936 రాజ్యాంగం ప్రకారం

ఈ రిపబ్లిక్స్‌కి తమ యిష్టం ఉన్నప్పుడు యూనియన్‌లో నుంచి బైటకు వెళ్ళే స్వాతంత్ర్యం ఉందని చెబుతారు అవన్నీ స్వతంత్ర రాష్ట్రాలు వాటికన్నింటికి సుప్రీం సోవియట్ ప్రత్యేక పతాకం మంత్రివర్గం పార్టీ వ్యవస్థ ఉంటాయి ఈ రాష్ట్రాలలోని ప్రముఖ నాయకులు స్థానిక పదవులలో ఉండడమే కాక సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్‌కి డెలిగేట్లుగా కూడా ఉంటారు అయితే ఒక రిపబ్లిక్‌నుంచి మరొక రిపబ్లిక్ సరిహద్దు దాటి వెళ్ళడానికి పాస్‌పోర్టులు, కస్టమ్స్ నిబంధనలు లేవు అంతే కాకుండా ప్రతి రిపబ్లిక్ పౌరుడు సోవియట్ యూనియన్ పౌరుడు కూడా యూనియన్ ప్రభుత్వం ప్రతి రిపబ్లిక్‌ను తమ భాష, సంస్కృతి, జానపద సంప్రదాయాలు పరిరక్షించుకుని, అభివృద్ధి చేసుకోవడానికి ప్రోత్సాహం యిస్తుంది

ఇక మాస్కో నగరం రష్యన్ రిపబ్లిక్‌కి యూనియన్‌కి కూడా ముఖ్యపట్టణం దీనికి ప్రపంచ మహా నగరాలలో ఐదవ స్థానం ఈ మహానగరం విస్తీర్ణం 125 చదరపు మైళ్ళు జనాభా సుమారు 50 లక్షలు మాస్కో చుట్టూ ఉన్న అసంఖ్యాకమైన పైన్, బిర్చ్ వృక్షాలతో నిండిన అడవులు హృదయాహ్లాదాన్ని కలిగిస్తాయి మాస్కోకి ప్రపంచంలో ఏ పట్టణానికి లేని ప్రత్యేకత ఉంది ఆ మహానగరం చూచినవారిని సమ్మోహపరచి జన్మలో దానిని మరచిపోకుండా చేస్తుంది ఆ మహాపట్టణంలో భాష రాకుండా ఒంటరిగా తిరగడంలో నాకు హాయి అనిపించలేదు దానికి తోడు పెకింగ్‌లో మన ఎంబసీలో పనిచేసే పరంజపాయ్ ఇంట్లో మకాం కాబట్టి ఎంబసీలోని భారతీయ మిత్రులతో చక్కగా కాలక్షేపం అయింది మాస్కోలో విష్ణు అహూజా నాకు పూర్తిగా క్రొత్త మొదట్లో "వీడు మనకెక్కడ దాపురించాడురా" అనుకుంటున్నట్టు ప్రవర్తించాడు అసలు మాస్కో రావడంలో తప్పు చేసామా అనిపించేటంత నిస్పృహ కలిగింది కాని భాష వచ్చినా రాకపోయినా, మిత్రులు ఉన్నా లేకపోయినా మాస్కో మహానగరం చూచి తీరాలనే దృఢ సంకల్పంతో రావడంవల్ల నిస్పృహ చెందడం భావ్యం కాదనిపించింది

మాస్కో గురించి చెప్పుకునే కథ ప్రకారం ఆ పట్టణాన్ని 1147లో ప్రిన్స్ డోల్గరూకి నిర్మించాడు అయితే 1713లో పీటర్ దిగ్రేట్ రష్యా రాజధానిని మాస్కో నుంచి పీటర్స్‌బర్గ్‌కి మార్చాడు మళ్ళా బోల్షివిక్ విప్లవానంతరం మార్చి 10, 1918న మాస్కో తిరిగి రాజధాని నగరం అయింది

మాస్కో వెళ్లిన పర్యాటకుడు రోజుల తరబడి చూచినా తరగని ఆకర్షణలు ఉన్నమాట వాస్తవం రెడ్‌స్క్వేర్ చూడ్డానికి మరొకసారి వెళ్ళాను చిత్రం ఏమిటంటే అది ఎరుపు కాదు చతురాకారంలోనూ లేదు ఈ పేరులో ఎరుపుకి

అర్థం అందమైనదని ఆ ప్రదేశానికి ఈ పేరు విప్లవానికి ముందే పెట్టారట రెడ్‌స్క్వేర్‌కి దక్షిణాన ప్రపంచంలో అత్యంత సుందరమైన సెయింట్ బాసిల్ ది బ్లెసెడ్ చర్చి ఉంది 1554-60లో నిర్మించబడిన ఈ చర్చిని పోక్రోవ్‌స్కి చర్చి అంటారు ఇవాన్ ది టెరిబుల్ కజాన్‌పై సాధించిన విజయ చిహ్నంగా దీనిని నిర్మించారని స్థల పురాణం అందరూ చెప్పుకునే కథ ప్రకారం ఈ చర్చి నిర్మాణం పూర్తి అయిన తరువాత అటు వంటి చర్చిని మరొక చోట నిర్మించడానికి వీలు లేకుండా ఇవాన్ చక్రవర్తి ఆ భవన నిర్మాత కళ్ళు తీయించివేసాడట ఈ కథనం కొందరు అంగీకరించరు

రెడ్‌స్క్వేర్‌కి పశ్చిమ భాగాన క్రెమ్లిన్ గోడకు ఆనుకుని లెనిన్-స్టాలిన్ (గోరీ) మసోలియం ఉంది ఈ మసోలియం సట్చొసేవ్ రూపొందించాడని చెప్పుకుంటారు మొదట ఈ కట్టడం కర్రతో నిర్మించారు కాని ఐదు సంవత్సరాల తరువాత దానిని నలుపు ఎరుపు గచ్చుకాయ రంగు రాళ్ళతో శాశ్వతంగా ఉండేటట్లు కట్టారు లెనిన్-స్టాలిన్ మృతదేహాలు ఏదో రసాయనిక పద్ధతిలో కుళ్ళిపోకుండా చేసి అక్కడ ఉంచారు ప్రతి దినం వేలాది మంది రష్యన్లు విదేశీయులు బారులు తీరి లోపలకు వెళ్ళి వారి నాయకులకు శ్రద్ధాంజలి ఘటిస్తారు

నేనూ అలాగే క్యూలో నిలబడ్డాను ఇద్దరు రష్యను సైనికులు ప్రవేశ ద్వారం వద్ద ఉన్నారు అద్దాల వెనుక లెనిన్, స్టాలిన్ మృతదేహాలు పూర్తి మిలిటరీ దుస్తులు మెడల్స్‌తో సహా మనకు కనుపిస్తాయి వారిని ఎత్తుగా ఉన్న స్లేట్‌గ్లాస్ ఫలకం మీద పడుకోబెట్టారు కాని తలవైపు ఎత్తు చేయడంవల్ల వారి పూర్తి స్వరూపం మనకు కనుపిస్తుంది దానికి తోడు ఆ జాగా అంతా వెలుగుతో నిండి ఉంది కొద్దిక్షణాలు వారిముందు నిలబడి ఆ మహానాయకులకు శ్రద్ధాంజలి ఘటించి బైటకు వచ్చాను అక్కడ క్రమశిక్షణ, వారి నాయకుల పట్ల రష్యన్లు చూపే గౌరవాభిమానాలు అపురూపం లెనిన్ దేహం ఆ మసోలియంలో 1924 నుంచి ఈనాటి వరకు అలాగే ఉంది స్టాలిన్ మార్చి 5, 1954లో మరణించగా ఆయన దేహాన్ని లెనిన్ ప్రక్కనే ఉంచారు కాని నేను చూచి వచ్చిన తరువాత రాజకీయ కారణాల మూలంగా స్టాలిన్ దేహాన్ని దానిలోనుంచి తీసివేసి క్రెమ్లిన్ గోడ ప్రక్క పాతిపెట్టారు స్టాలిన్ వ్యతిరేక ఉద్యమం గురించి మరొకసారి చెప్పుకుందాం

సందర్భం వచ్చింది కాబట్టి కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడు సోవియట్ యూనియన్ నిర్మాత అయిన లెనిన్ గురించి రెండు మాటలు చెప్పాలి ఆయన రష్యాలో అక్టోబరు విప్లవానికి నాయకత్వం వహించాడు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నెలకొల్పిన ఖ్యాతి ఆయనదే మార్క్స్ కమ్యూనిస్టు సైద్ధాంతిక

వేత్తగా ప్రఖ్యాతికెక్కాడు లెనిన్‌కి కూడా సిద్ధాంతవేత్తగా పేరు ఉన్నా ఆయన కార్యశూరుడు మార్క్స్ మాటలలో చెప్పిన సిద్ధాంతాన్ని లెనిన్ తన నాయకత్వ సౌలభ్యంతో కార్యదక్షతతో చేతలలో చూపించాడు స్థూలంగా చెప్పాలంటే మార్క్సిజం తత్వశాస్త్రం అయితే లెనినిజం రష్యాలో మార్క్సిజాన్ని ప్రభుత్వానికి ఆచరణయోగ్యం చేసిన మౌలిక సిద్ధాంతం

లెనిన్ 1870లో ఓల్గా నదీతీరాన ఉన్న చిన్న పట్టణం సింబిర్క్స్‌లో వ్లాడిమిర్ ఇల్యిచ్ ఉల్యనోవ్‌గా జన్మించాడు (సింబిర్క్స్ పేరు ఉల్యనోవ్క్స్‌గా మార్చారు) ఆయన విప్లవ నేతగా ఉన్న తొలి రోజుల్లో తన పేరు ఎన్ లెనిన్‌గా పెట్టుకున్నాడు ఆయన పేరులోని 'ఎన్'కి ఏమీ అర్థంలేదట సోవియట్ యూనియన్‌కి మార్క్స్ కంటే లెనిన్ ఆరాధ్యుడు అంటే ఆశ్చర్యపడనక్కరలేదు లెనిన్‌ని, స్టాలిన్‌ని వారు బ్రతికుండగా చూడలేకపోయినా వారి మృతదేహాలను చూడగలిగినందుకు చాలా ఆనందించాను అది అనిర్వచనీయమైన అనుభూతి

మాస్కో మహానగరంలో తప్పకుండా చూచి తీరవలసిన విశేషాలు కోకొల్లలు పారిశ్రామిక, సాంస్కృతిక రంగాలలో కమ్యూనిస్టులు సాధించిన విజయపరంపరలు ప్రత్యక్షంగా కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి కళలు క్రీడలు ఎంత చూచినా తనివితీరదు విప్లవానంతరం కమ్యూనిస్టులు అన్ని రంగాలలోను సాధించిన ప్రగతిని గర్వంగా చూపెట్టుకోవడానికి అనేక ప్రదర్శనలు, తమ దేశపు పూర్వపుటౌనత్యాన్ని గుర్తుచేస్తూ బ్రహ్మాండమైన మ్యూజియములు, ఆర్ట్ గ్యాలరీలు మనకు ఓపిక, తీరిక అన్నింటికంటే ముఖ్యంగా చూడాలనే ఉత్సుకత ఉండాలేకాని ఆ మహానగరంలో ఆకర్షణలు అసంఖ్యాకం కాని అవన్నీ ప్రత్యేకంగా కార్యక్రమం పెట్టుకుని చూడవలసినవి ఏవిధమైన ఏర్పాటు అవసరంలేని కాలక్షేపం గోర్కీవీధిలో నడవడం గోర్కీవీధి మాస్కో నగరంలో రాజవీధి అన్ని మహాపట్టణాలలాగే మాస్కో వీధులలో నడిచేటప్పుడు అప్రమత్తంగా ఉండాలి ట్రాఫిక్ లైట్లు ఎక్కడో ఆకాశంలో ఉంటాయి వాహనాల రాకపోకల సూచన పైకి చూడ్డం డ్రైవర్లకు, నడిచేవారికి కూడా యిబ్బందే!

మాస్కోలో షాపులు ప్రతి సోమవారం మూసివేస్తారు షాపుల మాట వస్తే మాస్కోలో రెడ్‌స్క్వేర్‌లో ఉన్న గుమ్ డిపార్టుమెంట్ స్టోర్సు చూచితీరాలి దానిలో అమ్మని వస్తువంటూ ఉండదు తల పిన్నులనుంచి ఫర్ కోట్ల వరకు అమ్మడానికి అనేక విభాగాలు ఉన్నాయి గుమ్‌స్టోర్సు ప్రపంచంలో చాలా పెద్దవైన స్టోర్సులో ఒకటి అయితే ధరలుమాట అడగకండి, ధరలు చుక్కలనంటుతుంటాయి కాని నిత్యావసర వస్తువుల

ధరలు అంత మండిపోవు పుస్తకాలు, గ్రామఫోను రికార్డులు చాలా చౌక దీనికి కారణం ప్రజలలో విద్య విజ్ఞానం సంస్కృతి అభివృద్ధి చేయాలనే కమ్యూనిస్టు నాయకత్వం ఆకాంక్ష

రష్యన్ స్త్రీలు, పురుషులు కూడా దృఢకాయులు రష్యను స్త్రీలలో మన కవులు వర్ణించిన స్త్రీ సౌందర్యం కన్ను పొడుచుకున్నా కనిపించదు సింహేంద్ర మధ్యమలు నాజూకైన అవయవ నిర్మాణం ఉన్న స్త్రీలు అరుదు అయితే వారంతా సంపూర్ణ ఆరోగ్యంతో స్థూల కాయాలతో లూజుగా ఉండే దుస్తులతో ఆకర్షణీయంగా ఉంటారనే చెప్పాలి నేను వియత్నాంలోను పెకింగ్‌లోను అతి నాజూకైన స్త్రీలను చూచిరావడంవల్ల రష్యను స్త్రీలు చాలా మోటుగా కనుపించారు

మాస్కో పౌరులు తమ పనులు పూర్తి అయిన తరువాత కాలక్షేపం చేయడానికి మాస్కోలో అనేక సదుపాయాలు, సంస్థలు ఉన్నాయి సోవియట్ యూనియన్‌లోని కళారంగంలో అన్ని విభాగాలలోను తమ బాలేకి రష్యన్లు ఉత్తమ స్థానం ఇచ్చి దానిగురించి వారెంతో గర్వపడతారు మాస్కోలోని సాంస్కృతిక కేంద్రాలలో శిఖర స్థానాన్నాక్రమించిన బోల్షోయ్ (గొప్ప) థియేటర్ ప్రపంచంలోని అనేక కళాకేంద్రాలలో అత్యంత సుందరమైనదని ప్రముఖుల అభిప్రాయం రష్యన్లు అంతగా అభిమానించి గర్వపడే బాలే అంటే మనకు తెలియదు భరత నాట్యం కథాకళి కూచిపూడి కథక్ మొదలైన నాట్య రూపాలకు అలవాటుపడ్డ భారతీయులకు బాలే నృత్యం క్రొత్త అప్పుడప్పుడు మన దేశంలో పర్యటించిన రష్యను సాంస్కృతిక బృందాలు ప్రదర్శించిన బాలే నృత్యభాగాలు చూచినవారికి మాత్రమే కొద్దిగా పరిచయం నేను లండనులో చదువుకొనే రోజుల్లోబాలే ప్రదర్శనలు చూడ్డానికి అలవాటుపడ్డాను ఆ ప్రదర్శనలు చూచి ఆనందించడానికి వాటిలోని అందాలు మెలుకువలు తెలుసుకోవడానికి ప్రయివేటు నాట్యాచార్యులు ప్రత్యేకంగా ఏర్పాటుచేసే బాలే ప్రదర్శనలు చూసాను ఆ ప్రదర్శనలో టేపుచేసిన సంగీతంతో మాష్టారు వివరాలు చెబుతూ నాట్యంచేసి వివరణలు యిచ్చేవారు ఆ తరువాత స్టేజిమీద ఆ ప్రదర్శనలు చూస్తే అత్యంత రమణీయంగాను ఆనందదాయకంగాను ఉండేవి ఆ రోజుల్లో ఇంగ్లాండులో మార్గెట్ ఫాంటెన్ ప్రముఖ బాలే నర్తకి, పాశ్చాత్య బాలే నృత్యంలో అఖండ కీర్తి నార్జించిన రష్యన్ బాలరీనా పవలోవా అప్పటికే దివంగతురాలైనా బాలరీనాల కందరికీ ఆమె నృత్యం ఒరవడి అప్పటికి రష్యన్ బాలే రంగంలో కీర్తిశిఖరాలు అందుకున్న ఉలనోవా యింకా ప్రదర్శనలు యిస్తోంది ఫాంటెన్, ఉలనోవాలలో ఎవరు గొప్ప అనే చర్చలు జోరుగా సాగేవి నేను ఉలనోవా

నృత్యం చూడలేకపోయాను సోవియట్ రష్యా వెళ్ళినప్పుడు ఉలనోవా బాలే ప్రదర్శన చూడాలని సంకల్పించాను కాని నేను మాస్కో చేరడానికి రెండు మాసాలముందే ఆమె రంగంలోనుంచి నిష్క్రమించినదని విని చాలా నిరుత్సాహపడ్డాను అయితే 32 సోవియట్ పట్టణాలలో బాలే ట్రూపులు ఉన్నందున ఒక కళాకారిణి రంగంనుంచి నిష్క్రమిస్తే అనేకమంది నూతన తారలు ఆవిర్భవిస్తారు అటువంటితార మాయా ప్లెసిస్కాయ, ఆమె నాట్యం చేసే స్లీపింగ్ బ్యూటీ బాలె చూడ్డానికి వెళ్ళాను

ప్రపంచంలోని బాలె ట్రూపులన్నీ ముఖ్యంగా స్వాన్‌లేక్, జిజిల్, స్లీ పింగ్ బ్యూటీ మొదలైన బాలే ప్రదర్శనలు యిస్తాయి అవికాక ఆయా దేశాలకు ప్రత్యేకమైన కదావస్తువుతో బాలేలు తయారుచేసి ప్రదర్శనలు యివ్వడం పరిపాటి ఆ రాత్రి నేను చూడ్డానికి వెళ్ళిన ప్రదర్శన చాలా పాతది అది నేను చాలాసార్లు చూసాను కాని ప్రతి ప్రదర్శన దానిలో పాల్గొనేవారి శక్తి సామర్థ్యాలను బట్టి క్రొత్త అందాలు చూడవచ్చును ప్రదర్శన ప్రారంభించడానికి కొంచెం ముందుగానే హాలులోకి వెళ్ళాను నేను కూర్చున్న వరుసలోనే మరొక భారతీయుడు కూడా ఉన్నాడు ఆయన ప్రభుత్వ అతిథి అయినందున ఆయనతో ఇన్ టూరిస్టు సంస్థకు చెందిన గైడ్ కూడా ఉంది ఆయన పేరు గుర్తులేదు కాని ఖద్దరు టోపీ, అచకన్ ధరించాడు వయసు మళ్ళినవాడు గుజరాత్ రాష్ట్రానికి చెందిన వాడని గుర్తు నేను ఒంటరిగా వెళ్ళాను మా వెనుక వరుసలో నలుగురు బల్గేరియన్లు కూర్చున్నారు వారు రష్యన్ గైడ్‌తో మాట్లాడుతూ గాంధీ టోపీతో ఉన్న పెద్దమనిషి ఏ దేశం వాడని అడిగారు ఆ అమ్మాయి ఆయన ఇండియానుంచి వచ్చాడని చెప్పింది వాళ్ళకు అర్థం కాలేదంటే ఆశ్చర్యపడకండి ఆ బల్గేరియన్లు ఇండియా అనే మాట ఎప్పుడూ విన్నట్టులేదు ఆ అమ్మాయిని వివరంగా చెప్పమన్నారు మళ్ళా ఇండియా ఇండియా అని చెప్పింది వాళ్ళకు తెలియలేదు చివరకు ఏమి చెప్పాలో ఎలా చెప్పాలో తెలియక నెహ్రూ దేశం అంది ఆ బల్గేరియన్లకు పూర్తిగా అర్థం అయిపోయింది ఓహో నెహ్రూదేశం నుంచి వచ్చిన అతిథా! అని ఆనందం వ్యక్తం చేసారు అయితే వారి ఉత్సుకత అంతటితో ఆగలేదు వారికి ముందు కూర్చున్న నన్ను చూపించి ఆయన ఏ దేశస్థుడని ఆ అమ్మాయిని ప్రశ్నించారు నేను సూటులో ఉన్నాను ఆగైడ్ కూడా నన్ను అప్పుడే చూచింది ఆమెను అవస్థపెట్టడం ఎందుకని ఆమెతో నేను కూడా నెహ్రూ దేశంనుంచే వచ్చానని వారికి చెప్పమన్నాను దానితో కరచాలనాలు కుశల ప్రశ్నలు

సోవియట్ యూనియన్‌లో స్త్రీలు చేయలేని పనిలేదు వారంతా

పురుషులతో సమానంగా పనిచేస్తారు పసివాళ్ళు వృద్ధులు తప్ప మిగిలిన రష్యను మహిళ లంతా ఏదో ఒక వృత్తి చేస్తారు సోవియట్ యూనియన్‌లోని అన్ని ఉద్యోగాలలో45 శాతం స్త్రీలు ఉన్నారు పారిశ్రామిక కార్మికులలో 40 శాతం నిర్మాణ కార్మికులలో 30 శాతం స్త్రీలే అయితే మహిళలు సోవియట్ ఆర్మీలో పనిచేయరు 2 లక్షల పైగా మహిళా ఇంజనీర్లు 4 లక్షలకు మించి సాంకేతిక నిపుణులు ఉన్నారు విజ్ఞాన శాస్త్రంలోను, కళలలోను లెనిన్ స్టాలిన్ బహుమతులు అందుకున్న స్త్రీలు 740 మంది ఉన్నారు బార్యాభర్తలు యిద్దరూ కష్టపడి పనిచేయడం మూలంగా వారికి జీవనబారం తేలికగా ఉంటుంది రష్యన్లు ఇంటిఅద్దె పన్నులు మొదలైన వాటికి చాలా తక్కువ ఖర్చుపెడతారు సోవియట్ యూనియన్‌లో అదాయం పన్ను 13 శాతానికి మించి ఉండదు చాలామంది 5 శాతమే కడతారు ఇంటిఅద్దె వారి నివేశనస్థల పరిమితినిబట్టి నిర్ణయిస్తారు అది సాదారణంగా వారి సంపాదనలో 4 శాతం మాత్రమే ఉంటుంది జీవితావసరాలు మిగిలిన వాటితో పోల్చిచూస్తే కారుచౌక వైద్యసౌకర్యాలు, దంతవైద్యం ప్రబుత్వం ఉచితంగా యిస్తుంది వారు సెలవులలో చేసే వినోదపర్యటనకు కూడా చాలాతక్కువ ఖర్చు అవుతుంది ఉద్యోగ విరమణ చేసేవరకూ ప్రతి పౌరునికి ఉద్యోగ హామీ ఉంది వృద్దాప్యంలో కూడా వారి బాధ్యత ప్రభుత్వానిదే ఇదంతా కాలదన్నట్టు వారి పిల్లలకందరికీ ఉచిత విద్యా సౌకర్యం ఉంది సోవియట్ యూనియన్ మార్క్స్ ఏంజల్స్ నిర్వచించిన కమ్యూనిజాన్ని సాధించినా సాధించకపోయినా ప్రజలకు సంబందించినంత వరకు అది శ్రేయోరాజ్యమే ఈ పరిస్థితులలో ఆ దేశ ప్రజలు ఆరోగ్యంగా, ఆనందంగా ఉన్నారంటే అబ్బురపడనక్కరలేదు

అయితే హోటళ్ళలో మకాంచేసి రెస్టారెంట్లలో భోజనం చేసేవారికి, అందునా ముఖ్యంగా విదేశీ పర్యాటకులకు మాత్రం మాస్కో చాలా ఖరీదైన పట్టణం అనే చెప్పాలి అప్పటిలో ఒక రూపాయికి ఒక రూబులు విదేశీ మారక విలువ ఉండేది, (ఇప్పుడు 1 రూబులుకు 8 రూపాయలు)

రోజుకు వంద రూబుల్సు ఖర్చుపెట్టి పదిరోజులు మాస్కోలో ఉండి వెళ్ళిపోదామనే సంకల్పంతో వెళ్ళాను కాని మొదటి నాలుగురోజుల అనుభవంతో రోజుకు వంద రూబుల్సు ఏమూలకు రావడం లేదని గ్రహించాను బాష తెలియకుండా మిత్రులు లేకుండా బోలెడు ఖర్చుపెట్టి ఆ మహానగరంలో ఉండడంలో అర్థం లేదనిపించింది ఆపరిస్థితిలో మిత్రుడు విల్‌ఫ్రెడ్ నగరంలో ఉన్నాడేమో తెలుసుకుందామని టెలిఫోను చేసాను నా అదృష్టం బాగుండి అతడు అక్రితం రోజునే సోఫియా (బల్గేరియారాజధాని)

నుంచి తిరిగివచ్చాడట నేను పెకింగ్ నుంచి అతడికి వ్రాసిన జాబు అందినది కాని అనుకున్నరైలులో నేను రాలేక పోయినందున నేను మాస్కో ఎప్పుడు వచ్చినది తెలియలేదన్నాడు అంతేకాకుండా పనిమీద సోఫియా వెళ్ళాడట నా అవస్థ అతడికి ఫోనుమీదే చెప్పాను అసలు మాస్కోలో హోటలులో దిగమని ఎవరు చెప్పారని చివాట్లు పెట్టాడు మార్గాంతరంలేక హోటల్‌లో దిగవలసి వచ్చినదని గ్రహించిన మిత్రుడు వెంటనే హోటల్ గది ఖాళీచేసి తన ఇంటికి రమ్మని ఆహ్వానించాడు మిత్రుడు విల్‌ఫ్రెండ్ బుర్చెట్ గురించి యిక్కడ రెండు ముక్కలు చెప్పాలి ఆయన జన్మతహా ఆస్ట్రేలియన్ వృత్తిరీత్యా పాత్రికేయుడు రాజకీయంగా కమ్యూనిస్టు అతని రాజకీయాలు నచ్చని ఆస్ట్రేలియన్ ప్రభుత్వము అతడిని ఆస్ట్రేలియా నుంచి బహిష్కరించింది విల్‌ఫ్రెడ్ బుర్చెట్ బల్గేరియా దేశానికి ముఖ్యపట్టణమైన సోఫియా నగరానికి చెందిన వేరా అనే ఆమెను వివాహం చేసుకున్నాడు (ఇటీవల బుర్చెట్ మరణవార్తవిని చాలా విచారించాను) నేను వియత్నాంలో అంతర్జాతీయ కమిషన్‌లో ఉన్నరోజుల్లో బుర్చెట్ హెనోయ్‌లో ఉండేవాడు ఆయన చాలా గ్రంథాలు వ్రాసాడు మంచి పాత్రికేయుడు అన్నిటికి మించి సహృదయుడు మంచి మిత్రుడు బుర్చెట్ మాస్కోలోనే స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు అతడి భార్య వేరా సోఫియాలో ఉంది కాబట్టి తనింట్లో ఒకగది ఖాళీగా ఉన్నందున నన్ను తన ఇంట్లో ఉండమని ఆహ్వానించాడు పెట్టె సర్ది సిద్ధంగా ఉంటే తానువచ్చి తీసుకువెళతానన్నాడు నాకు బ్రహ్మానందమైంది ఏదో పెన్నిధి దొరికినంతగా సంతోషించాను వెంటనే బ్రేక్‌ఫాస్ట్ ముగించి సూటుకేస్ సర్ది విల్‌ఫ్రెండ్ రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను

అంతలో హోటల్ రిసెప్షన్ నుంచి టెలిఫోను నాకోసం ఎవరో వచ్చారు కాబట్టి క్రిందకు రావలసినదిగా పిలుపు మిత్రుడు బుర్చెట్ వచ్చాడనుకుని తొందరగా క్రిందకు వెళ్ళాను ఆశ్చర్యం వచ్చినది బుర్చెట్ కాదు మాస్కోలోని ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ నుంచి వచ్చిన బృందం వారంతా ఆడ మగ కలసి 16 మందిదాకా ఉన్నారు వారు నిజంగా నాకోసం వచ్చారంటే నమ్మలేకపోయాను వారెవరో నాకు తెలియదు నన్ను వారు ఎరిగుండడానికి ఏమాత్రం అవకాశం లేదు దీనిలో ఏదో పొరపాటు ఉందనిపించింది కాని ఆ బృందంలోని నాయకుడు వారి రాకలో ఏమీపొరపాటు లేదని, వారు నాకోసమే వచ్చారని నన్ను నమ్మించాడు నేను మాస్కో ఏరోజున వస్తున్నానో వారికి తెలియనందున నన్ను రైలువద్ద కలుసుకోలేకపోయినందుకు విచారం వ్యక్తం చేసారు నేను సోవియట్ యూనియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ సంస్థ అతిదిని అన్నారు నేను ఏ భాష

మాట్లాడతానో తెలియనందున భారత రాజ్యాంగంలో పేర్కొన్న 14 భారతీయ భాషలు మాట్లాడగలిగిన వారిని వెంటబెట్టుకు వచ్చారు నేను ఆంధ్రుడనని తెలుసుకుని వారంతా సంతోషం వ్యక్తం చేసారు వారిలో తెలుగు మాట్లాడ గలిగిన ఒక రష్యన్ మహిళకూడా ఉంది వారు ఇంగ్లీషులోనే చెప్పినా వారుచెప్పేది నాకు ఏమీ అర్థం కావడంలేదు అంతా అగమ్యగోచరంగా ఉంది ఆశ్చర్యంగా ఉంది మాస్కోలోను, సోవియట్ యూనియన్‌లోను ఏమి చూడాలనుకుంటున్నానో, నాకార్యక్రమం ఏమిటో చెప్పమంటున్నారు

అంతలో నన్ను హోటల్‌నుంచి తన ఇంటికి తీసుకువెళ్ళడానికి బుర్చెట్ వచ్చాడు అతణ్ణి ప్రక్కకు తీసుకువెళ్ళి నాతోమాట్లాడేవారు ఎవరో ఏమంటున్నారో చెప్పాను బుర్చెట్ తన చెవులను తానేనమ్మలేకపోయాడు నువ్వువాళ్ళ అతిధివని అన్నారా అని రెట్టించాడు అన్నారన్నాను ఐతే నువ్వు హోటల్ వదలవలసిన పనిలేదన్నాడు వాళ్లు సాయంకాలం 4 గంటలకు వస్తే భవిష్యత్ కార్యక్రమం నిర్ణయించుకోవచ్చునని చెప్పమన్నాడు వారితో అలాగే చెప్పాను సాయంకాలం వస్తామని చెప్పి వారు వెళ్ళిపోయారు నేను, విల్‌ఫ్రెడ్ ఆశ్చర్యంలోనుంచి తేరుకోవడానికి కొంచెం వ్యవధి కావలసివచ్చింది బుర్చెట్ కారులో మాస్కో అగ్రికల్చరల్ ఎగ్జిబిషన్‌కి బయలుదేరాం దారిలో అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారి అతిధి అంటే ఏమిటో బుర్చెట్ చెప్పాడు కమ్యూనిస్టు పార్టీ ప్రెసిడియం మంత్రివర్గం తరువాత అత్యంత పలుకుబడి గల సంస్థ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ఈసంస్థ 1726లో స్థాపించబడి 1920లో పునర్వ్యవస్థీకరించబడినది దీనికి స్వయం ప్రతిపత్తి కల్పించి మంత్రివర్గానికి అనుబంధంగా చేసారు ఈ సంస్థ దేశంలోని 2 లక్షల 50 వేల విజ్ఞాన వేత్తల పనిని నిర్ధారించడం, ప్రోత్సహించడం చేస్తుంది ఈ సంస్థలో 200 మంది పూర్తి సభ్యులు ౮౦౦ మంది కాండిడేట్ సభ్యులు ఉన్నారు అకడమీషియన్ కావడం ఆదేశంలో అత్యంత ప్రముఖస్థానాన్ని ఆక్రమించడమే ఈ సంస్థ ప్రతిసంవత్సరం 28000 పత్రాలు ప్రచురిస్తుంది నేను మాస్కో వెళ్ళిన రోజుల్లో అకాడమీ అధ్యక్షుడు ప్రొఫెసర్ అలెగ్జాండర్ నెస్మియానోఫ్ రాజకీయ పరపతిలో సోవియట్ ముఖ్యమంత్రి తరువాత స్థానం ఆయనదే నన్ను ఆ సంస్థ తమ అతిధిగా స్వీకరించడం చాలా గొప్పవిషయం అన్నాడు మిత్రుడు విల్‌ఫ్రెడ్

మిత్రుడు విల్‌ఫ్రెడ్ బుర్చెట్‌తో కలిసి మాస్కో నగరానికి దగ్గరలో ఉన్న వ్యవసాయ ప్రదర్శన చూడ్డానికి వెళ్ళాను ఈ ప్రదర్శన 500 ఎకరాల విస్తీర్ణంలో ఏ[illegible]ంది మామూలు ఎగ్జిబిషన్లలా దీనిని తీసివేయడం ఉండదు అది శాశ్వతంగా ఉండేటట్టు కట్టడాలు నిర్మించారు సోవియట్

యూనియన్‌లోని అన్ని రాష్ట్రాలు తమ పంటలు, పరిశ్రమలు, పశుసంపద, అనేక రంగాలలో తాము సాధించిన ప్రగతి సగర్వంగా ఈ ప్రదర్శనలో ప్రదర్శిస్తారు ఎగ్జిబిషన్ ఒక ప్రపంచ ప్రదర్శనలా ఉంటుంది అదే దృష్టిలోచూస్తే ఈ వ్యవసాయ ప్రదర్శన చిన్నసైజు సోవియట్ యూనియన్‌లా కనిపించింది దీనిలో 57 పెవిలియన్లతో పాటు 300 శాశ్వత కట్టడాలు ఉన్నాయి దీనిని వ్యవసాయ ప్రదర్శన అనిపిలిచినా అక్కడ రష్యన్ల పారిశ్రామిక ప్రగతిని కూడా చూడవచ్చును నేను చూచినప్పుడు 20హాలుల్లోను సుమారు 1400 పైగా వివిధ యంత్రాలు ప్రదర్శించబడ్డాయి ఇవి కాక వ్యవసాయానికి సంబంధించినంత వరకు ఈ ప్రదర్శనలో ప్రత్యేకత అక్కడ వారు నిదర్శనాత్మకంగా పండించే పంటలు ఈ ప్రదర్శనలోని 62 ఎకరాల భూమిని మోడల్ పంటలు, పళ్ళతోటలు, కూరగాయలు పండించడానికి ప్రత్యేకించారు ఇవన్నీ దేశం అంతటి నుంచి వచ్చే లక్షలాది రైతులకు మార్గదర్శకంగా ఉండేటట్టు ఏర్పాటు చేసారు

దేశంలోని ప్రతిజిల్లా, ప్రతి కలక్టివ్ ఫారం స్టేట్‌ఫారం, తమ ప్రతినిధులను ఈ ప్రదర్శనకు పంపుతారు అక్కడ 200 అత్యుత్తమ రకాలపంటలకు చెందిన విత్తనాలు ప్రయోగాత్మకంగా పెంచుతారు దానిలో 800 రకాల పళ్ళు, 2500 రకాల చెట్లు చేమలు పెంచి చూపెడతారు అంతేకాదు ఈ ప్రదర్శన చూడ్డానికి వెళ్ళిన వారికి నిపుణులచేత ఉపన్యాసాలు చెప్పిస్తారు సామాన్యుల మాట ఎలా వున్నా రైతులు, పండ్లు, కూరలు పండించేవారికి ఈ ప్రదర్శన అధునాతన వ్యవసాయక పాఠశాలగా పనిచేస్తుందనడం అతిశయోక్తికాదు ఈ ప్రదర్శనలో ఒకచోటు నుంచి మరొకచోటుకి వెళ్ళాలంటే బస్సులలో ప్రయాణం చేయాలంటే దాని విస్తీర్ణం ఊహించుకోవచ్చును

సోవియట్ యూనియన్‌లోని అన్ని రాష్ట్రాలనుంచి, సోషలిస్టు మిత్రదేశాలనుంచి, ప్రపంచంలోని అనేక దేశాలనుంచి రైతుప్రతినిధి వర్గాలకు ఈ ప్రదర్శన మక్కా అంటే నమ్మండి ఇక టూరిస్టులకు కూడా మాస్కోలో తప్పకుండా చూడవలసిన ఆకర్షణలలో ఇది ముఖ్యం

నేను, బుర్చెట్ ఆరోజంతా ఆ ఎగ్జిబిషన్‌లో గడిపాం అయితే దానిని చూడటానికి ఒక రోజు చాలదని అక్కడకు వెళ్ళగానే అర్థమైపోయింది అప్పటికి యింకా నాకు క్రొత్త కాబట్టి వివిధ రాష్ట్రాల పెవిలియన్లలో వారి జాతీయ దుస్తులలో వారిప్రత్యేక సస్యసంపదను ప్రదర్శిస్తున్నవారిని ఆసక్తిగా చూసాను కొన్ని రాష్ట్రాలలో కొన్ని వందల రకాల ద్రాక్ష పండిస్తారు దానితో అనేక రకాల వైన్సు తయారు చేస్తారు అవి రుచిలోను నాణ్యతలోను ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన ఫ్రెంచి, ఇటాలియన్ వైన్సుతో పోటీపడతాయి సోవియట్

యూనియన్‌లో అన్నిరకాల వైన్సుతోపాటు విస్కీ బ్రాంది జిన్ రమ్ము మొదలైన అనేక మద్యపానీయాలు తయారు చేస్తారు కాని స్కాచ్ విస్కీ రుచి చూచిన వారికి మరి ఏదేశంలో తయారైన విస్కీకూడా అంతగా రుచించదు కాని రష్యా ప్రత్యేకత వారివోడ్కా బంగారం దగ్గర నుంచి పచ్చిమిరపకాయల వరకు వోడ్కా తయారు చేయడానికి ఏపదార్థం కూడా అనర్హం కాదట అయితే వోడ్కా యిచ్చే నిషా అప్రతిమానం కాని అప్పటి సోవియట్ ప్రధాని కృశ్చేవ్‌కు వోడ్కా గొప్ప సమస్యను తెచ్చిపెట్టింది ఆదేశంలోని యువకులు వోడ్కా రుచిమరిగి అతిగా దానిని సేవించడంతో కొంత క్రమశిక్షణా రాహిత్యం పనులలోకి వెళ్ళకపోవడం, సంఘవ్యతిరేక ప్రవర్తన పెచ్చు పెరగడంతో ప్రభుత్వానికి తలనొప్పి వ్యవహారంగా తయారయింది

రష్యన్లను వోడ్కా అలవాటు నుంచి తప్పించడానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలలో బాగంగా షాంపేన్‌ను చిల్లరగా అమ్మడాన్ని ప్రోత్సహించారు దాని పుణ్యమా అంటూ 1956లో సోవియట్ యూనియన్ 2కోట్ల 70లక్షల సీసాల షాంపేన్‌ను తయారు చేసింది ఇక్కడ షాంపేన్ గురించి ఒక ముక్క చెప్పాలి ఫ్రాన్స్ దేశంలో షాంషేన్ అనే జిల్లాలో తయారుచేసే వైన్‌ని అదే పేరుతో పిలిచేవారు ఈ నాటికి ఏదేశం ఆరకం వైన్ తయారుచేసినా షాంషేన్ అనే పిలుస్తారు ప్రపంచవ్యాప్తంగా షాంషేన్‌కి ప్రత్యేక స్థానం ఉంది శుభ కార్యాలకు విజయాలను పురస్కరించుకొని జరుపుకునే ఆనంద సన్నివేశాలలోను ఉత్సవాలలోను ఒకటేమిటి సంతోషంగా, ఆనందంగా ఉండే అన్ని వేళలలోను షాంషేన్‌దే పైచెయ్యి దానిని త్రాగడానికి ప్రత్యేకమైన గ్లాసులు, త్రాగేపద్ధతి వేరు ఇక దానిని ఐస్ తొట్టెలో చల్లబర్చాలి దాని మూత తీయడం ఒక ఆర్టు

ఒక ప్రత్యేకమైన పరిస్థితిలో ఒకవిలక్షణమైన పద్ధతిలో పుచ్చుకునే డ్రింక్ షాంపేన్, అటువంటిదాన్ని మామూలుగా డిపార్టుమెంటల్ స్టోర్సులోను బార్‌లలోను అమ్మించాడు కృశ్చేవ్ మనం రోడ్డు మీద వెళుతూ రోడ్డు ప్రక్క షాపులో టీ త్రాగినట్టు, సోడాత్రాగినట్టు షాంపేన్‌ని త్రాగవచ్చు మాస్కోలో దానికి సంఘంలో ఉన్న మర్యాదను మంటకలుపుతున్నాడని ప్రధానిని విమర్శించారు కొందరు కాని వారి జాతీయ అవసరాలకు ఆచర్య తీసుకోవడాన్ని కొందరు సమర్థించారు విమర్శించినా, సమర్థించినా లక్షలాది షాంపేన్ సీసాలు ఖాళీ అయ్యాయి

మాట వచ్చింది కాబట్టి సోవియట్ ప్రధాని కృశ్చేవ్‌కి ఉన్న ఒక విచిత్రమైన అలవాటు గురించి చెప్పాలి ఆయన ఏపార్టీకి వెళ్ళినా అనేక వైన్ గ్లాసులు పగలగొట్టేవాడని ప్రతీతి ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా ఆయన

అలా గ్లాసులు ఎందుకు బద్దలు కొడతాడో అర్థంకాలేదు ఆ చిదంబర రహస్యం మాస్కో వెళితే కాని తెలియలేదు ఇతర ప్రధాన మంత్రులుకాని, రాజ్యాదినేతలు కాని పార్టీ యిచ్చినప్పుడు ఒకరు మరొకరి దేశం యొక్క సౌభాగ్యానికి, అచంచల స్నేహసంబంధాలను వ్యక్తపరుస్తూ షాంపేన్ త్రాగుతారు అలా త్రాగిన తరువాత గ్లాసు తలక్రిందులు చేసి చూపెట్టడం ఆచారం అలా బోర్లించినప్పుడు ఒక్కచుక్క కూడా దానిలో నుంచి కింద పడకూడదు అదే ఆ స్నేహసంబంధాల పటిష్టతకు నిదర్శనం కాని గ్లాసు తలక్రిందులుచేస్తే చుక్కలు రాలకుండా ఉండవు అటువంటి పరిస్థితి రానీయకుండా ప్రధాని కృశ్చేవ్ త్రాగిన గ్లాసు వంచినట్టు చూపించి వెనక్కు విసిరేసేవాడు గ్లాసు పగిలిపోయినా దేశాలమధ్య స్నేహం అవిచ్ఛిన్నంగా ఉంటుందని ఆయన నమ్మకం కాబోలు

నేను, మిత్రుడు విల్‌ఫ్రెడ్ వ్యవసాయ ప్రదర్శన చాలా వరకు చూచి అలసిపోయి ఒక వోడ్కా షాపుకి వెళ్ళాం ఎన్నిరకాల వోడ్కాలో! వాటిలో కొన్నిటిని రుచిచూసాం అంతలో పచ్చిమిరపకాయ బొమ్మతో ఉన్న ఒక సీసా నాదృష్టిని ఆకర్షించింది అదేవిటో కనుక్కోమన్నాను విల్‌ఫ్రెడ్ అడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతూ అక్కడి అమ్మాయి అది ఛిల్లీ వోడ్కా అంటూ "పచ్చి మిరపకాయల వోడ్కా చాలా అపాయకరం" అని బయపెట్టింది అయితే పచ్చిమిరపకాయలతో తయారుచేసిన వోడ్కా ఎలా ఉంటుందో రుచిచూడాలనే ఉత్సుకతతో "ఈ కామ్రేడ్ పచ్చి మిరపకాయలు తినే దేశంనుంచి వచ్చాడని" చెప్పమన్నాను దానితో ఆమె ఏవిధమైన అభ్యంతరం చెప్పకుండా పచ్చిమిరపకాయల వోడ్కా అందించింది అప్పుడు సోవియట్ ప్రధాని ప్రజలను వోడ్కా త్రాగే అలవాటునుంచి తప్పించడానికి ఎందుకు ప్రయత్నిస్తున్నాడో అర్థమయింది మేం హోటల్‌కి చేరేసరికి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓరియంటాలజిస్టుల సంస్థ ప్రతినిధి శ్రీ ఎరిక్‌కామరాఫ్ నాకోసం ఎదురుచూస్తూ ఉన్నాడు

ప్రొఫెసర్ గఫూరాఫ్ మాస్కోలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓరియంటల్ స్టడీస్ సంస్థ డైరెక్టరు అకాడమీ ఆఫ్ సైన్సెస్ సంస్థ నన్ను తమ అతిదిగా స్వీకరించి తమ ఆతిథ్యం ఓరియంటల్ స్టడీస్ సంస్థ ద్వారా అందించడానికి నిర్ణయించారు ఎరిక్ కామరాఫ్ నన్ను వెంటబెట్టుకుని ప్రొఫెసర్ గఫూరాఫ్ వద్దకు తీసుకువెళ్లాడు గఫూరాఫ్ ఉజ్బెకిస్తాన్‌కి చెందినవాడు తన తెలివి తేటలు, విజ్ఞానం శక్తిసామర్థ్యాలతో చాలా ఉత్తమస్థానాన్ని ఆక్రమించగలిగాడు నేను భారతీయుణ్ణి కాబట్టి సోవియట్ యూనియన్‌లోని ఆసియన్ రిపబ్లిక్స్, వారి ప్రగతి, జీవన విధానం చూడ్డం మంచిదని ఆయన సలహా ఇచ్చారు

వాటిలో ఉజ్బెకిస్తాన్ తజకిస్తాన్, అజర్బయిజాన్ చూచిరావడానికి ఏర్పాట్లు చేస్తానన్నాడు మాస్కోలో చూడవలసిన ఆకర్షణలు చాలా ఉన్నప్పటికి ముందు లెనిన్‌గ్రాడ్ చూచివచ్చి మిగిలిన కార్యక్రమం ప్రారంభించమని ఆయన సలహా ప్రొఫెసర్ గఫూరాఫ్ చాలా మృదుభాషి చాలా భారీ ఎత్తుమనిషి అనేక బాషలతోపాటు ఆయన ఇంగ్లీషు కూడా అనర్గళంగా మాట్లాడేవాడు (ఆయన ఇటీవలనే మరణించాడని పత్రికలలో చదివి చాలా విచారించాను)

ఇక ఆనాటి నుంచి నాకు గైడు, మిత్రుడు సహచరుడు అయిన ఎరిక్ కామరాఫ్ యువకుడు ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌లో చరిత్ర విభాగంలో ఉద్యోగి, ఆయనకు రష్యను భాషతోపాటు ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ భాషలు వచ్చును నన్ను తమ అతిధిగా స్వీకరించడానికి ముందు అకాడమీ ఆఫ్ సైన్సెస్ సంస్థ ఒకే ఒక్క భారతీయుణ్ణి తమఅతిధిగా స్వీకరించింది ఆయన ప్రొఫెసర్ మహల్నబీస్ కామరాఫ్ ప్రొఫెసర్ మహల్నబీస్‌కి కూడా గైడ్‌గా వ్యవహరించిన అనుభవజ్ఞుడు అతడు కొన్ని సంవత్సరాల తరువాత ఢిల్లీలోని సోవియట్ ఎంబసీలో సాంస్కృతిక వ్యవహారాల అధికారిగా కూడా పనిచేసాడు అప్పుడు మాస్కోలో భారత రాయబారి శ్రీ కె పి యస్ మీనన్ కూడా నాకు అకాడమీ ఆఫ్ సైన్సెస్ అతిథ్యం యిచ్చిందని విని ఆశ్చర్యపోయాడు సోవియట్ ప్రభుత్వం, కమ్యూనిస్టు పార్టీ ఎంతమందికైనా అతిథ్యం యిస్తుంది కాని అకాడమీ ఆఫ్ సైన్సెస్ ద్వారా ఎవరికీ అతిథ్యం యిప్పించలేక పోయానన్నారు వారి అతిధుల్లో నేను రెండవ భారతీయుణ్ణి ావడం అదికూడ మన ఎంబసీ ప్రమేయం లేకుండా జరగడం ఎంబాసిడర్ ి యస్ మీనన్‌ని ఆశ్చర్యంలో ముంచివేసింది సోవియట్ అకాడమీ ఆఫ్ ్సెన్సెస్ వారి అతిథ్యం అంటే మన జ్యోతిష శాస్త్రంలో చెప్పిన ుహారాజయోగమే హోటల్‌లో నాతోపాటు ఎంతమంది భోజనం చేసినా ఎంత ఖరీదైన భోజనం చేసినా బిల్లు మీద "మూర్తి ఇండియా" అని సంతకం చేయడమే నాపని ప్రయాణాలు చేయాలంటే ఎరిక్ కామరాఫ్ టెలిఫోను చేసి"మూర్తి ఇండియా" కోసం రెండు విమాన టిక్కెట్లు అంటే చాలు సీట్లు రిజర్వు అయిపోయేవి ఏ పట్టణం వెళ్ళినా పెద్ద హోటల్‌లో నాకు పెద్దగది (సూట్) కామరాఫ్‌కి ఒకగది ఏర్పాటు చేసి ఉండేది ప్రయాణాలు, భోజనాలు, హోటలు గదులు, టాక్సీలు అన్నింటికి "'మూర్తి, ఇండియా" ఏదో మ్యాజిక్కులా పనిచేసేది

ఆరాత్రే లెనిన్ గ్రాడ్ ప్రయాణం, కామరాఫ్ విమానం టిక్కెట్లు, లెనిన్‌గ్రాడ్‌లో హోటల్ ఏర్పాట్లు నిమిషాలమీద చేసాడు, టాక్సీలో మాస్కో విమానాశ్రయానికి చేరాం టాక్సీ డ్రయివరు కూడా ప్రభుత్వోద్యోగి అనే

విషయం గుర్తుంచుకోవడానికి కొంత వ్యవధి కావలసి వచ్చింది సోవియట్ యూనియన్‌లో తయారయే కార్లలో జిస్, జిమ్ మంచికార్లు జిస్ కార్లు అమ్మకానికి కాదు ప్రభుత్వము యొక్క ఉపయోగానికి ప్రత్యేకించ బడతాయి ఇవి కాక మరొక మూడు రకాల ప్యాసింజరు కార్లు రష్యన్లు తయారు చేస్తారు అవి పొబేడా, వోల్గా, మాస్కవిచ్, మాస్కోలో48 లక్షల జనాభా ఉన్నా పదివేలకంటె హెచ్చు ప్రయివేటు కార్లు లేవంటే ఆశ్చర్యపడ నక్కరలేదు రాత్రి గం 9-00కి మాస్కో విమానాశ్రయం ప్రయాణీకులతో క్రిక్కిరిసిపోయి చాలా సందడిగా ఉంది రాత్రి గం 9-20కి విమానం బయలుదేరింది చిత్రం ఏమిటంటే విమానంలో సీటు బెల్టులు లేవు విమానం బయలుదేరేటప్పుడుకాని దిగేముందుకాని పొగత్రాగవద్దనే హెచ్చరికలేదు చాకలెట్లు లేవు రెండుగంటల పదిహేను నిముషాలలో లెనిన్ గ్రాడ్ చేరాం ఇన్ టూరిస్టు హోటల్ అస్టోరియాకు టాక్సీలో చేరి రాత్రి భోజనం చేసేసరికి ఒంటి గంట అయింది అస్టోరియా హోటల్ లెనిన్ గ్రాడ్ రాజవీధి నెవ్‌స్కి ప్రోస్పెక్ట్‌మీద ఉంది

లెనిన్ గ్రాడ్ సోవియట్ యూనియన్‌లో అత్యంత ప్రముఖ సముద్రరేవు పట్టణం ఇది ఫిన్లాండ్‌గల్ఫ్‌లో క్రాన్ స్టాడ్‌టే ఒడ్డున ఉంది లెనిన్‌గ్రాడ్ హార్బరు ప్రపంచంలోని అతి పెద్ద ఓడ రేవులలో ఒకటి ఆర్కిటిక్‌కి లెనిన్‌గ్రాడ్ ముఖ్య సోవియట్ ద్వారం ఈ పట్టణాన్ని ఆరోగ్యంగా, నాజూగ్గా, అందంగా ఉండే అమ్మాయితో పోలుస్తారు లెనిన్‌గ్రాడ్ ఇంకా లవండర్ పరిమళాలు విరజల్లుతూనే ఉందని పలువురు పాశ్చాత్య పర్యాటకుల భావం లెనిన్‌గ్రాడ్ యూరోపులోని పారిస్ వియన్నా పట్టణాల వలె అందంగా ఉంటుందని, మాస్కో సోవియట్ యూనియన్‌కి ముఖ్యపట్టణమైనా దానికి పూర్తిగా పల్లెటూరి లక్షణాలు వదలలేదని కొందరి వాదం నిజానికి మాస్కోవాసులకు, లెనిన్ గ్రాడ్‌వాసులకు ఏపట్టణం అందమైనది అనే విషయంలో విప్లవానికి ముందునుంచీ వాదోప వాదాలు ఉన్నవి అవి ఈనాటికి ఆయా పట్టణవాసుల్లో పాతుకుపోయాయి లెనిన్‌గ్రాడ్ (పీటర్స్‌బర్గ్) 200 సంవత్సరాలు రష్యాకు ముఖ్యపట్టణంగా ఉంది పీటర్, కాథరిన్, అలెగ్జాండరు చక్రవర్తులు ఇక్కడ నుంచే రష్యాను పాలించారు ఈ పీటర్స్‌బర్గ్ పట్టణమే విప్లవ సమాలోచనలకు, ఆందోళనకు, విజయానికి ముఖ్యస్థానాన్ని ఆక్రమించుకొంది 1825 డిశంబరులో సిపాయి తిరుగుబాటు 1905 ఉద్యమం 1917 లో ఫిబ్రవరి, అక్టోబరు విప్లవాలు కూడా పీటర్స్ బర్గ్‌లోనే జరిగినవి ఆనాటి విప్లవంలో ముఖ్యపాత్ర వహించిన యుద్ధనౌక అరోరా నేవా నదిలో ప్రేక్షకులకు కన్నుల పండుగ చేస్తూ అలాగే ఉంది

నేవా నది ఒంపులో ఒకమైలు దూరంలో స్మోల్ని ఇన్స్టిట్యూట్ ఉంది విప్లవానికి ముందు దీనిని ప్రముఖుల కుమార్తెలకు పాఠశాలగా నిర్మించారు 1917లో బోల్షివిక్స్ దీనిని తమ ప్రధమ హెడ్ క్వార్టర్స్‌గా ఉపయోగించు కున్నారు లెనిన్ మహాశయుడు ఉపయోగించిన గదినెంబరు 95ఈ భవనంలో మూడవ అంతస్తులో ఉంది ప్రస్తుతం ఈ బవనం స్థానిక కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు మాత్రమే రష్యన్ సామ్రాజ్ఞి ఎలిజబెత్ (1741-62) అజ్ఞ మేరకు నిర్మించిన వింటర్ ప్యాలస్ చూడ్డానికి వెళ్ళాను దానిని యిప్పుడు హెర్మిటాజ్ అంటారు ఇటాలియన్ ఫ్రెంచి డచ్చి చిత్రకారుల తైలవర్ణ చిత్రాలు శిల్పకళాఖండాలు ఎన్నో ఉన్నాయి ప్రపంచంలో ఖరీదైన చిత్రాలు శిల్పాలు అక్కడ ఉన్నట్టు ప్రతీతి ఇక మనకు వాటిని చూచి ఆనందించడానికి ఎంత సమయమైనా చాలదనిపించింది లెనిన్ గ్రాడ్‌కి చారిత్రకంగా విశిష్టమైన స్థానం ఉంది ఒక ప్రక్క రష్యన్ చక్రవర్తుల పాలనా చిహ్నాలు మరో ప్రక్క సోవియట్ విప్లవ విజయ చిహ్నాలు,వీటిమధ్య లలిత కళలు రెండువందల సంవత్సరాలకు ముందు రష్యన్ బాలే లెనిన్‌గ్రాడ్‌లోనే పుట్టింది సోవియట్ యూనియన్‌లోని అత్యంత ప్రసిద్ధికెక్కిన పురాతన బాలే స్కూలు ఇంకా ఇక్కడ నిర్వహించబడుతోంది పవలోవా, నిజిన్‌స్కీ మొదలైన బాలే డాన్సర్ల పుట్టినిల్లు లెనిన్‌గ్రాడ్ వింటర్ ప్యాలస్ దగ్గరలో అరమైలు పొడవుగా ఉన్న అడ్మిరాలిటీ భవనాలు ఉన్నాయి అక్కడే అలెగ్జాండ్రిన్ స్కీ థియేటర్ ఉంది దానిని ఇప్పుడు పుష్కిన్ థియేటర్ అంటారు లెనిన్‌గ్రాడ్ నగర మధ్యలో డిశంబరిస్టు స్క్వైర్‌లో పీటర్ ది గ్రేట్ గుర్రంమీద కూర్చున్న శిల్పం మరొకచోట ఒకటవ నికలస్ గుర్రం మీద ఉన్న శిల్పం నగరానికి అందం యిచ్చాయి

లెనిన్ గ్రాడ్‌కి దగ్గరలో ఉన్న సమ్మర్ ప్యాలస్ చూడ్డానికి వెళ్ళాను ఫిన్నిష్‌బే గుండా మోటర్ లాంచిలో ప్రయాణం చేసి గంటాఇరవై నిమిషాలలో పీటర్ హాప్ చేరాం ఇక్కడ రష్యన్ చక్రవర్తులు వేసవి వేడి నుంచి ఉపశమనం పొందడానికి కొన్ని వందల నీళ్ళ ఫౌంటెన్లు అమర్చారు అవన్నీ కూడా అనేక రకాల డిజైన్లలో నిర్మించబడ్డాయి ఇంకా అవి పనిచేస్తూనే ఉన్నాయి ఎంతసేపు ఆ ఫౌంటెన్ల మధ్య తిరిగినా తనివి తీరలేదు అంత సరదాపడి వెళితే అక్కడ ఫౌంటెన్లు తప్ప మరేవిదమైన ప్రత్యేక ఆకర్షణ లేదు తీరికగా బస్సులో రైల్వే స్టేషన్‌కి వెళ్ళి అక్కడ నుంచి ఎలక్ట్రిక్ రైలులో లెనిన్‌గ్రాడ్‌కి బయలుదేరాం ప్రయాణం 35 నిమిషాలు మాత్రమే ఆ కొద్ది వ్యవధిలోను స్పానిష్ భాష బోధించే ఉపాధ్యాయుడు, ఒక గైడ్ తటస్థపడ్డారు వారికి లెనిన్‌గ్రాడ్ మహానగరం అంటే ఉన్న అభిమానం నన్ను ఆశ్చర్యపరచింది వారు లెనిన్‌గ్రాడ్ పట్టణవాసులమని ఎంతో గర్వంగా చెప్పుకున్నారు

ఆ రాత్రి పుష్కిన్ థియేటర్‌లో నాటకం చూడ్డానికి వెళ్ళాం సోవియట్ యూనియన్‌లో థియేటర్ ఉద్యమానికి మంచి ప్రజాదరణ ఉంది ఐతే నాటకం హాలులోకి వెళ్ళేవరకు ఆ నాటకంలో ఏ వేషం ఎవరు వేస్తారో మనకు తెలియదు వారు అమ్మే ప్రోగ్రాంలో ప్రతి పాత్రకు ఇద్దరు ముగ్గురు పాత్రధారుల పేర్లు అచ్చువేసి ఉంటాయి మనం హాలులోనికి వెళ్ళేముందు ఏ పాత్ర ఎవరు వేస్తున్నారో వివరాలు తెలియజేసే కాగితం గేటు వద్ద యిస్తారు ఇక హాలులోనికి వెళ్ళే ముందు మన ఓవర్ కోటు భద్రపరచడానికి యివ్వడం గొప్ప సమస్య అంతా క్యూలో నిలబడి తమ కోట్లు వాటిని భద్రపరచే అమ్మాయికి అందిస్తారు మళ్ళా కార్యక్రమం పూర్తి అయిన తరువాత క్యూలో నిలబడి ఆ కోటు తీసుకోవాలి నిజంగా ప్రాణం విసుగెత్తుతుంది నాకు భాష రాకపోయినా మిత్రుడు కామరాఫ్ సహాయంతో కథ అర్థం చేసుకున్నాను విప్లవం రోజుల్లో ఒక యుద్ధనౌకలో తీవ్రవాదుల గురించిన కథ కథకంటే దానిలోని పాత్రల నటనా కౌశల్యం ప్రొడక్షన్‌లోని అందాలు తెలుసుకోవడం నా సరదా

థియేటర్‌కి ప్రజలలో ఉన్న ప్రాచుర్యాన్ని చూడాలంటే లండన్‌లోనే చూడాలి ఎన్ని థియేటర్లు! ఎంతమంది మహానటులు! సంవత్సరం పొడుగునా నాటకాలు ఆడుతూనే ఉంటారు అప్పుడప్పుడు కాంట్రాక్టు నాటకాలు, కొన్ని సందర్భాలలో ఔత్సాహిక నాటక సమాజాలవారు ప్రదర్శించే నాటకాలు చూడ్డానికి అలవాటుపడ్డ మనకు యూరోపియన్ థియేటర్ చాలా అందమైన అనుభూతి ఒక నాటకం ప్రదర్శన యోగ్యంగా తయారు చేయడానికి ఆ కంపెనీలు బోలెడు శ్రమ ఖర్చు పెట్టాలి అందుమూలంగా ఆ ప్రదర్శన ప్రతిరాత్రి కొన్ని మాసాలు ప్రదర్శిస్తారు ఆ తరువాత మరి కొన్ని పట్టణాలకు వెళతారు సాధారణంగా నాటకం పొందిన ప్రజాదరణను బట్టి దాని మనుగడ ఉంటుంది అగదా క్రిష్టి వ్రాసిన "వరమ్స్" అనే నాటకం లండన్‌లో కొన్ని సంవత్సరాలు ప్రతిరాత్రి ప్రదర్శించబడింది అయితే ఇంగ్లండులో గొప్ప యాక్టరుగా పేరు సంపాదించుకోవాలంటే షేక్స్పియర్ నాటకాలు వారికి గీటురాయి లారెన్స్ ఒలివియర్ రెడ్ గ్రేవ్ అలెక్ గినెస్ మొదలైన హేమాహేమీలంతా షేక్స్‌పియర్ నాటకాల ద్వారా కీర్తి శిఖరాలు అందుకున్నారు

సాధారణంగా ఒక కంపెనీ ఒక నాటకం ప్రదర్శన యోగ్యంగా తయారుచేయడానికి వేలాది పౌండ్లు ఖర్చు అవుతుంది ఆ నాటకాన్ని ఇంగ్లండులో మాత్రమే ప్రదర్శిస్తే ఖర్చులు కూడా రావు అందుమూలంగా వారంతా ఇంగ్లాండు నుంచి అమెరికా వెళ్ళి అక్కడ కూడా ప్రదర్శనలు

యిస్తారు నేను ఇంగ్లాండులో ఉన్న రోజుల్లో థియేటర్ రంగంలో గొప్ప సంచలనాన్ని తీసుకువచ్చిన సన్నివేశం మరపురానిది సర్ అలెక్ గినెస్ హేమ్లెట్ నాటకాన్ని ప్రదర్శించడానికి సర్వ సన్నాహాలు చేసి ప్రదర్శనకు ముందురోజు నాటక విమర్శకులకు ప్రదర్శన ఏర్పాటు చేసాడు అక్కడనాటక విమర్శకులకు మంచి పరువు ప్రతిష్టలు ఉంటాయి తెల్లవారేసరికి అందరు విమర్శకులు ఐక్య కంఠంతో "హేమ్లెట్" ను దుయ్యబట్టారు దానికి కారణం ఆ నాటకంలో హేమ్లెట్‌కు గినెస్ చిన్న గెడ్డం తగిలించడం దానితో హేమ్లెట్‌కి గడ్డం ఉండేదా లేదా అని మీమాంస లేదన్నారు విమర్శకులు ఆ మరునాడు అలెక్ గినెస్ విమర్శకుల సమావేశం ఏర్పాటుచేసి హేమ్లెట్ డేనిష్ యువరాజు కాబట్టి అతడి కాలంలో డేన్లు అందరూ గడ్డాలు పెంచుకునేవారు కాబట్టి హేమ్లెట్‌కి చిన్న గడ్డం తగిలించానని, దానిలో సంప్రదాయ విరుద్ధం ఏమీ లేదని వాదించాడు కాని ఫలితం లేకపోయింది సంప్రదాయం జయించింది గినెస్ ఓడిపోయాడు ఇంగ్గండులో నాటకాలు ప్రదర్శించడానికి ప్రొడ్యూసర్లు తీసుకునే శ్రద్ధ, జాగ్రత్తలు నాటక విమర్శకుల ప్రతిష్ట, సంప్రదాయం యొక్క బలాన్ని గూర్చి కామరాప్‌తో మాట్లాడుతూ హోటల్‌కి చేరాం

మరునాడు లెనిన్‌గ్రాడ్‌లోని స్వెర్ద్లాప్ మెషిన్ టూల్‌ఫ్యాక్టరికి వెళ్ళాను ఈ సంస్థలో 2300 మంది కార్మికులు పని చేస్తున్నారు వీరు హారిజంటల్ బోరింగ్ మెషిన్లు తయారుచేసి భారతదేశానికి, వియత్నాం, కొరియా చైనా, ఫిన్లాండ్, యుగోస్లావియా దేశాలకు ఎగుమతి చేస్తారు ఈ సంస్థ ఏడాదికి 500 మెషిన్లు ఉత్పత్తి చేసే శక్తి కలిగి ఉంది ఛీఫ్ ఇంజనీరుతోను, డెప్యూటీ డైరెక్టరుతోను అక్కడి కార్మికులను గూర్చిన వివరాలు మాట్లాడాను ఆఖరిదశలో డైరెక్టరు కూడా వచ్చి మా సంభాషణలో పాల్గొన్నాడు ఈ సంస్థలో ఉద్యోగుల జీతాలకు సంబంధించినంత వరకు సాధారణంగా సోవియట్ యూనియన్ అంతటా ఉన్న వివరాలే చెప్పారు సోవియట్ రష్యాలో స్త్రీలకు పురుషులకు కూడా ఒకేరకమైన పనికి ఒకే రకమైన జీతం అనే సూత్రం వర్తిస్తుంది ఈ సంస్థలో పురుషులు 60 ఏళ్ళకు స్త్రీలు 55 ఏళ్ళకు పదవీవిరమణ చేస్తారు అనారోగ్యకరమైన కొన్ని విభాగాలలో పనిచేసేవారు 5ఏళ్ళు ముందుగా పదవీ విరమణ చేస్తారు ఈ సంస్థలో డైరెక్టరు జీతం నెలకు 3000 రూబుల్సు ఛీఫ్ ఇంజనీరు జీతం 1800 రూబుల్సు సామాన్య కార్మికునికి 1200 రూబుల్సు నిపుణుడైన కార్మికునికి అతి తక్కువ జీతం 800 రూబుల్సు నిపుణుడు కాని కార్మికునికి 300 నుంచి 400 రూబుల్సు జీతం అయితే వారు భోజనానికి, మకాం కోసం చాలా తక్కువ ఖర్చుపెడతారు హాస్టళ్ళలో ఉన్న వారు భోజనం మినహా నెలకు 30 రూబుల్సుతో కాలక్షేపం చేయవచ్చును కార్మికులకు యిచ్చే గృహవసతికి 1చదరపు మీటరు స్థలానికి

1రూబులు 30 సెంట్లు నెల అద్దెగా వసూలు చేస్తారు మహిళలకు నాలుగు మాసాల ప్రసూతి సెలవు పూర్తి జీతంతో యిస్తారు ఉద్యోగ విరమణ చేసినవారికి 50 నుంచి 80 శాతం జీతం పెన్షన్‌గా యిస్తారు కాని పెన్షన్ నెలకు 1200 రూబుల్సుకి మించకూడదు

ఆ ఫ్యాక్టరీ నుంచి హోటల్‌కి తిరిగివచ్చి ఆ సాయంకాలం ఏదైనా సినిమాచూద్దాం అని బయలుదేరాం మేం వెళ్ళిన ఆటకు టిక్కెట్లు దొరకలేదు సినిమా టికెట్లకోసం అంతగా పట్టించుకోకుండా హాయిగా ఒక పార్కులో కూర్చున్నాం అక్కడ ఉన్న హాలులో పూర్తిగా మహిళలతో నిర్వహించబడుతున్న జాజ్ బ్యాండు కార్యక్రమం జరుగుతోంది కాని ఎందుకో లోపలకు వెళ్ళబుద్ధి పుట్టలేదు నేను, కామరాఫ్ వియత్నాం సమస్యగురించి మాట్లాడుతూ కూర్చున్నాం ఆ పార్కునిండా బాగాత్రాగి, ఆ నిషాలో ఆనందంగా కాలక్షేపం చేస్తున్న యువతీ యువకులు కనిపించారు వాళ్ళ ప్రవర్తన చూచి నేను ఏమనుకుంటానో అని మిత్రుడు కామరాఫ్ చాలా ఆదుర్దా పడ్డాడు కాని నేను మాత్రం మానవుడు ఏ పరిస్థితులలో ఎలా ప్రవర్తిస్తాడో అనే విషయం మీద చిన్న ఉపన్యాసం చెప్పాను తొందరగా భోజనంచేసి మాస్కోతిరుగు ప్రయాణానికి సిద్ధం అయ్యాను వచ్చేటప్పుడు విమానంలో ప్రయాణం చేసాం కాబట్టి తిరుగు ప్రయాణం రైలులో చేయాలని నిర్ణయించాం

రైలులో ప్రయాణం చేయాలని నిర్ణయించడంలో మరొక ముఖ్యకారణం ఉంది లెనిన్‌గ్రాడ్ నుంచి మాస్కోకువెళ్ళే రెడ్ యారో ఎక్స్‌ప్రెస్ రైలు మార్గం చాలా ప్రసిద్ధికెక్కింది మాస్కో లెనిన్‌గ్రాడ్ మధ్యనున్న 300 మైళ్ళ రైలుమార్గంలో ఒకవంపుకాని, వంకరకాని, కుదుపుకాని ఉండదు ఒకటవ నికలస్ జార్ చక్రవర్తి అటువంటి రైలుమార్గం కావాలన్నాడు రాజు తలిస్తే దెబ్బలకు కొదవా అన్నట్టు చక్రవర్తి ఆజ్ఞలకు అధికారులు రూపకల్పన చేసి అటువంటి రైలు మార్గం నిర్మించారు అక్కడి భూమి యొక్క స్వభావం దానికి తోడ్పడింది రెడ్ యారో ఎక్స్‌ప్రెస్ 300 మైళ్ళ దూరం 9 గంటల 45 నిమిషాలలో ప్రయాణిస్తుంది

రాత్రి గం 11-50కి రైలు లెనిన్‌గ్రాడ్ స్టేషన్ వదిలింది సామాన్యంగా సోవియట్ యూనియన్‌లో రైలు బయలుదేరే ముందు ఏవిధమైన హెచ్చరిక ఉండదు కూతలు, ఈలలు ఉండవు సరి అయిన సమయానికి రైలు స్టేషన్ వదలడం గమ్యం చేరిపోవడం జరిగిపోతుంది మరునాటి ఉదయం గం 9-35కి మాస్కో చేరాం

మాస్కోలో భారత రాయబారి శ్రీ కె పి ఎస్ మీనన్‌ని చూడ్డానికి వెళ్ళాను ఆయన అప్పటికే ఐదు సంవత్సరాలనుంచి సోవియట్

యూనియన్‌లో భారత రాయబారిగా ఉన్నాడు మన దేశానికి స్వతంత్రం రావడానికి పూర్వం బ్రిటిషు పరిపాలనా కాలంలోనే చైనాలో ఏజెంట్ జనరల్‌గా పనిచేసాడు ఆయన చేసిన సాహసోపేతమైన ప్రయాణాలను వివరిస్తూ వ్రాసిన గ్రంథాలు మంచి ప్రఖ్యాతికెక్కినవి కెపిఎస్ హాస్య ప్రియుడు ఆయన సంబాషణాచాతుర్యం అనన్యసామాన్యం చెరొక గ్లాసు షెర్రీ సేవిస్తూ కబుర్లాడే సందర్భంలో తాను ఐసిఎస్ అధికారిగా ఆంధ్రా కేడర్‌కి చెందినవాడినని చెప్పారు కెపిఎస్‌కి అప్పటి సోవియట్ ప్రధాని కృశ్చేవ్ అంటే గొప్ప అబిమానం సోవియట్ యూనియన్‌లోని కర్షక కార్మికవర్గాల మేలు కోరడమే కృశ్చేవ్ పరిపాలనా లక్ష్యం, పరమావధి అన్నారు ఆయన రష్యాలో అనేక సంస్కరణలు ప్రవేశపెట్టాడు కాని మాలొటాఫ్ మొదలైన నాయకులు కృశ్చేవ్ ప్రణాళికలకు వ్యతిరేకత చూపడంవల్ల ఆయన పూర్తి ఫలితాలు సాదించలేక పోయాడన్నారు శ్రీ మీనన్ ఎక్కడికో ప్రయాణం పెట్టుకున్నందున మా సమావేశం స్వల్ప వ్యవధిలో ముగిసింది కాని నేను అక్కడ ఉన్నంతసేపు ఆయన కృశ్చేవ్ గొప్పతనం గురించి చెబుతూనే ఉన్నాడు

ఆ మద్యాహ్నం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓరియంటల్ స్టడీస్‌లో డైరెక్టరు ప్రొఫెసర్ గఫూరాఫ్ ఇతర శాఖల అదికారులతో సమావేశం భారతదేశ చరిత్రశాఖ అదిపతి ప్రొఫెసర్ బాలా బుషావిచ్ అనేకమంది పరిశోధకులు కూర్చుని అనేక విషయాలు చర్చించాం సోవియట్ యూనియన్‌లో ప్రపంచంలోని ఇతర దేశాల చరిత్ర, బాష సంస్కృతులను గూర్చి జరిగే పరిశోధనలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి ఆనాటి చర్చలలో అనేక ఆసక్తికరమైన విషయాలు తెలుసుకున్నాను ప్రొఫెసర్ గఫూరాఫ్ సలహా మేరకు ఉజ్బెకిస్తాన్ తజికిస్తాన్, అజర్బయిజాన్ రిపబ్లిక్స్ చూడ్డానికి ఆ సాయంకాలమే బయలుదేరాలని నిర్ణయించుకున్నాం ఉజ్బెకిస్తాన్ విస్తీర్ణం 156,640 చ మైళ్ళు జనాబా ఏప్రిల్ 1956 నాటికి 7,30,000 ముఖ్య పట్టణం తాష్కెంట్ తజకిస్తాన్ రిపబ్లిక్ విస్తీర్ణం 54,826 చ మైళ్ళు, జనాభా సోవియట్ యూనియన్‌లోని అన్ని రిపబ్లిక్స్ కంటె తక్కువ, 1,800,000 ముఖ్యపట్టణం స్టాలినాబాద్ అజర్బయిజాన్ విస్తీర్ణం 33,089 చ మైళ్ళు జనాభా 34,00,000 ముఖ్యపటణం బాకు అంతకుముందు చెప్పినట్టు సోవియట్ యూనియన్‌లో ఒక రిపబ్లిక్ నుంచి మరొక రిపబ్లిక్‌కి వెళ్ళడానికి పాస్‌పోర్టులు అవసరంలేదు కస్టమ్స్ పరీక్షలు ఉండవు ప్రతి రిపబ్లిక్ పౌరుడు సోవియట్ యూనియన్ కంతటికీ పౌరుడై ఉంటాడు

సోవియట్ యూనియన్‌లోని ఆసియన్ రిపబ్లిక్స్ చూడ్డానికి

బయలుదేరాను బ్రహ్మాండమైన వర్షం మాస్కో విమానాశ్రయం నుంచి టి యు 104 రష్యన్ జెట్ విమానంలో ప్రయాణం అప్పటికి రష్యాలో సామాన్యంగా ఉపయోగించే విమానం30మంది ప్రయాణికుల్ని తీసుకువెళ్ళే ఇల్యూషియన్ దీనిలో రెండు రకాలు ఉన్నాయి రష్యన్ జెట్ విమానం టి యు 104, 50 నుంచి 70 మంది ప్రయాణికుల్ని తీసుకువెళుతుంది రాత్రి 11 గంటలకు మాస్కోవదిలాం విమానంలో సీటుబెల్టులు ఉన్నాయి కాని విమానం బయలుదేరేటప్పుడు కాని దిగేముందు కాని సీటు బెల్టులు కట్టుకోమని ఎవరూ ఆజ్ఞాపించరు మిగిలిన దేశాల విమానాలలో లాగ స్వీట్లు యివ్వరు చివరకు చెవులలో పెట్టుకోవడానికి దూది కూడా ఇవ్వరు విమానం ఎగిరేటప్పుడు నా చెవులు గింగిర్లు ఎత్తాయి ఒత్తిడి ఎక్కువ ఉన్నట్టు అనిపించింది మాస్కోనుంచి తాష్‌కెంట్‌కి జెట్ విమానం నాలుగు గంటలు తీసుకుంది మామూలు విమానం 14 గంటలు తీసుకుంటుంది మాస్కో టైము ఉదయం 3 గంటలకు తాష్‌కెంట్‌కి చేరాం అప్పుడు అక్కడ ఉదయం 6 గం అయింది రాత్రంతా కంటిమీద కునుకులేదు విమానం లోపల చాలా వేడిగా ఉంది విమానాశ్రయం వద్ద ఇన్ టూరిస్టు, వి వో కె ప్రతినిధులు నన్ను, కామరాఫ్‌ని కలుసుకున్నారు మాతోపాటు ఫ్రెంచి పార్లమెంటు సభ్యుల బృందం విమానంలో వచ్చింది పుష్పమాలలు, ఫోటో, ఆటోగ్రాపుల హడావిడి తాష్‌కెంట్ హోటల్‌కి చేరాం పెద్ద డబుల్‌బెడ్ రూమ్ ఇచ్చారు కాని బోలెడు ఈగలు అయినా 11గంటల వరకు నిద్రపోయాను ఒక రష్యన్ యువతి గైడ్‌గా రాగా తాష్కెంట్ చూడ్డానికి బయలుదేరాం నిజానికి మా కార్యక్రమంలో తజకిస్తాన్ నుంచి తిరిగివచ్చిన తరువాత తాష్కెంట్‌లో రెండు రోజులు గడపాలని పెట్టుకున్నాం అందుమూలంగా ఆ రోజంతా విశ్రాంతి తీసుకోవడంలోనే గడిపాం

తాష్కెంట్ అత్యంత ఆదునికమైన పారిశ్రామిక నగరం సోవియట్ యూనియన్‌కి బారతదేశానికి మధ్య నడిచే విమాన ప్రయాణానికి తాష్కెంట్ ఆయువుపట్టు మనదేశంలో డిల్లీలోను, హైదరాబాదులో ఉన్నట్టు తాష్‌కెంట్ పట్టణంలో కూడా పాతపట్టణం కొత్త పట్టణం ఉన్నాయి చారిత్రాత్మకంగా చూస్తే తాష్కెంటు చాలా పురాతన పట్టణం గతించిన శతాబ్దాలలో ఈ పట్టణంలో కొన్ని సామ్రాజ్యాలు స్థాపించబడ్డాయి మరికొన్ని నశించాయి ఏడవ శతాబ్దంలో దానిని అరబ్బులు వశపర్చుకున్నారు పదమూడు పదిహేను శతాబ్దాల మధ్య మంగోలులు పాలించారు 16వ శతాబ్దంలో ఉజ్బెక్కులు దానిని తమ స్వంతం చేసుకున్నారు చివరకు 19వ శతాబ్దంలో అది రష్యన్ వశమైంది ఛెంగిస్‌ఖాన్ వల్ల నాశనం చేయబడి తామర్లేనుచేత పరిపాలింపబడి

మాస్కో నుంచి జార్ చక్రవర్తి సైన్యాల పదఘట్టాల క్రింద నలిగిపోయినా తాష్కెంటు అన్ని దండయాత్రలను తట్టుకొని నిలబడింది

1865లో అమెరికాలో వచ్చిన అంతర్యుద్ధం పుణ్యమా అంటూ రష్యాలో మాస్కోవద్దనున్న వస్త్రపరిశ్రమకు కావలసిన ముడిప్రత్తి సరఫరా పడిపోయింది అప్పుడు రష్యను సైన్యాలు తాష్కెంట్ మీదకు దండెత్తి ప్రత్తి ఉత్పత్తిచేసే మధ్య ఆసియాలో జార్‌చక్రవర్తి పాలనను నెలకొల్పారు ఇప్పుడు తాష్కెంట్‌లో ప్రపంచంలో కల్లా పెద్దదైన జౌళిమిల్లు ఉన్నదని చెప్పుకుంటూరు (బర్నాల్‌లో ఉన్నమిల్లు దీనితో పోటీపడుతుందట) ఈ పట్టణంలోని ప్రత్తి పరిశోదనా కేంద్రం వద్ద కార్మికులు తమ రంగుల ప్రత్తిని గురించి గర్వంగా చెప్పుకుంటూరు ఇక్కడ పశ్చిమ ఆసియాలోని సామాన్య బూడిద ప్రత్తిరకాలతో సంకరణముచేసి ఆకుపచ్చ గోధుమవన్నె ప్రత్తి రకాలను ఉత్పత్తి చేసారు ఈ సంకరజాతి ప్రత్తి రకాలవల్ల మంచి దిగుబడి వస్తోంది 2,500 రకాలను ఇక్కడ పరిశోధిస్తున్నారు

ఇక ఉజ్బెక్కులు తమ బాష చాలా అందమైనదని గర్వంగా చెప్పుకుంటూరు, కాని ఆ బాషరానివారు వింటే వారికి దానిలోని అందం తెలియక పోవచ్చు ఉజ్బెక్ సాహిత్యానికి 15వ శతాబ్దంలోని ప్రముఖ కవి ఆలిషిర్ నవోమ్ ఆద్యుడని చెప్పుకుంటూరు ఉజ్బెక్ బాష పూర్వం అరబిక్ లిపిలో వ్రాసేవారు కాని ప్రస్తుతం ఆ బాషను రష్యన్ లిపిలో వ్రాస్తున్నారు

స్టాలినాబాద్ ఆ మరునాడు వెళ్ళడానికి నిర్ణయించాం రెష్టారెంటులో భోజనానికి వెళ్ళాం అది కిటకిటలాడిపోతోంది లోపలకు భోజనానికి రావడానికి ప్రజలు క్యూలో నిలబడి ఉన్నారు అయితే విదేశీ అతిధులకు క్యూలు అడ్డురావు సోవియట్ యూనియన్‌లో ఎక్కడికి వెళ్ళినా విదేశీ అతిధులకు ప్రత్యేక మర్యాదలు ఉంటాయి భోజనానంతరం ఉజ్బెక్ సంగీత నాట్య ప్రదర్శనకు వెళ్ళాం ఆ కార్యక్రమం జరిగే ఓపెన్ ఎయిర్ హాల్ ఒక సరస్సు ప్రాంతంలో ఉంది ఆ పరిసరాలన్నీ ప్రజలతో నిండిపోయి ఉన్నాయి సంగీతం బాల్‌రూం డాన్సింగ్ ఇంకా ఎన్నో వినోద కార్యక్రమాలు మేం వెళ్ళిన కార్యక్రమానికి ఫ్రెంచి పార్లమెంటు సభ్యుల బృందం కూడా వచ్చింది ఉర్దూ వచ్చిన వారికి వారు పాడే షయిరాలు హాయిగా అర్థం అవుతాయి ఆ కార్యక్రమంలో రెండు భారతీయ నృత్యాలు, రెండు భారతీయ సినిమా పాటలు ఉన్నాయి ఆ పాటలలో ఒకటి బైజు బావ్రా నుంచి రెండవది అవారా నుంచి కార్యక్రమం హాయిగా ఉంది ప్రేక్షకులు ఉత్సాహంగా నానా గొడవ చేసారు అయితే తాష్కెంట్‌లో ఉజ్బెక్ ప్రేక్షకులకోసం ఉజ్బెక్ కళాకారులు యిచ్చిన కార్యక్రమంలో నాలుగు బారతీయ కళారీతులు ఉండడం చూచి చాలా

ఆశ్చర్యపోయాను

ప్రయాణం ఏర్పాట్లు ఎంత జాగ్రత్తగా చేసినా అప్పుడప్పుడు అవాంతరాలు రావడం తప్పదు ఆ ఉదయం తాష్కెంట్ నుంచి తజకిస్తాన్ ముఖ్యపట్టణం స్టాలినాబాద్‌కి వెళ్ళాలని నిర్ణయించుకున్నాం కాని మమ్మల్ని విమానాశ్రయానికి తీసుకువెళ్ళవలసిన ఇన్‌టూరిస్టు ప్రతినిధి హోటల్‌కి రాలేకపోయాడు కారు విషయంలో ఏదో ఇబ్బంది వచ్చిందట వోక్స్ ప్రతినిధి టాక్సీలో వచ్చాడు కాని మా ముక్కూ మొఖం తెలియని ఒక పెద్దమనిషి మమ్మల్ని తనకారులో విమానాశ్రయానికి తీసుకువెళ్ళాడు ఉదయం గం 7-10లకు డకోటా విమానంలో తాష్కెంట్ వదలిపెట్టాం దారిలో విమానం లెనినాబాద్ సమరఖండ్ విమానాశ్రయాల్లో ఆగింది కాని చరిత్ర ప్రసిద్ధి కెక్కిన సమరఖండ్ చరిత్రపుటలలో ఒక జ్ఞాపకంగా మిగిలిపోయింది తామర్లేన్ చక్రవర్తి సామ్రాజ్యానికి ముఖ్యపట్టణంగా వెలుగొంది ప్రాచీనకాలంలో ఆసియా మీదుగా చైనాకు వెళ్ళే సిల్కు రోడ్డుకి కీలక స్థానమైన సమర్ ఖండ్ అనేక జ్ఞాపకాలకు పుట్టినిల్లు జెరావ్‌షాన్ లోయకు రెండువేల అడుగుల ఎత్తున ఉన్న ఒయాసిస్ మీద నిర్మించబడిన సమర్‌ఖండ్ చుట్టూ పర్వతాలు ప్రస్తుతం అది ఏదో ఎడారిలో ఉన్నట్టు ఉంది అంతా దుమ్మే! డకోటా విమానంలో ప్రయాణం కాబట్టి నేలంతా స్పష్టంగా కనిపిస్తోంది తాష్కెంట్ నుంచి సమర్‌ఖండ్ వరకు ఉన్న భూభాగమంతా ప్రసిద్ధికెక్కిన 'హంగర్ స్టెప్పీ' దీనిపై ప్రారంభంలో దండెత్తిన రష్యన్లు వేలాదిమంది మరణించారు అదంతా మరో చరిత్ర

మధ్యాహ్నం 12 గంటలకు స్టాలినాబాద్ చేరాం ఇన్ టూరిస్టు ప్రతినిధి మమ్మల్ని విమానాశ్రయంలో కలుసుకుని రెస్ట్ హౌస్‌కి తీసుకువెళ్ళాడు ఆ ప్రదేశం చాలా అందంగా ఉంది రెస్ట్ హౌస్ అత్యంత ఆధునికంగా ఉంది అది నిర్మించబడిన స్థలమహాత్మ్యం కాబోలు ఆ భవనంలో నిలబడి ఎటు చూసినా ప్రకృతిశోభ అసామాన్యంగా ఉంది స్టాలినాబాద్‌పై నాకు మొదటి చూపులోనే ప్రేమ కలిగినట్టు అయింది తజకిస్తాన్ పామీర్‌లలో ఉంది దాని సరిహద్దులు చాలా వరకు ఆఫ్ఘనిస్తాన్‌తోనే పాకిస్తాన్‌కి తజకిస్తాన్‌కి మధ్య ఒకపుంత మాత్రమే ఉంది అంటే స్టాలినాబాద్ మనదేశానికి నెత్తి మీద ఉందన్నమాట తాజిక్ ప్రజలు పర్వతాలలో నివసించే పెరిషియన్ జాతికి చెందినవారు వారు మాట్లాడే భాష పెరిషియన్ భాషకు చాలా దగ్గరగా ఉంటుంది ఇరాన్ దేశాన్ని చక్రవర్తి పరిపాలించే రోజుల్లో ఆయన తన సహచరులతో వచ్చి రెస్టు హౌస్‌లో మకాంచేసి పామీర్స్‌లో వేటకు వెళ్లేవారట రెస్ట్ హౌస్‌లో చాలా అందమైన గది నాకు ఇచ్చారు ఎక్కడ

చూసినా పళ్ళు చక్కటి ఏర్పాట్లు ఆ [illegible] షా చక్రవర్తి మకాంచేసేవాడని అక్కడ పనిచేసే అమ్మాయి [illegible] వెంటనే మిత్రుడు కామరాఫ్ ఇకముందు వచ్చేవారికి ఈ గదిలో డాక్టరు మూర్తి మకాం చేసాడని చెప్పమని ఆ అమ్మాయితో వేళాకోళం ఆడాడు

లంచ్ సమయానికి రిపబ్లిక్ విదేశాం[illegible] మంత్రి, శాంతి సంఘం ప్రతినిది నన్ను చూచి పరామర్శ చేయ[illegible] వచ్చారు వారు కూడా మాతోపాటు ఎటువంటి అరమరికలు లేకుండా భోజనానికి కూర్చున్నారు. ఉజ్బెక్ సూప్, కూరతో నింపిన సిమ్లా మిరపకాయలు, కబాబ్, అన్నం భోజనం బ్రహ్మాండంగా ఉంది డైనింగ్ హాలులో కూర్చుని బైటకు చూస్తే ప్రకృతి ఇంకా అందంగా ఉంది ఇక్కడి ప్రజలు అతిధిసత్కారంలో అందె వేసిన చేతులు అనిపించింది ముందు అనుకున్న రెండు రోజులకంటే ఇక్కడ ఎక్కువ కాలం ఉండాలనిపించింది స్టాలినాబాద్ వెళ్ళమని [illegible] చెప్పిన ప్రొఫెసర్ గఫూరాఫ్‌ని మనస్సులోనే అబినందించాను ఒమర్ [illegible] టిజిక్ కవి అని ఆ దేశస్థులు గర్వంగా చెప్పుకుంటారు స్టాలినాబాద్‌లో [illegible] అంటే ప్రపంచపు కప్పుమీద తిరిగి నట్టే ఎటుచూచినా కొండలు, మరొకప్రక్క రాజస్తాన్ ఎడారివంటి ఎడారి ప్రదేశం

1929కి పూర్వం స్టాలినాబాద్‌ని ద్యుషన్ బే అనేవారట నేను వెళ్ళినప్పుడు దానిపేరు స్టాలినాబాద్ కాని అప్పటి రష్యన్ ప్రదాని కృశ్చేవ్ ప్రారంబించిన స్టాలిన్ వ్యతిరేక ఉద్యమం పుణ్యమా అంటూ స్టాలినాబాద్ పేరు మార్చి వేసారట 1929 వరకు తజకిస్తాన్ ఉజ్బెకిస్తాన్‌లో ఒక బాగంగా ఉండేది

'ఐని' పేరుతో ఉన్న పదవ నెంబరు పాఠశాల చూడ్డానికి వెళ్ళాం అది ప్రారంభంలో ఆడపిల్లల కోసం ప్రత్యే[illegible] ఆ తరువాత దానిలో మగపిల్లలను ఆడపిల్లలను కూడా చేర్చుకుంటున్నారు స్కూలు డైరెక్టరెస్ పులటోవా బడి క్లాసులు చూపించింది సోవియట్ యూనియన్ మొత్తంమీద బడికివెళ్ళే పిల్లల సంఖ్య 30మిలియన్లు సుమారు 4 మిలియన్లు ఏడేళ్ళ పిల్లలు ప్రతిసంవత్సరం పాఠశాలల్లో చేరతారు విద్య ఉచితం, నిర్బంధం కూడాను సోవియట్ యూనియన్ లో రెండురకాల పాఠశాలలు ఉంటాయి ఏడేళ్ళ నుంచి 14 ఏళ్ళ వయస్సు పిల్లలకోసం పెట్టిన 7 ఏళ్ళ పాఠశాలలు, 7 నుంచి 17 ఏళ్ళ వయస్సు వారి కోసం పెట్టిన 10 ఏళ్ళ పాఠశాలలు 17 ఏళ్ళ వయస్సు తరువాత విద్యార్థులు విశ్వవిద్యాలయానికి వెళతారు పదివేల కంటే హెచ్చు జనాబా ఉన్న పట్టణాలలో పదేళ్ళ చదువు నిర్బందం కాని అంతకంటే చిన్న పట్టణాలు, గ్రామాలలో ఏడేళ్ళ చదువు చాలు 1949 వరకు గ్రామీణ

ప్రాంతాలలో నిర్బంధ విద్యాప్రమాణం నాల్గవ తరగతిని మించలేదు అంతేకాదు 1956 వరకు పదేళ్ళ బడులలో చివరి మూడేళ్ళకు జీతం కట్టవలసి ఉండేది ఇప్పుడు ఆ నిబంధన ఎత్తివేసారు తజకిస్తాన్ మొత్తంలో 1910లో ఏడు పాఠశాలలు 124 మంది విద్యార్థులు ఉండేవారట నేను వెళ్ళినప్పుడు తాజిక్ రిపబ్లిక్‌లో 2500 పాఠశాలలు 3 లక్షల 50 వేల విద్యార్థినీ విద్యార్థులు ఉన్నారు

సోవియట్ యూనియన్‌లో 18 లక్షల 11వేల ఉపాధ్యాయులు ఉన్నారు మొదటి నాలుగు క్లాసులకు చదువు చెప్పేవారు నెలకు 580 రూబుల్సు జీతంతో ప్రారంభిస్తారు ప్రతి ఐదేళ్లకు 10 శాతం జీతం హెచ్చిస్తారు పై తరగతులకు బోదించేవారికి నెలకు 700 రూబుల్సు జీతం 20 సంవత్సరాలు ఉద్యోగం చేసిన తరువాత వారు నెలకు 350 రూబుల్సు పెన్షన్ మీద ఉద్యోగ విరమణ చేయవచ్చు ఏడేళ్ళ బడులు పదేళ్ళ బడులలో బోధించేవారిలో 70 శాతం మంది మహిళలే

అదే రోజు తజిక్ మెడికల్ ఇన్‌స్టిట్యూట్ హాస్పిటల్ చూడ్డానికి వెళ్ళాం, శ్రీ మతి నీనా కరినిఛేవా, మెడికల్ సైన్స్ డీన్ మమ్మల్ని ఆహ్వానించి హాస్పిటల్, స్కూలు చూపించింది సోవియట్ యూనియన్‌లో 3లక్షల 44 వేల మంది డాక్టర్లు ఉన్నారు వారిలో 70 శాతం స్త్రీలు ఆ దేశంలో 12 లక్షల 90 వేల హాస్పిటల్ పడకలు ఉన్నాయి 78వైద్య విద్యాకేంద్రాలు ఉన్నాయి, పది సంవత్సరాల చదువు పూర్తిచేసిన తరువాత వైద్యవిద్యా కేంద్రంలో ఆరేళ్ళు చదివిన తరువాత డిప్లొమా పొంది వైద్య వృత్తిని చేపట్టవచ్చును పోస్టు గ్రాడ్యుయేట్ అయినవారినే డాక్టర్లు అని పిలుస్తారు మిగిలినవారంతా ఫిజిషియన్లు, ఈ పద్ధతి ఇంగ్లండులో కూడా ఉంది

ఆ సాయంకాలమే స్టాలినాబాద్ సిటీ సోవియట్ అధ్యక్షుడు శ్రీ బాబా జనాప్ నోర్ జయరోవిక్ పట్టణంలో భారీ ఎత్తున జరుగుతున్న గృహనిర్మాణ పథకాలు చూపించారు నగర జనాబా 2 లక్షల 20 వేలకు పెరిగినా 11లక్షల చదరపు మీటర్ల విస్తీర్ణంలో మాత్రమే నివాసయోగ్యమైన గృహాలు ఉన్నాయి రాబోయే 5 ఏళ్ళలో ప్రభుత్వం 4 లక్షల 30 వేల చదరపు మీటర్ల విస్తీర్ణంలో గృహాలు నిర్మిస్తుంది 1లక్ష 50 వేల చదరపు మీటర్ల విస్తీర్ణంలో ప్రయివేటు వ్యక్తులు గృహాలు నిర్మిస్తారు వారికి స్థలం ప్రభుత్వం ఉచితంగా ఇస్తుంది అంతే కాకుండా పదివేల రూబుల్సు అప్పుకూడా యిస్తుంది స్టాలినాబాద్‌లో రెండు థియేటర్లు ఉన్నాయి వాటిలో ఒకటి తాజిక్ మరొకటి రష్యను థియేటర్లు అప్పటికి రెండేళ్ళ ముందే పట్టణంలో ట్రాలీబస్సులు ప్రవేశపెట్టారు 340 టాక్సీలు ఉన్నాయి స్టేడియం, సరస్సు చూడ్డానికి వెళ్ళాం ఏదో సినిమా

షూటింగ్ జరుగుతున్నట్టుంది అమ్మాయిలు అబ్బాయిలు వేషాలంకరణాలలో ఉన్నారు వారిలో కొందరు నేను ఉదయం చూడ్డానికి వెళ్ళిన బడిలో చదువుకునే అమ్మాయిలు ఆనందంగా పలకరించారు ఆ సరస్సులో మోటారు బోటుమీద వాహ్యాళిచేసాం, ఆ తరువాత తజకిస్తాన్‌పై తీసిన ఫిల్ము ప్రత్యేక ప్రదర్శన చూసాం ఆ ఫిల్ము మా ఇద్దరి కోసమే ప్రదర్శించారు

స్టాలినాబాద్‌లో పిరదౌసి పేరుమీద ఉన్న స్టేట్ రిపబ్లికన్ లైబ్రరీ చూడ్డానికి వెళ్ళాం లైబ్రరీ డైరెక్టరు శ్రీమతి కరిమోవా అమీనా మమ్మల్ని చాలా ఆదరపూర్వకంగాను, ఉత్సాహంగాను ఆహ్వానించి లైబ్రరీ చూపెట్టింది 1933లో ప్రారంభించబడిన ఈ లైబ్రరీలో 10 లక్షల పుస్తకాలు ఉన్నాయి దానిలో 120 మంది సిబ్బంది సోవియట్ యూనియన్‌లో ఏ భాషలో ఎక్కడ ముద్రించబడిన ప్రచురణ అయినా ఈ లైబ్రరీకి పంపాలట అటువంటి లైబ్రరీలు సోవియట్ యూనియన్‌లో 40 ఉన్నాయి ఫిరదౌసి లైబ్రరీలో 6 రీడింగ్ రూమ్సు ఉన్నాయి రీసెర్చి చేసేవారికి ప్రత్యేక సదుపాయాలు దీనిలో 68 బాషలలో రచింపబడిన గ్రంథాలు ఉన్నాయి సోవియట్ యూనియన్ మొత్తం మీద 3,92,000 లైబ్రరీలు ఉన్నాయి వాటిలో 135 కోట్ల 10 లక్షల పుస్తకాలు ఉన్నాయట

లైబ్రరీ నుంచి బైటకు వచ్చేసరికి ఏదో ఫిల్ము షూటింగు జరుగుతున్న హడావిడి కనిపించింది మాతో ఉన్న ఇన్ టూరిస్టు గైడ్ ఉజ్బెక్ అతడు యూక్రేనియన్ అమ్మాయిని వివాహం చేసుకున్నాడు అతడు బారత దేశం కూడా వెళ్ళి వచ్చానని గర్వంగా చెప్పాడు ఆఫిల్ము తీసేవారితో మాట్లాడివచ్చి దానిలో పాల్గొనే అమ్మాయిలు నాతో ఫొటో తీయించుకోవడానికి సరదా పడుతున్నారన్నాడు అదేం భాగ్యం అని ఫోటోలు తీయించుకున్నాం

అక్కడ నుంచి తజకిస్తాన్ ప్రభుత్వం నిర్వహించే అనాధ శరణాలయం చూడ్డానికి వెళ్ళాను ఆ శరణాలయం డైరెక్టరు కుమారి లిడియా అరిన్‌ఛెహిన 1945 నుంచి అక్కడే పని చేస్తున్నదట శరణాలయంలో 75 మంది పిల్లలు ఉన్నారు తల్లి దండ్రులుకాని బంధువులుకాని లేని పిల్లల్ని ఈ శరణాలయంలో ఉంచుతారు తజికిస్తాన్‌లో ఇటువంటి శరణాలయాలు మూడు ఉన్నాయి ఆ పిల్లలంతా కడిగిన ముత్యాల్లా ఉన్నారు ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉన్నారు ఆ వయస్సు అటువంటిది వారి సంరక్షణ కోసం 12 మంది సిబ్బంది ఉన్నారు ఆ శరణాలయంలో 3 నుంచి 7ఏళ్ళ వయస్సులో ఉన్న పిల్లలనే ఉంచుతారు ఆ తరువాత వారు స్కూలు శరణాలయానికి వెళ్ళిపోతారు

స్టాలినాబాద్ 33 కిలోమీటర్ల దూరంలో ఉన్న తాజిక్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న బోటనీ ఇన్‌స్టిట్యూట్ చూడ్డానికి

వెళ్ళాం అసలు స్టాలినాబాద్ దాని పరిసరాలలోనే ప్రకృతి శోభ అహ్లాదంగా ఉందంటే యీ జాగా యింకా అందంగాను ఆకర్షణీయంగాను ఉంది అక్కడి కొండలు, అడవులు ప్రకృతి అందాన్ని ద్విగుణీకృతం చేసాయి ప్రొఫెసర్ ఓవ్చినికోవ్ బోటనీ ఇన్స్టిట్యూట్ డైరెక్టరు నిజంగా రిసెర్చిలో నిమగ్నమై బాహ్య ప్రపంచాన్ని అంతగా పట్టించుకోని శాస్త్రవేత్తలా కనిపించాడు నేను అక్కడకు వెళ్ళిన సమయంలో వారు ఇర్గే అనే అడవిమొక్క వేళ్ళనుంచి ఆపిల్సు పేర్స్ కాయించడం ప్రయత్నంలో నిమగ్నమై ఉన్నారు ఇర్గే మొక్క ఆపిల్ పేర్ జాతికి దూరపు బంధువని నిర్ధారణ చేయడానికి ప్రయత్నిస్తున్నారు వీటిని కొండలమీద పెంచవచ్చునని అభిప్రాయపడ్డారు భారతదేశంలో అనేక అడవిమొక్కలు ఉన్నాయి కాబట్టి వాటిని గూర్చిన శాస్త్రపరిజ్ఞానం తెలుసుకోవడం చాలా లాభదాయకం అన్నారు వారు అత్యంత ఆప్యాయంగా ఎన్నో ఆపిల్స్ ద్రాక్షలు మాచేత తినిపించారు దానితో సంతృప్తిపడక రెస్ట్ హౌస్‌కి తీసుకుపోవడానికి మరికొన్ని కారులో పెట్టారు

స్టాలినాబాద్‌కి 15 కిలోమీటర్ల దూరంలో ఉన్న స్టాలిన్ కలక్టివ్ ఫారం చూడ్డానికి వెళ్ళాం సోవియట్ యూనియన్‌లో వ్యవసాయానికి సంబంధించినంత వరకు కలక్టివ్ ఫారాలు, స్టేట్ ఫారాలు అని రెండు రకాల వ్యవస్థలు ఉన్నాయి కలక్టివ్ ఫారం ఒక గ్రామం అయితే స్టేట్ ఫారం ఒక ఫ్యాక్టరీ అని చెప్పవచ్చు స్టేట్ ఫారం (సోవ్‌ఖోజ్)లో పనిచేసే వారికి నెలసరి జీతాలు యిస్తారు వారి జీతాలు 700 నుంచి 1100 రూబుల్సు వరకు ఉంటాయి సోవియట్ యూనియన్‌లో 80,000 కలక్టివ్ ఫారమ్స్ ఉంటాయని అంచనా దేశంలోని సగం మంది వాటిలో సభ్యులై ఉంటారు దేశంలోని వ్యవసాయ ఉత్పత్తులలో 80 శాతం వరకు కలక్టివ్స్ (కొల్‌ఖోజ్) ద్వారా జరుగుతాయి స్టాలినా బాద్‌లోని స్టాలిన్ కలక్టివ్ ఫారం 1929లో నెల కొల్పబడింది దీనిలో 3,000 ఇళ్ళు 41,000 హెక్టార్ల వ్యవసాయ భూమి 18,000 మంది జనాభా ఉంది వీరిలో 7,000 మంది కష్టపడి పనిచేయగలిగినవారు 4,900 హెక్టార్లభూమి నీటివసతితో వ్యవసాయానికి అనువైనది మిగిలినది మెట్ట భూమి ఈ ఫారంలో 3,500 హెక్టార్లు ప్రత్తి పంట క్రింద 325 హెక్టార్లు ద్రాక్షతోటలు, 328 హెక్టార్లు కూరగాయల పంటక్రింద ఉన్నాయి దీనిలో 3,000 ఆవులు ఎద్దులు, 26,000 మేకలు, గొర్రెలు 800 గుర్రాలు 11,000 కోళ్ళు, 530 తేనెటీగల సముదాయాలు ఉన్నాయి ఈ ఫారంలో 110 ట్రాక్టర్లు ఉన్నాయి

ఈ కలక్టివ్ ఫారంలో నాలుగు రకాల ప్రత్తి పండిస్తారు మొదటి రెండురకాల ప్రత్తి చాలా ఉత్తమమైనది వాటిని సంప్రదాయ పద్ధతులలో

ఉత్పత్తి చేస్తారు మిగిలిన రెండురకాల ప్రత్తి యంత్రాల సహాయంతో పండిస్తారు ప్రత్తి పంట హెక్టారుకి 4,000 కిలోల వరకు వస్తుంది కలక్టివ్ ఫారానికి ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి అధ్యక్షుడు ఎన్నుకోబడతాడు నేను వెళ్ళినప్పుడు అద్యక్షుడు శ్రీ సుల్తాన్ జమనోవ్ ఆయన 1943 నుంచి అద్యక్షుడుగా ఉంటున్నాడు

స్టాలిన్ కలక్టివ్ ఫారానికి ఏడాదికి 43 మిలియన్ రూబుల్సు రాబడి వస్తుంది దానిలో 10 శాతం ప్రభుత్వానికి పన్ను రూపంలో పోతుంది మిగిలినదానిలో 38 శాతం కలక్టివ్ ఫారం పెట్టుబడికి అబివృద్ధికి అవిబాజ్య మొత్తంగా ఉంచుతారు మిగతా 62 శాతం సభ్యులంతా పంచుకుంటారు ఈ పంపకం ప్రతి సభ్యుడు పని చేసిన రోజులను బట్టి ఉంటుంది పనిచేసిన రోజుకు మనిషికి 15 రూబుల్సు నగదు, 2 1/2 కిలోల గోధుమలు యిస్తారు ఐదుగురు పనిచేసే సభ్యులున్న కుటుంబంలో సగటున ఏడాదిలో 1700 పని రోజులు వస్తాయి దీనిలోని సభ్యులకు ఒక్కొక్కరికి 2 ఆవులు, 25 మేకలు కాని గొర్రెలు లెక్కలేనన్ని తేనెటీగలు ఒక గుర్రం ఒక గాడిద 0 12 హెక్టార్ నీటి వసతి ఉన్న భూమి అర హెక్టారు మెట్ట భూమి ఉంచుకోవడానికి అదికారం ఉంది వీటిపై ఫారానికి ఏవిదమైన అదికారం లేదు ఇవి ఆయా సభ్యుల ప్రయివేటు ఆస్తిక్రింద లెక్క వాటినివారు తమ యిష్టం ఉన్నట్టు చేసుకోవచ్చును ప్రయివేటు ఆస్తిపై చాలా హెచ్చుగా పన్నులు ఉండేవి వాటిని క్రమేపి తగ్గించారు ఇప్పుడు కలక్టివ్ ఫారంలోని ప్రయివేటు ఆస్తులపై పన్ను తీసివేసారు

కలక్టివ్ ఫారంలో ఉత్పత్తిచేసిన ప్రత్తి ఊలు, (పట్టుపురుగు ఉండేకాయలు) ప్రభుత్వానికి తప్ప మరెవ్వరికీ అమ్మకూడదు అలా అమ్మిన ప్రత్తిని కొని ప్రభుత్వం కలక్టివ్ ఫారానికి కావలసిన లారీలు, కార్లు, తదితర వ్యవసాయ యంత్రాలు యిస్తుంది స్టాలిన్ కలక్టివ్ ఫారానికి 53 లారీలు, 7 కార్లు ఉన్నాయి ఫారం అద్యక్షునికి ఒక కారు ఇచ్చారు

వ్యవసాయానికి కావలసిన విత్తనాలు ఎరువులు ట్రాక్టర్లు ప్రభుత్వం సప్లయి చేస్తుంది పాఠశాల ఉపాద్యాయులకు, వైద్యులకు జీతాలు ప్రభుత్వం యిస్తుంది ఈ కలక్టివ్ ఫారంలో 36 పాఠశాలలు ఉన్నాయి వాటిలో మూడు మద్యమస్థాయి పాఠశాలలు 181 మంది ఉపాధ్యాయులు, 4110 మంది విద్యార్థులు, వారిలో 2359 మంది బాలికలు ఒక వైద్యశాల, ఒక ప్రసూతివైద్యశాల కూడా ఉన్నాయి కుమారి లూబ (అంటే ప్రేమ అని చెప్పింది) మెడికల్ స్కూలులో చదువు పూర్తిచేసి ప్రసూతి వైద్యశాలలో నర్సుగా పనిచేస్తోంది ప్రత్తి పొలాలు పాఠశాలలు, వైద్యశాల చూచి అధ్యక్షుని

ఆతిథ్యం స్వీకరిస్తేకాని ఆయన మమ్మల్ని వదలలేదు

లెనిన్ పేరుతో ఉన్న తజిక్ స్టేట్ యూనివర్సిటీ చూడ్డానికి వెళ్ళాం ఈ విశ్వవిద్యాలయం 1949లో నెలకొల్పబడింది సోవియట్ యూనియన్‌లో ఉన్న 33 విశ్వ విద్యాలయాలలో తజిక్ యూనివర్సిటీ వయసులో చిన్నది సోవియట్ యూనియన్‌లో మొత్తం 767 పెద్దచదువులు చేప్పే వ్యవస్థలు ఉన్నాయి వాటిలో 33 యూనివర్సిటీలు ఇవి కాక 3,500 వృత్తి విద్యాసంస్థలు ఉన్నాయి తజిక్ యూనివర్సిటిలో ఆరుబోధనా శాఖలు ఉన్నాయి మొత్తం 4,000 మంది విద్యార్థుల లోను 2250 మంది పగటి పూట 600 మంది సాయంకాలం వచ్చేవారు 1200 మంది వరకు ప్రయివేటు విద్యార్థులు ఉన్నారు వీరిలో 35 శాతం విద్యార్థినులు ఉపాధ్యాయ బృందంలో ఐదుగురు అకాడమీషియన్లు ఆరుగురు ప్రొఫెసర్లు నలుగురు కరస్పాండింగ్ సభ్యులు, 83 మంది లెక్చరర్లు ఉన్నారు బోదనా బాష తజిక్ కానీ భూగర్భ శాస్త్రం మాత్రం రష్యన్ బాషలో బోదిస్తారు పదవ తరగతి చదివిన విద్యార్థులు యూనివర్శిటీలో సీటు కోసం ప్రవేశ పరీక్షలలో ఉత్తీర్ణులు కావాలి అయితే రెండేళ్ళు వృత్తి అనుబవం ఉన్నవారికి ప్రవేశ పరీక్ష లేదు యూనివర్శిటీలో ఐదుసంవత్సరాల చదువు తజకిస్తాన్‌లోని అన్ని విద్యాసంస్థలలోను రెండవ ఏడునుంచి తజిక్‌తోపాటు రష్యన్ బాష కూడా నేర్పుతారు యూనివర్సిటీలో అన్ని శాఖలలోను తజిక్ రష్యన్ బాషలలో చదువు చెప్పే ఏర్పాట్లు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి

అనాధ శరణాలయాల నుంచి వచ్చిన విద్యార్థులకు దేశ విప్లవ పోరాటంలో పాల్గొన్న తల్లిదండ్రుల పిల్లలకు పరీక్షలలో ఉత్తీర్ణులైనవారికి నూటికి 80 శాతం వరకు స్కాలర్ షిప్పులు యిస్తారు తజిక్ యూనివర్సిటీలో విద్యార్థుల తల్లిదండ్రుల పరిస్థితులతో సంబంధం లేకుండా ఉపకార వేతనాలు యిస్తారు ఈ పద్ధతి మాస్కోలో అవలంబించే పద్ధతికి బిన్నం ఉపాద్యాయ సిబ్బందికి యిచ్చే జీతాలలో కూడా తేడా ఉంది మాస్కోలో కంటె స్టాలినాబాద్‌లో 30 శాతం హెచ్చు జీతాలు వున్నాయి

అప్పటికే అనుకున్న సమయం కంటే ఒక రోజు స్టాలినాబాద్‌లో ఎక్కువ గడిపివేసాను తజికిస్తాన్ ఆకర్షణ అటువంటిది కాని మూడు రోజులు ఆనందంగా గడిపిన తరువాత స్టాలినాబాద్ వదలిపెట్టే సమయం వచ్చింది మిత్రులు తజిక్ సంగీతం ఉన్న గ్రామఫోను రికార్డులు తజిక్‌టోపి, కొన్ని పుస్తకాలు బహూకరించారు సాయంకాలం గం 4-10 విమానంలో స్టాలినాబాద్ నుంచి తాష్‌కెంట్‌కి ప్రయాణం మిత్రులంతా విమానాశ్రయానికి వచ్చారు వారి ఆప్యాయత, స్నేహబావం, అతిదృ మర్యాదలు నన్ను ముగ్ధుణ్ణి

చేసాయి ఏదో చాలా ప్రియమైన ప్రదేశాన్ని వదలిపెడుతున్నట్టుగా బాధపడ్డాను సాయంకాలం ఏడుగంటలకు తాష్కెంటు చేరాం చిత్రం ఏమిటంటే వెళ్ళేటప్పుడు ప్రయాణం ఐదు గంటలు పట్టింది తిరుగుప్రయాణం మూడు గంటలలో అయిపోయింది ఇన్‌టూరిస్టు అధికారి విమానాశ్రయానికి వచ్చాడు తాష్కెంట్‌కి చాలా దూరంలో ఉన్న రెస్ట్‌హౌస్‌కి వెళ్ళి తొందరగా డ్రస్ మార్చుకొని నగరంలో బాతే చూడ్డానికి వెళ్ళాం అది అంతంత మాత్రంగా ఉంది

తజికిస్తాన్ వెళ్ళేముందు తాష్కెంట్‌లో ఒక రాత్రి గడిపాను కాని తిరుగు ప్రయాణంలో ఈ పట్టణంలో బోలెడు కార్యక్రమాలు ఏర్పాటుచేసారు తాష్కెంట్ అంటే 'రాతినగరం' అని అర్థం అట అది ఉజ్బెకిస్తాన్‌కి ముఖ్యపట్టణమేకాక మధ్య ఆసియాలోని ఐదు రిపబ్లిక్స్‌కి ముఖ్యమైన నగరం ఈ ప్రాంతంలో 20 మిలియన్ల ముస్లిములు ఉన్నట్టు అంచనా ఇక్కడ స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు ఉన్నాయి ముస్లిం బాలికలంతా పాఠశాలలకు వెళ్ళడం తప్పనిసరయితే నగరంలోని కొన్నిప్రాంతాలలో బురఖా వేసుకుని తిరిగే ముస్లిం మహిళలు కనుపించారు తాష్కెంట్‌లో ప్రార్థనలు జరిగే పది పెద్ద మసీదులు ఉన్నాయి అవి కాక అనేక చిన్న ప్రార్థనామందిరాలు ఉన్నాయి రెండు మదరసాలు కూడా ఉన్నాయి సోవియట్ యూనియన్ ప్రభుత్వ విధానంలో మతానికి స్థానంలేదు అందుమూలంగా ప్రభుత్వం మసీదు భవన నిర్మాణానికి ఆర్థిక సహాయం చేయదు కాని వారికి రవాణా సౌకర్యాలు కల్పించడంలో సహాయపడుతుంది ప్రభుత్వంతో సంబంధాలు చక్కగా ఉండేటట్టు చూడడానికి ఒక ముస్లిం ఆధ్యాత్మిక కమిటీని మంత్రివర్గంలో బాగంగా ఉంచారు కొన్ని ముస్లిం పండుగల సందర్భంగా 20 వేల మంది వరకు ముస్లిములు మసీదులకు ప్రార్థనలకు వెళతారు ఒక మసీదు చూడ్డానికి వెళ్ళాను ఆ దారిలో చిన్న సందులు, మట్టి గోడల ఇళ్ళు బారతదేశంలోని గ్రామాలను గుర్తుచేసాయి ఆ మసీదు 16 వ శతాబ్దంలో నిర్మించారు అది ప్రస్తుతం ప్రభుత్వ పరిరక్షణలో చరిత్రాత్మక చిహ్నంగా ఉంది కాని దానికి ఎదురుగా ఉన్న మసీదులో ప్రార్థనలు జరుగుతాయన్నారు దాని లోపలికి వెళ్ళాను బారతదేశంలో అనేకమసీదులు చూసినవాళ్ళకు ఆ మసీదు వసారా ఇల్లు లాగ కనిపిస్తుంది

సోవియట్ యూనియన్‌లోని ఆసియన్ రిపబ్లిక్స్‌లో హెచ్చు జనాభా ముస్లిములు కావడం వల్ల వారి జీవన విధానంలో ముస్లిం సాంస్కృతిక ప్రబావం కనుపిస్తుంది వాటిలో 'చాయ్‌ఖానా' ఒకటి చాలా ప్రాంతాలలో ప్రజలు తమ పనులు పూర్తి అయిన తరువాత టీ షాపు వద్ద కూర్చుని టీ

త్రాగుతూ సిగరెట్లు కాలుస్తూ కబుర్లాడుకోవడం కనిపిస్తుంది ఆ చాయ్ ఖానా నిర్మాణం చూస్తే కాశ్మీర్‌లోని కిళ్ళీబడ్డీలు గుర్తుకువచ్చాయి నేను మసీదులు చాయ్‌ఖానా ఫొటోగ్రాఫులు తీయడం కామరాఫ్‌కి మాతో వచ్చిన టక్స్ ప్రతినిధికి అంతగా నచ్చలేదు కాని కాదనలేకపోయారు

తాష్కెంట్ కార్యక్రమాల్లో టెక్స్‌టైల్ కంబైన్ చూడ్డం, ఉజ్బెకిస్తాన్ ఉప ముఖ్యమంత్రిని కలుసుకోవడం ముఖ్యమైనవి స్టాలిన్ పేరుతో ఉన్న తాష్కెంట్ టెక్స్‌టైల్ కంబైన్ 100 హెక్టార్ల స్థలంలో నిర్మించబడ్డ బ్రహ్మాండమైన నేత పరిశ్రమాగారం ఈ ఫ్యాక్టరీ 1932లో నెలకొల్పబడింది దీనిలో 3 నూలు 2 నేత, ఒక ఫినిషింగ్ ఒక దారం ఫ్యాక్టరీ ఉన్నాయి దీనిలో పనిచేసే కార్మికులు, సిబ్బంది కలిసి 20 వేలమంది ఉన్నారు వీరంతా రోజుకి మూడు షిఫ్టులుగా పని చేస్తారు వీరిలో 75 శాతం స్త్రీలు, వీరంతా రోజుకి 8 గంటలు పనిచేస్తారు ఈ ఫ్యాక్టరీకి రోజుకి 70 నుంచి 80 టన్నుల శుద్ధిచేసిన ప్రత్తి కావలసి ఉంటుంది దీనిలో6,000 మగ్గాలు 420 వేల స్పిండిల్స్ ఉన్నాయి ఈ ఫ్యాక్టరీలో ఏడాదికి 200 మిలియను మీటర్లగుడ్డ ఉత్పత్తి అవుతుంది డైరెక్టరు శ్రీ జిక్రుల్లా అబ్దుల్లహేవ్ మాకు తన సామ్రాజ్యం అంతా సగర్వంగా చూపించాడు తాష్కెంట్‌లో ఇది ఒక్కటే టెక్స్‌టైల్ ఫ్యాక్టరీ అని ఇది ఉజ్బెకిస్థాన్‌లో ఉన్న అన్ని ఫ్యాక్టరీల కంటే పెద్దదని చెప్పారు పనివారి జీతాలు, వారికి గృహవసతి, వైద్యసదుపాయాలు వారి పిల్లలకు విద్యాసౌకర్యాల వివరాలు చెప్పారు కొద్ది ప్రాంతీయ భేదాలతో ఈ వివరాలు చాలా వరకు సోవియట్ యూనియన్ అంతా ఒకే రకంగా ఉంటాయి మేము ఫ్యాక్టరీ నుంచి బైటకు వచ్చేముందు దానిలో తయారైన కార్డ్‌రాయ్ కొన్ని గజాల గుడ్డ బహుమతిగా ఇచ్చారు ఈ ఫ్యాక్టరీలో ఉత్పత్తి అయిన గుడ్డ చాలావరకు ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, మిత్రరాజ్యాలు, సోవియట్ యూనియన్‌లోని ఇతర రిపబ్లిక్‌లకు ఎగుమతి చేస్తారు

శ్రీ మీర్జా మహముదోనియో మునవానోవ్ ఉజ్బెకిస్తాన్ రిపబ్లిక్ ఉపముఖ్యమంత్రి మధ్యవయస్కుడు మతవిషయాలపై సమాధానాలు చెప్పడానికి కొంచెం సందేహించినా మిగిలిన అన్ని విషయాలమీద సమాచారం క్షుణ్ణంగా తెలుసును ఆయన భార్య కూడా ఉజ్బెక్, వారికి నలుగురు పిల్లలు ఆయన టెక్స్‌టైల్ ఇంజనీరు టెక్స్‌టైల్ కంబైన్‌లో కార్మికుడుగా పనిచేసి, అసిస్టెంట్ మాష్టరు, మాష్టరు, మేనేజరు, ఛీఫ్ ఇంజనీరు, డైరెక్టరు ఉద్యోగాలు చేసి నేను కలుసుకోవడానికి రెండేళ్ళ ముందు టెక్స్‌టైల్ పరిశ్రమశాఖ మంత్రి అయినట్టు చెప్పారు స్టేట్ ప్లానింగ్ బోర్డు అధ్యక్షుడు కూడా ఆయనకు నెలకు 5,000 రూబుల్సు జీతం వస్తుంది

ఉజ్బెక్‌రిపబ్లిక్ 1942 లో స్థాపించబడింది ఆయనతో కూర్చున్నంతసేపు ఉజ్బెకిస్తాన్ యొక్క సర్వతోముఖాభివృద్ధిని వివిధ రంగాలలో సాధించిన ప్రగతిని చాలా వివరంగా చెప్పారు సోవియట్ యూనియన్‌లో ఎక్కడికి వెళ్ళినా విప్లవానికి ముందు ఉన్న పరిస్థితితో పోలుస్తూ తాము సాధించిన ప్రగతిని చెప్పడం అలవాటు వారు సాధించిన విజయాలు, ప్రగతి అద్భుతం ఉజ్బెకిస్తాన్ ప్రత్తిపంటకు ప్రసిద్ధి సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తి అయ్యే మొత్తం ప్రత్తిలో 60 శాతం ఈ రిపబ్లిక్‌లో పండుతుంది తమ రిపబ్లిక్‌లో 120 రకాల ద్రాక్షలు పండిస్తామని చెబుతూ బోలెడు రకాలు మాముందు పెట్టారు రుచి చూడడానికి వైన్స్, బ్రాంది బీరు, ఓడ్కా తయారు చేయడంలో తమది ప్రధమ స్థానం అన్నారు

రిపబ్లిక్ బడ్జెట్ 5,400 మిలియన్ రూబుల్సు హంగ్రీ స్టెప్పిస్ ప్రాంతంలో 3 లక్షల హెక్టార్ల భూమిని సేద్యంలోకి తేవాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి దాని మూలంగా 320 వేల టన్నుల ప్రత్తి అధికంగా ఉత్పత్తి చేయవచ్చు ఆయన వద్ద సెలవు తీసుకుని రెస్ట్‌హౌస్‌కి వెళ్ళాం ఆ రాత్రి గం 9-00 (మాస్కో సమయం 6గంటలు) తాష్కెంట్ నుంచి అజర్బయిజాన్ రిపబ్లిక్ ముఖ్య పట్టణం బాకూకి బయలు దేరాం ఇన్ టూరిస్టు, ఓక్సు ప్రతినిదులు మాకు విమానాశ్రయం వద్ద వీడ్కోలు చెప్పారు 'మళ్ళారండి' అనేది ఎక్కడికి వెళ్ళినా వినిపించే నినాదం అనిపించింది

అజర్బయిజాన్ రిపబ్లిక్ ముఖ్యపట్టణమైన బాకూ విమానాశ్రయంలో రాత్రి గం2-15 లకి దిగాం ఆ సమయంలో కూడా మమ్మల్ని ఆహ్వానించడానికి నలుగురు పెద్దమనుషులు విమానాశ్రయంలో మాకోసం ఎదురుచూస్తున్నారు వారిలో ఇద్దరు అకాడమీ ఆఫ్ సైన్సెస్‌కి చెందిన అకడమీషియన్లు భూగర్భ శాస్త్రవేత్త, అకాడమీ ఆఫ్ సైన్సెస్ కార్యదర్శి డా॥ మీర్ అలికాష్కై, వైద్యశాస్త్ర నిపుణుడు ఆసియా దేశాలతో మైత్రీ సంబందాల సోవియట్ కమిటీ సభ్యుడు ప్రొఫెసర్ ముస్తఫా టోప్చెల్‌సషేవ్ మిగిలిన ఇద్దరూ ఇన్ టూరిస్టు ప్రతినిదులు విమానాశ్రయం నుంచి సిటీకి 36 కిలో మీటర్ల దూరం తెల్లవారుఝాము మూడు గంటలకు ఇన్ టూరిస్ట్ హోటల్‌కి చేరాం ఆ హోటల్ పురానా ఖిల్లా(కోట) ఆవరణలో ఉంది ఎదురుగా కాస్పియన్ సముద్రం పట్టణ శివార్లు పెట్రోలు వాసన కొడుతున్నాయి చాలా వేడిగా ఉంది నిద్రపోవడానికి చేసిన ప్రయత్నం ఫలించలేదు మిత్రుడు ఎరిక్ కామరాఫ్ ఎదురుగా కనిపించే సముద్రాన్ని చూచి బొంబాయిలోని మెరీన్ డ్రైవ్‌ని గుర్తు చేస్తోందన్నాడు

అదేరోజు ఉదయం గం 11-00 లకు అజర్బయిజాన్ సోవియట్

సోషలిస్టు రిపబ్లిక్ సుప్రీం సోవియట్ అధ్యక్షుడు మీర్జా ఇబ్రహిమోవ్‌తో సమావేశం ఏర్పాటు చేసారు రిపబ్లిక్ అధ్యక్షుడు భారతదేశం నుంచి అతిథివచ్చాడు మీరంతా ఆయన్ని కలుసుక్కోవాలని చెప్పి తన మంత్రివర్గ సభ్యులనందరినీ ఆహ్వా[illegible]టు అది ఒక పెద్ద సమావేశంగా తయారయింది రిపబ్లిక్ అధ్యక్షుడు తన ఆత్మకథ చెబుతూ తన7వ ఏట తండ్రి పోవడం, తాను అనాధకావడం, వ్యవసాయరంగంలో రోజుకూలీ పనిచేయడం, మొదలైన కష్టాల[illegible]డి చివరకు రిపబ్లిక్ అధ్యక్షపదవి అలంకరించానన్నారు తనకు ఇటువంటి అవకాశం యిచ్చిన రిపబ్లిక్ అంటే ఆయనకు ఎనలేని ప్రేమ అజర్బయిజాన్ [illegible] కావడానికి ముందు ఆయన రచయితల సంఘం అద్యక్షుడుగా ఉండేవాడట ఆయన నాటక రచయితగా మంచి పేరు సంపాదించుకున్నారు భారతదేశంలోని జీవన విధానాన్ని ప్రతిబింబించే "చంద్ర" అనే కథకూడా వ్రాసారట ఆయన 1954లో అధ్యక్షపదవికి వచ్చారు ఒక అధ్యక్షపదవి నుంచి మరొక అధ్యక్ష పదవికి అని చమత్కరించాడు ఆ సమావేశంలో ముగ్గురు మహిళలను చూపించి వారంతా పరదాలో ఉండే తల్లుల పిల్లలన్నారు ఇప్పటికీ కొంతమంది తల్లులు పరదాలో ఉండవచ్చునన్నారు ఆ మహిళలలో ఆకిమా సుల్తానోవా డెప్యూటీ ప్రధానమంత్రి జరీఫా ఘుకురోవా, అధ్యక్షుని కార్యదర్శి, తైరాతైరోవా ఎకనామిక్ కౌన్సిల్ యొక్క విజ్ఞాన సాంకేతిక శాఖ అధ్యక్షురాలు అధ్యక్షుడు రెండుసార్లు భారతదేశం వెళ్ళి వచ్చారు తనకు మహాత్మాగాంధీని చూచే మహద్భాగ్యం కలిగిందని ఎంతో గర్వంగా చెప్పారు అందుకేనేమో ఒక బారతీయ అతిధికి వారు చేస్తున్న అపూర్వ అతిధిమర్యాదలు అనుకున్నాను

అజర్బయిజాన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ ఏప్రిల్ 1920లో నెలకొల్పబడింది కిరోఫ్ నాయకత్వంలో కకేషియన్ ప్రాంతంలో వచ్చిన విప్లవంలో విజయం సాధించిన తరువాత సోవియట్ యూనియన్‌లోని అన్ని ప్రాంతాలవలెనే అజర్బయిజాన్ కూడా బ్రహ్మాండమైన ప్రగతిని సాధించింది బాకూలోని చమురు పరిశ్రమ ప్రపంచంలో కల్లా అత్యుత్తమమైనదట బాకూలో చమురు నిక్షిపాల అన్వేషణ ప్రధమదశలో వారు అమెరికానుంచి డ్రిల్లింగ్ రిగ్గులు తెచ్చుకునేవారు ఇప్పుడు వారు తమ స్వంతయంత్రాలు తయారు చేసుకుంటున్నారు అంతేకాదు వాటి నమూనాల కోసం అమెరికన్లు అడుగుతున్నారట రిపబ్లిక్ అధ్యక్షుడు తన దేశ సౌబాగ్యం ప్రగతిని గురించి ఎంతో గర్వంగా చెప్పారు ఇక విద్య, ఆరోగ్యం పరిశ్రమలు ప్రజల జీవన నదుపాయాల విషయంలో తమ ప్రభుత్వం చేస్తున్న కృషిని వివరించారు అంతా టీ త్రాగుతున్నాం ఇండియన్ టీ కంటే వారి టీ బాగా ఉంటుందనే

విషయంలో ఆయనతో ఏకీభవించలేకపోయాను అధ్యక్షుడు భారతదేశానికి అజర్బయిజాన్‌తో ఉన్న పురాతన సంబంధాలు చెప్పారు ప్రస్తుత కాలంలో భారతదేశం నుంచి బాకూ చమురు పరిశ్రమలో ప్రత్యక్ష అనుభవం కోసం విద్యార్థులు వెళుతూ ఉంటారు అధ్యక్షుడు మీర్జా ఇబ్రహిమోవ్ ఆయన మంత్రివర్గ సభ్యులతో జరిపిన సమావేశం చాలా సంతృప్తిగా ఉంది జాతకాల మీద నమ్మకం ఉన్నవారికి ఆ సమావేశం రాజయోగం అనిపిస్తుంది

కాస్పియన్ సముద్రం, నల్లసముద్రం మధ్యనున్న భూభాగం చాలా శక్తి వంతమైన అందమైన కాకసస్ ప్రదేశం బ్రహ్మాండమైన పర్వతాలు, సమతల భూభాగం ఆసియా యూరోప్‌ల కలయిక ప్రదేశం ఈ కాకసస్‌లో ఉన్న జార్జియా, ఆర్మీనియా అజర్బయిజాన్ రిపబ్లిక్స్‌లో 9 మిలియన్ల ప్రజలున్నారు సోవియట్‌రష్యా మొత్తంలో కాకసస్ ప్రాంతం అత్యంత సౌభాగ్యవంతమైనది దానికి కారణం అక్కడ లభ్యమయ్యే పెట్రోలియం కాస్పియన్ సముద్రతీరంలో ఉన్న అజర్బయిజాన్ నీటి వసతి లేని స్టెప్పీ లేక చాలా వరకు ఎడారి ప్రాంతం ఇక్కడి ప్రజలంతా చాలా వరకు ముస్లిములే 75 శాతంమంది టర్కిష్ జాతివారి సంతతి అజర్బయిజాన్ సరిహద్దు కొంత భాగం ఇరాన్‌తో ఉంది ఈ ప్రాంతంలో అపారమయిన ఆయిలు నిక్షేపాల తోపాటు ప్రత్తి పంట కూడా ఉంది నిజానికి ఉజ్బెకిస్తాన్ తరువాత ప్రత్తిపంట ఈ రాష్ట్రంలో చాలా హెచ్చు

బాకూ ఆసియా అంచులమీదనున్న యూరోపియన్ పట్టణంలా ఉంటుంది నిజానికి దానికి అమెరికన్ కళలు హెచ్చుగా ఉన్నాయి ...టునుంచి చూచినా ఆయిల్ యంత్రాలు సముద్రంలో రిగ్గులు కనిపిస్తాయి ...త్రం ఏమిటంటే బాకూ తన ప్రాముఖ్యతను తెలుసుకున్న పట్టణంలా రీవి ...లకబోస్తుంది

బాకూ అనే పర్షియన్ మాటకు అర్థం గాలుల పట్టణం అట పట్టణం చూడ్డానికి వెళ్ళాం, చిన్న కొండమీద విప్లవ నాయకుడు కిరోఫ్ నిలువెత్తు విగ్రహం ఉంది అక్కడ నుంచి బాకూ పట్టణం, హార్బర్ దృశ్యం చాలా చక్కగా ఉంది కాని ఫొటోలు నిషేధం అన్నారు పట్టణంలో అనేక పాత భవనాలు పడగొట్టి కొత్తభవన నిర్మాణం జరుగుతోంది చిత్రం ఏమిటంటే పురుషులుకాని స్త్రీలుకాని వారి సంప్రదాయసిద్ధమైన దుస్తులలో లేరు అంతా పాశ్చాత్య వేషాలే! ఆయిల్ రిఫైనరీ చూడ్డానికి వెళ్ళాం, ఆ భవన ప్రవేశ ద్వారం వద్ద ఉన్న నోటీసు నన్ను ఆశ్చర్యపరచింది పారిశ్రామిక ఉత్పత్తిలో బాకూకి తాష్కెంట్‌కి సోషలిస్టు పోటీ ఉందని నోటీసు ఆ రిఫైనరీ 1953 లో నెలకొల్పారట దానిలో2000 మంది సిబ్బంది దాని డైరెక్టరు రిఫైనరీ ఆవరణ

చూపించి విమానాలకు, మోటారుకార్లకు కావలసిన పెట్రోలు, డీసెల్, కిరసనాయిలు ముడిచమురులో నుంచి తీస్తామని చెప్పారు ఆ ఫ్యాక్టరీ 5 మిలియనుటున్నుల ముడి చమురు శుద్ధి చేస్తుందట రిఫైనరీ వద్దకు తీసుకువెళ్ళి ఏవో బోలెడు సాంకేతిక విషయాలు చెప్పాడు నాకు అర్థం అయినదల్లా ఆయిల్ శుద్ధి కార్యక్రమం కేటలైజర్స్‌తో జరుగుతుందన్న విషయం అదంతా బ్రహ్మాండమైన వేడిలో జరుగుతున్నందున్న మాకు చూడ్డానికి ఏమీ లేకపోయింది అంతకంటే మా హోటల్ ముందు సముద్రంలో ఉన్న ఒడ్డు నుంచి రిగ్గులు, డ్రిల్లింగు చూడ్డం చాలా సరదాగా ఉంది ఒడ్డు నుంచి రిగ్గు వరకు సన్నటి వంతెనలు నిర్మించారు నడిచి వెళ్ళడానికి వీలుగా

ఆ సాయంకాలం అజర్బయిజ్ కవి నిజామీ వ్రాసిన పద్యాన్ని బాలేగా తీర్చిదిద్దిన"ఏడుగురు అందగత్తెలు" అనే బాలే చూడ్డానికి వెళ్ళాం దానిలో ఒక అందకత్తె భారతీయ యువతి కావడం నిజామీ కవితలోని ప్రత్యేకత అప్పుడు భారతదేశంలో కేంద్ర ప్రభుత్వంలో రక్షణశాఖ స్టేట్ మంత్రిగా ఉన్న శ్రీ మహావీర్ త్యాగి కూడా బాకూలో ఉన్నారట ఆయన కూడా బాలే చూడ్డానికి వచ్చారు నేను ఆయన్ని అప్పుడు దూరం నుంచి చూడ్డమేకాని కలుసుకోలేదు ఆయన కార్యక్రమం చివరి వరకు కూర్చోలేదు బాలే బాగుంది వారంతా మంచి డాన్సర్లు కార్యక్రమం రాత్రి12 కి పూర్తి అయింది

అజర్బయిజాన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ సభ్యులతో సమావేశం ఉదయం 10 గంటలకు ఏర్పాటు చేసారు ఇన్ టూరిస్టు అధికారి, ఓక్స్ అధికారి, అకడమీషియన్లు పదికార్లలో హోటల్‌కి వచ్చారు ఆ హడావిడి అంతా దేనికో నాకు అర్థం కాలేదు నేను సోవియట్ యూనియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ అతిథిని కాబట్టి అజర్బయిజాన్ శాఖవారు నన్ను సన్మానించబోతున్నారని మిత్రుడు కామరాఫ్ చెప్పాడు హోటల్‌నుంచి పది కార్లలో బయలుదేరి ఊరేగింపులా అకాడమీ భవనానికి చేరాం అకాడమీ అధ్యక్షుడు డా మూసా అలిఏవ్, కార్యదర్శి మీర్ అలీ కష్కాయ్ ఎంతో ఆప్యాయంగా, ఆదరంగా ఆహ్వానించారు అక్కడ అంతకు ముందే సమావేశానికి వచ్చిన శ్రీ మహావీర్ త్యాగి ఉన్నారు ఆయన 10 గంటల కంటే ముందుగా అకాడమీ భవనానికి వెళ్ళారు అధ్యక్షుడు కార్యదర్శి, సభ్యులు అంతా ఉన్నారు కాని కార్యక్రమం ప్రారంభించడం లేదు ఉండబట్టలేక ఆలస్యానికి కారణం అడిగాడట భారతదేశంనుంచి వచ్చిన డా మూర్తి ముఖ్య అతిథి అని, ఆయన రాకకోసం ఎదురుచూస్తున్నామని చెప్పారట శ్రీ త్యాగికి అర్థం కాలేదు తాను భారత ప్రభుత్వంలో రక్షణ మంత్రిత్వ శాఖ స్టేట్ మంత్రి తనకంటే పెద్ద మంత్రులెవరూ ఆ సమయంలో సోవియట్ యూనియన్‌లో లేరు ఆ పరిస్థితిలో

తనకంటే ముఖ్యమైన భారతీయ అతిధికోసం వారంతా ఎదురు చూస్తున్నారంటే ఆయనకు అంతుచిక్కలేదు అంతలో నేను హాలులో అడుగుపెట్టాను అరుగో మా ముఖ్య అతిధి వచ్చాడన్నారు అధ్యక్షుల వారు శ్రీ త్యాగి నన్ను చూడగానే ఆశ్చర్యపోయి "ఓహో మీరా" అని మాత్రం అనగలిగారు

ఈ సందర్భంలో ఒక చిన్న విషయం చెప్పాలి నేను నెహ్రూ నాయకత్వంలోని కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ ఆఫీసులో పనిచేసే రోజుల్లో శ్రీ త్యాగితోపాటు పార్లమెంటు సభ్యులందరికీ సుపరిచితుణ్ణి డాక్టరు మూర్తి అని చెబితే గుర్తురాలేదు కాని నన్ను చూడగానే గుర్తుపట్టారు అయితే తమ ఆఫీసులో చిన్న ఉద్యోగం చేసే మూర్తికి సోవియట్ యూనియన్‌లో అజర్బయిజాన్ రిపబ్లిక్‌లో తనకంటే హెచ్చు గౌరవ మర్యాదలు జరపడంలోని రహస్యం ఏమిటో ఆయనకు అర్థం కాలేదు ఇక అకాడమీ అధ్యక్షుడు డా మూసా అలిఏవ్ నా'గొప్పతనం' విశిష్టత ఇంకా ఏవో బోలెడు ప్రశంసాపూర్వకమైన భావాలు వ్యక్తం చేసారు నన్ను సోవియట్ అకాడమి ఆఫ్ సైన్సెస్ తమ అతిధిగా అంగీకరించడమే నా గొప్పతనానికి నిదర్శనమన్నారు ఆ పొగడ్తలు వింటున్నంతసేపూ నాకూ ఆశ్చర్యంగానే ఉంది ఇక శ్రీ త్యాగి మాట వేరే చెప్పనక్కరలేదు దానికి తోడు నాకు సన్మానం అని నలుగురు అకడమీషియన్లు ఉపన్యాసాలు చెప్పి బహుమతులు ఇచ్చారు

నాకు జరిగిన గౌరవానికి సమాధానం చెప్పవలసిన సమయం వచ్చింది అప్పుడు నేను ఇబ్బందిలో పడ్డాను అక్కడ భారతప్రభుత్వ మంత్రి సీనియర్ రాజకీయ నాయకుడు కూర్చుని ఉండగా నేను భారత సోవియట్ సంబంధాలను గురించి ఉపన్యసించడం సమంజసమనిపించలేదు నాకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు తెలుపుతూ భారతదేశం తరఫున శ్రీత్యాగి మాట్లాడతారని చెప్పి కూర్చున్నాను అంతవరకు కొంచెం ఇబ్బందిగా కూర్చున్న త్యాగికి ఈ మాట వినేసరికి మొహంలో కళ వచ్చింది ఆయన ఉపన్యసించాడు నా పక్షాన తనను మాట్లాడమని కోరినందుకు ఆయన చాలా సంతోషించాడు ఆ ఉత్సాహంలో ఆయన కూడా నా గురించి మంచి మాటలు చెప్పాడు ఇదంతా మూర్తికి పట్టిన మహారాజయోగం అన్నాడు

అకాడమీ అధ్యక్షుడు తమ ఉపన్యాసంలో విజ్ఞానశాస్త్ర ప్రగతిలో తమ అకాడమీ యొక్క పాత్రను గూర్చి విపులంగా చెప్పారు బారతదేశానికి అజర్బయిజాన్‌కి ఉన్న ఆర్థిక వ్యాపార, సాంస్కృతిక చరిత్రాత్మక సంబంధాలు వివరించారు పూర్వకాలంలో భారత వ్యాపారులకు

అజర్బయిజాన్ మార్కెట్లలో ప్రత్యేక స్థానం ఉండేదట ప్రముఖ అజర్బయిజాన్ కవి నిజామి రచనలను గూర్చి తప్లావి హోప్రావ్ తన గ్రంథంలో వ్రాసాడు కొందరు అజర్బయిజాన్ రచయితలు బారతదేశంలోనే ఉండిపోయి రచనలు చేస్తూ జీవితాలు వెళ్ళబుచ్చారు

1925 లో బాకూలో ప్రప్రథమంగా కొద్దిమంది విజ్ఞానవేత్తలు కలిసి చిన్న సంఘంగా పెట్టుకున్నారు 1935లో సోవియట్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ యొక్క భాగం అయింది 1945 లో అజర్బయిజాన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ అనే సంస్థను రూపొందించారు ఈ రిపబ్లిక్‌లో 74 విజ్ఞాన శాస్త్రానికి, రిసెర్చికి సంబంధించిన సంస్థలు ఉన్నాయి 1700 మంది విజ్ఞానవేత్తలు రిపబ్లిక్‌లో పనిచేస్తున్నారు అకాడమీలో 2200 మంది పనిచేస్తున్నారు వారిలో 1000 మంది సైంటిఫిక్ సిబ్బంది 460 మంది డాక్టరేట్లు ఉన్న కాండిడేట్‌లు 13 సంస్థలు 5 సైన్సు కేంద్రాలు అకాడమీకి అనుబంధంగా ఉన్నాయి అకాడమీ ఐదు ప్రత్యేక శాఖలలో రిసెర్చి కార్యకలాపాలు చేస్తుంది అకాడమీ ప్రిసీడియంలో 9 మంది సభ్యులు ఉంటారు వారు ఒక అధ్యక్షుడు, నలుగురు ఉపాధ్యక్షులు, ఒక కార్యదర్శి, ముగ్గురు ప్రముఖ విజ్ఞానవేత్తలు వారి రీసెర్చి కార్యకలాపాలలో చమురు పరిశ్రమకు ప్రత్యేక స్థానం వారికి స్వంత ప్రచురణ విభాగం ఉంది ఏడాదికి 1500 పుస్తకాల వరకు వారు ప్రచురిస్తారు అధ్యక్షుని అభిమానశాఖ భూగర్భ శాస్త్రం అకాడమీ పనిలో300 మంది మహిళా విజ్ఞానవేత్తలు పని చేస్తారు

అక్కడ నుంచి చారిత్రాత్మక మ్యూజియంకి వెళ్ళాం దానిలో ఉన్న పురాతన వస్తువులన్నీ అపూర్వంగా ఉన్నాయి అక్కడ ఉన్న పుస్తకంలో ఆ మ్యూజియం గురించిన అభిప్రాయం నా మాతృభాషలో వ్రాయమన్నారు తెలుగులో నాలుగు వాక్యాలు వ్రాయడానికి ఇబ్బంది పడిపోయాను ఆ సాయంకాలం 12 వ శతాబ్దంలో జీవించిన కవి రచయిత నిజామి మ్యూజియం చూడ్డానికి వెళ్ళాం నిజామి వ్రాసిన 5 పద్యకావ్యాలు చాలా ప్రసిద్ధికెక్కినవి లైలా మజ్నూ, ఎడుగురు అందగత్తెలు, అలెగ్జాండర్, ప్రేమ, రాజ్యపరిపాలన అక్కడ నుంచి సాంస్కృతిక మంత్రిత్వశాఖవారి ప్రత్యేక సినిమా హాలుకివెళ్ళి "ఆయిల్ మాన్ ఆఫ్ కాస్పి" అనే డాక్యుమెంటరీ చూసాం దానిని కార్మన్ ప్రొడ్యూస్ చేసాడు అద్భుతంగా ఉంది మేము నలుగురమే కూర్చుని అంత మంచి ఫిల్ము చూసి ఆనందించాం ఆ తరువాత అజర్బయిజాన్ భాషలో తీసిన సంగీత హాస్య ఫిల్ము చూపించారు ఆ ఫిల్ము పేరు "ఈ భార్య కాకపోతే మరొక భార్య " ఒక మాదిరిగా ఉంది స్టాలినాబాద్‌లో తజిక్ భాషలో చూసిన హాస్యచిత్రంతో పోల్చడానికిలేదు చిత్రం ఏమిటంటే రష్యన్ భాషలో హాస్య

చిత్రాలు తక్కువ కాని ఆసియన్ రిపబ్లిక్స్ ప్రజల జీవితాలలో హాస్యం పాలు హెచ్చునే చెప్పాలి

రాత్రి గం 11-35 బాకూ టైమ్ (గం 10-35 మాస్కో సమయం) కి బాకూ వదలిపెట్టాం విమానంలో రాత్రంతా నిద్రపట్టలేదు ఉదయం గం 6-55కి మాస్కో చేరాను

మాస్కోలో ఇన్ టూరిస్టు అధికారులు నా మకాం సావాయ్ హోటల్‌లో ఏర్పాటు చేసారు నేను మొదట మాస్కో వెళ్ళినప్పుడు దిగిన లెనిన్‌గ్రాడ్ స్కాయా హోటల్‌తో పోలిస్తే సావాయ్ పురాతనభవనంలా ఉంది ఇన్ టూరిస్టు వ్యవస్థకు మాస్కోలో నాలుగు హోటళ్ళు ఉన్నాయి వాటిలో సావాయ్ ఒకటి ఇవికాక మాస్కోవా, యూక్రేన్ పెకింగ్ మొదలగు ఆధునాతన ఫైవ్ స్టార్ హోటళ్ళు కూడా ఉన్నాయి ప్రభుత్వంలో విదేశ వ్యాపార శాఖలో ఇన్ టూరిస్టు ఒక బాగం లెనిన్‌గ్రాడ్ స్కాయా హోటల్‌కి వెళ్ళి నా సూట్‌కేసులు తెచ్చుకున్నాను ఇక సోవియట్ యూనియన్ వదలిపెట్టే సమయం దగ్గర పడింది మాస్కోనుంచి పోలెండ్ ముఖ్యపట్టణమైన వార్సా వెళ్ళాలని ఆలోచన మిత్రుడు లుబెల్స్కీకి జాబు వ్రాసాను వార్సాలో ఉన్న నాలుగు రోజులు వాళ్ళ ఇంట్లో ఉండటానికి వీలు ఉంటుందేమోనని ఆశపడ్డాను మన దేశంలో అయితే బంధువులుకాని మిత్రులు కాని పొరుగూరు వెళ్ళేటప్పుడు అక్కడ ఎవరైనా బంధువులుకాని ఆప్త మిత్రులు కాని ఉన్నారేమో గుర్తుచేసుకుని బెడ్డింగ్‌తో వెళ్ళి వాళ్ళ ఇంట్లోదిగడం ఆచారం వారికి ముందుగా జాబు వ్రాయడం చాలా తక్కువమంది చేస్తారు మనం అలా చెప్పాపెట్టకుండా దిగితే ఆ బంధువుకాని మిత్రుడుకాని ఇబ్బంది పడతాడేమోననే ఆలోచనరాదు ఎలాగో సర్దుకుంటాం ఆ ఆప్యాయత అటువంటిది

నాకు సోవియట్ యూనియన్‌లో ఆతిధ్యం ఇచ్చిన అకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో భాగమైన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓరియంటాలజిస్ట్స్ నిపుణులతో ఆనాడు ఏర్పాటు చేసిన సమావేశం కారణాంతరాల మూలంగా వాయిదా వేయబడింది అందుమూలంగా సమయం వృధాచేయకుండా క్రెమ్లిన్ చూడ్డానికి వెళ్ళాను

క్రెమ్లిన్ అనే మాటకు అర్థం కోట లేక దుర్గం అది అత్యంత అద్భుతమైన కట్టడం దానిలోని భవనాలు, చర్చిలు, గోపురాలు, శిఖరాలు, బురుజులు, నయనానందకరంగా ఉన్నాయి దాని చుట్టూ ఉన్న ఎర్రగోడ, పంథొమ్మిది శిఖరాలు ఆకర్షణీయంగా ఉన్నాయి క్రెమ్లిన్ గోడ 15 వ శతాబ్దంలో ముగ్గురు ఇటాలియన్ శిల్పులు నిర్మించారు మరొక ఇటాలియన్ క్రెమ్లిన్‌లోని అత్యంత

విశాలమైన, సుందరమైన ఉస్పెన్‌స్కి చర్చి 1475-79 లో నిర్మించాడు రష్యన్ జార్ చక్రవర్తుల పట్టాభిషేకం ఈ చర్చిలో జరిగేది మరొక చర్చి ఆర్చ్ ఎంజెల్ కెథడ్రెల్‌లో ఇవాన్ ది టెరిబుల్ ఆయన ఇద్దరు కుమారుల గోరీలు ఉన్నాయి క్రెమ్లిన్‌లో ఉన్న మ్యూజియం చూడ్డానికి వెయ్యికళ్లు కావాలనిపించింది ఇవాన్ ది టెరిబుల్ యొక్క దంతపు సింహాసనం, పీటర్ ది గ్రేట్ యొక్క కిరీటం, ట్రాన్స్ సైబీరియన్ రైల్వే ప్రారంభం సందర్భంగా ఈస్టర్ (ఒక్కలో) చెక్కిన ప్లాటినం రైలు, ఒకే వజ్రంలో చెక్కిన స్త్రీ యొక్క కాలు దాని చుట్టూ వజ్రాలు పొదిగిన గార్టర్ ఇంకా ఎన్నో అద్భుతమైన, ఆకర్షణీయమైన పూర్వకాలపు అవశేషాలు ఉన్నాయి బ్రహ్మాండమైన గంట, ఫిరంగులు, ఇంకా అనేక ఆకర్షణలు మైలున్నర విస్తీర్ణంలో ఉన్న క్రెమ్లిన్ అందం గురించి ఎంత చదివినా ఎన్ని ఫోటోగ్రాఫులు చూసినా ఆ అందాలు ప్రత్యక్షంగా చూస్తే కలిగే ఆనందం, సంభ్రమాశ్చర్యాలు వర్ణనాతీతం ఆ క్రెమ్లిన్ పరిధిలోనే సోవియట్ నాయకుల పరిపాలనా భవనాలు కూడా ఉన్నాయి ఆ భాగంలోనికి ప్రేక్షకులకు ప్రవేశం నిషిద్ధం ఇంతకు ముందు చెప్పినట్టు క్రెమ్లిన్ గోడకు ముందుగా రెడ్ స్క్వేర్ ఉంది దానికి పశ్చిమంగా క్రెమ్లిన్ గోడకు ఆనుకుని లెనిన్-స్టాలిన్ మసోలియం ఉంది అంతేకాకుండా క్రెమ్లిన్ గోడను ఆనుకుని సోవియట్ యూనియనులో మరణించిన ప్రముఖులను పాతిపెడతారు మసోలియం నుంచి స్టాలిన్ దేహాన్ని తీసివేసిన తరువాత దానిని ఆ గోడ ప్రక్కనే పాతిపెట్టారు

విదేశాలకు సోవియట్ ఆర్థికసహాయం అందజేసే శాఖ ముఖ్యఅధికారి శ్రీ కొలిబలావ్‌తో సమావేశం చాలా ఆసక్తికరంగా జరిగింది ఆయనతోపాటు ఐక్యరాజ్యసమితి చేసే ఆర్థిక సహాయ విషయాలపై సోవియట్ నిపుణుడు శ్రీఛాటొఖిన్ కూడా మా చర్చలలో పాల్గొన్నాడు సోవియట్ యూనియన్ అనేక దేశాలకు సాంకేతిక, పారిశ్రామిక, ఆర్థిక సహాయాలు అందజేస్తుంది ఆయా దేశాల నుంచి అనేకమందిని తమ దేశం తీసుకువెళ్ళి వారికి శిక్షణ యిస్తారు తమ నిపుణులను ఆయా దేశాలకు పంపుతారు వివిధ దేశాలలో ఎంతమంది సోవియట్ నిపుణులు ఉన్నారన్న ప్రశ్నకు సమాధానం చెప్పలేదు కాని భారతదేశంలో 170మంది సోవియట్ నిపుణులు ఉన్నారని చెప్పారు ప్రపంచంలోని అనేక దేశాల నుండి 5000 మందికి సోవియట్ యూనియన్‌లో సాంకేతిక శిక్షణ యిస్తున్నారని వారిలో 250 మంది ఆసియాలోని దేశాలనుంచి వచ్చినవారని తెలియజేసారు సోవియట్ యూనియన్ ఆర్థిక సాంకేతిక రంగాలలో ఇతర దేశాలకు చురుకుగా సహాయం అందజేయడం 1947 నుంచి ప్రారంభమయింది సోవియట్ యూనియన్ చేసే

సహాయం అమెరికా చేసే సహాయంతో పో... ...దా అని అడిగిన ప్రశ్నకు సమాధానం రాలేదు అయితే అమెరికాలాగ సోవియట్ ... యూనియన్ ఆయా దేశాలలో నెలకొల్పిన వ్యవస్థలలో భాగస్వామ్యం తీసుకోవడానికి అంగీకరించదు

ఆరోజు వర్షం, చలి ఎక్కువగా ఉన్నది ... ...సించలేదు అని మాస్కోకు 25 కిలోమీటర్ల దూరంలో ఉన్న లెనిన్ కలక్టి... ...చూడ్డానికి కార్యక్రమం నిర్ణయించబడినది కాబట్టి తప్పలేదు ఈ కలక్టివ్ ఫారం 1950లో స్థాపించబడిన బహుళార్థ వ్యవస్థ దీనికి 1979 హెక్టార్ల భూమి ఉంది 1159 మంది కర్షక సభ్యులు ఉన్నారు వారిలో 500 మంది 16-30 ఏళ్ళ వయస్సు ఉన్న యువకులు ఈ ఫారంలో ముఖ్యంగా పళ్ళ తోటలు, కూరగాయలు పండించటం పశు సంవర్థక శాఖలు ఉన్నాయి వారివద్ద ... 465 ఆవులలో265 ఆవులు సంవత్సరం పొడవునా ఒక్కొక్కటి నెలకు 416 లీటర్ల పాలు యిస్తాయట 800 పందులు, 2000 కో... ...10 గుర్రాలు ఉన్నాయి ఏడాదికి 87 టన్నుల మాంసం ఉత్పత్తి చేస్తారు ఒక్కొక్క కోడి ఏడాదికి 135 గ్రుడ్లు పెడుతుందట ఇక కూరగాయల శాఖలో 240 హెక్టార్లలో బంగాళా దుంపలు పండిస్తారు సంవత్సరానికి హెక్టారుకి 16 టన్నుల బంగాళా దుంపలు ఉత్పత్తి చేస్తారు 200 హెక్టార్లలో పళ్ల తోటలు ఉన్నాయి ఈ కలక్టివ్ ఫారం ఉత్పత్తి చేసే పాలు, కాయకూరలు, పళ్ళు కొంతభాగం ప్రభుత్వం నిర్ణయించిన ధరకు వారికి తప్పనిసరిగా అమ్మివేయాలి మిగిలిన పాలు మాంసం, కాయకూరలకు ప్రభుత్వం ఎక్కువ ధర ఇచ్చి కొంటుంది అయితే మార్కెట్టులో ధరలు వీటిమీద హెచ్చుగా ఉంటాయి

ఈ ఫారం చూస్తున్నంతసేపు నాకు రెండు విషయాలు చాలా ఆసక్తి కలిగించాయి ఒకటి కర్షకులకు ఇచ్చే వేతనాలు వారు రోజుకి 8 గంటలు పనిచేయాలి కాని వారి శ్రమకు ఇచ్చే ప్రతిఫలం పనిరోజునుబట్టి లెక్క కడతారు పనిరోజు లెక్కకట్టడానికి ప్రాతిపదిక ఉత్పత్తి కాని సమయం కాదు పాలుతీసే మహిళలు పని రోజులో 100 లీటర్ల పాలు తీయాలి బంగాళాదుంపలు ఒక పనిరోజులో 500 కిలోలవరకు తీయాలి పనిరోజుకు సామాన్యంగా 22 రూబుల్స్ ప్రతిఫలం ముట్టుతుంది అది నగదు, వస్తు రూపంలో ఉంటుంది ప్రతిరోజుకు 7 రూబుల్స్ నగదు, 6 కిలోల బంగాళా దుంపలు 11 కిలోల యితర కూరకాయలు, 500 గ్రాముల పాలు యిస్తారు అది నగదులో 22 రూబుల్స్ అవుతుంది అయితే వారిలో నాయకులకు ప్రతి పనిరోజుకు 1 75 పనిరోజుల క్రింద లెక్కకడతారు ఇదికాక నాకు ఆసక్తి కలిగించిన విషయం కలక్టివ్ ఫారంలో పనిచేసే వారికి అనుమతించే స్వంత

ఆస్తి ప్రతి సభ్యుడు 25 హెక్టార్ భూమి (హెక్టారులో నాల్గవ వంతు) స్వంత ఇల్లు, ఒక ఆవు, కొన్ని పందులు 15 వరకు గొర్రెలు, ఇష్టం వచ్చినన్ని కోళ్ళు ఉంచుకోవచ్చును ముసలివారు శక్తి ఉడిగినవారికి ఫారం పెన్షన్ ఇస్తుంది అతడు చేసిన పని, ఎంతకాలం చేసాడో ఫారం యొక్క అభివృద్ధికి అతడు చేసిన సేవ, మొదలైన విషయాలమీద ఆధారపడి వారికి ఏడాదికి 90 నుంచి 300 పనిరోజులు పెన్షన్‌గా ఇస్తారు వారు తమ స్వంత భూమి, ఇల్లు తాము ఉంచుకోవచ్చు

మాస్కోలో చాలా పురాతనమైన రెడ్ ప్రోలిటేరియట్ మెషిన్ టూల్ ఫ్యాక్టరీ చూడ్డానికి వెళ్లాను అది 1857లో నెలకొల్పబడినదట దీనిలో ఇంజన్ లేత్ మెషిన్లు తయారు చేస్తారు దానిలో 500 మంది కార్మికులు పని చేస్తున్నారు వారిలో 40 శాతం స్త్రీలు ఈ ఫ్యాక్టరీలో చాలా సున్నితమైన పనులు మహిళలు చేస్తారు దానికి వారికి కొద్దిగా ఎక్కువ జీతం ఇస్తారు కొన్ని విభాగాలు స్త్రీలే నిర్వహిస్తున్నారు అయితే మాష్టరు మాత్రం పురుషుడు ఉంటాడు సాంకేతిక ఇంజనీరు రమనోవ్ ఫ్యాక్టరీ అంతా చూపించి చాలా చక్కగా విశదీకరించాడు ఇక్కడ తయారైన మెషిన్లు, చైనా, ఇండియా ఈజిప్టు యుగోస్లావియా ఇంకా అనేక ఇతర దేశాలకు ఎగుమతి చేస్తారు ఆ ఫ్యాక్టరీలో పనిచేసే మాస్టర్ నివాసం చూడ్డానికి వెళ్లాం మొత్తం 28 1/2 చదరపు మీటర్ల నివేశన స్థలం దానికి కరెంటు, నీళ్లు, ఇల్లు వేడిచేయడానికి అయ్యే ఖర్చులతో కలిపి నెలకు 82 రూబుల్స్ కడతాడట ఎనిమిది అంతస్తుల మేడలో ఏడవ అంతస్తులో ఆయన మకాం అతడికి నెలకు 1400 రూబుల్స్ జీతం 19 ఏళ్ళ కుమార్తె దుస్తుల తయారీ పరిశ్రమలో నెలకు 800 రూబుల్స్ సంపాదిస్తుంది భార్య 850 రూబుల్స్ సంపాదిస్తుంది కుమారుడు సైన్యంలో ఉన్నాడు వారందరికీ భోజనం ఖర్చులు నెలకు 1000 రూబుల్స్ అని చెబుతూ తమజీవితం చాలా సౌఖ్యంగా, ఆనందంగా జరుగుతోందన్నాడు శ్రీ రమనోవ్

మాస్కో నుంచి వార్సాకు 26 వ తేదీకి రైలు టిక్కెట్టు కొనవలసినదిగా లెనిన్ గ్రాడ్‌స్కాయా హోటల్ సర్వీస్ బ్యూరో వారికి చెప్పాను వారు 27వ తేదీ వరకు టిక్కెట్టు కొనడానికి వీలులేదన్నారు దానిమూలంగా నా ప్రయాణంలో కొత్త సమస్యలు తలెత్తాయి సోవియట్ యూనియన్‌లో ఉండడానికి నాకు ఇచ్చిన వీసా గడువు 26 వ తేదీతో పూర్తి అవుతుంది ప్రయాణం 27వ తేదీన అంటే వీసా గడువు పొడిగించాలి ఆ పని ఎరిక్ కామరాఫ్‌కి అప్పగించి ఆ రాత్రి అతడి ఇంటికి భోజనానికి వెళ్ళాను రష్యన్లు సాధారణంగా అతిథుల్ని హోటళ్ళలో తప్ప ఇంటి వద్దకు ఆహ్వానించరు కాని నెల రోజులు ఇద్దరం కలిసి తిరిగిన స్నేహ భావంతో కామరాఫ్ నన్ను తన

ఇంటికి భోజనానికి తీసుకు వెళ్ళాడు శ్రీమతి కామరాఫ్ చక్కటి భోజనం తయారుచేసింది కామరాఫ్ తల్లి కూడా వచ్చింది వారు ఉండేది చాలా చిన్న గది అనిపించింది

26వ తేదీ ఉదయం సోవియట్ యూనియన్‌లో నాకు ఆతిథ్యం ఇచ్చిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓరియంటాలజిస్టుల సంస్థకు వెళ్ళాను ఇండియా డిపార్టుమెంటు అధినేత ప్రొఫెసర్ బాల బుషావిచ్ తదితర ప్రముఖ మేధావులు సమావేశమయ్యారు వియత్నాం, భారతదేశం గురించి వారు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పాను నాకు వారిదేశంలో ఆతిథ్యం ఇచ్చినందుకు నా కృతజ్ఞతలు తెలియజేసాను నేను వార్సాలో ఉన్న రోజుల్లో పోలిష్ ప్రభుత్వం నన్ను తమ అతిథిగా పరిగణిస్తారని భారత రాజదూత కార్యాలయంలో విష్ణు అహూజా చెప్పాడు అయినా ఆ విషయం ధృవపరచుకోవడానికి వార్సాలో భారత రాజదూతగా ఉంటున్న శ్రీరాయ్‌కి మాస్కో నుంచి టెలిఫోన్ చేసాను రాత్రి 2 గంటలకు టెలిఫోన్ వచ్చింది రాయ్‌తో మాట్లాడాను నేను 20న కాక 27న ప్రయాణం చేస్తున్నట్టు తనకు తెలుసునన్నాడు పోలిష్ విదేశవ్యవహారశాఖ వారు నాకు ఆతిథ్యం ఇస్తున్నట్టు తనకు తెలియజేసారని చెప్పి వార్సాలో ఏర్పాట్ల గురించి ఏవిధమైన ఆందోళన పడనక్కరలేదన్నాడు

సోవియట్ యూనియన్ వదిలిపెట్టే రోజు వచ్చింది మిత్రుడు ఎరిక్ కామరాఫ్ నా వీసా గడువు 26వ తేదీ వరకు పొడిగించి తీసుకువచ్చాడు దానితోపాటు మాస్కో నుంచి వార్సాకు రైలు టిక్కెట్టుకూడా తెచ్చాడు రైలు టిక్కెట్టుకి అయిన ఖర్చు 270 రూబుల్స్ ఇన్‌స్టిట్యూట్ వారు పెట్టుకున్నారు రైలు సాయంకాలం కావడంవల్ల అగ్రికల్చరల్ ఎగ్జిబిషన్‌కి వెళ్ళి ఆ తరువాత బారత రాజదూత కార్యాలయానికి వెళ్ళి హోటల్‌కి తిరిగి వచ్చేసరిగి కామరాఫ్, ప్రొఫెసర్ బాల బుషావిచ్ అక్కడ ఉన్నారు వారితో కలసి బెలో రష్యా స్టేషన్‌కి వెళ్ళాం చివరి నిమిషంలో పోలిష్ ఎంబసీలోని ప్రథమ కార్యదర్శి కూడా స్టేషన్‌కి రావడం వారి ఆప్యాయతకు నిదర్శనం అనిపించింది

## పోలెండు పోకడలు

నెల రోజులు సోవియట్ యూనియన్‌లో చాలా ఆనందంగా గడిపి మిత్రులవద్ద సెలవు తీసుకుని మాస్కో వదలిపెట్టాను రైలు కదిలేసరికి సాయంకాలం గం 6-05 అయింది రైలు పెట్టెలో నాతో పాటు పోలిష్ యువకుడు ఆయన రష్యన్ భార్య ఉన్నారు వారికి ఇంగ్లీషురాదు అందుమూలంగా వారితో మాట్లాడే అవకాశం లేకపోయింది విదేశాంగశాఖ

అధికారి రెస్టారెంట్‌కి వచ్చి నేను భోజనం ఆర్డరు చేయడానికి తోడ్పడ్డాడు అంతలో 30 మంది భారతీయ 'స్త్రీ పురుషులు రెస్టారెంట్‌లో భోజనానికి వచ్చారు వారంతా భారత సాంస్కృతిక ప్రతినిధివర్గ సభ్యులని తెలిసింది వారిలో మణిపూరుకు చెందిన సూర్యముఖి, తొంబినాదేవి వచ్చి నన్ను పలకరించారు వారిని నేను వియత్నాంలో ఉన్నప్పుడు కలుసుకున్నాను వారంతా జర్మనీ వెళుతున్నామని చెప్పారు

ఆ రైలు నిండా ప్రతినిధివర్గాలే వారికి ప్రత్యేక సదుపాయాలు, ప్రత్యేక భోజనాలు హడావిడి అంతా చూసి చిరాకుపడ్డవారు లేకపోలేదు నాతో ప్రయాణం చేసే పోలిష్ యువకుడు రహస్యపోలీసు శాఖలో పనిచేస్తాడట అమ్మాయిది ఖజకిస్తాన్‌లోని ఆల్మాటా ఆమె ఐదేళ్ళు జర్నలిజం చదివినదట పోలిష్ రేడియోలో పని చేయాలనుకుంటున్నానని చెప్పింది వాళ్ళు ఇంగ్లీషు మాట్లాడ్డానికి నానా అవస్థ పడ్డారు మధ్యాహ్నం గం 1-20 కి రష్యాలో ఆఖరు స్టేషన్ బ్రెస్ట్ చేరింది రైలు స్టేషన్‌లో రెస్టారెంట్‌లో భోజనం మా పెట్టె మరొక రైలుకి తగిలించారు రైలు 3 గంటలకు బయలుదేరింది చాలా తొందరలో పోలెండ్‌లోని మొదటి స్టేషన్ టెనర్‌పోల్ చేరుకున్నాం అక్కడ రైలు 28 నిమిషాలు ఆగింది పాస్‌పోర్టు, కస్టమ్స్ పరీక్ష చాలా తొందరగా ముగించారు సాయంకాలం 7 గంటలకు పశ్చిమ వార్సా అక్కడ నుంచి తూర్పు వార్సా తరువాత మధ్య వార్సా స్టేషన్‌కి చేరింది రైలు స్టేషన్ వద్దకు నాకు స్వాగతం చెప్పడానికి మిత్రులు లుబెల్‌స్కీ, బాబడ్ మనెలి వచ్చారు పోలిష్ విదేశాంగశాఖనుంచి కోటీ, భారత రాజదూత కార్యాలయంనుంచి మూర్తి కూడా వచ్చారు బ్రహ్మాండమైన సన్మానం స్టేషన్‌నుంచి బ్రిస్టల్ హోటల్‌కి వచ్చాం చక్కటి విశాలమైన గది లుబెల్‌స్కీ, బాబడ్, మనెలి నాతోపాటు వియత్నాంలో పనిచేసారు వారితో ఆ రాత్రి డిన్నర్ పోలిష్ విదేశాంగశాఖలో దూరప్రాచ్య విభాగం అధికారి, ఆర్థిక విభాగం అధికారి ఇద్దరూ కలిసి నాకు అతిధ్యం ఇస్తున్నట్టు మిత్రుడు లుబెల్‌స్కీ చెప్పాడు

పాశ్చాత్య శాస్త్రీయ సంగీత స్రష్టలలో ఒకడైన ఛోపాన్ జన్మతః పోల్ ఆయన జన్మస్థలం పోలెండ్ ముఖ్యపట్టమైన వార్సాకి 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న జెలనోవా అది చూడ్డానికి వెళ్ళాం ఛోపాన్ జన్మించిన ఇంటిని జాతికి అంకితం చేసి ఆయన స్మృతిచిహ్నంగా ఉంచివేసారు ఇల్లు అయితే చిన్నదే కాని దానిని జాగ్రత్తగా చూచుకునే శ్రద్ధ ప్రశంసనీయం ఆ ఇంటి ఆవరణలో పదివేలచెట్లు పెంచుతున్నారు అక్కడ ఎంతసేపు గడిపినా మనకు కాలం గడిచినట్టే తెలియదు చాలా అందంగా ఉంది ఆ ఇల్లు ప్రపంచంలో శాస్త్రీయ పాశ్చాత్య సంగీత విశారదులకు, సామాన్య

సంగీతప్రియులకు కూడా యాత్రాస్థలం వందలాది మంది సంగీత ప్రియులు ప్రతిరోజు ఆ గ్రామం వెళ్ళి ఛోపాన్ జన్మించిన ఇంటిని చూచి ఆయన సంగీతాన్ని విని తరించామనుకుంటారు సంగీతంలో అందెవేసిన చేతులు కూడా ఛోపాన్ జన్మస్థలంలో ఆయన సృష్టించిన సంగీతాన్ని పియానో మీద వాయించి ధన్యులవుతారు ఆ ఆరాధన అర్థంకావాలంటే పాశ్చాత్య సంగీతం గురించి తెలియాలి మనకు బెధూవిన్, మొజార్ట్, షూల్ట్జు, ఛోపాన్ మొదలైన శాస్త్రీయ పాశ్చాత్య సంగీత స్రష్టల సంగీతం ఏదో గోలగా ఉంటుంది అయితే జర్మన్లు, పోల్స్ మంచి సంగీత ప్రియులు పారిస్ చిత్రకళకు ఎలా కాణాచి అయిందో అదే విధంగా జర్మనీ సంగీత కళకు ఆటుపట్టు జర్మన్‌ముద్ర పడితేకాని శాస్త్రీయ సంగీతంలో నిష్ణాతుడు కాలేడని యూరప్‌లో ఒక భావం ఉండేది ఛోపాన్ జీవిత చరిత్ర దానికి ప్రత్యక్ష నిదర్శనం ఆయన సంగీతం జీవిత గాథ మాట్లాడుకుంటూ ఉండగా స్కెండ్జియాంకా ఛోపాన్ సంగీతకచేరీ చేస్తున్నాడు అది ప్రతిదినం జరిగే కార్యక్రమం అన్నారు నాతో వచ్చిన లుబెల్స్కీ దంపతులు ఆ కచేరీ జరుగుతున్నంతసేపు ఆ ఇంట్లో అన్ని గదులలోను కూర్చుని, నిలబడి సంగీతం విన్నారు ఆ కచేరీ విని లంచ్‌కి బ్రిస్టల్ హోటల్‌కి చేరాం

పోలెండ్ దేశానికి ఒకప్పుడు 'యూరపు యొక్క జబ్బుమనిషి' అని పేరుండేది రెండు ప్రపంచయుద్ధాలలోను బోలెడు నష్టపోయింది రెండవ ప్రపంచ యుద్ధంలో హిట్లర్ యొక్క జర్మను సేనలు పోలెండును ఎలా ధ్వంసం చేసాయో చూపించడానికా అన్నట్టు యుద్ధానంతరం అనేక సంవత్సరాల తరువాత కూడా వార్సా, దాని పరిసరాలలో అనేక ప్రత్యక్ష నిదర్శనాలు అలాగే ఉన్నాయి కొన్ని చోట్ల శత్రు విమానదాడులవల్ల ధ్వంసమైన భవనాల అవశేషాలు అలాగే నిల్చి ఉన్నాయి కాని పట్టణం వదలి బైటకు వెళితే ప్రకృతి సౌందర్యం ఆకర్షణీయంగా ఉంది మధ్యాహ్నమంతా వర్షం, మిత్రుడు లుబెల్స్కీ ఇంటికి వెళ్ళాం అతడి నివాసగృహం మూడు గదులు ఒక వంట గది మొత్తం 80 చదరపు మీటర్ల స్థలం రష్యనుప్లాట్స్ చూచిన తరువాత వార్సాలో ఫ్లాట్స్ విశాలంగా ఉన్నాయనిపించింది లుబెల్స్కీ అత్త మామలు కూడా అక్కడే ఉన్నారు ముసలాయన చాలా హుషారుగా ఉన్నాడు భారతదేశం గురించి అనేక ప్రశ్నలు అడిగాడు భారతదేశం వదలి బైటకు వెళితేకాని మనదేశం గురించి ప్రపంచంలో ఎంత తక్కువ తెలుసునో అర్థంకాదు రాత్రి భోజనం అక్కడే చేసి హోటల్‌కి తిరిగి వెళ్ళాను

వార్సా నగరంలో యుద్ధానంతరం సోవియట్ రష్యా పోలెండుకు కానుకగా ఒక బ్రహ్మాండమైన 33 అంతస్తుల భవనం నిర్మించి ఇచ్చింది దానిని

సాంస్కృతిక వైజ్ఞానిక భవనం అంటారు దానిలో సినీమాహాల్సు థియేటర్లు, ఆటలు ఈత కొట్టడానికి స్విమ్మింగ్ సదుపాయాలు, సంస్థల కార్యాలయాలు, భోజనశాలలు ఉన్నాయి 3000 మంది కూర్చోవడానికి అనువైన అందమైన హాలు మొత్తం భవనం అంతా చాలా ఆకర్షణీయంగా ఉంది సూడాన్ నుంచి వచ్చిన ప్రతినిధులలో ఒక పాత్రికేయుడు ఒక మహిళా ఆర్కిటెక్ట్‌తో కలిసి వార్సా పట్టణం చూడ్డానికి వెళ్ళాం యుద్ధానంతరం పునర్నిర్మాణ కార్యక్రమం పూర్తికాలేదనడానికి అనేక నిదర్శనాలు పార్లమెంటు భవనం చాలా అందంగా ఉంది

భారత రాజదూత కార్యాలయం నేను మకాం చేసిన బ్రిస్టల్ హోటల్‌లోనే ఉంది అంతస్తు తేడా, అంతే మాస్కోలో ఉన్న భారత రాజదూత శ్రీ కె పి యస్ మీనన్ పోలెండుకు కూడా రాజదూత కాని, శ్రీ రాయ్ వార్సాలో ఇన్‌చార్జిగా ఉంటున్నారు మన ఎంబసీ తలుపు కొడుతుండగా ఒక భారతీయుడు, మన ఎంబసీ ఉద్యోగి, నన్ను పలకరించి "మీరు సూడాన్ ప్రతినిధివర్గ సభ్యులా?" అని ప్రశ్నించాడు తోటి భారతీయుడే నన్ను ఆఫ్రికన్ అనుకుంటే ఇక పాశ్చాత్యుల మాట వేరేచెప్పాలా శ్రీరాయ్‌తో పోలిష్ రాజకీయాలను గురించి చర్చించాను లుబెల్‌స్కీతో కలసి నేషనల్ మ్యూజియం చూసాను ఆ తరువాత పోలిష్ విదేశాంగ శాఖలో శ్రీ అగ్రడజిన్‌స్కీని కలుసుకున్నాను ఆయన అంతకుపూర్వం వియత్నాం కమిషన్‌లో పోలిష్ ప్రతినిధిగా ఉండేవారు పోలిష్ అధినేత గొముల్కా యుగోస్లావియా అధ్యక్షుడు టిటోను చూడ్డానికి వెళ్ళడంలోని పరమార్థం, పోలెండు రష్యను ప్రభావం క్రింద ఉండడం గురించి అడిగాను యూరోపులో భద్రతా పరిస్థితులు మెరుగుపడేవరకు పోలెండు సోవియట్ బ్లాకులో ఉండడం తప్పదన్నారు సోవియట్ ప్రభావం క్రింద ఉన్నా పోలెండ్ ప్రపంచంలోని అలీన దేశాలతో స్నేహ సంబంధాలు పెంచుకోవడానికి ప్రయత్నిస్తుంది ఆ గ్రూపులో కూడా శాంతికోసం విశాల దృక్పథం కోసం ప్రయత్నిస్తుందన్నారు సామ్యవాద సాధనకు అనేక మార్గాలు ఉన్నాయనే సత్యాన్ని సోవియట్ యూనియన్ అంగీకరించినదన్నారు భౌగోళికంగా పోలెండ్ అపాయ పరిధిలో ఉంది కాబట్టి దానికి సోవియట్ బ్లాకులో ఉండడం తప్పనిసరి అన్నారు అప్పటి పోలిష్ విదేశాంగనీతిని అగ్రడజిన్‌స్కీ కంటే నైపుణ్యంగా విశదీకరించ గలిగినవారు చాలా తక్కువమంది ఉంటారు ఆయన చెప్పినదంతా విని అది ప్రపంచ పరిస్థితులను గురించి పోలిష్ దృక్పథం మాత్రమే అన్నాను ఆయన అంగీకరించాడు అక్కడనుంచి నాకు ఆతిథ్యం యిస్తున్న విదేశాంగశాఖ అధికారులు శ్రీ స్లుక్ జాన్ స్కీ శ్రీ షెలుబ్ స్కీలను చూడ్డానికి వెళ్ళాను

ఆ రాత్రికి థియేటర్ కార్యక్రమం ఏర్పాటు చేసారు కాని తీరా టిక్కెట్లు తీసుకోవడానికి వెళ్లేసరికి లేవన్నారు ఏదో పొరపాటు జరిగిపోయింది మరొక రెండు థియేటర్లకు వెళ్లాం టిక్కెట్లు లేవు అంతకు క్రితం రోజునే శ్రీమతి కామా మతలాషక్‌ని చూడాలని ఉందని మిత్రుడు లుబెల్స్కీకి చెప్పాను అతడు నా కోర్కెను విదేశాంగశాఖ వారికి తెలియజేసాడు వారు మళ్ళా నన్ను అడిగి స్థిరపరచుకొని ఆమెతో ఆ రాత్రి థియేటర్ కార్యక్రమం ఏర్పాటు చేసారు కామా మాతోపాటు వియత్నాం కమిషన్‌లో హెనోయ్‌లో ఉండేది పోలిష్ డెలిగేషన్‌కి లా ఆఫీసరుగా ఉండేది చూడచక్కని చిన్నది చాలా అందంగా ఉంటుంది దానికి తోడు చాలా హుషారైనది నేను వార్సా వస్తున్నట్టు తెలిసికూడా స్టేషన్‌కి రాకపోయినా హోటల్‌కి టెలిఫోను కూడా చేయకపోవడం నన్ను ఆశ్చర్యపరచింది తరువాత తెలుసుకుంటే అప్పుడు పోలెండులో నెలకొన్న రాజకీయపరిస్థితిలో ఆమె స్వేచ్ఛగా తిరగడానికి ప్రభుత్వపరంగా అడ్డంకులు ఉన్నట్టు అనిపించింది ఏమైతేనేం ప్రభుత్వ అతిథి ఆమెను కలుసుకోవాలన్నాడు కాబట్టి అనుమతి ఇచ్చారు అయితే థియేటర్‌కి టిక్కెట్లు దొరకనేలేదు నేను లుబెల్స్కీ దంపతులు కలసి కామా ఇంటికి వెళ్ళి ఆమెను కారులో ఎక్కించుకువచ్చాం సాంస్కృతిక భవనంలోని రెస్టారెంటులో నలుగురం భోజనం చేసాం చక్కటి పరిసరాలు ఉత్సాహంగా ఉంది లుబెల్స్కీ దంపతుల సమక్షంలో కామా మనసు విప్పి మాట్లాడ్డం లేదనిపించింది తన మిత్రుడు కరియప్పను గురించి అడిగింది కరియప్ప, కామా వియత్నాంలో మంచి మిత్రులు రెస్టారెంటులో డాన్సు చేయడానికి చక్కటి స్థలం, మంచి సంగీతం ఉన్నాయి నాకు బాల్‌రూం డాన్సు అంటే బోలెడు సరదా మాస్కోలో ఎవరూ పట్టించుకోలేదు కాని వార్సాలో ఏమనుకుంటారో అని సందేహించాను అంతలో కామా తనతో టాంగో డాన్సు చేస్తానని మాట ఇచ్చాను కాబట్టి డాన్సు చేయాలని ప్రోత్సహించింది టాంగో చాలా కష్టమైన, అందమైన డాన్సు అయితే కామా చాలా పొట్టి, అయినా సరదాగా డాన్సు చేసాం ఒక నల్లనివాడు తెల్ల అమ్మాయితో డాన్సు చేయడం చాలా పొట్టిగా ఉన్న అమ్మాయి చాలా పొడవైన వాడితో డాన్సు చేయడం చూసి అంతా ఏమనుకున్నారో నాకు తెలియదుకాని మిత్రురాలితో డాన్సు చేయడం నాకు చాలా ఆనందం కలిగించింది

పోలెండు దేశాన్ని మహారాజులు పాలించే రోజుల్లో ఆ దేశానికి ముఖ్యపట్టణం క్రకావ్, వార్సా నుంచి క్రకావ్‌కి 320 కిలోమీటర్ల దూరం అమెరికన్ బెల్‌ఎయిర్ కారులో ఉదయం గం 7-30 లకి వార్సా వదలిపెట్టాం నాతో మిత్రుడు లుబెల్స్కీ కూడా ఉన్నాడు దారిలో కీల్స్ అనే చిన్న పట్టణంలో బ్రేక్‌ఫాస్ట్ చేసాం వార్సాలో హోటళ్ళ రేట్లతో పోలిస్తే సగానికి

నగం చౌక కారు 120 కి మీ వేగంతో వెళుతోంది క్రకావ్ చేరిన తరువాత ఆ రాత్రికి మేము మకాం చేయవలసిన హోటల్ వెతుక్కోవడానికి 40 నిమిషాలు పట్టింది తీరా హోటల్ ఫ్రాన్కుస్కిని కనుక్కున్న తరువాత హోటల్ సాయంకాలం 6 గంటల నుంచి బుక్ చేసారు కాబట్టి అంతవరకు గదులు ఇవ్వనన్నారు అక్కడ సూటుకేసులు వదలిపెట్టి పూర్వకాలంలో పోలిష్ రాజులు నిర్మించిన కోటలు, రాజభవనాలు చూడ్డానికి వెళ్ళాం ఆ భవనాలలో ఉండే కళాఖండాలు చాలా వరకు యుద్ధకాలంలో కెనడాకు పంపివేసారట కాని యుద్ధానంతరం ఆ ప్రభుత్వం వాటిని తిరిగి పోలిష్ ప్రభుత్వానికి ఇవ్వడానికి నిరాకరించిందట ఆ వివరాలన్నీ గైడ్ చాలా ఉత్సాహంగాను సరదాగాను చెప్పాడు పోలిష్‌రాజుల పట్టాభిషేకాలు జరిగేది వారి మృతదేహాలు సమాధిచేసే చర్చి చూసాం ఆ భవనాలన్నీ చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి

చిన్న రెస్టారెంట్‌లో లంచ్‌చేసాం వార్సాకంటె క్రకావ్ కూడా చౌక అనిపించింది ఆ తరువాత క్రకావ్‌కి పది కిలోమీటర్ల దూరంలో ఉన్న నోవాహూత (కొత్తమిల్లు) చూడ్డానికి వెళ్ళాం అది కొత్త స్టీల్ నగరం దానిలో లక్షమంది కార్మికులు నేను మొదటిసారిగా స్టీలులోని అన్ని భాగాలు చూసాను ఆ మిల్లు పనిచేసేతీరు, ఉత్పత్తి విధానం చూసాను చాలా ఆసక్తి దాయకంగా ఉంది ఆ మిల్లులో ఏడాదికి 8 లక్షల టన్నుల స్టీలు ఉత్పత్తి అవుతుందట దానికి కావలసిన ముడిపదార్థం సోవియట్ రష్యా నుంచి వస్తుంది 1950 లో పూర్తిగా కొత్త నగర నిర్మాణం చేసారు స్టీలు మిల్లు చూచి తిరిగి క్రకావ్ వచ్చి హోటల్‌కి వెళ్ళాం అప్పుడు గదులిచ్చారు చాలా అలసిపోయాం బైట చాలా చలిగా ఉంది గంట విశ్రాంతి తర్వాత బయటుకెళ్ళి భోజనం చేసాం

మరునటి ఉదయం బ్రేక్‌ఫాస్ట్ చేసి క్రకావ్‌కి 56 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఆష్‌విట్జ్‌కి బయలుదేరాం ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో జర్మన్‌లు ఆష్‌విట్జ్ వద్ద ఒక బ్రహ్మాండమైన కాన్‌సెంట్రేషన్ శిబిరం నెలకొల్పారు జర్మనీలోను, ఆక్రమిత దేశాలలోను నాజీలు నెలకొల్పిన నిర్బంధ శిబిరాలన్నింటిలోను ఆష్‌విట్జ్ చాలాపెద్దది ఎక్కువమందిని నిర్బంధంలో ఉంచిన చోటు, అతి క్రూరమైన అమానుష హింసాకాండ జరిపిన చోటుకూడా అదే ఆష్‌విట్జ్ జనాభా 12,000 మాత్రమే నాజీ నాయకులు ఏప్రిల్ 1940లో ఆ ప్రదేశంలో ఖైదీలకోసం నిర్బంధ శిబిరం నెలకొల్పారు ప్రారంభంలో దానిలో వెయ్యి మందిని ఉంచాలనుకున్నారు ఆ శిబిరానికి నాయకుడు రుడోల్ఫ్ ఫ్రాంజ్ ఫెర్డినాండ్ హోస్ ఈ శిబిరం ఊరుబైట విసురా,

సోలా గదులు విడిపోయి ఫోర్క్‌గా తయారైన ప్రదేశంలో ఉంది ప్రారంభంలో దాని విస్తీర్ణం 40 కిలోమీటర్లు అయితే మార్చి 1944 లో నాజీ పోలీసు వ్యవస్థ సుప్రీం కమాండర్ హిమ్లర్ వచ్చి ఆ శిబిరాన్ని 30 వేల మందికోసం, ఆ తరువాత లక్షమంది కోసం విస్తరింపజేసాడు ఈ శిబిరానికి సోవియట్ సైన్యం 1945 జనవరిలో విముక్తి కలిగించింది ఏప్రిల్ 1947 లో పోలిష్ సుప్రీం నేషనల్ ట్రిబ్యూనల్ హోస్‌కి మరణశిక్ష విధించింది

ఇక ఆ శిబిరంలో నాజీ నరహంతకులు చేసిన హత్యాకాండ, మారణహోమం చరిత్రలో కనీవినీ ఎరుగనంత ఘోరం హింసాకాండ పరాకాష్టనందుకున్న ఈ శిబిరంలో ఉరికంబాలు ఇంకా అలాగే ఉన్నాయి గ్యాసుపెట్టి చంపే గదులు ఆ చావుల వివరాలు కొట్టవచ్చినట్టు ఉన్నాయి ఇక చావులు చిత్రహింసలు ప్రతి దినచర్య ఆశిబిరంలో రిజిష్టరు అయినవారి సంఖ్య నాలుగు లక్షలు వారిలో మూడవ వంతు మాత్రమే బ్రతికి బైటపడ్డారు, అయితే అనధికారికంగా ఆ శిబిరంలో మొత్తం 40 లక్షల మంది మరణించి ఉంటారని అంచనా నాజీల అమానుషత్వానికి ప్రదర్శనశాలలాగ ఆష్‌విట్జ్ శిబిరాన్ని ఉంచివేశారు ఖైదీల జుట్టు, బట్టలు అనేక అవశేషాలు అన్ని గదులలోను ఉన్నాయి నాకు ఎందుకో చాలా జుగుప్స కలిగింది జపాన్‌లో హిరోషిమా వెళ్ళి అమెరికన్ ఆటంబాంబు యొక్క దారుణ ఫలితాలు మ్యూజియంలో చూసినప్పుడు కూడా నేను చాలా బాధపడ్డాను జపాన్ కూడా పూర్తిగా నాశనమైన ఒక భవనాన్ని అమెరికన్ల అమానుషత్వానికి గుర్తుగా ఉంచివేసింది పోలెండులోని ఆష్‌విట్జ్ శిబిరం జపాన్‌లోని హిరోషిమా చూచిన తరువాత యుద్ధం అంటే పరమ అసహ్యం కలిగితీరుతుంది చిత్రం ఏమిటంటే ప్రపంచంలో అణుయుద్ధం నిషేధించాలనేకాని అసలు యుద్ధాలను నిషేధించాలని ఎవరూ అడగరు ఆ శిబిరంలో తిరుగుతుంటే నాకు మానవుని మంచితనం మీద నమ్మకం తగ్గిపోయింది అయితే జర్మనీ రెండవ ప్రపంచ యుద్ధంలో ఓడిపోయింది కాబట్టి ఇటువంటి శిబిరాలు బైటపడ్డాయి విజయం సాధించిన దేశాలలో ఎటువంటి శిబిరాలు ఉన్నాయో ప్రపంచానికి తెలియదుకదా అనిపించింది

అక్కడనుంచి ఎంత తొందరగా బైటపడితే అంత మంచిదనిపించింది మధ్యాహ్నం12-45కి ఆ శిబిరం వదలి వార్సాకి బయలుదేరాం తిరుగు ప్రయాణంలో కొత్తదారి తీసుకున్నాం ఆ దారి అంతా ఫ్యాక్టరీలతో నిండి ఉంది డ్రైవరు చాలా స్పీడుగా డ్రైవ్‌చేసి నాలుగు గంటలలో వార్సాకి తీసుకొచ్చాడు సాయంకాలం 5 గంటలకు లంచ్ చేసాను చిత్రం ఏమిటంటే ఆసమయంలో కూడా రెస్టారెంటు క్రిక్కిరిసి ఉంది

అక్టోబరు 4, 1957 శుక్రవారం ప్రపంచ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యమైనరోజు అనాడు రష్యన్లు ప్రప్రధమంగా స్పుట్నిక్‌ని అంతరిక్షంలోకి వదలిపెట్టి నూతన శకారంభానికి నాంది పలికారు రష్యన్ భాషలో స్పుట్నిక్ అంటే రెండు అర్థాలు ఉన్నాయి. భౌగోళిక శాస్త్రార్థంలో దానికి చంద్రుడు అని ఉపగ్రహం అని అర్థం మరొక అర్థం 'తోటిప్రయాణికుడు', మొదటి స్పుట్నిక్ అతి చిన్నది దాని బరువు 183,92 పౌండ్లు సెకండుకి 26,400 అడుగుల వేగంతో అది భూమిని వదలిపెట్టి 560 మైళ్ళ ఎత్తువరకు వెళ్ళింది అది రోజుకి 15 సార్లు భూమి చుట్టూ ప్రదక్షిణలు చేసింది అనాటినుంచి అంతరిక్షయాత్ర బ్రహ్మాండమైన ప్రగతిని సాధించింది వార్సాలో బ్రిస్టల్ హోటల్ భోజనశాలలో బ్రేక్‌ఫాస్ట్ చేస్తుండగా మిత్రుడు లుబెల్‌స్కీ ఈ చారిత్రాత్మకమైన వార్త తీసుకువచ్చాడు విజ్ఞానశాస్త్రంలో రష్యన్లు సాధించిన విజయాలు రష్యన్లు అంతరిక్షయాత్రలకు శ్రీకారం చుట్టి ప్రపంచ దేశాలలో ప్రధమస్థానం ఆక్రమించిన ఘనత గురించి మాట్లాడుకున్నాం

ఆ సాయంకాలం పోలిష్ విదేశాంగశాఖ అధికారులు నా గౌరవార్థం ఇచ్చిన కాక్‌టేల్ పార్టీకి వెళ్ళాను మిత్రుడు లుబెల్‌స్కీ, కల్నల్ కొటోవ్‌స్కీ నాతో వచ్చారు ఆ పార్టీలో నేను వియత్నాంలో ఎరుగున్న పోలిష్ మిత్రులంతా ఉన్నారు వారిలో శ్రీయుతులు అగ్రడజిన్‌స్కీ, సిమనోవ్‌స్కీ, శ్రీమతి బాబడ్, అన్యా కొడకోవ్‌స్కావా కామా మతలాషక్ ఉన్నారు భారత రాజదూత కార్యాలయం నుంచి మూర్తి వచ్చారు అప్పుడు పోలెండ్ పర్యటనలో ఉన్న మన పార్లమెంటు సభ్యుడు శ్రీ ఔాయకిం ఆల్వా, కేంద్రంలో సహాయ మంత్రి శ్రీ మహావీర్ త్యాగి కూడా పార్టీకి వచ్చారు తమచుట్టూ ఉన్నవారంతా వోడ్కా, విస్కీ, కోన్‌యాక్ మొదలైనవి త్రాగుతుంటే ఈ పార్లమెంటు సభ్యులు ఇద్దరూ ఆరంజ్ స్క్వాష్ గ్లాసులు పట్టుకు నిలబడడం చూస్తే జాలి వేసింది వారికి రెండు ఇబ్బందులు, మొదటిది భారతదేశంలో ఏవిధమైన ప్రాముఖ్యత, పదవి లేనివ్యక్తి గౌరవార్థం పోలిష్ ప్రభుత్వం యిచ్చేపార్టీకి వారిని అతిధులుగా ఆహ్వానించడం రెండవది అతిధులంతా ఆనందంగా వోడ్కా త్రాగుతుంటే వారు స్క్వాష్ త్రాగుతూ నిలబడడం ఈ ఇబ్బందులు ముందుగా వారికి చెప్పినా వారు పార్టీకి వచ్చారు

పోలెండులో 'గోల్డెన్ వాడా' అనే పేరుతో ఒక వోడ్కా తయారు చేస్తారు అది వారి ప్రత్యేకత దానిలో బంగారం తునకలు ఉంటాయి ఆ బంగారు తునకలు మూడు వంతులు మనదేశంలో కిల్లీల మీదచుట్టే బంగారు వెండి కాగితాలు వంటివని నా ఊహ ఏదిఏమైనా బంగారు వోడ్కా తయారుచేసే

ఘనత పోలెండుకే దక్కుతుంది ఒకప్పుడు అమెరికన్ అధ్యక్ష పదవికి పోటీచేసి ఓడిపోయిన శ్రీ బారీ గోల్డ్‌వాటర్ పూర్వులు పోలెండు నుంచి అమెరికా వెళ్లారట అంతేకాదు గోల్డెన్ వాడా అనే పోలిష్ మాటను అమెరికన్ ఇంగ్లీషులోకి మార్చి గోల్డువాటర్ అన్నారు ఆ గోల్డువాటర్ పూర్వులు పోలెండులో గోల్డెన్ వాడా అనే వోడ్కా తయారు చేసేవారట ఇక దాని రుచి గురించి అడగవద్దు అంతకు ముందే చెప్పినట్టు వోడ్కా బ్రహ్మపదార్థం దానికి రంగు, రుచి, వాసన ఉండవు గొంతులో పోసుకుంటే మాత్రం గరళం మ్రింగిన శివుడు గుర్తుకు వస్తాడు చిత్రం ఏమిటంటే పూర్వులు అటువంటి డ్రింక్స్ త్రాగి నిలబడేవారు కాని నేటితరంవారు వాటిని త్రాగాలని సరదాపడుతున్నారు తప్పత్రాగి నిలబడ లేకపోతున్నారు ప్రభుత్వానికి అది పెద్ద సమస్యగా తయారయింది

బ్రహ్మాండమైన పార్టీ అక్కడ నుంచి నేను, కామా, లుబెల్స్కి క్రాకడైల్ రెస్టారెంటుకి వెళ్లాం లుబెల్స్కి వెళ్ళిపోయాడు నేను కామా కబుర్లాడుతూ, డాన్సుచేస్తూ నడిరాత్రి వరకు గడిపేసాం ఆ మరుసటిరోజు నేను పోలెండు వదలివేస్తున్నాను మళ్ళా జీవితంలో కలుసుకుంటామనే ఆశలేదు అందుమూలంగా రెస్టోరెంటు మూసివేసేవరకు డాన్సు చేస్తూనే వున్నాం అప్పుడు కామాని టాక్సీలో వాళ్ళ ఇంటివద్ద దింపి హోటల్‌కి వెళ్ళాను మమ్మల్నిద్దర్ని వదలి వెళ్ళిన లుబెల్స్కి ఏమనుకుంటాడో అని కామా ఆదుర్దాపడడం చూస్తే నాకు నవ్వు వచ్చింది శనివారం సాయంకాలం వార్సా వదలి జర్మనీలోని బెర్లిన్‌కి వెళ్ళడానికి నిర్ణయించాను 354 జ్లోటీలు పెట్టి రైలు టిక్కెట్టు కూడా కొన్నాను

నాతోపాటు వియత్నాంలో ఉన్న ప్రొఫెసర్ మనేలితో కలిసి వార్సా యూనివర్శిటీకి వెళ్ళాను వ్యవధి లేనందున హిందీశాఖ మాత్రం చూసాను వార్సా యూనివర్సిటీలో హిందీ చదువుకునే విద్యార్థులు పదకొండుగురు ఉన్నారు హిందీ ప్రొఫెసర్ ఒక మహిళ ఆమె హిందీ సోవియట్ యూనియన్‌లో లెనిన్ గ్రాడ్ యూనివర్సిటీలో చదువుకున్నదట ఆమెకు హిందీ మాట్లాడ్డం అంతగా రాదు త్వరలో భారతదేశంనుంచి ప్రొఫెసర్ గోషాల్ వస్తారని చెప్పారు అక్కడనుంచి నాతో పెకింగ్‌నుంచి మాస్కో వరకు రైలులో ప్రయాణం చేసిన కల్నల్ లెర్నర్ ఇంటికి వెళ్ళాం ఆయన ఎంతో ఆనందించాడు వార్సాలో వియత్నాం రాజదూతగా ఉన్న హోంగ్ వాన్ టియెన్ ఇంటికి ఆయన ఆహ్వానంమీద లంచ్‌కి వెళ్ళాను మనిషి మంచివాడు వియత్నాం పరిస్థితిని గురించి నా అభిప్రాయాలు అడిగాడు నేను, మిత్రుడు లుబెల్స్కి శ్రీమతి బాబడ్, ప్రొఫెసర్ మనేలి ఇళ్ళకు వెళ్లాం కాఫీలు స్వీట్లు

చిన్నచిన్న బహుమానాలు చాలాకాలం తరువాత కలుసుకున్నందున మేమందరం చాలా ఆనందించాం హోటల్‌కి తిరిగి వచ్చి ప్రయాణానికి సిద్ధం అయ్యాను కామా ఏదో కాన్క తీసుకువచ్చి యిచ్చి వెళ్ళిపోయింది లుబెల్‌స్కీ నేను స్టేషన్‌కి వెళ్ళాం కామా స్టేషన్‌కి వచ్చింది విదేశాంగశాఖ ప్రతినిధి శ్రీ కేట్ కూడా స్టేషన్‌కి వచ్చారు రాత్రి గం 8-25 కి రైలు వార్సాస్టేషన్ వదలిపెట్టింది హాయిగా నిద్రపోయి తెల్లవారేసరికి తూర్పు బెర్లిన్ చేరవచ్చును

## బెర్లిన్‌లో జైలు అనుభవం

తెల్లవారుఝాము నాలుగు గంటలవరకు హాయిగా నిద్రపోయాను అప్పుడు రైలు పెట్టెలో కలకలం వినిపించింది 'పాస్‌పోర్ట్', 'పాస్‌పోర్ట్' అనే కేకలతో మెలకువ వచ్చింది వార్సానుంచి తూర్పు బెర్లిన్ వెళ్లే రైలులో ప్రయాణీకుల సౌకర్యం కోసం జర్మను పోలీసులు రైలు నడుస్తుండగానే వీసాలు అవీ పరీక్ష చేస్తారు నా పాస్‌పోర్టు పోలీసు అధికారికి ఇచ్చాను దానిలోని తూర్పుజర్మన్ వీసా చూసి జర్మన్ భాషలో ఏదో గట్టిగా అరుస్తున్నాడు నాకు నిద్రమత్తు వదలిందికాని విషయం అర్థంకాలేదు పోలీసు అధికారికి ఇంగ్లీషురాదు నాకు జర్మన్ రాదు నేను ఉన్న కంపార్టుమెంటులో ఇంగ్లీషు వచ్చినవారెవరూ లేరు నాకు తూర్పు జర్మన్ వీసా హెనోయ్‌లో తూర్పుజర్మన్ మిత్రులు ఉచితంగా కూడా యిచ్చారు కాబట్టి దానిలో పొరపాటు రాకూడదని నాధీమా కాని ఆ పోలీసు అధికారి సౌంజ్ఞలతో వీసాలోని తేదీలు చూపించాడు అది చూడగానే నాకు విషయం అర్థమయింది వీసా అయితే మూడు నెలలకు యిచ్చారు కాని దారిలో అంతకంటే ఎక్కువకాలం గడిపినందున తూర్పు జర్మన్ వీసా గడువు దాటిపోయింది ఏదో ధీమాతో వీసా విషయం చూసుకోనేలేదు ముందే చూసుకుని ఉంటే వార్సాలోనే ఒక క్షణంలో దాని వ్యవధి పొడిగించేటట్టు చేసేవాణ్ణి అప్పుడిక జరిగిపోయిన పొరపాటు గురించి ఆలోచించడం చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నట్టే ఇంతలో మా ప్రక్క పెట్టెలో నుండి ఇంగ్లీషు వచ్చిన ప్రయాణీకుడు వచ్చి చెప్పినదేమిటంటే నేను సరి అయిన వీసా లేకుండా వచ్చాను కాబట్టి పోలీసు స్టేషన్‌కి వెళ్ళాలన్నాడు

ఉదయం గం 7-20కి తూర్పు బెర్లిన్ స్టేషన్ రానేవచ్చింది నా కూడా ఒక మగ పోలీసు ఒక ఆడ పోలీసు ఉన్నారు వారికి ఇంగ్లీషు రాదు ఆమెకు "నీవంటే నాకు ఇష్టం" అన్న మాటతప్ప మరొక ఇంగ్లీషు మాట రాదని చిలిపిగా నవ్వింది అప్పుడు సరసాలాడే మూడ్‌లో లేనందున నేనొక సూట్‌కేసు, పోలీసు అధికారి మరొక సూట్‌కేసూ పుచ్చుకుని రైల్వే పోలీసు

స్టేషన్‌కి చేరాం అది ప్లాట్‌ఫారం మీద ఉన్న పెద్దగది నాతోబాటు ఆ రైలులోనే పారిస్ వెడుతున్న బెల్జియం పౌరుడు తూర్పు జర్మనీ గుండా ప్రయాణించడానికి కావలసిన అనుమతి వీసా లేనందున పోలీసు స్టేషనుకు వచ్చాడు మా బాధను ఇనుమడింపచేయడానికి ఆ రోజు ఆదివారం అయింది విదేశాంగ కార్యాలయం పనిచేయదు ఆదివారం కావడంవల్ల మామూలుగా ఆ స్టేషనులో ఉండే దుబాసీలు కూడాలేరు, ఇక చూడండి అవస్థ!

పోలీసు అధికారి ఏమి చెబుతున్నాడో నాకు అర్థంకాదు గుడ్డిలో మెల్లగా మాతో ఉన్న బెల్జియన్ పౌరునికి జర్మను ఫ్రెంచి భాషలు వచ్చినందున బ్రతికిపోయాం పోలీసు అధికారి జర్మనులో చెప్పింది అతడు నాకు ఫ్రెంచిలో చెప్పి సహాయ పడ్డాడు నా పాస్‌పోర్టుమీద నేను జర్మనీలో ప్రవేశించినట్లు ముద్ర పడితేతప్ప నావద్ద ఉన్న విదేశీ ద్రవ్యం పౌండ్లు, డాలర్లు మార్చుకోవడానికి వీలులేదు జర్మను మార్క్కులు నావద్దలేవు ఏదో శాస్త్రం చెప్పినట్టు చుట్టూ నీళ్ళున్నా త్రాగడానికి ఒక్క చుక్కకూడా లేదన్నట్టు తయారయింది నా పరిస్థితి

విదేశాంగ కార్యాలయానికి వెళ్ళి మన అదృష్టం ఎలా ఉంటుందో ప్రయత్నిద్దాం పదమన్నాడు పోలీసు అధికారి మాతో ఉన్న బెల్జియం మిత్రుని వద్ద జర్మను మార్కులు ఉన్నాయి కాబట్టి మేం ముగ్గురం టాక్సీలో బయలుదేరాం ఆదివారం ఉదయం కావడంవల్ల నగరమంతా నిర్మానుష్యంగా ఉంది విదేశాంగ కార్యాలయంవద్ద బెల్జియం మిత్రుని పని జరిగింది అయనకు తూర్పుబెర్లిన్ మీదుగా ప్రయాణం చేయడానికి అనుమతినివ్వడమే కాబట్టి పెద్ద బెడద లేకపోయింది నేను వాళ్ళ దేశంలో వారం రోజులు ఉండడానికి వెళ్ళాను కాబట్టి నావీసా వ్యవధిని పొడిగించే అధికారం ఆరోజు ఆఫీసులో ఉన్న ఉద్యోగికి లేదట ఆ మరునటిరోజు అక్టోబరు 7వ తేదీ సోమవారం తూర్పు జర్మనీ జాతీయదినం కాబట్టి ప్రభుత్వ కార్యలయాలకు సెలవు మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు అయింది ఇక కర్తవ్యం ఏమిటంటే నేను వెంటనే పశ్చిమ బెర్లిన్‌కు వెళ్ళి అక్కడ రెండు రోజులుండి మంగళవారం తూర్పుబెర్లిన్ వస్తే నా వీసా వ్యవధి పొడిగించుకుని ఆదేశం చూడవచ్చునని సలహా చెప్పాడు పోలీసు మిత్రుడు ఈ సంబాషణ అంతా బెల్జియన్ మిత్రుని సహాయంతో జరిగింది

ఆ రోజుల్లో భారతీయులకు పశ్చిమజర్మనీ వెళ్ళడానికి వీసా అవసరం లేదు (1980 జూలై 18వ తేదీ నుంచి పశ్చిమ జర్మనీ వెళ్ళడానికి బారతీయులకు వీసా అవసరం) బెల్జియన్ మిత్రుడు వెళ్ళిపోయేలోపుగా పోలీసు మిత్రుణ్ణి చివరి ప్రశ్న అడిగాను నావద్ద ఆదేశపు డబ్బు ఒక్క పైసా లేదు కదా తూర్పు బెర్లిన్

నుండి పశ్చిమ బెర్లిన్ ఎలా వెళ్ళడం అన్నాను నీవేమీ దిగులుపడకు ఆ భారం నామీద వదలమన్నాడు పోలీసు అధికారి బెల్జియన్ మిత్రుడు వెళ్ళిపోయాడు నేను, పోలీసు అధికారి రైలు స్టేషనుకు తిరిగి వచ్చాం అప్పటికింకా తూర్పు పశ్చిమ బెర్లిన్ల మధ్య అడ్డుగోడ నిర్మించలేదు స్వేచ్ఛగా ఒక ప్రక్కనుండి మరో ప్రక్కకు యూబాన్ రైలులో వెళ్ళవచ్చును మళ్ళా నా సూట్‌కేసులు నేను పోలీసు అధికారి తీసుకుని రైలు వద్దకు వెళ్ళాం పశ్చిమ బెర్లిన్ వెళ్లే రైలులో కండక్టరు కూర్చునే పెట్టెలో కూర్చుండబెట్టి నన్ను జూ స్టేషనులో దింపమని కండక్టరుకు చెప్పాడు పోలీసు మిత్రుడు రైలు కదిలింది చిత్రం ఏమిటంటే పశ్చిమ బెర్లిన్‌లో జూ స్టేషన్‌లో టిక్కెట్టు లేకుండా రైలులో దిగినా ఎవరూ పట్టించుకోలేదు

ఉదయం 11 గంటలకు పశ్చిమ బెర్లిన్ చేరాను మార్పు కొట్టవచ్చినట్టు కనిపించింది అంతా ఇంగ్లీషు మాట్లాడుతున్నారనిపించింది 8 పౌండ్లు జర్మన్ మార్క్కులలోకి మార్చి చుట్టలు కొనుక్కొని సూట్‌కేసులు తీసుకుని"సమాచారం" వద్దకు వెళ్లాను అక్కడ ప్రయాణీకుల సౌకర్యార్థం సమాచారం చెప్పడానికి హోటల్ గదులు ఏర్పాటుచేసి పెట్టడానికి బహుభాషా పరిజ్ఞానం ఉన్న అమ్మాయిలు ఉన్నారు నాకు సామాన్యమైన హోటల్‌గది కావాలన్నాను ఆమె ఒకటి రెండు చోట్లకు టెలిఫోను చేసి బార్బెల్ అనే చిన్న హోటల్‌లో గది ఏర్పాటు చేసింది ఆ సహాయం చేసినందుకు 50 సెంట్లు తీసుకుంది టాక్సీలో ఎక్కి ఆమె ఇచ్చిన అడ్రసుకి వెళ్ళాను అక్కడ టాక్సీలు అన్నీ కొత్తకార్లే అవి ఏం కార్లనుకుంటున్నారు, ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన మెర్సిడిజ్ బెన్జ్, ఓపల్ కార్లు ఆశ్చర్యపోయాను రెండవ ప్రపంచ యుద్ధంలో బెర్లిన్ సర్వనాశన మయిపోయినదనే చిహ్నాలు కూడా ఏమీ లేకుండా ఆ పట్టణాన్ని పునర్నిర్మించారు కొత్త బెన్జి ఓపుల్ కార్లు టాక్సీలుగా ఉపయోగించే దర్జా ఆ దేశం యొక్క సిరి సంపదలకు నిదర్శనం అనిపించింది

'బార్బెల్' పశ్చిమ బెర్లిన్‌లో అత్యంత విశాలమైన ప్రముఖమైన మెయిన్‌రోడ్డు కుర్‌పుర్‌స్టెన్ డామ్‌మీద ఉంది రెండవ అంతస్తుకి సూట్‌కేసులు నేనే మోసుకోవలసి వచ్చింది స్నానం చేసి సేదతీరేటప్పటికి యజమానురాలు కాఫీ యిస్తానంటూ వచ్చింది ఐరిష్ కాఫీ త్రాగుతావా, టర్కిష్ కాఫీ చేయనా లేక పాలు పంచదార వేసుకుని కాఫీ త్రాగుతావా అంది కాఫీలో పాలు పంచదారకు బదులు బ్రాందీ పోసుకుంటే ఐరిష్ కాఫీ అవుతుంది పాలు, పంచదార, బ్రాందీ కలుపుకోకుండా చాలా స్ట్రాంగ్ డికాక్షన్ త్రాగితే టర్కిష్ కాఫీ త్రాగినట్టు నేను పాలు పంచదార కలిపిన కాఫీ

ఇమ్మన్నాను కాఫీ బ్రహ్మాండంగా ఉంది ఆ తరువాత లంచ్ చేయడానికి కుర్‌ఫుర్‌స్టెన్ డామ్ బులివార్డ్ మీద నడిచాను ఆ షాపులు, రోడ్డుప్రక్క కాఫీ షాపులు, కార్లు, ఒకటేమిటి ఆ సౌభాగ్యం కళ్ళు మిరుమిట్లు గొలిపాయి ఆ రోడ్డుమీద ఉన్న ఖరీదైన కింపిన్‌స్కీ రెస్టారెంటులో లంచ్ చేసాను వెయిటర్లు కూడా ఇంగ్లీషు మాట్లాడారు కాని టిప్పు వదలడం దగ్గర నేను పప్పులో కాలువేసాను బిల్లు మీద 10 శాతం సర్వీస్ చార్జెస్ అని బిల్లులో కలుపుతారు అదికాక వెయిటర్‌కి టిప్పు ఇవ్వడం ఆ దేశంలో ఆచారం అట ఇవ్వకపోయేసరికి వెయిటర్ నన్ను పురుగుని చూచినట్టు చూసాడు ఆ పొరపాటు మళ్ళా చేయలేదనుకోండి

అలా నడుస్తూ మన కాన్సల్ జనరల్ ఆఫీసుకి వెళ్ళాను కాన్సల్ జనరల్ సేథి ఆఫీసులో ఉన్నారు కాని భారతదేశంనుంచి వచ్చిన మంత్రిగారితో మాట్లాడుతున్నారని రిసెప్షనిస్టు చెప్పింది నేను కూర్చుంటాను కాని నా కార్డు ఆయనకు యిచ్చి రమ్మన్నాను చిత్రం ఏమిటంటే ఆ అమ్మాయి వెనుకనే కాన్సల్ జనరల్, మంత్రి హడావిడిగా బైటకువచ్చి నన్ను ఆహ్వానించారు శ్రీ సేథి నన్ను ఇంతకు ముందెప్పుడూ చూడలేదు కాని ఆయనతో మాట్లాడుతున్న మంత్రి మరెవరోకాదు శ్రీ మహావీర్‌త్యాగే! సేథీ నా కార్డుచూచి బి ఎస్ ఎన్ మూర్తా కూర్చోమన్నాడట నా పేరు విన్న మంత్రి 'మూర్తిగారే పదపద" అంటూ హాలులోకి వచ్చి ఆదరంగా ఆహ్వానించారు సేథికి మతిపోయింది ఆ తరువాత మేమిద్దరం సోవియట్ యూనియన్‌లోను, పోలెండులోను కలుసుకోవడం ఆ దేశాలలో నా గౌరవార్థం జరిగిన పార్టీలలో తాను పాల్గొనడం గురించి శ్రీత్యాగి మన కాన్సల్ జనరల్‌కి చెప్పారు పోలెండు వదలిన తరువాత నేను సామాన్య వినోద పర్యాటకునిగా ఉన్నానని ఆ ఉదయంనుంచి నేను పడ్డ అవస్థలు చెప్పాను ఏది జరిగినా మన మంచికొరకే అన్నట్టు సంతృప్తి పడ్డాను ఒక్క విషయంలో మాత్రం మంచి జరిగింది ఒక పశ్చిమ జర్మన్ మార్కుకి 4 తూర్పు జర్మన్ మార్కులు యిస్తున్నారు

ఆ మరునాడు హాంబర్గుకి రైలు టిక్కెట్టు కొన్నాను కాని పశ్చిమ బెర్లిన్ నుంచి హాంబర్గు వెళ్ళాలంటే తూర్పుబెర్లిన్ మీదుగా వెళ్ళాలి కాబట్టి వీసా ఉండాలన్నారు బెర్లిన్ నుంచి హాంబర్గుకి టిక్కెట్టు 26 పశ్చిమ జర్మన్ మార్కులు హాంబర్గులో హోటల్‌గదికోసం రెండు మూడుసార్లు టెలిఫోను చేయవలసివచ్చింది చివరకు బెర్లిన్‌లో ఉన్న మన కాన్సల్ జనరల్ ద్వారా హాంబర్గులో ఉన్న మన కాన్సల్ జనరల్ సహాయంతో అక్కడ ఒక హోటల్ గది సంపాదించగలిగాను ఒక గుజరాతి విద్యార్థితో కలసి తూర్పు బెర్లిన్ వెళ్ళాను అక్కడ హాయిగా చక్కటి భోజనం చాలా చౌకగా పూర్తిచేసి వారి

జాతీయ దినోత్సవాలు చూడ్డానికి వెళ్ళాం ఆ జన సందోహం, వారి ఆనందం, ఉత్సాహం, రంగురంగుల హరివిల్లులా ఉన్న అలంకారాలు కన్నుల పండుగగా ఉన్నాయి తూర్పుపశ్చిమ బెర్లిన్‌లను వేరుచేసే బ్రాండన్‌బర్గ్ గేటు, పూర్వపు రీచ్ స్టాంగ్, కాంగ్రెసుహాలు చూసాం తూర్పుజర్మనీలో నాలుగు రోజులు ఉండాలనే ఆలోచనకు స్వస్తి చెప్పాను

బెర్లిన్ జర్మనీలోని అన్ని పట్టణాలలోను పెద్దది దాని వైశాల్యం 347 చదరపు మీటర్లు జనాభా 3 3 మిలియన్లు అయితే రెండవ ప్రపంచయుద్ధం పుణ్యమా అంటూ బెర్లిన్ మహానగరం ముక్కలు చింపిన విస్తరి అయింది హిట్లర్‌కి వ్యతిరేకంగా ఇంగ్లండు అమెరికా దేశాలతో కలిసి పోరాడిన సోవియట్ రష్యాకు జర్మనీలో ప్రాముఖ్యత వచ్చింది జర్మనీ విభజించబడి ఒక భాగం రష్యా చెప్పుచేతలలోనికి వచ్చింది ఆ భాగాన్ని తూర్పుజర్మనీ అన్నారు బెర్లిన్‌పట్టణం కూడా తూర్పు పశ్చిమ భాగాలుగా విభజించబడింది పశ్చిమబెర్లిన్ విస్తీర్ణం 189 చ కి మీ 2 2 మిలియన్ జనాభా తూర్పు బెర్లిను 158 చదరపు కి మీ విస్తీర్ణం, 1 1 మిలియన్ జనాభా పశ్చిమ బెర్లిన్‌కి అన్ని ప్రక్కలా తూర్పు జర్మన్ భూభాగం ఉండడంతో అది ఒక ద్వీప కల్పంలా ఉంటుంది అంతేకాకుండా జర్మనీలోని రెండుభాగాలయొక్క ప్రగతి, సౌభాగ్యం జీవన ప్రమాణంలో భేదాలు చూపించడానికి పశ్చిమ బెర్లిన్ ప్రత్యక్ష నిదర్శనంలా ఉంటుంది పశ్చిమబెర్లిన్‌నుంచి రైలులోకాని, కారులోకాని బైటపడాలంటే తూర్పుజర్మన్ వీసా ఉండాలి ఆ వీసాకు 5 మార్కులు తీసుకున్నారు

బెర్లినులో తెలుసున్నవాళ్లు ఎవరూ లేనందున ఇక అక్కడ ఉండాలనిపించలేదు మొహం మొత్తినట్టు అయింది అక్టోబరు 9వ తేదీ ఉదయం గం 10-20కి రైలులో హాంబర్గ్‌కి బయలుదేరాను రెస్టారెంటు కారులో లంచ్ చేసాను ప్రయాణం చాలా సామాన్యంగా జరిగిపోయింది మొదటిసారిగా రెండవతరగతిలో ప్రయాణం చేసాను అది పగటి ప్రయాణం కాబట్టి ఇబ్బంది లేకపోయింది ఆ రోజే మధ్యాహ్నం గం 3-20కి హాంబర్గ్ సెంట్రల్ స్టేషనులో దిగాను హాంబర్గులో నాకు మంచిమిత్రులు ఉన్నారు కాని వారికి ముందుగా తెలియజేయనందున స్టేషనువద్ద నన్ను కలుసుకోవడానికి ఎవరూలేరు స్టేషనునుంచే మన కౌన్సిల్ జనరల్ ఆఫీసుకి టెలిఫోను చేసి నా హోటల్ గురించి అడిగాను వాళ్ళ పుణ్యమా అంటూ స్టేషనుకి దగ్గరలో ఉన్న హోటల్ రీచ్‌హాఫ్‌లో ఒకగది ఏర్పాటుచేసారు హాంబర్గులో షూల్ట్జు దంపతులను కలుసుకోవడానికి మార్గాలు ఆలోచించాను అంతలో హోటల్ హాల్‌పోర్టరు వారి అడ్రసుకి ఒక టెలిగ్రాం ఇవ్వమని సలహా చెప్పాడు అలా

చేసి విశ్రాంతి తీసుకున్నాను రాత్రి గం 7-20 అయ్యేసరికి లూయిస్ టెలిఫోను చేసింది వెంటనే టాక్సీలో ఆల్టోనా వెళ్ళాను అక్కడ లూయీస్ నాకోసం ఎదురుచూస్తోంది ఆమెను నేను లండనులో చదువుకున్నప్పటినుంచి ఎరుగుదును చాలా ఏళ్ళ తరువాత చూసాను ఆమె ఇంటికి వెళ్లాను ఆమె తల్లిదండ్రులు, భర్తను కలుసుకున్నాను నిద్రపోతున్న వాళ్ళ అబ్బాయి లేచి బోలెడు కబుర్లు చెప్పాడు అయితే నాకు జర్మన్ భాషరాదని ఆ పసివాడికి తెలియదు వాడు చెప్పింది నాకు వినబడడంలేదనే ఉద్దేశ్యంతో చక్కగా వినబడే యంత్రం ఏర్పాటు చేసుకోవాలని నాకు సలహా చెప్పాడు అంతకు ముందు నల్లటివాళ్లను చూచి ఉండడు అందుకే వాళ్లకు బొగ్గులు తెచ్చేవానిలా ఉన్నానని నన్ను ఆశ్చర్యంగా చూసాడు అర్థరాత్రి దాటిపోయింది నేను హాంబర్గులో దిగినరోజునే లూయిస్‌ని ఆమె కుటుంబాన్ని చూడగలిగినందుకు సంతోషించాను

ఆ మరుసటిరోజు ఉదయం కుక్స్ కంపెనీకి వెళ్ళి హాంబర్గునుంచి పారిస్‌కి రెండవతరగతి రైలుటిక్కెట్టు కొన్నాను ఆ టిక్కెట్టు ఖరీదు 68 డూష్‌మార్కులు పడుకోవడానికి బెర్తు దొరకలేదు ఆ ప్రయాణం కూర్చుని చేయవలసినదే జర్మనీనుంచి ఫ్రాన్సు వెళ్లేటప్పుడు రైలు బెల్జియం దేశం మీదుగా వెళుతుంది కాబట్టి ఆ దేశంగుండా ప్రయాణం చేయడానికి వీసా కావాలన్నారు అక్కడనుంచి బెల్జియమ్ కాన్సులేట్‌కి వెళ్లాను వీసాకోసం అయితే నేను బెల్జియం వెళ్లడానికి మన ప్రభుత్వం అంగీకరిస్తూ అనుమతిని నాపాస్‌పోర్టులో ఉదహరించాలి ముందు ఆ అనుమతి పాస్‌పోర్టులో వేయించుకు రమ్మన్నాడు మన కాన్సులేట్ జనరల్ ఆఫీసుకి వెళ్లాను నేను హాంబర్గులో మరొక నాలుగు రోజులు ఉంటాను కాబట్టి రెండు మూడురోజులలో బెల్జియన్ ట్రాన్సిట్ వీసా తెప్పించి పెడతానన్నాడు ఆ ఆఫీసులో పనిచేసే అసిస్టెంటు శ్రీ బోసు కాన్సల్ జనరల్ శ్రీ పటేల్ పట్టణంలో లేడట ఆల్టోనా వెళ్లి లూయీస్ కుటుంబంతో గడిపాను సాయంకాలం ఎల్బ్ నదీతీరాన వాహ్యాళికి వెళ్లాం అయితే హాంబర్గులో అటువంటి పిచ్చిపని ఎవరూ చేయరు జర్మనీలోని అన్ని పట్టణాలలోను ఆ మాటకు వస్తే యూరప్‌లోని అన్ని పట్టణాలలోను నైట్‌క్లబ్బులు, బార్లు, డాన్సుహాల్సు, రాత్రి కాలక్షేపాలకు హాంబర్గుకి పెట్టినది పేరు అయితే కన్నులు మిరుమిట్లు గొలిపే ఆ నియోన్ రంగులదీపాల వినోద కేంద్రంలో అడుగుపెట్టాలంటే బోలెడు డబ్బు కావాలి జర్మనీలో అడుగుపెట్టిన నాటినుంచి ఖర్చంతా నాదేకాబట్టి వొళ్లుదగ్గర పెట్టుకుని ఖర్చు చేయవలసిన అవసరం వచ్చింది

ఎంత జాగ్రత్తగా ఖర్చుపెట్టినా చాలాడబ్బు ఖర్చు అయింది భారత కాన్సల్ జనరల్ శ్రీ పటేల్‌ను కలుసుకుని మాట్లాడాను బెల్జియన్ వీసాతో నా పాస్‌పోర్టు తీసుకున్నాను 5 మార్కులు ఇచ్చి హాంబర్గులో చూడదగ్గవన్నీ బస్సులోవెళ్లి చూచివచ్చాను ఆ తరువాత నేను, లూయిస్ ఎల్బనది దాటి అవతలప్రక్క ఉన్న చిన్నదీవికి వెళ్ళి సాయంకాలం వరకు గడిపాం 14వ తేదీన సాయంకాలం హాంబర్గు నుంచి పారిస్‌కి రైలులో బయలుదేరాను ఆ రైలు డెన్మార్క్ దేశం ముఖ్య పట్టణమైన కోపెన్ హాగన్‌నుంచి ఫ్రాన్సు ముఖ్యపట్టణమైన పారిస్ వరకు వెళుతుంది రైలు సాయంకాలం 6 37 నిమిషాలకు వచ్చింది లూయిస్, భర్త పిల్లలు స్టేషనుకి వచ్చారు గం 6 50 కి రైలు బయలుదేరింది కూర్చొనడానికి సీటు దొరికింది రాత్రంతా నిద్రలేదు తెల్లవారేముందు ఆ పెట్టెలో నేను, ఒక జర్మను డాక్టరు, ఒక జర్మను అమ్మాయి మాత్రం ఉన్నాం

## పారిస్ అందాలు

ఉదయం గం 8-50 కి రైలు పారిస్ చేరింది పారిస్‌లో ఎక్కడైనా హోటల్ గది ఏర్పాటు చేసుకున్నావా? అని జర్మను డాక్టరు అడిగాడు నేను ముందుగా ఎక్కడా మకాం ఏర్పాటు చేసుకోకుండా పారిస్‌లో దిగుతున్నానంటే అతడు ఆశ్చర్యపోయాడు భాష తెలియని మాస్కోలోనే అలా దిగగాలేనిది కొద్దో గొప్పో ఫ్రెంచిభాష తెలిసిన వాణ్ణి కాబట్టి పారిస్‌లో అలా దిగడానికి ధైర్యం చేసాను ఆ జర్మను మిత్రుడు ఏదో హోటులులో గది ఏర్పాటు చేసుకున్నాడట నన్నుకూడా అక్కడకు రమ్మన్నాడు టాక్సీలో అక్కడకు వెళ్లాం స్నానానికి బాత్‌రూమ్ ఉంటే ఆగదికి స్నానంగది లేనిగదికంటే రెట్టింపుపైనే అద్దె ఉంది అయినా స్నానాలగదితో ఉన్నగది పుచ్చుకున్నాను అయితే తీరా స్నానం చేయబోతే అక్కడ ఉన్న ఏర్పాటు నన్ను ఆశ్చర్యంలో ముంచింది అది అమెరికన్ పద్ధతి షవరుకాదు ఇంగ్లీషు పద్ధతిలో టబ్‌కాదు కూర్చుని స్నానం చేయడానికి అతి చిన్న తొట్టెలా నిర్మించారు

టాక్సీలో బ్యాంకుకి వెళ్లాను నేను హెనోయ్ నుంచి బయలుదేరేముందు అక్కడ లండను అబ్జర్వర్ పత్రిక ప్రత్యేక ప్రతినిధిగా ఉన్న డెన్నిస్ బ్లడ్‌వర్త్ వద్ద పారిస్‌లోను, లండన్‌లోను విదేశీ మారకద్రవ్యం తీసుకోవడానికి వీలుగా ఉత్తరాలు తీసుకువచ్చాను అతడివద్ద చెక్కుపుస్తకం లేనందున ఆ జాబు తీసుకువచ్చిన వారికి రు 1300ల విలువైన ఫ్రెంచి ఫ్రాంకులు యివ్వవలసినదని ఒక తెల్లకాగితం మీద వ్రాసి యిచ్చాడు ఆ కాగితం

తీసుకువెళ్ళి పారిస్‌లోని బ్యాంకులో యిచ్చాను దానితోపాటు నా పాస్‌పోర్టు కూడా ఇచ్చాను ఆ బ్యాంకు గుమాస్తా ఆ కాగితాన్ని లోపలకు తీసుకు వెళ్ళి ఐదు నిమిషాలలో వచ్చి37,000 ఫ్రాంకులు నా చేతిలో పెట్టాడు ఆశ్చర్యపోయాను

తిరిగి హోటల్‌కి వెళ్లేముందు లంచి చేద్దామని ఒక రెస్టారెంటుకి వెళ్ళాను ఫ్రెంచి పౌరులకు తమ భాషలోనే మాట్లాడాలనే పట్టుదల హెచ్చు ఇంగ్లీషు భాష ప్రపంచభాష కావడానికి ముందు యూరోపులో రాజభాష ఫ్రెంచి ఇంగ్లండు అమెరికాలలో కూడా విదేశ వ్యవహారాలలో ఫ్రెంచి భాషకే ప్రాముఖ్యత ఉండేది రానురాను ఆ పరిస్థితి మారిపోయింది దానికితోడు ఫ్రాన్సు రాజకీయంగా బలహీనం కావడంతో ఫ్రెంచిభాషకు పూర్వం ఉన్న ఔన్నత్యం తగ్గిపోయింది కారణం ఏమైనప్పటికి ఫ్రెంచిపౌరులు ఇంగ్లీషు వచ్చినా ఫ్రెంచిలో మాట్లాడతారు నేను కూడా ఆంధ్రా యూనివర్శిటీలో ప్రాథమిక ఫ్రెంచి పరీక్షలో ఉత్తీర్ణుణ్ణయ్యాను లండను యూనివర్సిటీలో పిహెచ్ డి కోసం ఫ్రెంచిని రెండవ భాషగా ఎన్నుకున్నాను అంతే కాకుండా మూడేళ్ళు ఇండో చైనాలో నగం ఇంగ్లీషు నగం ఫ్రెంచి మాట్లాడుతూ గడిపినందున నాకు ఫ్రెంచి భాష వచ్చు ననుకునేవాణ్ణి తీరా పారిస్ రెస్టారెంటులో ఫ్రెంచి భాషలో నేను లంచి ఆర్డరుచేస్తే బేరర్‌కి ఒక్కముక్క అర్థం కాలేదు సిగ్గుపడడం నా వంతు అయింది చివరకు తేలినదేమిటంటే నాకు కొద్దో గొప్పో భాష వచ్చినా సరి అయిన ఉచ్చారణ రాదని నా ఫ్రెంచి భాషాపరిజ్ఞానం తలుచుకున్నప్పుడల్లా ఒక సన్నివేశం గుర్తుకి వస్తుంది ఢిల్లీ ఆకాశవాణిలో ఒక ఫ్రెంచి యువతి పనిచేసేది మంచి మిత్రురాలు ఒకసారి ఏదో సందర్భంలో 'మద్‌మోసెల్ ఊత్రేజాంతి' అన్నాను అంటే మిస్ నీవు చాలా మంచిదానివని అయ్యో ఫ్రెంచి భాషను ఖూనీ చేస్తున్నానని ఆమె నామీద విరుచుకుపడింది నాకు అర్థంకాలేదు ఊ కాదు ఉజెత్ అనాలంది నేను క్రియాపదాన్ని వదలివేసానని ఆమెబాధ, నీవంటి అందకత్తెకోసం ఒక వెర్బ్ ఏమి ఖర్మ రెండు వెర్బ్‌లు వదలుతానని చమత్కరించి తప్పించుకున్నాననుకోండి

ఆ సాయంకాలం జర్మన్ మిత్రునితో కలిసి బైటకువెళ్ళి ఒక చిన్న రెస్టారెంటులో భోజనం చేసాం దానికి అయిన ఖర్చు పరమచౌక నేను నిజంగా నమ్మలేకపోయాను అయితే ఆ రెస్టారెంటు చాలా చౌకబారుది చాలా పేదవారు భోజనంచేసే చోటు ఈపరిస్థితి పారిస్‌లోనే కాదు, ప్రపంచం అంతా ఉంటుంది మనదేశంలో కూడా ఢిల్లీవంటి పట్టణాలలో ఖరీదైన రెస్టారెంటులో ఖరీదైన భోజనంకంటే మంచి భోజనం కాకా హోటల్‌లో అంతకంటే

తక్కువధరకే లభిస్తుంది దానికి కారణాలుకూడా మనకు తెలుసు ఆ రాత్రి మొయోల్ నైట్‌క్లబ్‌లో కార్యక్రమం చూడ్డానికి వెళ్లాం ఆరాత్రి అయ్యే ఖర్చంతా జర్మను డాక్టరు పెట్టుకునేటట్టు, హోటల్‌కి చేరిన తరువాత ఆ ఖర్చు చెరిసగం పంచుకునేటట్టు ఒప్పందం మా మిత్రుడు టిక్కెట్లు కొన్నాడు లోపలకువెళ్లే గేటులో ఆ క్లబ్బు యూనిఫారంలో ఆరు అడుగుల ఎత్తు ఉన్న ఫ్రెంచి ఆఫ్రికన్ మా టిక్కెట్లు ఒక చివర పిసరంత చింపి "సర్వీస్‌ప్లీజ్" అని చెయ్యిచాపాడు మా డాక్టరు వానిచేతిలో కొన్ని ఫ్రాంకులు పెట్టాడు అతడికి టిప్పు ఎందుకు ఇవ్వాలో నాకు అంతుచిక్కలేదు

సరే లోపలకువెళ్ళి వోవర్‌కోట్లు భద్రపరిచే చోటుకు వెళ్లాం అక్కడ ఒక అమ్మాయి కోటు జాగ్రత్తచేసినందుకు ఇవ్వవలసిన సొమ్ము ఇవ్వగానే సర్వీస్ ప్లీజ్ అని చెయ్యిచాపింది ఆమెకు కూడా ఏదో ముట్టచెప్పాడు మా మిత్రుడు ఇక ఫోయర్ మధ్యలో అర్థనగ్నంగా ఉన్న ఒక ముద్దుగుమ్మ ప్రోగ్రాం పుస్తకాలు అమ్ముతుంది అవి కొనుక్కోవడానికి పెద్దక్యూ ఆ క్యూలో మేమూ నిలబడ్డాం నావంతు వచ్చేసరికి ఒక ప్రోగ్రాం పుస్తకంకొని దానివెల ఇచ్చాను సర్వీస్ ప్లీజ్ అని చెయ్యిచాపింది ఆ అందాలరాశి నాకు నిజంగా మతిపోయింది పుస్తకం ఖరీదు ఇచ్చాక ఇంకా టిప్పు ఎందుకో అర్థం కాలేదు అదేమాట ఆ అమ్మాయికి అర్థం అయ్యే ఫ్రెంచిలో అన్నాను ఆమె ఒక చిరునవ్వు నవ్వి సర్వీస్ ప్లీజ్ అంది నా వెనుక క్యూలో ఉన్నవారు తొందరపడుతున్నారు వాళ్ళంతా మంత్రముగ్ధుల్లా కదులుతున్నారు ఇంకా ఆలస్యంచేస్తే వాళ్ళంతా తిట్టుకుంటారని ఆమెకు టిప్పు ఇచ్చి ముందుకు నడిచాను

కార్యక్రమం ఇంకా ప్రారంభం కాలేదు ఆ దీపాలకాంతిలో మన సీట్లు కనుక్కోవడం కష్టంకాదు కాని పారిస్‌లో అందునా నైట్‌క్లబ్‌లో మీసీట్లు మీరు వెతుక్కోరు మరొక అందాలరాశి చేతిలో టార్చితో ప్రత్యక్షమయింది మాటిక్కెట్లు తీసుకుని ఆమె ముందుకువెళ్ళి ఒక క్షణంలో మా సీట్లు చూపించింది మేం కూర్చోవడం తడువుగా సర్వీస్‌ప్లీజ్ అని చెయ్యిచాపింది మా మిత్రుడు కొన్నిఫ్రాంకులు ఆమె చేతిలో పెట్టాడు అవి చూచి మళ్ళీ సర్వీస్‌ప్లీజు అంది ఆ వెలుగులో హాలులో ఉన్నవారంతా మావైపే చూస్తున్నారు మా ముందు వరుసలో కూర్చున్న అమెరికన్ దంపతులకు మా పరిస్థితి అర్థమైంది పారిస్‌నైట్ క్లబ్‌కి కొత్తగావచ్చిన ముజాబస తెలిసిపోయింది నెమ్మదిగా ఇంగ్లీషులో మనిషికి ఇన్నిఫ్రాంకులు టిప్పు ఇవ్వాలని చెప్పాడు అలాగే ఇచ్చాడు మా మిత్రుడు ఆ అందకత్తె "మెర్సీ" చెప్పి వెళ్లిపోయింది నాకు నిజంగా అదంతా చాలా అసభ్యం అనిపించింది కాని

ఫ్రెంచి పద్ధతిలోని ప్రత్యేకత ఏమిటంటే ఈ అందగత్తెలకు క్లబ్బువారు జీతాలు యివ్వరట ఆ టిప్పులమీద వచ్చిన రాబడే వారి జీవనోపాధి అని విన్నతరువాత కూటికొరకే కోటివిద్యలని సమాధానపడ్డాను

కార్యక్రమం బాగానే ఉంది నైట్‌క్లబ్‌లలో కూడా స్త్రీలు పూర్తిగా వివస్త్రలై ప్రేక్షకులముందు నృత్యప్రదర్శన చేస్తారనుకోవడం పొరపాటు ఈ ప్రదర్శనలు పెద్దలు, పిన్నలు, స్త్రీలు, పురుషులు కూడా కుటుంబాలతో వచ్చి చూస్తారు అయితే పూర్తిగా నగ్నంగా ఉన్న స్త్రీలు డాన్సుచేసే జాగా లోపలుంది చూస్తారా అని చాటుగా అడుగుతారనుకోండి నగ్నంగా స్త్రీలుకాని, పురుషులు కాని బహిరంగంగా ప్రదర్శనలు ఇవ్వడం శాసనరీత్యా నిషిద్ధం ఈ విషయంలో బ్రిటిషు ప్రభుత్వ నియమాలు చాలా చిత్రంగా ఉంటాయి బ్రిటిషు ప్రజల ప్రవర్తన విషయంలో నియమాలుచేసే అధికారం లార్డ్‌ఛాంబర్లిన్‌ది అయన నిర్ణయించిన ప్రకారం ఏ ప్రదర్శనలో కూడా స్త్రీ, పురుషులు నగ్నంగా స్టేజిమీద తిరగకూడదు అయితే వారు కదలకుండా ఉండేపద్ధతిలో నగ్నంగా నిలబడితే అభ్యంతరం లేదు వారు కదిలితే మాత్రం రెండు షిల్లింగుల ఖరీదైన గుడ్డతో వారి మర్మాంగాలను కప్పాలి ఈ నియమం దేశంలో, విక్టోరియా మహారాణి పాలించిన రోజుల నాటిదై ఉంటుంది రోజుల్లో రెండు షిల్లింగులకు బోలెడుగుడ్డ లభించేది కాబోలు కాని ప్రస్తుతం డబ్బుకి సిగ్గుబిళ్లగా పనికివచ్చేటంత గుడ్డ కూడా దొరకదు అయినా ఇంకా ప్రదర్శనలలో ఉపయోగించే గుడ్డకు విలువతోనే ముడిపెట్టి ఉంచారు అది బ్రిటిషువారి కన్సర్వేటిజానికి నిదర్శనం ఎవరి వెర్రి వారికి ఆనందం

మరుసటిరోజు నిద్రలేచేసరికి హోటల్‌లో దీపాలులేవు హాంబర్గ్‌లో లూయిస్ బహుమానంగా ఇచ్చిన కాండిల్ లాంప్ తీసి వెలిగించి కాలకృత్యాలు పూర్తిచేసాను గదిలోనుంచి బైటకు వచ్చిన తరువాత తెలిసింది అసలువిషయం విద్యుత్‌శాఖ కార్మికులు సమ్మెచేస్తున్నారట ఆ మహానగరంలో ఎక్కడా విద్యుత్తులేదు అందు మూలంగా మెట్రో రైళ్లు నడవడం లేదు భారత రాజదూత ఆఫీసుకి వెళదామని నేను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి విద్యుత్తు సమ్మె పుణ్యమా అంటూ ఆరోజంతా ఎక్కడకూ కదలడానికి వీలుపడలేదు మన ఎంబసీకి టెలిఫోనుచేసి శ్రీ సన్యాల్‌కి నా అవస్థ చెప్పుకొని ఎంబాసిడర్ శ్రీ కె యస్ ఫణిక్కర్‌ని చూడ్డానికి ఆమరునాడు వస్తానని చెప్పుకున్నాను అమెరికన్ మిత్రుడు స్నైడర్‌కి ఫ్రెంచి మిత్రుడు ప్రొఫెసర్ రిగలాఫ్‌కి టెలిఫోను చేసాను చిత్రం ఏమిటంటే మిత్రుడు స్నైడర్‌తో ఏడాది క్రితం వియత్నాంలో ఉండగా పారిస్‌లో కలుసుకోవడానికి ఏర్పాటు చేసుకున్నాం అతడికి పారిస్‌లో

ఉద్యోగంలేదు పని అంతకంటే లేదు కాని స్నైడర్ దంపతులు పారిస్‌లో శాశ్వతంగా ఒకగది అద్దెకు పుచ్చుకుని వారికి అమెరికాతో మొహం మొత్తినప్పుడు పారిస్ వచ్చి కొన్నిరోజులు గడిపి వెళుతుంటారు అది అమెరికన్ సంపన్నుల సరదా టెలిఫోను చేయగానే భార్యాభర్తలు వచ్చారు లంచ్‌కి వెళ్ళాం కాని వారికుమారుడు అనారోగ్యంతో బాధపడుతున్నందున అంత సరదాగా గడపలేకపోయాం

ప్రొఫెసర్ రిగలాఫ్ కుటుంబాన్ని వియత్నాంలో ఎరుగుదును ఆయన సొర్‌బాన్ విశ్వవిద్యాలయంలో చైనీస్ భాషలో ఆచార్యులు ఆయనకు భారతదేశం అంటే ప్రత్యేక అభిమానం వియత్నాంలో ఫ్రెంచిప్రభుత్వ సాంస్కృతిక విభాగానికి అధిపతిగా ఉండేవాడు నేను పారిస్ వెళ్ళేనాటికి తిరిగి యూనివర్శిటి ఉద్యోగంలో చేరాడు టెలిఫోను చేయగానే ఆరాత్రికి భోజనానికి రావాలన్నారు కాని విద్యుత్ సమ్మె మూలంగా నేను ఎక్కడికీ కదలలేని పరిస్థితిలో ఉన్నందున ఆయనే కారులోవచ్చి పారిస్ నగరానికి బైట ఉన్న తమ యింటికి తీసుకువెళ్లాడు మదాం రిగలాఫ్ అద్భుతమైన డిన్నర్ తయారు చేసింది ఆరాత్రి దీపాలు లేనందున హాయిగా కాండిల్ లైట్ డిన్నరు చేశాం మిత్రుడు రిగలాఫ్ సతీసమేతంగా నన్ను పారిస్‌లో హొటల్ వద్ద దిగబెట్టి వెళ్ళాడు

స్నైడర్‌కి కాని రిగలాఫ్‌కి కాని నాతోపాటు తిరిగి పారిస్ నగరంలోని ఆకర్షణలు అందాలు చూపించడానికి తీరిక లేకపోవడంతో నేను వంటరిగా తిరగవలసి వచ్చింది ప్రపంచంలో అన్ని దేశాలవారు పారిస్ అంటే పడిచచ్చిపోతారు ఆ మహానగరం దాని అందాలు చూచి తరించాలని ఉవ్విళ్ళూరతారు పారిస్ చూస్తే కాని జన్మ తరించదనుకునేవారు కోకొల్లలు కాని నగరంలోని ఆకర్షణలు భవనాలు కట్టడాలు దాని స్వరూపం ఆర్టు గ్యాలరీలు, మ్యూజియములు, ప్రజలజీవన సరళిచూచి ఆనందించాలంటే తోడు కావాలి మన ఆనందాన్ని పంచుకోలేకపోతే ఎంత అందాన్ని చూచినా మనస్సుకి తృప్తి ఉండదు అదే జరిగింది నా విషయంలో, అయినా అంతదూరం వెళ్ళి ఆ మహానగరంలోని అందాలు చూడకుండా వచ్చేటంత వెర్రివాళ్ళు ఉండరుకదా!ఫ్రాన్సు దేశానికి ముఖ్య పట్టణమైన పారిస్ మహానగరంలో 28 లక్షల జనాభా ఉంది ఆ పట్టణం విస్తీర్ణం 10,500 హెక్టార్లు దాని చుట్టుకొలత 50 కిలోమీటర్లు పారిస్ మహానగరాన్ని 20 మునిసిపల్ కార్పొరేషన్లుగాను 80 క్వార్టర్లుగాను విభజించారు ప్రతి కార్పొరేషనుకి ఒక మేయరు, ప్రతి క్వార్టరుకి ఒక పోలీసు స్టేషను ఉన్నాయి పారిస్ యొక్క అందం మాటల్లో చెప్పడం సాధ్యం కాదు ఆ మహానగరంలో

ప్రతి భవనానికి, బ్రిడ్జికి, చర్చికి, మ్యూజియమ్‌లకు చరిత్ర ఉంది పారిస్ పౌరులకు తమ రాజధానీ నగరం అంటే ఎనలేని అభిమానం వారికి ఎంతో గర్వం విదేశీ పర్యాటకులు ఆ నగరాన్ని దానిలోని అందాలను ఆకర్షణలను చూడ్డానికి అధమం నాలుగు రోజులు పడుతుంది సామాన్యంగా పర్యాటకులను హెచ్చుగా ఆకర్షించే ఐఫల్ టవరు ఎత్తు 300 మీటర్లు ఇది ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన ఆకర్షణ పిరమిడ్ ఆకారంలో ఉన్న ఈ టవరు పూర్తిగా ఉక్కుతో నిర్మించబడినది దీని నిర్మాణం 1887 జనవరిలో ప్రారంభమయింది దీని బరువు ఏడు మిలియన్ కిలో గ్రాములు

ఐఫల్ టవరు ప్రపంచంలో అన్ని ప్రాంతాలకు టెలిగ్రాంలు పంపడానికి, అన్ని చోట్ల నుంచి టెలిగ్రాంలు అందుకోవడానికి ఉపయోగిస్తుంది రెండవ ప్రపంచ యుద్ధంలో ఈ టవర్ పరిశీలనా కేంద్రంగా బాగా ఉపయోగపడింది దాని పైకి లిఫ్టులో వెళ్లవచ్చును నడిచే ఓపిక, సరదా ఉన్నవాళ్ళకు మెట్లు కూడా ఉన్నాయి పై అంతస్తులలో కాఫీ హోటళ్ళు ఉన్నాయి నేను ఐఫల్ టవర్ పైకి వెళ్ళి పారిస్ పట్టణమంతా నాలుగు ప్రక్కలాచూచి ఆనందించే సమయంలో నలుగురు అమ్మాయిలు వచ్చి "మీరు ఏదేశంనుంచి వచ్చా" రన్నారు నేను సమాధానం చెప్పి మరి మీరో అన్నాను మీరు చెప్పుకోండి చూద్దాం అన్నారు వారంతా యూరోపియన్ డ్రెస్ వేసుకున్నారు కాని యూరోపియన్లు కాదనిపించింది, కాని వారు ఏ దేశస్తులో చెప్పలేకపోయాను చివరకు వారు లెబనాన్‌నుంచి వచ్చామన్నారు అంతకు ముందు నేను లెబనాన్ అమ్మాయిల్ని చూడనందున గుర్తుపట్టలేకపోయాను వారు పారిస్‌లో వైద్యవిద్య అభ్యసిస్తున్నారు ఐఫల్ టవర్ మీద నిలబడి ఆ అందమైన అమ్మాయిలతో కలిసి పారిస్ అందాలు చూస్తే పారిస్ మరీ అందంగా కనిపించింది

పారిస్‌లో ఎటు వెళ్ళినా నగరం నడిబొడ్డులో ఉన్న సీన్ నదిని దాటాలి ఆ నదిమీద కట్టిన వంతెనలు కూడా చాలా ఆకర్షణీయంగా ఉంటాయి మూడవ అలెగ్జాండరు బ్రిడ్జికి 1896 అక్టోబరులో రెండవ జార్ నికలస్ శంఖుస్థాపన చేసారు వందమీటర్ల పొడవైన ఒకే స్టీలు ఆర్చి సీన్ నది మీద నిర్మించారు దాని స్థంభాలమీద అనేక కాంశ్య విగ్రహాలు ఉన్నాయి

ఇక లూవ్ర్ మ్యూజియమ్ ఫ్రెంచివారికి గర్వకారణం దానిలోనే ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన మోనలీసా పెయింటింగ్ ఉంది ఆ మ్యూజియం భవనం 40 హెక్టార్ల స్థలంలో ఉంది నాలుగు అంతస్తుల భవనం మ్యూజియం అంతా చూచి బైటకు వచ్చిన తరువాత మోనలీసా పెయింటింగ్ చూడలేదని గుర్తుకి వచ్చి మళ్ళా లోపలకు వెళ్ళాను మోనలీసా నవ్వుతుంది కాని మనకు అది

నవ్వులా అనిపించదు ఏదో విచిత్రమైన ఆకర్షణ, ఆ అనుభూతి వర్ణనాతీతం ఇక సమయం ఉన్నప్పుడల్లా షాంప్ ఎలిసీస్ ప్రొమనాడ్‌లో నడవడం గొప్ప కాలక్షేపం, వెర్ సైల్స్, ఫాంటేన్‌బ్లూ, నోటర్‌డాం, సోర్ బాన్ విశ్వ విద్యాలయం చూడలేకపోయినా పారిస్ చూచిన అనుభూతి వర్ణనాతీతం

పారిస్ అందాలు చూడ్డంలో తలమున్కలైనప్పటికి భారతరాయబారి సర్దార్ కె ఎం ఫణిక్కర్‌ని చూడ్డానికి వెళ్ళడం మర్చిపోలేదు శ్రీ ఫణిక్కర్ చాలా అనుభవం ఉన్న డిప్లొమాట్ మర్యాద పూర్వకంగా ఆయన్ని చూడ్డానికి వెళ్ళాను కాని ఆయనతో నాకు చిన్నపని కూడా ఉంది నేను వియత్నాంపై వ్రాసిన గ్రంథాన్ని లండనులో ప్రచురించడానికి ఆయన సహాయం అర్థించాను, ఆయన ఈజిప్టులో భారత రాయబారిగా ఉండగా నేను వ్రాసిన 'నెహ్రూవిదేశ నీతి' అనే గ్రంథం మీద చక్కటి అభిప్రాయాలు వ్రాసి పంపారు లండనులో లిటరరీ ఏజెంటుని నియమించడంలో తోడ్పడమని అడిగాను ఆయనకు ఎదురుగా ఉన్న మనిషితో మాట్లాడేటప్పుడు చూరువైపు చూడ్డం అలవాటనిపించింది ఆయన పెద్ద ఉత్సాహంగా మాట్లడలేదు చాలా నిరుత్సాహంగా బైటపడ్డాను అయితే నేను లండనులో దిగిన రెండవ రోజున 'లండను అబ్జర్వరు' న్యూస్ ఎడిటరు నాకు టెలిఫోనుచేసి పారిస్ నుంచి ఫణిక్కర్ తనకు నా గురించి జాబు వ్రాసాడని నా పనికి మంచి ఏజెంటుని చూచిపెడతానని భరోసా ఇచ్చాడు ఇలా చేస్తానని శ్రీ ఫణిక్కర్ నాతో సూచనప్రాయంగా కూడా అనకపోవడం నన్ను నిజంగా ఆశ్చర్యపరిచింది

అయితే వారం రోజులు పారిస్‌లో గడిపిన తరువాత ఇక లండను వెళ్ళాలనే తొందరపుట్టింది పారిస్ నుంచి ఇంగ్లీషు ఛానల్ దాటి రైలు డోవర్ చేరడంతో ఇంగ్లాండులో అడుగుపెట్టినట్టే! నేను 1949 నుంచి 1952 వరకు సుమారు నాలుగు సంవత్సరాలు లండను విశ్వవిద్యాలయంలో చదువుకున్నాను ఇంగ్లాండు, లండను విశేషాలు వ్రాయడం మొదలు పెడితే అదంతా పెద్ద గ్రంథం అవుతుంది అంతేకాకుండా ఆంగ్లేయులు మనదేశాన్ని రెండు వందల సంవత్సరాలు పరిపాలించడం మూలంగా మనదేశంలో ఇంగ్లండు గురించిన వివరాలు ఎక్కువగా తెలుసు అందుమూలంగా లండను విశేషాలు చెప్పడం సమంజసం కాదేమో అనిపించింది కాని ఒక్క విషయం చెప్పాలి నేను లండనులో చదువుకున్నప్పుడు ప్రొఫెసర్ కార్నికన్ పది పౌన్లు ఇచ్చి ఆదుకున్నాడు ఆ సొమ్ము ఇచ్చేసాను దురదృష్టవశాత్తు శ్రీమతి టిటర్‌టిన్ 5 వ నంబరు టావిటన్‌వీధి ఇల్లు ఆడపిల్లల హాస్టల్‌కి అద్దెకిచ్చి లండను వదలిపెట్టినట్లు తెలుసుకుని ఆమెను కలుసుకోలేక పోయినందుకు విచారించాను మిస్ థారన్, ప్రొఫెసర్ హాల్ ఇతర మిత్రుల్ని కలుసుకున్నాను

తిరిగి 1965 లో ఎయిర్ ఇండియా ఫిజీ దీవులకు సర్వీసు ప్రారంభించిన సందర్భంలో ఫిజీ దీవులనుంచి లండను వెళ్లాను ఆ సందర్భంలో లండనులో ఉన్న వ్యవధి తక్కువ కావడం వల్ల ఇంగ్లండులో వివిధ ప్రాంతాలలో ఉన్న నా మిత్రులనందరినీ లండను ఆహ్వానించి వారికి లంచ్ ఏర్పాటు చేసాను. ఇవన్నీ జ్ఞాపకాలుగా మిగిలిపోయాయి

లండనులో నాకు జరిగిన గౌరవాన్ని ఎన్నడూ మర్చిపోలేను నేను లండనులో ఉన్నానని తెలియగానే రాయల్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ అఫైర్స్ సంస్థ కార్యదర్శి తమ సొసైటీ సభ్యులకు వియత్నాం పరిస్థితి మీద నన్ను ఉపన్యసించమని ఆహ్వానించాడు నేను నిజంగా నమ్మలేకపోయాను భారతీయులలో నెహ్రూ, కృష్ణమీనన్, ఫణిక్కర్ వంటి వారికి తప్ప అటువంటి అవకాశం నాబోటి సామాన్యులకు రావడం అనూహ్యం నాతోపాటు పిహెచ్ డి చేసి లండను యూనివర్శిటీలో ఆగ్నేయ ఆసియా శాఖాధిపతి అయిన ప్రొఫెసర్ టింకర్ ఆ ఉపన్యాసం ఏర్పాటు చేయించాడట ఎవరు కారణమైనా అంతర్జాతీయ సంబంధాలు చదువుకున్న నాకు ఆ అవకాశంలో గొప్పతనం అర్థం అయింది ఎవరెస్టు ఎక్కినంత ఆనందించాను ఆనాటి సభకు అధ్యక్షత వహించిన మహానుభావుడు బ్రిటిషువారి రోజుల్లో 1924 లో ఢిల్లీలో కేంద్ర శాసన సభకు అధ్యక్షుడుగా ఉండేవాడట ప్రొఫెసర్ హాల్‌తో పాటు నాతో చదువుకుని ప్రొఫెసర్లు అయిన మిత్రులంతా ఆ సమావేశానికి హాజరయ్యారు అనిర్వచనీయమైన ఆనందం నా ప్రయాణానికి ఆ నాటి సభ అత్యంత అద్భుతమైన ముగింపు అనిపించింది

  

# టూరిజం శాఖతో అనుబంధం

ఉద్యోగం చేయకుండా స్వతంత్రంగా బ్రతకడానికి అవకాశాలు వెతుక్కోవడానికి ఢిల్లీలో మకాం పెట్టాను పుస్తకాలు వ్రాసుకుని జీవనం గడుపుదామని ఒక అభిప్రాయం వచ్చింది అప్పుడే నేను వియత్నాంమీద వ్రాసిన పుస్తకాన్ని అచ్చు వేయించుకునే ప్రయత్నంలో ఉన్నాను ఆ రోజుల్లో ఎక్కువ కాలం సప్రూహౌస్ లైబ్రరీలో కూర్చుని గ్రంధాలు చదివి నోట్సు వ్రాసుకునేవాణ్ణి డా॥ అప్పాదొరై, డా॥ రాజన్ ఇంకా అనేకమంది స్కాలర్లతో పరిచయాలుండేవి చాలావరకు లైబ్రరీలలోనే కాలక్షేపం చేసేవాణ్ణి

అప్పటిలో ఢిల్లీలో ఒక పార్లమెంటు సభ్యుని ఇంట్లో అద్దెకు ఉండేవాణ్ణి కుటుంబం నరసాపురంలోనే ఉండేవారు నాకు యిల్లు అద్దెకిచ్చిన పార్లమెంటు సభ్యుడు శ్రీ తారిక్ కాశ్మీరీ ముస్లిము ఆయనకు ఇంగ్లీషుభాష రాదు అయినా ప్రధాని నెహ్రూ మెప్పుపొందడానికి ఇంగ్లీషు పత్రికలలో అనేక విషయాలమీద అభిప్రాయాలు ప్రకటించుకోవటానికి తాపత్రయపడేవారు నేను తన ఇంట్లో అద్దెకు ఉండడాన్ని తారిక్ సాహెబ్ చక్కగా ఉపయోగించుకునేవాడు రకరకాల అభిప్రాయాలు, ప్రకటనలు ఇంగ్లీషులో నాచేత వ్రాయించి పత్రికలకు యిచ్చేవాడు

వియత్నాంనుంచి తెచ్చిన డబ్బు అయిపోవస్తోంది కూర్చుని తింటే ఎంతసొమ్ము ఉన్నా చాలదు పరిస్థితి క్లిష్టమవుతోంది అప్పుచేసి పప్పుకూడు అన్నట్టు ఢిల్లీలో బ్రతుకు భారం అవుతోంది గ్రంధరచన ప్రయత్నాలు లైబ్రరీలలో కూర్చుని నోట్సు వ్రాసుకోవడానికంటే ముందుకి వెళ్ళలేదు పరిస్థితిని పరిగణనలోనికి తీసుకుని ఏదైనా ప్రభుత్వ ఉద్యోగం చేయడం బాగుంటుందనే నిర్ణయానికి వచ్చాను ఉద్యోగాలు ఉండాలిగా చేయడానికి ఇన్‌ఫర్‌మేషన్ మంత్రిత్వ శాఖలో పంచవర్షప్రణాళిక ఫీల్డ్ ఆఫీసరు ఉద్యోగాలు యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషను ప్రకటించింది దానికి అప్లికేషను పెట్టాను దానికోసం సర్వ ప్రయత్నాలు చేసాను చివరకు పబ్లిక్ సర్వీసు కమిషను జరిపే ఇంటర్‌వ్యూలో సభ్యులు ఎవరు ఉండాలో కూడా నాకు అనుకూలంగా నిర్ణయించబడింది ఆ రోజుల్లో ఢిల్లీలో నాకు అంత పరపతి ఉండేది యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషను ఇంటర్‌వ్యూలో నాది ప్రధమస్థానం, వారణాసి సుబ్రహ్మణ్యానిది రెండవస్థానం అయితే అప్పటికి అడ్‌హాక్‌గా ఆ ఉద్యోగం చేస్తున్న అభ్యర్ధి సర్వీసు కమిషనులో ఎంపిక

కాలేకపోయాడు అయినా మంత్రిత్వశాఖలో ఆయనకు బ్రహ్మాండమైన పరపతి ఉండేది అందుమూలంగా పబ్లిక్ సర్వీసు కమిషనువారు ఉద్యోగానికి నా పేరు మంత్రిత్వశాఖకు పంపినా వారు నాకు ఉద్యోగనియామక జాబు పంపలేదు

ఇంతలో కేంద్రప్రభుత్వం టూరిస్టు డిపార్టుమెంటులో డైరెక్టరు ఉద్యోగాలను యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషను ప్రకటించింది దానికి కూడా అప్లికేషన్ పెట్టాను

భారత దేశానికి తిరిగివచ్చిన కొద్దికాలంలో నేను ఊహాల ఉయ్యాలలో ఊగుతున్నానని తేలిపోయింది పుస్తకాలు వ్రాసుకు బ్రతుకుదామనే సంకల్పం ఫలించలేదు ఏదైనా ఉద్యోగం చేయనిదే జీవితం గడవని పరిస్థితి వచ్చింది యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషను ద్వారా రెండు ఉద్యోగాలకు ఇంటర్వ్యూలకు వెళ్ళాను టూరిస్టు డిపార్టుమెంటులో ఉద్యోగం కూడా వచ్చింది ఆ శాఖవారు ఉద్యోగనియామకలేఖ వెంటనే పంపారు అప్పుడు ఆ రెండు ఉద్యోగాలలో ఏదో ఒకటి నిర్ణయించుకోవలసిన పరిస్థితి వచ్చింది రెండూ మంచి ఉద్యోగాలే. అయితే టూరిస్టు డిపార్టుమెంటులో విదేశాలలో పనిచేయడానికి అవకాశం ఉందన్న ఆకర్షణ నా నిర్ణయానికి దోహదం చేసింది టూరిజం డిపార్టుమెంటులో డైరెక్టరుగా చేరాను ఆ ఉద్యోగంలో చేరిన మరునాడు పంచవర్ష ప్రణాళిక శాఖనుంచికూడా నియామక లేఖ వచ్చింది ఆ ఉద్యోగం నాకు అక్కరలేదని వ్రాసేసాను

నేను టూరిజంశాఖలో చేరేసరికి ఆ శాఖ ఢిల్లీలో జనపత్‌లో బారక్స్‌లో ఉండేది శ్రీ సోమనాధ్ ఛిబ్ మా డైరెక్టరు జనరల్ ఆయన కేంబ్రిడ్జిలో చదివాడు నా తోటి డైరెక్టరు డాక్టరు శాస్త్రి ఫ్రాన్సులో సోర్ బాన్ యూనివర్సిటీలో డాక్టరేటు తీసుకున్నారు మిగిలిన వారిలో కొందరు ఎం ఏ డిగ్రీలు తీసుకుంటే ఒకరిద్దరు సామాన్య డిగ్రీలు పొందినవారు అప్పటికి టూరిస్టు శాఖ ఆఫీసులు కలకత్తా బొంబాయి మద్రాసులో ఉండేవి ఢిల్లీలో ప్రభుత్వశాఖ ఆఫీసులు కాకుండా వేరే టూరిస్టు ఆఫీసు కూడా ఉండేది ఇవిగాక విదేశీ పర్యాటకులు హెచ్చుగా వెళ్ళే కొన్ని కేంద్రాలలో కూడా టూరిస్టు ఆఫీసులు ఉన్నాయి ఢిల్లీ ఆఫీసుపరిధిలో ఆగ్రాలో ఆఫీసు, బొంబాయి ఆఫీసు పరిధిలో ఔరంగాబాద్‌లో ఆఫీసు కలకత్తా పరిధిలో డార్జిలింగ్ ఆఫీసు, మద్రాసు ఆఫీసు పరిధిలో బెంగుళూరు, కొచ్చిన్ ఆఫీసులు ఉండేవి ఆరోజులలో కేంద్రటూరిస్టు శాఖ ఆఫీసులు విదేశీ పర్యాటకులకు సేవలు అందించడంలో నిమగ్నమై ఉండేవి టూరిస్టు శాఖ ప్రారంభంలో కేంద్రప్రభుత్వంలో ట్రాన్సుపోర్టు మంత్రిత్వశాఖలో భాగంగా ఉండేది కొంతకాలం సివిల్ ఏవియేషన్ శాఖతో కలిసి ఉండేది చివరకు ప్రత్యేక ప్రభుత్వశాఖగా రూపుదిద్దుకుంది

ప్రారంభంలో విదేశీ పర్యాటకులను ఆహ్వానించి వారి పర్యాటక కార్యక్రమాన్ని నిర్వహించడంలో మగవారికంటే మహిళలు చక్కగా పనిచేస్తారనే భావంతో శ్రీ ఛిబ్ గారి ఆధ్వర్యంలో అమ్మాయిలను టూరిస్టు శాఖలో హెచ్చుగా చేర్చుకున్నారు వారిలో కొందరు అలంకారప్రాయంగా ఉంటే మరికొందరు అత్యంత సమర్థవంతంగా తమ విధులను నిర్వహించేవారు దేశం నలుమూలలా టూరిస్టు ఆఫీసులు నెలకొల్పి భారతదేశం చూడ్డానికివచ్చే విదేశీ పర్యాటకులకు సేవలు అందించడం ఒకవంతు అసలు విదేశీ పర్యాటకులు భారతదేశం వచ్చేటట్టు చేయడం అత్యంత ప్రముఖ కార్యక్రమం దీనికోసం భారత ప్రభుత్వం లండనులోను, పారిస్‌లోను, జర్మనీలోని ఫ్రాంక్‌ఫర్టులోను టూరిస్టు ఆఫీసులు నెలకొల్పారు అమెరికాలో న్యూయార్కు, శాన్ ఫ్రాన్‌సిస్కో పట్టణాలలోను కెనడాలో టోరెంటోలోను ఆస్ట్రేలియాలో మెల్బోర్న్ పట్టణంలోను భారత టూరిస్టు ఆఫీసులు నెలకొల్పారు విదేశాలలో కేంద్రాలు నిర్ణయించడంలో అంతవరకు భారతదేశయాత్రకు వచ్చే విదేశీయుల సంఖ్యపై ఆధారపడ్డారు కొంతకాలం తరువాత టూరిస్టు శాఖ దృక్పథంలో మౌలికమైన మార్పులు వచ్చాయి ప్రారంభంలో విదేశీ పర్యాటకుల మంచిచెడ్డలు చూడ్డమే పరమావధిగా పెట్టుకుని భారతీయ పర్యాటకులను పట్టించుకొనని టూరిస్టు ఆఫీసులు భారతీయ పర్యాటకులపట్ల శ్రద్ధ వహించడం మొదలుపెట్టారు అలాగే మొదట్లో విదేశాలనుంచి పర్యాటకులుగా వచ్చేవారు విమానాలలో వచ్చినా ఓడలమీద వచ్చినా భారతదేశం రావడం ముఖ్యం అనే భావన రానురాను మారి విదేశీ పర్యాటకులు ఎయిర్ ఇండియా విమానాలలో ప్రయాణం చేయాలనే తపన చోటుచేసుకుంది దానితో విదేశాలలోని భారత ప్రభుత్వ టూరిస్టు ఆఫీసులు ఎయిర్ ఇండియా ఆఫీసులకు అనుబంధ ఆఫీసులుగా తయారయ్యాయి

నేను టూరిస్టు డిపార్టుమెంటులో చేరేనాటికి శ్రీ చిఛ్ డైరెక్టరు జనరల్‌గాను, శ్రీ కడప డెప్యుటీ డైరెక్టరు జనరల్‌గాను ఉండేవారు కొత్తగా చేరినవాణ్ణి కాబట్టి నన్ను ప్రారంభంలో డైరెక్టరు (ఇన్ స్పెక్షన్)గా నియమించారు టూరిస్టు భవనాల నిర్మాణం వాటి నిర్వహణ మొదలైన విషయాలు చూడమన్నారు అంతేకాకుండా డిపార్టుమెంటుకివచ్చే ఫిర్యాదులు కూడా చూడాలన్నారు నేను ఉద్యోగంలో చేరగానే వచ్చిన ఫిర్యాదు పరిష్కరించడానికి నేను పడ్డపాట్లు నా పగవానికి కూడా రాకూడదనిపించింది ఆ కథ చెప్పడానికి ముందు అమెరికానుంచి భారతదేశం వచ్చే విహారయాత్రా నౌకల గురించి ముచ్చటించుకోవాలి

మానవుడు సాధించిన సాంకేతిక విప్లవఫలితాల పుణ్యమా అంటూ ఇప్పుడు ప్రపంచంలో ప్రతి దేశం మరొక దేశానికి ప్రక్క ఊరు అయిపోయింది విమానాలు వాయువేగ మనోవేగాలతో ప్రయాణం చేసి రెండు రోజుల్లో ప్రపంచాన్ని చుట్టివస్తున్నాయి బొంబాయిలో ఉదయం బయలుదేరి లంచ్‌కి లండను, డిన్నర్‌కి న్యూయార్క్ చేరుకునే స్థితికి వచ్చింది ఒక పూటలో టోకియోలో ఉదయం బయలుదేరితే అదేరోజు ఉదయానికి అమెరికా చేరే విద్యుద్ధర ప్రయాణాలున్నాయి అయితే ఈ ఆఘుమేఘాల మీద ప్రయాణంలో వేగం తప్ప హాయి ఆనందం లేవు ఓడ ప్రయాణం సర్వవిధాలా ఉత్కృష్టమైనదని చాలామంది నమ్మకం ఆ సముద్రపు అలలు, ఉప్పునీరు, నీలాకాశం, తీక్షమైన సూర్యరశ్మి ఓడప్రయాణీకులకు ఒక అనిర్వచనీయమైన మత్తెక్కిస్తుంది ఆ హాయి అనుభవించవలసినదే తప్ప వర్ణించడానికి ప్రయత్నించడంలో అర్థంలేదు

ప్రయాణికులను ఆరు నెలలలో ప్రపంచం చుట్టూ త్రిప్పి తీసుకువచ్చే అధునాతన విలాసనౌకలు ప్రయాణ సదుపాయాలకు అధునాతన జీవన సరళికి తుదిపలుకే మొత్తం ఓడ అంతా ఎయిర్ కండిషన్డు, మొదటి తరగతి ప్రయాణ సౌకర్యాలు, బాత్‌రూముతో కలిసి ఉన్న ప్రత్యేకగది, కోరిన భోజనం బ్రహ్మాండమైన బజారు, చక్కటి స్విమ్మింగ్ పూల్, ప్రయాణికుల ఆనందానికి సినిమాలు, డ్యాన్సులు క్రరగుర్రపు పందాల ఆటలు, ఒకటేమిటి ఆ ఓడలో ప్రయాణం చేస్తున్నంతసేపు రోజులో ఉన్న గంటలు చాలవనిపిస్తుంది అయితే ఈ భోగమంతా ఎవరు అనుభవించగలరని అనుమానంగా ఉందా? చాలావరకు అమెరికను కోటీశ్వరులే ఈనౌకలపై విహారయాత్రలు చేయగలుగుతారు ఒక్కొక్క ఓడలో వెయ్యిమంది వరకు వయస్సు మళ్ళిన ఆడ, మగ అమెరికను విహారయాత్రికులు ఉంటారు యువతరం మధ్యతరగతి అమెరికన్లకు ఈప్రయాణాలు సాధ్యం కావు

అలా ప్రపంచ పరిరంభణలో ప్రతి సంవత్సరం ఒకటో రెండో విలాస నౌకలు అమెరికా నుంచి బొంబాయి వస్తాయి అటువంటి ఓడ బొంబాయి రేవులో ఆగినపుడు చూడాలి మనవాళ్ళు చేసే హడావిడి రాష్ట్రప్రభుత్వ, కేంద్ర ప్రభుత్వ పర్యాటక శాఖలు, అనేక సంఘాలు, సమాజాలు వారికి బ్రహ్మారథం పడతారు ఓడలోనే స్వాగతాలు, పూలమాలలు భరత నాట్య ప్రదర్శనలు ఆ ఓడ బొంబాయి రేవులో ఉన్న రెండుమూడు రోజులు భారతీయ సాంస్కృతిక కార్యక్రమాలు, పట్టణం చుట్టు ప్రక్కల ఉన్న ఆకర్షణలను చూపించటం యింకా ఏవేవో కార్యక్రమాలతో ఊపిరి సలపనివ్వరు అయితే వారిలో కొందరు ఉత్సాహవంతులు ప్రత్యేక రైలులో ఆగ్రా వెళ్ళి తాజ్‌మహల్ చూచి

అలా ఢిల్లీ చూచుకుని బొంబాయిలో మళ్ళా ఓడ అందుకుంటారు ఈ విలాసనౌక ప్రయాణీకులకోసం రైల్వే శాఖనడిపే ప్రత్యేక రైలు చూడముచ్చటగా ఉంటుంది రైలులో ఏవిధమైన నిషేధాలు ఉండవు ప్రయాణీకులకు ఇంటి కంటే ఓడ పదిలం అయితే సౌకర్యాలలో ప్రత్యేక రైలు ఓడతో పోటీ పడుతుంది ఈ తాపత్రయం, హంగామా అంతా ఆకోటీశ్వరుల్ని సంతోషపెట్టడానికే అనడంలో ఏమీ రహస్యం లేదు వారు ఆనందంగా మన దేశంలో వాళ్ళ డాలర్లు ఖర్చు పెట్టేటట్టు చేయడమే దాని పరమావధి ఆ యాత్రికులు మనదేశంలో హెచ్చు మొత్తంలో డాలర్లు ఖర్చు పెడతారనడం నిర్వివాదం వారి ఖర్చులో హెచ్చు భాగం మనదేశంలో దొరికే అపురూపశిల్ప కళాఖండాలు, అమూల్యమైన వజ్ర వైఢూర్యాలు కొనుక్కోవడానికి పోతుంది

మనదేశం వజ్రాల నగల ఎగుమతికి ప్రసిద్ధి భారతదేశంనుంచి సంవత్సరానికి 6,7 వందల కోట్ల రూపాయల విలువైన వజ్రాలు, నగలు ప్రపంచంలో అనేక దేశాలకు ఎగుమతి అవుతాయని అంచనా వీటిలో సగానికి పైగా అమెరికాకు వెడతాయి ఈ రాళ్ళన్నీకూడా అక్కడి స్త్రీలు అలంకారాలుగా ఉపయోగిస్తారు ఆ రాయి రంగు తమ కళ్ళరంగుతోనో దేహచ్ఛాయతోనో కలసిందని వేల డాలర్లు ఖర్చుపెట్టివాటిని కొనుక్కుంటారు ఎన్ని విలువైన రాళ్ళు ఒక కుటుంబంలో ఉంటే ఆ కుటుంబ విలువ అంత పెరుగుతుందని వాళ్ల నమ్మకం చిత్రం ఏమిటంటే విదేశాలలో ఈ రాళ్ళకున్న విలువ బంగారానికి లేదు

బంగారం అంటే భారత మహిళలలో వున్న వ్యామోహం విదేశ స్త్రీలలో లేదంటే ఆశ్చర్యపడ నక్కరలేదు పది పదిహేను సంవత్సరాల క్రితం వరకు అమెరికాలో కాని జపానులో కాని బజారులో బంగారం అమ్మడం మొదలుపెడితే కొనేవాళ్ళు లేకపోయారు కొనడానికి డబ్బులేక అనుకునేరు సుమా! సామాన్యప్రజలకు బంగారం కొనుక్కుని ఏమిచేయాలో తెలియకపోవటమే దీనికి కారణం భారత స్త్రీలకు బంగారం అలంకారానికే కాకుండా ఆర్థిక స్తోమతకు అప్పులు పుట్టించటానికి చిహ్నంగా నిలిచిపోయింది ఇటువంటి ఉపయోగాల అవసరం లేకపోయినా విలువైన రాళ్ళకు అమెరికన్ స్త్రీల అలంకారంలో ప్రత్యేక స్థానం అదొక వెఱ్ఱి

ప్రపంచంలో ఈ అమూల్యమైన రాళ్ళను అనేక అవసరాలకు కొనుక్కుంటారు ఇవి అలంకారానికి తోడు ఆరోగ్యానికి కూడా తోడ్పడతాయి ప్రఖ్యాత విజ్ఞాన శాస్త్రవేత్త మేఘనాధ సాహా ఉద్దేశ్యంలో మానవులు ఈ అమూల్యమైన రాళ్ళను ధరించడం వల్ల అవి సూర్యకిరణాలను ఆకర్షించి రుగ్మతలను తొలగించటానికి తోడ్పడతాయి మానవ శరీరంపైన

మనస్సుమీద ఈ రాళ్ళు చూపే ప్రభావం వాటిరంగు పైనే ఆధారపడి ఉంటుందని మరొక నమ్మకం ఈరాళ్ళకు జ్యోతిషశాస్త్రానికి కూడా అవినాభావ సంబంధం ఉంది అయితే పాశ్చాత్యులకు ఈ నమ్మకాలు ఉన్నాయో లేదో తెలియదు, కాని వాళ్ళకు ఈ అమూల్యమైన రాళ్ళు కొనుక్కోవడం అంటే మాత్రం బోలెడు సరదా

నేను టూరిజం శాఖలో డైరక్టరుగా చేరిన సంవత్సరం అమెరికను విలాసనౌక "కరోనా" బొంబాయి వచ్చింది అక్కడనుంచి ప్రత్యేక రైలులో ఢిల్లీ చేరినవారిలో ఒకామెకు వజ్రవైడూర్యాలంటే ప్రాణం అలంకారం చేసుకోవటం ఆడవాళ్ళ జన్మహక్కు కదా! ఇంద్రనీలం తన కళ్ళరంగుతో కలుస్తుందనే బావంతో ఆమె ఢిల్లీలో ఒక ప్రముఖ నగల వ్యాపారి షాపుకి వెళ్లి ఒక ఇంద్రనీలంరాయి ఖరీదు చేసింది దాని ధర నలభైవేల రూపాయలు ఆ రాయి తన పర్సులో పెట్టుకుని కొంతసొమ్ము డాలరు ట్రావెలర్స్ చెక్కులరూపంలోను, మిగిలింది అమెరికాలో తన బ్యాంకు మీద చెక్కుగాను యిచ్చి ప్రత్యేకరైలులో బొంబాయి వెళ్ళిపోయింది ఆమరునటి రాత్రే కరోనా నౌక బొంబాయి వదలి వెళ్ళిపోతుంది ప్రపంచంలో అందరి ఆడవాళ్ళలాగే ఆమె కూడా తాను ఢిల్లీలో కొన్న ఇంద్రనీలాన్ని బొంబాయిలో పది మందికి చూపించింది మనకున్న వస్తువు ఇతరులు మెచ్చుకోవాలనుకోవడం మానవసహజమైన బలహీనత కదా! బొంబాయిలోని ఒక నగల వర్తకునికి కూడా తన అమూల్యమైన రాయి చూపించింది దానికి ఎంత యివ్వవచ్చునని అడిగింది ఆ వర్తకుడు ఆ రాయిని అటు ఇటు త్రిప్పి చూచి తను అయితే దానిని ముప్పైఫ అయిదు వేలకు యిచ్చేవాడినన్నాడు

అంతే దానితో ఆమె మనస్సు వికలమైపోయింది ఢిల్లీ వ్యాపారి తనను మోసగించాడనే నిర్ణయానికి వచ్చింది వెంటనే థామస్‌కుక్స్ కంపెనీలో పనిచేసే నారాయణన్ వద్దకు వెళ్ళి ఆరాయి అతడి చేతిలో పెట్టి ఢిల్లీ వ్యాపారి అడ్రసుఇచ్చి ఆ రాయి ఆయనగారికి త్రిప్పి పంపివేయమని కోరింది ఢిల్లీ వ్యాపారికి యిచ్చిన చెక్కులు చెల్లకుండా అక్కడికక్కడే జాబులు వ్రాసి పుట్టెడు విచారంతో ఆ రాత్రే కరోనాలో బొంబాయి వదిలిపెట్టింది అయితే ఆ ఇంద్రనీలాన్ని ఢిల్లీ వ్యాపారికి పంపడం నారాయణన్‌కి బ్రహ్మాండమైన సమస్యగా తయారైంది ఆయన చాలా అనుభవజ్ఞుడు కావటం మూలంగా ఆ రాయిని రెండు ఇన్సూరెన్సు కంపెనీలచేత ఎనభైవేల రూపాయలకు భీమాచేయించి ఇండియన్ ఎయిర్ లైన్సు విమానంలో పార్సెలుగా ఢిల్లీ పంపాడు

ఇండియన్ ఎయిర్ లైన్సు కార్గోవిభాగం వారి జాబు అందుకున్న ఢిల్లీ

వ్యాపారి ఆ పార్శెలు విప్పి తనకి యిస్తే తీసుకుంటానన్నాడు ఎయిర్‌లైన్సు నిబంధనల ప్రకారం అలా పార్శెల్‌ని యివ్వడం నిషేధం పార్శెలుపైన 40 వేలు విలువైన రాయి దానిలో ఉన్నట్టు వ్రాసి ఉంది కాని ఢిల్లీ వ్యాపారి బాధ ఏమిటంటే తీరా పార్శెలు తీసుకున్న తరువాత దానిలో ఏదైనా కంకరరాయి ఉంటే తన గతేంకాను! పార్శెలు విప్పి యివ్వకపోతే ఢిల్లీ వ్యాపారి ఆ పార్శెలు తీసుకోవడానికి నిరాకరించాడు ఆ విషయం ఎయిర్ లైన్సు అధికారులు థామస్ కుక్స్‌కి తెలియజేసారు బొంబాయిలో నారాయణన్ భారత ప్రభుత్వపర్యటన శాఖ డైరెక్టరును కలుసుకుని ఢిల్లీ వ్యాపారి ఆ పార్శెలు తీసుకునేటట్టు చేయమని ప్రాధేయపడ్డాడు అలా జరగకపోతే అన్యాయంగా తాను యిరుకున పడిపోతానన్నాడు తన ముప్పైఫైరెండేళ్ళ అనుభవంలో యిటువంటి జటిలసమస్యను ఎదుర్కొనలేదని బాధపడ్డాడు బొంబాయి డైరక్టరు ఢిల్లీలో టూరిస్టు డిపార్టుమెంటు డైరెక్టరు జనరల్‌కి టెలిఫోను చేసి ఆపార్శెలు ఢిల్లీనగల వ్యాపారి తీసుకునేటట్టు చేయవలసినదిగా కోరటంతో ఉరుమువచ్చి మంగళంమీద పడ్డట్టు యీసమస్య క్రొత్తగా డిపార్టుమెంటులో చేరిన నానెత్తిన పడింది మాడైరెక్టరు జనరల్ ఛీఫ్ నన్ను పిలిచి ఆజ్ఞలు జారీ చేసారు దానితో నేను కషంలోపడ్డ ఈగలా కొట్టుకున్నాను అటు ఎయిర్‌లైన్సు మీదకాని ఇటు నగల వ్యాపారి మీదకాని టూరిస్టు డిపార్టుమెంటుకి ఎటువంటి అధికారం లేదు పార్శెలు విప్పి యివ్వకపోతే తీసుకోనంటాడు వ్యాపారి ససేమిరా అలా ఇవ్వటానికి వీలులేదంటాడు ఎయిర్ లైన్సు అధికారి ఆయన తెలుగువాడే నాకు మంచిమిత్రుడు కూడాను కాని రూల్సు రూల్సే అన్నాడాయన ఈ సమస్యను అందరికీ సంతృప్తి కలిగేటట్టు పరిష్కరించటం నాకు అగ్నిపరీక్ష అయింది

చివరకు గిరీశం చెప్పినట్టు అటునుంచి నరుక్కు రావటానికి ఉపక్రమించాను ఆ నగలవ్యాపారిని ఆఫీసుకి పిల్చి ఆ రాయి వివరాలు తెలుసుకుని ఆ పార్శెలు అతడు తీసుకోకపోతే భారతదేశ ప్రతిష్టకు వచ్చే నష్టాన్ని వివరించాను ఆ రాయిని భీమాచేసిన రెండు కంపెనీల ప్రతినిధులనుకూడా పిల్చి ఆ పార్సెలులో నిజంగా కంకరరాయి ఉంటే ఆ వ్యాపారి సొమ్ముకి నష్టం రాకుండా చూడ్డానికి మాట తీసుకున్నాను ఆముగ్గుర్ని వెంటబెట్టుకుని ఇండియన్ ఎయిర్‌లైన్సు కార్గో ఆఫీసుకు వెళ్ళాము అక్కడ కార్గో మేనేజరు అందర్నీ కూర్చోబెట్టి పార్సిల్ తీసి వ్యాపారి చేతిలో పెట్టాడు కత్తిరి యిస్తే అక్కడే తెరుస్తానన్నాడు వ్యాపారి అదేం పనికిరాదు, గుమ్మం అవతలకు వెళ్ళి పార్సెలు తెరచి చూచుకోమన్నాడు కార్గో మేనేజరు చివరకు ఆ పార్సెలు విప్పి ఆ రాయి తన ఇంద్రనీలమే అని వ్యాపారి అనేవరకు

అంతా ఊపిరి తీసుకోవటం మర్చిపోయారు నలభైవేల రూపాయలబేరం పోయినందుకు ఆ వ్యాపారి ఏమాత్రం విచారించలేదు తాను అమెరికావెళ్లి దాన్ని లక్షరూపాయలకు అమ్ముతానని ధైర్యంగా చెప్పాడు అయితే అంత విలువైనరాయి తమ జీవితంలో కొనలేకపోయినా ఒకసారి కళ్ళారాచూచి ఆనందిద్దామని మేమంతా ఆ రాయిని చూపించమన్నాం తీరా చూస్తే ఆ రాయి సోడాబుడ్లలో ఉండే గాజుగోళి అంత అలాగే ఉంది మా నిరుత్సాహాన్ని పసికట్టిన వ్యాపారి దాని అందాన్ని చూడాలంటే దానిని వెలుగులో చూస్తే దివ్యతేజస్సులా దాని కిరణాలు కనిపిస్తాయని చూపించాడు దాని కిరణాలుచూచి ముగ్ధులైనవారంతా అందుకే దానికంత విలువ అన్నారు నాకుమాత్రం బ్రహ్మాండమైన బరువు తొలగినట్లనిపించింది డిపార్టుమెంటులో ఎదుర్కొన్న ప్రధమ జటిలసమస్య విజయవంతంగా పరిష్కరించినందుకు నేను ఆనందించాను ఇంద్రనీలం అందంమాట ఎలా ఉన్నా ఆ అమెరికను వనిత మాత్రం మమ్మల్నందర్నీ ఇంద్రజాలం చేసినమాట నిజం

టూరిస్టు డిపార్టుమెంట్ డైరెక్టరు జనరల్ సోమనాథ్‌ఛిబ్ సరదాపురుషుడు మానవనైజాన్ని కనిపెట్టడంలో సిద్ధహస్తుడు దానికితోడు టూరిస్టు డిపార్టుమెంటు తాను స్వహస్తాలతో నిర్మించిన సంస్థ అనే భావం కొట్టవచ్చినట్టు కనిపించేది ఆయనలో పర్యటన శాఖను బలపరచడానికి కావలసిన హంగులను బలపరచటంలో తన సమయం హెచ్చుగా వినియోగించేవాడు హోటల్ పరిశ్రమ, టూరిస్టు ఏజెన్సీల స్థాపన, టూరిస్టు టాక్సీలుగా మంచి విదేశీవాహనాల ఉపయోగం యింకా అనేక సమస్యలతో ఎప్పుడూ సతమతమవుతూ కనిపించేవారు అటువంటి ఛిబ్ గారు ఒకరోజు తనగదికి నన్ను పిలిపించారు అప్పుడు ఆయనతో ఒక అమెరికను టూరిస్టు కూర్చుని ఏదో చర్చిస్తోంది నన్ను పిలిపించిన ఛిబ్ నాతో ఏమీ చర్చించకుండానే పంపించివేసారు ఆ అమెరికను టూరిస్టు వెళ్లిపోయిన తరువాత నన్ను తన గదికి మళ్ళా పిలిపించి తనతో మాట్లాడిన మహిళను చూసావా? అని ప్రశ్నించారు నేను ఆశ్చర్యపోయాను ఆమె వేషం కొంచెం విలక్షణంగా ఉండటం గమనించిన నేను శ్రీ ఛిబ్ అడిగిన ప్రశ్నలోని పరమార్ధం గ్రహించలేకపోయాను ఆమె దుస్తులు విలక్షణంగా ఉన్నాయన్నాను ఆమె జుట్టు సహజంగా కనపడలేదన్నాను ఛిబ్‌గారు పగలబడి నవ్వాడు ఆమెకు ఎన్నిరంగుల డ్రస్సులు ఉన్నాయో అన్నిరంగుల విగ్గులు ఉన్నాయని చెబుతూ నా పరిశీలనను మెచ్చుకున్నారు ఆకుపచ్చ విగ్‌తో ఆమె నాకళ్ళకు ఘోరంగా కనిపించింది

పుణ్యస్థలాలు చూడ్డానికి, పుణ్యతీర్థాలలో స్నానం చేయడానికి

భారతీయులు తరతరాలుగా దేశం నలుమూలలలో ఉన్న పుణ్యతీర్థాలు దర్శిస్తూనే ఉన్నారు వారికి ప్రత్యేక సదుపాయాలేమీ ఉండేవికావు దక్షిణాదినుంచి కాశీయాత్ర చేస్తే యిక జీవితానికి అదే ఆఖరి ప్రయాణం అనుకునేవారు యాత్రలు చేసే ప్రయాణీకుల కోసం కొన్ని పుణ్యక్షేత్రాలలో ధర్మసత్రాలు ఉండేవి అయితే మనదేశానికి స్వాతంత్ర్యం రావడం, ప్రయాణ సౌకర్యాలు అభివృద్ధి చెందడంతో ప్రజలు తీర్థయాత్రలకే కాకుండా శెలవులలో ప్రయాణంచేసి దేశంలోని వివిధ ప్రాంతాలను చూడ్డానికి ఉత్సాహం చూపించడం మొదలుపెట్టారు దానితో తీర్థయాత్రలు చేసేవారు, సరదాకి దేశం చూడ్డానికి ప్రయాణం చేసేవారు పెరిగిపోయారు ప్రజల్ని ప్రయాణాలకు ప్రోత్సహించడానికి మా చిన్నతనంలో రైల్వేలు "బైరాగి" టిక్కెట్లు అమ్మేవారు ఆ టిక్కెట్టు ధర పదిరూపాయలు అప్పట్లో M S M (మద్రాసు సదరన్ మరాఠా) రైల్వేలో ఒక నెలరోజులు మన యిష్టం వచ్చిన ప్రదేశానికి యిష్టం వచ్చినన్నిసార్లు రైలులో ప్రయాణం చేయవచ్చును ఆ రోజులలో మొదటిసారిగా తిరుపతి, కాళహస్తి, మద్రాసు మొదలైన ప్రదేశాలు బైరాగి టిక్కెటుపై ప్రయాణం చేసి చూసాను తిరుపతిలో రైలుదిగి రాత్రంతా నడచి తెల్లవారేసరికి తిరుమల చేరి మొట్టమొదటిసారి శ్రీ వెంకటేశ్వర స్వామి వారి ధర్మదర్శనం చేసుకున్నాను అయితే శ్రీ కాళహస్తి దేవాలయంలో దైవదర్శనానికి టిక్కెట్టు కొనమన్నారు నాకు కుర్రతనం దేవుణ్ణి చూడ్డానికి టిక్కెట్టు కొనడం అనే ఆలోచనే నాకు నచ్చలేదు అంతే దైవదర్శనం చేసుకోకుండా వచ్చేసాను

టూరిస్టు డిపార్టుమెంటులో చేరిన కొద్ది రోజుల్లోనే నాకు టూరిస్టులకు వసతి సదుపాయాలు కల్పించే బాధ్యత అప్పజెప్పారు డిపార్టుమెంటులో ఆరోజులలో ఒకటే ఆలోచన విదేశాలనుంచి మనదేశం వచ్చే పర్యాటకుల జీవనవిధానం భోజనసదుపాయాలు, ప్రయాణసౌకర్యాలు భారతీయుల అవసరాలతో చాలావరకు విభేదిస్తాయి కాబట్టి వారికి ప్రత్యేక ఏర్పాట్లు చేయాలి ఆరోజులలో డిపార్టుమెంటులో మౌలికమైన చర్చ టూరిస్టు డిపార్టుమెంటు ఎవరి సదుపాయాలు చూడాలనే విషయం పైనే! అనేక చర్చలు జరిగిన తరువాత టూరిస్టు డిపార్టుమెంటు విదేశీ పర్యాటకుల మంచి చెడ్డలు, సదుపాయాలు సౌకర్యాలు మాత్రమే చూడాలని, భారతీయ పర్యాటకుల అవసరాలు రాష్ట్రప్రభుత్వాలు చూడాలని నిర్ణయించారు ఈ చర్చ కేంద్రమంత్రి మారినప్పుడల్లా వచ్చేది పెద్దల అభిప్రాయాలకు అనువుగా డిపార్టుమెంటు కార్యకలాపాలు సరిదిద్దుకునేవారు విదేశీ పర్యాటకులు అంతా ఒళ్ళు బలిసిన అమెరికను టూరిస్టులనే భావం ప్రారంభంలో ఉండేది రాను రాను

పాశ్చాత్యదేశాలనుంచి మధ్యతరగతికి చెందిన యువతీయువకులు భారతదేశం రావడం ప్రారంభించారు వారికి ఐదునక్షత్రాల హోటళ్ళలో మకాంచేసే ఆర్థిక స్తోమతలేదు వారికోసం పాశ్చాత్యపద్ధతిలో చౌకగా ఉండే హోటల్ సదుపాయం చేయవలసివచ్చింది పెద్దపట్టణాలలో అనేకరకాల హోటల్ సదుపాయాలు ఉన్నా విదేశ పర్యాటకులు మనదేశంలో దర్శించే అనేక ప్రదేశాలలో వారికి మకాం, భోజన సదుపాయాలు లేవనే విషయం డిపార్టుమెంటు గ్రహించి వారి సౌకర్యంకోసం టూరిస్టు బంగళాలు నిర్మించాలని నిర్ణయించారు

టూరిస్టు బంగళాలు ఎక్కడ నిర్మించాలనే విషయం డైరెక్టరు జనరల్ కేంద్ర మంత్రితో చర్చించి నిర్ణయిస్తారు ఆ నిర్ణయం జరిగిన తరువాత భారం నానెత్తిన పడవేసేవారు నిర్ణయించిన ప్రదేశం ఉన్న రాష్ట్రానికి వెళ్ళి టూరిస్టు బంగాళా నిర్మించవలసిన స్థలాన్ని ఎంపిక చేసి ఆ ప్రదేశాన్ని కేంద్రప్రభుత్వానికి దఖలు పర్చవలసినదిగా ఆ జిల్లా కలెక్టరుతో చెప్పి ఢిల్లీకి తిరిగి వచ్చేవాణ్ణి ఆ ప్రయాణాలలో నాకు సలహా చెప్పడానికి, స్థలనిర్ణయంలో సాంకేతిక మెలుకువలు చెప్పడానికి ఢిల్లీలోని కేంద్ర పబ్లిక్‌వర్క్స్ శాఖ నుంచి సీనియర్ ఆర్కిటెక్ట్‌ని కూడా తీసుకువెళ్ళేవాణ్ణి నాకు ఈ బాధ్యతలు అప్పగించటానికి ముందు శ్రీ జ్ఞానసింగ్ అనే అధికారి ఈ పనులు చేస్తూ ఉండేవాడు కేంద్ర ...బ్లిక్‌వర్క్స్ శాఖలో సీనియర్ ఆర్కిటెక్ట్‌లు మంచిమిత్రులుగా ఉండేవారు ...జస్థాన్ రాష్ట్రంలోని భరతపూర్‌లో టూరిస్టు బంగళా నిర్మాణ నిర్ణయానికి ...ైన ప్రయాణం మరపురాని అనుభవం భరత్‌పూర్ బయలుదేరడానికి ...ందురోజు ఢిల్లీలో ఏదోసందర్భంలో కేంద్ర టూరిస్టు మంత్రితో ...ాట్లాడుతూ నా భరత్‌పూర్ ప్రయాణం గురించి చెప్పాను అయన స్వగ్రామం ...రత్‌పూర్ కావటంమూలంగా తాను కూడా వస్తున్నానన్నారు మంత్రిగారు ...ాడా టూరు వేసుకున్నందున కొంచెం అనారోగ్యంగా ఉన్నా ...ా ప్రయాణం మానడానికి వీలులేకపోయింది మరుసటిరోజున నేను, ఒక ...నియర్ ఆర్కిటెక్ట్ ఢిల్లీనుంచి భరత్‌పూర్‌కి ప్రయాణమయ్యాం మేము భరత్‌పూర్‌లో దిగిన తరువాత అదే రైలులో దిగిన మంత్రివర్యుని చూసాం స్టేషన్ బైటకు వచ్చాం మంత్రిగారికోసం కారుకాని, దండలుకాని, నినాదాలుచేసే మిత్రబృందంకాని స్టేషనులో కనిపించలేదు అయన నావద్దకు వచ్చి పట్టణంలోనికి ఎలావెడుతున్నావని అడిగారు ముందుగా మా టూరుప్రోగ్రాం పంపాము కాబట్టి జిల్లాకలెక్టరు మాకు గెస్ట్ హౌస్‌లో మకాం ఏర్పాటుచేసి ప్రభుత్వజీపు స్టేషన్‌కి పంపారు ఈవిషయం విన్న మంత్రి మాజీపులో వస్తానని జీపులో నాప్రక్క కూర్చున్నారు జీపు బయలుదేరబోయే సమయానికి మంత్రిగారి పరివారం కారు, దండలు స్టేషన్‌కి చేరాయి

అనుకున్న దానికంటే రైలు ముందుగా వచ్చిందన్నారు కారులో వెళుతూ ముందు తమ ఇంట్లో ఆతిథ్యం స్వీకరించి వెళ్ళమని ఆహ్వానించారు నా ఆరోగ్యం ఎలా ఉన్నా మంత్రిగారి ఆహ్వానాన్ని తిరస్కరించలేకపోయాను ఆ ఆహ్వానం పుణ్యమా అంటూ నాజీవితకాలం అంతా గుర్తుండే రాజస్తానీ భోజనం రుచి చూసాను

మంత్రిగారితోపాటు అంతా నేలమీద భోజనాలకు కూర్చున్నాం బాజరాతో తయారుచేసిన రొట్టెలు, బెల్లంముక్క, వెన్నముద్దతో పాటు కూరలు వడ్డించారు యావన్మంది సంతుష్టిగా భోజనం చేసారు నాతో వచ్చిన సీనియర్ ఆర్కిటెక్ట్ మహారాష్ట్రుడు ఆ భోజనాన్ని ఎంతో మెచ్చుకున్నాడు నా ఆరోగ్యం బాగోనందున ఆ భోజనానికి న్యాయం చేయలేకపోయాను మంత్రిగారు భోజనంపై నా అభిప్రాయం అడిగారు బ్రహ్మాండంగా ఉందన్నాను "ఇప్పుడు అర్థమైందా నేను ఇంతలావు ఎలా అయ్యానో" అన్నారు మంత్రి మీరు ఇంత ఆరోగ్యంగా ఎలా ఉంటున్నారో నాకు అర్థమయిందన్నాను అంతా హాయిగా కాస్సేపు నవ్వుకుని మంత్రిగారివద్ద సెలవు తీసుకుని మాకు జిల్లా కలెక్టరు ఏర్పాటు చేసిన గెస్టుహౌస్‌కి వెళ్ళాం భరతపూర్‌కి దగ్గరలో ఉన్న సరస్సుకి ప్రపంచ నలుమూలలనుంచి కొంగలు, ఫ్లెమింగోలు చలినుంచి తప్పించుకోవడానికి సైబీరియానుంచి వచ్చి ఈసరస్సులో తల దాచుకుంటాయి

టూరిజం డిపార్టుమెంటులో చేరిన తరువాత మొదటిసారిగా దక్షిణ భారత దేశంలోని పర్యాటక సదుపాయాలు చూడటానికి ప్రయాణం పెట్టుకున్నాను మా డైరెక్టరు జనరల్ ప్రభుత్వ ఛీఫ్ సెక్రటరీకి ఒక జాబువ్రాస్తూ నా టూరు పోగ్రాం జతచేసి పంపాడు నేను వెళ్ళేది మద్రాసు రాష్ట్రమే కాబట్టి ఈ హంగామా ఎందుకు అన్నాను శ్రీ ఛిబ్‌తో ఆయన ససేమి అంగీకరించలేదు ఛీఫ్ సెక్రటరీకి నా ప్రయాణ వివరాలు పంపితే అది నేను వెళ్ళే జిల్లాకలెక్టరుకి, అక్కడనుంచి నేను వెళ్ళే పట్టణంలో తహసిల్దారుకి తెలుస్తాయని స్టేషన్‌కి వచ్చి నన్ను కలుసుకుని ప్రభుత్వ వాహనంలో ప్రభుత్వ మకాంలోనికి తీసుకువెళ్ళి నాప్రయాణసౌకర్యాలు చూస్తారని ఆయన వాదించారు నేను ప్రప్రథమంగా రష్యాదేశం వెళితే మాస్కో రైల్వే స్టేషన్‌లో నన్ను కలుసుకోవడానికి ఎవరూ రాకపోవడాన్ని ఆయనకు గుర్తుచేసాను అయినా ఆయన అంగీకరించ లేదు కేంద్ర ప్రభుత్వ అధికారిగా రాష్ట్రాలకు వెళ్ళినప్పుడు ఆ ప్రభుత్వం చేసే మర్యాదలన్నీ ఛీఫ్ సెక్రటరీ ద్వారా జరగాలన్నారు ముందుగా తంజావూర్ వెళ్ళాను ఆరైలు తెల్లవారుఝాము నాలుగు గంటలకు స్టేషన్‌కి చేరింది అక్కడ ఒక తహసిల్దారు బంట్రోతు రెండు జీపులతో సిద్ధంగా ఉన్నారు అప్పటికింకా

ప్రభుత్వ పద్ధతులు పూర్తిగా వంటుపట్టనందున నా ఒక్కనికోసం వాళ్ళనందరినీ బాధపెట్టడం నాకు నచ్చలేదు కాని అది పద్ధతి అని క్రమంగా తెలిసివచ్చింది

ఆ ప్రయాణంలోనే తిరుచినాపల్లి టూరిస్టుబంగళాలో మంచినీటి ఎద్దడి ఉన్నదని విని ట్రిచీ వెళ్ళాను ఈసారి ప్రయాణంలో సెంట్రల్ పబ్లిక్ వర్క్స్ శాఖనుంచి ఆర్కిటెక్ట్‌ని తీసుకువెళ్ళలేదు ట్రిచీలో ఓ టూరిస్టుబంగళా నిర్మాణమైపోయింది అందుమూలంగా ఒంటరిగా వెళ్ళాను అచ్చట ఉన్న సి పి డబ్ల్యు డి నుంచి అసిస్టెంటు ఇంజనీరు వచ్చి సమస్య తెలియజేసాడు అంతకు పూర్వం అచ్చటి టూరిస్టుబంగళాలో త్రవ్విన దిగుడుబావి ఎండిపోయింది ఆ బంగాళా పట్టణానికి చాలా దూరంలో నిర్మించినందున దానికి మునిసిపల్ నీళ్ళు తీసుకురావటానికి చాలా ఖర్చవుతుంది అచుట్టుప్రక్కల ప్రజలు ఎవరూ నివసించడంలేదు ఆ టూరిస్టుబంగాళా ఆవరణలో మరొకచోట బావి త్రవ్వాలి అది ఎక్కడ త్రవ్వడం అనేది సమస్య దానిని ఎలా పరిష్కరించాలి? ఇంజనీర్లు ట్రైనింగ్ ప్రకారం ఆ పరిస్థితిలో రెండుమూడు చోట్ల డ్రిల్‌చేసి ఎక్కడ నీళ్ళు ఉనికి హెచ్చుగా ఉంటే అక్కడ బావి తవ్వించాలి అయితే ప్రపంచవ్యాప్తంగా నీటి ఉనికిని కనిపెట్టే పద్ధతి మరొకటుంది వాటర్ డివైనర్ అని అంటారు వారు అపరభగీరథులు కాదు ఒర్జునులు అంతకంటే కాదు, కాని భూమిలో ఎక్కడ నీళ్ళు ఉంటాయో వారికి తెలుస్తుంది ఎలా తెలుస్తుందో చెప్పడం కష్టం కాని వారు నీటి ఉనికిని తెలుసుకోవడానికి ఏమి చేస్తారో చూడవచ్చు ఆయనగారు చేతిలో ఒకపుల్ల తీసుకుని ఆ పుల్లను భూమికి తగిలిస్తూ నడుస్తాడు ఎక్కడో ఒకచోట ఆగి ఇక్కడ త్రవ్వండి అంటాడు అక్కడ త్రవ్వితే పుష్కలంగా నీళ్ళు పడతాయి ఈ పద్ధతికి వైజ్ఞానిక పునాదులు లేనందున ప్రభుత్వపనులలో ఈ పద్ధతి ఆమోదయోగ్యంకాదు నాతో మాట్లాడిన అసిస్టెంటు ఇంజనీరుకి వాటర్ డివైనర్ మీద బ్రహ్మాండమైన నమ్మకం మధురైలో కొన్ని కట్టడాలకోసం వాటర్ డివైనర్ జలనిధులు కనుక్కోవడం వాటి సత్ఫలితాలను చూసాను అయితే ఆ అసిస్టెంటు ఇంజనీరు వాటర్ డివైనర్‌ని తీసుకువచ్చి బావి ఎక్కడ తవ్వాలో నిర్ణయించమని నాతో చెప్పించడానికి ప్రయత్నించాడు కాని ఇంజనీరుగా ఆనిర్ణయం తీసుకోవలసినది ఆయనే కాబట్టి ఆ నిర్ణయమేదో తననే తీసుకోమన్నాను వాటర్ డివైనర్ కోసం డబ్బు ఖర్చు పెట్టడానికి ప్రభుత్వం అంగీకరించదని నాకు తెలుసు, అసిస్టెంటు ఇంజనీరుకి తెలుసు డ్రిల్ చేసి నీటి ఉనికిని తెలుసు కోవటం ప్రభుత్వ పద్ధతి మేమిద్దరం కలిసి ప్రభుత్వ పద్ధతి ద్వారానే ట్రిచీ టూరిస్టు బంగాళాకు మంచినీటి కరువు తీర్చడానికి నిర్ణయించాం

దక్షిణ భారతదేశంలో ముఖ్యంగా తమిళనాడులో బ్రహ్మాండమైన హిందూ దేవాలయాలున్నాయి వాటిలో బృహదేశ్వరాలయం తంజావూరులోను, కంచి కామాక్షి, మధుర మీనాక్షి, రామేశ్వరం దేవాలయం అన్నీ ఆకర్షణీయంగా ఉంటాయి మద్రాసు ప్రభుత్వ టూరిస్టు డైరెక్టరు వెంటరాగా ఈ దేవాలయాలలో పూర్ణకుంభంతో సన్మానం జరిగేది మిత్రుడు కులందైవేలు మద్రాసు రాష్ట్ర టూరిస్టు డైరెక్టరు అప్పటికి కేంద్ర పర్యాటక శాఖలో ఉన్న దక్షిణ భారతీయ ఆఫీసర్ని నేనొక్కణ్ణే అందుమూలంగా నేను దక్షిణ రాష్ట్రాలకు టూరుమీద వస్తే ఆయా రాష్ట్రాల టూరిస్టు డైరెక్టర్లు చాలా హంగామా చేసేవారు మిత్రుడు కులందైవేలు నేను కలసి ఒకసారి కుర్తాలం వెళ్ళాం టూరిస్టు డిపార్టుమెంటు కార్యదర్శి ఐ సి యస్ ఆఫీసరు శ్రీ ఆర్ ఎల్ గుప్త కుర్తాలంలో కొన్ని రోజులు అక్కడి జలపాతంవద్ద స్నానాలుచేసి ఢిల్లీ తిరిగి వచ్చి కుర్తాలంవద్ద ఏవైనా సదుపాయాలు చేయాలని సలహా యిచ్చారు దాని ఫలితంగా అక్కడికి వెళ్ళాను బ్రహ్మాండమైన జలపాతం, దానిక్రింద ప్రజలు స్నానాలు చేయడానికి వీలుగా సున్నంతో ప్లాట్‌ఫారం కట్టించి ఇనుప గొట్టాలు అడ్డుకట్టారు స్నానం చేసే సమయంలో చేయి ఇనుపగొట్టాలను వదలడానికి వీలులేదు నెత్తిమీద జలపాతం పిడుగుల్లా పడుతుంది స్నానానికి ముందు యావన్మంది మంచినూనె తలకు, వంటికి చాలాహెచ్చుగా పట్టించి జలపాతం క్రింద నిలబడతారు కొంతసేపటి తరువాత బైటకు వస్తే శరీరం అంతా సబ్బుతో తోముకున్నదానికంటే శుభ్రంగా ఉంటుంది చాలామంది ఆరోగ్య కారణాల మూలంగా కుర్తాలం జలపాతం వద్ద స్నానాలు చేస్తారు

నా చిన్న తనంలో నేను పిఠాపురంలో మా అమ్మమ్మగారితో ఉండే రోజుల్లో ఆమె ఇల్లు మంగయ్యమ్మారావుపేటలో ఉండేది నాలుగడుగులు వేస్తే ఏనుగులతోట ఉండేది రాజాగారికి ఒకటే ఏనుగు ఉండేది దానిని ఆ తోటలో కట్టి ఉంచేవారు దానిని ప్రతి ఉదయం కోటవెనుకగా ప్రవహించే ఎర్రకాలువలో జలక్రీడలు ఆడడానికి తీసుకు వెళ్ళేవారు ఇక ప్రతిరోజు ఏనుగుతో పాటు నేను వెళ్ళేవాణ్ణి పెద్దవాణ్ణి అయిన తరువాత టూరిజం శాఖలో ఉద్యోగంచేసే రోజుల్లో ఏనుగు జలక్రీడలు, అవి గుంపుగా తిరగటం చూడ్డానికి కేరళ రాష్ట్రంలో థేకడి అడవుల లోనికి వెళ్ళేవాణ్ణి కేంద్రప్రభుత్వం విదేశీపర్యాటకుల ఆనందంకోసం థేకడి అడవిలో అరణ్యనివాస్ అని ఒక టూరిస్టు బంగాళా నిర్మించారు ఆ బంగళా మెట్లుదిగి అక్కడ సిద్ధంగా ఉండే మోటర్‌లాంచీలో ఆ నదిలో పర్యాటకులు ప్రయాణంచేసి వెళుతుంటే నదికి రెండుప్రక్కలా ఉన్న అరణ్యంలో అనేక ఏనుగులు గుంపులు గుంపులుగా కనిపిస్తాయి అవి మంచినీళ్ళు త్రాగడానికి వస్తాయి అప్పుడు టూరిస్టులు తమ కెమేరాలతో వాటి ఫోటోలు తీసుకుంటారు థేకడిలో అరణ్యనివాస్ టూరిస్టు

హోటల్‌లో దిగితే నదిలో లాంచిలో వెళ్ళి ఏనుగులను చూడడమే ముఖ్యమైన కార్యక్రమం

ఏనుగులు మంచినీళ్ళు త్రాగడానికి వచ్చేసమయం అక్కడివారికి తెలుసు కాబట్టి లాంచి ప్రయాణం అదే సమయానికి ఏర్పాటు చేస్తారు అయితే అందరికి అదృష్టం ఉండదు లాంచిలో ఎంతసేపు తిరిగినా ఒక్క ఏనుగుకూడా కనిపించకపోవచ్చు అవన్నీ నదీతీరంనుంచి అడవులలోకి వెళ్ళిపోతాయి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానమంత్రిగా ఉన్న రోజుల్లో ఆయన కూడా థేకడిలో ఏనుగుల్ని చూడ్డానికి వెళ్ళేవారు నెహ్రూ తమని చూడ్డానికి వచ్చాడని వాటికి చూచాయగా తెలిసిపోయేది నెహ్రూగారు లాంచిలో బయలుదేరడానికి ముందు ఏనుగులు మంచినీళ్ల త్రాగడానికి నదీతీరానికి వచ్చే దారులన్నింటిలోను ఉప్పు చల్లేవారు ఏనుగులు ఆ ఉప్పుతిని దాహం తీర్చుకోవడానికి నదీతీరానికి వచ్చి నెహ్రూగారికి దర్శనమిచ్చి ఆయన్ని ఆనందింపచేయడం పరిపాటి కాని నేను ఎన్నిసార్లు ప్రత్యేకలాంచిలో వెళ్ళినా ఏనుగులగుంపు ఒక్కటికూడా నా కంటపడలేదు పాపం కేరళ టూరిస్టు డైరెక్టరు సుబ్రమణి ఎంతో బాధపడేవాడు నాకు ఏనుగులు కనిపించినా కనిపించకపోయినా అరణ్య నివాస్‌లో మకాం ఎప్పుడు వెళ్ళినా ఆహ్లాదంగా ఉండేది

ఒకసారి థేకడి అడవులలో అరణ్యనివాస్ దగ్గరలో మరొక టూరిస్టు బంగళా నిర్మించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి ఆ ఏర్పాట్లు చూడ్డానికి వెళ్ళాను మొత్తం భవననిర్మాణ ప్రదేశం చుట్టూ ఒక కందకం త్రవ్వడంలోని పరమార్థం అర్థం కాలేదు కాంట్రాక్టరుని అడిగాను ఏనుగులు అక్కడవేసిన కలపను సామానులను ధ్వంసం చేయకుండా అన్నాడు ఆ సన్నటి కందకం ఏనుగుల్ని ఎలా ఆపుతుందో నాకు అర్థం కాలేదు కాంట్రాక్టరు నవ్వుతుని గజశాస్త్రంలోనుంచి కొన్నిపాఠాలు చెప్పాడు ఏనుగు ఎత్తుఎక్కేటప్పుడు చాలా వేగంగా నడుస్తుంది కాని ఎత్తుప్రదేశంనించి దిగేటప్పుడు చాలా నెమ్మదిగా నడుస్తుంది అడుగు వేయడానికి ముందు తన తొండంతో వాసన చూస్తూ దిగుతుంది గొయ్యి ఉన్నట్టు కనిపిస్తే ముందుకి అడుగువెయ్యదు కందకం ఎంత సన్ననిదైనా తన ముందు గొయ్యి ఉందని అనిపించగానే ఏనుగు ఇక ముందుకి అడుగు వేయదని అక్కడివారికందరికీ తెలుసు

తమిళనాడునుంచి కేరళకు రైలులో కాని, విమానంలో కాని వెళ్ళవచ్చును నేను మొదటిసారి రైలులో వెళ్ళాను కాని మరొకసారి మధురై నుండి త్రివేంద్రం విమానంలో వెళ్ళాను ఆ కొబ్బరితోటలు ప్రతి అంగుళప్రదేశాన్ని కప్పివేసినట్టు అనిపించింది ఏదో సందర్భంలో కేంద్ర టూరిస్టు మంత్రితో మాట్లాడుతూ

ఉంటే ఆయన దక్షిణ భారతంలో కర్నాటక రాష్ట్రం చాలా అందంగా ఉంటుందన్నారు భరతపూర్ రాజవంశీయులు మైసూర్ రాజవంశీయులకున్న సంబంధ బాంధవ్యాలను దృష్టిలో పెట్టుకుని ఆయన అలా అని ఉంటాడనుకుని కేరళలో ప్రతి అంగుళం అందంగా ఉంటుందన్నాను నిజానికి కేరళ చాలా అందంగా ఉంటుంది విదేశీ పర్యాటకులకు అడవులు, సముద్రం, ప్రకృతి సౌందర్యం కొకొల్లలు త్రివేంద్రానికి దగ్గరలో ఉన్న కోవలం బీచ్ విదేశీ పర్యాటకులకు అత్యంత ఆకర్షణీయమైన ప్రదేశం కేరళ దేవాలయాలలో విలక్షణమైన పద్ధతులు ఉన్నాయి దేవాలయానికి వెళ్ళేభక్తులు ముండు కట్టుకుని తువాలు నడుముకి చుట్టుకుని వెళ్ళాలి దేహంమీద మరెటువంటి ఆచ్ఛాదన ఉండకూడదు త్రివేంద్రంలో పద్మనాభస్వామి దేవాలయంలో స్వామివారిముందు సాష్టాంగ నమస్కారం చేయకూడదు మరొక దేవాలయానికి వెళితే భక్తులకందరికీ ఒంటికి వ్రాసుకోవడానికి గంధం యిస్తారు నేను కేరళ రాష్ట్రానికి టూరుమీద వెళ్ళినప్పుడు రాష్ట్రప్రభుత్వం డైరక్టరు సుబ్రమణి నాకోసంకూడా ఒక పంచె తువాలు తీసుకువచ్చేవాడు మధురైలో మీనాక్షిదేవిని చూచిన తరువాత కేరళలో భాగంగా ఉన్న కన్యాకుమారి చూడ్డానికి వెళ్ళాం నాకెందుకో కన్యాకుమారి దేవాలయంలోని విగ్రహం అత్యంత సుందరంగా ఉందనిపించింది కన్యాకుమారినుంచి కొద్ది దూరంలో సముద్రంలో నిర్మించిన శ్రీవివేకానంద దేవాలయం అద్భుతంగా ఉంది పడవలో వివేకానంద రాక్‌కి చేరి అక్కడ ఎంతసేపు కూర్చున్నా మహదానందంగా ఉంటుంది కన్యాకుమారి సముద్రతీరంలో యిసుక రంగురంగులుగా ఉంటుందని చెబుతారు దానికి కన్యాకుమారి శివుణ్ణి వివాహం చేసుకోవాలని బయలుదేరినప్పుడు కూడా తీసుకువెళ్ళిన పసుపు కుంకుమలు అక్కడ పడిపోయి ఆమె ఆ స్థలంలో శిల అయిపోయినదని పెద్దలు చెబుతారు

నేను టూరిజం డిపార్టుమెంటులో ఉద్యోగానికి చేరేసరికి ఆ డిపార్టుమెంటే కొత్త అంతవరకు ట్రాన్స్‌పోర్టు శాఖలో భాగంగా ఉండి స్వయం ప్రతిపత్తి లేకుండా ఉండేది శ్రీసోమనాథ్‌ఛిబ్ పట్టుదల ఫలితంగా టూరిస్టు డిపార్టుమెంటుని ప్రత్యేక శాఖగా చేసి సివిల్ ఏవియేషన్ మంత్రిత్వశాఖతో జోడించారు అప్పటికి భారతదేశంలోని అనేక రాష్ట్రాలలో టూరిజానికి ప్రత్యేక శాఖ ఉండేది కాదు శ్రీ ఛిబ్ పుణ్యమా అని త్వరలో అన్ని రాష్ట్రాలలోను టూరిజం శాఖలు నెలకొల్పబడ్డాయి ఏడాదికొకసారి దేశంలోని అన్ని రాష్ట్రాలనుంచి టూరిజం శాఖను నిర్వహించే మంత్రులు అధికారులు సమావేశమై దేశ విదేశీ పర్యాటకులకు ఏర్పరచవలసిన వసతి

సౌకర్యం, వారి ప్రయాణాలను సులభతరం చేయడం మొదలైన అనేక సమస్యలు చర్చించేవారు సమావేశం జరిగేది ఒకరోజే అయినా డిపార్టుమెంట్‌లో ఆ సమావేశం ఏర్పాటు చేయడానికి చాలాకాలం పట్టేది దానిని టూరిస్టు డెవలెప్‌మెంట్ కౌన్సిల్ అని పిలిచేవారు ఈ కౌన్సిల్ సమావేశాలు ఢిల్లీలో జరిగేవి రాష్ట్ర ప్రభుత్వాలు కోరుకుంటే వారి రాష్ట్రాల్లో జరిగేవి , ఆ కౌన్సిల్ నిర్వహణకు నన్ను డైరెక్టరుగా నియమించారు ఈ సమావేశాలు సంవత్సరానికి ఒకసారి జరిగేవి కాబట్టి ఆ బాధ్యతలు నాకు అదనంగా యిచ్చారు సమావేశంలో ఎవరు ఎక్కడ కూర్చోవాలో నిర్ణయించడంనుంచి సర్వ ఏర్పాటులు చేయడం నా బాధ్యత ఆ రోజుల్లో వివిధ రాష్ట్రాలలో టూరిజం శాఖను నిర్వహించే మంత్రులలో చాలామంది కాంగ్రెసువారు అయి ఉండేవారు అప్పట్లో బొంబాయి రాష్ట్రంలో టూరిజం శాఖను శ్రీ తలయార్‌ఖాన్ డెప్యూటిమంత్రి హోదాలో నిర్వహిస్తూ ఉండేవారు

శ్రీ తలయార్‌ఖాన్ టూరిజం సమావేశాలకు భార్యాసమేతంగా వచ్చేవారు సమావేశం ఢిల్లీలో అయితే ఎవరికీ సమస్య ఉండేదికాదు కాని అవి కేరళలోను మైసూరులోను, అస్సాం రాష్ట్రంలోను జరిగితే మంత్రులకు మకాం ఏర్పాటు చేయడం ఒక సమస్యగా తయారయ్యేది టూరిజం డెవలెప్‌మెంట్ కౌన్సిల్‌లో రాష్ట్ర మంత్రులేగాక అనధికారులు కూడా సభ్యులుగా ఉండేవారు టూరిజం ఏజంట్లు, హోటల్ యజమానులు, కేంద్రహస్తకళల ప్రతినిధులు కూడా ఈ సమావేశాలకు వచ్చేవారు శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ ప్రతి సమావేశానికి హాజరయ్యేవారు ఒక ఏడాది సమావేశం కేరళలో త్రివేండ్రానికి దగ్గరలో ఉన్న కనకకున్ను ప్యాలెస్‌లో ఏర్పాటు చేసాం వివిధ రాష్ట్రాలనుంచి సమావేశానికి వచ్చేమంత్రులను రాజభవన్‌లో గవర్నరు అతిధులుగా ఉంచమని కేరళ గవర్నరుని కోరాం కాని రాజభవన్‌లో అంతమందికి జాగా ఉండదు కాబట్టి సమావేశానికి హాజరయ్యే మహిళామంత్రులను, శ్రీమతి కమలాదేవిని గవర్నరుగారి అతిధులుగా ఉంచడానికి అంగీకరించారు శ్రీమతి తలయార్‌ఖాన్‌కి ఆమె భర్తతోపాటు త్రివేండ్రంలో ఉన్న మంచి వెస్టరన్ స్టైపు హోటల్‌లో గది ఏర్పాటు చేసాం తీరా సమావేశానికి వచ్చి తమకు ఏర్పాటు చేసిన మకాం గురించి తెలుసుకున్న శ్రీతలయార్‌ఖాన్ చాలా బాధపడిపోయారు తనను, తన భార్యను గవర్నరుగారి అతిధులుగా పెట్టనందుకు తనను అవమానించినట్టే భావించారు ఆ విషయం కౌన్సిల్ అధ్యక్షుడైన కేంద్ర టూరిజం మంత్రితో అన్నారు ఆయన నన్ను అడిగారు గవర్నరుగారి అనుమతి లేకుండా

రాజ్‌భవన్‌లో ఎవరినీ పెట్టడానికి వీలు లేదని చెప్పాను గవర్నరుగారు స్థలాభావం వల్ల మహిళామంత్రుల్నే రాజ్‌భవన్ అతిథులుగా అంగీకరించారని చెప్పాను

శ్రీతలయార్‌ఖాన్ బొంబాయి రాష్ట్రమంత్రివర్గంలో టూరిజం శాఖ డెప్యూటీ మంత్రి ఆయన కౌన్సిల్ సమావేశాలకు హాజరయ్యేవారు ప్రారంభంలో ఆయనకు టూరిస్టు డిపార్టుమెంట్ తగినంత ప్రాముఖ్యం యివ్వడంలేదని ఒక భావన ఉండేది దానికి కారణం సమావేశంలో సభ్యులసీట్లు వర్ణక్రమంలో ఏర్పాటు చేసేవాళ్ళం బొంబాయి ప్రతినిధి కేంద్రమంత్రి ప్రక్క మొదటి రెండుస్థానాలలో కూర్చోవాలనేవారు ఆవిషయం కేంద్రమంత్రి నాతో అన్నారు తీరా చూస్తే ఆంధ్రప్రదేశ్, అస్సాం బీహార్ రాష్ట్రాల సీనియర్ మంత్రులు సమావేశానికి హాజరయితే బొంబాయి రాష్ట్రానికి చెందిన డెప్యూటీ మంత్రికి వారికంటే ముందు సీటు యివ్వడం కుదరదన్నాను కేంద్రమంత్రి అంగీకరించారు శ్రీ తలయార్‌ఖాన్‌కి అంగీకరించక తప్పలేదు అయితే కేరళలో కనకకున్ను ప్యాలెస్‌లో జరిగే సమావేశానికి ముందురోజు రాత్రి మా డైరెక్టరు జనరల్ ఛిబ్, జ్ఞానసింగ్, నేను కూర్చుని సమావేశంలో సీటింగ్ ఏర్పాట్లు చూస్తున్నాం మాకొక ఆలోచన వచ్చింది ప్రతిసారి ఎ నుంచి జడ్ వరుసక్రమంలో సీట్లు ఏర్పాటు చేస్తున్నాం ఈసారి జడ్‌నుంచి ఎ వరుసలో సీట్లు ఎందుకు ఏర్పాటు చేయకూడదని జ్ఞానసింగ్ అన్నాడు నేను శ్రీ ఛిబ్ అంగీకరించాం అలాగే ఏర్పాటు చేసాం

సమావేశాన్ని గవర్నరు ఉదయం పదిగంటలకు ప్రారంభిస్తారు అంతకుముందే సమావేశస్థలానికి వచ్చి ఏర్పాట్లు అన్నీ చూస్తున్నాను అంతలో శ్రీ తలయర్‌ఖాన్ కూడా ఉదయం వచ్చి తన సీటు ఎక్కడుందో చూచుకున్నారు ఆగ్రహోదగ్రుడై నావద్దకు వచ్చి తనపేరు చివరలో పడవేసారన్నారు వరున క్రమం మార్చామని చెప్పాను ఆ విషయం కేంద్రమంత్రితో చెబుతానని బెదిరించారు కేంద్రమంత్రితో చెప్పమని ఆయనతో అని నేను సమావేశస్థలానికి తిరిగి వచ్చేసరికి మా మంత్రిగారు నిప్పులు త్రొక్కుతున్నారు శ్రీ తలయర్‌ఖాన్ తన పంతం నెగ్గించుకోవడానికి కేంద్రమంత్రితో చెప్పారని అర్థం అయింది అయ్యా పదినిమిషాల్లో గవర్నరుగారు వస్తున్నారు కాబట్టి గవర్నరు బాషణ అయి ప్రతినిధులు కాఫీ త్రాగేటప్పుడు మారుద్దామన్నాను మంత్రి అంగీకరించారు ఇంతలో గవర్నరు రావడం ఆయన ఉపన్యాసం గొడవలో సీట్లు క్రమం మార్చాలనే మాటే మర్చిపోయాం మరొక సంవత్సరం కౌన్సిల్ సమావేశం అస్సాం రాష్ట్రంలో ఏర్పాటు చేసాం సమావేశం ముందురోజు సీటింగ్

ఏర్పాటుచూస్తూ కూర్చున్నాం మామూలుగా ఎ నుంచి జడ్ క్రమంలో ఏర్పాటు చేయాలని నిర్ణయించాం శ్రీతలయర్‌ఖాన్ తన ప్రైవేటు సెక్రటరీని తనసీటు ఎక్కడ ఉంటుందో కనుక్కురమ్మని పంపారు అయ్యా మీ మంత్రి గారిసీటు "ఎమ్" క్రింద ఉంటుంది కాబట్టి చివరిభాగంలోనే ఉంటుందని చెప్పాను అప్పటికి బొంబాయి రాష్ట్రం మహారాష్ట్రగా రూపొందింది

నేను మద్రాసులో కేంద్ర టూరిస్టు డైరెక్టరుగా ఉండగా మైసూరులో టూరిస్టు డెవలప్‌మెంటు కౌన్సిల్ సభలు జరపడానికి నిర్ణయించారు దక్షిణ రాష్ట్రాలన్నింటిలోను టూరిస్టు వ్యవహారాలకు కేంద్రం మద్రాసు ఆఫీసు కావడం మూలంగా మైసూరు సమావేశాలు నిర్వహణలో నా బాధ్యత కూడా ఉంది సమావేశం మైసూరులో లలితమహల్ ప్యాలెస్ భవనంలో ఏర్పాటుచేసారు ఆ సమావేశాలకు వెళ్ళవలసిన కేంద్ర, రాష్ట్ర మంత్రులు, మిగిలిన సభ్యులు బెంగుళూరు వరకు విమానంలో వచ్చి అక్కడ నుంచి కార్లలో మైసూరు వెళ్ళాలి ఆ ఏర్పాట్లు చూడ్డానికి నేను మద్రాసునుంచి బెంగుళూరు వెళ్లాను ఎందుకైనా మంచిదని బెంగుళూరు నా కారులో వెళ్ళాను ప్రతినిధులను బెంగుళూరునుంచి మైసూరు తీసుకువెళ్ళడానికి కర్నాటక రాష్ట్రప్రభుత్వం కార్లు ఏర్పాటు చేసింది నేను బెంగుళూరు విమానాశ్రయం వద్ద కూర్చుని అక్కడకు ప్రతి విమానం లోను వచ్చే ప్రతినిధులను ఆహ్వానించి వారిని కారులో కూర్చోబెట్టి మైసూరు పంపిస్తున్నాను చాలామంది మైసూరు ళ్ళిపోయారు ఆ మరునాడు మైసూరులో సమావేశం బెంగుళూరు మానాశ్రయంలో మిత్రులతో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాను ల్లీనుంచి వచ్చిన విమానంలో కేంద్రటూరిస్టు మంత్రిత్వశాఖలో డెప్యూటీ మంత్రి దిగారు ఆమె బీహారు రాష్ట్రంలోని షెడ్యూల్డ్ తెగలకు చెందిన నాయకుని భార్య ఆమెను ఆహ్వానించి తీసుకువచ్చి విశ్రాంతిగదిలో కూర్చోబెట్టాను ఆమె ప్రయివేటు సెక్రటరీ నావద్దకు వచ్చి డెప్యూటీ మంత్రిని మైసూరు తీసుకు వెళ్ళడానికి కారు ఏర్పాటుచేసారా? అని అడిగారు మంత్రిగారికి ఏర్పాటుచేసిన కారుగురించి రాష్ట్రప్రభుత్వ ప్రతినిధిని అడిగాను కొంచెం దూరంగా నిలబడి ఉన్న కారుల్నిచూపించి దానిలో ఒక కారు అన్నాడు ఆరోజు విమానాశ్రాయానికి మైసూరు మహారాజా వారి ప్యాలస్ నుంచి కూడా ఒక కారు వచ్చింది ఆ కారుచూచి అది డెప్యూటీ మంత్రిగారికి పంపిన కారని నేను, ఆమె కార్యదర్శి కూడా పొరపడ్డాం మేము ఆ కారువద్దకు వెళ్ళిచూడలేదు తీరాచూస్తే అది మామూలు అంబాసిడర్ కారు

ఇంతలో శ్రీమతి విజయరాజే సింధియా మరొకవిమానంలో దిగారు అంతకుపూర్వం నేను ఆమెను చూడనందున గుర్తుపట్టలేననే అనుమానంతో

ఆమెను టూరిస్టు కౌంటర్‌వద్దకు రావలసిందని విమానసిబ్బందిచేత మైక్‌లో చెప్పించాను ఆమె కౌంటర్‌వద్దకు వచ్చారు అప్పటికే మైసూరు మహారాజావారి ప్యాలెస్‌నుంచి వచ్చిన అధికారి ఆమెను కలుసుకున్నాడు తనకు మహారాజా కారు పంపారు కాబట్టి మైసూరులో తన మకాం, వాహనం విషయంలో మమ్మల్ని యిబ్బంది పడవద్దని చెప్పి మహారాజావారు పంపిన కారులో ఆమె మైసూరు వెళ్ళిపోయారు ఆమె టూరిస్టు కౌన్సిల్‌లో అనధికార సభ్యురాలు ఆమెను కారులో మైసూరు పంపి కేంద్రటూరిస్టు డెప్యూటీమంత్రిని కూడా మైసూరు సాగనంపి బెంగుళూరులో నా బాధ్యత తీరినదనే సంతృప్తితో ఆ మరునాడు ఉదయం నా కారులో మైసూరు చేరాను సమావేశం ప్రారంభం కావడానికి యింకా కొంత వ్యవధి ఉంది కాని డిపార్టుమెంటులోని మిత్రులు అంతా నన్ను ఏదో ఘోరంచేసిన వాణ్ణి చూచినట్టు చూడ్డం ఆశ్చర్యం కలిగించింది ఎవరూ ఆప్యాయంగా పలకరించక పోవడం చూడగానే అశుభం శంకించాను సహోద్యోగి అంజనీ మెహతా వచ్చి నన్ను వెంటనే వెళ్ళి కేంద్రటూరిస్టు రాజ్యమంత్రి శ్రీ పునాఛాను చూడమని సలహా చెప్పింది

శ్రీ పునాఛా నన్ను చూడగానే విరుచుకుపడిపోయారు డెప్యూటీ మంత్రిని అవమానపరచానని, వెంటనే వెళ్ళి ఆమెకు క్షమాపణ చెప్పుకోమని సలహా చెప్పారు ఆయనవద్దనుంచి బైటకు వచ్చి అసలు విషయం ఏమిటో మిత్రుల్ని అడిగి తెలుసుకున్నాను బెంగుళూరు విమానాశ్రయంవద్ద మైసూరు వెళ్ళడానికి డెప్యూటీ మంత్రిగారికి రాష్ట్రప్రభుత్వం యిచ్చిన కారు ఆమెకు దారిలో యిబ్బంది కలిగించిందని, దానితో ఆమెకు చిరాకెత్తి అసలు సమావేశానికి హాజరుకానని గొడవ చేసినదట కేంద్రమంత్రి శ్రీసంజీవరెడ్డి కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ నిజలింగప్ప, స్టేట్ మినిష్టరు శ్రీ పునాఛా అందరూ తమ ఇంపోర్టెడ్ కార్లను ఆమె ఉపయోగానికి యివ్వడానికి సిద్ధపడ్డారట ఆమెను ఎలాగైతేనే బుజ్జగించి మైసూరులో ఉండేటట్లు చేసారట చిత్రం ఏమిటంటే ఆవిడకోపం అంతా నామీదేనట తన సెక్రటరీకి బెంగుళూరు విమానాశ్రయంలో మంచికారు చూపించి ఆ కారు శ్రీమతి విజయరాజే సింధియాకు యిచ్చి తనకు డొక్కు అంబాసిడరు కారు యిచ్చి తనను మూర్తి అవమానించాడని ఆమె అభియోగం బెంగుళూరులో దూరంనుంచి చూచిన కారు మైసూరు ప్యాలెస్‌నుంచి శ్రీమతి సింధియాకోసం వచ్చినదని ఆమెకు తెలియదు అంతేకాకుండా తాను ఎక్కినకారుకి దారిలో పంక్చర్ అయితే దానికి మూర్తి ఎలాకారణమో నాకు అర్థం కాలేదు మా స్టేట్‌మినిష్టరు శ్రీపునాఛా ఆమెచేసిన హడావిడికి హడలిపోయి నామీద విరుచుకుపడ్డారు

అంతలో సమావేశ ప్రారంభ కార్యక్రమం మొదలుకావడంతో డెప్యూటీ మంత్రిగారికి ఒక నమస్కారం పెట్టి సమావేశంలో పాల్గొన్నాను దానికి తోడు క్రితం రాత్రి ఆమె శ్రీ సంజీవరెడ్డిగారితో మాట్లాడుతున్నప్పుడు ఆయన ఆమె కోపాన్ని తగ్గించడానికి నాగురించి తనకు తెలిసిన వివరాలన్నీ చెప్పి మూర్తి తనను అవమానపరచడం సాధ్యం కాదని చెప్పారట దానితో టీకప్పులో తుఫాను సృష్టించిన మా డెప్యూటీ మంత్రి చల్లబడిపోయింది కాని శ్రీ పునాఛా మాత్రం ఆ విషయం మర్చిపోలేకపోయాడు నేను కనిపించినప్పుడల్లా ఆ విషయం గుర్తుచేసేవారు అయితే ఆయనకు తెలియని విషయం ఏమిటంటే ఆ గొడవ తరువాత డెప్యూటీ మంత్రికి నాయందు అభిమానం పెరిగిందని ఒకసారి ఆమె మద్రాసు విమానాశ్రయంలో రెండు మూడు గంటలు గడపవలసిన పరిస్థితి ఏర్పడితే విమానాశ్రయంలో ఉన్న విశ్రాంతిభవనంలో దిగారు నాకు డెప్యూటీ మంత్రి మద్రాసు వస్తున్నట్టు సమాచారం లేనందున విమానాశ్రయానికి వెళ్ళలేదు ఆమె విమానాశ్రయం విశ్రాంతిభవనంలో ఉన్నారని తెలుసుకొని విమానాశ్రయానికి వెళ్ళాను ఆమెతో కబుర్లు చెబుతూ రెండు గంటలకు పైగా కూర్చోవలసివచ్చింది ఆ సందర్భంలో కేంద్ర టూరిస్టు మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి నాగురించి ఆమెకు మైసూరులో చెప్పిన వివరాలు చెప్పి ఆనందపడిపోయింది శ్రీ సంజీవరెడ్డి గారితో పాటు నేను 1941 లో రాయవెల్లూరు జైలులో సహజీవనం చేసినమాట ఆయననుంచి విని ఆమె ఉక్కిరిబిక్కిరి అయిపోయింది టూరిస్టు కౌన్సిల్ సమావేశాల సందర్భంగా మైసూరు లలితమహల్ ప్యాలెస్‌లో నాయకుల ముందు నాపై నేరం మోపినందుకు ఆమె చాలా విచారపడింది చాలా ఆప్యాయంగా మాట్లాడారు ఆమెతో వచ్చిన అభిప్రాయబేధాలు సమసిపోవడంతో నేను కూడా సంతోషపడ్డాను

  

# ఆస్ట్రేలియా - అనుభవాలు

నేను ఢిల్లీలో డిపార్టుమెంటులో చేరినప్పుడు నన్ను డైరెక్టరు, ఇన్‌స్పెక్షన్‌గా నియమించారు మన దేశంలో ఏప్రాంతంలోనైనా విదేశీ పర్యాటకులకు వసతి సదుపాయాలు కల్పించవలసిన అవసరం ఉన్నదా లేదా అనే నిర్ణయం చేయడంనుంచి అవసరమైతే వసతి సదుపాయాలు ఎక్కడ కల్పించాలనే విషయం నిర్ణయం వరకు నాదే బాధ్యత ఆరోజుల్లో టూరిస్టు డిపార్టుమెంటు విదేశీ పర్యాటకుల మంచిచెడ్డలు చూడ్డానికి, వారికి సదుపాయాలు చేయడంలో నిమగ్నమై ఉండేది కేంద్ర టూరిస్టు ఆఫీసులు కలకత్తా బొంబాయి మద్రాసు ఢిల్లీ పట్టణాలలో ఉండేవి భారతీయులు వినోదపర్యాటకులుగా వెళితే వారి బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలదే అనేక రాష్ట్రప్రభుత్వాలు తమ రాష్ట్రంలో విదేశీ పర్యాటకుల్ని ఆకర్షించే అనేక ప్రత్యేకతలు ఉన్నాయి కాబట్టి ఆయాప్రాంతాలకు తగు ప్రచారం ఇచ్చి, అక్కడ వసతి సౌకర్యాలు కల్పించమని కోరేవి భారత ప్రభుత్వం విదేశీ పర్యాటకులను ఆకర్షించే ప్రదేశాలను మాత్రమే పరిగణలోనికి తీసుకుంటుందని వారు ఆకర్షణీయంగా ఉన్నాయనుకున్న ప్రదేశాలలో ప్రత్యేకత లేదని రాష్ట్రప్రభుత్వాలకు చెప్పి ఒప్పించడానికి తలప్రాణం తోకకు వచ్చేది

మనకు ఆకర్షణీయంగా ఉన్నాయనిపించే అనేక విషయాలు విదేశ పర్యాటకులకు నచ్చక పోవచ్చు అ విషయం మన రాష్ట్రనాయకులు అంగీకరించేవారు కాదు, నాకు బాగా గుర్తు నేను ఢిల్లీలో ఉద్యోగం చేసేటప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో విదేశీ పర్యాటకులకు ఆకర్షణీయంగా ఉండే ప్రదేశాలు పరిశీలించి నిర్ణయించడానికి హైదరాబాదు వెళ్ళాను అప్పట్లో శ్రీరంగారెడ్డి రాష్ట్ర ఆర్థికమంత్రి సమాచారమంత్రిగా ఉండేవారు, మిత్రుడు మహారాజ్‌కరన్ రాష్ట్రప్రభుత్వ టూరిస్టు శాఖలో అసిస్టెంటు డైరెక్టరు మర్యాదకు మంత్రిగారిని చూడ్డానికి వెళ్ళాను ఆరుకోట్ల రూపాయల విలువైన పథకాలు అంగీకరించడానికి నాకు అవకాశం ఉందని ఆయనకు తెలుసు 'మూర్తిగారు మనవాడేకదా' అనే బరోసాతో మహారాజ్ కరన్‌ని తోడిచ్చి పంపారు రాష్ట్ర ప్రభుత్వం అప్పుడు నాకు చూపించిన ఆకర్షణలు ఏవీ కూడా విదేశీపర్యాటకులను ఆకర్షిస్తాయని నాకు అనిపించలేదు అదే వారితో చెప్పాను

బారత ప్రభుత్వం 1956 లో ఆస్ట్రేలియా దేశంలో మెల్బోరన్ పట్టణంలో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్ ఆటల పోటీల తరువాత ఆ దేశప్రజలను బారతదేశానికి వినోద పర్యాటకులుగా ఆకర్షించడానికి మెల్బోరన్‌లో ఒక ఆఫీసు తెరిచారు అప్పటికే మనకు ఆస్ట్రేలియాతో దౌత్యసంబంధాలు ఉన్నాయి భారత హైకమిషనరు ఆస్ట్రేలియాకు ముఖ్యపట్టణమైన కాన్‌బెరాలోను, మన ట్రేడ్ కమిషను ఆ దేశంలో అతి పెద్ద ప్రముఖ పట్టణమైన సిడ్నీలో ఉంటాయి ఇక టూరిస్టు ఆఫీసు మెల్బోరన్ పట్టణంలో పెట్టాలని మన ప్రభుత్వం నిర్ణయించింది మెల్బోరన్‌లో ప్రధమ బారతీయ టూరిస్టు ఆఫీసరుగా మిత్రుడు రత్నాకర్‌ని నియమించారు ఆయన తరువాత కుదేషియా పనిచేసాడు వారిద్దరూ అసిస్టెంటు డైరెక్టరు హోదాలో ఉండేవారు నేను టూరిస్టు డిపార్టుమెంటులో డైరెక్టరుగా చేరిన మూడేళ్ళలో నన్ను మెల్బోరన్ ఆఫీసులో డైరెక్టరుగా నియమించారు

విదేశాలలో తిరిగిన అనుబవంతో ఆస్ట్రేలియా వెళ్ళడానికి అంగీకరించాను మద్రాసులోనే భారతప్రభుత్వ పాస్‌పోర్టు ఆఫీసు ఉండడం వల్ల పాస్‌పోర్టు తీసుకోవడం సులువుగా అయిపోయింది నా ప్రయాణానికి ఒక నెలరోజులు వ్యవధి ఉంది ఉద్యోగ ధర్మంగా కేరళ, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు వెళ్ళి మంత్రులకు అధికారులకు కృతజ్ఞతలు చెప్పుకుని వారివద్ద సెలవు తీసుకున్నాను అది ఆ రోజుల్లో పాటించే సంప్రదాయం ప్రయాణానికి ముహూర్తం దగ్గరపడుతున్న కొద్ది మద్రాసులో ఇంటా బైటా కూడా హడావిడి విదేశాలకు వెళుతున్నానని నన్ను సాగనంపడానికి మా అన్నయ్య మద్రాసు వచ్చాడు మిత్రులు టూరిజంతో సంబంధం ఉన్నవారంతా కలిసి విడిగాను పార్టీలు ఏర్పాటు చేసారు ఏదో గాలిలో తేలిపోతున్నట్టుగా ఉంది జూన్ 20వ తేదీన కొలంబో (సిలోన్) నుంచి మెల్బోరన్ (ఆస్ట్రేలియా)కి బయలుదేరే ఓడలో ప్రయాణం నిశ్చయమైంది అంటే మద్రాసు నుంచి కొలంబో వెళ్ళి అక్కడ ఓడ ఎక్కాలన్నమాట కొలంబో వెళ్ళడానికి సిలోన్ ప్రభుత్వం వారి వీసాకావాలి అదృష్టవశాత్తు సిలోన్ ప్రభుత్వ ట్రేడ్ కమిషనరు ఆఫీసు మద్రాసులో ఉన్నందున ఆ దేశపు వీసా నిమిషాలమీద వచ్చింది ఆస్ట్రేలియా వెళ్ళడానికి కూడా ప్రభుత్వం యొక్క అనుమతి ఉండాలి నేను ఉద్యోగరీత్యా ఆస్ట్రేలియా వెళుతున్నాను కాబట్టి ఆ ఏర్పాట్లు అతి సులభంగా పూర్తి అయ్యాయి

1962 జూన్ 17వ తేదిన మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో రామేశ్వరం మెయిల్‌వద్ద నన్ను సాగనంపడానికి వచ్చిన కుటుంబసభ్యులు మిత్రులు ప్లాట్‌ఫారంలో చాలా బాగం ఆక్రమించుకున్నట్టు అనిపించింది

పూలమాలలు కోకొల్లలు అది మద్రాసు సాంప్రదాయం, మర్యాద మద్రాసులో ఏ చిన్న కార్యక్రమానికి వెళ్ళినా పూలమాల లేకుండా తిరిగి వచ్చేవాణ్ణి కాదు భారత ట్రావెల్స్ అండ్ కంపెనీ మిత్రులకు మద్రాసులోను బెంగుళూరులోను కూడా ఆఫీసులు ఉన్నందున వారు నిలువెత్తు పూలమాల బెంగుళూరు నుంచి విమానంలో పంపారు దానిని రైలుస్టేషన్ వద్దకు తీసుకు వచ్చి నా మెడలో వేసారు మా శ్రీమతి, అమ్మాయిలు స్టేషన్ వద్ద ఉన్నారు కాబట్టి ఆ దండయొక్క వినియోగం సమస్య కాలేదు ఆ రోజుల్లో నిలువెత్తు పూలమాలలు తయారు చేయడం కర్నాటక వారి ప్రత్యేకత ఆ తరువాత ఆ అలవాటు, నేర్పు ఇతర దక్షిణాది రాష్ట్రాలకు కూడా ప్రాకింది దండ మెడలో వేయడానికి ముందే దానిని చేతితో అందుకుని బల్లమీద పెట్టే అలవాటు చూస్తే అసలు దండలకోసం డబ్బు ఖర్చుపెట్టడం శుద్ధదండగ అనిపిస్తుంది కాని టూరిజం డిపార్టుమెంటులో పూలమాలలకు ప్రత్యేకస్థానం ఉంది మనదేశంలోని అన్ని అంతర్జాతీయ విమానాశ్రయాల వద్ద మన దేశంలో అడుగుపెట్టే విదేశపర్యాటకులకు పూలమాలల మర్యాదలు చేస్తారు ఆ దండలు వేసుకున్న విదేశీయుల ఆనందం చూచి తీరాలి ఆడ, మగ కూడా తమ హోటళ్ళకు వెళ్ళేవరకు ఆ దండలు తీయరు అది చూచిన తరువాత మన నాయకులు పూలమాలలకు చేసే అవమానం చూస్తే బాధ కలుగుతుంది

మద్రాసునుంచి రామేశ్వరం వరకు రైలు ప్రయాణం రామేశ్వరంనుంచి తలైమన్నారు వరకు ఓడ ప్రయాణం తలైమన్నారు మన దేశంనుంచి సిలోన్ దేశంలోకి ప్రవేశించడానికి ముఖద్వారం అనవచ్చు సిలోన్ దేశానికి వెళ్ళే అంతర్జాతీయ నౌకాయానం అంతా కొలంబో రేవునుంచి జరుగుతుంది సిలోను ద్వీపకల్పం కావడంవల్ల భారతదేశంనుంచి సిలోన్‌కి వెళ్లడానికి రామేశ్వరం తలైమన్నార్ మార్గం అడ్డదారి లేకపోతే కొచ్చిన్‌లో ఓడ ఎక్కి చుట్టు తిరిగి కొలంబో చేరాలి ఇదంతా ఓడ ప్రయాణం చేసేవారి మాట ఎయిర్ సిలోన్ విమానాలు ప్రయాణికుల్ని శ్రమ లేకుండా కొలొంబోనుంచి మద్రాసు తీసుకు వస్తాయి అయితే లక్షలాది తమిళులు జీవనోపాధికి సిలోన్ వెళ్ళడం పాత చరిత్ర పాక్ జలసంధి దాటితే సిలోన్ భూభాగంలో ఉంటారు కాబట్టి పేద తమిళులు రామేశ్వరం నుంచి తలైమన్నారు వెళతారు సామాన్య ఓడ ప్రతిరోజు రామేశ్వరం తలైమన్నారు మధ్య ప్రయాణికుల సదుపాయం కోసం తిరుగుతుంది ఓడ ప్రయాణం అలవాటులేని వారికి ఆ ఓడ ప్రయాణం సముద్రప్రయాణం రుచి చూపెడుతుంది కెరటాలు, నీటివడిని బట్టి మూడు నాలుగు గంటలలో ఓడ తలైమన్నారు చేరుతుంది ఈ ప్రయాణం విదేశ ప్రయాణంగానే పరిగణింపబడుతుంది పాస్‌పోర్టులు, వీసాలు, అంతర్జాతీయ ఆరోగ్యపత్రం, విదేశీమాకర ద్రవ్య తతంగం అన్నీ వున్నాయి

తలైమన్నారులో ఓడదిగి సిలోన్ దేశంలో ప్రవేశించినట్టు పాస్‌పోర్టుమీద ముద్ర వేయించుకొని కొలంబోకి రైలు ఎక్కాను మనదేశంనుంచి సిలోన్ వెళ్ళే ప్రయాణీకుల కోసం ఏర్పాటు చేసిన రైలు అది మన రైళ్ళకు దానికి ఏమీ పెద్ద తేడా కనిపించలేదు చిత్రం ఏమిటంటే దారివెంట చూచిన పరిసరాలు, వృక్షసంపద ముఖ్యంగా పుష్కలంగా పండే కొబ్బరి మన కేరళ రాష్ట్రాన్ని గుర్తుచేసాయి కొలంబో చేరేవరకు దక్షిణ బారతంలో ఉన్న బావమే కలిగింది ఇక కొలంబో నగరం అందం ఆకర్షణ నేడు ప్రపంచంలోని పెద్ద పట్టణాలకు ఎందునా తీసిపోదు అంతేకాదు సింహళీయులు చాలా సరదాగా బ్రతికే జాతి చాలాకాలం బ్రిటిష్‌వలన రాజ్యం కావడం, బ్రిటిష్ పరిపాలకులు సిలోన్‌ను తమ నౌకాస్థావరం చేసుకొని బారతదేశంలో భాగంగా పరిపాలించడం మూలంగా కొలంబో ఎంత ఆదునిక పట్టణమైనా మనకు క్రొత్త అనిపించదు మిత్రుడు కుదేషియా బార్యా సమేతంగా రైలు స్టేషనుకి వచ్చి నన్ను తన యింటికి తీసుకు వెళ్ళాడు

రెండు రోజులు కొలంబోలో గడిపాను నేను ప్రయాణం చేయవలసిన ఓడ ఆరాత్రికి కొలంబో చేరింది బరువు సామాన్లు ముందుగా ఓడ అధికార్లకు అప్పగించి బారత హైకమీషనర్‌ని చూడ్డానికి వెళ్ళాను కొలంబో తరువాత చూడవలసిన పట్టణం కాండి కాబట్టి నన్ను తప్పకుండా దానిని చూచి రమ్మని సలహా చెప్పారు కాండీలో కోళ్ళగెట్టలో పచ్చలు దొరకుతాయట ఆ పట్టణంలో ఉన్న బుద్ధ విగ్రహం చాలా ప్రసిద్ధి కెక్కినది ఆయన సలహాలన్నీ విన్న తరువాత నిజంగా అవన్నీ చూడాలనిపించింది కాని ఆమరునాటి రాత్రి ఓడ కొలంబో వదలుతుందని వార్త వచ్చినందున సాహసించలేదు కుదేషియాతో కలసి ఆ సాయంకాలం పాత్రికేయుల సమావేశంలో మాట్లాడి క్లబ్‌కి వెళ్ళాను దనిక వర్గాలకు చెందిన సింహళీయుల సాంఘిక జీవన విదానం చూసే అవకాశం దొరికింది ఎంత చూడాలని సరదాపడ్డా టీ తోటలలో పనిచేసే పేద బారతీయుల్ని చూసే అవకాశం లబించలేదు పేద వర్గాలు నివసించే కొన్ని ప్రదేశాలు చూసాను పేదరికం అబివృద్ధి చెందుతున్న దేశాలలో చేసే విలయతాండవం కొలంబోలో కూడా సాక్షాత్కరించింది

ఇంగ్లండు దేశంనుంచి ఆస్ట్రేలియా వెళుతూ కొలంబో రేవులో ఆగిన బ్రిటిష్ నౌక ప్రయాణానికి సిద్ధంగా ఉంది మిత్రుడు కుదేషియా ఓడవరకు వచ్చి నాకు వీడ్కోలు చెప్పాడు సామాన్యంగా బ్రిటిష్ ప్యాసింజరు నౌకలు బొంబాయి రేవులో ఆగుతాయి కాని నేను ఆస్ట్రేలియా వెళ్ళడానికి ఎక్కవలసిన ఓడ బొంబాయి కాకుండా కొలంబోలో ఆగడం వల్ల నాకు సిలోన్ దేశం చూచే అవకాశం చిక్కింది జూన్ 20వ తేదీ రాత్రి ఓడ కొలంబో వదలి

పెట్టింది ఇంతకుముందు నేను బొంబాయినుంచి లండను వరకు ఓడలో ప్రయాణం చేసాను లండనులో చదువు పూర్తిచేసుకొని భారతదేశానికి ఓడలోనే తిరుగుప్రయాణం చేసాను ఆ తరువాత వియత్నాంనుంచి చైనా, సోవియట్ యూనియన్ పోలెండ్, జర్మనీ ఫ్రాన్స్ దేశాలు చూచుకుంటూ లండను చేరి లండనునుంచి బొంబాయికి ఓడలో ప్రయాణం చేసాను విమానాలలోను, రైళ్ళలోను ప్రయాణం చేయడానికంటే నాకు ఓడ ప్రయాణమంటే ప్రాణం ఆ ప్రయాణంలోని సుఖం హాయి అనుభవించిన తరువాత మరొక రకం ప్రయాణం చేయడానికి మనస్కరించదు సముద్రపునీరు, కెరటాల ఊపులో ఓడ చేసే విన్యాసాల ఫలితంగా ఓడలో ప్రయాణించే వారంతా చిత్రాతిచిత్రంగా ప్రవర్తిస్తారు ఆ వాతావరణం ప్రయాణీకులమీద ఒక విధమైన మైకాన్ని కప్పుతుంది

ఓడ ప్రయాణంలో అనుభవం ఉండడంవల్ల ప్రయాణం హాయిగా సాగిపోతోంది కాని ఆ ఓడలో వున్న 12 వందలమంది ప్రయాణీకులలోను యూరోపియన్ జాతికి చెందనివాణ్ణి నేనొక్కణ్ణే అని గుర్తించి ఆశ్చర్యపోయాను అంతేకాకుండా ఆ ఓడలోని ప్రయాణీకుల్లో అధికభాగం బ్రిటన్‌నుంచి అనేక యూరోపియన్ దేశాలనుంచి ఆస్ట్రేలియాకు వలస పోతున్నవారే, కొద్దిమంది ఇంగ్లాండులో విద్యకోసం వెళ్ళి తిరిగి వస్తున్నారు శాశ్వతంగా తమ జన్మస్థలాలు వదలి జీవితంలో నూతన అవకాశాలు వెతుక్కుంటూ వందల మైళ్ళు ప్రయాణం చేసి ఆస్ట్రేలియాకు తరలిపోతున్న వారితో నిండివుంది ఓడ వారిలో చాలా మందికి ఆస్ట్రేలియా గురిం తెలియదు, జీవితంలో వారికది ఒక సాహసం భార్యా పిల్లలతో స ఇంగ్లండుదేశం వదలి ఆస్ట్రేలియాకు తరలిపోయే ఇంగ్లీషువానిలో క్ర ప్రపంచంలోనికి అడుగుపెడుతున్నామన్న ఉత్సాహం కొట్టవచ్చినట్ల కనబడుతుంది కాని సాధారణంగా తనదేశంలో బాగుపడి, సిరిసంపదలు, సంఘంలో గౌరవ మర్యాదలు సంపాదించిన వ్యక్తి మాతృదేశం వదలి మరొకదేశానికి వలస పోవడానికి అంగీకరించడు

జీవితంలో పైకి రావడానికి అవకాశాలు వెతుక్కుంటూ వెళ్ళే వారికి అనేక కొత్త దేశాలు ఆశ్రయమిచ్చి వారికి శాశ్వత నివాసం కల్పించాయి అటువంటి దేశాలలో అమెరికా ప్రథమ స్థానం ఆక్రమిస్తుందని చరిత్ర చదువుకున్న వారికి తెలుసు అమెరికా దేశానికి ఆస్ట్రేలియా దేశానికి కొన్ని పోలికలున్నాయి వాటిలో ముఖ్యంగా బ్రిటిష్ ప్రభుత్వం ఈ రెండు దేశాలను తమ దేశంలో నేరం చేసి శిక్ష విధించబడ్డ నేరస్తులను పంపడానికి ఉపయోగించింది వేలాదిమంది పేద వర్గాలకు చెందిన నేరస్తుల్ని తమ దేశంలోని జైళ్ళలో

ఉంచడానికి స్థలం చాలక పరదేశాలకు శిక్ష అనుభవించడానికి పంపేవారు అమెరికా, బ్రిటీష్ సామ్రాజ్యంపై తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యం ప్రకటించే వరకు బ్రిటీష్ నేరస్తుల్ని అమెరికాకు పంపే వారు, అయితే అప్పటికే అమెరికన్ భూస్వాములు ప్రతి ఏట ఆఫ్రికానుంచి వేలాదిమంది ఆఫ్రికనులను బానిసలుగా దిగుమతి చేసుకోవడంవల్ల వారికి బ్రిటీష్ నేరస్తులకు ఆశ్రయం ఇవ్వవలసిన అవసరం లేకపోయింది ఆవిధంగా అమెరికా దేశానికి నేరస్తుల్ని పంపడానికి అవకాశాలు తగ్గడంతో బ్రిటీష్ ప్రభుత్వం కొత్త దేశాలు వెతుక్కోవలసి వచ్చింది ఆ అన్వేషణ ఫలితంగా ఆస్ట్రేలియాలో బ్రిటిషు నేరస్తులకు నివాసం ఏర్పడింది

బ్రిటిషువారు, ఆస్ట్రేలియా ఖండాన్ని కనుక్కోవడం చాలా అసక్తికరమైన చారిత్రక సత్యం కొలంబస్ అమెరికాను కనుగొన్నాడు అయితే ప్రపంచంలోకెల్లా అతి చిన్న ఖండమైన ఆస్ట్రేలియాను ఎవరు కనుగొన్నారు? చరిత్ర చదువుకున్నవారికందకి 17, 18, శతాబ్దాలలో డచ్, పోర్చుగీస్, స్పానిష్, బ్రిటీష్, ఫ్రెంచి సాహస యాత్రికులు నౌకలపై ప్రయాణిస్తూ వారికి ఎక్కడ భూభాగం కనిపిస్తే అక్కడ ఆగి దానిని తాము కనుగొన్నామని ప్రకటించుకోవడం పరిపాటని తెలిసిన విషయమే అయితే ఆరోజుల్లో సాహస యాత్రలు చేయడంలో మిగిలిన దేశాలవారు డచ్చివారి ముందు దిగదుడుపే

పోర్చుగీస్, స్పానిష్‌వారు ఆస్ట్రేలియా భూభాగం మీద కాలు మోపిన ఋజువు లేదు 1606లో టోర్స్ ఆస్ట్రేలియా పాపువా మధ్యనున్న సముద్ర మార్గం గుండా నౌకలో వెళ్ళాడు అదే సంవత్సరం డచ్ నౌక కార్పెన్ టేరియా సందుశాఖలో ప్రవేశించినది 1623లో జన్ కార్ స్టెన్స్ అనే డచ్చి యాత్రికుడు ఆస్ట్రేలియాలో ఒకమూల దిగి దానికి న్యూహాలెండ్ అని పేరు పెట్టాడు ఆస్ట్రేలియా ఖండంలో సుక్షేత్రమైన ప్రదేశాలను కనుగొనలేక పోయినందున డచ్చివారికి 1696నాటికి ఆస్ట్రేలియాలో ఆసక్తి తగ్గిపోయింది

1688లో విలియం డాంపియర్ అనే ఇంగ్లీషు సాహస యాత్రికుడు ప్రప్రథమంగా ఆస్ట్రేలియా భూబాగంమీద అడుగుపెట్టాడు 1699లో అతడు మరొకసారి ఆస్ట్రేలియా వెళ్ళాడు కాని అతడి నివేదికలు ఇంగ్లాండులో ప్రభుత్వ వర్గాలలో ఏవిధమైన ఆసక్తిని రేకెత్తించలేకపోయాయి మరొక 70 ఏళ్ళవరకు ఆస్ట్రేలియాను ఎవరూ పట్టించుకోలేదు 1770లో బ్రిటిషు రాయల్ నౌకాదళానికి చెందిన కేప్టెన్ జేమ్సుకుక్ అనే ఆంగ్లేయుడు ఆస్ట్రేలియా తూర్పు ప్రాంతాన్ని చూసాడు ఏప్రిల్ 29, 1970 నాడు జేమ్సుకుక్ బోటనీబే, (ప్రస్తుతం సిడ్నీ ఉన్న ప్రదేశం) వద్ద ఆస్ట్రేలియా భూభాగం మీద దిగి అక్కడ బ్రిటిషు పతాకం ఎగురవేసి ఆప్రాంతాన్ని అంతా ఆక్రమించుకున్నాడు అతడి

నివేదికలు లండనులో ఆసక్తి కలిగించినా అప్పట్లో ఆస్ట్రేలియాను వలసదేశంగా చేసే ప్రయత్నాలు జరగలేదు

అయితే అమెరికన్ స్వాతంత్ర్య పోరాటం ఫలితంగా అమెరికన్ వలస రాష్ట్రాలు బ్రిటిష్‌వారి చేయి జారిపోవడంతో వారిదృష్టి ఆస్ట్రేలియాపైకి మళ్ళింది 1787 మే 13వ తేదీన 1500 మంది బ్రిటిష్ పౌరులు కేప్టెన్ ఆర్థర్ ఫిలిప్ నాయకత్వంలో 11 ఓడలలో ఆస్ట్రేలియాకు ప్రయాణమయ్యారు వారిలో 800 మంది నేరస్తులు ఉన్నారు రెండు మాసాలు ప్రయాణంచేసి 1788 జనవరి 1వ తేదిన బ్రిటిష్ ఓడలు బోటనీ బే చేరాయి అదే నెల 26 వ తేదీన ఫిలిప్ ఆస్ట్రేలియా తూర్పు బాగాన్ని హస్తగతం చేసుకుని బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణకు ఆస్ట్రేలియాలో నాంది పలికాడు అతడే ఆ తరువాత న్యూసౌత్‌వేల్స్‌కి ప్రథమ బ్రిటిష్ గవర్నరు అయ్యాడు దారి తెన్ను తెలియని క్రొత్త ప్రదేశంలో వ్యవసాయ భూముల్ని, అందునా సారవంతమైన వాటిని వెతుక్కోవడానికి కొంతకాలం పట్టింది ఆ సమయంలో ఫిలిప్‌తో పాటు యావన్మంది ఆస్ట్రేలియాలోని నీటి వనరులు తదితర వివరాలు తెలుసుకోవడంలో నిమగ్నమయ్యారు ముఖ్యంగా దేశంయొక్క తూర్పు తీరాన్ని క్షుణ్ణంగా పరిశీలించడానికి అనేక ప్రయత్నాలు జరిగాయి 1802-03లో కేప్టెన్ మాద్యూ ఫ్లిండర్స్ ఆస్ట్రేలియా ఖండం చుట్టూ ప్రదక్షిణ చేసి ఆ ఖండాన్ని కనుక్కోవడానికి 200 సంవత్సరాలుగా జరిగిన కృషి విజయవంతంగా ముగించాడు ఆ ఖండానికి ఆస్ట్రేలియా అని నామకరణం చేసిన ఘనత ఫ్లిండర్స్‌దేనని చరిత్రకారుల నమ్మకం అంతవరకు దానిని న్యూహాలండ్ అని న్యూసౌత్ వేల్స్ లేక బోటనీ బే అని పిలిచేవారు

అప్పటి నుండి అనేక యిబ్బందులకు కష్టాలకు లక్ష్యపెట్టకుండా అధికారులు సాహస వంతులైన ప్రజలు ఆస్ట్రేలియా నలుమూలల ప్రయాణించి అనేక నివాసయోగ్యమైన ప్రదేశాలను కనుగొన్నారు వాటిలో 1803లో టాస్మేనియాలోని హోబార్ట్‌ను 1824లో క్వీన్స్‌లాండ్ బ్రిస్ బెన్ నదీ ప్రాంతంలోను, 1829లో పశ్చిమ ఆస్ట్రేలియాలోని స్వాన్ నది ప్రాంతంలోను నివాసస్థానాలు ఏర్పాటు చేసుకున్నారు 1835లో పోర్ట్‌ఫిలిప్ బే వద్ద మెల్బోర్న్ నగర స్థాపన, 1836లో దక్షిణ ఆస్ట్రేలియాలో సెయింట్ విన్సెంట్ గల్ఫ్ తీరంలో అడిలెయిడ్ నగర స్థాపన జరిగాయి అటు తరువాత ఈ స్థావరాలను కేంద్రాలుగా చేసుకుని ఆ ఖండంలోని అనేక బాగాలను తెలుసుకోవడం జరిగింది సిడ్నీ ముఖ్యపట్టణంగా బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులుగా న్యూసౌత్ వేల్స్ రాష్ట్రాన్ని పాలించిన గవర్నర్లు అడిగిన వారికి లేదనకుండా భూమి ఉచితంగా ఇచ్చారు శిక్షాకాలం పూర్తిచేసిన

నేరస్తులు నావికులు మిలిటరీ అధికారులు ఒకరేవిటి ఖైదీలచేత పనిచేయించుకుని వారికి తిండి బట్ట పెట్టి పోషించ గలవారికందరికీ భూదానం చేసారు 1820 సంవత్సరంలో 3000 మంది ఉన్న జనాభా వలస వచ్చిన వారితోను సహజ జనాభా అభివృద్ధి వల్ల 1850 నాటికి 4,05,000 అయింది ఐచ్ఛికంగా ఆస్ట్రేలియాకు వలస వచ్చేవారి సంఖ్య పెరగడం వల్ల న్యూసౌత్ వేల్స్‌లోను తదితర కాలనీలలోను బ్రిటిష్ నేరస్తుల దిగుమతికి వ్యతిరేకత రావడంతో1840 ఆఖరికి బ్రిటన్‌నుండి ఖైదీలను ఆస్ట్రేలియా పంపడం ఆపివేసాడు అప్పటికి ఒక లక్షమంది నేరస్తుల్ని ఆస్ట్రేలియా పంపడం జరిగింది

ఇక1851లో న్యూసౌత్ వేల్స్ పశ్చిమ భాగాన బాథర్ స్టి వద్ద ఎడ్వర్డు హార్ గ్రేవ్ బంగారం కనుక్కోవడం విక్టోరియా రాష్ట్రంలో బల్లారట్, బెండిగో వద్ద బంగారు గనులు త్రవ్వడంతో ప్రపంచం నలుమూలలనుంచి ప్రజలు తండోప తండాలుగా వచ్చి పడ్డారు వారి పుణ్యమా అంటూ ఆస్ట్రేలియా జనాభా1880 నాటికి 1,140,000 కి పెరిగింది మరొక పదేళ్ళలో జనాభా మరొక 5లక్షలు పెరిగింది మళ్ళా1892లో పశ్చిమ ఆస్ట్రేలియాలో కాల్గూర్లి వద్ద బంగారు గనులు బైటపడ్డాయి ఈ స్వర్ణగనులలో బంగారం ముద్దలుగా దొరికేదని చెప్పుకుంటూరు ప్రారంభ దశలోనే బంగారం దొరకడం ఆస్ట్రేలియా అభివృద్ధికి ఇతోధికంగా తోడ్పడినదనడం నిర్వివాదం బంగారం కోసం వచ్చిన వారిలో అనేక వృత్తులలో అనుభవజ్ఞులు ఉండంతో ఆ దేశంలో నూతనోత్సాహం, శక్తి ఆలోచనా సరళిని ప్రవేశపెట్టూరు రోడ్డు, రైలుమార్గాల నిర్మాణం ప్రారంభమైంది వ్యాపారం విస్తరించడంతో రహదారులు తదితర సదుపాయాలు అభివృద్ధి చెందాయి విద్యావిధానానికి పునాదులు వేసారు

ఆస్ట్రేలియా ద్వీపఖండం అని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు దానికి పశ్చిమాన హిందూ మహాసముద్రం, తూర్పున పసిఫిక్ మహాసముద్రం ఉన్నాయి ఆస్ట్రేలియా విస్తీర్ణం 2,967,909 చదరపు మైళ్ళు దానికి 12,446 మైళ్ళ సముద్రతీరం ఉంది గ్రేట్ బ్రిటన్, ఐర్లండ్ కంటే ఆస్ట్రేలియా25 రెట్లు పెద్దది ఇండియా పాకిస్తాన్ కలసిన విస్తీర్ణం కంటే రెట్టింపు ఉంటుంది జూన్ 30, 1965 నాటికి ఆస్ట్రేలియా జనాబా 11,359,510 ఆదేశ జనాభా10 మిలియన్లనుంచి 11మిలియన్లు దాటడానికి 41ఏళ్ళు పట్టింది ఆదేశంలో వర్షాభావం వల్ల అనేక ప్రాంతాలలో జనావాసాలు లేవు చదరపు మైలుకి నలుగురు కూడా ఉండరు 1945లో ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ఆస్ట్రేలియా లోనికి జనాబాను దిగుమతి చేసుకోవడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి ఆ పథకం ప్రకారం దేశజనాభాను దిగుమతి

చేసుకోవడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి ఆ పథకం ప్రకారం దేశజనాభాను 20 మిలియన్లు చేయాలనే సంకల్పంతో ఆస్ట్రేలియా ప్రభుత్వం ప్రయాణం ఖర్చులు భరించి బ్రిటన్‌నుంచి ప్రజలను దిగుమతి చేసుకోవడం ప్రారంభించింది జూలై 1947 నుంచి జూన్ 1965వరకు బ్రిటిషు ప్రభుత్వం చేసుకున్న ఒప్పందం ప్రకారం ఉచిత ప్రయాణఖర్చుల పథకం క్రింద 594,956 మంది ఆస్ట్రేలియాకు వచ్చారు 290,000మంది యూరోపియన్ కాందిశీకులు కూడా ఆస్ట్రేలియా చేరారు మిగిలిన యూరోపియన్ దేశాలతో కూడా ఉచిత ప్రయాణఖర్చుల పథకం ప్రకారం జనాబాను దిగుమతి చేసుకునే ఒప్పందాలు చేసుకుంది

దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం యొక్క జాత్యహంకారం, తెల్లజాతుల ఆధిక్యతను, అధికారాన్ని ప్రోత్సహించే విధానాలు ప్రపంచ వ్యాప్తంగా విమర్శకు గురి అవుతన్నమాట మనకందరికీ తెలిసిన విషయమే కాని ఆస్ట్రేలియాకు కూడా తమ దేశంలో తెల్ల జాతుల ప్రాబల్యం ఉండాలనే ఆకాంక్ష ఉన్నట్టు మనకు తెలియదు ఆ దేశ జనాభాను చూస్తే దానిలోని నిజం తెలిసిపోతుంది తమదేశం యొక్క జనాభా ఎలా ఉండాలో నిర్ణయం చేసే అధికారం ప్రతిదేశానికి ఉన్నమాట వాస్తవం ఎంత చిన్న దేశమైనా ఎంత పెద్దదేశమైనా తమ దేశంలో శాశ్వత నివాసం ఏర్పరచుకోవడానికి వస్తానన్న ప్రతివారిని రానివ్వరు ఆ విధంగానే ఆస్ట్రేలియా కూడా తమ దేశజనాభా ఎలా ఉండాలో నిర్ణయించుకున్నది ప్రారంభంలో తెల్ల ఆస్ట్రేలియా విధానం కొట్టి వచ్చినట్టు కనుపించేది తమ దేశంలోనికి శాశ్వత నివాసం కోసం వచ్చేవారు ఆర్థికంగాను సాంఘికంగాను తమ దేశప్రజలతో కలసి పోవడానికి సమర్థులై ఉండాలనే ఉద్దేశంతో ఆస్ట్రేలియాకు వలస వచ్చేవారిలో యూరోపియన్ జాతులకు ప్రాముఖ్యతనిచ్చారు అంతమాత్రాన యూరోపియన్ దేశాల బైట నుంచి ఆస్ట్రేలియాలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకోవడానికి వచ్చేవారిని పూర్తిగా నిరోధించరు అటువంటివారి విషయంలో తుదినిర్ణయం మంత్రిదే!

ఆస్ట్రేలియాలో 1965 నాటికి 37,500 యూరోపియనేతర జాతులవారు ఉన్నారు వారిలో ఆ దేశంలోని వివిధ కళాశాలలు, విశ్వవిద్యాలయాలలో చదువుకునే విద్యార్థులు12,500 అప్పటికి ఆదేశంలో ఉన్న యూరోపియనేతర జాతులకు చెందిన ఆస్ట్రేలియా పౌరులు15,500 వీరెక్కడనుంచి వచ్చారని ఆశ్చర్య పోకండి తెల్లజాతుల వారైతే ఏదేశం నుంచి వచ్చినా ఆస్ట్రేలియా వారిని ఆహ్వానిస్తుంది తెల్ల జాతులకు చెందని వారి విషయంలో మంత్రి గారిది తుదినిర్ణయం వారి దేశానికి ఏరంగంలో నైనా సహాయపడతారనే నమ్మకం ఉంటే ఏదేశం వారినైనా వారు ఆహ్వానించి

కొద్దికాలం తరువాత పౌరసత్వం ఇస్తారు భారతదేశం నుంచి వెళ్ళి
ప్రొఫెసర్లు, హాకీ ఆటగాళ్ళ రంగు వారిని బాధించదు అంతేకాదు, మిగిలి
అన్ని యూరోపియను దేశాలలో వలెనే ఆస్ట్రేలియాలో కూడా ఆ దేశ
అమ్మాయిని వివాహం చేసుకున్న దేశస్థుడైనా ఆ దేశపౌరుడు కావచ్చు
దేశంలో పుట్టిన పసిపిల్లల తల్లిదండ్రులు తమ పిల్లల పై ఆధారప
కుటుంబసభ్యులుగా ఆ దేశంలో ఉండవచ్చు ఆస్ట్రేలియన్ ప్రభుత్వం తమ
తెల్ల ఆస్ట్రేలియా విధానాన్ని చాలా జాగ్రత్తగా, గోప్యంగా నిర్వహిస్తుంది

సామాన్యంగా ఇంగ్లండు ఆస్ట్రేలియా దేశాల మధ్య తిరిగే ప్యాసింజ
ఓడలు సింగపూర్‌లో ఆగడం ఆచారం రెండవ ప్రపంచయుద్ధంలో జపాను
మిత్ర రాజ్యాల పోరాటంలో సింగపూర్‌లో బ్రిటిష్ నౌకాస్థావరం ప్రముఖపాత్ర
వహించిన విషయం అందరికి తెలిసినదే కాని భారతదేశానికి స్వాతంత్ర్య
రావడంతో బ్రిటిష్ సామ్రాజ్యం ఆసియా ఖండములో కుంచించుకు పోయింది
మలేషియాకు, సింగపూర్‌కి స్వాతంత్ర్యం ఇచ్చి బ్రిటిషువారు సింగపూర్‌ల
తమ నౌకా స్థావరాన్ని మూసివేసారు నేను ప్రయాణం చేసే ఓడ నిండా
ఆస్ట్రేలియా వెళ్ళే ప్రయాణికులే కావడంవల్ల అది సింగపూర్‌లో ఆగలేదు
ప్రయాణము హాయిగా సాగిపోతోంది సిడ్నీలో ఉంటున్న ఆస్ట్రేలియా
అబ్బాయిని వివాహం చేసుకోవడానికి వెళుతున్న అమ్మాయి నేను భోజనం
చేసే టేబుల్ పార్టనర్ ఆమె సాధారణంగా మితభాషి డ్యాన్సు కార్యక్రమానికి
వచ్చినా జిన్ త్రాగుతూ పుస్తకం చదువుకుంటూ కూర్చునేది నాకు
బాల్‌రూమ్ డాన్సింగ్ ఇష్టం కావడంవల్ల నాప్రోత్సాహంతో డాన్సుచేసేది ఆ
కార్యక్రమం అయిన తరువాత ఓడలో డెక్‌మీద ఒకచోట గంటల తరబడి
కబుర్లు చెప్పుకుంటూ కూర్చునే వాళ్ళం ఆమె బాగా చదువుకున్నది దానికి
తోడు కొద్దిగా వేదాంత ధోరణి మాచర్చలకు అంతు ఉండేది కాదు మంచి
మిత్రురాలు ఓడ ప్రయాణాలలో స్నేహాలు రైలుప్రయాణంలో స్నేహాల లాగే
ప్రయాణం పూర్తికాగానే ఎవరిదారి వారిది కాని ఆమెతో స్నేహం అలా
తెగతెంపులు కాలేదు

ఓడలో నాకేబిన్‌కి బాత్‌రూమ్ కలిసి ఉండటం వల్ల హాయిగా హోటల్
గదిలా ఉండేది దుప్పట్లు దగ్గరనుంచి అన్నీ ఓడ కంపెనీవే మన అవసరాలు
తీర్చడానికి పనివారు బోలెడు మంది డైనింగ్ టేబుల్ వద్ద సీటు ఓడ అధికారులు
నిర్ణయిస్తారు నిర్ణీత సమయాలకు బ్రేక్ ఫాస్ట్ లంచి, డిన్నర్‌కి వెళ్ళాలి ఒక
బాచ్ ప్రయాణికుడు మరొక బాచ్ భోజన సమయంలో వెళితే సీటు ఉండదు
ఇక భోజనమంటారా? అంతా ఇంగ్లీషు భోజనం మొదటిసారి నేను ఇంగ్లండు
వెళ్ళేటప్పుడు ఓడలో పడ్డ అవస్థలు లేవు ఇంగ్లీషువారి భోజనంలో మంచి

ష్టలు నిర్ణయించి దాని రుచిని హర్షించగల స్థితికి ఎదిగాను అప్పటికి క్ష్యలతోను ఫోర్కులతోను భోజనం చేయడం కూసువిద్య అయింది ఇంగ్లీషు జనం రుచిపచి లేకుండా అతి సామాన్యంగా ఉంటుందని ప్రతీతి ఆ గాటలో వాస్తవం లేకపోలేదు ముఖ్యంగా భారతీయులు అందునా ఆంధ్రులకు భోజనం అసలు సహించదు అయితే ఆస్ట్రేలియా భోజనం ఎలా ంటుందో అంతవరకు రుచి చూడలేదు ఆ మాటే ఓడ కేప్టెన్‌తో అన్నాను. నవ్వుతూ రుచి అడగడం దేనికి, ఆస్ట్రేలియా వెళుతున్నావుగా! అని మత్కరించాడు ఆయన ఇంగ్లీషువాడు నేను లండను యూనివర్సిటీలో హెచ్ డి డిగ్రీ తీసుకున్నానని తెలుసుకున్న తరువాత కేప్టెన్ గారి టేబిల్ వద్ద భోజనం చేయడానికి నాకు ఆహ్వానాలు హెచ్చుగా వచ్చేవి కేప్టెన్‌తో కూర్చుని భోజనం చేయడం లోని ప్రత్యేకత వేరే చెప్పాలా! ఒక ప్రక్క గౌరవం, మరో పక్క వడ్డించేవాడు మనవాడు

ఓడ పెర్త్ రేవుకి చేరినదన్నారు ఆస్ట్రేలియా వెళ్ళేవారికి మొట్టమొదట కగితే ఆస్ట్రేలియన్ పట్టణం పెర్త్ తరువాత అడిలెయిడ్, దక్షిణ ఆస్ట్రేలియా రాష్ట్ర ముఖ్యపట్టణం అక్కడనుంచి విక్టోరియా రాష్ట్ర ముఖ్యపట్టణమైన మెల్బోరన్ రేవు చేరింది ఓడ ప్రపంచ నాగరికత అంతా మహానదుల ననుసరించి వ్యాప్తి చెందినట్టు చరిత్ర చెబుతోంది ఆస్ట్రేలియా అభివృద్ధి అంతా సముద్రతీరాన్ని అనుసరించి ఉంటుంది ఆ దేశంలోని ముఖ్యరాష్ట్రాల ముఖ్య పట్టణాలైన సిడ్నీ, మెల్బోరన్, ఎడిలెయిడ్, పెర్తు, బ్రిస్ బెన్, డార్విన్, హోబార్టు పట్టణాలన్నీ సముద్రతీరంలో ఉండడం గమనార్హం

ఆస్ట్రేలియా ఖండంలో అడుగుపెట్టాను మెల్బోరన్‌లో ఓడదిగి నా ఉద్యోగ స్థాయికి సరిపోయే ఇల్లు దొరికేవరకు హోటల్‌లో మకాం పెట్టాను నాముందు మెల్బోరన్‌లో భారత ప్రభుత్వ టూరిస్టుశాఖ డైరెక్టరుగా పనిచేసిన శ్రీ రత్నాకర్ అప్పటికే ఆస్ట్రేలియా వదలిపెట్టాడు 1956 లో మెల్బోరన్‌లో జరిగిన ఒలింపిక్స్ క్రీడల అనంతరం భారత ప్రభుత్వం ఆస్ట్రేలియానుంచి ఇంగ్లాండు వెళ్ళే ప్రయాణికులలో కొంతమందినైనా భారతదేశంలో వినోద పర్యాటకులుగా కొద్దిరోజులు గడిపేటట్టు చేయాలనే సంకల్పంతో అక్కడ ఒక చిన్న ఆఫీసు తెరిచారు ఒక అసిస్టెంటు డైరెక్టరు, ఒక అసిస్టెంటును భారతదేశం నుంచి పంపి మిగిలిన ఉద్యోగాలకు ఆ దేశస్థులనే నియమించారు శ్రీ భూపేంద్రసింగ్ భారతదేశంనుంచి పంపిన ఇన్‌ఫర్‌మేషన్ అసిస్టెంట్ స్టెనోగ్రాఫర్, అక్కౌంటెంటు, మెసెంజర్, మరొక అమ్మాయి ఆస్ట్రేలియన్లు మెల్బోరన్‌లో టూరిస్టు ఆఫీసుస్థాయి 1960లో పెంచి నన్ను డైరెక్టరుగా నియమించారు మెల్బోరన్‌లో నేను ఒక్కణ్ణే భారతప్రభుత్వోద్యోగిని భారత

హైకమిషను ఆఫీసు కాన్‌బెరాలో ఉంటుంది భారతట్రేడ్ కమీషనర్ ఆఫీసు సిడ్నీలో ఉంటుంది నా ఉద్యోగస్థాయికి తగిన మకాం దొరకడం అంత సులభం అనిపించలేదు విదేశాలలో ఉద్యోగాలుచేసే భారతీయులకు వారి ఉద్యోగస్థాయి విదేశాలలో యిచ్చే అలవెన్సులు, వారి మకాం ఎంత అద్దెలో ఉండాలో ఆ వివరాలన్నీ హైకమిషన్ ఆఫీసులో సిద్ధంగా ఉంటాయి వారుకూడా అటువంటి వివరాలకు బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒరవడిగా తీసుకుంటారు

రత్నాకర్ కుటుంబంతో ఉన్నందున అతడు ఉండే ఇల్లు నాకు పనికిరాదు నేను కుటుంబాన్ని తీసుకువెళ్ళలేదు అందుమూలంగా నాకు వచ్చే అలవెన్సులు తగ్గుతాయి అయితే ప్రభుత్వం ఉచిత మకాం ఇవ్వాలి కాబట్టి సెయింట్ కిల్డా ప్రాంతములో మూడంతస్తుల ఫ్లాట్‌లో మధ్యభాగం అద్దెకు తీసుకున్నాను దానిలో సర్వసదుపాయాలు ఉన్నాయి తలగడలు దుప్పట్లు తప్ప మిగిలిన అన్ని పరికరాలు ప్రభుత్వం ఇస్తుంది అధికార ప్రభుత్వ ముద్రవేసిన ప్లేట్లు, గ్లాసులు, వంట సామాగ్రి ఇస్తుంది పూర్తిగా ఫర్నిష్ చేసిన మకాం దొరికింది అప్పటికి మెల్బోర్న్ పట్టణంలో ఎలక్ట్రిక్ ట్రాములు ఉండేవి ఆఫీసు పట్టణం నడిబొడ్డులో మొదటి అంతస్తులోఉంది సాదారణంగా టూరిస్టు ఆపీసు రోడ్డులెవెల్‌లో ఉండాలని సిద్ధాంతం రానురాను ఆ అభిప్రాయం మారుతోంది నేను మద్రాసునుంచి మెల్బోర్న్ వచ్చేముందు నా కారు అమ్మివేసాను ఆస్ట్రేలియాలో అతి సామాన్యమైన వాహనం కారు మా ఆఫీసు తుడవడానికి వచ్చేవ్యక్తి కారులో వచ్చేవాడు ఆఫీసర్ల వద్ద, పెద్ద వ్యాపారస్తులవద్ద డ్రైవర్లుగా పనిచేసేవారు తమ కార్లలో డ్యూటీకి వచ్చి పని అయిపోయిన తరువాత తమ కార్లలో ఇళ్ళకు వెళతారు మా ఆఫీసులో మెసంజరుగా పనిచేసే డేవిడ్ ఒక రోజు ఆఫీసుకి తన కారులో వచ్చాడు స్వంతకారు ఉంటే కాని ఆడపిల్లలు తనతో రావడం లేనందున కారు కొన్నానన్నాడు

ఆస్ట్రేలియాలో కారు లేకుండా జరగదనిపించింది మెర్సిడిస్ బెన్జ్ కొనాలని సరదా ఉండేది అయితే బారత ప్రభుత్వ టూరిస్టు డైరెక్టరుకి డిప్లొమాటిక్ సదుపాయాలకు అర్హత ఉన్నదా! అని మీమాంస వచ్చింది ఆ కంపెనీ వారికి కాని ఫియట్ కంపెనీవారు వారి కారు డిప్లొమాటిక్ ధరకు ఇవ్వడానికి సంసిద్ధత వ్యక్తం చేసారు ఫియట్ -23 ఆరు సిలెండర్లు 23 హార్స్ పవర్ కారు పదకొండువేల రూపాయలకు అప్పుడే ఇటలీనుంచి దిగుమతి చేసినది ఇచ్చారు విక్టోరియా ప్రభుత్వం టూరిస్టు డైరెక్టరుకి కూడా డిప్లొమాటిక్ నెంబరు ప్లేటు ఇచ్చారు దానిపుణ్యమా అంటూ పెట్రోలు సగం

ధరకే పోసేవారు. కారు పార్కు చేయడానికి పడవలసిన అవస్థలనుంచి విముక్తి దొరికింది. రాయల్ ఆటోమొబైల్ క్లబ్బులో సభ్యత్వం కోసం నానా అవస్థలు పడవలసి వచ్చింది. ఒక ఏడాది ఆగాలన్నాడు కార్యదర్శి. నాముందు ఉన్న ఆఫీసరుకి సభ్యత్వం ఉంది కాబట్టి అది నాకు బదిలీ చేయమన్నాను. చివరకు ఆ క్లబ్‌లో సభ్యత్వం సాధించాను. ఆ క్లబ్‌కి మెల్బోరన్ క్లబ్ అంత ప్రాముఖ్యత లేకపోయినా మా ఆఫీసుకి దగ్గరలో ఉండడం, నగరంలో ఉద్యోగాలు చేసే పెద్దవారిని కలుసుకోవడానికి అవకాశాలు ఉండడం వల్ల నాకు హాయిగా ఉండేది. ఒకసారి భారత హైకమిషనర్ శ్రీ మసందుకి మెల్బోరన్ క్లబ్‌లో పదిమంది ఆస్ట్రేలియన్ ప్రముఖులకు లంచ్ ఇవ్వాలని సంకల్పం కల్గింది. ఆ పేర్లు నాకు పంపి వారంతా ఆ క్లబ్ సభ్యులు అవునో కాదో తెలుసుకోమన్నారు. ఆస్ట్రేలియన్ గవర్నరు జనరల్ లార్డు 'కేసి' తప్ప ఆ లిస్టులోని వారెవరూ ఆ క్లబ్ సభ్యులు కాదని తేలింది. మన హైకమిషనర్ కూడా ఆ క్లబ్ గౌరవసభ్యుడు కాబట్టి ఆ క్లబ్ లో పార్టీలు ఇవ్వడానికి వీలు లేదన్నారు. అది మెల్బోరన్ క్లబ్ స్థాయి.

ఇక రాయల్ ఆటోమొబైల్ క్లబ్‌లో పరిస్థితి వేరు. సామాన్యంగా అన్ని దేశాలలోను ప్రయివేటు క్లబ్బులలో అతిథులను ఖర్చుపెట్టనివ్వరు. అతిథియొక్క యావత్తు ఖర్చు అతణ్ని ఆహ్వానించిన సభ్యునిదే. కాని మా క్లబ్‌లో కొద్దిగా మార్పు ఉండేది. అతిథిని తీసుకువెళితే బార్ దగ్గర మొదటి డ్రింకు ఖర్చు సభ్యుడు పెట్టుకున్న తరువాత అతిథి కూడా ఖర్చుపెట్టవచ్చు. ఆ క్లబ్ బార్ వద్ద విచిత్రమైన ఆచారం ఉండేది. అక్కడ మద్యం సేవించే మిత్రులతో కలిస్తే ఆ గ్రూపులో ఎంతమంది ఉంటే అన్ని రౌండ్స్ త్రాగవలసినదే. మొత్తం మెల్బోరన్ లో ఉన్న బ్యాంకర్లందరు లంచ్‌కి అక్కడికే వచ్చేవారు. అంతా బీర్ త్రాగడంలో సిద్ధులే. నిజానికి జర్మన్లు, ఆస్ట్రేలియన్ల మధ్య బీర్ త్రాగడంలో నిజమైన పోటీ ఉండి ఉండాలి. కాని నేనెరుగున్నంత వరకు ఆస్ట్రేలియన్లు బీర్ త్రాగడంలో సిద్ధహస్తులు. వారు అధికారికంగా ఇచ్చిన డిన్నర్‌కి వెళ్ళి ఆకలి వేయడానికి ఒకటో అరో విస్కీ తీసుకుని తెల్లవైన్, ఎర్రవైన్, షాంపెన్, లెక్యూర్, బ్రాందీతో భోజనం అయిన తరువాత బార్‌కి వెళ్ళి బీరుత్రాగితేకాని సంతృప్తి పడని ఆస్ట్రేలియన్లు కోకొల్లలు. అది వారి సంస్కృతి.

ఆస్ట్రేలియన్ల బీరు ప్రియత్వాన్ని తెలుసుకోవడానికి వారి జీవన విధానాన్ని అర్థం చేసుకోవాలి. కాని ఏ విధమైన అవస్థ పడకుండా మెల్బోరన్ మహాపట్టణంలో ప్రతి రోజు సాయంకాలం ఐదుగంటలనుంచి ఆరుగంటలవరకు జరిగే "బీరు మహోత్సవం" చూస్తే చాలు విషయం అర్థం

కావడానికి ఆఫీసులన్నీ సాయంకాలం ఐదుగంటలకే మూసివేస్తారు ఐదుగంటల ఐదు నిమిషాలకు ఏ ఆఫీసులోను ఎవరు ఉండరు ఆఫీసరు కాని మెసెంజరు కాని ఐదు గంటల తరువాత ఆఫీసులో ఉండకపోవడం భారతదేశంనుంచి వెళ్ళిన నాకు క్రొత్తగా, ఆశ్చర్యంగా అనిపించేది ఢిల్లీలో ఆఫీసు టైములో సమావేశాలు చర్చలు, సంప్రదింపులు చేసి ఆఫీసు మూసివేసిన తరువాత ఆఫీసుపని చూచుకోవడానికి అలవాటుపడ్డవారికి మెల్బోర్న్‌లో ఏ ఆఫీసులోను ఐదుగంటల తరువాత ఎవరూ ఉండక పోవడం పరమ ఆశ్చర్యం అయితే అలా ఖాళీ అయిన ఆఫీసులోని ఆఫీసర్లు, సిబ్బంది వారంతా ఎక్కడకి వెళతారని మీరు ఆశ్చర్య పడుతున్నారా? యావన్మంది గమ్యం ఒకటే దగ్గరలో ఉన్న "పబ్"కే అందరి ప్రయాణం చిత్రం ఏమిటంటే సాయంకాలం ఆరుగంటల తరువాత మెల్బోర్న్ మహాపట్టణంలో మద్యం అమ్మడానికి వీలు ఉండేది కాదు ఆ తరువాత క్లబ్బులకో, స్నేహితుల ఇళ్ళకో లేక తమ ఇంటికో చేరవలసినదే!

ఆఫీసులో పని పూర్తి చేసుకుని దగ్గరలో ఉన్న పబ్‌కి వెళ్లి స్నేహితులతో బీర్ త్రాగటం మెల్బోర్న్ లో ఉద్యోగులకు అలవాటు అయితే ఆఫీసు అవగానే ఇళ్ళకు చేరి భార్యతో కలిసి లేక ఇంటివద్ద ఒంటరిగా బీర్ త్రాగడం చేయవచ్చు కదా అని మహిళలు భర్తలకు నచ్చ చెప్పడానికి ప్రయత్నించారు సాయంకాలం ఐదుగంటలు ఆరు మధ్య గ్లాసుమీద గ్లాసు గొంతులో పోసుకోవమే కాని బీరు త్రాగిన ఆనందం ఉండదని ఒక వాదం ఉండేది అంతే కాదు ఆరుగంటలు కావడానికి పదినిమిషాల ముందు ఐదు నిమిషాలముంద అన్ని పబ్‌లలోను, గంటలు మ్రోగుతాయి అంటే పది నిమిషాలలో మీర త్రాగవలసిన బీరు గుటకాయ స్వాహా చేయాలి పది నిమిషాల ముందు ఆర్డర చేయాలి గంటమ్రోగిన తరువాత ఇక అమ్మరు ఆ సమయంలో బైటకు వచ్చే వారిని చూస్తే వారంతా తమ కార్లు డ్రైవ్ చేసుకుంటూ ఇళ్ళకు ఎలా చేరతారా అనిపిస్తుంది వారంతా తమ తమ కార్లలో ఇళ్ళకు చేరడం అంత సులభంకాదు అనేక ఆక్సిడెంట్లు అందుకే ఆఫీసులు మూసివేసిన ఒక గంటలో పబ్‌లు మూసివేయడం అమానుషమైన అలవాటని బీర్ ప్రియులంతా ప్రభుత్వానికి అర్జీలు పెట్టుకునేవారు అదమం రాత్రి 10గంటల వరకైన పబ్‌లు తెరిచి ఉంచాలని పురుష పుంగవుల కోరిక విక్టోరియా ప్రభుత్వం తమమీద వత్తిడి ఎక్కువైనప్పుడల్లా రిఫరెండం నిర్వహించేది పట్టణంలో బార్లు ఆరు గంటలకే మూసివేయాలా? రాత్రి 10 గంటల వరకు తెరచి ఉంచాలా? అదీ సమస్య ప్రజాస్వామ్య పద్ధతిలో ఓటింగు జరిగేది స్త్రీలు పురుషులు ఓట్లు వేసే వారు ఫలితం బార్లన్నీ ఆరుగంటలకే మూసివేయాలని నిర్ణయం అది మహిళల నిర్ణయం వారి విజయం

ఈ పద్ధతి విక్టోరియా స్టేట్‌లో మాత్రమే అమలులో ఉండేది మెల్బోరన్ మహానగరం దాటి ఆస్ట్రేలియాలో మరే రాష్ట్రానికి వెళ్ళినా బార్లకు సంబంధించినంత వరకు నియమ నిబంధనలు వేరుగా ఉండేవి ఇక పగటిపూట నియమాలు లేవు కాబట్టి క్రీడలు చూడ్డానికి వెళ్ళేవారంతా ఎవరి డ్రింకులు వారే తీసుకుపోవడం ఆచారం ముఖ్యంగా క్రికెట్ టెస్టు చూడ్డానికి వెళ్ళేవారు తమతో తీసుకువెళ్ళే బీరు డబ్బాలపుణ్యమా అంటూ సిడ్నీ క్రికెట్ గ్రౌండ్‌లో ఒక భాగాన్ని కొండ అంటారు అది బీరు డబ్బాల కొండ ఆస్ట్రేలియాలోని వివిధ రాష్ట్రాలలో బారులు తెరవడం లో రకరకాల రూల్సు ఉండేవి బీరు ప్రియులకు ఏ రూల్సు అడ్డు వచ్చేవి కావు ఆస్ట్రేలియాలో కారు లేనివారు అరుదు అనిచెప్పుకున్నాం కదా! ఇక కారులో ఐస్ బాక్స్ దానిలో బీరు లేకపోతే అతడు ఆస్ట్రేలియనే కాదు అంతే కాదు ఆస్ట్రేలియాలో ఉన్న భారతీయులు కూడా ఆ కోవకు చెందినవారే! నా ఉద్యోగ రూపేణ ఆస్ట్రేలియాలో గడిపిన మూడేళ్ళు మెల్బోరన్‌లోనే ఉండవలసి వచ్చింది అందుమూలంగా మెల్బోరన్ అంటే ప్రత్యేకమైన అభిమానం పెంచుకున్నాను నిజానికి మెల్బోరన్‌లో మంచినీళ్ళు కారు బ్యాటరీలలో పోసుకోవడానికి తగినంత మంచివని ప్రజల నమ్మకం డిస్టిల్డ్ వాటర్‌కి బదులు పైప్‌లో నీళ్ళు బ్యాటరీలో పోసుకోవచ్చునని ప్రతీతి అయితే దక్షిణ ఆస్ట్రేలియాలో అడిలేయిడ్ పట్టణంలో బార్స్ బైట "మీ విస్కీలోకి మెల్బోరన్ మంచి నీళ్ళు ఇవ్వబడును" అని బోర్డులు కడతారు అందుమూలంగా అటువంటి మంచినీళ్ళతో తయారు చేయబడిన బీర్ బ్రహ్మాండంగా ఉంటుందని వేరే చెప్పాలా! అడిలెయిడ్‌లో నీరు మడ్డిగా ఉంటుంది అక్కడ తయారు చేయబడిన బీర్‌కి కూడా అదే లక్షణం అందువల్లనే అక్కడ బీర్‌కి ప్రతిష్టలేదు కాని దక్షిణ ఆస్ట్రేలియాలో నున్న బరోసా వ్యాలీలో తయారయ్యే వైన్స్ ఫ్రెంచివారు తయారుచేసే ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన వైన్స్‌తో పోటీ పడతాయని ఆస్ట్రేలియన్లు గర్వంగా చెప్పుకుంటారు బరోసా వ్యాలీ కథా కమామిషు మరొకసారి

ఆస్ట్రేలియన్ రహదారులమీద కారు డ్రైవ్ చేయడంలో ఆనందం అనుభవైకవేద్యం అయితే జనవరి ఒకటవ తేదీన ఆస్ట్రేలియాలోని ఏ రహదారిమీద ప్రయాణం చేసినా మనకు కనిపించే దృశ్యాలు హృదయ విదారకంగా ఉంటాయి క్రొత్త సంవత్సర ఉత్సవాలలో పాల్గొని గృహోన్ముఖులైన అనేకమంది యువకుల మృతదేహాలు దారిపొడవునా కనిపిస్తాయి అనేక కార్లు ధ్వంసమై రోడ్డు ప్రక్కన కనిపిస్తాయి అయి స్పీడుగా కారు నడపడం సహజం నా ఫియట్ కారు స్పీడో మీటర్లో 120 క స్పీడు వెళ్ళుతుందని చూపించేది మిత్రుడు వెంకటేష్ నా కారు ఇన్సూర్ చే

కంపెనీ అధికారి స్పీడుగా కారునడపడం అతడికి సరదా ఒకసారి మే:
పిక్‌నిక్‌కి వెళ్ళినప్పుడు వెంకటేష్ నా కారులో ప్రయాణం చేస్తున్నాడు నే
90 మైళ్ళస్పీడులో డ్రైవ్ చేస్తున్నాను నీ కారు స్పీడోమీటరు 120 మై
చూపెడుతోంది కాబట్టి ఇంకాస్పీడుగా నడపమన్నాడు రహదారులు చక్క
విశాలంగా ఉన్నా మోటారు కార్లు తప్ప మరే యితర వాహనాల బెး
లేకపోయినా ఆ స్పీడులో చిన్న రాయి చక్రం క్రింద పడ్డా కారుతోపా
మనంకూడా తుక్కు తుక్కు అవుతామని గుర్తుచేసాను

మోటారు కార్ల గురించి మాట వచ్చింది కాబట్టి ఆస్ట్రేలియాలో
విక్టోరియా స్టేట్‌లో కారుప్రమాదాలపై పోలీసు దృక్పథం చెప్పుకోవా
సామాన్యంగా ప్రమాదాలు జరిగితే పోలీసులు పట్టించుకోరు ఆ ప్రమాదం
ప్రాణ నష్టంకాని గాయాలు తగలడం కాని జరిగితే పోలీసులు వస్తారు మిగిక
ప్రమాదాలన్నింటిలో ఇన్సూరెన్సు చేసిన కంపెనీ, పేరు నెంఒ
మార్చుకుంటే చాలు అయినా ఖర్చు మనకారు బాగుచేసిన కంపెనీ
ఇన్సూరెన్సు కంపెనీవద్ద వసూలు చేస్తారు ఒకసారి చిత్రమైన ప్రమాదం
చిక్కుకున్నాను ఆ నాడు భారతదేశానికి మెల్బోరన్‌లోని సంస్థ పాలప
బహూకరిస్తోంది భారతప్రభుత్వం ప్రతినిధిగా నేను ఆ బహుమ
స్వీకరించాలి నా కారులో బయలుదేరాను నాముందు చక్కటి చిన్నకారు
మహిళ డ్రైవ్ చేస్తోంది ఇంతలో ఒకచోట ఎర్రదీపం చూచి ఆమెకారు ఆపిం
నేను కూడా ఆమెవెనుక ఆపాను అంతలో ఒక పాతకారు నా వెనుక వచ్చి
కారుని గుద్దింది నా కారు వెళ్ళి నా ముందు ఆగి ఉన్న కారుని గుద్దింది
వెనుక వచ్చిన కారు రొట్టెల కంపెనీ వారిది దానికి ఇన్సురెన్సు లేదని తెలిం
నా ముందు ఉన్న కారుకి నా కారుకి కూడా నష్టం కలిగింది ఆ అమ్మా
సిడ్నీ నగరవాసి ప్రమాదం చేసినందుకు పోలీసు రిపోర్టు ఇవ్వాలని ప
పట్టింది నాకు అర్జెంటు కార్యక్రమం ఉన్నందున నా ఇన్సూరెన్సు కం
అడ్రసు తీసుకు వెళ్ళమన్నాను ఆమె అంగీకరించలేదు దగ్గరలో ఉ
టెలిఫోనువద్దకు వెళ్ళి పోలీసులకు టెలిఫోను చేసింది ప్రమాదం
ప్రాణనష్టం లేకపోతే ఎవరికీ గాయాలు తగలకపోతే తాము రానవసరం లే
పోలీసులు చెప్పారు ఆ అందాల భరిణకు నా మీద వచ్చిన కోపం విక్టోరి
పోలీసుల మీదికి మళ్ళింది వాళ్ళని నానాతిట్లుతిట్టి నా ఇన్సూరెన్సు కం
వివరాలు తీసుకుని వెళ్ళిపోయింది నేను కార్యక్రమానికి కొంచెం ఆలస్యం
చేరగలిగాను

ఆస్ట్రేలియా పేరు వినగానే మనకు గుర్తు వచ్చేది, ఆ దేశస్థుల క్రి
ప్రావీణ్యం ఆస్ట్రేలియన్లు మంచిక్రికెట్ ఆటగాళ్ళు నేను అడిలెయి

వెళ్ళినప్పుడు ఆస్ట్రేలియాలోనే కాక క్రికెట్ ఆడే అన్ని దేశాలలోను ప్రఖ్యాతి చెందిన సర్ డాన్ బ్రాడ్‌మన్ ని చూడ్డానికి ప్రయత్నించాను కాని ఆసమయంలో ఆయన ఇంగ్లండు వెళ్ళినందున నా ప్రయత్నం ఫలించలేదు చిత్రం ఏమిటంటే ప్రపంచ ప్రఖ్యాతి కెక్కిన క్రికెట్ ఆటగాళ్ళు ఉన్న దేశంలో క్రికెట్ క్లబ్ గ్రౌండ్ ఇంగ్లండులోని వెంబ్లీ గ్రౌండుతో పోటీపడుతుంది సులభంగా దానిలో లక్షమంది ప్రేక్షకులు హాయిగా కూర్చోవడానికి ఏర్పాట్లు ఉన్నాయి క్రికెట్ టెస్టులకు ఆ స్టేడియమ్ నిండదు సంవత్సరానికి ఒకసారి లక్షమంది ప్రేక్షకులు ఆ స్టేడియంలో కూర్చుని చూచి ఆనందించే ఆట ఆస్ట్రేలియన్ రూల్సు ఫుట్‌బాల్ క్రికెట్ మాత్రం కాదు

మనదేశంలో ఫుట్‌బాల్ ఆడతాం అదే ప్రపంచమంతటా ఆడతారు కాని ఆస్ట్రేలియాలోని విక్టోరియా స్టేట్‌లో ప్రత్యేక రకమైన ఫుట్‌బాల్ ఆడతారు దానికి మెల్బోర్న్ మక్కా ఆ నగరంలోని వివిధ ప్రదేశాలలో టీములు తయారై ఒకరితో మరొకరు ఆడుకుంటారు సంవత్సరానికి ఒకసారి ఆ నగరంలోని టీములన్నీ లీగ్ పద్ధతిమీద ఆడి చివరకు మెల్బోర్న్ గ్రౌండులో గ్రాండు ఫైనల్స్ ఆడతారు ఆ నాడు మెల్బోర్న్‌లో పండుగలా ఉంటుంది లక్షమందికి పైగా ఫైనల్స్ చూడ్డానికి వెళతారు ఆ ఉద్రేకాలు, ఉత్సాహం వర్ణనాతీతం ఆ ఆట భారతీయులకు రుచి చూపించడానికి ఎయిర్ ఇండియావారు మెల్బోర్న్ నుంచి రెండు టీముల్ని ఢిల్లీ తీసుకువచ్చి ఆ ఆటను చవి చూపించారు ఆస్ట్రేలియాలో ఆట చూసాను కాబట్టి నేను చాలా ఆనందించాను ఆటం ఫుట్‌బాల్ లాగానే ఆడతారు కాని బాల్ ఫుట్‌బాల్ లాగా కాకుండా ( బంతిలా ఉంటుంది బాల్ చేతితో పట్టుకొని పరుగు పెట్టవ ఎదుటిపక్షంలోని ఆటగాణ్ణి అతడిచేతిలో బంతి ఉన్నప్పుడు బలవంత పట్టుకుని ఆపవచ్చు ఆ ఆటలో ఉన్న మజా ఫుట్‌బాల్ ఆటలో లేదనిపిస్తు ఈ ఆటకు విక్టోరియా స్టేట్‌లో ఎక్కువ ప్రాచుర్యం ఉంది మిగి రాష్ట్రాలలో ఫుట్‌బాల్‌కే ప్రాముఖ్యత యూరోపు దేశాలనుంచి వ వచ్చినవారు హెచ్చుగా ఉన్న న్యూసౌత్ వేల్స్ రాష్ట్రంలో ముఖ్యపట్టణ సిడ్నీలో అంతా ఫుట్‌బాల్ మయం

ఎవరి ఇష్టా ఇష్టాలు ఎలాఉన్నా మెల్బోర్న్ క్రికెట్ క్లబ్ గ్రౌండ్‌లో జ ఆస్ట్రేలియన్ రూల్స్ ఫుట్‌బాల్ గ్రాండ్ ఫైనల్స్ చూచి తీరాలి ఆ అనుభ అనిర్వచనీయం లీగ్ పద్ధతిలో ఆట జరిగేటప్పుడు చూడ్డానికి పెద్ద క ఉండదు కాని గ్రాండ్ ఫైనల్స్‌కి టిక్కెట్లు దొరకడం చాలాకష్టం నే మెల్బోర్న్‌లో సెయింటు కిల్డా ప్రాంతంలో ఉండేవాణ్ణి మా టీమ సెయింట్సు అనేవారు అలాగే వివిధ ప్రదేశాలలోని టీములకు చిత్రమైన పే

ఉండేవి ఏ ప్రదేశాల్లో ఉన్నవారు వారి టీముని ప్రోత్సాహించవలసి
అంతేకాదు, వారి టీము ఎవరితో ఆడినా వాళ్ళంతా హెచ్చు సంఖ్యలో వెళ్ళి
టీమ్‌కి ప్రోత్సాహం ఇవ్వాలి ఇది వారానికి ఒకరోజు తప్పనిసరి కార్యక్ర
కాని గ్రాండ్ ఫైనల్స్‌కి టిక్కెట్టు దొరకడం చాలా కష్టం నేను ఆస్ట్రేలియ
ఉన్న మూడు సంవత్సరాలలోను గ్రాండ్ ఫైనల్స్‌కి ఒక్కసారి వెళ్ళగలిగా
మిత్రుడు షేటు పొట్టివాడవడం మూలంగా ఖాళీ బీర్ డబ్బాలమీద నిలబడి
చూసాడు మాకు సెయింట్సు గ్రాండుఫైనల్స్‌లో విజేతలు కాలేదని బా
ఉండేది కాని నేను భారతదేశం తిరిగి వచ్చిన తరువాత ఆ శుభవార్త
సంతోషించాను

ఇక ఆస్ట్రేలియా అనుభవాలలో మరపురానిది మెల్బోరన్ కప్
గుర్రపు పందెం ఆ నాడు విక్టోరియా స్టేట్‌లో సెలవు అయితే భారత ప్రభ
టూరిస్టు ఆఫీసుకి కూడా సెలవు ఇవ్వడంలోని ఔచిత్యం ఢిల్లీ
అధికారులకు అర్ధం అయ్యేదికాదు గుర్రపు పందాలకు ప్రభుత్వ ఆ
మూసివేయడం ఏమిటని ప్రశ్నించేవారు నేను పంపిన సంజాయిషీ వ
అర్ధం అయినా కాకపోయినా మా ఆఫీసుకి కూడా సెలవు నగరవాస
చుట్టుపక్కలనుంచి వచ్చిన వారు అంతా రేసెస్‌కి ప్రయాణం మెల్బోరన్
స్టేషన్‌లో రేసుకి ప్రవేశరుసుము రైలు టిక్కెట్టుతో పాటు వసూలు చేస్తారు
తిన్నగా రేసులు జరిగే ప్రదేశం లోపలకు వెళుతుంది తిరుగుప్రయాణ
కూడా అదేవిధమైన సదుపాయం ఉంటుంది అయితే మామూ
దేశమంతటా జరిగే రేసులకు మెల్బోరన్ కప్ నాటి రేసులకు బోలెడు
ఉంటుంది అది మహిళలకు ఫేషన్ పెరేడు ఆనాటి రేసులకు అధికార
డిప్లొమాట్సు టెయిల్సు వేసుకువెళ్ళాలి కాన్‌బెరానుంచి విదేశదూ
ఇతరరాష్ట్రాల నుంచి ప్రభుత్వ ప్రభుత్వేతర ప్రముఖులు వస్తారు ఆ గు
పందాలు కన్నుల పండువుగా ఉంటాయి ఆస్ట్రేలియాల
న్యూజిలాండులోను జాతి గుర్రాలకు రిజిష్టర్లు ఉంటాయి వాటిలో
వంశవృక్షం, తల్లి దండ్రులు గెల్చిన రేసుల వివరాలు వ్రాసి ఉంటాయి
పందాలు కాసేవారికి తోడు నీడలా పనిచేస్తాయి

నేను మెల్బోరన్‌లో ఉన్న మూడేళ్ళలోను ఒకేసారి మెల్బోరన్ కప్ రే
చూడ్డానికి వెళ్ళాను ఆ నాడు ఒక సిడ్నీ వనిత అప్పట్లో ఫేష
పరిగణింపబడే టాప్‌లెస్ డ్రెస్సులో రేసులు చూడ్డానికి వచ్చింది ఇక చూ
పెద్దలు రేసులు చూడ్డం మర్చిపోయి ఆ అమ్మాయి శరీర సౌష్టవం చూడ్డ
నిమగ్నులయ్యారు ఆమె పుణ్యమా అంటూ వివిపిలకు నిర్ణయించిన జా
కూర్చుంది కాబట్టి మాకు పెద్ద బాధ లేకపోయింది ఆమె ఆకాశమంత హె

పాంటీ తప్ప మరొక నూలుపోగు శరీరంమీద లేకుండా రేసులకు రావడం ఆ ఏడాది మెల్బోరన్ కప్ ప్రత్యేకత

నేను మెల్బోరన్‌లో ఉన్నప్పుడు ఇద్దరు ఆంధ్రా డాక్టర్లు ఆ పట్టణంలో ఉండేవారు జయగోపాల్ పార్థసారధి భారత రైల్వేశాఖలో ఉద్యోగాలు చేస్తూ ఆస్ట్రేలియా వచ్చారు వారిద్దరూ ఆ దేశంలో స్థిరనివారం ఏర్పరచుకున్నారు పార్థసారధి జూడీ అనే ఆస్ట్రేలియన్ అమ్మాయిని వివాహం చేసుకోవడం మూలంగా అతడికి ఆస్ట్రేలియాలో ఉండిపోవడానికి అవకాశం వచ్చింది ఇక జయగోపాల్ ఆస్ట్రేలియా వెళ్ళేముందే వివాహం చేసుకున్నాడు కాని అతడిభార్య కోకిల మెల్బోరన్‌లో ఉండగా ఒక కుమారుణ్ని కన్నది ఆస్ట్రేలియన్ రూల్సు ప్రకారం ఆ పసివాడి గార్డియన్లగా తల్లిదండ్రులు ఆ దేశంలో ఉండవచ్చు డాక్టర్లకు ఆస్ట్రేలియాలో మంచిరాబడి పరపతి ఉన్నాయి పార్థసారధి బాపట్లవాడు మెల్బోరన్‌లో తన ఇంటికి ఆహ్వానించి చక్కటి తెలుగు భోజనం పెట్టేవాడు జూడీకి మన వంటలు చేయడం తప్పేదికాదు జూడి తనపేరు జూడిసారధి అని ఊళ్ళో అందరికీ చెప్పింది కాని సారధి భర్త యొక్క అసలు పేరు అందువల్ల అలా పిల్చుకోవడం పద్ధతి కాదని ఎవరో చెప్పారు భర్తయొక్క ఇంటిపేరు తన పేరు ప్రక్క చేర్చింది అప్పటినుంచి ఆమె జూడి కత్తుల అయింది అయితే కత్తుల అన్నమాట సరిగా అనలేక కతూలాఅనేది ఆమె షాపింగ్‌కి వెళ్ళినప్పుడల్లా ఆయాషాపుల వాళ్ళు ఆమెపేరులో మార్పు చూచి సారధిని వదలివేసి మరొక భారతీయు వివాహం చేసుకున్నావా? అని వేళాకోళం ఆడేవారు

ఇక జయగోపాల్, కోకిల నేను మెల్బోరన్‌లో ఉన్నరోజుల్లో నాకు చా ఆప్తులుగా ఉండేవారు నేను కుటుంబం లేకుండా ఒంటరిగా ఉన్నందున ప్ర పండుగకు భోజనం జయగోపాల్ ఇంటివద్దనే విదేశాలలో ఉంటే మన పండుగలు తెలియకపోవడంలో ఆశ్చర్యం లేదు కోకిల తల్లిదండ్రులు బెంగుళూరులో ఉండేవారు తండ్రి నారాయణస్వామి బెంగుళూరులో పెద్ద ఉద్యోగి తల్లి చాలా పూర్వకాలపు మనిషి అయి ఉంటుంది ప్రతి పండుగకు ముందు వాళ్ళమ్మాయికి జాబు వ్రాస్తూ పండుగ వివరాలు ఆ రోజున ఏమి చేయాలో వివరంగా వ్రాసేది అన్ని పండుగలకు జయగోపాల్ దంపతులకు నేనే అతిథిని కోకిల ఫోను చేసి 'మూర్తిగారూ ఫలానా రోజున ఏమి చేస్తున్నారని' అడిగితే చాలు ఏదో తెలుగు పండుగ వస్తున్నదని నాకు ఆలోచన వచ్చేది ఆ దంపతుల ఆహ్వానం పండుగలకే కాదు జయగోపాల్ ఎవరైనా ఆస్ట్రేలియన్ డాక్టరుకి 'లోకమ్' చేస్తున్నప్పటికి నాకు భోజనానికి ఆహ్వానం వచ్చేది

ఈ సందర్భంలో లోకమ్ అంటే ఏమిటో చెప్పాలి. చాలామంది ఆస్ట్రేలియన్ డాక్టర్లు శని, ఆదివారాలు తమ క్లినిక్స్‌లో పనిచేయరు. నర్సుని క్లినిక్‌లో వదలి మరొక డాక్టర్ని హామీగా ఉంచి ఆస్ట్రేలియా డాక్టర్లు ఊరు వదలిపోతారు. సాధారణంగా భారతీయ డాక్టర్లు అలా వెళ్ళిపోయిన ఆస్ట్రేలియా డాక్టర్ల స్థానంలో అవసరమైన రోగులకు వైద్యం చేస్తారు. సాధారణంగా ఆస్ట్రేలియన్లకు శని, ఆది వారాలలో జబ్బు చేయదని జోక్‌గా చెప్పుకుంటారు. శని ఆదివారాలు ఆస్ట్రేలియా పట్టణాలన్నింటిలోను ఏవో ఆటల పోటీలు, గుర్రపు పందాలు ఉంటాయి. ఏమీ లేకపోతే అందమైన సముద్రతీరం సముద్రస్నానాలు ఉండనే ఉంటాయి. జయగోపాల్ లోకమ్ చేసే రోజుల్లో సాధారణంగా క్లినిక్‌కి కాని రోగియొక్క ఇంటికి కాని వెళ్ళవలసిన అవసరం వచ్చేదికాదు. నిజంగా ఎవరైనా అనారోగ్యంతో క్లినిక్‌కి టెలిఫోను చేస్తే అక్కడ ఉన్న నర్స్ జయగోపాల్‌కి టెలిఫోను చేసేది. అనారోగ్యం ఏమిటో తెలుసుకుని ఏమిమందు ఇవ్వాలో చెప్పేవాడు. ఇక నిజంగా ఆ రోగిని చూడ్డం తప్పనిసరి అయితే మాత్రం కారు వేసుకుని వెళ్ళి చూచి వచ్చేవాడు. అటువంటి పరిస్థితి ఎప్పుడో కాని వచ్చేదికాదు. లోకమ్ చేస్తున్న డాక్టరు ఎవరైనా రోగిని చూడ్డానికి వెళ్ళినా వెళ్ళకపోయినా సోమవారంనాడు తిరిగివచ్చిన ఆస్ట్రేలియన్ డాక్టరు తాను లేని సమయంలో తన రోగుల మంచి చెడ్డలు చూచిన డాక్టరుకి 50 ఆస్ట్రేలియన్ పౌన్లకు చెక్కు ఇస్తాడు. జయగోపాల్ స్నేహితులతో శని, ఆది వారాలుగడిపి 50 పౌన్లు సంపాదించడం చూస్తే నాకు ఆశ్చర్యంగా ఉండేది. ఆస్ట్రేలియన్ డాక్టరు తన క్లినిక్‌ని రోగులను వదలి శని ఆది వారాలలో ఎక్కడికి వెళతాడో తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉండేది. తీరా తెలుసుకుని ఆశ్చర్యపోయాను. ఆస్ట్రేలియా డాక్టర్లు ప్రాపంచిక సమస్యలు రోగులు, రోగాలు మర్చిపోవడానికి చేపల్ని పట్టుకోవడానికి (ఫిషింగ్) కి వెళ్ళిపోతారు. భారతదేశంలో ఉన్నప్పుడు అటువంటి సెలవులు తీసుకోవడానికి అలవాటుపడని మన డాక్టర్లు ఆస్ట్రేలియాలో కూడా వారాంతంలో ఇంట్లో కూర్చోవడం చూస్తే నాకు నవ్వు వచ్చేది.

నాకు వంటచేసి పెట్టడానికి ఒక ఆస్ట్రేలియను మధ్యవయస్కురాలిని ఏర్పాటు చేసుకున్నాను. ఆఫీసుకి వెళ్ళిన తరువాత మకాం శుభ్రపరచి వెళ్ళేది. సాయంకాలం వచ్చి డిన్నరు తయారు చేసిపెట్టేది. ఆమెపనికి గంటకు ఇన్నిషిల్లింగులు అని లెక్కకట్టి ఇచ్చేవాడిని. మధ్యాహ్నభోజనం ఆఫీసు ఉన్న రోజుల్లో రాయల్ ఆటోమొబైల్ క్లబ్ లో చేసేవాణ్ణి. సెలవు రోజుల్లో కుటుంబాలతో ఉన్న భారతీయ మిత్రులు ఆహ్వానించేవారు. ఇంటిలో తయారుచేసే వంట క్లబ్బులో తినే తిండి కూడా ఆస్ట్రేలియను పద్ధతిలో చేసిన

వంటకాలు కావడంవల్ల భారతీయ మిత్రుల ఇళ్ళకు వెళితే చక్కటి ఇండియన్ భోజనం దొరికేది నిజానికి నేను ఏ దేశంలో ఉంటే వారి భోజనం చేయడం అలవాటు చేసుకున్నవాణ్ణి ఇండియన్ భోజనం ఉండాలని నాకు పట్టింపు ఉండేది కాదు కాని ఒక డజను భారతీయులు ఉన్నచోట అందునా రెండు తెలుగు కుటుంబాలు ఉన్న మెల్బోర్న్‌లో ఇండియను భోజనం ఆనందంగా సేవించేవాణ్ణి

ఆ సంవత్సరం కొలంబో ప్లాను సమావేశాలు మెల్బోర్న్‌లో జరిగాయి ఆ సందర్భంగా భూటానునుంచి ప్రతినిధివర్గం వచ్చింది దానిలో అంతా మహిళలే ఆ సంవత్సరం భూటానుకి కొలంబో ప్లాను సమావేశాల్లో పూర్తి సభ్యత్వం ఇచ్చారు వారి ప్రతినిధి వర్గానికి నాయకురాలు భూటాన్ రాకుమారి మహారాజుగారి సోదరి ఆ ప్రతినిధి వర్గంలో ఉన్న శ్రీమతి దోర్జీ నాకు ముందే తెలుసు ఆ పరిచయంతో భూటాన్‌కి కొలంబో ప్లాన్‌లో సభ్యత్వం వచ్చిన శుభసందర్భంలో నా ఇంటివద్ద విందుకి ఆహ్వానించాను శ్రీమతి దోర్జి ఆనందంతో నా ఆహ్వానాన్ని అంగీకరించింది రాకుమారి ప్రతినిధివర్గ నాయకురాలిగా ఆస్ట్రేలియన్ ప్రధాని అధికారికంగా ఇచ్చే విందుకి వెళ్ళాలి కాబట్టి తాను నా ఆహ్వానాన్ని అంగీకరించలేనంది భూటాన్ ప్రతినిధివర్గంలోని మిగిలిన సభ్యురాండ్రు నా ఇంటికి భోజనానికి రావడానికి అంగీకరించారు నాకు వంటచేసిపెట్టే ఆస్ట్రేలియన్ మహిళ ఆ వార్త విని చాలా సంతోషించింది మాకు ఐదుగురికి కావలసిన సూప్, చేప బీఫ్ తదితరపదార్థాలతో చక్కటి ఆస్ట్రేలియన్ భోజనం తయారు చేసింది తీ నేను వారిని తీసుకురావడానికి వారి హోటల్‌కి వెళ్ళేసరికి భూటాన్ రాకుమా తన తొలి నిర్ణయం మార్చుకొని ఆస్ట్రేలియన్ ప్రధాని విందుకు వెళ్ళకుండ నాతోపాటు నా ఇంటికి భోజనానికి వస్తానంది ఆఖరిక్షణంలో తమ మనస్సు మార్చుకునే అధికారం స్త్రీల ప్రత్యేకత అనే నానుడి గుర్తుకు వచ్చింది ఆమె మా ఇంటికి వస్తానన్నందుకు సంతోషించాను కాని ఆస్ట్రేలియన్ పద్ధతి భోజనంలో అనుకోకుండా ఒక అతిథి ఎక్కువైతే ఆఖరి నిమిషంలో ఏర్పాటు చాలా కష్టం ఇంటికివచ్చి భూటాన్ రాకుమారి కూడా భోజనానికి వచ్చిందని మా వంటావిడకు చెప్పాను ఆమె తన తెలివితేటలన్నీ చూపిస్తూ ఐదుగురికి ఏర్పాటు చేసిన పదార్థాలు ఆరుగురికి పంచింది అతిథులంతా చాలా మెచ్చుకున్నారు రాజకుటుంబీకులను విందుకి ఆహ్వానించినందుకు మా వంటావిడ నన్ను మెచ్చుకుంది

మా వంటావిడ పూర్వకాలపు మనిషి నేను ఆస్ట్రేలియాలో ఉన్న రోజుల్లో పార్టీలకు వెళ్ళే ఆడమగ స్నేహితులు సరదాకి కారు తాళాల ఆట

ఆడుకునేవారు. మగవారంతా వారి కారు తాళాలు ఒకచోట పడవేస్తారు. పార్టీకి వచ్చిన మహిళలు ఒక్కొక్కరు ఒక్కొక్క తాళం తీసుకుంటారు. వారు తీసిన తాళంగల కారు యజమాని ఎవరైనా అతగాడితో ఆమె ఆ రాత్రి గడుపుతుంది. ఈ ఆట పుణ్యమా అంటూ మా వంటావిడ కుమార్తె చాలా అరుదుగా రాత్రిళ్ళు ఇంటిపట్టున ఉండేదట. అది ఆమెకు చాలా బాధాకరం కావడంతో మెల్బోరన్ వదలడానికి నిర్ణయించినదట. అప్పుడు నాకు తాపీ ధర్మారావుగారు వ్రాసిన దేవాలయాల మీద బూతుబొమ్మలు పుస్తకంలో చెప్పిన రవికల పండుగ గుర్తుకు వచ్చింది. ఆ పండుగ గురించి ఆమెకు చెప్పాను. కారు తాళాల ఆటను ఆమె హర్షించలేకపోయింది. ఆమె వెళ్లిపోయిన తరువాత నేను చాలావరకు క్లబ్‌లో భోజనం చేయడానికి అలవాటుపడ్డాను. కాని అప్పుడప్పుడు సెలవు రోజుల్లో మిత్రురాలు డయానా వచ్చి వంట చేసిపెట్టేది.

డయానా చాలా మంచి మిత్రురాలు. ఆమె ఒక రోజున టూరిస్టు ఆఫీసుకి వస్తే ఆమె అందం చూచి మా ఆఫీసులోని ఆడ మగకు మతులుపోయాయి. నాకు ఆమెతో పరిచయం ఎలా అయిందో గుర్తులేదు. కాని మెల్బోరన్‌లో నాకున్న మంచి మిత్రులలో ఆమెకు ప్రధమ తాంబూలం. ఆమె ఇంగ్లండునుంచి బ్రతుకు తెరువు వెదుక్కుంటూ ఆస్ట్రేలియా వచ్చింది. ఆమె మెల్బోరన్‌లోని టీచర్సు ట్రైనింగ్ కాలేజీలో ఉద్యోగం చేసేది. ఆమె మహిళా హాస్టల్‌లో ఉండేది.

ఒకరోజు ఆమె టెలిఫోను చేసి ఒక శనివారం రాత్రి భోజనానికి ఆహ్వానించింది. ఆనందంగా అంగీకరించాను. ఆ తరువాత ఆఫీసుపని తొందరలో ఉండిపోయాను. ఆమె చెప్పిన దనుకున్న రోజున వారి హాస్టల్‌కి భోజనానికి వెళ్ళాను. హాస్టల్‌లో ఆమెను కలుసుకుంటే ఎక్కడా అతిధుల జాడగాని, భోజనాల హడావిడి కాని కనిపించక పోయేసరికి ఆశ్చర్యపోయాను. అదే మాట ఆమెతో అన్నాను. అంతే, అంతవరకు నిగ్రహంతో ఉన్న డయానా డైనమైట్‌లా పేలింది. అప్పటికీ నాకు పరిస్థితి అర్థం కాలేదు. చివరకు తేలిన దేమిటంటే ఆమె పిలిచిన భోజనానికి నేను వారంరోజులు ఆలస్యంగా వెళ్ళాను. ఆమె కోపానికి అవధులు లేవు. నన్ను పరిచయం చేయడానికి వాళ్ళ స్కూల్ ప్రిన్సిపాల్‌ని ఆయన భార్యను కూడా భోజనానికి పిలిచిందట. వారు అనుకున్న రోజున వచ్చారు. నేను వెళ్ళలేదు. ఆ నాడు ఆమెకు చాలా అవమానం అయినట్టు, దానికి నేను కారణం కాబట్టి బ్రహ్మాండమైనంత కోపంతో నా పొరపాటుని టెలిఫోను మీదనైనా గుర్తుచేయలేదు. చివరకు ఆమె ఆహ్వానం మీద భోజనానికి బయలుదేరిన నేను కోపోపశమనం

తరువాత ఆమెను భోజనానికి తీసుకువెళ్ళవలసి వచ్చింది

డయానాకు వాళ్ళ కాలేజీలో నా చేత ఒక ఉపన్యాసం చెప్పించాలని ఆలోచన ఆ ఉద్దేశంతోనే నన్ను తన కాలేజి ప్రిన్సిపాల్‌కి పరిచయం చేయడానికి డిన్నర్ ఏర్పాటు చేసింది ఆ అవకాశం నేను పాడుచేసాను అయినా ఆమె తన పట్టుదల వదలకుండా ప్రిన్సిపాల్‌తో చెప్పి నా ఉపన్యాసం ఏర్పాటు చేసింది ఆస్ట్రేలియాలో చాలా చోట్ల ఉపన్యాసాలు చెప్పేవాణ్ణి ముఖ్యంగా రోటరీ క్లబ్‌లలోను మహిళా సంఘాలలోను భారతదేశం గురించి మాట్లాడ్డం మా ఉద్యోగ ధర్మంలో ఒక భాగం మన దేశంలో ఆ ఆచారం ఉందో లేదో తెలియదు కాని అనేక పాశ్చాత్య దేశాలలో మాత్రం లంచ్‌కి కాని డిన్నర్‌కి కాని టిక్కెట్ కొనుక్కుని ముఖ్యఅతిధి ఉపన్యాసం వినడానికి వస్తారు అటువంటి ఉపన్యాసాలు కూడా చెప్పేవాణ్ణి అయితే వీటన్నింటికి వచ్చే ప్రజలు చాలా తక్కువ మంది ఉంటారు ఆస్ట్రేలియాలోని జనాభా చాలా తక్కువని ముందే చెప్పుకున్నాంకదా! కాని నా ఉపన్యాసానికి మెల్బోర్న్ టీచర్స్ ట్రైనింగ్ కళాశాల ఆడిటోరియం విద్యార్థి విద్యార్థినులతో కిటకిటలాడిపోయింది వారు ఇంతకుముందు భారతీయుడు ఉపన్యసించగా వినలేదు ఉత్సుకత, నూతనత్వం వారి సరదాకి దోహదం చేసాయి డయానా ముందు వరుసలో కూర్చుంది అంతకు ముందు ఆమె నా కబుర్లు విన్నదేకాని నా ఉపన్యాసం వినలేదు వందలాది మంది ముందు నిలబడి నోట్సు కాని కాగితాలు కాని లేకుండా ఎలా ఉపన్యాసం చెబుతానో అనే అనుమానం ఆమె ముఖంలో కొట్టవచ్చినట్టు కనిపించింది తన మిత్రునిగా నేను ఉపన్యాసం బాగా చెప్పాలని ఆమె ఆకాంక్ష ఆమె ఆందోళన చూచి నాలో నేను నవ్వుకున్నాను వియత్నాంనుంచి తిరిగివస్తూ లండను వెళ్ళినప్పుడు అక్కడ రాయల్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ అఫైర్స్ సభ్యులకు వియత్నాంపై ఉపన్యాసం చెప్పమని ఆహ్వానించారు అప్పుడు కూడా మా ప్రొఫెసర్ హాల్ ఇంగ్లీషు విద్యావేత్తలకు ఇంగ్లీషు బాషలో ఉపన్యాసం చెప్పగల నా సామర్థ్యాన్ని శంకించారు అది నాయందు వారికున్న వాత్సల్యం అని అర్థం చేసుకున్నాను లండనులో ప్రొ॥ హాల్, మెల్బోర్న్‌లో మిత్రురాలు డయానా నా ఉపన్యాసాలు విని నేను వారికి ఆశాభంగం కలిగించలేదని సంతోషించారు

ఆస్ట్రేలియాలో ఉపన్యాసాలు చెప్పడం అనుభవాలు తలచుకున్నప్పుడు ఒకటి రెండు సన్నివేశాలు గుర్తుకువస్తాయి వాటిలో ముఖ్యమైనది మెల్బోర్న్‌లో జరిగిన ఐ ఎల్ ఒ (International Labour Organisation) సమావేశాలు ఆ మహాసభలకు భారతదేశం నుండి ప్రతినిధివర్గాన్ని పంపకూడదని ప్రభుత్వం నిర్ణయించింది అది మనదేశం

చైనాతో యుద్ధంలో నిమగ్నమైన సమయం. అందుమూలంగా ఆస్ట్రేలియాలో ఉన్న భారత హైకమిషనర్‌ని ఆ సమావేశానికి పరిశీలకునిగా వ్యవహరించమని ప్రభుత్వ ఆజ్ఞ. హైకమిషనర్ శ్రీ మసంద్ కాన్‌బెరానుంచి రావాలి. ఆయన రాకుండా నాకు టెలిఫోన్ చేసి ఆ అంతర్జాతీయ సమావేశానికి భారతదేశం తరఫున నన్ను పరిశీలకునిగా ఉండమన్నాడు. "నీవు చేయవలసినదేమీ ఉండదు. సమావేశాలలో కూర్చుని ఉపన్యాసాలు వినడం మాత్రమే" అని నాకు ధైర్యం చెప్పారు. సమావేశం ప్రారంభం కావడానికి ముందు ఐ.ఎల్.ఒ. ఐ.ఎల్.ఒ. సెక్రటరీ జనరల్‌ని కలుసుకుని భారతదేశంనుంచి ప్రతినిధివర్గం రావడంలేదని, నన్ను పరిశీలకునిగా నియమించారని చెప్పాను. అదివిని ఆయన లబోదిబో అని తల కొట్టేసుకున్నాడు. ఐ.ఎల్.ఒ.కి స్థాపక సభ్యులైన భారతదేశం ప్రతినిధి వర్గాన్ని పంపకపోవడాన్ని అర్థం చేసుకోవడానికి ఆయనకు కొంత వ్యవధి పట్టింది. సమావేశానికి హాజరయ్యే నేను ఉపన్యాసం చెప్పితీరవలసినదే అన్నాడు.

వెంటనే కాన్‌బెరా టెలిఫోను చేసి హైకమిషనరుకి సెక్రటరీ జనరల్ వ్యక్తంచేసిన అభిప్రాయం చెప్పాను. భారత హైకమిషనర్‌కి నా సామర్థ్యం మీద బ్రహ్మాండమైన నమ్మకం అయినా ఉండి ఉండాలి. లేకపోతే ఆయన పరమ బద్ధకస్తుడైనా అయి ఉండాలి. ఏదైతేనేమి, ఆయన ఆ ఉపన్యాసం చెప్పే బాధ్యతను కూడా నా నెత్తినే పెట్టాడు. అప్పటి కప్పుడు ఆదరాబాదరాగా ఉపన్యాసం తయారు చేసాను. అంతర్జాతీయ మహాసభలలో భారతదేశ ప్రతినిధిగా ఉపన్యసించడం నాకు కొత్త అనుభవం. తయారుచేసిన ఉపన్యాసం టెలిఫోను మీద హైకమిషనర్‌కు వినిపించాను. ఆ తరువాత మహాసభలో ఉపన్యసించాను. సెక్రటరీ జనరల్ చాలా ఆనందించి అభినందించాడు.

నేను మెల్బోర్న్‌లో ఉద్యోగంచేసే రోజుల్లో ఆస్ట్రేలియాలో భారత హైకమిషనరుగా శ్రీ మసంద్ ఉండేవారు. ఆ సంవత్సరం దక్షిణ ఆస్ట్రేలియాలోని అడిలైడ్ విశ్వవిద్యాలయం వేసవి సెలవులలో ఇండియాపై ప్రత్యేక కోర్సు నిర్వహించడానికి నిర్ణయించి శ్రీ మసంద్‌ని ఆ కోర్సుకి ప్రారంభోత్సవం చేయమని కోరారు. ఆయన ఆ బాధ్యత నాకు అప్పగించి తప్పుకున్నారు. నాకు టెలిఫోను చేసి విషయం చెప్పి అడిలైడ్ వెళ్ళమని ఆజ్ఞాపించారు. నేను ఆశ్చర్యపోయాను. విశ్వవిద్యాలయంవారు హైకమిషనర్‌ని ఆహ్వానించడంలో ఉద్దేశ్యం ఆయన గొప్పగా ఉపన్యాసిస్తాడని కాదు. హైకమిషనరు వస్తే టెలివిజను రేడియో, పత్రికలలో తమ కార్యక్రమానికి ప్రచారం ఉంటుంది. టూరిస్టు డైరెక్టరుకి ఆ మర్యాద ఉండదని నాకు తెలుసు.

అదే విషయం శ్రీ మసంద్‌కి చెప్పాను ఆయన అంతా విని ఆ కార్యక్రమాన్ని నన్నే ప్రారంభించమన్నారు అదే విషయం విశ్వవిద్యాలయానికి తెలియజేసారు అడిలైడ్ విశ్వవిద్యాలయంలో ఇండియాపై ఏర్పాటు చేసిన ప్రత్యేక కోర్సు ప్రారంభించి మెల్బోరన్ తిరిగి వచ్చేసరికి హైకమిషనర్‌నుంచి టెలిఫోను వచ్చింది కార్యక్రమం ఎలా జరిగినదని ప్రశ్నించారు హైకమిషనరు తమ కార్యక్రమానికి రాలేకపోయినందుకు కార్యక్రమ నిర్వాహకులు చాలా నిరుత్సాహపడ్డారని చెప్పాను

ఆస్ట్రేలియాలో రోటరీ ఉద్యమం చాలా పటిష్టమైనది ఆ క్లబ్బులలో సభ్యులు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నా ప్రపంచ వ్యవహారాలు తెలుసుకోవడానికి వారు చూపించే ఉత్సాహం, ఉత్సుకత అపారం ఒక క్లబ్బులో ఎవరైనా ఉపన్యసిస్తే, ఆక్లబ్బువారు పంపే సమాచార లేఖల ద్వారా ఆ ఉపన్యాసకుని అడ్రసు తెలుసుకొని ఆహ్వానాల పరంపర వస్తుంది నాకు కారు ఉండేది కాబట్టి విక్టోరియా స్టేట్‌లో అనేక ప్రదేశాలకు కారులో వెళ్ళి ఉపన్యాసాలు చెప్పి వచ్చేవాణ్ణి కొన్ని ప్రాంతాలకు విమానంలో వెళ్ళవలసి వచ్చేది ఉపన్యాసాలు చెప్పడం కూడా ఉద్యోగధర్మం కాబట్టి హైకమిషను కూడా మార్చించేది ఒకనాడు ఉపన్యాసం చెప్పడానికి విమానంలో వెళ్ళవలసి వచ్చింది రోటరీ మీటింగు అయిపోయిన తరువాత ఒక సభ్యుని ఫారం ఇంట్లో ఆ రాత్రికి మకాం ఆయనకు కొన్ని వేలగొర్రెలు ఉన్నాయి ఆ గొర్రెల గురించిన వివరాలు విని తిరుగు ప్రయాణానికి విమానం ఎక్కాను విమానం చిన్నది ప్రయాణీకులు తక్కువ విమానం ఎగరగానే ఎయిర్ హోస్టెస్ వచ్చి నాపక్క ఖాళీగా ఉన్న సీటులో కూర్చుంది కూర్చున్నది ఊరుకోకుండా నీవు పాకిస్తాన్ నుంచి వచ్చావా? అంది ఆమె అజ్ఞానానికి నవ్వుకుని "ఇండియా నుంచి" అన్నాను ఇక మెల్బోరన్ చేరేవరకు ఆమె ప్రశ్నల వర్షం కురిపించింది ఆ తరువాత ఆమె నాకు మంచి మిత్రురాలు అయింది

రోటరీ క్లబ్బులో ఉపన్యాసాలు కొన్ని సరదాగాను మరికొన్ని ఇబ్బందికరంగాను ఉండేవి రెండు మూడు పట్టణాలలో నగర పాలకసంస్థ నాకు పౌరసన్మానం చేసిన సన్నివేశాలు ఉన్నాయి అంటే రోటరీ క్లబ్బు సమావేశానికి ముందు పురపాలక సంఘ ఆవరణలో ఉపన్యాసాలు అతిథి ఆరోగ్యానికి వారంతా బీరు త్రాగడం, పాటలు ఉండేవి ఆ తరువాత రోటరీ మీటింగు ఆస్ట్రేలియన్లకందరకీ భారతీయులు బీఫ్ [ఆవు మాంసం] ఎందుకు తినరో అర్థం కాదు అదేవిషయం ప్రతి మీటింగులోను అడిగేవారు హిందువులకు గోమాత ఎడల ఉన్న పవిత్రభావం, దాని ఉపయోగాలు ఎంత చెప్పినా వారికి అర్థం అయ్యేది కాదు నేను వియత్నాంలో ఉన్నప్పటి

అనుభవం గుర్తుకి వచ్చి "మీరు కుక్క మాంసం తింటారా! అని అడిగేవాణ్ణి. వాళ్ళకు కుక్క ప్రేమతో చూచుకునే జంతువు. దాని మాంసం తినే ఆలోచన ఊహించరానిది. నా ప్రశ్నవిని వారంతా బోలెడు బాధతో అటువంటి ప్రశ్న ఎలా అడుగుతున్నావనేవారు. అప్పుడు వియత్నాంలో కుక్క మాంసం ఎంత ఇష్టంగా తింటారో చెప్పి ఆవుమాంసం తినే విషయంలో హిందువులు కూడా అలా బాధ పడతారని చెప్పేవాణ్ణి.

సాయంకాలం ఆఫీసు సమయం అయిన తరువాత మెల్బోరన్‌లో ఎవరూ ఆఫీసులలో ఉండరని ఇంతకు ముందు చెప్పుకున్నాం. అలవాటుగా ఐదు గంటలు కాగానే ఆఫీసు వదలడానికి సిద్ధం అవుతున్న సమయంలో టెలిఫోను మ్రోగింది. ఆశ్చర్యపోయాను. ఆ సమయంలో అంతా బీరుత్రాగడానికి పరుగులు పెడుతూ ఉంటారు. అప్పుడు టెలిఫోను రావడం అరుదు. అయితే టెలిఫోను చేసిన అమ్మాయి కోరిన కోర్కె అసామాన్యం. ఆమె భారతదేశం వెళ్ళి వస్తూ సరదాపడి ఒకచీర తెచ్చుకున్నదట. ఆరోజు సాయంకాలం చీరకట్టుకొని పార్టీకి వెళ్ళడానికి నిర్ణయించినదట. సమస్య ఏవిటంటే ఆమెకు చీరకట్టుకోవడం రాదు. మా ఆఫీసు సహాయం అర్థిస్తూ టెలిఫోను చేసింది. విదేశాలలో ఇటువంటి పరిస్థితులు ఎదుర్కోవలసిన వస్తుందని ఊహించిన పెద్దలు "చీర ఎలాకట్టుకోవాలి" అనే విషయాన్ని ఆరుబొమ్మలలో చక్కగా వివరిస్తూ ఒక ప్రచురణ తయారు చేసారు. టెలిఫోను చేసిన అమ్మాయికి మా ఆఫీసులో ఉన్న ప్రచురణ విషయం చెప్పి ఆమెను వచ్చి తీసుకువెళ్ళమని సలహా యిచ్చాను. ఆమె బోలెడు అదుర్దాతో మా ఆఫీసుకు రావడానికి తగినంత వ్యవధి లేదని ప్రాధేయ పడింది. ఆ సాయంకాలం పార్టీకి చీరకట్టుకు వెళ్లితీరాలి. నాకు పచ్చివెలక్కాయ గొంతులో పడినట్టయింది. చిన్నతనంనుంచి పంచెలు కట్టుకోవడం అలవాటు ఉంది. కాని చీరకట్టడం అనుభవం లేదు. ఆ అమ్మాయి ఎదురుగా ఉంటే మా వద్ద ఉన్న ప్రచురణ సహాయంతో ప్రయత్నించేవాణ్ని. కాని ఆమె టెలిఫోను మీద ఉంది. టూరిస్టు ఆఫీసర్లుగా ఎంపిక చేసిన పురుష అధికారులకు విదేశాలకు పంపేముందు వారికి చీరకట్టడంలోని సులువులు చెప్పని డిపార్టుమెంటుని తిట్టుకొని ఆదుర్దాగా ఎదురు చూస్తున్న అమ్మాయి చేత టెలిఫోను మీద చీర కట్టించాను.

భారత పర్యాటకశాఖ విదేశాలలో ప్రదర్శనలకు ఖరీదైన అందమైన చీరలు పంపుతారు. ఒకటి రెండుసార్లు ప్రదర్శనలలో ఉపయోగించిన తరువాత వాటిస్థానంలో క్రొత్త చీరలు పంపుతారు. అందుమూలంగా విదేశాలలోని భారత టూరిస్టు ఆఫీసులలో చీరలు ఉంటాయి. వారు అప్పుడప్పుడు కార్యక్రమాలు ఏర్పాటు చేసి చీరలు బహుమతిగా యివ్వడం ఆచారం.

అటువంటి సమావేశం మెల్బోర్న్‌లో ఒకసారి ఏర్పాటు చేసాను ఆకార్యక్రమంలో ఆస్ట్రేలియన్ మహిళలకు భారతదేశం గురించి తెలిసిన సమాచారంపై క్విజ్ నిర్వహించడం జరిగింది దానిలో గెలుపొందిన మహిళకు చక్కటి చీర బహుమతిగా యిచ్చాం ఒక మధ్య వయస్సులో ఉన్న ఆస్ట్రేలియన్ మహిళ బహుమతి గెల్చుకొంది ఆమె చీరను చూచి చాలా ముచ్చటపడి దానిని కట్టి చూపించమని కోరింది మరొకసారి నాకు పరీక్ష వచ్చింది అంతకు పూర్వం ఏదో టెలిఫోను మీద చీర కట్టుకోవడం చెప్పి బైటపడ్డాను కాని ఆనాటి కార్యక్రమంలో నా పరిస్థితి చాలా క్లిష్టంగా తయారయింది ఆ సమావేశంలో భారత మహిళలు ఎవరూ లేరు అందుమూలంగా నేనే స్వయంగా ఆ మహిళకు చీర సింగారించవలసి వచ్చింది నాకు చేతనైనంతమేరకు ఆమెకు చీరకట్టాను ప్రేక్షకులంతా హర్షించారు

ఆస్ట్రేలియన్ ట్రావెల్ ఏజంట్స్ అసోసియేషన్ వార్షిక సమావేశాలు ఎప్పుడూ చాలా సరదాగా జరిగేవి ఆ సంవత్సర సమావేశానికి నేను వెళ్ళాను సమావేశం మూడు రోజులు జరిగింది సమావేశాలకు వచ్చిన ప్రతినిధులంతా ఆడ, మగ, రోజులో చాలా భాగం సముద్రతీరంలో గడిపేవారు అటువంటి సమయంలో ఒక ఆస్ట్రేలియన్ యువతి నన్ను వెతుక్కుంటూ వచ్చింది ఆ సమావేశాలలో పాల్గొనే భారతీయుణ్ణి నేను ఒక్కణ్ణే ఆమెకు నాతో పని ఏమిటో అర్థం కాలేదు తీరా ఆమె తన మనస్సులో మాట చెప్పేసరికి నేను ఆశ్చర్యపోయాను ఆమె సమావేశాల ఆఖరి రోజు రాత్రి జరిగే అధికారిక డిన్నర్ డాన్సుకి తాను తెచ్చుకున్న చీర కట్టుకోవడంలో నా సహాయం కోరింది నేను కాదనలేకపోయాను ఆమె ఏవిస్ అద్దె కార్ల కంపెనీలో పనిచేస్తున్నానంది ప్రపంచవ్యాప్తంగా విమానాలలో ఎయిర్ హోస్టెస్‌లు ఉన్నట్లు ఏవిస్ అద్దె కార్ల కంపెనీ చాలా అందమైన మహిళా కారు డ్రైవర్లను నియమిస్తారు ఆస్ట్రేలియాలో విమానాల్లో ప్రయాణం చేసే ప్రయాణీకులకు ముందుగా ఏర్పాటు చేసుకుంటే విమానం దిగగానే చాలా అందమైన ఏవిస్ కంపెనీ డ్రైవరు కారు తీసుకువచ్చి ఎయిర్‌పోర్టు ముందు ఉంచుతుంది మిమ్మల్ని పరిచయం చేసుకోగానే ఆ కారు తాళాలు మీకు యిచ్చేస్తుంది నగరంలో మీపనులు చూచుకోవడానికి ఆ కారులో తిరిగి నగరం వదలిపెట్టేముందు విమానాశ్రయం వద్ద కారు వదలి వెళ్ళిపోవచ్చు ఏవిస్ కంపెనీ కూడా ట్రావెల్‌ఏజంట్ల పరిధిలోకి వస్తారని ఆ అసోసియేషన్‌లో వారికి సభ్యత్వం ఇచ్చారు అందుమూలంగా ప్రతిసంవత్సరం అందమైన అవివాహిత యువతులు ట్రావెల్ ఏజంట్ల సమావేశాలకు హాజరై సభలకు క్రొత్త

అందాన్ని వ్వడానికి దోహదం చేస్తారు

సమావేశం చివరిరోజున డిన్నర్ డాన్సు మగవారంతా డిన్నర్ జాకెట్టు బ్లాక్‌టై వేసుకుంటేరాలి మహిళలకు కొంత వెసులుబాటు ఉంది అందుమూలంగానే ఆ అమ్మాయి చీర కట్టుకోవాలని నిర్ణయించింది సాయంకాలం కాగానే అంతా పార్టీ అలంకారాలలో నిమగ్నమై ఉన్నారు నేను కూడా డిన్నర్ జాకెట్టు ఇస్త్రీ చేసుకోవడం గొడవలో ఉన్నాను అంతలో ఏవిస్ అమ్మాయి చీర కట్టుకోవడానికి తొందరపడుతోంది నా అలంకారం పూర్తి చేసుకొని ఆమె గదికి వెళ్ళి ఆమె చీర సింగారింపులో తోడ్పడ్డాను భోజనానంతరం డాన్సు కూడా ఉంది కాబట్టి ఆమె కొంచెం ఎక్కువ జాగ్రత్త తీసుకోవలసి వచ్చింది ఆ చీరలో ఆమె చాలా అందంగా ఆకర్షణీయంగా ఉంది నేనుపడ్డ శ్రమకు ప్రతిఫలంగా డాన్సు కార్యక్రమం ప్రారంభం కాగానే మొదటి డాన్సు నాతో చేసింది

దక్షిణ ఆస్ట్రేలియాలోని బరోసా వ్యాలీ ద్రాక్ష పంటకు ప్రసిద్ధి అందుమూలంగా దక్షిణ ఆస్ట్రేలియాకు వైన్ ఉత్పత్తి చేసే రాష్ట్రంగా ప్రఖ్యాతి నేను ఆస్ట్రేలియాలో ఉన్న రోజుల్లో దేశంలో ఏడాదికి 38మిలియన్ల గాలన్ల వైన్ తయారుచేసే వారని దానిలో 27మిలియన్ల వైన్ బరోసా వ్యాలీలో తయారయ్యేదని విన్నాం దానిలో 2మిలియన్ గాలన్ల వైన్ ప్రపంచంలో దేశాలకు ఎగుమతి చేసేవారు ఫ్రెంచి, ఇటాలియన్ వైన్స్‌కి అలవాటు పడ్డ గ్లీషు వారుకూడా ఆస్ట్రేలియన్ వైన్స్‌కి ఎక్కువగా మక్కువ చూపించేవారు కభాగం ఆస్ట్రేలియన్ వైన్స్ ఇంగ్లండు దేశానికి ఎగుమతి అవుతాయి సా వ్యాలీలో తయారయ్యే వైన్స్‌కి విచిత్రమైన పేర్లు ఆ వైన్సు చిచూచిన వారికి అవి ఫ్రెంచి, ఇటాలియన్ వైన్స్‌కి ఎందునా సిపోవనిపిస్తుంది

బరోసా వ్యాలీలో తయారయ్యే ఆస్ట్రేలియన్ వైన్సు రుచిచూచే అవకాశం మాకు ఆస్ట్రేలియన్ టూరిస్టుబోర్డువారు కల్పించారు ఆస్ట్రేలియాలో వున్న విదేశీ టూరిస్టు డైరెక్టర్లందరిని బరోసా వ్యాలీకి ఆహ్వానించారు ఆ సందర్భంగా బరోసా వ్యాలీకి వెళ్ళాను అక్కడ గడిపిన ఒక రోజులో వైన్సు తయారుచేసే పద్ధతి తెలుసుకున్నాం ద్రాక్షతోటల నుంచి వచ్చే ద్రాక్షపళ్ళు సిమెంట్‌తో తయారుచేసిన చదరపు నూతులలో వేసి వాటిని మనుష్యులు కాళ్ళతో కుమ్ముతారు ఏమాటకామాటే చెప్పుకోవాలి బీరుకాని, వైన్స్‌కాని తయారుచేసే పద్ధతి చూస్తే ఇక జీవితంలో అవి త్రాగకూడదనిపిస్తుంది కాని అవి ఎలా తయారవుతాయో చూడకపోతేమాత్రం వైన్స్ బ్రహ్మాండంగా ఉంటాయి ఆ సాయంకాలం వైన్ టేస్టింగ్ కార్యక్రమం

ఏర్పాటుచేసారు బరోసా వ్యాలీలో తయారయ్యే 30రకాల వైన్స్ వరుసగా బల్లలమీద ఉంచారు ఆ బల్లక్రింద ఖాళీ బకెట్లు ఉంచుతారు ఒకదాని తరువాత మరొకటి చొప్పున అన్ని రకాల వైన్స్ రుచి చూస్తారు రుచించకపోతే బల్లక్రిందనున్న బకెట్‌లో పోయడం బాగున్నా కొద్దిగా త్రాగి మిగిలినది బకెట్‌లో పోయడం. అలా అన్నిరకాల వైన్స్ రుచి చూచేసరికి ఇక రుచి తెలియని స్థితి వస్తుంది ఆ స్థితిలో వాటిలో మంచిచెడ్డలు నిర్ణయించడం సాధ్యం కాదు అందుకే వైన్స్ రుచి చూచి మంచిచెడ్డలు చెప్పడానికి ప్రత్యేకంగా అనుభవజ్ఞులైన నిపుణులు ఉంటారు

ఇంతకు ముందు చెప్పుకున్నట్లు ఆస్ట్రేలియన్లు బీరు రాయుళ్ళు ఏసమయంలోనైనా వారు స్పిరిట్స్, వైన్సకంటే బీరు త్రాగడానికి ఇష్టపడతారు వారు వైన్ను మొక్కుబడికి అధికారిక పార్టీలలోను, ప్రత్యేక పరిస్థితులలో తప్ప త్రాగరు ఇండోచైనా కమిషనులో మూడేళ్ళ అనుభవం పుణ్యమా అంటూ ఫ్రెంచి వైన్సు యొక్క మంచి చెడ్డా చెప్పగల సమర్థత నాకు అబ్బింది బరోసా వ్యాలీకి వెళ్ళి రావడంతో ఆస్ట్రేలియన్ వైన్స్ గురించి అర్థం అయింది వైన్స్ విషయంలో నాకున్న పరిజ్ఞానానికి పరీక్ష లండనులో వచ్చింది ఎయిర్ ఇండియా ఫిజీలోని నంది ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టునుంచి లండన్‌కు మొదటిసారిగా విమాన సర్వీసు ప్రారంభించినప్పుడు ఆస్ట్రేలియానుండి బారత హైకమిషనరును, నన్ను అతిథులుగా ఆహ్వానించారు మాతోపాటు ఆస్ట్రేలియా ఫిజీ దేశాలనుంచి అన్ని రంగాలలోని ప్రముఖులను ఆహ్వానించారు ఎయిర్ ఇండియా అతిథులుగా లండను చేరాం ఆరాత్రి భోజనానికి ఒక రెస్టారెంటుకి వెళ్ళాం అంతకు పూర్వం నేను లండనులో విద్యార్థిగా ఉన్న రోజుల్లో కాని, 1958లో వియత్నాం నుంచి తిరిగి వస్తూ లండనులో ఉన్నప్పుడు కాని ఆ రెస్టారెంటు లేదు దానిపేరు Talk of the Town నిజంగా పేరుకి తగ్గట్టే ఆ మహానగరంలో అంతా ఆ రెస్టారెంటు పేరే చెప్పుకుంటున్నారు బేరర్ వైన్‌లిస్టు తీసుకు వచ్చాడు అంబాసిడర్ మసంద్ ఆ వైన్‌లిస్టు నాచేతికిచ్చి అందరికి వైన్స్ సెలక్టు చేయమన్నారు ఆశ్చర్యపోయాను వైన్స్ గురించి సర్వం తెలిసిన హేమాహేమీలకు నన్ను వైన్సు సెలక్టు చేయమనడం నిజంగా నా పరిజ్ఞానానికి పరీక్ష అయింది నేను సెలక్టు చేసాను బేరర్ సీసామూత తీసి ముందుగా కొద్దిగా నాగ్లాసులో పోసి నేను రుచిచూచి బాగున్నదని అనిపించడంతో అందరికీ పోయమన్నాను అది మర్యాద నాకు అందరికంటే ఆఖర్ని పోస్తాడు ఆ రాత్రి అతిథులకు ముఖ్యంగా మసంద్ గారికి ఫ్రెంచి ఆస్ట్రేలియన్ వైన్సు అంత చక్కగా సెలక్టు చేయడం మూర్తికి ఎలా తెలిసినదని ఆశ్చర్యమైంది వైన్సు తయారుచేసే

దేశాలలో వైన్ను యొక్క రుచి ఆ సంవత్సరంలోని వర్షపాతం మీద ఆధారపడి ఉంటుంది వర్షపాతం తక్కువైన సంవత్సరాలలో తయారైన వైనులో నీటిపాలు తక్కువ ఉంటుంది అవి రుచిగా ఉంటాయి ఎప్పుడో సైగానులో నేర్చుకున్న పాఠం వారికి అప్పుజెప్పాను అతిధులంతా ఆనందించారని వేరే చెప్పాలా

అయితే ఆస్ట్రేలియాలో ఆయిష్టర్సు తిన్నవారికి ఇంగ్లండులో దొరికే ఆయిష్టర్సు రుచించవు ఆస్ట్రేలియాలో దొరికే ఆయిష్టర్సుని రాక్ ఆయిష్టరు అంటారు సముద్రంలో అవి తీరప్రాంతాల్లో రాతిని ఆశ్రయించి పెరుగుతాయి ఇంగ్లండులో దొరికే ఆయిష్టర్సుని బెడ్ ఆయిష్టర్సు అంటారు చిత్రం ఏవిటో ఆస్ట్రేలియాలో ఎంతో ఇష్టంగా డజన్ల కొద్దీ ఆయిష్టర్లు తినగలిగినవారంతా లండనులో పెట్టిన బ్రెడ్ ఆయిష్టరు నోట్లో పెట్టుకోలేక పోయారు ఆ ప్రయాణంనుంచి మెల్బోరన్ తిరిగి వచ్చిన తరువాత ఆస్ట్రేలియాలోని అందాలు మరీ అందంగా కనుపించాయి

ఆస్ట్రేలియా కామన్వెల్త్ దేశంగా కొలంబో ప్లానులో ప్రముఖపాత్ర వహించేది 1950 జనవరిలో కామన్వెల్త్ విదేశాంగ మంత్రులు శ్రీలంక ముఖ్యపట్టణం కొలంబోలో సమావేశమై దక్షిణ, ఆగ్నేయాసియాలోని దేశాల అభివృద్ధి కొరకు ఒక పధకం తయారుచేసారు అదే కొలంబో ప్లాన్ బారతదేశం కామన్‌వెల్త్ దేశంగా కొలంబో ప్లాన్‌కి సహాయం చేయడం దానివల్ల సహాయం పొందడంకూడా జరిగేది నేను ఆస్ట్రేలియాలో ఉన్నరోజుల్లో బారతదేశాన్నుంచి అనేకమంది ఉద్యోగులు కొలంబో స్కాలర్స్‌గా ఆస్ట్రేలియావచ్చేవారు ఇంజనీరింగ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, విద్య, నర్సింగ్, విజ్ఞానశాస్త్రం, వైద్యశాస్త్రం, వ్యవసాయం ఇంకా అనేక విషయాలు అధ్యయనం చేయడానికి, అనుభవం గడించడానికి అనేక దేశాలనుంచి ఆస్ట్రేలియా వచ్చేవారు భారతదేశంనుంచి వచ్చేవారిలో మెల్బోరన్‌కి వచ్చేవారు మాఆఫీసుకు వచ్చితీరాలి విక్టోరియా స్టేట్‌లో ఉన్న భారతప్రభుత్వ ఆఫీసు మాది ఒక్కటే అందుమూలంగా సలహా, సంప్రదింపులకు మాఆఫీసుకి, మాఇంటికి వచ్చేవారు అలావచ్చిన వారిలో రకరకాల వ్యక్తులు ఉండేవారు వారిలో కొందర్ని ఎప్పటికి మర్చిపోలేను

ఒక బెంగాలీ పోలీసు ఆఫీసరు ఆస్ట్రేలియా దేశంలో నేరపరిశోధన, గూఢచారి శాఖలో మెలుకువలు తెలుసుకోవడానికి మెల్బోరన్ వచ్చాడు ఆయన చాలా అనుబవం ఉన్న పోలీసు అధికారి వెళ్ళిన ఏడాదిలో ఉద్యోగవిరమణ చేస్తాడు అంటే నిజంగా ఆయన ఆస్ట్రేలియాలో ఏమైనా నేర్చుకున్నా దానివల్ల మనదేశానికి ఏవిధమైన ఉపయోగం ఉండదు అయినా ఉద్యోగవిరమణ చేయడానికి ముందు విదేశాలు వచ్చి క్రొత్తవిషయాలు

తెలుసుకోవాలనే ఉత్సాహం ఉత్సుకత చాలా అరుదు ఏదో ఉద్యోగ విరమణ చేసేముందు విదేశయాత్ర చేసే అవకాశం వచ్చిందని సంతోషించాడు మరొక కొలంబో ప్లాన్ స్కాలర్ కథ నాకు బాగా గుర్తు అతడు తమిళనాడునుంచి వచ్చాడు తమిళనాడులోని నైవేలీ లిగ్నైట్ గనులలో నిపుణుడు ఆస్ట్రేలియాలో న్యూసౌత్ వేల్సులో నల్ల బొగ్గు, విక్టోరియాలో బ్రౌన్ బొగ్గు గనులు చాలా ప్రసిద్ధి మెల్బోర్నకి 90 మైళ్ళ దూరంలో ఉన్న లాట్రోబ్ వ్యాలీలో గిప్స్లాండ్ వద్ద ప్రపంచంలో ఎక్కడాలేనంత హెచ్చు పరిధిలో బ్రౌన్ బొగ్గు గనులు ఉన్నాయి ఆ గనులు త్రవ్వడం ఆ బొగ్గుని ఉపయోగిచడంలో ఆస్ట్రేలియన్స్ అవలింభించే పద్ధతులు తెలుసుకోదగ్గవే! కాని ఆ విషయాలు అధ్యయనం చేయడానికి పంపబడ్డ అధికారి అంతస్థు చాలదని అతడే బాధపడ్డాడు చాలా ఉత్సాహంగా బొగ్గుగనుల గురించి తెలిసికొని భారతదేశానికి తిరిగి వెళ్ళిన తరువాత ఒక రిపోర్టు తయారుచేసి తన పై అధికారికి అందజేస్తాడు దానిలో తాను ఆస్ట్రేలియాలో చూచినది, తెలుసుకొన్నది వివరిస్తూ కొన్ని సూచనలు చేస్తాడు తనకంటే చిన్న ఉద్యోగికి ఆస్ట్రేలియా వెళ్ళేఛాన్సు వచ్చినదని కుమిలిపోతున్న అధికారి ఆ రిపోర్టు చెత్త బుట్టలో పారేస్తాడు తన రిపోర్టు ఏమైనా తనకు ఆస్ట్రేలియా చూసే అవకాశం దొరికినందుకు సంతోషించాడు ఆ ఇంజనీరు

చిత్రం ఏమిటంటే అనేకమందిని వివిధ దేశాలకు కొలంబో ప్లాన్ పేరుమీద పంపడం వారు దేశానికి తిరిగివచ్చిన తరువాత వారిని పట్టించుకోకపోవడం మన ప్రభుత్వం ప్రత్యేకత! ఆస్ట్రేలియన్ ప్రభుత్వం మాత్రం కొలంబో ప్లాన్ క్రింద పెట్టిన ఖర్చులలో 25 శాతం భారతదేశం కోసం ఖర్చుపెట్టింది కొలంబో ప్లాన్ పుణ్యమా అంటూ 700మంది ఉద్యోగుల మన దేశంనుండి ఆస్ట్రేలియా వెళ్ళారు వారు ఆ దేశంలో ఏమి నేర్చుకున్నార అది ఎంతవరకు మన దేశానికి ఉపయోగపడిందో అనే విషయం ఆ పెరుమాళ్ళకే ఎరుక

యూరపులోను ఇంగ్లండులోను డిశంబరు నెలలో మంచు కురిసి వారి క్రిష్టమస్ పండుగ తెల్ల క్రిస్టమస్ అని సంబరపడిపోతారు మనకు కూడా డిశంబరు, జనవరి మాసాలు శీతాకాలం పర్వత ప్రాంతాలల్లో మంచు కురుస్తుంది అయితే ఆస్ట్రేలియాలో డిశంబరు, జనవరి ఫిబ్రవరి మాసాలు మండువేసవి, జూన్నుండి ఆగస్టువరకు చలికాలం ఆస్ట్రేలియాకి సూర్యరశ్మి దేశం అని ప్రతీతి సంవత్సరంలో నగటున ప్రతిరోజు 6 గంటలనుండి 8 గంటలవరకు సూర్యరశ్మి ఉంటుందని గొప్పగా చెప్పుకుంటారు విక్టోరియాలోను టాస్మేనియాలోను మిగిలిన ప్రదేశాలకంటే కొన్ని

మాసాల్లో చల్లగా ఉంటుంది ఆస్ట్రేలియాలో శీతాకాలం మాసాల్లో ఆగ్నేయ ప్రాంతాల్లోను, టాస్మేనియాలోను మంచు కురుస్తుంది తేడా ఏమిటంటే మనం మండుటెండలతో బాధపడే మాసాలలో ఆస్ట్రేలియాలో అక్కడక్కడ మంచు కురుస్తుంది సంవత్సరంలో 300 రోజులు చలి వర్షంతో బాధపడే ఇంగ్లీషువారికి ఆస్ట్రేలియా వాతావరణం వరప్రసాదంలా ఉంటుంది అందుకే ఆస్ట్రేలియా జనాభాలో ఇంగ్లీషువారు ఎక్కువనిపించిది

ఆస్ట్రేలియా పేరు వినగానే జ్ఞాపకం వచ్చే జంతువు కంగారు, వీటిలో 40 రకాలు ఉంటాయట అవి సైజులోను ఆకారంలోను రకరకాలుగా ఉంటాయి ఆరడుగుల ఎత్తు ఉండి 200 పౌన్లు బరువుండే కంగారునుంచి మన ఇంటి ఎలుక సైజులో ఉండే కంగారు వరకు ఉంటాయి పరుగుపెట్టడానికి అవన్ని వాటివెనుక కాళ్ళమీద బలమైన తోకమీద ఆధారపడతాయి కొన్ని నాలుగు కాళ్ళమీద నడుస్తాయి మరికొన్ని చెట్టుమీదనుంచి చెట్టుమీదకు దూకుతాయి కొన్ని పగలు తిరిగితే మరికొన్నినిశాచరాలు చాలావరకు కంగారు జాతి శాకాహారి కొద్దిరకాలు మాత్రం మాంసాహారులు వాటిలో ఎన్ని భేదాలు ఉన్నా అన్నిరకాల కంగారు జంతువులలోను సామాన్యంగా వాటి పసిపిల్లల్ని ఉంచుకోవడానికి ఒక రకమైన సంచి ఉంటుంది చెట్లమీద ఉండే చిన్నరకం తప్ప మిగిలినవన్నీ నేలమీద జీవిస్తాయి

నా చిన్నతనంలో అమలాపురంలో మా బంధువుల ఇంట్లో అడుగు పెట్టగానే "కమలా ఎవరో వచ్చారు" అని వినిపించేది ఆమాట ఎక్కడనుంచి స్తోందా అని నాలుగుప్రక్కలా చూస్తే పంజరంలో ఉన్న మైనా గోరింక ంపించేది ఆమాట వినగానే లోపలనుంచి యజమానురాలు వచ్చేది అనేక ంవత్సరాల తరువాత ఆస్ట్రేలియాలో కనిపించే కొక్కాటూ పక్షి మనం ఏమాటంటే ఆమాటలు అంటుంది వెక్కిరించడంలో దానికి సాటిలేదనే చెప్పాలి ఆస్ట్రేలియాలో కనిపించే 'ఎము' పక్షి ఆఫ్రికాకు చెందిన ఆస్ట్రిచ్‌ని పోలి ఉంటుంది లైర్ పక్షి సంగీతనిధి దాని ప్రత్యేకత ఏమిటంటే తన పాట కచేరీకి స్థల నిర్ణయం స్టేజి నిర్మాణం అదే చేసుకుంటుంది లైర్ పక్షి మన నెమలిని పోలి ఉంటుంది గాని దాని పింఛం నెమలి పింఛాకంటే చిన్నదిగా ఉంటుంది ఇక ఆస్ట్రేలియా ప్రత్యేకత నల్లహంస కోలాబేర్ చూడ్డానికి విచిత్రంగా ఉంటుంది అది ఎప్పుడూ చెట్లమీదనే ఉంటుంది

మెల్బోరన్ నగరానికి మూడుగంటల దూరంలో పిలిప్ ద్వీపకల్పం ఉంది అక్కడ ప్రత్యేక ఆకర్షణ అర్థరాత్రివేళ బీచ్ మీద పెంగ్విన్ పక్షులనడక అది చూడ్డానికి వేలాది మంది ఆస్ట్రేలియన్లు అక్కడకు కార్లలో వెళ్ళి ఆ పక్షులు సముద్రంలోనుంచి తిరిగి వచ్చేవరకు పడిగాపులు పడి ఉంటారు

సముద్రతీరంలో బొరియలు చేసుకొని వాటిలో నివశించే పెంగ్విన్ పక్షులు ఆహారం కోసం సముద్రంలోకి వెళతాయి రాత్రిపడిన తరువాత వందలాది పక్షులు తమ నివాస స్థలాలకు తిరిగివస్తాయి అవి సముద్రంలోనుంచి బైటకు రావడం చూడముచ్చటగా ఉంటుంది నిజానికి మనుష్యమాత్రుడు వాటికి దీపాల వెలుగు చూపించనక్కర లేదు అయినా స్థానిక ప్రభుత్వం సెర్చిలైట్లు ఏర్పాటు చేసి ప్రేక్షకుల ఆనందంకోసం అవి గుంపులుగా సముద్రంలో నుంచి బైటకు వచ్చి బీచ్ మీద నడుస్తూ వాటి బొరియలలోనికి వెళ్ళిపోయేవరకు చూడ్డానికి అవకాశం కలిగిస్తారు ఆ దృశ్యం చాలా అందంగా ఉంటుంది చూడ్డానికి వచ్చినవాళ్ళు నిశ్శబ్దంగా ఉండాలి మనుష్యులజాడ తగిలితే అవి వెనక్కు వెళ్ళిపోయి దారి మళ్ళిస్తాయట గంటల తరబడి వాటి రాకకోసం ఎదురు చూడడంలో శ్రమలేకుండా చేయడానికి మిత్రురాలు డయానా నాకు తోడు వచ్చింది

ఇలా వ్రాసుకుంటూ పోతే ఆస్ట్రేలియాలో అనేక ఆకర్షణలు అందమైన అనుభవాలు టాస్మేనియా, డాండినాంగ్ పర్వత శ్రేణులు మంచుకొండలు, సముద్ర తీర క్రీడలు ఇంకా ఎన్నో ఆసక్తికరమైన అనుభవాలు వ్రాయాలనిపిస్తుంది కాని పాఠకుల్ని ఆస్ట్రేలియాతో విసిగించకుండా ఫిజీ దీవులు, న్యూజిలాండు దేశాల గురించి క్లుప్తంగా చెప్పాలని సరదా ఉద్యోగరీత్యా ఆస్ట్రేలియాలో ఉంటూ ఫిజీలోను న్యూజిలాండులోను కూడా భారతదేశంలోని అందాలు, ఆకర్షణల గురించి ప్రచారం చేయడం ఉద్యోగధర్మం నిజానికి ఫిజీ జనాభాలో సగం ఉన్న భారతీయ సంతతికి మన దేశం గురించి చెప్పడం తాతకి దగ్గులు నేర్పడమే అవుతుంది అయితే అక్కడ కూడా తరాల తేడా వచ్చింది బ్రిటిషువారు మన దేశాన్ని పాలించిన రోజుల్లో భారతీయుల్ని తూర్పు ఆఫ్రికా, మారిషస్, వెస్ట్ ఇండీస్, ఫిజీ దేశాలకు బలవంతంగా కూలీలుగా తీసుకుపోయిన విషయం చరిత్ర వారంతా ఆయాదేశాలలో స్థిరపడిపోయారు ఫిజీదీవులకు వెళ్ళిన భారతీయులు ముఖ్యంగా చెరకు పొలాల్లో పనిచేసి పంచదార ఉత్పత్తికి తోడ్పడ్డారు ఈ నాటికి ఫిజీలో హెచ్చుమంది భారతీయులు చెక్కర పరిశ్రమలోనే ఉన్నారు చాలామంది చదువు సంధ్యలు లేకుండా ఉండిపోయారు వయసు మళ్ళిన వారిలో నిరక్షరాస్యులు హెచ్చు యువతరం పెద్ద చదువులు చదువుకుని ఫిజీ దేశప్రగతిలో భాగస్వామ్యం పంచుకుని అన్ని రంగాలలోను ప్రముఖ పాత్ర వహిస్తున్నారు మారిషస్‌లోను వెస్ట్ఇండీస్‌లో కొన్ని దేశాల్లోను భారతీయ సంతతి రాజ్యాలు ఏలుతున్నారు కాని ఫిజీలో మాత్రం భారతీయ సంతతి పాలకులు కాలేకపోయారు

ఒకసారి ఆస్ట్రేలియానుంచి న్యూజిలాండ్ వెళుతూ ఫిజీలోని నంది అంతర్జాతీయ విమానాశ్రయానికి పాతికమైళ్ళు దూరంలో ఉన్న కరలేవూ బీచ్ చూడ్డానికి బస్ ఎక్కాను ఫిజీలో ఎక్కడకు వెళ్ళినా భారతీయులకు అక్కడి పరిసరాలు, వృక్ష సంపద క్రొత్త అనిపించవు గోవాలో ప్రయాణం చేస్తున్నట్లు అనిపిస్తుంది అయితే కరలేవూ బీచ్ గోవా బీచ్ అనేక ఆస్ట్రేలియన్ బీచ్‌ల తలతన్నుతుంది అది బీచ్ రిజార్టు దాని చుట్టుపక్కల కొన్నిమైళ్ళ దూరంలో ఊరుకాని పల్లెకాని ఉన్న జాడలేదు నంది విమానాశ్రయంలో విమానం దిగి బస్ ప్రయాణం చేసి కరలేవూ చేరతారు అక్కడ కొన్ని రోజులు ఉండిపోతారు వారి కోసం సర్వసదుపాయాలు ఉన్నాయి అక్కడ టూరిస్టుల కోసం ఏర్పాటు చేసిన నివాసం నన్ను ఆశ్చర్యపరిచింది లోపల చాలా ఆధునికంగా ఉన్నాయి కాని పైని మాత్రం ఒకరకం రెల్లుతో కప్పి ఉన్నాయి కరలేవూ చేరగానే అక్కడ బార్‌కి వెళ్ళాను అక్కడ ఒక అమెరికన్ టూరిస్టు కనిపించాడు అతడు కాలిఫోర్నియానుంచి వచ్చానన్నాడు కాలిఫోర్నియాలో ఉన్న అందమైన బీచ్‌లు వదలి కరలేవూ ఎందుకు వచ్చావన్నాను ప్రతి సంవత్సరం వస్తానన్నాడు అతడు మధ్యవయస్కుడు ఒంటరిగా కూర్చుని బీరు త్రాగుతున్నాడు డ్రింకులు అమ్మే అతడు భారతీయుడులాగ కనబడితే అతడితో కబుర్లు వేసాను చాలావరకు ఆడ మగ అనేక దేశాలనుంచి ఒంటరిగానే వచ్చి జతలు అవుతారన్నాడు ఫిజీ దీవుల చుట్టూ అనేక ఆకర్షణీయమైన బీచ్‌లు ఉన్నాయి కాని వాటిలో కరలేవు తలమానికం బీచ్‌కి వెళ్ళడానికి ఇష్టంలేని వారికి స్విమ్మింగ్‌పూల్ ఉంది దానిచుట్టూ అక్కడ మకాం చేసిన ఆడమగ స్విమ్‌సూట్లలో 'సూర్య స్నానం' చేస్తూ పడుకున్నారు తినగా తినగా గారెలు చేదవుతాయన్నట్టు ఆ అందాన్ని ఎక్కువసేపు చూస్తే మొఖం మొత్తేటట్టనిపించింది దానికి తోడు నేను ఒంటరివాణ్ణి నందిలో విమానం ఎక్కవలసిన సమయం దగ్గర పడుతున్నందున తిరుగు ప్రయాణం ప్రారంభించాను

కరలేవు బీచ్‌నుంచి ఫిజీ దీవుల ముఖ్యపట్టణమైన సువా పట్టణంలో అడుగుపెట్టేసరికి బారత దేశంలో తిరుగుతున్న భావం కలుగుతుంది అక్కడ భారతీయులు అన్ని వ్యాపారాలలోను ఉన్నారు అయితే సువాలోని పెద్ద హోటల్ మాత్రం అప్పటికీ బ్రిటిష్ ఆధిపత్యం క్రిందనే ఉంది బొప్పాయిపండులో నిమ్మకాయ పిండుకుని స్పూనుతో తినడం మొదటిసారిగా ఆ హోటల్‌లోనే చూసాను ఫిజీదీవులు దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలో ఉన్నందున అక్కడి ప్రజలు చాలావరకు పోలనేషియన్ లక్షణాలతో ఉంటారు ఇక భారతదేశంనుంచి వెళ్ళిన బారతీయ సంతతివారిలో ఏ రాష్ట్రంనుంచి వెళితే ఆరాష్ట్ర లక్షణాలు కొట్టవచ్చినట్టు కనబడతాయి వంద సంవత్సరాలు పైబడి

ఆ దేశం వెళ్ళి ఇప్పటికి మూడుతరాల భారతీయ సంతతి ఉన్నా ఆచార వ్యవహారాలు భోజనాదులలో వారి అలవాట్లు మారినట్లు కనిపించదు నేను కలుసుకున్న వృద్ధులలో ఇంకా గంగామాత, గోదావరి, కృష్ణా, కావేరీ నదుల గురించి భక్తిపూర్వకంగా మాట్లాడి భారత దేశంలోని పుణ్య క్షేత్రాలు మరొక్కసారి చూడాలనే అభిలాష వ్యక్తం చేసినవారు చాలామంది ఉన్నారు కాని వారెవ్వరూ సాధారణంగా భారతదేశానికి రారు

రెండవతరం భారత సంతతిని మన దేశంలో బంధువులు ఆస్తి వ్యవహారాలు, మన పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు ఆకర్షణలు కొంతవరకు భారతదేశంవైపు చూచేటట్టు చేసాయి కాని మూడవతరం భారతతంతతి బారతదేశాన్ని మ్యాపులో చూచుకొని సంతృప్తి పడతారు వారికి భారతదేశం ఎక్కడో ఉంది వాళ్ళ తాతలు అక్కడనుండి వచ్చి ఉండవచ్చు కాని యువతరం భారత సంతతి మాతృదేశంతో తెగతెంపులు చేసుకున్నారు వారు పైచదువులకు వెళ్ళాలన్నా, పర్యాటకులుగా వెళ్ళాలన్నా వారికి దగ్గరలో ఉన్న న్యూజిలాండు వారిని ఆకర్షిస్తుంది ఈ పరిస్థితి చూచిన తరువాత ఫిజీనుంచి బారతీయ సంతతివారిని మనదేశం టూరిస్టులుగా తీసుకురావడానికి ప్రయత్నించడంలో అర్థం లేదనిపించింది ఎయిర్ ఇండియా సంస్థ తమ శక్తివంచన లేకుండా భారతీయ సంతతివారిని మనదేశం తీసుకురావడానికి ప్రయత్నిస్తోంది కాలం గడిచినకొద్ది ఫిజీలోని భారతీయ సంతతికూడా వెస్ట్ ఇండీస్ లోని భారతీయ సంతతిలా వారి పేర్లవరకే భారతీయత పరిమితమవుతుందనిపించింది

నేను ఆస్ట్రేలియాలో ఉన్న మూడేళ్ళలోను ఫిజీ మూడుసార్లు వెళ్ళాను సువాలోని భారతీయ సంతతిలో పెద్దవారితో మాట్లాడ్డం సరదాగా ఉండేది బ్రిటిషువారు వారిని ఎలా ఫిజీకి తీసుకువచ్చారో, చెరకు పొలాలలో కూలీలుగా వచ్చినవారు అక్కడే శాశ్వత నివాసం ఏర్పరచుకోవడం, వారి కష్టసుఖాలు బాధలగురించి వింటూ ఉంటే కొంత బాధ కలిగేది కాని ఓర్పుతో, దీక్షతో ఆ దేశంయొక్క ప్రగతికి తమ సర్వశక్తులూ ధారపోసి ఆ దేశాన్ని తమదిగా భావించి అక్కడే ఉండిపోయినవారిని చూస్తూంటే అనేక మిశ్రమ ఆలోచనలు వచ్చేవి ఆరోజుల్లో సువాలో ఏ భారతీయుని ఇంటికి వెళ్ళినా రాజకీయ చర్చలే వినిపించేవి అవి ప్రముఖ భారతీయుల గృహాలు చిత్రం ఏమిటంటే సామాన్య భారతీయ మధ్యతరగతి కుటుంబీకుడు కూడా రాజకీయాలే మాట్లాడేవాడు కాని ఆనాటి రాజకీయాల పర్యవసానం భారత సంతతి రాజకీయ వైఫల్యం ఫిజియన్ వర్గాలు రాజకీయంగా విజయ‹ సాధించాయి తమ వైఫల్యానికి బ్రిటిష ప్రభుత్వాన్ని నిందించడ‹ మనకందరకూ తెలిసిన విషయమే రాజకీయ చర్చలు చాలావరకు రాజకీ‹

చైతన్యం ఉన్న విద్యాధికులకు పరిమితం అయితే సామాన్య కుంటుబీకులు మాత్రం ఒక్కసారి భారతదేశం వెళ్ళి గంగలో స్నానంచేసి కాశీ విశ్వేశ్వరుని సేవించుకోవాలని పగటికలలు కనేవారు వారి మాటలు వింటే నాకు నవ్వు వచ్చేది అలా పగటికలలు కనే వ్యక్తులు భారతపర్యటనకు రాలేరనేది అనుభవంమీద తెలుసుకున్న విషయం వేష భాషలలో మాత్రం వారిలో పెద్దమార్పు వచ్చినట్లు కనిపించేదికాదు

సూవాలో ఎక్కడికి వెళ్ళినా భారతీయ వాతావరణం కనిపిస్తుంది అక్కడ చెరకుపంట చాలావరకు పాత పద్ధతులలోనే జరుగుతున్న దనిపించింది అనేకమంది భోజనానికి ఆహ్వానించేవారు భోజన విషయంలో మాత్రం నూటికి నూరుపాళ్ళు భారతీయ వంటకాలు తింటూ ఉంటే భారతీయులు భోజనప్రియులేమో అనిపించేది భోజనానంతరం తాంబూలం వేసుకోవడానికి ఆస్ట్రేలియాలో అవకాశం ఉండేదికాదు కాని ఫిజీలోని పాతకాలం భారతీయులు తాంబూల చర్వణం చేయటం చూచి ఆశ్చర్యపోయాను అప్పటి రోజుల్లో నాకుకూడా తాంబూలం సేవించే బలహీనత ఉండేది కాని ఆస్ట్రేలియాలో దొరకనందున నోరు కట్టేసుకున్నాను ఫిజీలో తమలపాకులు, పచ్చివక్క దొరికేవి ఏదో ప్రియాతిప్రియమైన వస్తువు దొరికినట్టు సంతోషపడి తాంబూలం అడిగి మరీ తెప్పించుకుని తినేవాణ్ణి అందుకే కాబోలు ఎవరి వెఱ్ఱి వారికి ఆనందం అన్నారు

ఫిజీలో అనేక దీవులు ఉన్నాయి కాని ఒకటి రెండు దీవులలో తప్ప మిగిలిన దీవులలో హెచ్చుమంది జనాభా ఉన్న లక్షణాలు లేవు భారతీయ సంతతి ప్రజలు చాలావరకు సూవాలోను, నందిలోను ఉన్నారు సూవా పట్టణంలో అనేక సరుకులు దిగుబడి సుంకం లేకుండా చౌకగా దొరికేవి అటువంటి సరుకులు అమ్మడానికి ప్రత్యేక మార్కెట్టు ఉంది ఇక పర్యాటకులకు ఫిజీలోని సముద్రతీరం బీచ్‌లు ముఖ్య ఆకర్షణ ఒకనాడు అందరు టూరిస్టులలాగే నేనుకూడా సముద్రంలోని వింతలు చూడ్డానికి టూరిస్టు డిపార్టుమెంటువారి లాంచీ ఎక్కాను ఆ లాంచీ క్రిందిబాగం ఫైబర్ గ్లాస్‌తో చేసినది లాంచీలో కూర్చుని క్రిందకు చూస్తే రంగురంగుల చేపలు, కోరల్స్ వివిధ సముద్రజీవజాలం కన్నుల పండువుగా కనిపిస్తుంది అది కోరల్ సముద్రం లాంచీలో ఫైబర్ గ్లాస్ మట్టులోనుంచి సముద్రంలోని వింతలూ విడ్డూరాలు చూస్తూ కూర్చుంటే అదొక ఆనందం అంతలో పర్యాటక శాఖకు చెందిన డైవర్ లాంచిమీదనుంచి సముద్రంలోనికి దూకి దొరికినన్ని రంగుల కోరల్స్ చేపలు తెచ్చి లాంచిమీద పడవేసేవాడు వాటి అందాలు చూస్తూ సృష్టిలోని విచిత్రాలగురించి మాట్లాడుకుంటూ తీరం చేరాం

మనదేశంలో న్యూజిలాండ్ గురించి చాలా మందికి తెలియదు పర్వతారోహణలో సరదా ఉన్నవారికి ఎడ్మండ్ హిల్లరీ హిమాలయాల ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించి విజయం సాధించాడని తెలుసు కాని ఆయన న్యూజిలాండు దేశస్థుడని కొద్దిమందికి తెలుసు నిజానికి క్రికెట్ ఆటగాళ్ళకు తప్ప మిగిలిన భారతీయులకు న్యూజిలాండులో ఆకర్షణలేదు అంతే కాకుండా అది చాలా చిన్న దేశం

న్యూజిలాండ్‌కి 1400 ప్రాంతంలోనే ఆసియాఖండం నుంచి మవురీలు వలస వచ్చారు పోలినేషియన్ జాతికి చెందిన మవురీలు నావికా వృత్తిలో అపూర్వసాహసం కలవారై సింహళం, థాయిలాండ్, ఇండోనేషియా మొదలగు దేశాలు సందర్శించి చివరకు మానవ నివాసం లేకుండా ఉన్న ఈ దీవులలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు వీరు వ్యవసాయం చేపల పరిశ్రమపై ఆధారపడుతూ ఉండేవారు వీరి పూర్వులు భారతదేశంలో నివసించేవారని ఒక వాదం ఉంది కాని ఆ విషయం ఈ కాలంలో వారికి తెలియదు 1840లో బ్రిటిషు వారు ఈ దీవులను స్వాధీనం చేసుకున్న తరువాత బ్రిటన్‌నుంచి తన సంతతివారిని న్యూజిలాండ్‌లో ప్రవేశ పెట్టడం మొదలుపెట్టారు అప్పటికే ఆ దీవులలో స్థిరనివాసం ఏర్పరచుకున్న మవురీ ప్రజలు తెల్లవారి రాకకు అభ్యంతరాలు చెప్పలేదు కాని వారు సాగుచేసుకున్న భూముల్ని తెల్లవారు బలవంతంగా స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించడంతో వారు తమ హక్కులకోసం పోరాడవలసివచ్చింది వారి తిరుగుబాటుని బ్రిటిష్‌వారు అణచివేసారు ఆతరువాత వారు క్రమంగా దేశం అంతా ఆక్రమించుకున్నారు బ్రిటన్‌కి వలసదేశంగా ఉండే న్యూజిలాండ్ 1931లో బ్రిటిష్ కామన్వెల్తులో భాగస్వామ్యం పొంది స్వపరిపాలనా దేశంగా పరిణతి చెందింది న్యూజిలాండ్ పార్లమెంటులో నలుగురు మవురీ ప్రజలకు ప్రాతినిధ్యం ఉంది న్యూజిలాండ్ జనాభాలో నూటికి 90శాతం పైగా బ్రిటిష్ జాతీయులు 7శాతం మవురీలు న్యూజిలాండ్‌లోని బ్రిటిష్ జాతీయులకు మవురీలకు మధ్యవున్న సుహృద్భావం, స్నేహసంబంధాలు ఆశ్చర్యం కలిగిస్తాయి ఆ రెండు జాతుల మధ్య ఏవిధమైన జాతి వివక్షత కన్ను పొడుచుకున్నా కనిపించదు మవురీలు ఈ నాటికీ వారి ఆచారవ్యవహారాలు పాటిస్తూ ఉంటారు నలుగురితో నారాయణా అన్నట్టు బ్రిటిషు పాలకులతోపాటు వారు కూడా ఇంగ్లీషు భాషే మాట్లాడుతారు పాతకాలపు మవురీ పెద్దలు వారి వేషభాషలు అవలంభించినా ఆధునిక మవురీ యువకులు యధా రాజా తధా ప్రజ అన్నట్టు పాలకుల వేషభాషలు అలవాటు చేసుకున్నారు

న్యూజిలాండ్‌లో భారీ పరిశ్రమలు చాలా తక్కువ పశువులు, గొర్రెల

పెంపకం ప్రధాన వృత్తి పాలపొడి, మాంసం, ఎగుమతి చేస్తారు జాతి గుర్రాలు వాటి జీవిత విశేషాలతో కూడిన రిజిష్టర్లు ప్రభుత్వం వద్ద ఉంటాయి భారత ప్రభుత్వం మన ప్రెసిడెంటు యొక్క బాడీగార్డు విభాగానికి కావలసిన గుర్రాలు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ దేశాలనుంచి కొనుగోలు చేస్తుంది గత 40ఏళ్ళనుండి న్యూజిలాండులో నిరుద్యోగం లేదు ప్రజలు సుఖజీవనం చేస్తారు ఉత్తరదీవిలో ఉన్న వెల్లింగ్టన్, ఆక్లండ్, దక్షిణదీవిలోని క్రైస్ట్ చర్చి ఒక మాదిరి పట్టణాలు పోతే హామిల్టన్, పాల్మర్స్టన్, డనీడిన్, మన తాలూకా పట్టణాల్లా వుంటాయి

న్యూజిలాండ్‌లోని పట్టణాలలో జీవనవిధానం చాల ప్రశాంతంగా ఒడుదుడుకులు లేకుండా ఉంటుంది ఆ దేశస్తులకు తమ మాతృదేశం ఇంగ్లండు అంటే బోలెడు అభిమానం వలస వచ్చి ఎన్ని ఏళ్ళయినా వారికి ఇంగ్లండు వెళ్ళడం అంటే సరదా అలా తమ మాతృదేశాన్ని చూడ్డానికెళ్ళే న్యూజిలాండు దేశస్థులను ఇంగ్లండు వెళ్ళేటప్పుడుకాని తిరిగి వచ్చేటప్పుడు కాని భారత దేశంలో ఆగి మా దేశంలోని అందాలు కూడా చూచి వెళ్ళమని చెప్పడానికి ఆస్ట్రేలియానుండి న్యూజిలాండ్ కూడా వెళ్ళేవాణ్ణి నిజంగా న్యూజిలాండ్‌నుంచి పర్యాటకులుగా వచ్చేవారి సంఖ్య చాలా స్వల్పం ఎయిర్ ఇండియా న్యూజిలాండ్ వెళ్ళకపోయినా ఆ దేశంలో వారి ప్రతినిధులతో ఆఫీసులు ఉంటాయి ఆస్ట్రేలియానుంచి భారత టూరిస్టు ఆఫీసర్లకు అక్కడ మకాం ఏర్పాట్లు ట్రావెల్ ఏజంట్లను కలుసుకొనే ఏర్పాట్లు ఎయిర్ ఇండియా ఏజంట్లు చేసి పెడతారు

నేను ఒకసారి న్యూజిలాండ్ వెళ్ళిన సందర్భములో జరిగిన ఒక సంఘటన ఎన్నటికీ మర్చిపోలేను నేను వియత్నాం గురించి వ్రాసిన గ్రంథం లండన్‌లో అచ్చయి న్యూజిలాండ్ యూనివర్శిటీకి చేరింది టూరిస్టు డైరెక్టర్ మూర్తి న్యూజిలాండ్‌లో పర్యటిస్తున్న వార్త స్థానిక దినపత్రికలలో చూచి ఒక పత్రికేయునికి ఆ గ్రంధకర్త ఈ టూరిస్టు డైరెక్టరు ఒకడేనా అని సందేహం వచ్చింది ఆ సందేహ నివృత్తికోసం ఒకరోజు తెల్లవారకుండా నేను మకాం చేసిన హోటల్‌కువచ్చి నన్ను కలుసుకున్నాడు ఆ గ్రంథకర్తను నేనేనని తెలుసుకొని అతడు బోలెడు ఆనందించాడు ఇంటర్వ్యూ అన్నాడు ఆ మరునాడు మూర్తిగారు వియత్నాం గురించి చెప్పిన విషయాలు ఆ పత్రికలో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి భారతదేశంలోని టూరిస్టు ఆఫీసర్లలో కూడా గ్రంథకర్తలుంటారని న్యూజిలాండ్ ప్రజలు సంతోషించారు ఇక ఎయిర్ ఇండియా ప్రతినిధుల ఆనందానికి అవధులు లేవు అయితే ఆ ఇంటర్వ్యూ కాపీ ఢిల్లీలోని విదేశవ్యవహారాల శాఖకు చేరేసరికి ప్రభుత్వం నామీద విరుచుకుపడింది ఆ రోజుల్లో వియత్నాం సమస్య జటిలంగా ఉంది

పర్యాటకుల్ని భారతదేశం రావడానికి ప్రోత్సహించమని పంపితే వియత్నాం సమస్యకు పరిష్కారమార్గాలు చెపుతున్నావా? అని భారతప్రభుత్వం నన్ను సంజాయిషీ కూడా అడక్కుండా కోప్పడింది

న్యూజిలాండ్‌లో ఉన్న ప్రకృతి వైపరీత్యాలు సహజసౌందర్యం కన్నుల పండువుగా ఉంటుంది భారతదేశం వచ్చి మాదేశంలోని అందాలు చూడమని చెప్పడంతోపాటు వారి దేశంలో ఉన్న ఆకర్షణలు చూడ్డం ఉద్యోగధర్మంగా భావించేవాణ్ణి రొటరువాలో ఉన్న అగ్నిపర్వతం అవశేషాలు చూడ్డానికి వెళ్ళాను ఆ ప్రదేశం అంతా ఎక్కడ చూచినా ఉడుకుతున్న మట్టితో కుతకుతలాడుతూ కనిపించింది స్థానికుల కథనం ప్రకారం ఆ ప్రదేశమంతా ఇంకా పూర్తిగా చల్లారని అగ్ని పర్వతం అవశేషాలతో నిండి ఉంది రాత్రింబవళ్ళు అలా ఎత్తుగా లేస్తూ ఉంటుంది ఆ ప్రదేశాలచుట్టూ ప్రేక్షకులకు ఏవిధమైన అపాయం రాకుండా కంచెలుకట్టి ఉంచుతారు అయితే ఉడికే మట్టిని ఎంతసేపు చూడగలం అందుమూలంగా రొటరువా విద్యుత్‌కేంద్రాన్ని చూడ్డానికి వెళతారు ప్రజలు దాని ప్రత్యేకత ఏమిటంటే అగ్నిపర్వతం అవశేషాలద్వారా ఉత్పత్తి అయ్యే శక్తినుంచి విద్యుత్‌ను తయారుచేయడం న్యూజిలాండ్ విజ్ఞానవేత్తల సామర్థ్యానికి అది మచ్చుతునక చిత్రం ఏమిటంటే ఆ ప్రాజెక్టునుంచి విద్యుత్‌తో పాటువచ్చే జలాల్ని పంటలకు ఉపయోగించడం చూడముచ్చటగా ఉంటుంది రొటరువా చూడ్డానికి వెళ్ళే ప్రజలకోసం కట్టిన టూరిస్టు ఇన్‌లో మకాంచేస్తే అర్ధరాత్రి కూడా హాయిగా స్విమ్మింగ్ పూల్ లో వేడినీళ్ళలో ఈతలు కొట్టవచ్చు

హామిల్టన్‌కి కొద్దిదూరంలో కొండగుహాలు ఉన్నాయి వాటిని చూడ్డానికి ప్రజలు తండోపతండాలుగా వెళుతూ ఉంటారు వాటి ఆకర్షణ రెండురకాలు ఎల్లప్పుడూ పడే చల్లటి నీటి ప్రభావంవల్ల తయారైన మంచుశిలలు ప్రజలకు మంచి ఆకర్షణ రెండవది మిణుగురు పురుగుల వెలుగులో బోటుషికారు ఆ గుహలో ఒక పావు కిలోమీటరువరకు విస్తరించిన అంతపెద్ద లోతులేని నీటిప్రవాహం ఉంది దానిని నీళ్ళతో నిండిన గుహ అనవచ్చు ఆ దారి అంతా లక్షలాది మిణుగురు పురుగులు వెలుగుతో ప్రకాశిస్తూ ఉంటుంది మనల్ని బోటుషికారు తీసుకువెళ్ళే పెద్దమనిషి చప్పుడు చేయకుండా బోటును తోసుకుంటూ వెడతాడు నావలో కూర్చున్నవారు ఏవిధమైన శబ్దం చేయకూడదు చప్పుడు వినపడితే మిణుగురు పురుగులు ముడుచుకుపోతాయి ఆ షికారు చేసి బైటపడేసరికి దివినుంచి భువికి వచ్చినట్టనిపిస్తుంది

న్యూజిలాండ్‌లో 2517 మీటర్ల ఎత్తులో ఉన్న తార్నికి అగ్నిపర్వతం నీడలో సిన్ ఫ్యూయల్ ప్లాంట్ ఉంది ఆదేశం దక్షిణ తీరానికి 34కిలోమీటర్ల

దూరంలో ఉన్న సహజ వాయువు నిక్షేపం ప్రపంచంలోకెల్లా పెద్ద రిజర్వు ఆయిల్ నిక్షేపాలు లేని న్యూజిలాండ్ సహజవాయువును పెట్రోలుగా మార్చే అత్యంత సాహసోపేతమైన ప్రక్రియ ప్రారంభించినదని చదివి చాలా సంతోషించాను

వెల్లింగ్‌టన్‌లో ఉన్న సమయంలో న్యూజిలాండులో భారత హైకమిషనర్ ఆఫీసునుంచి టెలిఫోన్ వచ్చింది హైకమిషనర్ లంచ్‌కి ఆహ్వానించాడు హైకమిషనర్ నా పూర్వమిత్రుడు విష్ణు అహూజా అని తెలుసుకుని చాలా సంతోషించాను నేను వియత్నాంనుంచి మాస్కో వెళ్ళినప్పుడు విష్ణు మన ఎంబసీలో ఫస్ట్ సెక్రటరీగా ఉండేవాడు చాలా సరదామనిషి అతని భార్య అమీనా ముస్లిం రష్యన్ భాషలో దిట్ట వెల్లింగ్‌టన్‌లో విష్ణు అహూజాతో లంచ్ పాత విషయాలు నెమరువేసుకోవడానికి పనికివచ్చింది అప్పటికి ఆస్ట్రేలియాలో నా ఉద్యోగ పరిమితి కూడా పూర్తి అయిపోయింది భారతదేశానికి తిరిగి వెళ్ళేసమయం దగ్గరపడింది

మెల్బోర్న్ తిరిగివచ్చేసరికి డైరెక్టరు జనరల్ సోమనాథ్ ఛిబ్‌వద్దనుంచి జాబు నన్ను మద్రాసు రీజినల్ ఆఫీసుకి బదిలీ చేసారు మద్రాసు ఆఫీసులో ఏవో గొడవలు ఉన్నాయి కాబట్టి నన్ను వెంటనే అక్కడ జాయిన్ కావలసినదిగా వ్రాసారు నేను ఆస్ట్రేలియాలో ఉన్నరోజుల్లో మా అన్నయ్య చనిపోవడం మూలంగా ఇంటికి వెళ్ళికాని మద్రాసు వెళ్ళలేనని జాబు వ్రాసి తిరుగు ప్రయాణం ఏర్పాట్లలో ఉన్నాను అప్పటికింకా విదేశాలలో నియమించబడ్డ ఆఫీసర్లు ఎయిర్ ఇండియాలోనే ప్రయాణం చేయాలనే నియమం అమలులోకి రాలేదు అందుమూలంగా తిరుగు ప్రయాణం ఓడలోనే! మొత్తం అంతా ఎయిర్‌కండిషన్ చేసిన ఇటాలియన్ ఓడలో ప్రయాణం నేను ఆస్ట్రేలియాలో ఉన్న విదేశీ టూరిస్టు డైరెక్టర్ల సంఘానికి ప్రెసిడెంటుని కావడం మూలంగా ఇటాలియన్ ఓడ కంపెనీ వారు టూరిస్టు టిక్కెట్టుకి ఫస్టుక్లాసులో గది ఇచ్చారు ఇక ఓడ మెల్బోర్న్ వదిలే రోజు వచ్చింది నిజానికి ఉద్యోగరీత్యా మూడేళ్ళు గడిపినా ఓడలో నన్ను చూడ్డానికి వచ్చిన మిత్రులు కళ్ళవెంట నీళ్ళు పెట్టుకోవడం నన్ను ఆశ్చర్యపరిచింది ఇక మిత్రురాలు డయానా వీడ్కోలు సీను భరించలేక వెళ్ళిపోయింది ఎయిర్ హోస్టెస్ మిత్రురాలు సింగపూర్‌లో కలుసుకుందామని సెలవు తీసుకుంది, భారతీయ మిత్రులంతా ఓడమీదకు వచ్చారు వీడ్కోలు చెప్పడానికి మూడేళ్ళు ఆస్ట్రేలియాలో గడిపి మంచి మిత్రుల్ని వదలి బరువు గుండెతో ఆ దేశం వదిలాను.

# ప్రతిభకు పట్టం

జీవితంలో మరొకమార్పు ఈ మార్పే నా ప్రతిభకు పట్టం కట్టినట్లుగా భావిస్తాను దీనితో నాకు మంచి పేరు కూడా లభించింది దానియొక్క వివరాలు చెప్పేముందు మద్రాసు టూరిష్టు ఆఫీసులో జరిగిన ఒక సంఘటన

నేను ఆస్ట్రేలియానుంచి తిరిగి వచ్చి బారత ప్రభుత్వ టూరిష్టు ఆఫీసు మద్రాసులో రెండవ దఫా డైరెక్టరు ఉద్యోగం చేయవలసి వచ్చింది అప్పటికి మిత్రుడు కున్‌వర్ రాజ్‌సింగ్ డైరెక్టరుగా ఉన్నాడు నేను ఆస్ట్రేలియా వెళ్ళేముందు అతడు అసిస్టెంటు డైరెక్టరుగా ఉండేవాడు అతగాడి మీద రెండు అభియోగాలున్నాయి వాటిని నన్ను విచారించమని శ్రీ ఛిబ్ సలహా ఇప్పుడు అతడు నాతో సమానమైన హోదా కలిగిన ఉద్యోగి కాబట్టి నేను ఆయనపై వచ్చిన అభియోగాలు పరిష్కరించడం బాగోదు కాబట్టి ఢిల్లీ నుంచి మరొక సీనియర్ ఆఫీసర్ని పంపవలసినదిగా వ్రాసాను మిత్రుడు సింగ్ నాకు చార్జి అప్పగించి సెలవు మీద మద్రాసులోనే ఉన్నాడు పిల్లల చదువుకోసం ఆయనపై వచ్చిన అబియోగాల గురించి విచారించడానికి డెప్యూటీ డైరెక్టరు జనరల్ శ్రీ గెయింద్ మద్రాసు వస్తున్నాడని తెలిసిపోయింది

అసలు మిత్రుడు సింగ్‌పై వచ్చిన అభియోగాలు చాలా చిత్రమైనవి మద్రాసుకి 35 మైళ్ళ దూరంలో ఉన్న మహాబలిపురంలో ఉన్న టూరిస్టు బంగాళా యాజమాన్యం అప్పట్లో మద్రాసు ఆఫీసుక్రింద ఉండేది డైరెక్టరు ఎప్పుడు కావాలంటే అప్పుడు మహాబలిపురం టూరు వేసుకువెళ్ళి 35 రూపాయలు బిల్లు తీసుకోవచ్చును అయితే శ్రీ కున్‌వర్ రాజ్‌సింగ్ ఒకసారి మహాబలిపురం తమిళనాడు ప్రభుత్వ టూరిస్టు డైరెక్టరు కారులో వెళ్ళి ట్రావెలింగ్ అలవన్సుకి బిల్లు పెట్టి డబ్బు తీసుకున్నాడు అలాగే మరొకసారి మద్రాసులోని ఇంపీరియల్ హోటల్ మేనేజర్ కారులో మహాబలిపురం వెళ్ళి తన కారులో వెళ్ళినట్టు బిల్లు పెట్టుకుని డబ్బులు తీసుకున్నాడు అవీ అభియోగాలు

ఈ విషయం ఢిల్లీలో డిపార్టుమెంటుకి తెలియడం, దానిని డైరెక్టరు జనరల్ మంత్రి సీరియస్‌గా పరిగణించడం వాటిపై విచారణ జరపాలని నిర్ణయించడం జరిగింది ఢిల్లీనుంచి శ్రీ గెయింద్ విచారణకు వస్తున్నాడని తెలిసి శ్రీ సింగ్ భార్యాపిల్లలతో తమిళనాడు ప్రభుత్వ టూరిస్టు డైరెక్టరు శ్రీ కులైందవేలు యింటికి రాత్రివేళ వెళ్ళి ఆయన కాళ్ళమీదపడి తన ఉద్యోగం కాపాడమని

వేడుకున్నాడు అప్పటికి ఆ కుటుంబాన్ని సముదాయించి పంపివేసి ఆ మరునాడు కులైందవేలు నా ఆఫీసుకి వచ్చాడు విషయం చెప్పి నా సలహా అడిగాడు శ్రీ సింగ్ ఒకసారి మహాబలిపురం శ్రీ కులైందవేలు కారులో వెళ్లి దానికి బిల్లు వ్రాసుకుని డబ్బుతీసుకున్న మాట వాస్తవం కులైందవేలుకి ఏమిచేయడానికి తోచలేదు 35 రూపాయలకు పెద్ద ఉద్యోగి కక్కుర్తిపడితే దాని ఫలితం అనుభవించ వలసినదేనన్నాను ఏదో పిల్లలు గలవాడు అతడి ఉద్యోగం పోతుందేమోనని కులైందవేలు జాలిపడ్డాడు శ్రీ సింగ్ ఇంపీరియల్ హోటల్ వాళ్లను బ్రతిమాలుకున్నాడు ఆ మేనేజరు నావద్దకు వచ్చి పరిస్థితి చెప్పి తాను మద్రాసు వదలి వెళ్ళిపోతున్నానన్నాడు

అనుకున్న రోజున శ్రీ గెయిండ్ మద్రాసు వచ్చాడు శ్రీ కులైందవేలు చాలా తెలివిగా తప్పించుకున్నాడు తాను సింగ్ కలిసి మహాబలిపురం చాలాసార్లు వెళ్ళామని అంగీకరిస్తూ అభియోగంలో చెప్పబడిన తేదీనాడుకూడా మహాబలిపురం వెళ్ళాం కాని ఇద్దరం కలసి తన కారులో వెళ్ళామో సింగ్ కారులో వెళ్ళామో గుర్తు లేదన్నాడు సరే యిక ఇంపిరియల్ హోటల్ మేనేజరు మద్రాసులోనే లేడు శ్రీ గెయిండ్ విచారణలో శ్రీ సింగ్‌పై వచ్చిన అభియోగాలు నిరూపించబడలేదని రిపోర్టు వ్రాసాడు ఆ తరువాత శ్రీ సింగ్ మద్రాసునుంచి ఢిల్లీ బదిలీ అయ్యాడు ఆ తరువాత విదేశాలలో కూడా పనిచేసినట్టు విన్నాను అతడు 35 రూపాయల కోసం కక్కుర్తిపడి దానిలోనుంచి తప్పించుకోవడానికి కరిచిన గడ్డి, పడ్డ అవస్థలు ఆయన జీవితంలో మర్చిపోయి ఉండడని అనుకుంటాను

మైసూరులో జరిగిన టూరిస్టు డెవలప్‌మెంటు కౌన్సిల్ సమావేశాల అనంతరం మిత్రుడు డా॥ కూనపరెడ్డి కృష్ణారావు ఢిల్లీలో తమ ఆధ్వర్యంలో నిర్వహించబడే ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్‌నేషనల్ లా సంస్థకు నన్ను డైరెక్టరుగా రమ్మని అడిగాడు అయితే టూరిస్టు డైరెక్టరు ఉద్యోగం నుంచి ఇంటర్‌నేషనల్ లా సొసైటీ డైరెక్టరుగా వెళ్ళడానికి నా అర్హత ఏమిటో నాకు అర్థం కాలేదు ఆ మాటే అన్నాను కృష్ణారావుతో దేశంలోని అనేక విశ్వవిద్యాలయాల్లో ఇంటర్ నేషనల్ లా బోధించే ఉపాధ్యాయులు ప్రపంచ దేశాలలో ఇంటర్‌నేషనల్ లా నిర్వహించే యూనివర్శిటీలలోని ప్రొఫెసర్లు నన్ను ఇంటర్‌నేషనల్ లా సొసైటీ డైరెక్టరుగా అంగీకరిస్తారా? అనే అనుమానం కూడా వ్యక్తం చేసాను శ్రీ కృష్ణమీనన్ అధ్యక్షతలో నిర్వహించబడే ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్‌నేషనల్ లా సంస్థకు డాక్టరు కృష్ణారావు ఆయువుపట్టు ఆ సంస్థకు అతడు కార్యనిర్వాహక అధ్యక్షుడు నేను లండను విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు తీసుకున్నాను కాబట్టి

ఇంటర్‌నేషనల్ లా సొసైటీకి డైరెక్టరుగా పనికివస్తానని కృష్ణారావు నిర్ణయించాడు అదంతా చూస్తే వడ్డించేవాడు మనవాడైతే అనే సామెత గుర్తుకు వచ్చింది

అప్పటికి కృష్ణారావు ఏడు సంవత్సరాలు యునైటెడ్ నేషన్స్ లీగల్ డివిజన్‌లో అమెరికాలో పనిచేసి భారత విదేశవ్యవహారాల లీగల్, ట్రీటీస్ డివిజన్‌లో లీగల్ అడ్వయిజర్‌గా ఢిల్లీలో పనిచేస్తున్నాడు అంతవరకు ఇంటర్నేషనల్ లా సొసైటీకి డైరెక్టరుగా పనిచేసిన చాకో ఢిల్లీ విశ్వవిద్యాలయంలో పొలిటికల్ సైన్సు ప్రొఫెసర్‌గా పని చేసిన అనుభవశాలి ఆయన భార్య అమెరికను డాక్టరు వారిద్దరు వృద్ధాప్యాన్ని అమెరికాలో గడపడానికి నిర్ణయించుకుని అమెరికా వెళ్ళిపోయారు ఆయనతోపాటు నేను కూడా ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా సొసైటీస్థాపక సభ్యుణ్ణి నా సేవలు కావాలనుకుంటే ఆ విషయం కేంద్రటూరిస్టు మంత్రితో చర్చించి నా సేవలు ఇంటర్నేషనల్ లా సొసైటీకి మార్చడానికి ప్రభుత్వం అంగీకరించేటట్టు చేయమని కృష్ణారావుకి చెప్పాను ఆ తరువాత ఆ విషయం అంతగా పట్టించుకోలేదు కేంద్ర టూరిస్టు మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి మద్రాసు రావడం తటస్థించింది ఆయన తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరస్వామిని సేవించుకొని మద్రాసు రైలులో వచ్చారు కేంద్ర ప్రభుత్వ అధికార బృందం అంతా మంత్రిని సెంట్రల్ స్టేషనులో కలుసుకుని నమస్కారాలతో ఆహ్వానించారు ఆయన అధికారులతో మాట్లాడుతూ తాను ఆ మరునాడు కొచ్చిన్‌లో జరగబోయే కాంగ్రెస్ కార్యవర్గసమావేశానికి వెళుతున్నాను కాబట్టి ఎవరూ విమానాశ్రయానికి రావనవసరం లేదని చెప్పారు అయితే ఆయన తత్వం బాగా ఎరుగున్న మిత్రులు మాత్రం ఆయన ఎవరూ విమానాశ్రయానికి రానవసరం లేదని చెప్పి వెళితే సంతోషిస్తారని చెప్పారు తెల్లవారుఝామున నా కారులో మీనంబాకం విమానాశ్రయానికి బయలుదేరాను అప్పటికే మంత్రిగారు ప్రయాణం చేయవలసిన విమానం సిద్ధంగా ఉంది కారు స్పీడు హెచ్చించాను అంత ప్రొద్దుటే ఎలావచ్చారో ట్రాఫిక్ పోలీసులు నా కారు ఆపారు హెచ్చు స్పీడులో వెళుతున్నందుకు కేసు వ్రాయాలన్నారు నా కార్డు పోలీసు ఆఫీసరుకి యిచ్చి నేను అర్జెంటుగా విమానాశ్రయానికి వెళ్ళాలని చెప్పి వెళ్ళిపోయాను సరిగ్గా నా కారు పార్కు చేసేసరికి మంత్రిగారి కారుకూడా వచ్చింది

మంత్రిగారికి ఒక నమస్కారం చేసి విమానాశ్రయంలో కార్యకలాపాలు చూస్తున్నాను శ్రీ సంజీవరెడ్డి ఎయిర్‌పోర్టులో మంత్రుల గదిలో కూర్చున్నారు చిత్రం ఏమిటంటే ఆయన రానవసరం లేదన్నా మొత్తం కేంద్ర

ప్రభుత్వ అధికారబృందం అంతా అక్కడ ఉంది అంతలో ఎయిర్‌పోర్టు అధికారి ప్రధాన్ నన్ను వెతుక్కుంటూ వచ్చాడు విశేషం ఏమిటంటే మంత్రిగారు నా గురించి అడుగుతున్నారు ఆయన్ని చూడ్డానికి వెళ్ళాను "మూర్తీ, నువ్వు యింకా మద్రాసులోనే ఉన్నావేమిటి నీ సేవలు ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్‌నేషనల్ లా సంస్థకి యివ్వడానికి అంగీకరిస్తూ కాగితాలపై సంతకం చేసాను" అన్నారు వాళ్ళు ఇచ్చే జీతం టూరిష్టు డిపార్టుమెంటులో ఎంతకాలం పనిచేసినా సంపాదించలేవనే ఉద్దేశంతో నీ సేవలు సొసైటీకి ఇవ్వడానికి అంగీకరించానని మంత్రి అన్నారు ఆ గదిలో ఉన్న ప్రభుత్వ అధికారులంతా ఆశ్చర్యంగా చూస్తూ కూర్చున్నారు మంత్రిగారు కొచ్చిన్ వెళ్ళిపోయారు విమానాశ్రయంనుంచి ఇంటికి వెళుతూ ఆలోచించాను ప్రభుత్వోద్యోగులకు ఓ డిపార్టుమెంటు నుంచి మరొక డిపార్టుమెంటుకి డెప్యుటేషన్ యివ్వడానికి పెద్ద సమస్య ఉండదు కాని ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా సంస్థలో ఉద్యోగం ప్రభుత్వోద్యోగం కాదు అయినా పెద్దలంతా, తలుచుకున్నారు కాబట్టి నాకు డెప్యుటేషన్ యివ్వడం సాధ్యపడింది ప్రభుత్వంనుంచి ఆర్డర్లు వచ్చాయి వీడ్కోలు సన్మానాలు పెద్ద ఎత్తున జరిగాయి తమిళనాడు ట్రాన్సుపోర్టు కార్యదర్శి శ్రీ శంకరన్ ఐ ఎ ఎస్ అధ్యక్షతన జరిగిన వీడ్కోలు సన్మానం మరువరాని అనుభూతి

నేను ఢిల్లీ చేరేసరికి కృష్ణారావు దేశంలో లేడు శ్రీ కృష్ణమీనన్‌ని కలుసుకుని ఉద్యోగ బాధ్యతలు స్వీకరించవలసినదని జాబువ్రాసి కృష్ణారావు విదేశ పర్యటనకు వెళ్ళాడు ఒక ఉదయం కృష్ణమీనన్ ఇంటికి వెళ్ళి నన్ను నేను పరిచయం చేసుకున్నాను నిజంగా క్రొత్తగా వచ్చే డైరెక్టరు ఎవరో ఆయనకు తెలియదు నన్ను చూడగానే "ఓహో నువ్వా? ఎవరో అనుకున్నాను" అని ఆహ్వానించారు ఆయన లండనులో భారత హైకమిషనరుగా ఉన్న రోజుల్లో నేను లండను విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉండి ఆర్థిక యిబ్బందులవల్ల పడ్డ అవస్థలు ఆయనకు గుర్తు ఉండటం నన్ను ఆశ్చర్యపరిచింది నన్ను కొత్త డైరెక్టరుగా శ్రీ కృష్ణమీనన్ ఆమోదించడం కొండంత బలమిచ్చింది ఆయన ఆశీర్వాదాలు పొంది సొసైటీ ఆఫీసుకి చేరాను సొసైటీ ఆఫీసులు 7 - 8 నెంబరు సింధియాహౌస్ మొదటి అంతస్తులో ఉన్నాయి సింధియాహౌస్ కన్నాట్ సర్కస్ పరిధిలో కస్తూరిబా గాంధీ మార్గ్ ప్రారంభంలో ఉంది ఆఫీసులో సొసైటీ ప్రారంభంనుంచి కార్యదర్శిగా ఉన్న కుమారి మాలతీ మీనన్, శ్రీమతి ఆనంద్ శ్రీ ఫ్రాన్సిస్ ఉండేవారు ఫ్రాన్సిస్ మొత్తం సొసైటీ వ్యవహారాలన్నీ అత్యంత సమర్ధవంతంగా నిర్వహించేవాడు వీరు కాక రిసెర్చి ఆఫీసర్లుగా

హేమాహేమీలు ఉండేవారు సొసైటీ ఆధ్వర్యంలో ఇంటర్నేషనల్ లా జర్నల్ ఒకటి ప్రచురించబడేది ఈ కార్యక్రమాలన్నింటికి నిధులు విదేశాంగ శాఖవారు ఇచ్చేవారు

డాక్టరు కృష్ణారావు విదేశాలనుంచి తిరిగివచ్చిన తరువాత తీరిగ్గా కూర్చుని ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా వ్యవహారాలు చర్చించడానికి అవకాశం దొరికింది అంతవరకు ప్రొఫెసర్ చాకో సంస్థకు సెక్రటరీ జనరల్ గాను అకాడమీ ఆఫ్ ఇంటర్నేషనల్ లాకి డైరెక్టరు ఆఫ్ స్టడీస్ గాను పనిచేసారు ఆయన అమెరికా వెళ్ళిపోవడంతో ఆ భారం అంతా నాపై పడింది సొసైటీకి మంచి లైబ్రరీ ఉంది సొసైటీ ఇంటర్నేషనల్ లా లో మూడు నెలల సర్టిఫికేట్ కోర్సు నిర్వహించేది ఆ కోర్సు చేసినవారికి శ్రీ కృష్ణమీనన్ నేను సంతకాలు చేసి సర్టిఫికేట్లు యిచ్చేవాళ్ళం ఆ కోర్సు విషయంలో శ్రీ కృష్ణమీనన్ అభిప్రాయాలు చిత్రంగా ఉండేవి ఆ కోర్సు పూర్తి చేసినవాడు మూడు నెలలు ఇంటర్నేషనల్ లా లో ఉపన్యాసాలు వినడానికి హాజరయ్యేవారు మాత్రమే గాని ఇంటర్నేషనల్ లా లో వారి పరిజ్ఞానాన్ని పరీక్షించి యిచ్చిన సర్టిఫికేట్ కాదని అనేవారు అయితే ఏ విశ్వవిద్యాలయానికి సంబంధం లేకుండా మేము యిచ్చే సర్టిఫికేట్‌లు విద్యార్థులకు ఎంతవరకు ఉపకరిస్తాయి అనే విషయంలో మేము వారికి ఏవిధమైన ధైర్యం చెప్పలేకపోయేవాళ్ళం అయినా ప్రతి సర్టిఫికేటు కోర్సులోను అనేకమంది చేరేవారు వారి క్లాసులు సాయంకాలం ఉండేవి ఉపన్యాసకులుగా అకాడమీలో ఉండే రిసెర్చి ఆఫీసర్లు, ఢిల్లీ విశ్వవిద్యాలయంలోని ఉపన్యాసకులను ఉపయోగించేవారం ఆయనకు బుద్ధి పుట్టినప్పుడు శ్రీ కృష్ణమీనన్ టెలిఫోనుచేసి ఆ సాయంకాలం క్లాసు తీసుకుంటాననేవారు ఆ క్లాసులకు మేమంతా కూడా వెళ్లి కూర్చునేవాళ్ళం శ్రీ కృష్ణమీనన్ అంతటివ్యక్తి అకాడమీ క్లాసులో 15, 20 మంది విద్యార్థులకు ఇంటర్నేషనల్ సంస్థల గురించి ఉపన్యాసం చెబుతూ ఉంటే మాకు ఆశ్చర్యంగా ఉండేది గాని ఆయన మాత్రం ఉపన్యాసం తయారుచేసి క్లాసులో చక్కగా పాఠం చెప్పేవారు

ఇంటర్నేషనల్ లా సొసైటీని నిర్వహించడానికి భారత ప్రభుత్వం విదేశాంగశాఖ ప్రతిసంవత్సరం గ్రాంటు యిచ్చేది ప్రారంభంలో ఏడాదికి లక్ష రూపాయలు యిచ్చేవారు ఆ తరువాత విదేశాంగ శాఖవారు కోరిన విషయాలపై రిసెర్చి చేయడానికి గ్రాంటు యిచ్చేవారు శ్రీ యం చంద్రశేఖరరావు, చంద్రశేఖరన్ రాధాకృష్ణ రీసెర్చి ఆఫీసర్లుగా ఉండేవారు వారు మూడు మాసాలకొకసారి ప్రచురించబడే ఇండియన్ జర్నల్ ఆఫ్ ఇంటర్నేషనల్ లా

తయారు చేయడంలో తోడ్పడేవారు అప్పట్లో భారత రాష్ట్రపతి కార్యదర్శిగా పనిచేసే డాక్టరు నగేంద్ర సింగ్ ఐ సి ఎస్ మా సొసైటీకి వైస్ ప్రెసిడెంటు ఢిల్లీ విశ్వవిద్యాలయంలో రాజకీయ విభాగంలో ప్రొఫెసర్‌గా ఉండే డా॥ హరనాం సింగ్ మరొక వైస్ ప్రెసిడెంట్‌గా ఉండేవారు సొసైటీకి పాట్రన్‌గా ప్రధానన్యాయమూర్తి ఉండేవారు అధ్యక్షులు శ్రీ కృష్ణ మీనన్, డా॥కృష్ణారావు కార్యనిర్వాహణాధ్యక్షులు నేను అకాడమీకి డైరెక్టరు ఆఫ్ స్టడీస్‌గా జీతం పుచ్చుకునే ఉద్యోగం చేస్తు న్నాను సొసైటీకి సెక్రటరీ జనరల్‌ని, క్వార్టర్లీ పత్రికకు ఎడిటర్‌ని కూడా నేనే జనరల్ ప్రతి మూడు మాసాలకు ప్రచురించడం యజ్ఞం చేసినట్టే ఉండేది

ఇకపోతే సొసైటీ కోసం పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ హయాంలో ఆయన యిప్పించిన సింధియా హౌస్‌లోని రెండవ అంతస్తు అద్దె వ్యవహారాలు కూడా గొడవల్లో పడ్డాయి ఆ భవనం సర్ శోభాసింగ్‌ది ఆయన పెద్ద కుమారుడు ఢిల్లీలో ఉన్న వారి ఆస్తుల బాధ్యత వహించాడు ఆయన మరొక కుమారుడు కుష్వంత్‌సింగ్ ఆస్తి వ్యవహారాలు పట్టించుకునేవాడు కాదు వారి ఆస్తుల వ్యవహారాలు చూడ్డానికి ఒక ప్రత్యేకమైన విభాగం ఉండేది నేను సొసైటీలో చేరిన తరువాత అంతవరకు తేలని భవన అద్దె సమస్య రాజీ చేసుకుంటే పోతుందని నిర్ణయించాను ఆ మాటే శ్రీ కృష్ణమీనన్‌తో అన్నాను మా సంస్థలో ఉన్న వారంతా లాయర్లే కాని భవనం అద్దె విషయం చర్చించడానికి ఎవరికీ తీరికలేదు, ఓపికలేదు శ్రీ కృష్ణమీనన్ కూడా విసిగిపోయి ఆ సమస్యను నా యిష్టం వచ్చినట్టు పరిష్కరించమన్నారు భవనం యజమానుల లాయర్లతో రెండు సమావేశాలలో ఆ సమస్యను రాజీ చేసేసాను అద్దె భవనంలో సొసైటీని నిర్వహించడం అంత గౌరవనీయం అనిపించలేదు అప్పట్లో సుప్రీంకోర్టు పరిసరాలలో ఉన్న ఖాళీస్థలంలో కొంతభాగం ఇంటర్నేషనల్ లా సొసైటీకి భవన నిర్మాణంకోసం ఇప్పించవలసినదిగా ప్రభుత్వాన్ని కోరడం జరిగింది ప్రభుత్వం స్థలం యిచ్చింది కాని భవన నిర్మాణానికి కావలసిన నిధులు లేక చాలాకాలం ఆ స్థలం ఖాళీగానే ఉండిపోయింది

సొసైటీలో రిసెర్చి చేయడం అకాడమీలో సర్టిఫికేట్ కోర్సు నిర్వహించడానికి అలవాటు పడిపోయాను అయితే సంవత్సరానికొకసారి జరిగే సొసైటీ సమావేశాలకు రాష్ట్రపతిని ప్రారంభోత్సవానికి పిలిచే ఆనవాయితీ ఉండేది డాక్టరు జాకీర్ హుస్సేన్ రాష్ట్రపతిగా ఉండగా ఆయన్ని మా సమావేశానికి ఆహ్వానించాం కాని ఆయన ఆహ్వానాన్ని అంగీకరించిన మరుక్షణంనుంచి సెక్యూరిటీ వారు మా ఆఫీసు సమావేశ స్థలం మొత్తం

సింధియా హౌస్ యావత్తు ముస్తుడించేసారు మొదటి అంతస్తులోనికి వెళ్ళే లిఫ్ట్ ఎవ్వరూ ఉపయోగించడానికి లేదు విద్యుత్ సరఫరా మెయిన్ స్విచ్ వద్ద ఒక సెక్యూరిటీ గార్డుని పెట్టారు రెండు పెట్రోమాక్స్ లైట్లు సిద్ధంగా ఉంచారు సమావేశం జరిగే హాలులో ప్లాట్‌ఫారంపైకి ఎక్కడానికి ఉన్న మెట్లు కొద్దిగా కదులుతున్నాయి కాబట్టి వాటిని వెంటనే బాగు చేయించాలన్నారు రాష్ట్రపతి కూర్చోవడానికి కుర్చీ ఆయన నడవడానికి ఎర్రటి తివాచీ రాష్ట్రపతి భవనంనుంచి తెప్పించవలసి వచ్చింది ఈ ఏర్పాటులన్నీ ఒక ఎత్తు అయితే రాష్ట్రపతి చేయవలసిన ఉపన్యాసం తయారుచేసి దానిని ఆమోదింపజేయడం మరొక ఎత్తు డా|| నగేంద్రసింగ్ రాష్ట్రపతి కార్యదర్శిగా ఉండడం మా అదృష్టంగా భావించాము కాని ఒకసారి రాష్ట్రపతిని ఆహ్వానించిన అనుభవంతో మళ్ళా రాష్ట్రపతిని ఆహ్వానించడానికి సాహసించలేకపోయాం

ప్రపంచ న్యాయస్థానంలో పోలిష్ జడ్జి ప్రొఫెసర్ లాక్స్‌ని భారతదేశానికి ఆహ్వానించడానికి నిర్ణయించారు ఆయనను భారత దేశానికి పర్యాటకునిగా ఆహ్వానించారు కాని ప్రపంచకోర్టు జడ్జీలు ఏ దేశప్రభుత్వానికి అతిధులుగా వెళ్ళకూడదు అయితే ప్రపంచకోర్టులో పాకిస్తాన్ జడ్జిగా ఉన్న జఫరుల్లాఖాన్ ఆ నియమాన్ని ఉల్లంఘిస్తూ ఉండేవారు ప్రొఫెసర్ లాక్స్ భారత ప్రభుత్వ అతిధ్యం స్వీకరించడానికి అంగీకరించలేదు అందుమూలంగా ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా అతిధిగా రావలసినదని ఆహ్వానించారు ఆయన అంగీకరించారు ఆయన భారతదేశంలో ఉన్న సమయంలో ఢిల్లీ విశ్వవిద్యాలయం ఆయనకు గౌరవ డాక్టరేటు ఇచ్చే ఏర్పాటు కూడా చేసారు అంతా బాగానే ఉంది కాని ఆయన్ని తమ అతిధిగా మర్యాదలు చేయడానికి ఇంటర్నేషనల్ లా సొసైటీలో నిధులు ఏవి? ఏదో కేంద్ర ప్రభుత్వం ఇచ్చే గ్రాంట్‌తో కాలక్షేపం చేసే సొసైటీ వేలవేల రూపాయలు ప్రొఫెసర్ లాక్స్ కోసం ఖర్చు పెట్టే స్థితిలో లేదు ఆ విషయం నగేంద్ర సింగ్ కృష్ణారావుకి కూడా తెలుసు ప్రభుత్వంలో పరపతి ఉన్న అధికారులు కాబట్టి వారిద్దరు అవసరమైన నిధులు ఏర్పాటు చేసారు

ఒకరోజు నాకు విదేశాంగ శాఖనుంచి టెలిఫోను వచ్చింది సౌత్ బ్లాక్‌లో ఫలానా గదికి రమ్మని ఆహ్వానం సౌత్ బ్లాక్‌కి వెళ్ళాను ఆగదిలో ఉన్న ఆఫీసరు తలుపు గడియపెట్టి 25 వేలరూపాయలు నగదు నా చేతిలో పెట్టి ప్రొఫెసర్ లాక్స్‌ని ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా అతిధిగా చూడ్డానికి ఖర్చుపెట్టమని యిచ్చారు ప్రొఫెసర్ లాక్స్‌ని మా సొసైటీ అతిధిగా ఆయన్ని విమానాశ్రయంలో ఆహ్వానించి భారతదేశంలో ఆయన ఉన్నన్ని రోజులు మా అతిధిగా ఆయనకు బ్రహ్మరథం పట్టాము




ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా వార్షిక సదస్సులో
ప్రసంగిస్తున్న అప్పటి బారత రాష్ట్రపతి శ్రీ జకీర్ హుస్సేన్



అంతర్జాతీయ న్యాయస్థానం జడ్జి ప్రొపెసర్ లాక్స్ ఇండియన్ సొసైటీ
ఆఫ్ ఇంటర్నేషనల్ లా అతిదిగా బారతదేశం వచ్చిన సందర్భంలో

ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ప్రత్యేక సమావేశంలో ఛాన్సలర్ వి వి గిరి ప్రొఫెసర్ లాక్స్‌కి గౌరవ డాక్టరేటు పట్టా బహూకరించారు ఆయన ఎంతో సంతోషించాడు అప్పట్లో భారత రాష్ట్రపతిగా ఉండే శ్రీ గిరి శ్రీ లాక్స్ గౌరవార్థం రాష్ట్రపతి భవనంలో మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేసారు ఆ విందుకి నన్ను కూడా ఆహ్వానించారు శ్రీ లాక్స్‌ని అతిథిగా చూసే సొసైటీ సెక్రటరీ జనరల్‌గా నాకు రాష్ట్రపతి ఆహ్వానం వచ్చింది మా సొసైటీ తరపున ప్రొఫెసర్ లాక్స్ గౌరవార్థం రిసెప్షన్ ఏర్పాటు చేసాం సుప్రీంకోర్టు చీఫ్ జస్టిస్‌తో సహా సుప్రీంకోర్టు జడ్జిలు, ఢిల్లీ హైకోర్టుల జడ్జిలు ప్రభుత్వాధికారులు హాజరయ్యారు అది బ్రహ్మాండమైన పార్టీ దానికి కావలసిన డ్రింక్స్ విదేశాంగ శాఖ వారు యిచ్చారు ప్రభుత్వం అప్పుడప్పుడు విచిత్రంగా ఆలోచిస్తుంది కొన్ని బాటిల్స్ స్కాచ్ విస్కీ, కొన్ని బాటిల్స్ ఇండియాలో తయారైన విస్కీ ఇచ్చి పార్టీలో అతిథుల కోసం ఉపయోగించమన్నారు ఎవరికి స్కాచ్ విస్కీ, ఎవరికి ఇండియా విస్కీ ఇవ్వాలి అన్న మీమాంస వచ్చింది దానికి పరిష్కారం విదేశాంగ శాఖవారే చెప్పారు ముందు అందరికీ స్కాచ్‌విస్కీ ఇచ్చి ఆతరువాత ఇండియన్ విస్కీ యిమ్మన్నారు వారివాదం ఏమిటంటే మొదటి రెండు రౌండ్లు అయ్యేసరికి అతిథులు స్కాచ్‌కి ఇండియన్‌కి తేడా కనిపెట్టేస్థితి దాటిపోతారట! వెర్రివాళ్ళు అనుకున్నాం

ప్రొఫెసర్ లాక్స్ నోట్లో ఎప్పుడూ వెలిగించని సిగరెట్ ఉండేది పార్టీలలోకాని ప్రత్యేక సమావేశాల్లోకాని ఆయన నోట్లో సిగరెట్ అలాగే ఉండేది న్యాయాధిపతులు ప్రభుత్వ ఉన్నతాధికారులు, విదేశీరాయబారులు ఆయన సిగరెట్ వెలిగించడానికి పోటీపడేవారు అయితే ఆయన నిమ్మకు నీరెత్తినట్టు నవ్వుతూ "పరవాలేదు నా దగ్గర లైటరు ఉంది" అని తప్పించుకునేవారు ఆయనతో కలిసి పదిరోజులు దేశమంతా తిరిగినా పాత సిగరెట్ పారేసి కొత్తసిగరెట్ నోట్లో పెట్టుకోవడం తప్ప దానిని వెలిగించడం చూడలేదు చివరకు తేలినదేమిటంటే ఆయనకు గుండెజబ్బు వచ్చినప్పటినుండి డాక్టర్లు పొగ త్రాగవద్దన్నారట ఆ అలవాటునుండి బయట పడడానికి ఆయనచేసే ప్రయత్నమే ఆ వెలిగించని సిగరెట్టు ప్రొఫెసర్ లాక్స్‌కి ఉదయం ప్రయాణాలంటే నచ్చేవి కావు ఆయన రాత్రిళ్ళు ఎంతసేపైనా మెలుకువగా ఉండగలరు కాని ఉదయం పెందలాడే లేవడమంటే చాలా బాధపడేవారు ఆయన, నేను కలిసి మైసూరు, మద్రాసు వెళ్ళాం ఉదయం ప్రయాణాలు నిషేధం బెంగళూరులో శ్రీ లాక్స్ మైసూరు రాష్ట్రగవర్నరు శ్రీపాఠక్‌గారి అతిథిగా రాజభవనంలో మకాం నేను వెస్టెండ్ హోటల్‌లో దిగాను రాష్ట్రగవర్నర్ పాఠక్‌తో శ్రీ లాక్స్ స్నేహం యునైటెడ్ నేషన్సు

నాటిదట అప్పట్లో శ్రీ లాక్స్ యునైటెడ్ నేషన్సులో పోలిష్‌దేశ శాశ్వత ప్రతినిధిగా ఉండేవారు అప్పుడు శ్రీ పాథక్ భారత ప్రతినిధివర్గంలో సభ్యులుగా వెళ్ళేవారు బెంగుళూరులో వారిద్దరూ తమ పాత జ్ఞాపకాలు నెమరువేసుకుని ఆనందించారు అయితే రాజ్‌భవన్‌లో ఎన్ని సదుపాయలు ఉన్నా ఆయనకు కావలసిన బీర్ విస్కీలు మాత్రం నిషేధం అందువల్ల మధ్యాహ్న భోజనానికి రాత్రి భోజనానికి ముందు వెస్టెండ్ హోటల్‌కి వచ్చి ఒకటి అర డ్రింకు పుచ్చుకుని గవర్నరుగారితో భోజనానికి రాజభవన్‌కి వెళ్ళేవారు

మద్రాసు ప్రయాణం పూర్తి అయ్యేసరికి ఆయనకు మద్రాసు విశ్వవిద్యాలయంనుంచి గౌరవ డాక్టరేటు పుచ్చుకుంటే బాగుండు ననిపించింది మద్రాసు విశ్వవిద్యాలయం చాలా పురాతనమైనదని ఆయన సరదాపడ్డారు అయితే నగేంద్రసింగ్‌కి మద్రాసు విశ్వవిద్యాలయం అధికార వర్గాలలో అంత పరపతి లేనందున శ్రీ లాక్స్ సరదా తీరలేదు చిత్రం ఏమిటంటే ప్రొపెసర్ లాక్స్‌కి యూరప్‌లోను అమెరికాలోను అనేక యూనివర్సిటీలు గౌరవ డాక్టరేటులు యిచ్చాయి ఆయనకు గౌరవ డాక్టరేటు తీసుకోవడం సరదా అని నాకు అర్థం అయింది అయితే డా|| నగేంద్రసింగ్ ప్రొపెసర్ లాక్స్ విషయంలో యింత శ్రద్ధ తీసుకోవడానికి కారణం మొదట్లో నాకు అంతుచిక్కలేదు ఆ తరువాత అర్థమయినదేమిటంటే ప్రపంచ న్యాయస్థానంలో భారతదేశానికి అంతవరకు ప్రాతినిధ్యం లేనందున భారతదేశం పక్షాన డా|| నగేంద్రసింగ్ ప్రపంచ కోర్టులో జడ్జిగా పోటీ చేయడానికి నిర్ణయించి ఆయనకు మద్దతు కోసం ప్రొఫెసర్ లాక్స్‌ని భారతదేశానికి ఆహ్వానించి ఆయనకు గౌరవ డాక్టరేటు యిప్పించి ఆయన్ని సంతోషపెట్టారు ప్రొపెసర్ లాక్స్ అమెరికా విశ్వవిద్యాలయంలో ఎయిర్ లా పై ఉపన్యాసాలు చెప్పేవారు మా ఇండియన్ అకాడమీ ఆఫ్ ఇంటర్నేషనల్ లాలో ఎయిర్ లా సర్టిఫికేట్ కోర్సుకు ప్రొఫెసర్ లాక్స్ చేత ప్రారంభోత్సవం చేయించాము ఆ కోర్సులో ఇండియన్ ఎయిర్ లైన్సు సివిల్ ఏవియేషన్ డిపార్టుమెంటుల్లోని ఉద్యోగులు చాలామంది సర్టిఫికేట్లు తీసుకున్నారు

ప్రపంచ న్యాయస్థానంలో న్యాయాధీశులుగా ఉన్న ప్రొఫెసర్ లాక్స్ ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా కి అతిధిగా రావడం మాసొసైటీకి మంచి పేరు ప్రతిష్టలు తెచ్చాయి ఆయనచే ప్రారంభించబడిన ఎయిర్ లా సర్టిఫికేట్ కోర్సులో విమానయాన శాఖలోని ఆఫీసర్లతో సహా చాలామంది చేరడం కూడా మా సొసైటీ ఖ్యాతిని యినుమడింపచేసింది వారందరూ శ్రీకృష్ణమీనన్ నేను సంతకాలు చేసిన సర్టిఫికేట్లు తీసుకుని ఆనందించారు

వారికందరికి పదిలమైన ఉద్యోగాలు ఉన్నాయి కాబట్టి బాధలేదు అయితే ఈ చదువు తమ ఉద్యోగాన్వేషణలో ఉపకరిస్తుందనే ఆశతో చదివినవారికి ఆ సర్టిఫికేట్ యూనివర్సిటీ చేత ఇప్పిస్తే బాగుండుననే అభిప్రాయం ఉండేది ఈ విషయంలో ఢిల్లీ యూనివర్సిటీతో మా సంప్రదింపులు ఫలించలేదు మా సొసైటీకి ఉపాధ్యక్షులలో ఒకరైన ప్రొఫెసర్ హరనామ్‌సింగ్ కూడా ప్రయత్నించారు కాని పని జరగలేదు యూనివర్సిటీ వాదం ఏమిటంటే అకాడమీ ఆఫ్ ఇంటర్నేషనల్ లాలో ఉపన్యాసకులను నియమించడంలో కాని, కోర్సు యొక్క పరిధిని నిర్ణయించడంలో కాని తమకు ఎటువంటి ప్రమేయం, బాధ్యత లేనందున అటువంటి సంస్థ యిచ్చే సర్టిఫికేట్‌కి యూనివర్సిటీ ముద్ర వేయడానికి నిరాకరించారు ఒక సంవత్సరం ఢిల్లీ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌ని మా సొసైటీ సమావేశాలను ప్రారంభించవలసినదిగా కోరాం ఆయన సమావేశానికి వచ్చినపుడు శ్రీ కృష్ణమీనన్, డా॥ కృష్ణారావు ప్రొఫెసర్ హరనామ్‌సింగ్ వైస్ ఛాన్సలర్‌కి మా లైబ్రరీ, తరగతి గదులు, మేము నిర్వహించే సర్టిఫికెట్ కోర్సుల సిలబస్‌లు చూపించారు ఆ సర్టిఫికెట్‌లు విద్యార్థులకు ఉపయోగకరంగా ఉండాలంటే యూనివర్సిటీవారే ఆ కోర్సులు నడపమని చెప్పారు చివరకు వైస్ ఛాన్సలర్ మా సర్టిఫికేట్ కోర్సులకు యిచ్చే సర్టిఫికేట్లు ఢిల్లీ యూనివర్సిటీ పేరుమీద యివ్వడానికి అంగీకరించారు మాకోర్సులు ఢిల్లీయూనివర్సిటీ కోర్సుగా పరిగణింపబడడంతో ఆ కోర్సులలో చేరే విద్యార్థులు ఎక్కువయ్యారు ఢిల్లీ యూనివర్సిటీ యాజమాన్యం సర్టిఫికేట్‌కోర్సులకు సంబంధించిన అన్నివిషయాల బాధ్యత మాసొసైటీకే వదలిపెట్టారు విద్యార్థుల్ని చేర్చుకోవడం ఉపన్యాసాలు యిప్పించడం పరీక్షలు నిర్వహించడం సొసైటీ ఆధ్వర్యంలోనే జరుగుతాయి వారిలో ఉత్తీర్ణులైన వారికి ఢిల్లీ యూనివర్సిటీ సర్టిఫికేట్ యిస్తుంది దానితో విద్యార్థులు సంతృప్తి పడ్డారు మాకు కూడా మంచిపని చేసిన తృప్తికలిగింది

ఈ సందర్భంలో ఇండియన్ సొసైటీ ఆఫీసు మేనేజరుగా ఉన్న కుమారి మాలతీ మీనన్ సేవలు కొనియాడదగ్గవి ఆమె డా॥ కృష్ణారావుకి స్వయానా మరదలు ఆమె ఏమి చదివిందో, అనుభవం ఏమిటో అనే విషయాలు మాకెవరికీ తెలియదు శ్రీ కృష్ణారావుకి ఆమె అంటే ప్రాణం అందుమూలంగా ఆఫీసులో అందరికీ ఆమె అంటే హడలు లండను యూనివర్సిటీలో ఇంటర్నేషనల్ లా ప్రొఫెసర్‌గా ఉన్న శ్రీ శ్వాషన్ బర్గర్ మా సొసైటీ అతిథిగా ఢిల్లీ వచ్చినప్పుడు కుమారి మాలతీ మీనన్ ఆయన మంచిచెడ్డలు చూడ్డం, ఆయనకు దేశంలో కొన్ని భాగాలు చూపించడం

చేసింది ఆయన లండను తిరిగి వెళుతూ మాలతీ మీనన్‌ని ఆకాశానికి ఎత్తివేసి లండను యూనివర్సిటీలో ఒక కోర్సు చేయడానికి ఆమెను ఆహ్వానించారు

డాక్టరు కృష్ణారావు లండను యూనివర్సిటీలో ఎల్ ఎల్ ఎం ప్రొఫెసర్ శ్వాషన్ బర్గన్ వద్ద చేసారు ప్రొఫెసర్ శ్వాషన్ బర్గర్ యిచ్చిన ఉత్తరం పుణ్యమా అంటూ డా॥ కృష్ణారావు యునైటెడ్ నేషన్సు లీగల్ శాఖలో ఉద్యోగం సంపాదించగలిగాడు ఆయన అమెరికాలో ఏడేళ్ళు పైగా యునైటెడ్ నేషన్స్‌లో పనిచేసాడు ఆ సమయంలోనే తన మిత్రురాలు బానుమతి మీనన్‌ని వివాహం చేసుకున్నాడు వాషింగ్టన్ యూనివర్సిటినుంచి పిహెచ్ డి డిగ్రీ తీసుకున్నాడు ఆయన యునైటెడ్ నేషన్సు ఉద్యోగం వదలుకుని డిల్లీ వచ్చి విదేశాంగ శాఖ లీగల్ అండ్ ట్రీటీస్ శాఖ అధిపతిగా ఉద్యోగం స్వీకరించాడు మిత్రులు శ్రీ పి రాజేశ్వరరావుగారు బ్రతికున్నంతకాలం ఆ ఢిల్లీ ఉద్యోగం తనకు రావలసినదని డా॥కృష్ణారావు కృష్ణమీనన్ మేనకోడల్ని వివాహమాడినందున కృష్ణమీనన్ ఆ ఉద్యోగం కృష్ణారావుకి యిప్పించాడని అనేవారు నిజానికి కృష్ణారావు భార్యకు కృష్ణమీనన్‌కి ఏవిధమైన బంధుత్వం లేదు వారిద్దరు మళయాళులంతే కృష్ణారావు భారత ప్రభుత్వంలో ఉద్యోగానికి ప్రయత్నించలేదు ఆయనకు యునైటెడ్ నేషన్సులో చక్కటి ఉద్యోగం ఉంది అయితే భారత విదేశాంగమంత్రిత్వ శాఖలో డెప్యూటీ మంత్రిపదవి చేసే శ్రీ కొత్త రఘురామయ్య, శ్రీకృష్ణమీనన్ పట్టుపట్టి డా॥కృష్ణారావుచేత యునైటెడ్ నేషన్సు ఉద్యోగానికి రాజీనామా యిప్పించి బారతదేశానికి తీసుకువచ్చారు

నేను ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా సంస్థలో డైరెక్టరు ఆఫ్ స్టడీస్‌గా పనిచేసినంత కాలం ఇంటర్నేషనల్ లాలోను ఎయిర్ లాలోను డిప్లొమా పరీక్షలు మా ఆధ్వర్యంలోనే నిర్వహించబడేవనే విషయం ముందే చెప్పాను ఆ పరీక్షలలో విద్యార్థులు పుస్తకాలు చూచి వ్రాసినా అభ్యంతరం పెట్టేవాళ్ళం కాదు ఈ విషయంలో మా ప్రెసిడెంటు శ్రీ కృష్ణమీనన్‌తో వాదోపవాదాలు జరిగేవి పుస్తకాలు చూచి వ్రాస్తే అది పరీక్ష ఎలా అవుతుందని ఆయన వాదం పరీక్షా పత్రంలో ఉన్న ప్రశ్నకు సమాధానం ఏ పుస్తకంలో ఉంటుందో తెలుసుకుని ఆ పుస్తకంలో సమాధానం ఎక్కడ ఉందో తెలుసుకోగలిగితే ఆ అభ్యర్థికి విషయ పరిజ్ఞానం ఉన్నట్టే అని నా వాదం సంస్థను నడిపేవాణ్ణి నేను కాబట్టి మా ప్రెసిడెంటు డాక్టరు కృష్ణారావు నావాదాన్ని అంగీకరించారు డిప్లొమా పరీక్షలు లైబ్రరీ హాలులో పెట్టేవాణ్ణి అభ్యర్థులకు ప్రశ్నాపత్రం యిచ్చి నేను వెళ్ళి నాగదిలో కూర్చునేవాడిని పరీక్ష వ్రాసేవారు ఆ లైబ్రరీలో ఉన్న పుస్తకాలు చూచి ప్రశ్నలకు సమాధానం

వ్రాసినా మాకు అభ్యంతరం లేదని ముందుగా చెప్పేవాడిని అయితే ప్రశ్నకు సమాధానాలు మాత్రం నిర్ణీత గడువులో పూర్తి చేసి యివ్వాలి

పుస్తకాలు చూచి పరీక్షలలో ప్రశ్నలకు సమాధానాలు వ్రాయడం అందరూ అనుకున్నంత సులభంకాదు ఆ ప్రశ్నకు సమాధానం ఏ పుస్తకంలో ఉందో ముందు తెలియాలి ఆ పుస్తకం లైబ్రరీలో ఎక్కడ వుందో తెలియాలి ఆ పుస్తకం తీసిన తరువాత ప్రశ్నకు సమాధానం ఆ పుస్తకంలో ఎక్కడ ఉందో వెతుక్కొని సమాధానం వ్రాయాలి ఇదంతా అయ్యేసరికి పుణ్యకాలం కాస్తా అయిపోతుంది అందుమూలంగా లైబ్రరీలో పుస్తకాలమధ్య కూర్చోబెట్టినా ఎవరూ పుస్తకాలను చూచి సమాధానాలు వ్రాయడానికి ప్రయత్నించేవారు కాదు అయితే హైస్కూలు విద్యార్థులకు పరీక్షలలో పుస్తకాలు చూచి సమాధానాలు వ్రాసే అవకాశం ఇవ్వాలని రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥మర్రి చెన్నారెడ్డి పాలనా కాలంలో ఆలోచించడం జరిగింది కాని దానిని అమలు చేయలేదనుకుంటాను పుస్తకాలు చూచి పరీక్షలలో ప్రశ్నలకు సమాధానాలు వ్రాసేటట్టయితే అసలు పరీక్షలు పెట్టడం ఎందుకు అనే వాదం లేకపోలేదు

ఇంటర్నేషనల్ లా సొసైటీ ప్రచురించే జర్నల్‌తోపాటు కొన్ని గ్రంథాలు అచ్చువేయించడం కార్యక్రమం కూడా ఉండేది ఆ కార్యక్రమంలో భాగంగా "వియత్నాంలో శాంతి స్థాపనకు ప్రయత్నాలు" అనే విషయం పై నేనొక పుస్తకం వ్రాసాను దానిని సొసైటీ ప్రచురణగా అచ్చు వేయించడానికి పెద్దలంతా అంగీకరించారు ఆ గ్రంథం అచ్చు అయిన తరువాత ఒక కాపీ యునైటెడ్ నేషన్సు సెక్రటరీ జనరల్ ఊథాన్‌కి పంపాను ఆయన వద్దనుంచి చక్కటి జాబు వచ్చింది అంతకు ముందు వియత్నాంమీద నేను వ్రాసిన పుస్తకాన్ని ఏషియా పబ్లిషింగ్ హౌస్ బొంబాయివారు ప్రచురించారు

ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా సంస్థలో నాలుగేళ్ళు పని చేయడంవల్ల ఢిల్లీలోని అనేక సంస్థలతో సంబంధాలు పెరిగాయి కాని వాటిని ఉపయోగించుకోవడం నాకు యిష్టం ఉండేది కాదు అయితే భారత ప్రధాన న్యాయమూర్తి మా సొసైటీ గౌరవాధ్యక్షులు కాబట్టి సొసైటీ పనిమీద తరచు ఆయన్ని కలుసుకోవలసివచ్చేది కాని ప్రయివేటు సెక్రటరీలు నాకు ఎప్పుడూ తలనొప్పి తెప్పించేవారు వారు లక్ష యక్షప్రశ్నలు అడుగుతారు అది వారి ఉద్యోగ ధర్మం అయి ఉంటుంది కాని వారి ప్రశ్నలబారినుంచి తప్పించుకోవడానికి ఎవరిని చూడ్డానికి వెళ్ళేవాడినికాదు భారత ప్రధాన న్యాయమూర్తితో ఈవిషయం చెబితే ఆయన నాకు చక్కటి సలహా యిచ్చారు తమ పి ఏ ఉదయం 9గంటల తరువాత కాని డ్యూటీకి రాడు కాబట్టి తనను చూడాలన్న రోజున ఉదయం 9గంటల ముందే వస్తే ఏసమస్య

ఉండదన్నారు ఆయన్ని చూడాలనుకున్నప్పుడల్లా ఆయన సలహా పాటించేవాడిని ఒక కేంద్ర మంత్రివర్యునితో ఈవిషయంలో నా అనుభవం నన్నే ఆశ్చర్యపరచింది

నేను కాంగ్రెసు పార్లమెంటు పార్టీలో పనిచేసే రోజులలో ఒక పార్లమెంటు మెంబరు మంచి మిత్రుడుగా ఉండేవారు ఆయన కేంద్రంలో మంత్రి అయ్యారు అప్పటినుంచి నేను ఎప్పుడూ ఆయన్ని చూడ్డానికి వెళ్ళలేదు ఒకసారి రిపబ్లిక్ డే పెరేడ్‌కి వెళ్ళిన సందర్భంలో మంత్రిగారిని కలియడం జరిగింది ఆయన మంత్రి అయిన తరువాత నేను తనను చూడడానికి వెళ్ళలేదని నిష్ఠూరంగా మాట్లాడారు మీతో నాకు ఏమీ పనిలేదు నేను వచ్చి మీసమయం పాడుచేయడం నాకు యిష్టం ఉండదు, అంతే కాకుండా మీ సెక్రటరీ అడిగే లక్ష ప్రశ్నలకు సమాధానం చెప్పడం నాకు తలనొప్పి అన్నాను ఒకసారి రమ్మని ఆహ్వానించి వెళ్ళారు కేంద్రమంత్రి అంత ఆప్యాయంగా పిలిస్తే వెళ్ళి ఆయన్ని చూడకపోవడం బాగోదని ఒకరోజు ఆయన ఆఫీసుకి టెలిఫోను చేసాను "మూర్తిగారా? మంత్రిగారిని ఎప్పుడు చూస్తారు?" అని మంత్రిగారి ప్రయివేటు కార్యదర్శి అనేసరికి నేను నిజంగా ఆశ్చర్యపోయాను మంత్రుల ప్రయివేటు కార్యదర్శులు ఏదో క్రొత్త పంథా అవలంభించినట్టనిపించింది మంత్రిగారిని చూడటానికి వెళ్ళినపుడు ముందుగా ప్రయివేటు కార్యదర్శి గదికి వెళ్ళి నాఆశ్చర్యాన్ని తెలియజేసాను మంత్రిగారు అతగాణ్ణి పిలిచి మూర్తి తనను చూడడానికి వస్తానని టెలిఫోన్ చేస్తేమాత్రం ఏ విధమైన ప్రశ్నలు అడగవద్దని చెప్పారట

శ్రీకృష్ణమీనన్ డాక్టరు కృష్ణారావు అంతర్జాతీయ సంస్థలతో సంబంధాలు ఉన్న వ్యక్తులు కావడం మూలంగా మా సొసైటీకి కూడా అంతర్జాతీయంగా మంచి పరపతి, పలుకుబడి ఉండేవి అంతర్జాతీయ ఆర్బిట్రేషన్ సమావేశాలకు మా సొసైటీ సెక్రెటరి జనరల్‌గా నేను హాజరయ్యాను ప్రపంచ న్యాయ వ్యవస్థకు సంబంధించిన అంతర్జాతీయ సమావేశానికి మాసొసైటీ వైస్ ప్రెసిడెంట్ డాక్టరు నగేంద్రసింగ్ ప్రతినిధి నేను సలహాదారుగా వ్యవహరించాం బారత రాష్ట్రపతికి కార్యదర్శి పదవిలో ఉండే నగేంద్రసింగ్ ఆ తరువాత ప్రపంచ కోర్టులో జడ్జి పదవి నిర్వహించారు

డా నగేంద్ర సింగ్‌నకు క్రికెట్ అంటే మహా యిష్టం ఆయన ప్రతినిధిగా సమావేశంలో ముందువరుసలో కూర్చునేవారు నేను సలహాదారుగా వెనుక సీట్లో కూర్చునేవాణ్ణి నాకు కూడా క్రికెట్ సరదా ఉండేది కాబట్టి చిన్న పోకెట్ రేడియో తీసుకువెళ్ళి చెవిలో పెట్టుకుని ఆరోజుల్లో ఢిల్లీలో జరిగే క్రికెట్ టెస్ట్ మ్యాచ్ ప్రత్యక్షప్రసారం వినేవాణ్ణి డా॥ నగేంద్రసింగ్ వెనుకకు

చూచినప్పుడల్లా క్రికెట్ స్కోరు కాగితంమీద వ్రాసి యిచ్చేవాణ్ణి సమావేశంలో అంతా ఏదో సలహా వ్రాసి యిస్తున్నాననుకునేవారు ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్సువారు అమెరికను ఎంబసీతో కలిసి ప్రతి సంవత్సరం అమెరికాకు పంపే భారతీయులకు భారతదేశ చరిత్ర, రాజకీయాలు, విదేశాంగనీతి, సంస్కృతి మీద ఉపన్యాసాలు చెప్పించేవారు మిత్రుడు జి వి జి కృష్ణమూర్తి నాపేరు వారికి సూచించాడు వారు నన్ను విదేశాంగ నీతిమీద ఉపన్యాసాలు చెప్పమన్నారు నేను ఇంటర్నేషనల్ లా సంస్థలో ఉన్న నాలుగేళ్ళు ఆ ఉపన్యాసాలు చెప్పేవాణ్ణి భారతీయులు అమెరికాలో ఉన్నకొద్ది కాలంలోను అమెరికన్లను కలిసినప్పుడు వారు ఉత్సుకతతో అనేక ప్రశ్నలు అడుగుతారు అవి వారు చేసే ఉద్యోగానికి సంబంధించిన ప్రశ్నలు కాకపోవచ్చు అందుమూలంగా వారికి రకరకాల విషయాలపై ఉపన్యాసాలు చెప్పించి పంపేవారు వారి కృషిలో నాపాత్ర చిన్నదేనైనా సంతృప్తిగా ఉండేది

డా॥ కృష్ణారావు ప్రోత్సాహంతో సొసైటీ సమావేశాల్లో అలీనోద్యమం, భారతదేశ విదేశాంగ నీతి మొదలైన విషయాలపై ప్రత్యేక వ్యాసాలు చదివి వాటిపై చర్చలలో పాల్గొనేవాడిని ఇంతలో ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా సంస్థకు తీరని నష్టం జరిగింది డా॥ కృష్ణారావు అకస్మాత్తుగా మరణించడంతో ఆ సొసైటీలో నా స్థానం ఏమిటో నిర్ణయించుకోవలసిన పరిస్థితి వచ్చింది అతడు నాకు కొండంత అండగా ఉండి మద్దతు ఇచ్చేవాడు అటువంటి మంచి మిత్రుడు మరణించడంతో నాభవిష్యత్తు గురించి తీవ్రంగా ఆలోచించవలసి వచ్చింది నేను ఇంటర్నేషనల్ లా సొసైటీలో పనిచేయడానికి ఎవరూ అభ్యంతరపెట్టలేదు గాని కృష్ణారావు మరణంతో సొసైటీలో వచ్చే మార్పులతో నా ఉద్యోగానికి స్థిరత్వం ఉండదనే ఆలోచన వచ్చి టూరిజం డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళడానికి నిర్ణయించుకున్నాను అయితే నాలుగేళ్ళు నేను టూరిస్టు డిపార్టుమెంటునుంచి డెప్యుటేషన్‌పై ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్‌లా సంస్థతో ఉండేసరికి టూరిస్టు డిపార్టుమెంటులో నేను రిటైరయ్యే లోపుగా యిక డిపార్టుమెంటుకి తిరిగిరాననే భావం ప్రబలింది

  



భారతప్రభుత్వంచే ఏర్పాటు చేయబడిన ఒక ప్రదర్శనలో టూరిజం శాఖవారి స్టాల్‌ని అప్పటి భారతప్రదాని శ్రీమతి ఇందిరాగాంధీగారు సందర్శించినప్పటి దృశ్యం

# సాంకేతిక ప్రగతి - సౌందర్యోపాసన

భారత ప్రభుత్వ టూరిజం డిపార్ట్‌మెంట్‌నకు డైరెక్టరు జనరల్‌గా శ్రీ బి యస్ రామన్ ఉండేవారు నేను డిపార్టుమెంటుకి తిరిగి వెళ్లడం అధికారులకు సమస్య అయింది డెప్యుటేషన్ మీద ఉండడంతో నా ప్రమోషన్ అవకాశాలు దెబ్బతిన్నాయి డిపార్టుమెంటులో నేను, మిత్రుడు సైగల్ సీనియర్ డైరెక్టర్లం మాకంటే జూనియర్లు, డెప్యూటీ డైరెక్టర్సు జనరల్ అయి కూర్చున్నారు రామన్ గారు నాకు డైరెక్టరు పబ్లిసిటీ పదవి యిచ్చి నా నెత్తిమీద కుర్ర ఆఫీసరు లేకుండా చేసారు అప్పటికి నాకు మిగిలిన సర్వీసు రెండు సంవత్సరాలకంటే ఎక్కువ లేదు సాధారణంగా ఆఫీసరుకి మూడేళ్ళకు పైగా సర్వీసు వుంటే తప్ప ప్రభుత్వం అతణ్ణి విదేశాల్లో ఉద్యోగానికి నియమించరు అయినా మా డైరెక్టరు జనరల్ బి యస్ రామన్‌కి నన్ను విదేశాలకు పంపాలనే సంకల్పం కలిగింది అదే సమయంలో డిపార్టుమెంటు కార్యదర్శికి మంత్రి డాక్టర్ కరన్ సింగ్‌కి కూడా విదేశాలలో ఉద్యోగాలకు పంపవలసిన అభ్యర్థులు ఉన్నారు వారి ముగ్గురి మధ్య జరిగిన సంప్రదింపులలో మూర్తిని టోకియో పంపడానికి అంగీకరిస్తే మిగిలిన అభ్యర్థులను విదేశాలకు పంపడానికి తనకు అభ్యంతరం లేదని శ్రీ రామన్ పట్టుపట్టారు మంత్రికి, కార్యదర్శికి అంగీకరించక తప్పలేదు నన్ను టోకియోలో భారత ప్రభుత్వ టూరిస్టు ఆఫీసులో డైరెక్టరుగా నియమిస్తూ ఆర్డర్లు వేసారు ఎయిర్ ఇండియా సీటు రిజర్వేషన్ కూడా అయిపోయింది

అంతటితో నా సమస్య పరిష్కారమై పోయిందనుకోకండి ఒకనాడు మంత్రి ఆఫీసులో జరిగిన మీటింగులో టోకియో ఎవరు వెళుతున్నారని అడిగారు మంత్రి నేను వెళుతున్నానన్నాను త్వరలో జపాన్‌లో జరగబోయే PATA (పసిఫిక్ ఏరియా ట్రావెల్ అసోషియేషన్) సమావేశాలలో మూర్తి ఉంటాడని మంత్రివర్యులు అన్నారు మీటింగు అయిపోయిన ఒక గంటలో నాకు అడ్మినిస్ట్రేషన్ నుంచి టెలిఫోను వచ్చింది పిడుగువార్త మంత్రిగారు టోకియోలో అప్పటివరకు డైరెక్టరుగా ఉన్న ప్రాణనాథ్ సేత్ అక్కడే ఉండాలని ఒక నోట్ వ్రాసి పంపారట అందుమూలంగా నేను ఎయిర్ ఇండియాలో రిజర్వు చేసిన సీటు రద్దు చేసుకుని టోకియో ప్రయాణానికి

స్వస్తి చెప్పాలని సలహా మంత్రిగారి నోట్‌లో నా ప్రస్తావన లేదు వెంటనే ఎయిర్ ఇండియా ఆఫీసుకి వెళ్ళి నా సీటు రిజర్వేషన్ ఉపసంహరించుకొని ఇంటిదారి పట్టాను దారిలో మిత్రుడు ప్రసాద్ ఇంటికి వెళ్ళి జరిగిన విషయం ఏకరువు పెట్టాను ప్రసాద్ చాలా బాధపడి తక్షణం సుబ్బారావుగారి ఇంటికి కారు పోనివ్వమన్నాడు మిత్రుడు సుబ్బారావు జ్యోతిష్యంలోను, హస్తసాముద్రికంలోను నిష్ణాతుడు ఆయన ఇంటివద్దనే వున్నాడు ప్రసాదు ఆఖరు నిమిషంలో ఆగిపోయిన నా విదేశీ ప్రయాణం సమస్య ఆయనకు చెప్పాడు అంతే, వెంటనే ఆయన తన ఇంక్ పాడ్, రోలరు, తెల్లకాగితాలు తీసి నా చేతిముద్ర తీసి పరీక్షించి తన నిర్ణయం చెప్పాడు జపాన్ వెళతారో లేదో చెప్పలేను కాని మూర్తిగారు త్వరలో విదేశాలకు వెళ్ళక తప్పదన్నారు అది ఎలా జరుగుతుందో అర్థంకాక ఇంటిముఖం పట్టాను

రెండు రోజులు తిరగకుండా టోకియో నుండి కేబుల్ వచ్చింది సేత్‌ని టోకియోలో ఉండమన్న మంత్రి ఆదేశాన్ని డిపార్టుమెంటు పంపిన కేబుల్‌కి సమాధానం అది తన సామాన్లు ఉలెన్స్ అప్పటికే భారతదేశానికి పంపివేసినందున తాను టోకియోలో ఉండడం సాధ్యంకాదని, కావాలంటే భారతదేశం వచ్చి తిరిగి టోకియో వెళతానని కేబుల్‌లో వుంది శ్రీ బి యస్ రామన్ ఆ కేబుల్ తిన్నగా సెక్రటరీకి పంపారు ఆయన మంత్రికి పంపాడు ఏమనుకున్నారో మూర్తిని టోకియో వెళ్ళమని ఆదేశం ఇచ్చారు అది అందుకున్న శ్రీ రామన్ నన్ను పిల్చి వాళ్ళు మళ్లా మనసు మార్చుకొనేలోపు నా హాండ్‌బ్యాగ్ తీసుకుని టోకియో వెళ్ళిపో మిగిలిన సామాన్లు వెనకాల పంపుతానన్నారు ఆయన చెప్పినంత తొందరగా కాకపోయినా చివరకు టోకియో చేరాను

టోకియోలోని భారత ప్రభుత్వ టూరిస్టు ఆఫీసు డైరెక్టరుగా జపాను వెళ్ళడానికి ముందు జపాను గురించి ఏవో సామాన్య అభిప్రాయాలు తప్ప నిజంగా ఆ దేశం ప్రజల గురించి అవగాహన లేదు నేనూ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఏ ఆనర్స్ చదువుకునే రోజుల్లో మాకు జపాన్, చైనా హిస్టరీ కూడా ఒక అధ్యయన విషయంగా వుండేది కాని ద్వితీయ ప్రపంచ యుద్ధం పుణ్యమా అని భారతీయులకు జపాన్ గురించి తెలుసుకోవడానికి అవకాశం దొరికింది దానికితోడు నేతాజీ సుభాష్‌చంద్రబోసు భారత స్వాతంత్ర్య సముపార్జనకోసం ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో జపాను ప్రభుత్వ సహాయాన్ని అర్థించి ఇండియన్ నేషనల్ ఆర్మీని స్థాపించి బ్రిటిషు సామ్రాజ్యాధినేతల గుండెల్లో బల్లెం అయిన వివరాలు వినని భారతీయుడు వుండడు నేతాజీ ఆధ్వర్యంలో నడిచిన ఐ ఎన్ ఏ వీరగాథలు విని ఆనందించిన

మాట వాస్తవం కాని అప్పుడు కూడా మనకు జపాను దేశంగురించి అంతగా తెలియదు నిజానికి మనదేశంలో పాశ్చాత్యదేశాలపై ఉన్న మోజు ఆసియా దేశాలపై లేదు రెండు వందల ఏళ్ళ బ్రిటిష్ పరిపాలన మన దృష్టిని యూరోపు వైపు, ఇంగ్లండువైపు మళ్ళించడంతో మనం ఆసియా దేశాలకు దూరమయ్యాం మన పెద్దలకు జపాన్ అంటే చౌకవస్తువులు, ఇమిటేషన్ సరుకులు తయారుచేసే దేశంగా గుర్తు వుండి వుంటుంది కాని ఆధునిక జపాను సాధించిన పారిశ్రామిక ప్రగతి కళ్ళు మిరుమిట్లుగొల్పుతుంది ద్వితీయ ప్రపంచయుద్ధంలో జర్మనీతో చేతులు కలిపి పరాజయం పొందిన జపాను యుద్ధానంతరం సాధించిన ప్రగతి అత్యద్భుతం హిరోషిమ, నాగసకి పట్టణాలపై అమెరికన్లు ఆటంబాంబులు వేయడంతో ద్వితీయ ప్రపంచ యుద్ధం పరిసమాప్తి కావడం చరిత్ర

యుద్ధానంతరం జపాను దేశపు పునర్నిర్మాణం అతి చురుకుగా సాగింది, అయినా ఈనాటికి జపానులో గ్రామీణ ప్రాంతాలకు పట్టణాలకు ఉన్న భేదాలు, యువతరానికి పూర్వకాలపు వారికి ఉన్న తరాల తారతమ్యం, వ్యవసాయం నుంచి పారిశ్రామికీకరణకు శతాబ్దాలనాటి పురాతన జపాను సంస్కృతి అత్యాధునిక పాశ్చాత్య నాగరికతతో తలమున్కలు కావడం కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి చిత్రం ఏమిటంటే జపాను జాతివారికి విదేశాలు చూడాలని ఉన్న ఉత్సాహం, ఆసక్తి అంతా యూరోపియన్, అమెరికా దేశాలపై కేంద్రీకృతమవడం ద్వితీయ ప్రపంచయుద్ధం అయిపోయిన తరువ చాలాకాలం జపానుప్రజలు తమదేశం వదలి విదేశాలకు వెళ్ళడానికి ఆస్కార ఉండేదికాదు విదేశీద్రవ్యం లేనందున ప్రజల విదేశీ ప్రయాణాలపై నియమనిబంధనలు ఉండేవి 1964లో టోకియో ఒలింపిక్స్ అనంతరం జపాను ప్రజల మీద విదేశీ యాత్రలపై ఉన్న నిబంధనలు తొలగించబడ్డాయి అదే సమయంలో భారత ప్రభుత్వం ప్రపంచమంతా తిరగటానికి ఉద్యుక్తులవుతున్న జపానీయులను భారతదేశానికి కూడా ఆకర్షించాలనే సంకల్పంతో టోకియోలో ఒక టూరిస్టు ఆఫీసు నెలకొల్పింది బుద్ధ భగవానుని జన్మస్థలం కాబట్టి మనదేశంలో ఉన్న బౌద్ధ క్షేత్రాలను చూడ్డానికి జపానీ విదేశీ పర్యాటకులు వస్తారని భారత ప్రభుత్వం భావించింది

జపాను ప్రభుత్వం తమ పౌరుల విదేశీ ప్రయాణాలపై పెట్టిన నిబంధనలు తొలగించేసరికి అనేకమంది జపాను పౌరులు తమ విదేశీ ప్రయాణాలలో ఏ దేశాలు చూడ్డానికి ఇష్టపడతారనే విషయం మీద కొన్ని సంస్థలు సర్వేలు నిర్వహించాయి వాటిలో తేలిన వివరాలు చాలా దేశాలకు కనువిప్పు అయింది హెచ్చుమంది అమెరికా యూరోపు దేశాలకు వెళ్ళాలని ఉందన్నారు భారతదేశం వెళ్ళాలనే అభిప్రాయం వ్యక్తం చేసినవారు ఎవరూ లేరంటే

నమ్మండి జపాను ప్రభుత్వం 3,800 మంది ప్రాధమిక మాధ్యమిక పాఠశాలల ఉపాధ్యాయులను ఎడ్యుకేషన్ టూరుకి పంపాలని నిర్ణయించి ఆ ఉపాధ్యాయులను ఎక్కడికి వెళ్ళాలనుకుంటున్నారని అడిగారు వారిలో నూటికి 90 మంది అమెరికా యూరోపు దేశాలకు వెళ్ళడానికి ఉత్సుకత చూపించారు ఆసియా దేశాలకు వెళ్ళాలనుకున్నవారు బహుస్వల్పం విద్యాశాఖ వారు తుది నిర్ణయం చేస్తూ 50 శాతం మందిని యూరోపు దేశాలకు 40 శాతం మందిని అమెరికాకు, మిగిలిన 10 శాతం ఉపాధ్యాయులను ఆసియా దేశాలకు పంపాలని నిర్ణయించారు ఆధునిక జపానులో పాశ్చాత్య వ్యామోహం చాలా ప్రముఖంగా కనిపిస్తుంది దానికి ముఖ్య కారణం జపాను పౌరులకు పాశ్చాత్య నాగరికత అంటే ఒక విధమైన మోజు, ఆకర్షణతో పాటు తమ సంస్కృతి పాశ్చాత్య సంస్కృతితో తులతూగదనే ఒక భావన ప్రబలంగా ఉంది

ఏది ఏమైనా జపానుదేశంనుంచి పర్యాటకులను తమతమ దేశాలకు ఆకర్షించడానికి అనేక దేశాలు టోకియోలో తమ టూరిస్టు ఆఫీసులు తెరిచారు ఈ పరిస్థితి చూస్తే తాతకు దగ్గులు నేర్పడం సామెత గుర్తువస్తుంది జపాను దేశం విదేశీ పర్యాటకులకు గొప్ప ఆకర్షణ ఆ దేశం విదేశీ పర్యాటకులను ఆకర్షించడానికి పడే శ్రమ చూపించే శ్రద్ధ చూస్తే ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన ఆకర్షణలున్న మన దేశం ఎంత వెనుకబడి ఉందో తెలుస్తుంది టోకియోలో ఉద్యోగం చేయడంలో వున్న మొదటి ఇబ్బంది భాష జపానులో చాలా మంది తమ విద్యలో బాగంగా ఇంగ్లీషు నేర్చుకుంటారు కాని వారి ఇంగ్లీషుకి విద్యావిధానంలో బాష నేర్చుకోవడానికి ఉన్న ప్రాముఖ్యత ఇంగ్లీషు సంభాషణకు లేదు ఇంగ్లీషు వచ్చినవారు కూడా మాట్లాడటానికి సాహసించరు ఆ దేశంలో ఉద్యోగరీత్యాగాని, సామాన్య జీవితంలోగాని జపాను బాష మాట్లాడగలిగితే బ్రహ్మాండంగా ఉంటుంది విదేశీ టూరిస్టు ఆఫీసులో చాలా మంది జపాను బాష నేర్చుకున్నవారు, మాట్లాడ గలిగినవారు ఉన్నారు నేను మాత్రం వియత్నామీస్ భాష నేర్చుకోవడానికి చేసిన ప్రయత్నం తరువాత మరొక విదేశీ భాష నేర్చుకోవడానికి ప్రయత్నించలేదు టోకియోలోని బారత ప్రభుత్వ టూరిస్టు ఆఫీసు ఆ మహానగరానికి గుండెకాయగా పరిగణించబడే గింజాలో ఉంది భారత దేశం నుంచి వచ్చిన అసిస్టెంటు జపాను భాష మాట్లాడగలడు నాకు అతడు గాని మా ఆఫీసులో పనిచేసే తోయషిమా సాన్, సుయనాగా సాన్ మా డిపార్టమెంట్ అడ్వర్టయిజింగ్ ఏజెంటుగాని లేకుండా ఎక్కడికైనా వెళ్ళటంగాని ఎవరితోను మాట్లాడ్డానికి కాని అవకాశం ఉండేదికాదు టోకియోలోని విదేశ విలేఖరుల క్లబ్బులో మాత్రం అంతా ఇంగ్లీషే సాయంకాలాలు ఆ క్లబ్బులో గడిపి, రాత్రి

భోజనం అక్కడే చేసి ఎబిసులోని నా ఇంటికి చేరడం పరిపాటయింది

టోకియో మహానగరం నిజంగా జనారణ్యం అనేక గ్రామాలను కలిపి మహా నగరాన్ని చేసారనిపిస్తుంది ఏదైనా వీధి తెలుసుకోవాలన్నా, ఎవరి ఇల్లయినా కనుక్కోవాలన్నా బ్రహ్మ ప్రయత్నం చేయాలి ఆ మహా పట్టణాన్ని ఒక పద్ధతిలో నిర్మించిన లక్షణాలు లేవు అయితే టోకియో పట్టణానికి 500 సంవత్సరాల చరిత్ర మాత్రమే ఉందని మర్చిపోకూడదు 1457లో ఈడో అనే పేరుతో ఉండే పట్టణం 1868లో పేరు మార్చుకొని టోకియో పట్టణంగా రూపొంది జపాను దేశానికి ముఖ్యపట్టణమయింది 1923లో సంభవించిన కాంటో భూకంపం టోకియోను సర్వనాశనం చేసింది తిరిగి రెండవ ప్రపంచ యుద్ధం పుణ్యమా అంటూ టోకియో అపార నష్టానికి గురి అయింది ప్రపంచయుద్ధం తరువాత టోకియో పునర్నిర్మాణం అసాధ్యం అనుకొన్నారు కాని జపానీయుల కార్యదీక్ష, దేశభక్తి టోకియో నగరానికి క్రొత్త రూపం ఇచ్చి ప్రపంచ నగరాలలో ఒకటిగా చేసాయి చిత్రం ఏమిటంటే టోకియో ఒలింపిక్స్ పుణ్యమా అని ఇప్పుడు ఆ మహానగరంలో కనిపించే రోడ్లు సదుపాయాలు, పోవర్ పాసెస్ తయారయ్యాయి ఎన్ని సదుపాయాలు కల్పించినా, ఆ నగరం ఎంత అభివృద్ధి చెందినా అదంతా పూర్వపు పల్లెటూరి పునాదులమీద నిర్మించిన పట్టణమనే సత్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది ఆ మహానగరంలో అనేక వీధులకు పేర్లు ఉండవు ఇళ్ళకు నెంబర్లు ఉంటాయి కాని ఆ నెంబర్లు ఒకవరుసలో ఉండవు అంటే 3వ నెంబరు ఇల్లు 8, 17 వ నెంబరు ఇళ్ళ మధ్య వుండవచ్చు

టోకియోలో ఏ ఇల్లయినా కనుక్కోవడానికి మేప్‌ల సహాయం తీసుకోవాలి మనల్ని ఎవరైనా పార్టీకో, భోజనానికో పిలిస్తే ఆ పిలుపుతో పాటు తన ఇంటికి చేరే మార్గంతో అచ్చు వేయించిన మాప్ యిస్తాడు టోకియోలో ఉద్యోగానికి వెళ్ళిన ప్రతి వ్యక్తి మొదట చేయవలసిన పని తన అడ్రసుకి సంబంధించిన మాప్ అచ్చువేయించుకోవడం మన విజిటింగ్ కార్డుకి వెనుక ప్రక్క మన ఇంటికి టాక్సీలోగాని, భూగర్భ రైలు మార్గంలో కాని ప్రయాణం చేస్తే తీసుకోవలసిన దారి చూపెట్టే మాప్‌కూడా అచ్చు వేయించుకోవాలి అలా మాప్ ఉన్న కార్డుతో బయలుదేరి టాక్సీ డ్రైవరుకి ఆ కార్డు ఇచ్చి నిశ్చింతగా కూర్చుంటే అతగాడు మన గమ్యస్థానం చేర్చేస్తాడు జపానీభాష రానినాకు టాక్సీ డ్రైవర్లమీద ఆధారపడటం అలవాటైపోయింది టోకియో టాక్సీలన్నీ ఎయిర్‌కండీషన్ కారులే డ్రైవరు తన సీటులోనుంచి ఎప్పుడూ లేవడు తలుపు తీయాలంటే తాను కూర్చున్న చోటనున్న మీట కాలుతో నొక్కుతాడు కారు తలుపు తెరుచుకుంటుంది ఆ టాక్సీలో కూర్చుని

మన వద్దనున్న అడ్రసు మాప్ అతడికి యివ్వడమే ఆ జాగా తెలుసుకునే బాధ్యత అతడిది. దారి తెలియని, భాషరాని ప్రయాణీకుల్ని టోకియో టాక్సీ డ్రైవర్లు మోసం చేసారన్నమాట ఎప్పుడూ వినలేదు

ఇక ఎప్పుడైనా ఏదైనా అడ్రసు మనకి మనం తెలుసుకోవడానికి ప్రయత్నిస్తే యమ బాధపడాలి అటువంటి ప్రయత్నం టోకియోలో అసలు చేయకూడదు ఈ సందర్భంలో జపానులో ఉన్న ఒక అలవాటు జ్ఞాపకం వస్తుంది సాధారణంగా బారతీయులు కాని విదేశస్తులు కాని పార్టీలు ఇస్తే వారి ఇళ్ళ వద్ద ఏర్పాటు చేస్తారు కాని జపానీయులు సాధారణంగా విదేశస్తులను ఇళ్ళకు ఆహ్వానించరు కాని వారి ఆహ్వానాలపై జరిగే పార్టీలు సాయంకాలం 6 గంటల నుండి రాత్రి మూడు, నాలుగు గంటల వరకు ఉంటాయి అటువంటి పార్టీలకు మిత్రులు ఎప్పుడూ స్వంత కార్లలో వెళ్ళరు టాక్సీలలో వస్తారు పార్టీ అయిపోయిన తరువాత అతణ్ణి ఇంటికి చేర్చే బాధ్యత అతణ్ణి పిలిచినవారిది అప్పటికే రకరకాల మద్యం సేవించి సిద్ధిపొందిన మిత్రుడ్ని టాక్సీలో కూర్చోబెట్టి ఆ డ్రైవరుకి అడ్రస్‌తో ఉన్న మ్యాప్ ఇస్తే మన బాధ్యత తీరినట్టే అయితే ఈ పరిస్థితి అన్ని పార్టీలకు వర్తించదు ఒకళ్లిద్దరు మిత్రులతో చేసుకునే ప్రైవేటు పార్టీలకు మాత్రమే పగలంతా ఎంతో శ్రద్ధతో పనిచేసి మానసికంగా అలసిపోయిన జపానీయులకు రాత్రి స్నానం స్వర్గతుల్యం

ఫ్రెంచివారి భోజన అలవాటు గురించి చెబుతూ వారు చక్కటి బ్రాందీ త్రాగడానికే మంచి భోజనం చేస్తారని తరువాత హాయిగా చుట్ట కాల్చుకొని ఆనందించడానికే బ్రాందీ తాగుతారని చెప్పుకుంటారు అలాగే జపానీయులు తమ ఆఫీసుల్లో చచ్చేటట్టు పనిచేయడం సాయంకాలం స్నానం చేయడంలో అనుభవించే ఆనందం కోసమేనని చెప్పుకోవచ్చు అత్యధిక శాతం జపానీయుల ఇళ్ళలో స్నానాల గదులు ఉండవు అందువల్ల వారంతా సాయంకాలం పని నుంచి ఇంటికి వచ్చిన తరువాత వారి ప్రాంతంలో ఉన్న పబ్లిక్ బాత్‌కి స్నానానికి వెళతారు ఆఫీసు దుస్తులు విప్పి, యుకాతా ధరించి చిన్న ప్లాస్టిక్ గిన్నె తువాలు సబ్బు తీసుకుని స్నానానికి బయలుదేరతారు స్త్రీలు, పురుషులు రాత్రుల్లే స్నానం చేస్తారు ఇంగ్లీషు వారికి కూడా అదే అలవాటులెండి పబ్లిక్ బాత్‌లో స్నానానికి డబ్బులు యివ్వాలి రెండవ ప్రపంచ యుద్ధం అయిపోయిన కొంత కాలం వరకు జపానులో స్త్రీ పురుషులు పిల్లలు, వృద్ధులు అనే భేదం లేకుండా అంతా కలసి స్నానం చేసేవారు వారంతా నగ్నంగా స్నానాలు చేస్తారు మన దేశంలో మగవారు సాధారణంగా నగ్నస్నానాలు చేయడం మనకు అలవాటు లేదుసరికదా దానిని గురించి మాట్లాడ్డానికి కూడా చాలామంది సిగ్గుపడతారు జపానులో ఆ బాధ లేదు

పసితనం నుంచి వృద్ధాప్యం వరకు ఆడ మగ కలసి స్నానాలు చేయడం అలవాటయినందువల్లనే కాబోలు వివస్త్రలైన స్త్రీలు కాబరే కార్యక్రమాలలో కనబడితే జపానీ పురుషుడు చలించడు అతడికి నగ్నంగా స్త్రీలను చూడటం క్రొత్తకాదు కాబట్టి

రెండవ ప్రపంచ యుద్ధానంతరం జపాను అమెరికావారి ఆధీనంలో ఉన్న రోజుల్లో అమెరికన్ జనరల్ మెకార్థర్ జపానులో స్త్రీలు, పురుషులు కలసి నగ్నంగా స్నానాలు చేస్తారని విని నెత్తి నోరు కొట్టుకున్నాడు జపానువారి అలవాటు అనాగరికం అన్నాడు అసభ్యం అన్నాడు ఆడ మగ కలసి స్నానాలు చేయడాన్ని వెంటనే నిషేధిస్తూ ఆజ్ఞలు జారీ చేసాడు దాని ఫలితంగా ఆ దేశంలోని అన్ని స్నాన ప్రదేశాలలో మధ్య దడులు కట్టారు ఇప్పటికీ ఒకే పూల్‌లో పురుషులు, స్త్రీలు స్నానాలు చేస్తారు కాని వారి మధ్య దడి ఉంటుంది అంతా కలిసి లోపలకు వెళ్ళి స్నానం చేయడానికి సొమ్ము చెల్లించి మగవారి భాగంలో వారు బట్టలు విప్పి లాకర్‌లో పెట్టుకొని లోపలకు వెళతారు స్త్రీల భాగంలో కూడా అలాగే చేస్తారు అయితే స్నానం చేయడం సబ్బుతో వొళ్లు తోముకోవడం అంతా మామూలు పైపు వద్ద చేస్తారు అది అయిన తరువాత పూల్‌లో దిగి ఆ వెచ్చదనంలో అలా కూర్చుండిపోతారు పూల్ అందరికీ ఒకటే కావటంవల్ల స్త్రీల భాగంలో కిలకిలలు, కేరింతలు వినిపిస్తూనే వుంటాయి చాలాసేపు అలా పూల్‌లో కూర్చుని లాకర్ వద్దకు వచ్చి యుకాతా వేసుకుని ఆనందంగా నెత్తిమీద భారం అంతా దింపివేసుకుని ఇంటి ముఖంపడతారు

జపాను దేశంలో గృహాలు చాలావరకు కర్రతో కడతారు దానికి కారణం తరచు సంభవించే భూకంపాల ధాటికి రాయి సిమెంట్ కంటే కలప శక్తివంతంగా తట్టుకోగలదని వారి నమ్మకం అయితే ఇప్పుడు ప్రపంచంలోని అన్ని మహాపట్టణాలలోవలె టోకియోలో కూడ అనేక అంతస్తులు కాంక్రీటు నిర్మాణాలు వస్తున్నాయి ఇళ్ళు చాలా వరకు కర్రతో నిర్మించబడటం వల్ల హెచ్చుగా అగ్ని ప్రమాదాలు సంభవించటం పరిపాటి శీతాకాలంలో టోకియోలో అనేక అగ్ని ప్రమాదాలు సంభవిస్తాయి భూకంపాలు అగ్ని ప్రమాదాలు చాలవన్నట్టు జపాన్‌లో తుఫానుల బెడదకూడా హెచ్చు అవి ఋతువుల వలెనే క్రమం తప్పకుండా సంవత్సరానికి, రెండుసార్లు వస్తాయి సెప్టెంబరు నెలలో 10, 15 రోజుల వ్యవధిలో తుఫాన్లు,వరదలు సంభవిస్తాయి ఈ ప్రకృతి వైపరీత్యాలన్నిటిని తట్టుకుని జపాను ప్రజలు ఆధునిక కాలంలో బ్రహ్మాండమైన ప్రగతిని సాధించారు

జపాను జనాబా వంద మిలియన్లు (పదికోట్లు) దాటింది ఆ దేశం

ప్రపంచ జనాభాలో ఏడవ స్థానంలో వుంది అక్కడ ఒక చదరపు మైలుకు 655 మంది జనాబా వుంటారు ఆ దేశంలో 85 శాతం పర్వతాలు, కొండలు వుండటంవల్ల 1 శాతం మొత్తం దేశభూభాగంలో 40 శాతం జనాభా నివసిస్తారు జపానులో జనాభా వృద్ధి ప్రపంచ దేశాలన్నింటిలోను తక్కువ అయితే జీవన ప్రమాణం మాత్రం చాలా ఎక్కువ జపానులో పదివేల సంవత్సరాలుగా మానవులు నివశిస్తున్నట్లు పురావస్తు శాస్త్రజ్ఞుల అంచనా ప్రస్తుతం జపానులో నివసిస్తున్న ప్రజల పుట్టుపూర్వోత్తారాల గురించి కొన్ని విచిత్రమైన అభిప్రాయాలు ఉన్నాయి ఒక ప్రముఖ పుక్కిటి పురాణం ప్రకారం జపానీయుల పూర్వులు దేవతలని వారు తెల్ల మేఘాలమీద వచ్చి దక్షిణాన ఉన్న కియుషు దీవిలో జయజికి వద్ద దిగారని నమ్మకం అయితే ఆధునిక నిపుణుల అభిప్రాయం ప్రకారం తెల్లమేఘాలు అంటే సైబీరియా మంచు అనీ వారి పూర్వులు ఆ ప్రాంతాలనుంచి ఉత్తర చైనా, కొరియా మీదుగా జపానుకు చేరారని ఒక వ్యాఖ్య కొందరి అభిప్రాయం ప్రకారం వారు ఆగ్నేయ ఆసియా నుంచి వచ్చారని, మరికొంత మంది ఉద్దేశ్యంలో వారు చిన్న చిన్న పడవలలో దక్షిణ పసిఫిక్ దీవులనుంచి వచ్చారని అభిప్రాయాలున్నాయి

ఆధునిక చరిత్రకారుల ఆలోచన ప్రకారం జపానీయుల పూర్వులు యమాతో అనే జాతికి చెందినవారని క్రీస్తు తరువాత మొదటి మూడు నాలుగు శతాబ్దాలలో ఈ జాతివారు ఆ దేశంలో పరస్పరం కొట్లాడుకునే జాతులవారిని ుంచి తమ అధికారాన్ని నిలబెట్టుకున్నారు జపాను చక్రవర్తుల ుటుంబానికి యమాతో నాయకులు నిజమైన పూర్వీకులని ఇప్పుడు ుమ్మతున్నారు క్రీస్తు తరువాత మొదటి శతాబ్దంలో కొరియా రాజ్యంతో ంబంధాలు నెలకొల్పబడ్డాయి చర్మశుద్ధి నేత నౌకా నిర్మాణం మొదలైన పారిశ్రామిక నైపుణ్యం ఆ దేశం నుంచి నేర్చుకున్నారు ఆ సమయంలో చైనా, కొరియా జపాను దేశస్థుల సాంస్కృతిక ప్రగతికి దోహదం చేసాయి అప్పట్లో జపాను చైనా పాలనా పద్ధతిని తమ దేశానికి ఒరవడిగా తీసుకుంది 8వ శతాబ్దారంభంలో జపాను యొక్క మొట్టమొదటి శాశ్వత ముఖ్యపట్టణం నారా అంతకుపూర్వం చక్రవర్తి మరణించినప్పుడల్లా ముఖ్యపట్టణం మారేది జపాను చక్రవర్తి 710 నుంచి 784 వరకు నారాలో వుండేవాడు 794లో కియోటోలో క్రొత్త రాజధాని నగరం నిర్మించారు అప్పటి నుంచి వేయి సంవత్సరాల వరకు చక్రవర్తి నివాసం, ప్రభుత్వం కియోటోలోనే ఉంది

చక్రవర్తులు భోగ విలాసాలలో నిమగ్నులయి వుంటే రాజ్యంలోని సైనిక విబాగాలు రాష్ట్రాలలో స్వతంత్రంగా వ్యవహరించడం ప్రారంభించాయి సైనిక కుటుంబాల కొట్లాటల పుణ్యామా అని 1185 యుద్ధంలో మినమోతో

కుటుంబం విజయవంతం కావడంతో జపానులో సైన్యాధికారుల పాలన 700 సంవత్సరాలు సాగింది మినమోతో నాయకుడు యోరితోమో తన మిలటరి ప్రభుత్వం (షోగునేట్) ఇప్పటి టోకియో దగ్గరలో కామకూర వద్దకు మార్చారు చక్రవర్తి పాలనాధికారాలన్నీ తాను తీసుకున్నాడు సమురాయ్ సంప్రదాయం ప్రబలింది

16వ శతాబ్దాంతానికి మిలిటరి నాయకులలో అంతఃకలహాలు రాజ్యాధికారం కోసం కొట్లాటలు జరిగాయి 1603 లో టొకుగావా తన షోగునేట్‌ను ఈడో (టోకియో)లో నెలకొల్పాడు జపానును బయటి ప్రపంచముతో సంబంధం లేకుండా చేయడానికి బ్రిటన్, పోర్చుగల్, స్పెయిన్, నెదర్లాండ్సు నుంచి వచ్చిన వ్యాపారులను తోలివేసాడు క్రిష్టియన్ మిషనరీలను బాధించాడు అయితే 250 సంవత్సరాలు నాగసాకి వద్ద వుండే చిన్న సెటిల్‌మెంట్‌లో డచ్చి చైనా వ్యాపారులను ఉండనిచ్చాడు 1853లో అమెరికన్ కమోడోర్ పెర్రీ నాలుగు ఓడలతో టోకియోలో ప్రవేశించాడు ఆ మరుసటి సంవత్సరం పెర్రీ మళ్ళా వెళ్ళి జపానుతో స్నేహసంధి చేసుకున్నాడు నాలుగేళ్ళ తరువాత దానిని వ్యాపార సంధిగా మార్చారు అటువంటి సంధి సంబంధాలు రష్యా, బ్రిటన్ ఫ్రాన్స్ నెదర్లాండ్ దేశాలతో కూడా చేసుకున్నాడు బైట ప్రపంచం నుంచి వత్తిడి దేశంలో అశాంతి మూలంగా 1867 లో టోకుగావా షోగునేట్ పడిపోయింది మెయిజీ పునరుద్ధరణతో చక్రవర్తికి, పూర్వపు అధికారాలు చేతికి వచ్చాయి

మెయిజీ చక్రవర్తి పరిపాలనలో జపానును ఆధునిక రాజ్యంగా చెయ్యడానికి ప్రయత్నాలు జరిగాయి రాజధానిని కియోటో నుంచి ఈడోకి మార్చి దానికి టోకియో అని నామకరణం చేసారు శాసనబద్ధమైన రాజరికాన్ని నెలకొల్పి, ఫ్యూడల్ సమాజంలో ఉన్న సమురాయి రైతు, చేతిపనివారు, వర్తకులు అనే వర్గాలను ఎత్తివేసారు నూతన ప్రభుత్వం విదేశీ సంస్కృతి, సాంకేతిక నైపుణ్యం కనీవినీ ఎరుగని రీతిలో దిగుమతి చేసుకోవడం మొదలుపెట్టింది అప్పటికి యూరోపు అమెరికాల కంటే ఎంతగానో వెనుకబడ్డ జపాను వంద సంవత్సరాలలో ప్రపంచంలో ముఖ్యమైన పారిశ్రామిక దేశంగా రూపుదిద్దుకుంది

బారతదేశంలో క్రిష్టియన్ కేలండరు ప్రకారం రోజులు, సంవత్సరా
లెక్కపెట్టుకున్నా కొద్దికాలం నుంచి ప్రభుత్వం శక సంవత్సర తేదీ కూ
వేస్తోంది అలాగే జపానులో కూడా సంవత్సరాలు లెక్కపెట్టడానికి ము
పద్ధతులు అవలంభిస్తారు ప్రస్తుత చక్రవర్తి హిరహీతో 192
సింహాసనాన్ని అధిష్టించినప్పటినుంచి షోబా శకారంభం అందు

1964లో జరిగిన టోకియో ఒలింపిక్స్ షోబా 39 లో జరిగాయి ఈ లెక్క చక్రవర్తి పరిపాలించిన సంవత్సరాలపై ఆధారపడి ఉంటుంది మరొక పద్ధతి ప్రకారం టోకియో ఒలింపిక్స్ 2624 వ సంవత్సరంలో జరిగాయి ఈ లెక్క జపాను ప్రప్రథమ చక్రవర్తి జిమ్ముపాలన ప్రారంభించిన సంవత్సరం నుంచి మొదలు పెడతారు ప్రస్తుత చక్రవర్తి హిరహితో జపాను దేశాన్ని పాలించిన చక్రవర్తులలో 124వ వాడని ఆయన చక్రవర్తి జిమ్ము వంశస్థుడని నమ్మకం రెండువేల సంవత్సరాలు ఒకే వంశం పాలించిన దేశమని గొప్పగా చెప్పుకుంటారు ఏది ఏమైనా క్రైస్తవ కేలండర్ ప్రకారం సంవత్సరములు లెక్కపెట్టడం ఒక్కటే ఇప్పుడు మిగిలిన పద్ధతి

టోకియోలో నేను నివసించే యింట్లో 2 స్నానాల గదులు ఉండేవి ఒక దానిలో అమెరికన్ షవర్, మరొక దానిలో బ్రిటిష్ టబ్ అమర్చి ఉండేవి ఆ ఏర్పాట్లు విదేశస్థుల కోసం అద్దెకు ఇచ్చే ఇళ్ళలో ఉంటాయి కాని పబ్లిక్ బాత్‌కి వెళ్ళనక్కరలేని యజమానులు కూడా తమ బాత్ రూముల్లో కర్ర చెక్కలతో తయారుచేసిన చతురస్రాకారంలో మనిషి కూర్చోవడానికి సరిపడినంత లోతుగా ఉండే స్నానాల టబ్‌ను ఏర్పాటు చేసుకుంటారు జపానీయులు స్నానాల టబ్‌లో వొంటికి సబ్బు పెట్టి తోముకోరు అదంతా బయట పూర్తి చేసి అప్పుడు చెక్కల టబ్‌లో వేడిగా హాయిగా విశ్రాంతిగా కూర్చుంటారు ...ను ఉండే గదిలో స్నానాల గదులు ఉండడం మూలంగా టోకియోలో ఉన్న ...క్ బాత్‌లు చూడ్డానికి అవకాశము లేకపోయింది అయితే నేను ఆ దేశంలో ...రు చేస్తూ అంత పెద్దదికాని ఒక గ్రామము చేరాను నాతోపాటు మా ...డ్వర్టయిజింగ్ ఏజెంటు మిత్రుడు హోతా సాన్ ఉన్నాడు దారిలో ...ముద్రంలో నుంచి బయటపడ్డ అగ్ని పర్వతం చూసాము ఆ ప్రదేశమంతా ...గ్ని పర్వతాలకు ప్రసిద్ధి క్రొత్తగా బయటపడ్డ కొండను చూడ్డానికి ...లాదిమంది జపానీయులు టూరిస్టు బస్సులలో వస్తున్నారు చిత్రం ...మిటంటే ఆ కొండలో నుంచి ఇంకా పొగలు సెగలు వస్తూనే ఉన్నాయి ...ప్పుడో న్యూజిలాండులో రొటరువాలో చూసిన "ఉడికే బురద" జపానులో తిరిగి చూసాను మేము ఆ నాడు మకాం చేసిన ప్రదేశమంతా అగ్ని పర్వతాల మద్యవున్నట్లు భావన కలిగింది

ఆ ప్రదేశంలో వెస్ట్రన్ స్టైల్ హోటళ్ళు ఉన్నాయి కాని మేము జపాను పద్ధతి హోటల్‌లో మకాం చేయడానికి నిర్ణయించాం మామూలు హోటల్‌కంటే జపాను పద్ధతి హోటళ్ళలో గదులు అద్దె చాలా హెచ్చు అయితే ఆ దేశస్థుల జీవన విదానం కొంతైనా తెలుసుకోవడానికి అవకాశం ఉంటుందని ఆ హోటల్‌లో దిగాం అది నిజంగా నూతన అనుబవం హోటల్ గదిలోనికి

వెళ్ళడానికి ముందు బూట్లువిప్పి బయటపెట్టి హోటల్ వాళ్ళు ఏర్పాటు చేసిన స్లిప్పర్లు వేసుకోవాలి "తతామి" గదులైతే స్లిప్పర్సు కూడా వేసుకోకూడదు సాక్స్‌తోనే తిరగాలి ఆ గదికి బోలెడు అద్దె యిచ్చినా అది చాలా నిరాడంబరంగా ఉంది ఏ విధమైన ఫర్నిచర్ లేదు మంచాలు అసలు లేవు మిత్రుడు హోతాసాన్‌ని అడిగాను పడుకోవడం ఎక్కడ అని అతడు నేలవైపు చూపించాడు మరి మంచం లేకపోతే బెడ్డింగ్ అయినా ఉంటుందా? అన్నాను బెడ్డింగ్ నిద్రలేవగానే మడిచి, జాగ్రత్తగా ఒక ప్రక్కగా ఉంచుతారు తిరిగి రాత్రి పడుకునే సమయానికి ఆ బెడ్డింగ్ వేస్తారు పడక నేల మీదనే అన్న మాట అన్నాను అప్పుడు హోతాసాన్ చెప్పుకువచ్చాడు సాదారణంగా జపానులో హెచ్చుమంది జనాబా తతామీ చాపలమీద ప్రక్కవేసుకొని పడుకుంటారు ఐతే తతామీ అంటే ఏమిటని సందేహం వచ్చింది నాకు సందేహనివృత్తి కోసం మేము ఉన్న గదిలోని తతామీ చాప చూపించాడు అది ఒకరకమైన ఎండుగడ్డితో కట్టిన చాప దాని దళసరి 2 అంగుళాలు ఉంటుంది ప్రతి చాప 3 X 6 అడుగులు ఉంటుంది ఆ చాపలు గదిలో ఎన్నివడితే అన్ని చాపల గది అని వ్యవహరిస్తారు 6 చాపలు 8 చాపలు, 10 చాపలు గదులు ఉన్నాయి ఆ చాపల చుట్టూ గుడ్డబోర్డరు కుడతారు జపానీయులు తతామి చాపలున్న గదులు భోజనానికి నిద్రకు, మామూలుగా నివసించడానికి కూడా ఉపయోగిస్తారు చాలా తక్కువ ఎత్తు ఉన్న టేబిల్ చుట్టూ కూర్చుని భోజనాలు చేస్తారు మేము మకాం చేసిన హోటల్‌లో సరిగా అలాగే జరిగింది చక్కటి అందమైన జపానీ అమ్మాయి కిమొనో దరించి మా గదిలోనే భోజనాలు ఏర్పాటు చేసింది నాకు బాష రానందున మాట్లాడ్డానికి అవకాశం లేనందున చాలా విచారించాను

ఆ హోటల్‌లో స్నానాలకు పబ్లిక్ బాత్ ఉంది హోటల్‌లో మకాం చేసిన వారంతా అక్కడే స్నానం మొదటిసారిగా నేను జపానీ పద్ధతిలో స్నానం చేసాను స్నానం పూర్తి చేసిన తరువాత వేడినీళ్ళ సరస్సులో కూర్చోవడంలోని ఆనందాన్ని అనుభవించాను జపాను అంతటా పబ్లిక్ బాత్ టబ్‌లే కాకుండా ప్రైవేటు స్నాన ప్రదేశాలు కూడా ఉన్నాయి అంతేకాకుండా ఒక అందాల రాశి మనను స్నానం చేయిస్తుంది గౌరవనీయులయిన అతిదులకు స్నానం ముందు బట్టలు విప్పుకొనే శ్రమ కూడా యివ్వకుండా మనను స్నానం చేయించడానికి వచ్చిన వనిత ఆ బారం అంతా తానే వహిస్తుంది మనతోపాటు తాను కూడా సరిగంగ స్నానాలు చేస్తుంది సాదారణంగా జపాను వ్యాపారవేత్తలు తమ విదేశీ క్లయింట్లకు ఇటువంటి స్నానానుబవం కలిగిస్తారు

వీధిలో తిరిగి వచ్చిన బూట్లతో ఇంటిలోకి వెళ్ళక పోవడం అనే ఆచారం ఆ దేశంలో ఉన్న విదేశీయులు కూడా అనుసరిస్తారు ఎవరైనా భారతీయ మిత్రుడు భోజనానికి పిలిస్తే అతిధులంతా తమ బూట్లు ముందుగా విప్పి స్లిప్పర్లు వేసుకుని లోపలకు వెళతారు ఆ పద్ధతి చాలా చక్కటి అలవాటనిపించింది అయితే ఎంతమందిని ఆహ్వానిస్తే అన్ని జతల స్లిప్పర్లు ఆ ఇంటి యజమాని ఏర్పాటు చేయాలి ఆ స్లిప్పర్లు చాలా చౌక లెండి ఏ యింటికి వెళ్ళినా బూట్లు విప్పడం తిరిగివచ్చేటప్పుడు మళ్ళా వేసుకోవడం శ్రమ అని చాలా మంది తాళ్ళు కట్టుకునే బూట్లకు బదులు కాజువల్ బూట్లు వేసుకుంటారు అక్కడ కూడా అతిధులకు శ్రమ ఇవ్వకుండా షూ హారన్ చాలా పొడవుగా ఉన్నది పెడతారు అంటే బూట్లు తొడుక్కోవడానికి మనం వంగవలసిన అవసరం ఉండదు ఇవన్నీ జపానీయుల ఆతిధ్యంలోని అందాలు ఈ పద్ధతులు జపానులో ఉద్యోగం చేసే భారతీయులు కూడా అనుసరిస్తారు మనకు జపానీయుల ఇళ్ళలో ఆతిధ్యం స్వీకరించే అవకాశం రాదు ఎందువల్లనంటే విదేశీ అతిధులకు వారు తమ ఇళ్ళ వద్ద ఆతిథ్యం ఇవ్వరు వారి పార్టీలన్నీ అతిధి యొక్క అంతస్తుని బట్టి ఉంటాయి చాలా ముఖ్యమైన అతిథికి గెయిషా గృహంలో ఆతిధ్యం మిగతావారికి వారి ఇష్టాన్ని బట్టి నైట్ క్లబ్‌లోనో ప్లేబాయ్ క్లబ్‌లోనో అనేక యితర క్లబ్‌లలోనో ఆతిథ్యం స్తారు టోకియో మహానగరంలో వినోద ప్రదేశాలు రకరకాల భోజనశాలలు కౌల్లలు జపానులో సాధారణంగా పురుషులు వెళ్ళే పార్టీలకు తమ ర్యలను తీసుకు వెళ్ళరు భార్యాపిల్లలను ఇంటివద్ద ఉంచి మగ ుహారాజులు పార్టీలలో పాల్గొంటారు కొందరు తమ సెక్రెటరీలను కొన్ని రకాల పార్టీలకు తీసుకువెళతారు

జపానులో 50 సంవత్సరాల క్రితం అత్యంత వేగంగా ప్రయాణించే సాధనం గుర్రపు స్వారీ అప్పుడు ధనికులు పల్లకీలు, సామాన్య ప్రజలు రిక్షాలు ఉపయోగించేవారు కాని ఇప్పుడు జపాను ప్రజలు ప్రపంచంలో అత్యంత వేగంగా ప్రయాణం చేసే రైలు తమ ప్రత్యేకత అని గర్వంగా చెప్పుకుంటారు టోకియో ఒసాకా పట్టణాల మధ్య నడిచే టొకాయిడో ఎక్స్‌ప్రెస్ రైలు ప్రపంచంలో అన్ని రైళ్ళకంటే వేగంగా వెళుతుంది టోకియో నుంచి ఒసాకాకు మధ్య దూరం 510 కిలోమీటర్లు షింకాన్‌సెన్ ఎక్స్‌ప్రెస్ రైలు 2 గంటల20 నిమిషాలలో టోకియో నుంచి ఒసాకా తీసుకుపోతుంది ఆ రైలు గంటకు 200 కిలోమీటర్ల వేగంతో ప్రయాణం చేస్తుంది మామూలుగా ఆ రైలు గంటకు 172 కి మీ (160 మైళ్ళు) నడుస్తుంది యూరోపులో అతి వేగంగా ప్రయాణం చేసే ఫ్రెంచి మిస్ట్రయిల్ ఎక్స్‌ప్రెస్ రైలు యొక్క అత్యధిక

వేగం గంటకు 160 కి మీ (100 మైళ్ళు) కాని దాని మామూలు స్పీడు 132 కి మీ (82 మైళ్ళు) అమెరికాలో అత్యంత వేగంగా నడిచే రైలు సిటీ ఆఫ్ డెన్వర్ అత్యధిక స్పీడు 145 కి మీ (90మైళ్ళు)

టోకియో ఒసాకా నగరాల మధ్య నడిచే ఎక్స్‌ప్రెస్ రైళ్ళను బుల్లెట్ ట్రెయిన్స్ అంటారు వాటి ఇంజన్లు బుల్లెట్ ఆకారంలో ఉంటాయి టోకియో ఒసాకా నగరాల మధ్య బుల్లెట్ రైళ్ళు ఒక్కొక్కటి 990 మంది ప్రయాణీకులను తీసుకువెళతాయి అటువంటివి ప్రతిరోజు 60 ట్రిప్పులు తిరుగుతాయి

ఆ ఎక్స్‌ప్రెస్ రైలు అత్యంత వేగంగా వెళుతుంది కాబట్టి అది నడిచే దారి సాధ్యమైనంత తిన్నగా ఉండాలి అపాయాలు జరగకుండా మరొక రైలుతో ఢీకొనకుండా రాడార్ సంరక్షణ కల్పించారు ఈ రైళ్ళు ప్రత్యేక లైను మీద ప్రయాణం చేస్తాయి జపానులో ప్రయాణాలు చాలా వరకు రైళ్ళలోనే జరుగుతాయి వారి రైల్వేలు బ్రిటిష్ రైల్వేల పద్ధతిపై నిర్మించబడ్డాయి వారి రైళ్ళు ఎప్పుడూ నిర్ధారించిన సమయానికి చేరతాయని జపానీయులు సగర్వంగా చెప్పుకుంటారు నిజానికి చాలా వరకు రైళ్ళు నిర్ణీత సమయానికి చేరతాయి కాని ఏకారణం వల్లనైనా రైలు ఒక గంట ఆలస్యంగా చేరితే ప్రయాణీకుల వద్ద తీసుకున్న ఎక్స్‌ప్రెస్ టిక్కెట్టుకు డబ్బు వాపసు చేస్తారు అందుకే కాబోలు జపానులో రైలు ప్రయాణానికి 3 టికెట్లు ఇస్తారు ఒకటి పాసింజరు టికెట్టు రెండవది సీటు రిజర్వేషన్ మూడవది ఎక్స్‌ప్రెస్ టిక్కెట్టు జపానులో రైల్వే టికెట్లు, రిజర్వేషన్ టిక్కెట్లు ఇవ్వడం కంప్యూటర్లు చేస్తాయి ఇక ఆ రైళ్ళలోని కుషన్ సీట్లలో కూర్చుంటే రైలు ఎంత వేగంగా వెళుతోందో తెలియదు కాని డైనింగ్ కంపార్టుమెంటులో కూర్చుంటే మాత్రం మనకు స్పీడు తెలుస్తుంది అక్కడ స్పీడు చూపించే మీటరు ఉంటుంది నేను బులెట్ ట్రెయిన్‌లలో ప్రయాణం చేసేటప్పుడు టోకియోలో రైలు ఎక్కితే ఒసాకా చేరే లోపుగా మధ్యలో ఒక స్టేషన్‌లో మాత్రమే ఆగేది ఆ స్టేషన్‌లో ప్రయాణీకులు రైలు దిగడం ఎక్కడం మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది

రైలు ఆగే స్టేషన్ రావడానికి 10 నిమిషాల ముందు కండక్టరు రైలు అంతటా వినిపించేటట్టు స్టేషన్ వస్తోందని చెబుతాడు ఆ స్టేషన్‌లో దిగవలసిన ప్రయాణీకులు తమ సామాన్లు తీసుకుని తలుపువద్దకు వెళ్ళాలి రైలు ప్లాట్‌ఫారానికి ఏ ప్రక్కన ఆగుతుందో ప్లాట్‌ఫారానికి రైలు పెట్టెకి మధ్య ఖాళీ స్థలం ఉంటుంది కాబట్టి అడుగు జాగ్రత్తగా వేయాలనే జాగ్రత్త కూడ చెబుతాడు ఇక ట్రెయిన్ సమయానికి చేరుతుందా ఒక వేళ ఆలస్యమైతే ఎం ఆలస్యంగా వెళుతుందో వివరంగా నడిచే ట్రెయిన్‌లోనే చెబుతాడు ఆ రైల పెట్టెలోనుంచి ఎటు ప్రక్కదిగాలో ముందే చెబుతాడు కాబట్టి అక్కడ

దిగవలసిన ప్రయాణీకులు గేటువద్దకు వస్తారు ఆ ట్రెయిన్ పెట్టెలన్నీ వాటి నెంబరు ప్రకారం ప్లాట్‌ఫారంపై వేసిన నెంబర్ల ముందు ఆగుతాయి ట్రెయిన్ దిగేవారు వెళ్ళే లైను ఒకటి ట్రెయిన్ ఎక్కేవారు లోపలకు వచ్చే లైను ఒకటి ఆ లైన్లు స్పష్టంగా వేసి ఉంటాయి దిగేవారు, ఎక్కేవారు తోసుకోవడం సమస్య లేదు జపానులో ట్రెయిన్‌లో ప్రయాణం చేస్తూ వుంటె ఏదో కలగంటున్నట్టుగా అనిపిస్తుంది ముఖ్యంగా భారతీయులకు జపానులో ట్రెయిన్ ప్రయాణం మరపురాని అనుభూతి కండక్టర్ ప్రయాణీకులకు ఇచ్చే సలహాలు, చెప్పే జాగ్రత్తలు వింటే నాకు నవ్వు వచ్చేది పసివాళ్ళకు చెప్పినట్లు చెపుతున్నాడేవిటనిపించేది అయితే భారతదేశంలో జపానీ టూరిస్టులను చూచిన అనుభవం ఉన్నందున ఆశ్చర్యపడేవాడిని కాదు జపాను దేశస్థులు ఏ దేశం వెళ్ళినా వారి గ్రూపు నాయకుడు ఒక జెండా పైకి ఎత్తిపట్టుకుని నడుస్తాడు ఆ గ్రూపులోని వారంతా ఆ జెండాను అనుసరించాలి ఆ పద్ధతి చూచిన తరువాత జపానులో ట్రెయిన్ ప్రయాణంలో కండక్టరు చెప్పే జాగ్రత్తలు అతి సామాన్యం అనిపిస్తుంది

ప్రపంచంలో అత్యంత వేగంగా నడిచే ట్రెయిన్‌లే కాదు, జపాన్‌లో మోనో ట్రెయిన్ మార్గంకూడా ఉంది టోకియోలో హిమమత్సు స్టేషన్ నుంచి హానేడా విమానాశ్రయం వరకు మోనో ట్రెయిన్ టోకియో ఒలింపిక్స్ సందర్భంలో నిర్మించారు ఆ ట్రెయిన్ పెట్టెలు మామూలు ట్రెయిన్ పెట్టెల్లానే ఉంటాయి కాని రైలుపట్టాలు మాత్రం రెండు వుండవు ఒకటే పట్టా మీద నడుస్తుంది ట్రెయిన్ ఎక్కి కూర్చుంటే మనకు మామూలు రెండు పట్టాల మీద వెళ్ళే ట్రెయిన్‌కి ఒక పట్టామీద వెళ్ళే ట్రెయిన్‌కి పెద్ద తేడా కనిపించదు ఎత్తైన స్థంభాలపై వేసిన పట్టాలమీద నడిచే రైళ్ళు భవిష్యత్‌లో అతిసామాన్యం అంటున్నారు ఆ ఒక పట్టా మాగ్నెటిక్ పట్టా అట జపాను దేశస్థులు తమ ట్రెయిన్లు ప్రపంచంలో అత్యంత వేగంగా నడుస్తాయనీ, నిర్ణీతసమయానికి చేరతాయని గర్వపడటంలో తప్పు పట్టలేం జపానులో ఆవిరితో నడిచే ట్రెయిన్ ఇంజన్లు సాధారణంగా కనిపించవు నాకు ఆవిరి ఇంజన్లు చూడ్డానికి ఉత్తర జపాను దీవులకు వెళ్ళవలసి వచ్చింది అలాగే బారత దేశానికి పర్యాటకులుగా వచ్చే జపానీయులలో చాలామందికి మన ఆవిరి ఇంజన్‌లతో నడిచే ట్రెయిన్‌లు కూడా టూరిస్టుల ఆకర్షణ అంటే ఆశ్చర్యపోకండి ముఖ్యంగా మన దేశంలో డార్జిలింగ్, ఉదక మండలం, సిమ్లా మొదలయిన హిల్ స్టేషన్‌లకు బ్రిటిషు పాలకులు వేసిన చిన్న రైలు మార్గాలు జపాను పర్యాటకులకు ప్రత్యేక ఆకర్షణ

జపానులో అత్యంత వేగంగా ప్రయాణించే రైళ్ళ గురించి తెలుసుకున్నాం

ఆ బులెట్ ట్రెయిన్సు విషయంలో మరొక ప్రత్యేకత ఉంది జపానులో ఆత్మహత్యలు చేసుకోవాలనుకున్న పెద్దలు పిన్నలు అంతా ఆ రైళ్ళ క్రింద తలలు పెడతారు జపాను దేశస్తులు ప్రతి చిన్న విషయానికి ఆత్మహత్యలు చేసుకుంటారేమో అనిపిస్తుంది ముఖం చెల్లకపోవడం అన్న పరిస్థితిలో మన దేశస్థులు ముఖం చాటువేస్తారు అదే జపానులో అయితే రైలు క్రింద తల పెడతారు వారికి ముఖం చెల్లకపోవడం అనేది చాలా ముఖ్యమైన అనుభూతి పరీక్షలు తప్పిన పిల్లలు తమ ముఖం ఇంట్లోకాని స్కూలులో కాని చూపించలేక ఆత్మహత్యలు చేసుకుంటారు ఈ అలవాటు మన దేశంలో కూడా ప్రబలుతున్నదనుకోండి పెద్దవాళ్ళు రైలు క్రింద తలపెట్టి ఆత్మహత్యలు చేసుకోవడానికి కొన్ని కారణాలు వింటే నాకు ఆశ్చర్యమయ్యేది

జపానులో సామాన్యంగా ఒక కొత్త బవనం నిర్మించాలంటే కాంట్రాక్టరు పాత బవనం చుట్టూ దడికట్టిస్తాడు ఆ పాత బవనం పడగొట్టి నూతన భవనానికి శంఖుస్థాపన చేసే రోజునే ఆ భవనం ఎప్పుడు పూర్తి అవుతుందో, నూతన గృహప్రవేశం ఎప్పుడు జరుగుతుందో కూడా తేదీ నిర్ణయించి బోర్డు కడతారు అనుకున్న రోజుకు ఆ భవనం పూర్తి అయితీరాలి అయితే అనేక అనూహ్య కారణాలవల్ల భవన నిర్మాణం అనుకున్న సమయానికంటే ఆలస్యం అయితే ఏమి జరుగుతుందనుకున్నారు? ఆ కాంట్రాక్టరు రైలు క్రింద పడి ఆత్మహత్య చేసుకున్న వార్త వింటారు నిజంగా ఆ బవన నిర్మాణానికి అయిన ఆలస్యానికి అతడు కారణం కాక పోవచ్చు అయినా ఆలస్యం అయింది కాబట్టి సమాజంలో ముఖం ఎత్తుకు తిరగలేడట అటువంటి ఆత్మహత్య వార్తలు విని జపానీయులు ఆశ్చర్యపోకపోవటం అటుంచి అత్యంత సహజంగా తీసుకుంటారు బారత దేశంలో కాంట్రాక్టర్ల పద్ధతులలో అనుభవం వున్నవారికి జపానులో పద్ధతి విన్నా, చూచినా మతిపోతుంది జపాను చరిత్రలో ఆత్మహత్యలు సామాన్యంగా జరిగేవే హారాకిరీ అనే ఆత్మహత్య పద్ధతి చాలా కాలంగా జపానులో ఉంది ఆ పద్ధతి ప్రకారం హారాకిరీ చేసుకునే వ్యక్తి బాకుతో కడుపులో పొడుచుకుని, ఆ బాకును నలుప్రక్కలకు త్రిప్పుకుని మరణించడం ఆ దేశంలో వీర మరణంగా పరిగణించేవారు ఇటీవల కాలంలో ప్రముఖ రచయిత హారాకిరీ చేసుకున్నాడ అయితే హెచ్చుమంది ఆ దేశంలో ఇటీవల షింకాన్‌సెన్ రైలు క్రింద ‍ పెట్టడం సులువు అనుకుంటూ ఉండాలి

జపానులో భవన నిర్మాణ పద్ధతులు ఆసక్తికరంగా ఉంటాయి ప్రారంభించడానికి ముందుగా ప్రతిరోజు కార్మికులు ఇంజనీర్లు కాంట్ర ప్రతినిదులు సమావేశం జరుపుతారు దానిలో అంతవరకు జరిగిన

ప్రగతిని గురించి ఆరోజు జరగవలసిన పని గురించి చర్చిస్తారు అందరూ తమ అభిప్రాయాలు స్వేచ్ఛగా వెల్లడిస్తారు ఆ సంప్రదింపుల అనంతరం పని ప్రారంభిస్తారు దీనిలో ఉన్న రహస్యం ఏమిటంటే సామాన్య కార్మికునికి కూడా ఆ పనికి సంబంధించిన నిర్వహణ నిర్ణయాలలో తనకు కూడా ప్రముఖ పాత్ర వుందనే భావం కలిగించడమే ఇక ఆ కార్యక్రమాలు నిర్విఘ్నంగా సమయానికి జరగడంలో ఆశ్చర్యం లేదు అందుకే కాబోలు అలా జరగకపోతే కాంట్రాక్టర్లు రైలు క్రింద తల పెడతారు

అయితే జపానులో కార్మికులకు సమస్యలు లేవనుకోకండి ఉద్యోగులకు, కార్మికులకు అన్ని విభాగాలలోను సమస్యలు వుండేమాట వాస్తవం కాని వారు తమ సమస్యల పరిష్కారానికి అవలంభించే పద్ధతులలో కూడా వైవిధ్యం ఉంది సాధారణంగా జపాను రైల్వేస్‌లో తప్ప మరే యితర వ్యవస్థలోను సమ్మెలు వుండడం అరుదు రైల్వేస్‌లో మాత్రం ప్రతీ సంవత్సరం సమ్మె జరగడం ఆనవాయితీ అయిపోయింది మిగిలిన వ్యవస్థలలో సమస్యలు వున్నా జపానీయులు వాటి పరిష్కారానికి అవలంభించే పద్ధతి చిత్రంగా వుంటుంది అందరూ ఆఫీసులకు పనులకు వెళతారు లంచ్ వ్యవధిలో మాత్రం వారి నినాదాలతో తయారుచేసిన బ్యానర్లు బయటకు తీసి ఆఫీసుల ముందు గుమికూడి నినాదాలు చేస్తూ తమ కోర్కెలు వెల్లడిచేస్తూ తమ నిరసనను తెలియచేస్తారు చిత్రం ఏమిటంటే తమ నిరసన ప్రదర్శన మూలంగా తమ వ్యవస్థకు నష్టం కలిగించడానికి వారు అంగీకరించరు అందుమూలంగా లంచ్ వ్యవధి అయిపోగానే వారంతా తమ బ్యానర్లు మూసి ఆఫీసులకు వెళ్ళి మామూలుగా కంటే ఎక్కువ శ్రద్ధగా పనిచేస్తారు

ఈమధ్య భారతదేశం నుంచి ప్రతినిధి వర్గాలు జపాను వెళ్ళి అక్కడ పారిశ్రామిక ప్రగతిని పరిశీలించి ఆ దేశంలో కార్మిక సమస్యలు ఎలా పరిష్కారం చేస్తారో కూడా తెలుసుకుని వచ్చినట్టు వార్త జపానులో పారిశ్రామిక వేత్తలు అవలంభించే పద్ధతులు మన దేశంలో సాధ్యం కాకపోవచ్చు జపానులోని పెద్ద పారిశ్రామిక కంపెనీలు తమ సిబ్బందిని ఎన్నుకొనే పద్ధతిలో కాని ఏ కారణం వల్లనైనా కోపం వచ్చిన కార్మికుని కోపం తీర్చే పద్ధతులు కాని మనకు సరిక్రొత్త జపాను యూనివర్సిటీలలో ఫైనల్ సంవత్సరం చదివే యువకులను దేశంలోని పెద్ద కంపెనీలు ఇంటర్వ్యూ చేసి ఉద్యోగాలకు ఎంపిక చేసుకుంటాయి అతడు కంపెనీలో చేరిన రోజునుంచి ఉద్యోగ విరమణ చేసేవరకు కంపెనీ వారిదే బాధ్యత వారి వివాహాలు కుటుంబ మంచి చెడ్డలుచూడ్డం కూడా కంపెనీ బాధ్యతగా స్వీకరిస్తుంది అలా ఉద్యోగంలో చేరిన వ్యక్తి తన శక్తి సామర్థ్యాలు చూపించి

కంపెనీలో పై అధికారి అవుతాడు జపానువారి పద్ధతి ప్రకారం ప్రతివారు క్రిందనుంచి పైకి వెళ్ళాలి తప్ప మధ్య ఉద్యోగాలలో క్రొత్తవారిని నియమించడం వుండదు వారి పారిశ్రామిక ప్రగతికి మూల సూత్రం ఇదేనని ఒక భావం ఉంది

ప్రతి పెద్ద కంపెనీకి సిబ్బంది కోటులో గుచ్చుకోవడానికి ఆ కంపెనీ గుర్తుతో చేసిన Studds వుంటాయి అతడు డ్రైవరు అయినా పెద్ద ఆఫీసరు అయినా ఆ చిహ్నాలు దరిస్తారు మీరు ఎవరినైనా ఏమి ఉద్యోగం చేస్తున్నారని అడిగి చూడండి అతడు సగర్వంగా ఆ కంపెనీ చిహ్నాన్ని చూపించి తాను పనిచేసే కంపెనీ పేరు చెబుతాడు తప్ప తన ఉద్యోగం ఏమిటో చెప్పడు అది వారి కంపెనీలలో వారికున్న గౌరవం, గర్వం అయితే ఆఫీసులలో పనిచేసే సిబ్బంది కాని కార్మికులు కాని తమ నిరసన కోపం చూపించడానికి కూడా ప్రత్యేకమైన ఏర్పాట్లు ఉన్నాయి దానికి కూడా లంచ్ వ్యవదినే ఉపయోగిస్తారు వారు లంచ్ చేయటానికి ఏర్పరచిన గది గోడలపై యజమానుల ఫోటోగ్రాఫులు ఉంటాయి ఆఫీసులలో పై అధికారి అన్న మాటకు కోపం వచ్చిన ఉద్యోగి కాని, పనిలో చివాట్లు తిన్న కార్మికుడు కాని లంచ్ సమయంలో తన కోపం అంతా ఆ గది గోడలమీద ఉన్న ఫోటోగ్రాఫుల మీద చూపెడతారు తనకు కోపం తెప్పించిన అధికారి ఫోటో చితకకొడతారు ఆ సమయంలో అధికారిని ఆఫీసులో అనలేని మాటలన్నీ లంచ్ గదిలో అనేసి ఆ కోపంలో ఫోటోని గ్రుద్దుతాడు అతడి కోపం తగ్గుతుంది ఆ తరువాత మామూలుగా ఆపీసులో పనిచేయడానికి వెళ్ళిపోతాడు యాజమాన్యం పగిలిన ఫోటోలో అద్దం వేయించి మళ్ళా యధాస్థానంలో ఉంచుతుంది అది కోపం చూపించడానికి వినూత్న పద్ధతి

జపానులో ఉన్న రోజుల్లో వారి బాష నేర్చుకోవడానికి ప్రయత్నించలేదు టోకియోలోని బారతీయ మిత్రులు చాలా మంది జపానీ భాష అనర్గళంగా మాట్లాడేవారు కాని వారెవరికీ ఆ బాష వ్రాయడం వచ్చేది కాదు దానికి కారణం తెలియడం కష్టం కాదు జపాను బాషను చైనీస్ లిపిలో వ్రాస్తారు 2000 సంవత్సరాల క్రితం వేలాది చైనీస్ అక్షరాలు జపాను ప్రవేశపెట్టబడ్డాయి చాలా కాలం వరకు జపానులో ప్రబుత్వ రికార్డులు చైనీ లిపిలోనే ఉండేవి దాని పలితంగా బాగా చదువుకున్న కొద్దిమంది తప బాష వ్రాయలేకపోయేవారు ఈ ఇబ్బంది గ్రహించిన జపానీయుల పూ సామాన్యులకు కూడా చదవడానికి వ్రాయడానికి అనువుగా వుం కనిపెట్టడానికి ప్రయత్నించారు కాని అధికారిక రికార్డులు రాజప్రాసా చైనీస్ భాషలోనే ఉండేవి

8వ శతాబ్దంలో జపానులో చైనా అక్షరాలపై ఆధారపడి 48 అక్షరాలతో హీరాగన అనే లిపిని తయారుచేసారు దానికితోడు ఇతర భాషలనుంచి ఎరువు తెచ్చుకున్న మాటల కోసం కతకన లిపిని తయారుచేసారు దానిలో కూడ హీరాగల లాగే 48 అక్షరాలమాల ఉండేది చిత్రం ఏమిటంటే హీరాగన ప్రారంభంలో ఆ దేశంలో మహిళలు మాత్రమే ఉపయోగించేవారు విద్యాధికులైన పురుషులు మాత్రం చైనీస్ లిపిలోనే వ్రాసేవారు అయితే 905 వ సంవత్సరంలో రాజసౌధం నుంచి హీరాగనలో వ్రాసిన పద్యసంపుటి ప్రచురించబడింది అది జపానీ భాషకు ప్రజలలో ప్రాచుర్యానికి దోహదం చేసింది జపాను యొక్క సాంస్కృతిక చరిత్రలో అదొక మైలురాయి ఆధునిక జపాను భాషలో 'కాన' చైనీస్ అక్షరాలు కూడా ఉపయోగిస్తారు కాంజి (చైనీస్ లిపి)కి నామవాచకాలు క్రియలు విశేషణలు హీరాగన లిపిని మిగిలిన భాగాలకు కతకన విదేశీ భాషా పదాలకు ఉపయోగిస్తారు జపానులో కూడా చైనావారి పద్ధతిలోనే నిలువుగా అచ్చువేస్తారు అంతే కాకుండా ఒక వరుస తరువాత మరొక వరుస దాని ఎడమ ప్రక్క ఉంటుంది. వారి పుస్తకాలు కూడా ఉర్దూ పుస్తకాలలాగ ఎడమ నుంచి కుడికి చదువుకోవాలి ఇప్పటికీ ఇదే పద్ధతి కాని విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు అచ్చువేసేటప్పుడు మామూలు సవ్య పద్ధతి అవలంభిస్తారు

జపానులో మగవారు మాట్లాడే బాషకు మహిళలు మాట్లాడే భాషకు తేడా ఉంటుంది స్త్రీ పురుష సమానత్వం ప్రపంచవ్యాప్తంగా అంగీకరించబడినా జపానులో మాత్రం భాషాపరంగా మహిళలు మాట్లాడే భాష మృదువుగా స్త్రీలలోని అందాలను చిందిస్తూ వుంటుందట టోకియోలోని ఉన్నత కుటుంబాలలోనివారు మాట్లాడే భాష దేశ భాషగా చెలామణి అవుతుంది జపాను ద్వీపకల్పాల సమూహం అయినా ఉత్తరాదివారు మాట్లాడే భాష దక్షిణాత్యులకు అర్థం కాదు ఆ దేశంలో అనేక ప్రాంతాలలో ఉచ్ఛారణా బేదాలు ఉన్నాయి కాని దేశ వ్యాప్తంగా ఉన్న రేడియో, టెలివిజన్ పుణ్యమా అంటూ అందరికీ అర్థం అయ్యే బాష అలవాటు అవుతోంది విదేశీ పదాలను జపానీ భాషలో బాగంగా కతకన లిపి ద్వారా ఉపయోగిస్తారు మనం కూడా అనేక ఇంగ్లీషు పదాలను మన భాషలో ఉపయోగిస్తాం కాని జపానులో ఇంగ్లీషు పదాలను కతకన లోకి మార్చి వాటిని తమవిగా చేసుకున్నారు

జపానులో బాలబాలికలకు ప్రాదమిక, మిడిల్‌స్కూలు చదువు తప్పనిసరి జపానులో 6 ఏళ్లు వచ్చిన తరువాత ప్రాధమిక పాఠశాలలో ఆరేళ్ళ చదువు ప్రారంభిస్తారు ఆ బడిలో బాలబాలికలు 48 హీరాగన అక్షరాలు నేర్చుకుంటారు రెండవ తరగతిలోనికి వచ్చినవారు 48 కతకన అక్షరాలు

నేర్చుకుంటూరు ప్రాథమిక పాఠశాలనుంచి ఉత్తీర్ణులయ్యే సరికి అధికారికంగా నిర్ణయించిన అక్షరాలు పూర్తిగా నేర్చుకుని ఉంటూరు ఆ తరువాత బాలబాలికలు మూడేళ్ళు మిడిల్ స్కూలుకి వెళతారు మిడిల్ స్కూలు పూర్తి చేసేసరికి అనేక కాంజి అక్షరాలు నేర్చుకుని ఉంటూరు ప్రాథమిక పాఠశాలల్లో 9 ఏళ్ళు నిర్బంధంగా విద్య నేర్చుకుంటూరు కాబట్టి జపానులో యావన్మంది విద్య వచ్చినవారై వుంటూరు ఈ నిర్బంధవిద్య పూర్తి అయిన తరువాత విద్యార్థులు 3 ఏళ్ళ హైస్కూల్ చదువు, ఆ తరువాత 4 ఏళ్ళ యూనివర్సిటీ చదువులకు వెళ్ళవచ్చును ప్రస్తుతం జపానులో విద్యార్థి ప్రతిస్థాయిలో ఎన్ని సంవత్సరాలు గడుపుతాడో సూచిస్తూ 6-3-3-4 విద్యాపద్ధతి అమలులో ఉంది మిడిల్ స్కూలులో నిర్బంధవిద్య పూర్తి చేసిన బాలబాలికలలో 67 శాతం హైస్కూలు చదువుకి వెళతారు హైస్కూలు పూర్తి చేసిన వారిలో 21 శాతం కళాశాల చదువుకి వెళతారు

జపానులో ఏ విద్యానిలయంలో చేరాలన్నా అదొక యజ్ఞం నేను అక్కడ ఉన్న రోజుల్లో ప్రాథమిక పాఠశాలలో తమ పిల్లల్ని చేర్పించడానికి ప్రవేశ పరీక్షల కోసం వారిని తయారు చేసే తల్లులను చూచి ఆశ్చర్యపోయేవాడిని ఇక కాలేజీలలోను, యూనివర్సిటీలలోనూ చేరాలనుకొన్న వారికి ప్రవేశ పరీక్షలు ఫైనల్ పరీక్షలకంటే కష్టంగా ఉంటాయి దీనికి ముఖ్యకారణం జపానులోని పెద్ద పెద్ద పరిశ్రమలవారు యూనివర్సిటీలలోని విద్యార్థులను ఉద్యోగాలకు ఎంపిక చేసుకుంటూరు

జపాను విద్యా విధానంలో ఆంగ్లేయ బాషా అధ్యయనానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు ఆ దేశంలోని మిడిల్ స్కూలు, హైస్కూలు, యూనివర్సిటీలన్నింటిలోను వారానికి నాలుగైదు గంటలు ఇంగ్లీషు పాఠాలు చెబుతున్నారు అంటే యూనివర్సిటీ నుంచి డిగ్రీతో ఉత్తీర్ణుడైన విద్యార్థి పది సంవత్సరాలు ఇంగ్లీషు భాష చదివి ఉంటాడు కాని ఎంత విద్యావంతులైనా జపానీయులు ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడలేరంటే ఆశ్చర్యపడనక్కరలేదు వారంతా పరీక్షలలో ఉత్తీర్ణులవడానికే ఇంగ్లీషు చదువుతారనిపిస్తుంది కాని వారికి భాష బాగా తెలుసు అయితే ఎందుకు ఇంగ్లీషు మాట్లాడలేరంటే దానికి వారి విద్యావిధానం ఒక కారణం ఇంగ్లీషు చదవడం వ్రాయడం నేర్పుతారు కాని వారికి మాట్లాడడం నేర్పరు

కొన్ని సంవత్సరాల క్రితం జపానులోని మతాల గురించి తయారు చేసిన రిపోర్టు ప్రకారం పది కోట్ల జనాభాలో వివిధ మతాలకు చెందిన జనాబా 15 కోట్లు ఉంటూరని అంచనా ఈ విషయం మనల్ని తికమక పెడుతుంది అయినా దానికి కారణం లేకపోలేదు చాలామంది జపానీయులు ఒకేసారి రెండు

మతాలకు చెందివారై ఉంటారంటే ఆశ్చర్యపడనక్కరలేదు సాధారణంగా వారు వివాహాలు షింటో పద్ధతిలో చేసుకుంటారు కాని వారి అంత్యక్రియల తతంగం మాత్రం బౌద్ధమతపద్ధతి ప్రకారం జరుగుతుంది ఆ దేశంలోని మతాలకు చెందిన 15 కోట్లలో 8 కోట్లమంది షింటో మతస్థులు 6 9 కోట్లమంది బౌద్ధులు, 7 లక్షల 50 వేలు క్రైస్తవులు, 40 లక్షల పైచిలుకు అనేక ఇతర మత నమ్మకాలకు చెందినవారు ఉన్నారు

జపానీయుల్ని వారిమతం గురించి అడిగితే వెంటనే తిన్నగా సమాధానం చెప్పేవారు చాలా తక్కువ మంది కనబడతారు ఎవరైనా తాను బౌద్ధ మతస్థుణ్ణి అని చెప్పినా అతడికి ఆ మతంలో పెద్ద నమ్మకం ఉండదు అలాగే షింటో కాని క్రైస్తవ మతం గురించి కూడా ఎక్కువ తెలియదు తాను బౌద్ధ మతానికి చెందినవాడినని చెబితే వాని పూర్వులు బౌద్ధులు అయి ఉంటారు అతడి పూర్వుల ఎముకలు బౌద్ధ దేవాలయంలోని స్మశానంలో కప్పి ఉంచటంవల్ల అతడు బౌద్ధ మతస్తుడని చెప్పుకుంటారు

చాలామంది ఆధునిక యువతీ యువకులు నాస్తికులమని చెప్పుకుంటారు ఆధునిక జపానీయులు మతరాహిత్యంలో జీవితాలు గడుపుతున్నారనిపిస్తుంది కాని ఆ దేశంలో లెక్కకు మించిన షింటో, బౌద్ధ దేవాలయాలు ఉన్నాయి అంతేకాదు జపానులో పండుగలన్నీ మతానికి సంబందించినవే! నూతన సంవత్సర పండుగనాడు జపానులోని అన్ని గృహాల ద్వారబందాలను షింటో సంప్రదాయంలో అలంకరిస్తారు మన దేశంలో లాగే గృహనిర్మాణానికి కాని ఫ్యాక్టరీ నిర్మాణానికి కాని షింటో పురోహితుడు పునాదిరాళ్ళు వేయిస్తాడు గ్రామీణ పండుగలకన్నిటికీ షింటో నమ్మకాలే ఆధారం

అనాదినుండి జపానులో షింటో వారి జాతీయ మతం అనాది జపానీయుల్ని తన చుట్టుప్రక్కలనున్న ప్రకృతి నుంచి వేరుపరచడానికి వీలు ఉండేదికాదు వారు పర్వతాలను, వృక్షాలను చివరకు జంతువులను పూజించేవారు వారికి 80 లక్షలమంది "దేవుళ్ళు" ఉండేవారట ఈ రోజుకి కూడా షింటో మతంలోని ప్రకృతి ఆరాదన ప్రభావం ఆధునిక జపానీయులపై ఉంది ఉదయించే సూర్యుణ్ణి పూజిస్తారు చంద్రుని అందాలు చూసి ఆనందించడానికి పార్టీలు చేసుకుంటారు కొన్ని జపానీయుల కుటుంబాలు, గ్రామాలు కొందరు వ్యక్తుల్నికాని, ప్రకృతి సహజమైన వస్తువులనుకాని వారిని కాపాడే దేవుళ్ళుగా పూజించడం షింటో మత నమ్మకంలో ఒక భాగం జపాను చక్రవర్తుల పరిపాలనలో అభివృద్ధి చెందినది కాబట్టి ప్రఖ్యాతి చెందిన షింటో పుణ్య స్థలాలు జపాను చక్రవర్తులకు వారి కుటుంబ సభ్యులకు

అంకితం చేస్తారు షింటో మతస్థుల నమ్మకం ప్రకారం జపాను చక్రవర్తుల పూర్వీకురాలు అమె తరాసు అనే సూర్యదేవత మెయిజీ పునర్నిర్మాణ తొలిరోజుల్లో షింటో మతం రాజకీయాలతో హెచ్చుగా ముడిపడి ఉండేది చక్రవర్తిని దైవాంశ సంభూతుడుగా ఆరాధించడం ఆయన ప్రభుత్వాధినేత కాబట్టి ప్రభుత్వాన్ని ఆరాధించడం జరిగేది రెండవ ప్రపంచ యుద్ధంలో జపాను ప్రజల అంగీకారం పొందటానికి ఈ ఆరాధనాభావం తోడ్పడింది అయితే ద్వితీయ ప్రపంచ యుద్ధం తరువాత షింటో మతాన్ని జపాను జాతీయ మతంగా పరిగణించడం తగ్గిపోయింది చక్రవర్తి దైవాంశ సంభూతుడనే నమ్మకం కూడా పోయి ఆయన ప్రజల యొక్క ఐక్యతకు, దేశం యొక్క చిహ్నాంగాపరిగణించబడుతున్నాడు

బౌద్ధమతం బారత దేశంలో స్థాపించబడినప్పటికి జపాను దేశంలోకి కొరియా ద్వారా ప్రవేశించింది దానికి ముందు కూడా ఆసియా ఖండంలో ఆవిర్భవించిన అనేక మత విశ్వాసాల ప్రభావం జపాను ప్రజలపైన ఉండేది బౌద్ధమతం జపానులోనికి ప్రవేశించేసరికి నారాలో ప్రధమ జపాను చక్రవర్తి జపానులోని అన్ని ప్రాంతాలను ఐక్యపరచి తన ప్రభుత్వాన్ని నెలకొల్పాడు ప్రధమంలో బౌద్ధ మతస్థులు జపానులో హింసలకు గురి అయ్యేవారు దానికి కారణం ఆ మతం విదేశీది కావడమే కాని 6వ శతాబ్దం తుదికాలంలో చక్రవర్తి సుయికో పాలనలో ప్రిన్స్ రీజెంట్ షొటోకు బౌద్ధ మతాన్ని రాజమతం స్వీకరించి అనేక శాఖలను ఐక్యపరిచాడు

బౌద్ధ మతం న్యాయంలోను ప్రభుత్వ పాలనకు ముఖ్య సూత్రంగ అంగీకరించబడింది దాని ఫలితంగా జపానులో బౌద్ధమతం ప్రాబల్యం పెరిగింది ఆ తరువాత కూడా బౌద్ధమతం ఒడుదుడుకులు ఎదుర్కొనవలసి వచ్చింది అయితే 1603లో నెలకొల్పిన టొకుగావా షోగునేట్ పుణ్యమా అంటూ జపానీయులంతా బౌద్ధమతాన్ని స్వీకరించవలసి వచ్చింది ప్రభుత్వ సహాయంతో బౌద్ధమతం దేశంలోని మారుమూలలకు కూడా ప్రాకింది బౌద్ధ దేవాలయాలు దేశమంతా వెలిసాయి ఆయా ప్రాంతాల ప్రజలు యిచ్చే విరాళాలతో బౌద్ధ దేవాలయాలు బాగ్యవంతాలయ్యాయి బౌద్ధ బిక్షవులు ప్రభుత్వానికి జనాబా లెక్కలలో తోడ్పడేవారు వారి పుణ్యమా అంటూ బౌద్ధ దేవాలయాలు ప్రజలకు విద్య నేర్పడంలో చాలా ప్రముఖ పాత్ర వహించాయి వారు ఐశ్వర్యంతో ప్రపంచంలోని అన్ని మతాలవలెనే జపానులోని బౌద్ధ మతాధికారులు చెడు అలవాట్లకు పాల్పడడంతో మత విశ్వాసంగా బౌద్ధమతం యొక్క విలువ తగ్గిపోయింది కొన్ని పెద్ద దేవాలయాలలో సిగరెట్టు త్రాగుతూ బీరు త్రాగుతూ తమ వద్దకు సలహా కోసం వచ్చినవారితో మాట్లాడే

బౌద్ధభిక్షుకుల్ని చూచి నన్ను నేను నమ్మలేకపోయాను బౌద్ధ దేవాలయాలలో డబ్బు హుండీలో వేసిన భక్తులు మూడుసార్లు చప్పట్లు కొడతారు డబ్బు వేసామని బుద్ధ భగవానునికి చెప్పడానికేమో అనిపించేది నాకు

మిగిలిన సమయాలలో దేవాలయాలకు వెళ్ళినా, వెళ్ళకపోయినా నూతనసంవత్సర దినంనాడు మాత్రం ఆడ మగ సాంప్రదాయసిద్ధమైన వారి జాతీయదుస్తులు కిమొనోలు దరించి దేవాలయాలకు వెళ్ళడం చూడ్డానికి ముచ్చటగా ఉండేది

జపానులో 1958 వరకు వ్యబిచారం న్యాయ సమ్మతం ఆ దేశంలో ప్రతి పట్టణంలోను వేలాది మంది మగువలతో కలకలలాడే వేశ్యా వాటికలుండేవి నిజానికి టోకియోలోని యోషివారా వేశ్యావాటిక కియోటోలోని షిమాబారా వేశ్యావాటికలు పూర్వకాలపు ప్రముఖ ఉకియో (కర్రచెక్కడాల) చిత్రకారులకు ప్రసిద్ధి చాలా వరకు జపానులో దొరికే ఉకియో చిత్రపటాలు ఆ రోజుల్లో ఉండే ప్రసిద్ధి చెందిన వేశ్యలు గీసినవే జపానులో వేశ్యా వాటికలంటే బొంబాయి వంటి బారతీయ పట్టణాలలో ఉండే ఇరుకు సందులు, జుగుప్సాకరమైన పరిసరాలు కావు అవి ఆనంద నిలయాలు వేలాది అత్యున్నత స్థాయి హోటళ్ళు, బార్లు చక్కగా అలంకరించిన గెయిషా గృహాలతో నిత్య కల్యాణం పచ్చతోరణంలా ఉండేవి ఆ స్థలాలు వ్యబిచార యాలే అయినా అదొక అందమైన అనుబూతి నవ్వుల పువ్వులతో మర సంగీతంతో ప్రతిద్వనించి తినడానికి త్రాగటానికి హాయిగా ంతకాలం గడపడానికి ఆనందనిలయాలుగా ఉండేవి

లక్షలాది పాతతరం మగ మహారాజులను విచార సముద్రంలో ముంచి ఆ పూర్వపు శోబ బోగం ఆనందం అంతరించి పోయింది దానికి ముఖ్యకారణం రెండవ ప్రపంచ యుద్ధం తరువాత జపాను మహిళలకు పంతరించిన ఓటింగు హక్కు తమకు వచ్చిన ఓటింగు హక్కులతో మహిళలు సాదించిన ప్రదమ విజయం అదికారికంగా వ్యబిచారానికి చరమగీతం పాడటం దాని పలితంగా జపానులోని అన్ని పట్టణాలలోను వేశ్యావాటికలు మూతపడ్డాయి ప్రస్తుతం వాటి స్థానంలో 'మిజు షోబాయ్' చోటుచేసుకుంది 'మిజు షోబాయ్' అంటే బార్లు నైట్‌క్లబ్బులు కేబరే డాన్సు హాల్సు మసాజ్ పార్లర్లు ఉండే ప్రదేశాలకు జపానీయులు పెట్టుకున్న ముద్దు పేరు జపానులో బార్లుకి పాశ్చాత్య దేశాలలో బార్లకి కొన్ని తేడాలు ఉన్నాయి నిజానికి బార్లంటే మద్యపానం సేవించే ప్రదేశాలే కాని జపాను బార్లలో అంతా అమ్మాయిలే వారిని హోస్టెస్‌లు అంటారు ఇంటి యజమానురాలు అతిధులను ఎలా ఆప్యాయంగా ఆహ్వానించి ఆతిద్యం యిస్తుందో అంతకంటే ఆదరంగా,

ఆప్యాయంగా హోస్టెస్‌లు తమ బార్‌కి వచ్చే అతిథులను గౌరవిస్తారు నైట్ క్లబ్‌కి బార్‌కి పెద్ద తేడా ఉండదు కాని క్లబ్ అనేసరికి ఒక బ్యాండు, డాన్సు చేయడానికి జాగా ఉంటాయి కాబరేలు బ్రహ్మాండమైన నైట్‌క్లబ్బులు దానిలో వందలాది హోస్టెస్‌లు ఉంటారు ప్రతిరాత్రి అతిథుల ఆహ్లాదం కోసం ప్రదర్శనలు ఉంటాయి మిజుషోబాయ్ కార్యక్రమాల్లో లక్షలాది మంది మహిళలు ఉంటారంటే ఆశ్చర్యపోకండి

వ్యభిచారం అధికారికంగా ఎత్తి వేసినందున ఈ క్లబ్బులలోను, బార్లలోనూ పనిచేసే హోస్టెస్‌లు వ్యభిచారులు కారు వారు సాధారణంగా తమ అతిథులను చక్కటి సంభాషణతోను, డాన్సులతోను ఆనందపరుస్తారు కొద్దిగా ముద్దు చేయడానికి అభ్యంతరం చెప్పరు అయితే వారిలో చాలామంది వారు అడిగిన డబ్బు యివ్వగలిగిన అతిథులతో శృంగార చేష్టలకు యిష్టపడతారు అనేకమంది పురుష పుంగవులు ఈ క్లబ్బులలో మంచి అందమైన సర్వాలంకారభూషితులైన ముద్దు గుమ్మలతో దగ్గరలోని తక్కువ వ్యవధి హోటళ్ళకు వెళ్ళడం అతి సామాన్యం

'తక్కువ వ్యవధి హోటల్' జపానుకి ప్రత్యేకత ఈ హోటల్స్ గంట లెక్కన గదులు జంటలకు మాత్రమే అద్దెకిస్తారు జంటలుగా హోటల్‌కి వస్తే ఏవిధమైన ప్రశ్నలు అడగరు ఆ దేశంలో వ్యభిచారం నిషేధించబడినది కాబట్టి హోటల్స్‌లోనికి వ్యభిచారుల్ని తీసుకువెళ్ళకూడదు అయితే తక్కువ వ్యవధి హోటళ్లు ఆ దేశంలో న్యాయసమ్మతం ఈ తక్కువ వ్యవధి హోటల్స్ వ్యభిచారానికి మాత్రమే ఉపయోగిస్తారనుకోండి జపానులో వివాహితులైన కుమారుడు తన తల్లిదండ్రులు సోదరీ సోదరులతో కలిసి ఒకే ఇంట్లో ఉండడం ఆచారం ఆ పరిస్థితులలో నవయువ దంపతులు కూడా ఈ తక్కువ వ్యవధి హోటళ్ళను ఆశ్రయిస్తారు పాశ్చాత్య దేశాలలో లాగే జపానులో కూడా వివాహానికి ముందు ప్రేమికులు ప్రేమించుకోవడం అలవాటు చేసుకున్నారు వివాహానికి ముందు సెక్స్ పనికిరాదని మడికట్టుకు కూర్చోరు అయితే వారి ప్రేమ కలాపాలకు కూడా తక్కువ వ్యవధి హోటళ్లు ఆశ్రయమిస్తాయి జపానులో ప్రతిపట్టణంలోను ఇటువంటి హోటళ్లు అనేకంగా ఉన్నాయి వాటి యజమానులు బ్రహ్మాండమైన వ్యాపారం చేస్తారు అవసరాన్ని బట్టి లంచ్ వ్యవధిలో కూడా ప్రత్యేక తగ్గింపు రేట్లపై ప్రేమజంటలకు గదులు అద్దెకు యిస్తారు

పగలు కాని రాత్రికాని ఈ ప్రత్యేక హోటళ్ళలో గదులు ఉపయోగించే ప్రేమ జంటలకు ఏవిధమైన యిబ్బంది ఉండదు తమను ఎవరైనా చూస్తున్నారేమో అనే అనుమానం కూడా రాకుండా హోటల్ యజమాని

జాగ్రత్త పడతాడు ఆ పద్ధతి చూసితీరాలి తక్కువ వ్యవది హోటుల్సు ప్రతి పట్టణంలోను వందల సంఖ్యలో ఉంటాయి కాబట్టి వాటిని ఉపయోగించదలచిన జంటలకు వాటిని వెతుక్కోవలసిన బాధ ఉండదు తలుపు తీయగానే అక్కడ ఎవ్వరు ఉండరు యజమాని తెరవెనుక ఉంటాడు గదితాళం తెర క్రిందనుంచి ముందుకు తోస్తాడు ఆ తాళం తీసుకుని గదిలోకి వెళ్ళిపోతారు ఆ జంట యొక్క ప్రేమకలాపాలు అయిన తరువాత బైటకు వెళ్ళేటప్పుడు గది అద్దె తెర క్రింద పెడతారు వాళ్ళు లోపలకు వెళ్ళేటప్పుడు కాని బైటకు వెళ్ళేటప్పుడుకాని వాళ్ళు మరో కంటికి కనిపించరు పాశ్చాత్య దేశాలతో పోల్చిచూస్తే జపానులోని తక్కువవ్యవది హోటళ్ల నిజంగా వారి ప్రత్యేకత అనిపిస్తుంది

జపానులో వ్యాపారాభివృద్ధి కోసం వ్యాపార సంస్థలు అధ్యక్షుల నుండి సామాన్య ఉద్యోగి వరకు వారికి ఉపయోగ పడతారనుకున్న వారిని వినోద కాలక్షేపానికి ఆహ్వానించడం పరిపాటి సాయంకాలం కస్టమర్‌ని భోజనానికి, వినోదకాలక్షేపానికి పిలవడం సర్వసామాన్యమైపోయింది ఆ దేశంలో ఉపయోగపడే కస్టమర్ తనని సాయంకాల వినోదానికి తీసుకు వెళ్లమని అడగడానికి కూడా సందేహించడు ఆ కాలక్షేపం ఖర్చు అంతా కంపెనీ అకౌంట్‌లో పడుతుంది కాబట్టి ఎవ్వరూ వెనుకాడరు ఏ కారణం వల్లనైనా తమ క్లయింట్‌ని ఒక సాయంకాలం కాలక్షేపానికి ఆహ్వానించడంలో వెనకాడితే వారి వ్యాపార సంబందాలు బెడిసికొడితే ఆశ్చర్యపడనక్కరలేదు స్నేహితుల్ని కాని వ్యాపార సంబందాలున్న వారిని కాని ఒక సాయంకాలం వినోద కాలక్షేపానికి ఆహ్వానిస్తే ఖర్చు తడిసి మోపెడవుతుంది పెందలాడే భోజనంతో ప్రారంభమైన సాయంకాలం భోజనానంతరం వినోదం ప్రారంబమౌతుంది

సామాన్యంగా జపానీయులు ఒక బార్ వద్ద కాని నైట్ క్లబ్ వద్ద కాని ఎక్కువ సేపు ఉండరు అదమం మూడు నాలుగు బార్లు, క్లబ్బులు చూస్తే కాని సాయంకాలం వినోదం పూర్తి అయినట్టు కాదు వాటిలో ఒక బార్ ఆహ్వానించిన వానికి అత్యంత ప్రీతి పాత్రమైనది ఆహ్వానితునికి కూడా ప్రీతి పాత్రమైన నైట్ క్లబ్‌కి కూడా వెళతారు మద్యసేవనం తప్పనిసరి అయితే దురదృష్టవశాత్తు సామాన్య జపానీయుడు హెచ్చుగా మద్యం త్రాగి నిలబడలేడు బార్లు, నైట్ క్లబ్‌లు మూసివేసే సమయంలో అర్ధరాత్రి దాటిన తరువాత ఇద్దరు ముగ్గురు జపానీయులు ఒకరి చేతులలో మరొకరి చేతులు తగిలించి రోడ్డు మీద తూలుతూ టాక్సీ కోసం వెదకటం సర్వ సామాన్య దృశ్యం టాక్సీ ఖర్చు ఆహ్వానించిన వాడే పెట్టుకుంటాడు ఆ సమయంలో టాక్సీలకు బోలెడు గిరాకీ గింజాలో టాక్సీ డ్రైవర్లు రెండు వేళ్ళు చూపించిన

వారిని తప్ప మిగిలిన వారిని పట్టించుకోరు మీటరు చూపించిన రేటు మీద రెట్టింపు యిస్తామని ఆ సౌంజ్ఞ అర్థం

ఈ భోజనాలు, త్రాగుడు, వినోదకాలక్షేపాలు బోలెడు ఖర్చుతో కూడిన వ్యవహారం 1971లో జపాను ఆదాయపు పన్ను అధికారుల అంచనా ప్రకారం వినోద కాలక్షేపాల పద్దుక్రింద లిమిటెడ్ కంపెనీలు మాత్రమే 3768 కోట్లు రూపాయలు విలువైన జపానీ యెన్‌లు ఖర్చుపెట్టారు ఈ ఖర్చులో హెచ్చు బాగం బార్లు, నైట్ క్లబ్‌లలో అయినట్టు అంచనా ఈ బార్లు నైట్‌క్లబ్‌లలో పనిచేసే అమ్మాయిలు నెలకు 3,000 నుంచి 30,000 రూపాయల వరకు సంపాదిస్తారు కేబరే హోస్టెస్ అందరిలోకి తక్కువ సంపాదిస్తుంది గింజాలో హోస్టెస్‌లకు అధిక రాబడి ఉంటుంది త్రాగినవాడే ఇచ్చుకుంటాడు తాటిపన్ను అన్నట్టు ఈ ఖర్చులన్నీ ఒల్లు బలిసిన కంపెనీలు పెట్టుకుంటాయి

ఇటీవలి కాలంలో జపానులో గోల్ఫ్ ఆటకు పరపతి పెరిగింది గోల్ఫ్ క్లబ్బులలో సభ్యత్వం సంపాదించడం రోజురోజుకి కష్టమయిపోతోంది రెండు మూడేళ్ళ క్రితం గోల్ఫ్‌క్లబ్ సభ్యత్వం మిలియన్ జపానీస్ యెన్‌లకి వచ్చేది కాని యిప్పుడు రెండు మూడు మిలియన్ యెన్‌లు ఖర్చు పెడితే కాని ఆ సభ్యత్వం రావడం లేదు కస్టమర్లను గోల్ఫ్ ఆటకు తీసుకు వెళ్ళడం ప్రస్తుతం జపానులో ఫ్యాషన్ 'గోల్ఫ్‌విడో ' అనే పదం కూడా చలామణిలోకి వచ్చింది ఇద్దరు గోల్ఫ్ ఆటకు వెళితే పబ్లిక్‌కోర్సులో 180 రూపాయలు అవుతుంది ప్రైవేటు కోర్సులో 300 రూపాయలు అవుతుంది ఇదిగాక కష్టమర్‌కి లంచ్ డ్రింక్స్, టాక్సీ ఖర్చులు కలుపుకుంటే తక్కువేమీకాదు అయితే కస్టమర్ని గోల్ఫ్‌కోర్సుకి తీసుకు వెళ్ళడం అతణ్ణి రాత్రి వినోదానికి తీసుకువెళ్ళడంకంటే చాలా చౌక

గోల్ఫ్‌కంటే ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్న వినోదం చైనీస్ మహజాంగ్ ఆట జపానులో ఈ ఆట 1907లో ప్రవేశపెట్టబడినది ఈనాడు అది జపానులో ఎక్కువమంది చేత అబిమానించబడే ఆట అనటంలో అతిశయోక్తి లేదు జపానులో ఏ మూల చూచినా మహజాంగ్ ఆడే ప్రదేశాల ఉన్నాయి ఈ ఆట హాంకాంగ్‌లోను సింగపూర్‌లోనే కాకుండా సిక్కింలోన భూటాన్‌లో కూడా ప్రజాదరణ పొందిన ఆట ఈ ఆట నలుగురు ఆడతా చైనీస్ లిపిలో వ్రాసిన చిన్న చిన్న పెంకులతో ఆడతారు ఈ ఆట యె లక్ష్యం కూడా సెట్‌లు, సీక్వెన్సులు చేయడమే కాబట్టి దీనిని మనవాళ రమ్మీ పేకాటతో పోల్చవచ్చు ఈ ఆట పందాలు లేకుండా ఉండదు హాంకాంగ్ సింగపూర్‌లతో పోలిస్తే జపానులో ఈ ఆటలో సామాన్యంగా ఉంటాయి జపానులో ఇద్దరు కస్టమర్లను మహజ

తీసుకు వెళ్ళడం అతి చౌకగా తేలిపోయే వినోదకాలక్షేపం ఆటలో లాభనష్టాలు ఆడినవారే పెట్టుకుంటారు అయితే ఆహ్వానించిన పెద్దమనిషి మహాజాంగ్ ఇంటి బిల్లు భోజనం, డ్రింక్స్ ఖర్చుతో బైటపడవచ్చు

జపానీయులు ఓన్‌సెన్‌కి వెళ్ళడం అంటే పడిచస్తారు ఓన్‌సెన్ అంటే మినరల్ హాట్ స్ప్రింగ్ అగ్నిపర్వతాలతో నిండిన దేశం కావడం వల్ల జపానులో యిటువంటి ప్రదేశాలు వందలకొలది ఉన్నాయి వాటి చూట్టూ జపాను పద్ధతి హోటల్సు బార్లు నైట్‌క్లబ్బులతో కూడిన చిన్న చిన్న పట్టణాలు వెలిసాయి మంచి కష్టమరుని ఏడాదికొక సారైనా ఓన్‌సెన్‌కి తీసుకువెళ్ళడం ఆచారం సాదారణంగా ఈ ప్రయాణాలు ఎక్కువ మంది కలసి చేస్తారు మహజాంగ్ ఆడడం నుంచి సర్వ సదుపాయాలు హాయిగా అనుభవిస్తారు అన్నిటి కంటే మించి పొగలు చిమ్మే మినరల్ నీటితో నిండిన బాత్‌లో విశ్రాంతి తీసుకుని ఆనందించడం వారికి అత్యంత ప్రియమైన కాలక్షేపం

వినోదకాలక్షేపానికి అనేక అవకాశాలున్న జపానులో అతిధులను స్వగృహాలలో భోజనానికి ఆహ్వానించే పాశ్చాత్య ఆచారాన్ని వారు అంతగా హర్షించరు కాని అటువంటి ఆహ్వానం వస్తే విదేశస్థుల జీవన సరళి చూడాలనే కుతూహలంతో వెళతారు వారు భార్యలను సాదారణంగా పార్టీలకు తీసుకువెళ్లరు అయితే తాము ఆహ్వానించిన జపాను మిత్రునితో వచ్చిన ముద్దుగుమ్మ అతడి భార్య కాదని తెలుసుకుని తెల్ల ముఖం వేస్తారు మనవాళ్ళు

తమ వ్యాపారాభివృద్ధి కోసం జపానులోని వాణిజ్య సంస్థలు తమకు ఉపకరిస్తారనుకున్న వారిని వినోద స్థలాలకు, నైట్‌క్లబ్బులకు తీసుకువెళతారని తెలుసుకున్నాం అదంతా చాలదన్నట్టు జపానులో మరొక ఆచారం ఉంది అదే బహుమానాల పండుగ బహుమానాలు యివ్వడానికి ఓఛుజెన్, ఓసీబో సమయాలు గొప్ప అవకాశాలు ఒకటి జూన్ నెలలోను రెండవది నూతన సంవత్సరానికి ముందుగా డిశెంబరులోను పాటిస్తారు జపానులోని ప్రతి వ్యాపార సంస్థ తమకు తెలుసున్న అధికారుల లిస్టులు తయారు చేసి వారికి బహుమతులు పంపుతారు ఆ బహుమానాలలో తరతమ భేదాలు ఉంటాయనుకోండి వారి వ్యాపారానికి ఎంతగా ఉపయోగిస్తాడో అని బేరీజు వేసి ఆ అదికారికి అతడి విలువనుబట్టి బహుమతులు పంపుతారు ఆ బహుమతులు చేతిరుమాలు నుంచి రిఫ్రిజిరేటరు, రంగుల టెలివిజన్ వరకు ఉంటాయి డిపార్టుమెంటల్ స్టోర్సు ద్వారా ప్రభుత్వాదికారులకు బహుమతులు పంపడం ఆచారం

అయితే ప్రపంచంలో కష్టమర్లకు బహుమానాలు ఇవ్వకుండా విందులు వినోదాలతో పని లేకుండా వ్యాపారం జరుగుతుంది కదా మరి జపానులో

ఇదంతా ఎందుకు అవసరమనే అనుమానం వస్తుంది దానికి సమాధానం వారి ఉపకార బద్ధత సిద్ధాంతంలో ఉంది ఎవరైనా ఉపకారం చేస్తే వారికి తిరిగి ఉపకారం చెయ్యాలి అని భావం ఈ భావాన్ని జపాను వ్యాపారవేత్తలు చక్కగా ఉపయోగించుకుంటారు కష్టమర్ని నైట్‌క్లబ్బుకి తీసుకువెళ్ళడం అందమైన అమ్మాయిలతో విందులు వినోదాలు ఏర్పాటు చేయడం ఉపకార బద్ధత సిద్ధాంతంలో భాగమే ఆ విధంగా ఉపకారం పొందిన వ్యక్తి పదింతలు వ్యాపారంలో ఉపయోగిస్తాడు చిత్రం ఏమిటంటే వ్యాపారం యివ్వడం యిష్టం లేని కష్టమరు ఆహ్వానాలు అంగీకరించకుండా ఉపకార బాధ్యత నుంచి బైటపడతాడు దీనిలోని రహస్యం ఏవిటంటే వ్యాపార సంబంధాలను వ్యక్తిగత స్నేహ సంబంధాలుగా మార్చుకోవడమే దీని ఫలితంగా జపానులో కష్టమరు ఉపకార బద్ధత ప్రపంచములో అన్ని దేశాల కంటే హెచ్చు

జపానులోని ఉపకార బద్ధత సిద్ధాంతాన్ని అనేకమంది పాశ్చాత్య రచయితలు విమర్శించారు ఇదంతా అవినీతి, మభ్యపెట్టటానికి చేసే ప్రయత్నంగా అభివర్ణించారు దీనిలో కొంత నిజం లేక పోలేదు అయితే మనం అవినీతి అనేదాన్ని జపానువారు అందంగా సిద్ధాంతీకరించారు అంతేకాదు జపానులో బహుమానాలు ఇవ్వడాన్ని అవినీతి లంచాలు యివ్వడం అనరు అనుకోరు అయితే డబ్బు రూపంలో లంచాలు పుచ్చుకోవడం జపానులో అరుదు ఏది ఏమైనా జపాను వ్యాపారాభివృద్ధి చూస్తే వారి పద్ధతి చాలా విజయవంతంగా పని చేస్తుందని చెప్పాలి

గెయిషా పార్టీలు ఒకప్పుడు సంప్రదాయ వినోదంగా ఉండేవి కాని వ్యాపారాభివృద్ధి కోసం చేసే ప్రయత్నాలలో గెయిషా పార్టీలు పరాకాష్టనందుకున్నాయి గెయిషాపార్టీలో సాధారణంగా విందు భోజనం కబుర్లు త్రాగ గలిగినంత సాకే (జపాను రైస్ వైన్) త్రాగడం ఉంటుంది ఆ పార్టీ చాలా ప్రశాంతంగా, హాయిగా ఉండే జపాను పద్ధతి గదిలో జరుగుతుంది గెయిషాల గురించి అనేకమంది అమెరికన్ రచయితలు అనేక అతిశయోక్తులు వ్రాసారు కానీ అవన్నీ నిజం కాదని జపాను మిత్రులు చెబుతారు గెయిషా సంప్రదాయం జపానులో 16వ శతాబ్ద మధ్య కాలంలో ప్రారంభమైంది ఆ దేశంలో మూడుతీగెల సామిసెన్ (గిటార్) ప్రవేశపెట్టడంతో గెయిషాలు వచ్చారని వారి నమ్మకం గెయిషాలు చాలా కష్టమైన అభ్యాసం చేసి సంప్రదాయ నృత్యాలు చేయడం సంగీతం పాడడమే కాకుండా మనస్సుని రంజింపజేసే సంభాషణలు కూడా చేయగలరు ఏ పార్టీలోనయినా తమ అతిధులకు సాకే పోయడం, చక్కటి కబుర్లు చెప్పటం, సామిసెన్ వాయించడం, డాన్సు చేయడం గెయిషా అమ్మాయిల ప్రత్యేకత

నేటి గెయిషాలు పూర్వపు సంప్రదాయ గెయిషాల అంత సమర్థులు కారని ఒక వాదం ఉంది కాని అధునాతన గెయిషాలు కాలమాన పరిస్థితులకనుగుణ్యంగా గోల్ఫ్‌ఆట ఇంగ్లీషు సంభాషణ నేర్చుకుంటున్నారు వ్యాపారాభివృద్ధి కోసం కస్టమర్లను బహుమానాలతో ముంచెత్తడం వినోద కాలక్షేపాలకు తీసుకువెళ్ళడం ఖర్చుతో కూడిన వ్యవహారం సామాన్యులు భరించలేని భారం అయితే సామాన్య యువతీ యువకులు కాఫీహోటళ్ళలో కూర్చుని కాఫీ త్రాగుతూ కబుర్లాడుకోవడం అలవాటు చేసుకున్నారు కాఫీ హౌసులు చక్కగా అలంకరిస్తారు కాని లోపల చీకటిగా ఉండడంవల్ల ఆ అందాలు కనిపించవు కొన్ని ప్రత్యేకంగా జాజ్ సంగీతం రికార్డులు వేస్తే మరికొన్ని సంప్రదాయ సంగీతమే వేస్తారు మొత్తం మీద జపానులో అన్ని అభిరుచులకు అనువైన కాఫీహౌస్‌లు ఉన్నాయంటే ఆశ్చర్య పడనక్కరలేదు జపానులో ఏ పట్టణంలోనయినా పెద్దవీధిలో నడుస్తుంటే పచింకో పార్లరు కనిపించితీరుతుంది వాటిలో అనేక వరుసలలో పిన్ బాల్ మెషిన్లు ఉంటాయి ప్రతి దానిముందు అమ్మాయిలు అబ్బాయిలు నిలబడి బొటనవ్రేలితో మెషిన్‌ని నొక్కి ఇనుపగుళ్లను గదులలో పడేటట్టు చేయడంలో నిమగ్నమై కనిపిస్తారు పచింకో ఆడడం జపాను ప్రజలకు వెర్రి వ్యామోహం అయిపోయింది ఏ కొంచెం సమయం ఉన్నా దగ్గరలోని పార్లర్‌లకు వెళ్ళి పచింకో ఆడుకోవడం అలవాటయి పోయింది దేశంలోని ప్రతి వందమందికి ఒక పచింకోమెషిన్ ఉన్నదని అంచనా దేశం మొత్తం మీద 2 కోట్లమంది పచింకో ఆడతారు ఈ ఆట నిజంగా కాలక్షేపం ఆట

మొదట 50 ఎన్స్ పెట్టి 50 బాల్స్ కనుక్కోవాలి ఒక బాల్ రంధ్రంలో పడితే మెషిన్ 15 బాల్స్ యిస్తుంది ఓపిక ఉన్నంత సేపు ఆడడం విసుగెత్తినప్పుడు మనవద్ద మిగిలిన బాల్స్ యిస్తే చిన్న చిన్న బహుమానాలు యిస్తారు చిత్రం ఏమిటంటే పచింకో ఆడ మగ బహుమానాల కోసం ఆడరు

నిజానికి జపాను ప్రజలకు కాలక్షేపానికి కరువు లేదు వారు ఉదయించే చంద్రుణ్ణి చూచి చక్కటి పువ్వుల్ని చూచి పాటలు పాడుకుంటూ ఆనందిస్తారు టోకియోలోని ఉనావు పార్కులో కూర్చుని సాకే త్రాగుతూ పాటలు పాడుతూ అక్కడ విరిసిన ఛెర్రీ పుష్పాలు చూస్తూ ఆనందిస్తారు సంవత్సరానికొకసారి ఛెర్రీ పుష్పాలు చూచినపుడు పండుగ చేసుకుంటారు టోకియో వాసులు

జపానులో ఆటలకు ప్రాముఖ్యత హెచ్చు ఆటలలో ఉత్సాహంగా పాల్గొనడం మూలంగా శరీరాన్ని మనస్సుని ఆత్మనీ కూడా ఒక క్రమ పద్ధతిలో ఉంచవచ్చని వారు నమ్ముతారు అందుమూలంగా 15 నుంచి 60

ఏళ్ల మధ్య వయస్సులో ఉన్నవారంతా ఆటలయందు ఆసక్తి చూపిస్తారు క్రీడాకారులలో పురుషులు స్త్రీలకంటే హెచ్చు సంఖ్యలో ఉంటారు టోకియో ఒలింపిక్ ఆటల తరువాత క్రీడలలో విజయాలు సాధించడం ఆధునిక ప్రపంచంలో అభివృద్ధి చిహ్నంగా భావించి క్రీడారంగంలో తామెంత అభివృద్ధి సాధించారో ప్రపంచానికి చూపించాలనే తాపత్రయం జపాను ప్రజలలో ఎక్కువైంది దానితో క్రీడలు ప్రజాదరణను పొందాయి ఆటలు పాఠశాలల్లోను, విశ్వవిద్యాలయ స్థాయిలో కూడా అన్ని పాఠ్యాంశాల వలెనే నేర్పుతారు జపానులోని పెద్దపెద్ద కంపెనీలకన్నింటికి వారి టీములు ఉంటాయి జపానులో ప్రపంచ దేశాలలో ఆడే ప్రముఖ క్రీడలన్నీ ఆడతారు అవే కాక ఆ దేశంలో తప్ప మరెక్కడా ఆడని ఆటలు కూడా ఉన్నాయి జపానులో క్రీడలను మూడు భాగాలు చేయవచ్చును వారి దేశీయ క్రీడలు, విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నవి విదేశాల నుంచి దిగుమతి చేసుకుని తాము స్వంతం చేసుకున్నవి

సుమో కుస్తీ జపానువారి జాతీయక్రీడగా పరిగణించబడుతుంది అయితే ఆ కుస్తీని చూచి ఆనందించడమేకాని దానిలో పాల్గొనే అవకాశం అందరికీ ఉండదు హైస్కూళ్ళలోను, యూనివర్సిటీలలోను, పచ్చిక బయళ్ళలోను విద్యార్థులు, యువకులు సుమో కుస్తీ ఆట ఆడుకోవటం చూడవచ్చు సుమో యొక్క చరిత్ర స్పష్టంగా తెలియదు 2000 సంవత్సరాలనుంచి జపానులో ఉన్నట్టు అంచనా పూర్వకాలంలో సుమో కుస్తీలు దేవాలయ ప్రాంగణాలలో నిర్వహించబడేవి కాబట్టి సుమో జపాను దేశస్థుల మతంతో ముడిపడి ఉంది నిజానికి చాలా మంది సుమోను మతపరమైన ఉత్సవంగా పరిగణిస్తారు కాని క్రీడ అని భావించరు సుమో కుస్తీ పోటీలలో పాల్గొనే వస్తాదుల్ని చూస్తే ఆశ్చర్యపోతాం సామాన్యంగా జపానీయులు పొట్టిగా ఉంటారనేది నిజం కాని సుమో వస్తాదులు అంతా ఆరడుగుల ఎత్తు ఉంటారు వారి బరువు 300 నుంచి 400 పౌన్లు ఉంటుంది వారు నడుస్తూంటే చిన్న ఏనుగులు నడిచినట్టే ఉంటుంది వారంతా తమ జుట్టు పైకి దువ్వి పూర్వపు సమురాయి స్టయిల్‌లో నెత్తి మీద ముడివేస్తారు వారు యుకాతా తొడుగుకొని పాంకోళ్ళతో నడుస్తారు జపానులో అనేక కేంద్రాలలో సుమో వస్తాదులను తయారుచేస్తారు వారి భోజనం ప్రత్యేకం అని వేరే చెప్పనక్కర లేదు క్రీడాకారులుగా వారికి బ్రహ్మాండమైన ప్రజాదరణ పరపతి ఉంది కుస్తీలు జరిగే ప్రదేశం రెండు అడుగుల ఎత్తు 18 అడుగుల చతురంగా ఉంటుంది ఆ ఇసుక నేల మీద 15 అడుగుల మధ్యకొలత ఉన్న గుండ్రని ప్రదేశాన్ని మెలిపెట్టిన గడ్డితో వేరుచేస్తారు ఈ కుస్తీల ఫలితాలు నిర్ణయించడానికి అంపైర్ ఉంటాడు

సుమో కుస్తీకి సంబంధించిన నియమాలు చాలా సులువైనవి రంగంలో నిలబడ్డ ఇద్దరు వస్తాదులు అంపైర్ సిగ్నల్ అందుకుని కలియబడతారు వస్తాదు యొక్క ఏ భాగమైనా రింగ్ బైటకు వెళ్ళినా అతడి కాళ్ళు తప్ప మిగిలిన ఏ శరీర భాగమైనా రింగ్ లోపల నేలకు తగిలినా అతడు కుస్తీ ఓడిపోయినట్టే వస్తాదులు గోచీతో మాత్రమే ఉంటారు కొన్నికుస్తీలు క్షణాలలో అయిపోతాయి నిజానికి ప్రపంచంలో అత్యంత వేగంగా పూర్తి అయ్యే క్రీడ సుమో అని చెప్పవచ్చు అయితే వారు కుస్తీకి ముందు చేసే హంగామా, హడావిడి కాలహరణం ముందు జయాపజయాలు క్షణాలమీద తేలతాయి ప్రత్యర్థిని రింగ్ బైటకు తోయడానికి గాని రింగ్‌లో మట్టి కరిపించడానికి గాని వారు అనేక పద్ధతులు అవలంభిస్తారు త్రోయడం పడగొట్టడం వాటిలో ముఖ్యం కాని తన్నడం, పొడవడం మరే యితర అవాంఛనీయ చర్యలు నిషిద్ధం రింగ్‌లో ఉండే అంపైర్ కాక మరొక ఐదుగురు న్యాయ నిర్ణేతలు ఆ పీఠం చుట్టూ వివిధ ప్రాంతాలలో కూర్చుంటారు ఈ పోటీలు ప్రతి సంవత్సరం దేశంలోని ప్రముఖ పట్టణాలలో ఆరుసార్లు నిర్వహిస్తారు ప్రతిసారి ఈ పోటీలు 15 రోజులు జరుగుతాయి ఈ ఆరు పోటీలలోను పాల్గొన్న వస్తాదుల స్థానాలను నిర్ణయించడం చాలా క్లిష్టమైన పద్ధతి వారి స్థానాలలో అత్యంత ప్రముఖ స్థానం పొందిన వస్తాదుకి 'గ్రాండ్ ఛాంపియన్' అనే బిరుదు యిస్తారు గ్రాండ్ ఛాంపియన్ స్థానం పొందిన వ్యక్తికి స్వచ్ఛందంగా పోటీలనుంచి విరమించడం తప్ప స్థానభ్రష్టత లేదు గ్రాండ్ ఛాంపియన్ స్థానం పొందడం అంత సులువు కాదు జపాన్‌లో సుమో చరిత్రలో యింతవరకు 50 మంది మాత్రమే గ్రాండ్ ఛాంపియన్లు ఉన్నారంటే వాని ప్రాముఖ్యత దానిని సంపాదించడానికి వారికి ఎంత సామర్థ్యం ఉండాలో ఊహించవచ్చు

సుమో సామాన్యంగా ఆ దేశం జనాబాలో పెద్దవారికి అత్యంత ప్రీతి పాత్రమైన క్రీడ సుమోకు జపానువారి పూర్వచరిత్రలో ఉన్న స్థానం పుణ్యమా అంటూ పెద్దలు దానిని శ్రద్ధతో చూస్తారు నిజానికి లక్షలాది మంది సుమో పోటీలు టెలివిజన్ మీద చూచి ఆనందిస్తారు సుమో ప్రత్యక్షంగా చూడాలంటే స్టేడియంలో బాక్స్ సంపాదించడం సామాన్యునికి సాధ్యంకాదు సుమో చూడ్డానికి నేను చేసిన ప్రయత్నం, పడిన పాట్లు ఎప్పుడూ మర్చిపోలేను చిత్రం ఏవిటంటే టెలివిజన్ మీద సుమో చూడ్డంతో సంతృప్తి పడలేకపోయాను మిత్రుడు హోతాసాన్‌తో నా కోరిక చెప్పాను ఇక అతడు పడిన పాట్లు వర్ణనాతీతం సుమో పోటీలు జరిగే స్టేడియం పట్టణం బైట వుంది అక్కడకు చేరిన తరువాత ఇక హోతాసాన్ ఎంతమంది అధికార్లను చూసాడో

చెప్పలేను స్టేడియంలోని అన్ని బాక్సులు నిండిపోయినవని వార్త తిరిగి వెళ్ళడానికి మనస్సు అంగీకరించలేదు ఏమైనా సరే ఆనాటి కార్యక్రమం చూచి తీరాలని నిర్ణయించుకుని రంగంలోకి నేనే దిగాను జనరల్ మేనేజర్‌ను కలుసుకున్నాను నేను భారత ప్రభుత్వ ప్రతినిధినని చెప్పి నాకు సుమో యందున్న అభిమానం వెల్లడించాను మనస్సుంటే మార్గం ఉందన్నారు కదా! జనరల్ మేనేజరుకి నా విన్నపం నచ్చింది చక్రవర్తి కోసం నిర్ణయించిన ప్రత్యేక స్థానాలకు దిగువనున్న వరుసలో రెండుస్థానాలు ప్రత్యేకించారు అక్కడ నుంచి మొత్తం స్టేడియం అంతా చక్కగా కనిపించింది బాక్సులలో కూర్చునే వారంతా క్రింద కూర్చోవలసిందే భార్యాభర్తలు అవునో కాదో తెలియదు కాని ప్రతి బాక్సులోను మగ ఆడ జంటలుగా కూర్చుని సాకే సేవిస్తూ సుమో చూడ్డం కనిపించింది గోచీతో కుస్తీలో పాల్గొనే వస్తాదులు కార్యక్రమానికి ముందు బ్రహ్మాండమైన దుస్తులు వేసుకొని అంతా కలసి రింగ్‌లో కనబడతారు వారి దుస్తుల ఖరీదు వేల డాలర్లు ఉంటాయని అంచనా

జపానులో ప్రజలు రోజంతా కష్టపడి పనిచేసి సాయంకాలం స్నానం చేసి సేద తీర్చుకున్నట్టే వారంతా సంవత్సరం పొడుగునా కష్టించి పనిచేసి జాతీయ సెలవలలో కాని పండుగ సెలవలలో కాని హాయిగా ఆనందంగా గడిపివేస్తారు మన దేశంలోలాగ సెలవలలో కూడా పని చేసి డబ్బు సంపాదించడం వారికి కిట్టని పని సెలవలు అంటే వారి దృష్టిలో విశ్రాంతి కుటుంబంతో ఆనందంగా గడపడం టోకియోలో బారత రాయబారి జపాను వారి నూతన సంవత్సర సెలవల గురించి చెబుతూ ఆ వారం రోజులు జపానులో చాలా మంది బల్లల క్రిందనే కాని బల్లల వద్ద ఉండరని అపహాస్యం చేసేవాడు వారు తమ పని విషయంలో ఎంత శ్రద్ధా భక్తులు చూపెడతారో సెలవల విషయంలో కూడా అంత శ్రద్ధా, ఆసక్తి చూపెడతారు జనవరి ఒకటవ తేదీ జపాను దేశస్థులకు కొత్త సంవత్సరం పండుగ నూతన సంవత్సర పండుగ సందర్భంగా ఆ దేశంలో ఆఫీసులన్నీ ఆరు రోజులు మూసి వేస్తారు డిశంబరు 29 నుంచి జనవరి 3వ తేదీవరకు నూతనసంవత్సర జాతీయ సెలవు దినాలు పాశ్చాత్య దేశాలలోలాగ జపాను వీధులలో హడావిడి ఉండదు క్రిస్టమస్ పండుగనాడు పాశ్చాత్యులు విశ్రాంతిగా యింటివద్ద కుటుంబసభ్యులతోగడిపినట్టుగానే నూతనసంవత్సరం పండుగ జపానులో విశ్రాంతిగా ఉండే కుటుంబ వ్యవహారం ఆనాడు ప్రతి జపానీ భర్త ఇంటి పనులలో భార్యకు తోడ్పడతాడు

క్రొత్త సంవత్సరాన్ని ఆహ్వానిస్తూ 108 సార్లు పట్టణాలలోను గ్రామాలలోను బౌద్ధదేవాలయాల నుండి గంటలు మ్రోగుతాయి 108 సార్లు గంటలు మ్రోగించటానికి కారణం చిత్రంగా ఉంటుంది బౌద్ధ మత సిద్ధాంతం

ప్రకారం 108 ప్రాపంచిక ఆనందాలు ఉన్నాయట! దేవాలయాలలో గంటలు వినపడగానే స్త్రీలు, పురుషులు కిమనోలు ధరించి పావుకోళ్ళు శబ్దాలతో పుర వీధుల్లో నడుస్తూ షింటో దేవాలయాలకు వెళ్ళి ప్రార్థనలు చేస్తారు ఏ యితర సందర్భంలో కూడా ప్రార్థన చేయనివారు కూడా నూతన సంవత్సరం నాడు రాబోయే ఏడాదిలో దేశానికి ప్రజలకు శుభం కలగాలని ప్రార్థనలు చేస్తారు క్రొత్తసంవత్సర సెలవులలో మహిళలు, యువతులు రంగురంగుల ఖరీదైన కిమొనోలు ధరించి పట్టణవీధుల్లో తిరుగుతుంటే కన్నుల పండువుగా ఉంటుంది నూతన సంవత్సర సందర్భంగా మిత్రుల్ని, బంధువుల్ని, ఉన్నత అధికారుల్ని చూచి వారికి శుభాకాంక్షలు చెప్పడం ఆచారం ఇది పూర్వ సాంప్రదాయం రానురాను పద్ధతులు మారుతున్నాయి కుటుంబ సభ్యులతో చక్కటి వినోద పర్యాటక కేంద్రానికి వెళ్ళి సెలవలు అక్కడ గడపడం అలవాటు చేసుకుంటున్నారు సెలవల తరువాత నూతన శక్తి సామర్థ్యాలతో పనులలోకి వెళతారనే భావం నిజానికి భ్రమ మాత్రమే ఆ సెలవలలో ఆనందించడానికి వారు పెట్టే ఖర్చు మద్యపాన సేవనం తదితర కార్యకలాపాలతో వారు ఒకటి రెండు రోజులు పని చేయడానికి పనికి రారు అది వారి నూతన సంవత్సర పండుగ

జపానులో 20 ఏళ్ళ వయస్సు వచ్చిన యువతీ యువకులు ఓటు వేయడానికి అర్హులు జపాను దేశ పౌరులుగా బాధ్యతలు స్వీకరించడానికి 20 ళ్ళ వయస్సు రావాలి ఆ దేశంలో 20 ఏళ్ళ వయస్సు వచ్చినవారి కోసం ఒక ఃతీయ పండుగ చేసుకుంటారు జనవరి 15వ తేదీనాడు జరుపుకొనే ండుగనాడు 20 ఏళ్ళ వయస్సు వచ్చిన యువతీ యువకుల్ని బాధ్యతా యుతులైన పౌరులుగా ఆహ్వానిస్తారు జపానులో ఒక సామెత ఉంది ఎండలు కాని చలి కాని హీగన్ కంటే ఎక్కువ కాలం ఉండదని హీగన్ అంటే బౌద్ధమత సంప్రదాయ ప్రకారం ఋతువు మార్పులకు సంబంధించిన సెలవు దినాలు మార్చి 21వ తేదీ వసంత ఋతువు ప్రవేశించే రోజుగాను, సెప్టెంబరు 23వ తేదీ శిశిరం ప్రవేశించే రోజుగాను పరిగణిస్తారు ఋతువుల మార్పురోజులు జపాను దేశస్థులు జాతీయ సెలవు దినాలుగా పరిగణిస్తారు ఆ సెలవు దినాలనాడు వారంతా తమ పూర్వీకుల సమాధులను సందర్శిస్తారు ఈ ఋతు మార్పుల సెలవు దినాలు బౌద్ధమత సంప్రదాయాలతో ముడిపడి ఉన్నాయి

జపానులో ఏప్రిల్ 29నుంచి మే నెల 3వ తేదీ వరకు వచ్చే సెలవుల్ని ఆ దేశ ప్రజలంతా అత్యంత ఆనంద భరితంగా పరిగణిస్తారు కాబట్టి ఆ వారాన్ని "గోల్డెన్ వీక్" అని పిల్చుకుంటారు ఏప్రిల్ 29వ తేదీ జపాను చక్రవర్తి

హిరహీతో జన్మ దినం (ఇటీవల హిరహీతో చక్రవర్తి మరణించాడు) మే నెల 5వ తేదీ బాలల దినం ఈ బంగారు వారం సెలవులు చక్రవర్తి జన్మదినం ఉత్సవంతో ప్రారంభమవుతాయి వేలాదిమంది టోకియోవాసులు చక్రవర్తి రాజసౌధంలోనికి వెళ్ళి చక్రవర్తికి తమ శుభాకాంక్షలు తెలుపుతారు చక్రవర్తి తన ప్రజలకు దర్శనమిచ్చి వారికి శుభం కోరుతూ ఆశీర్వదిస్తారు ఆ దేశ ప్రజలను ఏడాదికి రెండుసార్లే రాజసౌధ ఆవరణలోనికి రానిస్తారు చక్రవర్తి జన్మదినంనాడు, నూతనసంవత్సర సందర్భంగాను ప్రజలకు తమ చక్రవర్తిని చూచే అవకాశం కలుగుతుంది నేను టోకియోలో ఉద్యోగం చేసే రోజుల్లో చక్రవర్తి జన్మదిన సందర్భంగా రాజ సౌధ ఆవరణలోనికి వెళ్ళాను చక్రవర్తి హిరహీతో ఆయన భార్య కుమారుడు కోడలు మనుమనితో కలిసి సౌధం మొదటి అంతస్తులో అద్దాల వెనుక నిలబడి ప్రజలకు దర్శనమిచ్చారు ప్రజల స్పందన చూచి ఆశ్చర్యపోయాను నినాదాలు లేవు, గొడవలేదు చక్రవర్తి భగవంతుని అవతారం అనే నమ్మకం త్రోసిపుచ్చి ఆయన కూడా సామాన్య మానవుడనే భావం ఉన్నా చక్రవర్తిని చూచినప్పుడు జపాను ప్రజలు చూపించే గౌరవ ప్రపత్తులు అనుపమానం

మే నెల 3వ తేదీ జపానులో రాజ్యాంగ దినోత్సవం చేసుకుంటారు ఆ రోజున జపాను యుద్ధానంతర రాజ్యాంగం 1947లో అమలులోనికి వచ్చింది మే 5 వ తేదీ పిల్లలకోసం ప్రత్యేకించబడింది ఆ రోజును పూర్వం బాలురపండుగ రోజు అనేవారు దానిని అధికారికంగా మార్చి ఇప్పుడు పిల్లల పండుగ అంటారు పేరు మార్చినా పిల్లల పండుగ బాలుర పండుగగానే చెలామణి అవుతుంది పండుగనాడు జపానులో ప్రతి గృహం పైన జెండా కర్రలపై ఆ కుటుంబంలో ఎంతమంది బాలురు ఉన్నారో తెలియజేసే గండు చేపల జెండాలు ఎగుర వేస్తారు చైనా, జపాను దేశాలలో గండు చేప ధైర్యసాహసాలకు చిహ్నం ఆ దేశంలో బడి పిల్లలు వేలాది మంది బంగారువారంలో వినోద పర్యటనానికి వెళతారు

చిత్రం ఏమిటంటే జపానులో సంస్కృతికి ఒక రోజు నిర్ణయించబడింది నవంబరు 3వ తేదీన సంస్కృతి దినంనాడు ప్రభుత్వం విజ్ఞానవేత్తలకు కళాకారులకు ఇతర ప్రముఖ వ్యక్తులకు బహుమతులు పంచిపెడతారు ఆనాడు కళలను విజ్ఞానాన్ని ప్రోత్సహించడానికి కళా ఉత్సవం జరుపుకుంటారు పూర్వం ఈ రోజును 1868-1912 వరకు జపానును పాలించి ఆ దేశం యొక్క ఆధునిక ప్రగతికి పునాదులు వేసిన మెయిజీ చక్రవర్తి జన్మదినంగా పరిగణించేవారు దాని పేరు ప్రస్తుతం సంస్కృతి దినంగా మార్చారు

జపానులో ప్రజాస్వామ్యం రెండవ ప్రపంచ యుద్ధం తరువా

ప్రవేశపెట్టబడినా ఇంత వరకు ఆ వ్యవస్థ జయప్రదంగానే నిలదొక్కుకుంది ప్రారంభంలో అనేక పాశ్చాత్య రచయితలు జపానులో ప్రజాస్వామ్య సిద్ధాంత మనుగడ విషయంలో అనేక అనుమానాలు వ్యక్తం చేసారు పార్టీల మీద ఆధారపడే ప్రజాస్వామ్య పద్ధతి నిరంకుశ పాలనకు చక్రవర్తికి అలవాటుపడ్డ జపానుదేశంలో బ్రతికి బట్టకడుతుందని ఎవరూ ఊహించలేదు చిత్రం ఏమిటంటే అందరి అనుమానాలను అధిగమించి జపానులో ప్రజాస్వామ్యం సుస్థిరంగా పాతుకుపోయింది ప్రజాస్వామ్య వ్యవస్థ పుణ్యమా అంటూ ఆ దేశం అంతర్జాతీయ అలజడులకు దూరంగా ఉంటూ వారి జాతీయ, ఆర్థిక ప్రగతికి దోహదం చేయగలిగింది జపానులో ప్రజాస్వామ్య సిద్ధాంతం విజయవంతం కావడానికి ముఖ్యకారణం, ప్రేరణ వారు దానిని విజయవంతం చేయాలనుకోవడమే అంటే అతిశయోక్తి కాదు వారు శతాబ్దాలుగా అలవాటుపడ్డ నిరంకుశ విధానాలు ప్రజాస్వామ్యం ద్వారాను చక్రవర్తి పూజను విద్యతోను, యుద్ధం చేయకూడదనే నిర్ణయం సైన్యాలను రాజ్యాంగంగా నిషేధించడంతోను, ప్రజలకు రాజ్యాంగపరమైన అధికారాలు యివ్వడంతోను ప్రజాస్వామ్యాన్ని ఆ దేశంలో పటిష్టం చేసారు ఈ పద్ధతిలో పుట్టి పెరిగిన నూతన తరం జపాను పౌరులు పాత పద్ధతులకు స్వస్తి చెప్పారు

బైట ప్రపంచం నుంచి అలవరచుకున్న అన్ని అలవాట్లవలెనే ప్రజాస్వామ్యంపై కూడా ప్రత్యేక జపాను ముద్ర కనిపిస్తుంది జపానులో నెలకొల్పిన ప్రజాస్వామ్య పరిపాలన బాహ్యంగా చూడ్డానికి బారత దేశంలోని పద్ధతిలాగానే కనిపిస్తుంది కాని దానిని నిశితంగా పరీక్షిస్తే కొన్ని ఆశ్చర్యకరమైన బేదాలు కనుపిస్తాయి ముందు సామ్యాలు చూద్దాం ద్వితీయ ప్రపంచ యుద్ధం అయినప్పటినుంచి జపానులో ఒకే పార్టీ ఆ దేశాన్ని పరిపాలిస్తుంది 1947లో ఒక్క సంవత్సరం తప్ప మిగిలిన కాలం అంతా లిబరల్ డెమోక్రాటిక్ పార్టీ (జిమిన్-తో) ఆ దేశాన్ని పాలిస్తోంది ఆ దేశంలో వున్న ఇతర పార్టీలలో సోషలిస్టు పార్టీ కమ్యూనిస్టు పార్టీ (కోమీ-తో) డెమూక్రాటిక్ సోషలిస్టు పార్టీలు వారి బలంపై ఆధారపడి రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహిస్తాయి జపాను సోషలిస్టు పార్టీ బ్రిటిష్ లేబరు పార్టీ కంటే వామపక్షం కావడమే కాకుండా వారు పెకింగ్ వైపు మొగ్గుచూపుతారు కమ్యూనిస్టు పార్టీ కొద్దిగా మాస్కో వైపు మొగ్గు కాని ఆ పార్టీకి మాస్కోలో గాని పెకింగ్‌లో గాని పరపతి లేదు ఇక కోమితో పార్టీ సోంకా గక్కాయ్ అనే అతివాద బౌద్ధశాఖకు చెందిన రాజకీయ శాఖ ఆ మధ్య కొన్ని రాజకీయ అభిప్రాయాల మూలంగా సోంకా గక్కాయ్‌తో ఉన్న సంబంధాలను తెగతెంపులు చేసుకోవలసి వచ్చింది దాంతో ఆ పార్టీ బలం క్షీణించింది

డెమోక్రాటిక్ సోషలిస్టు పార్టీ జపాను సోషలిస్టు పార్టీ నుంచి విడిపోయిన మధ్యేమార్గ పార్టీ ఈ ప్రతిపక్ష పార్టీలన్నీ కలసి జపాను పార్లమెంటు (కొక్కాయి)లో 1972లో 208 మంది సభ్యులు ఉండేవారు ప్రభుత్వ పక్షానికి 283 స్థానాలు

జపాను లిబరల్ డెమోక్రాటిక్ పార్టీలో సిద్ధాంతాల రీత్యా సారూప్యత కనిపించినా నిజానికి అది అనేక గ్రూపుల మిశ్రమం పార్లమెంటులో ఉన్న పాలకపక్ష సభ్యులంతా ఏదో ఒక గ్రూపుకి చెందినవారు అయి ఉంటారు ఆ గ్రూపునాయకులు తమగ్రూపుకి నిధులు వసూలు చేయడం తమగ్రూపు సభ్యులకు పరిపాలనలో అధికారం పరపతి ఉండే స్థానాలు సంపాదించడానికి ప్రయత్నిస్తారు పరువు ప్రతిష్ట గల స్థానాలు సంపాదించగలిగినా లేకపోయినా అన్ని గ్రూపులకు చెందిన సభ్యులు పార్టీకి విధేయులై ఉండాలి లిబరల్ డెమోక్రాటిక్ పార్టీకి గ్రామీణ ప్రాంతాలలో చాలా బలం ఉంది పార్లమెంటుకి గ్రామీణ ప్రాంతాల నుంచి హెచ్చు మంది సభ్యులను గెలిపించుకోవడానికి ప్రయత్నిస్తారు

జపానులో ప్రజాస్వామ్య పద్ధతి ప్రపంచంలోని పద్ధతితో ముఖ్యంగా ప్రభుత్వోద్యోగుల విషయంలో విభేదిస్తుంది ప్రభుత్వోద్యోగులకు జపానులో బ్రహ్మాండమైన పరపతి 250 ఏళ్ళ టొకుగావా పాలనలో ప్రభుత్వోద్యోగులే దేశాన్ని పాలించారు యుద్ధానంతరం జపాను అమెరికను ఆధీనంలో ఉన్న రోజుల్లో కూడా అమెరికన్లు పరోక్షంగా ప్రభుత్వోద్యోగుల ద్వారానే దేశపాలన నిర్వహించారు ఆధునిక జపానులో దేశపరిపాలనా వ్యవస్థ చూస్తే లిబరల్ డెమోక్రాటిక్ పార్టీని అడ్డుపెట్టుకొని ప్రభుత్వోద్యోగులే దేశాన్ని పాలిస్తారనిపిస్తుంది నిజానికి పాలకపక్షంలోని రాజకీయ నాయకులు ప్రభుత్వోద్యోగుల్ని దేశాన్ని పాలించడానికి అంగీకరిస్తారు కాని అప్పుడప్పుడు బలమైన ప్రధానమంత్రి పాలనలో పాలకపక్షానికి ఉద్యోగులకు పొరపొచ్చాలు రావడం కద్దు సర్వసామాన్యంగా ఉద్యోగులు తమ మాట చెల్లించుకుంటారు జపానులో ప్రభుత్వోద్యోగులు సంఘంలోని మేధావి వర్గాలకు చెందినవారై ఉంటారు వారు దేశంలోని ప్రముఖ విశ్వవిద్యాలయాలనుంచి వచ్చినవారు వారి శక్తి, సామర్థ్యాలను చూచి, జాతీయ సౌభాగ్యానికి వారి కృషినిబట్టి వారికి ప్రజలలోను వ్యాపార వర్గాలలోను, బోలెడు గౌరవం పరపతి ఉంటాయి

మనం జపాను ప్రభుత్వం గురించి మాట్లాడేటప్పుడు ఆ దేశంలో పాలకపక్షం, ప్రభుత్వోద్యోగులు వ్యాపార వర్గాల మిశ్రమ ప్రభుత్వం గురించి మాట్లాడుతున్నామని గుర్తుంచుకోవాలి ప్రపంచ యుద్ధానికి పూర్వం

జపానులో నెలకొని వున్న మిట్సుబిషి మిట్సూయి, సుమితోమో మొదలైన పారిశ్రామిక వ్యాపార సంస్థలు ఇంకా ఆ దేశంలోని పరిశ్రమలను, వ్యాపారాన్ని నిర్వహించడంలో కీలక పాత్ర వహిస్తున్నాయి ఇప్పుడు మరికొన్ని కొత్త గ్రూపులు స్వతంత్రులు ఇంకా ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి యుద్ధానంతరం జపానులో ఆవిర్భవించిన పారిశ్రామిక సంస్థలలో మత్సుషిత టోయోకో, గ్యోహోండా, టొయోటా ఇడెమిట్సు, హిటాచి బ్రహ్మాండంగా పెరిగిపోయాయి ప్రతి పరిశ్రమకు ఒక ట్రేడ్ అసోసియేషన్ ఉంటుంది ఈ అసోసియేషన్ల ద్వారా ప్రభుత్వ శాఖలతో సంబంధాలు పెంచుకుంటారు ఇవిగాక జపాను చాంబర్ ఆఫ్ కామర్స్ మరికొన్ని సంఘాలు ప్రభుత్వ విధాన నిర్ణయాలలో చురుకుగా పాల్గొంటాయి ఈ వ్యాపార సంస్థలకు పాలక పక్షానికి ఉన్న సంబంధాలు చాలా గట్టివి

జపానులో సంగీతం నాటకం రక్తసంబంధమున్న సోదరుల్లా పెరిగాయి జపాను దేశస్థులు సంగీత నాటకాల్ని శతాబ్దాలుగా పెంచి పోషించి ఆనందిస్తున్నారు జపానులో సంగీతం, నృత్యం ఆవిర్భావం గురించి అనేక కధలు గాధలు ఉన్నాయి వారి ఆరాధ్యదైవం సూర్యదేవత సూర్యుని వెలుగునంతా తీసుకుని ఒక గుహలోనికి వెళ్ళిపోయినప్పుడు ఆ సూర్య దేవతను గుహలోనుంచి బైటకు వచ్చేటట్టు చేయడానికి అమెనో మికాతో అనే వ్యక్తి సంగీతం పాడుతూ నృత్యం చేసాడని వారి 'పురాణాలు' చెబుతాయి అప్పుడు సూర్యదేవత ఆ సంగీతానికి నృత్యానికి ఆకర్షితురాలై గుహనుండి బైటకు వచ్చి వారికి సూర్యరశ్మిని ఆనందాన్ని ప్రసాదించినదని గాధ అయితే దేవతల కోసం చేసిన ప్రధమ నృత్య సంగీత నాటక కళ అనేక మార్పులు చెందినది అయినా ఈనాటికి ఆ కళారూపాలు జపాను ప్రజల్ని ఆనందింపజేస్తూనే ఉన్నాయి

ఈనాటి వరకు జపాను ప్రజల్ని ఆనందింపజేసే అత్యంత పురాతనమైన నాటక ప్రక్రియ నో దానికి అర్థం ప్రదర్శన ఈ ప్రక్రియ పుట్టుకనాటి నుంచి ఈనాటి వరకు సంగీతం, నృత్య రూపాలు పెద్దగా మారలేదు చిత్రం ఏమిటంటే నాటక రూపం సామాన్య ప్రజల ఆనందం కోసం తయారు చేయబడింది అది "కోతి సంగీతం", "పొలాల సంగీతం" సహాయంతో సామాన్య మోటు నృత్య ప్రదర్శనాలుగా ప్రారంభించబడ్డాయి అప్పటి పాలక ప్రభువులు వారి అనుయాయులు తమ అభిరుచికి అనువుగా దానిని తీర్చిదిద్దుకున్నారు దాని ఫలితంగా 17నుంచి 19వ శతాబ్దకాలంలో టొకుగావా పాలనలో సామాన్యులు నో నాటకాలు చూడ్డాన్ని శాసన రీత్యా నిషేధించారు 14,15 శతాబ్దాలలో ఉన్న ప్రముఖ నాటక రచయితలు

కియోట్సుగుకనామి ఆయన కుమారుడు మెటో కియోసీమి నో నాటకాల కోసం బ్రహ్మాండమైన పునాదులు వేసి దానిని ఈ నాటికి ప్రజల ఆదరాభిమానాలు చూరగొనడానికి ఆస్కారం కల్పించారు నో రంగస్థల కార్యక్రమంలో సంగీతం చాలా నెమ్మదిగా సాగదీసి పాడతారు దానికి సంగీత పరికరాలుగా ఫ్లూటు, డ్రమ్ములు ఉపయోగిస్తారు డ్యాన్సులు కూడా చాలా నెమ్మదిగా పూర్వ పద్ధతిలో ఉంటాయి ప్రదర్శకులంతా తాము ధరించే పాత్రల వేషాలకు కృత్రిమ ముఖాలు ఉపయోగిస్తారు నో నాటకాలలో యాక్షన్ ఉండదు నటులంతా కథలు చెప్పే పాత్రలు ధరించి, ఆ కథను సంగీతం నృత్యం సహాయంతో చెబుతారు

నో డ్రామా అంత పెద్దది కాదు కాని ఆ నాటకాలు ఐదు కలిపి ప్రదర్శించడం మూలంగా ఒక ప్రదర్శన ఆరు ఏడు గంటలు పడుతుంది ఆ ఐదు నాటకాలలో ఒకటి దైవ సంబంధమైనది ఒకటి చనిపోయిన వీరుని కథ, ఒక స్త్రీ కథ, పిచ్చిదాని కథ దెయ్యాల కథలు ఉంటాయి నో నాటకాలు ప్రదర్శనలు అందరికీ అందుబాటులో ఉంటాయి టెలివిజన్‌లో కూడా చూపిస్తారు కాని వాటిని మార్థించి, ఆనందించడానికి ప్రేక్షకులలో చరిత్ర ప్రజానమ్మకాలు, పూర్వకాలపు సంగీతం గురించి చక్కటి అవగాహన అవసరం అందుమూలంగా నో చాలా తక్కువ మంది జపాను వారికి అర్థం అవుతుంది ఇక విదేశీయుల మాట వేరే చెప్పాలా!

కబుకి జపాను వారి ప్రజా నాటక ప్రక్రియ హాలంతా పాముకోళ్ల ప్రతిధ్వనులతో మారు మ్రోగుతుంది అంతలో తెరలేచేసరికి సామిసెన్ చేసే శబ్దాలతో హాలు నిండిపోతుంది సామిసెన్ శబ్దాలు మధ్య కొన్ని గొంతులు కలిసి ఆనాటి నాటకాన్ని పరిచయం చేస్తాయి ఒక పాత్రధారి స్టేజి మధ్యకు పరుగున వస్తాడు అతడు ఇంద్రధనస్సు రంగులలో ఉన్న పూర్వ కాలపు దుస్తులు ధరించి ఉంటాడు పొడుగాటి తెల్లజుట్టు విగ్ ధరిస్తాడు ప్రేక్షకులలోనుంచి పాత్రధారిని మెచ్చుకుంటూ అరుపులు అది కబుకి కబుకి ప్రదర్శన రోజంతా జరుగుతుంది అయితే కబుకి ప్రేక్షకులు తమకు నచ్చిన యాక్టరు ఫలానా పాత్రలో ఎలా నటిస్తున్నాడో చూడడానికి ఒక గంట రెండు గంటలు కూర్చుంటారు కబుకి అతిశయోక్తులతో కూడిన సజీవ నాటకరంగం బ్రహ్మాండమైన రంగులు, ప్రత్యక్ష నటన విస్తృతమైన హంగులు కబుకి లో నాటకీయత, ప్రదర్శన విలువలు హెచ్చు ఆ నాటకాలు అర్థం చేసుకోవడం సులభం కాబట్టి కబుకి కి ప్రజాదరణ ఎక్కువ కబుకి ప్రదర్శనలో నాటక రచయిత కంటే నటులకు ప్రాముఖ్యత హెచ్చు నటుల యొక్క శక్తి సామర్థ్యాలను ప్రదర్శించడానికి వీలుగా నాటకాలు ఉంటాయి కబుకి లో

ఆడవేషాలు కూడా పురుషులే వేస్తారు

మన దేశంలో నాటక రంగంలోనికి స్త్రీలు ప్రవేశించని రోజులలో మగవారు ఆడవేషాలు వేసేవారు కాని జపానులో కబుకి ఆడవారితో ప్రారంభమై ఇప్పుడు ఆడ వేషాలు కూడా మగవారు వేసే స్థితికి చేరింది జపానులో 17వ శతాబ్దంలో కబుకి రంగస్థల ప్రదర్శనలు ఒక మహిళ ప్రారంభించింది ఒకుని అనే మహిళ షింటో దేవాలయంలో నర్తకిగా ఉండేది కాని ఆమె నాట్యాలు మతానికి అతీతంగా, అసభ్యంగా, అశ్లీలంగా ఉండేవట ఆ తరువాత ఆమె పాత జపాను నాటకాల నుంచి కొన్ని ఇతివృత్తాలు తీసుకొని ప్రదర్శించేది ఆమె ప్రదర్శనలు ప్రజల మన్ననలు పొందాయి ఆమె ఈడో (నేటి టోకియో) వెళ్లి కొందరు స్త్రీలను తనతో ప్రదర్శనలివ్వడానికి ఎంచుకుంది వారు తమ నాట్యాలతో కథలతో ఈడో లోని ప్రజలను సమ్మోహితుల్ని చేసారు 1629 లో టొకుగావా పాలకుల దృష్టిలో మహిళల కబుకి ప్రదర్శనల మూలంగా ప్రజలు నీతి దూరులవుతారనే భావంతో స్త్రీలను కబుకి ప్రదర్శనలనుంచి బహిష్కరించారు అప్పటి నుంచి ఈనాటి వరకు పురుషులే కబుకి ప్రదర్శనలలో పాల్గొంటారు పాశ్చాత్య ప్రభావంతో కబుకి కి ఇంకా జపానులో ఒకప్పటి ప్రాముఖ్యత పరపతి తగ్గినా ఇంకా టోకియో, ఒసాకా, కియోటో నగోయా పట్టణాలలో ప్రత్యేకంగా కబుకి నాటకాలు ప్రదర్శించే థియేటర్లు ఉన్నాయి పట్టణ వాసులకు కబుకి థియేటరుకి వెళ్లడానికి అనేక అవకాశాలు ఉన్నాయి కాని గ్రామీణ ప్రాంత వాసులు కబుకి ప్రదర్శనలు టెలివిజన్‌లోనే చూడాలి

జపానులో బొమ్మలాట రంగస్థలం 'నో' నాటకాల తరువాత వచ్చింది పాశ్చాత్య దేశాలలో పంచ్-జూడీ బొమ్మలాటలో కంటే జపానులోని బొమ్మలు పెద్దవి బొమ్మలు పెద్దవి కావడంవల్ల వాటిని ఆడించడానికి ముగ్గురు మనుష్యులు అవసరం అవుతారు వారు స్టేజి మీదనే ఉండి బొమ్మల్ని నడుపుతారు వారిలో ఇద్దరు ప్రేక్షకులు కనబడకుండా ఉండడానికి నల్ల బట్టలు వేసుకుంటారు పంచ్-జూడీ బొమ్మలు పసివారికి ఆనందాన్నిస్తే జపానులో బొమ్మలాట చాలా కళాత్మక ప్రక్రియగా అభివృద్ధి చెందింది గొప్ప నాటక రచయితలు బొమ్మలాటలకు కథలు వ్రాసారు ప్రఖ్యాత వ్యక్తులు వాటిని ప్రోత్సహించారు 17,18 శతాబ్దాలు జపానులో బొమ్మలాటలకు ప్రసిద్ధి ప్రస్తుతం పూర్వ కాలపు అన్ని కళా ప్రక్రియలలాగే జపానులో బొమ్మలాట కూడా తగ్గు మొఖం పడుతోంది అయినా బున్‌రకు అనే ఒక బొమ్మలాట కంపెనీ యిప్పటికీ మూడు పువ్వులు ఆరు కాయలుగా ఉంది బున్‌రకు కంపెనీ ఒసాకా పట్టణంలో ఉన్నా ప్రతి ఏడాది దేశం అంతా ప్రదర్శనలు

యిస్తూ ప్రజలకు ఆనందానుభూతి కలిగిస్తున్నది

జపానులో పాలకపక్షమైన లిబరల్ డెమోక్రాటిక్ పార్టీ, ప్రభుత్వోద్యోగులు, వాణిజ్య వర్గాలు పరస్పర సహాయంతో జాతీయ అభివృద్ధికి దోహదం చేస్తాయి ఈ కలయిక పుణ్యమా అంటూ ఆ దేశం కళ్ళు మిరుమిట్లు కొల్పే అభివృద్ధిని సాధించగలిగింది ఆర్థికాభివృద్ధి ఫలితంగా లిబరల్ డెమోక్రాటిక్ పార్టీ అధికారంలో కొనసాగుతోంది వ్యాపారస్థులు నానాటికి పెరిగిపోతున్న వ్యాపారంతో సంతృప్తిగా ఉన్నారు ఇక ప్రభుత్వోద్యోగులకు వారి కర్తవ్య నిర్వహణ విజయవంతంగా ముగించి తమ ఉద్యోగ విరమణానంతరం రాజకీయాల్లో కాని, వ్యాపార సంస్థలలో కాని చేరడానికి అవకాశాలు కోకొల్లలు నిజానికి జపాను పాలకపక్ష పార్టీలో మూడవవంతు సభ్యులు ఉద్యోగ విరమణ చేసిన ప్రభుత్వోద్యోగులంటే ఆశ్చర్యపడనక్కరలేదు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ప్రధానమంత్రులయిన వారిలో ఇషి, బషి తనకా తప్ప మిగిలినవారంతా ఉద్యోగవిరమణ చేసిన ప్రభుత్వోద్యోగులే! ప్రతి పారిశ్రామిక వాణజ్య సంస్థలోను ఒకరిద్దరు ఉద్యోగవిరమణ చేసిన ప్రభుత్వోద్యోగులు డైరెక్టర్లుగా ఉంటారు ప్రభుత్వం, వాణిజ్య సంస్థలు ప్రభుత్వోద్యోగుల కలయికనే ప్రపంచంలో జపాను ఇన్ కార్పొరేటెడ్ అని ముద్దుగా పిల్చుకుంటారు

పాలకపక్షం వాణిజ్య వర్గాలు, ప్రభుత్వోద్యోగులు దేశాన్ని నడిపిస్తుంటే జపానులోని ప్రతిపక్షాల ప్రభావం ఏమిటి? అనే ప్రశ్న వస్తుంది వారికి పార్లమెంటులోను బైట గోలచేయటం తప్ప మరో పాత్ర ఉన్నట్టు కనిపించదు అయితే వారు బహిష్కరణ, ప్రజా ప్రదర్శనలను ఆధారం చేసుకుని చేసే గోల మిగిలిన ప్రజాస్వామ్య దేశాలలోకంటే జపానులో ఎక్కువ బలంగా పనిచేస్తుంది దానికి కారణం జపాను సమాజంలో ఏకీభావం సాధించాలనే తపన ఉండడమే వారి ఏకీభావ సూత్రంలో అన్ని కోణాలనుంచి సమస్యను పరిశీలించడం దానిలో వ్యతిరేక భావాలుంటే అన్ని పక్షాలు కలిసి దానికి అంగీకారయోగ్యమైన పరిష్కారాన్ని కనుక్కోవడం ఉంది పాలకపక్షం తమకు పార్లమెంటులో ఉన్న సంఖ్యాబలంపై ఆధారపడి రాజీమార్గం అవలంభించకుండా ప్రతిపక్షాలు అంగీకరించని విషయాలపై నిర్ణయాలు తీసుకోవడానికి ప్రయత్నిస్తే ప్రతిపక్షాలు 'మెజారిటీ దౌర్జన్యం' అనే నినాదాన్ని లేవదీసి రభస చేస్తాయి అభిప్రాయభేదం ఉన్నప్పుడు ప్రభుత్వం రాజీకి ప్రయత్నించడం జపానులో సంప్రదాయం అటువంటి సంప్రదాయాన్ని ప్రభుత్వం కాలరాస్తుందని ప్రతిపక్షాలు గొడవ చేస్తాయి చిత్రం ఏమిటంటే సాంప్రదాయాన్ని వ్యతిరేకిస్తున్నారన్న ప్రతిపక్షాల

విమర్శకు ప్రజాసానుభూతి ఉంటుంది ప్రజాభిప్రాయం ప్రతిపక్షాల పక్షంలో హెచ్చుగా ఉంటే ప్రభుత్వం దిగివచ్చి రాజీకి అంగీకరిస్తుంది

అయితే ప్రభుత్వానికి ప్రతిపక్షాలకు మధ్య ఏ విషయంలోనైనా అభిప్రాయబేధాలు తీవ్రంగా ఉండి రాజీ సాధ్యంకాని పరిస్థితులలో జపాను పార్లమెంటులో ప్రధానమంత్రి విచిత్రమైన ప్రకటన చేస్తాడు పార్లమెంటులో చర్చకు ఎక్కువ వ్యవధి యివ్వకుండా ఓటింగు పెట్టినందుకు ప్రధానమంత్రి ప్రతిపక్షం కళ్ళనీళ్లు తుడవడానికి క్షమాపణ చెబుతాడు అలా చెబుతూ ఓటింగు ఫలితంగా అంగీకరించబడ్డ విషయంపై ఇక ఏవిధమైన మార్పు ఉండదని స్పష్టం చేస్తాడు మిగిలిన అన్ని విషయాలలోను రాజీకి రావడానికి పాలకపక్షం ప్రయత్నిస్తుంది దానిలో కూడా పాలకపక్షానికంటే ప్రతిపక్షాలే ఎక్కువ రాజీకి అంగీకరిస్తాయి కొన్ని పరిస్థితులలో ప్రభుత్వం తాము ప్రవేశపెట్టదలచిన శాసనాలను ఉపసంహరించుకోవడం కూడా చేస్తుంది

ఇంతవరకు జపానులో ప్రతిపక్షాలు అధికారం హస్తగతం చేసుకోవడంలో విఫలమైనా అనేక ముఖ్యవిషయాలపై జాతీయ ఏకాభిప్రాయం తీసుకురావడంలో విజయం సాధించారు ప్రజాస్వామ్య సిద్ధాంతానికి కట్టుబడి ఉండడం, చక్రవర్తిని ఆయన కుటుంబాన్ని రాజకీయాలకు, రాజకీయ చర్చలకు దూరంగా ఉంచడం, అణ్వస్త్ర నిషేధం బైటదేశాలతో పేచీలు పెట్టుకోకుండా ఉండడం విషయాలలో ఏకాభిప్రాయం ఉంది ఇక ఆర్థిక అభివృద్ధి సాంఘికసేవ, కాలుష్య నివారణ, జీతాలు ప్రతి సంవత్సరం పెంచడం, పాశ్చాత్య దేశాలతో సమానమైన జీవనస్థాయి, సమ్మెలు, కార్మిక సమస్యల సత్వర పరిష్కారం, ఎల్లరకు విద్యాసౌకర్యం, కుటుంబ నియంత్రణ, వ్యవసాయదారుల హక్కుల పరిరక్షణ మొదలైన విషయాలలో పాలక పక్షానికి ప్రతిపక్షాలకు ఏవిధమైన అభిప్రాయభేదాలు లేవు

జపానులో జాతీయ ఏకాబిప్రాయం ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండదు ప్రజాబిప్రాయాన్ని అనుసరించి అది మారుతూ ఉంటుంది ఆర్థిక అభివృద్ధి విషయంలో జాతీయ ఏకాభిప్రాయం ఎలా మార్పు చెందుతుందో చూద్దాం ఆ దేశంలో అన్ని రాజకీయ పార్టీలకు 1961వరకు ఆర్థికాభివృద్ధి ధ్యేయం దాని ఫలితంగా ప్రబుత్వం ఆర్థికాబివృద్ధి పథకాలకు ప్రాధాన్యతనిచ్చి పరిసరాల పరిరక్షణ, సాంఘిక సేవ మర్చిపోయింది గృహ నిర్మాణం, మురుగునీటి పారుదల, రోడ్లు మొదలైన పథకాలు పట్టించుకోలేదు ఇదంతా పరిశ్రమలలోనికి సాధ్యమైనంత హెచ్చు పెట్టుబడులు పెట్టడానికి కావాలని దానిని జాతీయ ప్రాతిపదికపై ప్రబుత్వం అనుసరించిన పద్ధతి దాని ఫలితంగా 1970 నాటికి జపాను వ్యవస్థ సూపర్ పవర్ క్లాసుకి చేరింది అయితే

అంతవరకు నిర్లక్ష్యం చేసిన వాతావరణ పరిరక్షణ, సాంఘిక సేవాపథకాలు కొట్టవచ్చినట్టు కనిపించసాగాయి ప్రజాభిప్రాయం కూడ కాలుష్యనివారణ, సాంఘిక సదుపాయాలలో జపాను వెనుకబడి వుందని ఆందోళన ప్రారంభించింది దానితో జాతీయ ఏకాభిప్రాయం కాలుష్యనివారణ సాంఘిక సదుపాయాల విస్తరణతో కూడిన ఆర్థికాభివృద్ధికి మారింది

జపాను కమ్యూనిస్టు పార్టీ మాత్రం జాతీయ ఏకాభిప్రాయసూత్రాన్ని పూర్తిగా అంగీకరించదు మిగిలిన పార్టీలన్నీ తరతమ భేదాలతో ఆ సూత్రాన్ని అంగీకరిస్తాయి పాలకపక్షం, ప్రభుత్వోద్యోగులు, వ్యాపార సంస్థలు కలసి జపానును ఆర్థిక రంగంలో అమెరికాతో పోటీపడే స్థితికి తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నారనడం అతిశయోక్తి కాదు

సామాన్య జపాను దేశపౌరుడు ప్రకృతి సౌందర్యోపాసకుడు వెన్నెలలో కూర్చొని సాకే సేవిస్తూ, చంద్రుణ్ణి చూస్తూ పాటలు పాడుకుంటారు చెర్రీ చెట్లు పువ్వులు పూస్తే టోకియో ప్రజలంతా వాటిని చూడడానికి తీర్థప్రజలా వెళతారు ఒక చుక్క సాకే ఎక్కువైతే వారిలో కొందరు కవిత్వం కూడా చెబుతారు ప్రకృతి ఆరాధన వారిలో జీర్ణించుకుపోయింది వారు నివసించే ఇళ్ళలో ఏ మాత్రం ఖాళీ స్థలం ఉన్నా గార్డెన్ వేసుకుంటారు వాటిని జపానీస్ గార్డెన్లు అని పిలుచుకుంటారు ఇంటి ఆవరణలో వేసుకునే గార్డెన్ ఆ యింటిలో ఒక బాగంగా కలసిపోతుంది మానవ జీవితం ప్రకృతితో సాన్నిహిత్యం సారూప్యం కలిగి ఉండాలని వారి నమ్మకం పట్టణంలో ఉన్న పబ్లిక్ గార్డెన్లు ప్రకృతికి ప్రతిరూపాలుగా తీర్చి దిద్ది ఉంటాయి టోకియో మహాపట్టణంలో ఉన్న ఒక పబ్లిక్ గార్డెన్‌లోని కొన్ని ప్రకృతి దృశ్యాలు ఫూజీ కొండలు నేపథ్యంలో నిర్మించబడ్డాయి

జపాన్ గార్డెన్ తయారుచేసేటప్పుడు ప్రతి చిన్న వివరాన్ని పరిగణలోనికి తీసుకుంటారు ఆ గార్డెను ఉదయం ఎలా ఉంటుంది? వర్షంలో ఎలా ఉంటుంది మంచు పడుతున్నపుడు ఎలా ఉంటుంది అని ఆలోచించి నిర్మాణం చేయాలి ఆ గార్డెన్ నిర్మాణం శీతాకాలంలోను వేసవికాలంలోను కూడా ఆకర్షణీయంగా ఉండేటట్టు చేయడం ఎలా? అనే విషయం ఆలోచించాలి జపానీస్ గార్డెన్‌కి కావలసిన ముడి పదార్థాలు ఎంతో జాగ్రత్తగా ఎన్నుకుంటారు గార్డెన్లు తయారుచేసే నిపుణుల్ని ప్రజలు గొప్ప ఆర్టిస్టులుగా పరిగణించి గౌరవిస్తారు

నేను టోకియోలో ఎబిసులోని ఇంట్లో ఉండేటప్పుడు దానిలో సామాన్యమైన గార్డెన్ ఉండేది దానిని చక్కటి స్థితిలో ఉంచడానికి ప్రభుత్వం కొంత సొమ్ము ఖర్చు పెట్టేది జపానీస్ గార్డెన్లు అందాలు అన్నీ కొంత ఖాళీ

స్థలం ఉన్న గృహాలకు, ధనవంతులకు పనిచేస్తాయి కాని చాలామంది జపానీయులు చిన్న ఇళ్ళలో ఉంటారు వాటిలో కాని అపార్టుమెంట్లలో కాని ఏవిధమైన గార్డెన్ పెంచడానికి ఆస్కారం లేదు కాని ప్రకృతికి దగ్గరలో ఉండాలనే వారి ఆకాంక్ష ఫలితంగా "బోన్సాయ్" మరగుజ్జు చెట్లు పెంపకం జపానులో వృద్ధి చెందింది బోన్సాయ్ గొప్ప కళ 400 సంవత్సరాలనాటి బోన్సాయ్‌లు కూడా వుంటాయి సాధారణంగా బోన్సాయ్ చక్కగా పెరగడానికి 10 సంవత్సరాలు పడుతుంది అది నిజంగా కళాఖండం కావడానికి 40 ఏళ్ళు పడుతుంది

వారి తాపత్రయంలో "బోంకై" మరొక సాధనం దానిని ముద్దుగా ట్రే గార్డెన్ అని పిలుస్తారు బురద ఒక రకమైన ఎండుగడ్డి రంగుల యిసుకతో అందమైన ట్రే గార్డెన్ తయారు చేస్తారు ప్రకృతిదృశ్యం పెద్దదైనా చిన్నదైనా నిజమైనదైనా కృత్రిమమైనదైనా జపానీయులు ప్రకృతిని అభిమానించి ఆరాధించడంలో సిద్ధహస్తులు

కిమోనో జపాను స్త్రీలు సంప్రదాయంగా ధరించే డ్రస్సు వారు కిమోనో ధరించి అడుగులో అడుగు వేసుకుంటూ గబగబా నడుస్తుంటే చూడముచ్చటగా ఉంటుంది జపాను స్త్రీలు కిమోనోలలో ఎంత అందంగా ఆకర్షణీయంగా ఉన్నా దురదృష్టవశాత్తూ చాలా తక్కువమంది ఈ రోజుల్లో కిమోనో ధరిస్తున్నారు దానికి కారణాలు లేకపోలేదు ఆధునిక జపానులో ...ఖ పురుషులు యూరోపియన్ దుస్తులు ధరించడం అలవాటు చేసుకున్నారు ...ని చౌక, ధరించడం సులభం శుభ్రం చేయడం సులభం అయినా ప్రతి స్త్రీకి ...ధమం ఒక మంచి ఖరీదైన కిమోనో ఉండితీరుతుంది పాశ్చాత్య దుస్తులకంటే కిమోనోలో వారు చాలా అందంగా స్త్రీత్వం ఉట్టిపడుతూ, ఆకర్షణీయంగా ఉంటారని వారికి తెలుసు వారి శరీర సౌష్టవం కిమోనో ధరించడానికి అనువుగా ఉంటుంది మన దేశంలో స్త్రీలు చీరలు కట్టుకొని అవి పాశ్చాత్య స్త్రీలు ధరిస్తే బాగోదంటారు మన స్త్రీల అవయవ నిర్మాణం చీర ధరించడానికి అనువుగా ఉంటుందని పాశ్చాత్య స్త్రీల అవయవ నిర్మాణం చీరకట్టుకోవడానికి అనువుగా ఉండదని ఒక ప్రముఖ భారతీయ పాత్రికేయురాలు అభిప్రాయపడింది అలాగే పాశ్చాత్య దుస్తులు వేసుకోవడానికి జపాను స్త్రీల అవయవనిర్మాణం అనువుగా ఉండదు కాని దైనందిక కార్యక్రమానికి కిమోనో కంటే పాశ్చాత్య దుస్తులు చక్కగా ఉపయోగపడతాయి

కిమోనో జపాను దేశస్థుల జాతీయ ఆహార్యం అది వదులుగా ఉండి సీల మడతల వరకు వస్తుంది చేతులు మాత్రం వెడల్పుగా, పక్షుల రెక్కలలా

ఉంటాయి ముందు భాగం తెరుచుకుని ఉంటుంది కాబట్టి దానిని ఐదుమడతలుగా పెట్టి ఓబితో కాని వెడల్పయిన గుడ్డతో కాని కడతారు అనేక రకాల కిమోనోలు వివిధ రంగులు, ఆకారాలలోను వస్తాయి సామాన్యంగా నూలుతో తయారుచేసిన కిమోనోలను స్త్రీలు ఇంటిలో ఉన్నప్పుడు వేసుకుంటారు దానిలో లైనింగు ఉండదు కాబట్టి వేసవిలో వేసుకోవడానికి హాయిగా ఉంటుంది దానిని యుకాతా అంటారు పూర్వకాలంలో యుకాతా స్నానాలకు వెళ్ళినప్పుడు మాత్రమే ధరించేవారు ప్రస్తుత కాలంలో వేసవిలోను మామూలుగా ఇంట్లో వేసుకోవడానికి ఉపయోగిస్తారు స్త్రీలు పురుషులు కూడా యుకాతా పడుకునేటప్పుడు వేసుకునే డ్రస్‌గా ఉపయోగిస్తారు జపానులో ఏ హోటల్‌కు వెళ్ళినా పక్కమీద యుకాతా ఉండి తీరుతుంది

వివాహితలైన జపాను మహిళలకు అనేక కిమోనోలు ఉంటాయి వాటిని కుటుంబ ఆస్తిగా పరిగణిస్తారు మంచి సిల్కు కిమోనో చాలా ఖరీదైనదిగా ఉంటుంది కొన్ని ఓబెతో కలిపి వెయ్యి డాలర్ల వరకు ఉంటుంది సామాన్యంగా వివాహిత స్త్రీలకు విందులు పండుగలు, ప్రత్యేక కార్యక్రమాలకు వేసుకోవడానికి, వీధిలో తిరగడానికి ఇంటిలో వేసుకోవడానికి కిమోనోలు ఉంటాయి వారు ధరించే కిమోనోలను బట్టి ధరించిన వారిని గురించి బోలెడు తెలుసుకోవచ్చు దానికి అనుభవం కావాలనుకోండి వారు ధరించే కిమోనోలను బట్టి వివాహితలు అవివాహితలను గుర్తించవచ్చును సామాన్యంగా కిమోనో రంగు తెలుపు అయి ఉండి దానిమీద రంగులు అద్ది ఉంటే అది ధరించిన వ్యక్తి అవివాహిత అని తెలుసుకోవచ్చు అంతే కాకుండా కిమోనో చేతులు మరీ పొడుగుగా ఉంటే ఆమె వివాహం చేసుకోలేదని తెలుసుకోవచ్చు అయితే వీధుల్లో తిరిగేటప్పుడు జపాను స్త్రీలు కిమోనో ధరించడం మానివేసారు యువతులు పాశ్చాత్య దుస్తులకు అలవాటుపడిపోయారు ఆఫీసులో పని చేసేవారంతా పాశ్చాత్య దుస్తులు వేసుకుంటారు కాని నూతనసంవత్సర ఉత్సవ సందర్భంగా ఆ దేశంలోని మహిళలంతా చిన్న పెద్ద అనే బేదం లేకుండా కిమోనోలు ధరించి దేవాలయాలకు వెళతారు

కిమోనోతోపాటు అనేక ఓబేలు ఉండాలి కిమోనోను యథాస్థానంలో ఉంచడానికి ఓబెను ఉపయోగిస్తారు ఓబె ఒక అడుగు వెడల్పు, పదకొండు అడుగుల పొడవు ఉంటుంది నడుము చుట్టూ రెండుసార్లు త్రిప్పి వెనుక ప్రక్క అందముగా ముడివేస్తారు ఓబె కూడా చాలా అందంగా తయారుచేయబడుతుంది దాని ధర కూడా చాలా హెచ్చు దానిని నడుం

చుట్టూ బిగించి ముడి వేయడం అంత సులభం కాదు దానిని సరిగా కట్టడానికి ఈ కాలపు పిల్లలకు అనుభవజ్ఞుల సహాయం, సేవలు అవసరం

అధునాతన జపాను మహిళలలో కిమోనో ధరించడంలో ఆసక్తి తగ్గిపోవడాన్ని గమనించిన డ్రస్ డిజైనర్లు మామూలుగా ఉతుక్కుని వేసుకొనే కిమోనోలు చౌకగా సామాన్యులకు అందుబాటులో ఉండేవి తయారు చేసారు రెడీమేడ్ ఓబెలు కూడా మార్కెట్‌లోకి వచ్చాయి ఈ కొత్తరకం కిమోనో రెండు భాగాలుగా ఉండి వెనుక భాగం జిప్పుతో మూసుకుంటుంది ఈ నూతన కిమోనో చాలా వరకు విజయవంతం అయినదనే చెప్పాలి అయితే సంప్రదాయాన్ని గౌరవించే జపానీయులు జిప్పులతో మూసుకునే కిమోనోను హర్షించరు వయస్సు మీరిన వివాహిత స్త్రీలు తమ తల్లుల వద్ద కిమోనో ధరించడంలోని సులువులు తెలుసుకున్నారు వారి పిల్లలు కిమొనో దరించడానికి ఉత్సుకత చూపకపోవడం వారికి బాధ కలిగిస్తుంది కాని వాళ్ళు పెద్దవాళ్ళయ్యాక కిమోనో ధరించడంలోని అందం గ్రహిస్తారని ఆశిస్తారు

జపానులో పురుషులు సూట్లు ధరిస్తారు రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం నుంచి సూట్లే ధరిస్తున్నారు అయితే సాయంకాలం వేడినీళ్ళ స్నానం చేసి సూట్లు వదలి కిమోనో ధరిస్తారు అయితే యువకులకు ఆ అలవాటు ముసలివాళ్ళ అలవాటనిపించి రోజంతా పాశ్చాత్య దుస్తులలోనే ఉంటారు ...యితే సుమో కుస్తీ యోధులు మరికొన్ని సంప్రదాయ వ్యాపకాలలో ఉండే ...రుషులు ఇప్పటికీ కిమోనోలను ధరిస్తారు క్లబ్బులలో పనిచేసేవారు, ...ర్లలోను ఇతర వినోద ప్రదేశాలలోను పనిచేసే స్త్రీలు అంతా కిమోనోలను ధరించి ఉంటారు ఇక గెయిషాల పుణ్యమా అంటూ కిమోనో యింకా జపానులో కనిపిస్తుంది

జపాను దేశంలో ప్రభుత్వ పార్టీ అయిన లిబరల్ డెమోక్రాటిక్ పార్టీ అవినీతి ఆరోపణలతో సతమతమవుతోంది జపాను ప్రధాని నోబోరు తకెషితా, మరియు అనేకమంది పాలకపక్ష నాయకులు ముడుపులు పుచ్చుకున్నారనే కారణంగా తమ పదవులకు రాజీనామా చేసారు మచ్చలేని నాయకుని కోసం వెతికి చివరకు సొసుకి ఉనోను ప్రధాన మంత్రిగా ఎన్నుకున్నారు నెలరోజులు తిరగకుండా ఉనో మరొక రకమైన అవినీతి ఆరోపణల వలయంలో చిక్కుకున్నారు ఇంతకీ ప్రధాని ఉనో చేసిన పాపం ఏమిటయ్యా అంటే తాను జపాను ప్రధాన మంత్రిని అవుతానని కలలో కూడా ఊహించని రోజుల్లో 1986 సంవత్సరంలో నాలుగు మాసాలపాటు ఒక గెయిషా స్త్రీతో సంబంధం పెట్టుకున్నాడట ఆ సంబందం 1986 లోనే తెగతెంపులు అయిపోయింది అయినా ఆయన ప్రధానమంత్రి అవగానే ఆ గెయిషా స్త్రీ

మైనీచి పత్రికకు యిచ్చిన ఇంటర్వ్యూలో ఉనో తనను నాలుగు మాసాలపాటు ఉంపుడుకత్తెగా ఉంచుకున్నాడని 20 వేల అమెరికన్ డాలర్లు ఖర్చుపెట్టాడని చెప్పింది ఆమె తాను చేసిన ప్రకటన యొక్క రాజకీయ పరిణామాలు ఊహించి ఉండదు ఏదో తన ప్రియుడు ప్రధాన మంత్రి అయ్యాడనే సంతోషంలో గెయిషా సంప్రదాయానికి విరుద్ధంగా పత్రికలలోను టెలివిజన్‌లోను దేశ ప్రజలకు ప్రపంచానికి కూడా ఉనో శృంగార జీవితం తెలియజేసింది ఆమె గెయిషాగా అలా బాహాటంగా చెప్పవచ్చునా అనేది విషయాంతరం అయితే దాని ఫలితంగా జపాను రాజకీయాల్లో క్రొత్త సంచలనం వచ్చింది ప్రధాని ఉనో తన పదవికి రాజీనామా చేయాలనే నినాదాలు వినిపిస్తున్నాయి తాను గెయిషాతో గడిపిన శృంగార జీవితానికి తన రాజకీయాలకు ఏమీ సంబంధం లేదు కాబట్టి తాను ప్రధాని పదవికి రాజీనామా చేయనన్నాడు ఉనో అయితే ప్రధాని ఉనో పరిస్థితి నడిరోడ్డు మీద కారు గుద్దేసిన వ్యక్తి పరిస్థితిలా ఉంది నిజానికి జపానులో యింతవరకు ఎన్ని అవినీతి ఆరోపణలు వచ్చినా అవన్నీ ధనదాహానికి సంబంధించినవే నేను జపానులో ఉన్న రోజుల్లో జపాను ప్రధాని 'తనకా సాన్' పదవి పోగొట్టుకున్నాడు ఇటీవల తకషితా సాన్ కూడా ప్రధాని పదవికి రాజీనామా చేయవలసివచ్చింది ఆ రాజీనామాలు డబ్బుకి సంబంధించినవి అయి ప్రధాని ఉనో సమస్య ఇంతకు ముందెన్నడూ ఆధునిక జపాను చరిత్రలో కః వినని సమస్య

రాజకీయ నాయకుల స్వంత (ప్రయివేటు) జీవిత విధానానికి వారి రాజకీయ జీవితాలకు సంబంధం ఉందా? అనే విషయం ప్రపంచంలో అనేక దేశాలలో అనేక విధాలుగా పరిగణింపబడుతుంది బ్రిటిష్ రాజకీయాల్లో ప్రొఫ్యూమో కెల్లర్ శృంగారం ప్రొఫ్యూమో మంత్రి పదవి పోవడానికి కారణమైంది ఇటీవల మన దేశపు అమ్మాయి బ్రిటిష్ రాజకీయవర్గాలలో చిరుకెరటాలు సృష్టించింది కాని దానిలో ఎవరూ మునిగి పోలేదు మన దేశంలో రాజకీయ నాయకుల స్వంత జీవన విధానానికి, రాజకీయ జీవితాలకు అవినాభావ సంబంధం ఉంది ప్రజానాయకుడు స్వచ్ఛమైన, నిష్కళంకమైన ప్రయివేటు జీవితం గడపాలని, ప్రజలకు మార్గదర్శకుడుగా ఉండాలని మన ప్రజలు ఆశిస్తారు కాని రాజకీయ నాయకులు కూడా మానవ మాత్రులే కాబట్టి వారంతా ఋషులులా జీవితాలు గడపాలనుకోవడం సమంజసం కాదేమో అనిపిస్తుంది శ్రీ మథాయి పుణ్యమా అంటూ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ లేడీ మౌంట్ బాటన్ ప్రేమ కలాపాలు దేశ ప్రజలకు ప్రపంచ ప్రజలకు తెలిసాయి మథాయి వ్రాతలు ప్రజలు హర్షించలేదు అంతే కాదు పండిట్‌జీతో అనేక సంవత్సరాలు పనిచేసిన మథాయి తన నాయకుని గురించి అటువంటి

వ్రాతలు వ్రాయడం పట్ల జుగుప్స, తీవ్ర నిరసన ప్రజలలో కలిగింది ఏది ఏమైనా ఈ వ్రాతలు నెహ్రూ చనిపోయిన తరువాత వచ్చినవి కాబట్టి భారత రాజకీయాలపై వాటి ప్రభావం లేదు

ఇక ఒక రాజకీయ నాయకుడు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండే రోజుల్లో ఆయన కుమారుడు ఢిల్లీ వచ్చి తమ నాన్నగారు ఒక స్త్రీని తమ ఇంట్లో పెట్టుకున్నాడని, కుటుంబ గౌరవం మంటకలుపుతున్నాడని ఒక కరపత్రం వేసి ఢిల్లీలోని తెలుగువారందరికి పంచిపెట్టాడు అంతతో సంతృప్తి పడక ప్రధానమంత్రిని చూచి తన తండ్రిపై ఆరోపణలు చేసాడు కాని దాని ఫలితంగా ఎవరికీ ఏమీ నష్టం రాలేదు కీర్తి శేషుడు కొత్త రఘురామయ్య కేంద్ర ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న రోజుల్లో ఆయన భార్య ప్రధాన మంత్రిని కలుసుకుని తన భర్త మరొక స్త్రీతో తిరుగుతున్నాడని ఆరోపించినదట. అదంతా విన్న శ్రీమతి ఇందిరా గాంధి ఆంధ్ర నాయకులు శృంగార నాయకులులా ఉన్నారే! అన్నట్టు ఢిల్లీలో చెప్పుకున్నారు అయితే ఈ నాయకులను ఎవరూ వారి పదవులకు రాజీనామా యివ్వమని అడగలేదు అది ఇండియన్ స్టయిల్ రాజకీయ నీతి అని సరిపెట్టుకున్నారు అంతా

జపానులో వృద్ధులు, ఇంటి యజమానురాలు, ఇంటివద్ద మధ్యాహ్నం భోజనం చేస్తారు స్కూలు పిల్లలు స్కూలులో లంచ్ చేస్తారు ఆఫీసుల్లో పనిచేసేవారు లంచ్ తమతో తీసుకువెళతారు పని తొందరలో ఉంటే రెస్టారెంటు నుంచి గిన్నెడు సోబా (నూడుల్సు) టెండన్ (అన్నం ఎండు చేప) కట్సుదాన్ (అన్నం పోర్కు కట్‌లెట్) తెప్పించుకుతింటారు జపానువారు అనేక రంగాలలో పాశ్చాత్య దేశాలనుంచి కొత్త విషయాలు నేర్చుకుని వాటిని తమ జీవన విధానంలో భాగంగా చేసుకున్నారు కాని భోజన విషయంలో మాత్రం వారు తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు అన్నిప్రక్కల సముద్రం ఉన్నందున జపానులో చేపలు పుష్కలంగా దొరుకుతాయి వాటిని వండడానికి వెయ్యి పద్ధతులున్నాయి శతాబ్దాలనుంచి జపాను ప్రజలకు చేపలే ముఖ్య ఆహారం గత 80 ఏళ్ళనుంచి బీఫ్ (పశు మాంసం) జపానులో ప్రవేశపెట్టబడింది సముద్రంలో దొరికే అన్ని రకాల చేప జాతులను జపానీయులు తింటారు ఆక్టోపస్, కటిల్ ఫిష్, ఈల్, ఫూగ అనే విషపూరిత గుండ్రటి చేపలు కూడా జపానువారు తింటారు ఈల్ (పాములాంటి చేప) వేయించే వీధిలో వెళుతుంటే ఆ వాసన ముక్కు బ్రద్దలు కొడుతుంది

పాశ్చాత్యుల దృష్టిలో సామాన్యంగా జపాను వంటకాలలో టెంపూర మంచి రుచికరమైన వంటకం టెంపూర బాగా వేయించిన చేప కాయకూరలతో తయారు చేస్తారు టెంపూర తయారుచేసే ప్రత్యేక

రెస్టారెంట్లలో తింటేనే దాని మజా, రుచి తెలుస్తుందని జపానీ మిత్రులు చెబుతారు టెంపూర వేడిగా ఉన్నప్పుడే తినాలి కాబట్టి ప్రజలు ప్రత్యేక కౌంటర్ల వద్ద కూర్చుని తింటారు విదేశీయులు మెచ్చే మరొక జపానీ వంటకం సుకియాకి ఇది పశుమాంస వంటకం వంద ఏళ్ళ క్రితం జపానులో పశుమాంసం తింటే అంగవికలురైన పిల్లలు పుడతారని నమ్మకం ఉండేది అయితే ఈనాడు కోబె పశువులు ప్రపంచంలో బీఫ్ పశువులలో ప్రఖ్యాతికెక్కాయి చిత్రం ఏమిటంటే సుకియాకి జపాను సంప్రదాయ పద్ధతిలో తుంగచాపలు పరచిన గదిలో కూర్చుని తింటారు మాంసం, కాయకూరలు కలిపి ఇనుప పాత్రలో వండి అతిధులముందు ఉంచుతారు వారు తమకు నచ్చినది ఆ పాత్రనుండి తీసుకుతింటారు మీకు ఇష్టమైతే ఆ ముక్కలను పగలగొట్టిన కోడిగ్రుడ్డు సొనలో ముంచుకుని తినవచ్చు

జపానులో కోడిమాంసం కూడా ఎక్కువగా తింటారు యకతోరి (కాల్చిన కోడి) జపాను వారు మెచ్చుకొనే వంటకం యకతోరిలో కోడి లివర్, మాంసం, కోడి చర్మం వెదురుముక్కల మీద కాల్చి పెడతారు బాతు రకరకాల పక్షులను కూడా యకతోరి పద్ధతిలో తింటారు జపాను ప్రజల దృష్టిలో జపాను వంటకాలలో ప్రముఖ స్థానం సుషికి దక్కుతుంది సుషి అంటే పచ్చిచేప అన్నం విదేశస్తులకు పచ్చి చేపలు తినడం అంటే జుగుప్స కలిగించవచ్చు కాని జపాను ప్రజలకు సుషి అంటే ప్రత్యేక అభిమానం అదేగాక సషిమి అని పిలువబడే మరొక పచ్చి చేప వంటకం కూడా ప్రజల ఆదరాభిమానాలు పొందింది ఫుగు అనే గుండ్రని చేప విషపూరిత మైనదని చెప్పుకున్నాం దానిని చాలా జాగ్రత్తగా శుభ్రం చేయాలి లేకపోతే ప్రాణాలు తీస్తుంది ఫుగు రెస్టారెంట్లకు ప్రభుత్వం ప్రత్యేకమైన లైసెన్సులు యిస్తుంది అలా ప్రభుత్వ లైసెన్సు పొందిన రెస్టారెంట్లు ఫుగూ నిపుణులను నియమిస్తారు ఫుగుతో పాటు జపానీస్ సాకే (బియ్యపు సారా) ఉంటే జపాను వారికి బ్రహ్మానందం అంత విషపూరిత ఫూగూను ప్రత్యేక లైసెన్సు పొంది ప్రత్యేక నిపుణులను నియమించి తినకపోతే నష్టం ఏమిటని అడగండి నష్టం ఏమీ లేదు నిజానికి దానిని తయారుచేయడంలో అశ్రద్ధ చేస్తే అది ప్రాణాంతకం కాని జపాను ప్రజలకు ఫూగూ అత్యంత రుచికరమైన జలచరం అందుకే వెఱ్ఱి వేయి విధాలన్నారు

జపాను దేశంలోకి టీ త్రాగే అలవాటును చైనా దేశం నుంచి బౌద్ధబిక్షువులు 8వ శతాబ్దంలో ప్రవేశపెట్టారు ప్రారంభంలో టీ దొరకడం గగనంగా ఉండేది దానిని అమృతతుల్యంగా పరిగణించి చక్రవర్తి రాజవంశీయులు, అత్యుత్తమ స్థానాలలో ఉండే మత గురువులు మాత్రమే

త్రాగేవారు అయితే తేయాకు పరదేశాలనుంచి సరఫరా అయ్యేటంతవరకు సహనం చూపించలేని జపాను చక్రవర్తి తేయాకు తోటలు తమ దేశంలోనే పెంచాలని ఆజ్ఞాపించాడు ఆ రోజుల్లో టీ ఆకుల్ని దంచి గుండ్రని ఉండలుగా చేసి వేడినీళ్ళలో ఉడకబెట్టేవారు త్రాగడానికి ముందు అల్లం తదితర సుగంధ ద్రవ్యాలు కలుపుకునేవారు ఈ తతంగం అంతా గంటల కొద్దీ పట్టేది ఆనాటి చక్రవర్తులు తమ కుటుంబ సభ్యులతో, రాజ వంశీయులతోను టీ త్రాగటాన్ని ఒక విశిష్టమైన కార్యక్రమంగా తయారుచేసారు చిత్రం ఏమిటంటే కొద్దికాలం తరువాత రాజవంశీయులకు టీ త్రాగడాన్ని పండుగగా చేసుకోవడంలో సరదా తీరిపోయింది

12 వ శతాబ్దంలో చైనా నుండి జపాను దేశంలోనికి ప్రవేశపెట్టబడిన జెన్ బౌద్ధ విశ్వాసం టీ పండుగకు మత ప్రాశస్త్యాన్ని ఆపాదించింది ఆనాటి నుంచి జెన్ బౌద్ధ విశ్వాసం టీ పండుగ కూడా జపాను ప్రజలు అవలంభించడంతో అవి రెండూ చాలా ప్రజాదరణ పొందాయి అప్పటి రోజుల్లో చైనా నుంచి వచ్చే టీ పొడిలో శరీర రుగ్మతలను తొలగించే వైద్య సామర్థ్యం ఉందని నమ్మిన బౌద్ధ భిక్షువులు రోగగ్రస్తులకు టీ తయారుచేసి యిచ్చేవారు వారివారి శారీరక రోగాలను టీ చికిత్స బాగు చేస్తుందని నమ్మేవారు చైనానుంచి టీ దిగుమతి చేసుకోవడంతో హెచ్చు ఖర్చు అవడం, ఆలశ్యం కావడంతో జపానులోనే తేయాకు పండించడానికి పూనుకున్నారు అనేక రకాల టీ పండించేవారు దేశంలోని ప్రతి ప్రదేశంలో ప్రత్యేక తేయాకు పండించడం మొదలుపెట్టారు ఆ రోజుల్లో ఏ టీ ఏ ప్రాంతానికి చెందినదని నిర్ణయించడానికి పోటీలు పడేవారు

జపానులో టీ ఆచారము పండుగగా తయారయింది దానికోసం ప్రత్యేకంగా గృహాలు నిర్మించడం ప్రారంభించారు అటువంటి కుటీరాలు ప్రకృతి సౌందర్య పరిసరాల్లో నిర్మించబడడంవల్ల టీ ప్రియులు ప్రకృతి సౌందర్యాన్ని చూచి ఆనందిస్తూ మనశ్శాంతి పొందేవారు 15వ శతాబ్దంలోనే జపానులోని టీ ఉత్సవం ఈనాటి విశిష్ట ఆచారానికి పునాదులు వేసింది ఆ రోజుల్లో టీ ఉత్సవం సంఘంలో ఉత్తమవర్గాలకు చెందిన సమురాయిలకే పరిమితమైనా ఈ నాటికి జపానులో ప్రజాదరణతో విరాజిల్లుతుంది అయితే సంప్రదాయం పూర్వానిదే అయినా ఉపయోగించే టీ లో మార్పు వచ్చింది టీ ఉత్సవంలో ఇంకా టీ పొడినే ఉపయోగించినా ప్రతి రోజు జపానువారు త్రాగే టీ వేరే విధంగా ఉంటుంది 300 ఏళ్ళనాడు జపానులో ఆవిరిపెట్టి ఆరబెట్టిన టీ ఆకులు ఉపయోగించి టీ తయారు చేసేవారు అది పొడితో చేసే టీ కంటే తక్కువ ఖర్చు

టీ ఉత్సవం జపాను ప్రత్యేకత ఆ కార్యక్రమానికి సాధారణంగా కొన్ని గంటలు పడుతుంది ఆ కార్యక్రమం పూర్తి అయినంతవరకూ అతిథులు ఓపిగ్గా, కదలకుండా మోకాళ్ళమీద కూర్చోవాలి దానిలో ఉపయోగించే పాత్రలన్నీ సంప్రదాయానుసారంగా ఎన్నుకుంటారు ఆచారప్రకారం ఆ కార్యక్రమంలో టీ చాలా జాగ్రత్తగా నెమ్మదిగా ఉడకబెట్టి అతిథులకు ఒక్కొక్కరిగా ఒక కప్పు ఇస్తారు ఆ అతిథి ఆ టీని మూడున్నర గుక్కలలో త్రాగాలి టీ తయారు చేసే వ్యక్తికి అతిథులకు కూడా ఇదమిద్ధంగా బాధ్యతలు ఉన్నాయి అతిథులు కార్యక్రమంలోని అన్ని భాగాలను ప్రశంసించాలి టీ కార్యక్రమం ఏర్పాటు చేసినవారికి ప్రత్యేకంగా ధన్యవాదాలు చెప్పడం ప్రత్యేక పద్ధతిలో నడవడం, కూర్చోవడం, నేర్చుకోవాలి అతిథులను ఆహ్వానించినవారు వారి అతిథుల సర్వ సదుపాయాలకు ముందుగానే ఏర్పాటు చేయాలి పాత్రలను జాగ్రత్తగా ఏర్పాటు చేయాలి టీ పార్టీకోసం ఉపయోగించే బొగ్గు రెండు మూడు రోజుల ముందుగానే కడిగి ఉంచుకుంటారు ఉపయోగించేటప్పుడు చేతులకు బొగ్గు అంటుకోకుండా జాగ్రత్తపడతారు

టీ ఉత్సవంలో ఉన్న అనేక వివరాలలో సిద్ధహస్తులు కావడం కోసం కొందరు స్త్రీలు అనేక సంవత్సరాలు పాఠాలు నేర్చుకుంటారు టీ తయారుచేసి దానిని తీరిగ్గా త్రాగడానికి జపాను ప్రజలు బోలెడు శ్రమకు, ఖర్చుకు గ అవుతారు అదంతా అతిథులతో సన్నిహితత్వాన్ని పెంచుకోవడానికి వా పడే తాపత్రయం నేటి జపానులో కూడా టీ ఉత్సవం చాలా ప్రజాదర పొందింది 20 లక్షలమంది పైగా ప్రజలు టీ ఉత్సవాలలో పాల్గొంటార వివాహం కావలసిన యువతులు టీ ఉత్సవ వివరాలు తెలుసుకోవడ వివాహయోగ్యతగా భావిస్తారు దేశంలో అనేక యూనివర్సిటీలలోన కాలేజీలలోను టీ ఉత్సవ క్లబ్బులు ఉంటాయి ఏడాదికొకసారి ఈ క్లబ్బులన్నీ కలసి ఒక బ్రహ్మాండమైన టీ ఉత్సవం చేసుకుంటారు ఇప్పటికీ టీ ఉత్సవాలు ప్రశాంతంగా ఉండే ప్రదేశాలలోనే జరుగుతాయి కాని వాటిలో ఆధునికతన ప్రవేశపెడుతున్నారు మోకాళ్లమీద గంటల తరబడి కూర్చోవలసిన అవస్థ లేకుండా కుర్చీలు, బల్లలు ప్రవేశపెట్టారు ఈ కార్యక్రమంలో పాల్గొనే మహిళలందరూ సంప్రదాయ కిమోనో ధరిస్తారు మగ మహారాజులు సూట్లు ధరిస్తారు సాంప్రదాయకళను ఆధునిక జీవన విధానంలో బాగంగా చేసుకోవడంలో జపానీ ప్రజలు సిద్ధహస్తులని చెప్పడానికి టీ ఉత్సవం ప్రత్యక్ష నిదర్శనం

ఇటీవల జపానులో గెయిషా వ్యవస్థ వీధిని పడింది ఒకప్పుడు గెయిషాలు చీకటి పడిన తరువాత నగరవీధుల్లో రిక్షాలలో ప్రయాణం చేసి తమ విద్యుక్త

ధర్మనిర్వహణకు రాజసం ఉట్టిపడేటట్టు వెళ్ళేవారు. వారు చీకటి పడితేకాని బైటకు వచ్చేవారుకాదు. ఈ శతాబ్ద ప్రారంభంలో గెయిషాలు తమ ప్రత్యేక ప్రపంచంలో ఉండేవారు. అతి ఖరీదైన భోజనం, అలంకరించుకున్న బొమ్మలు, పొగతో నిండిన తతామి చాపల గదులలో రాజకీయ వేత్తలతో నిండిన ప్రపంచం. దానిని "తేలిపోయే ప్రపంచం" అని ముద్దుగా పిల్చుకునేవారు. ఆ ప్రపంచంలోకి ప్రవేశించడానికి ఆ దేశంలోని ధనికులకు, అధికారంలో ఉన్న వారికి మాత్రమే సాధ్యం అయ్యేది. ఈ శతాబ్ద ప్రారంభంలో గెయిషాలు ప్రకటనలకు తమపేరును ఇచ్చి ప్రఖ్యాతిని ఆర్జించారు. కాని ప్రస్తుతకాలంలో వారు అజ్ఞాత జీవితాలు గడుపుతున్నారు. వారు పత్రికలలోను, యితరత్రా ప్రచారానికి అంగీకరించరు. నిజానికి అజ్ఞాతంగా ఉండడమే వారి వృత్తికి శ్రీరామరక్ష.

ఒక షింబాషి గెయిషా తన అభిప్రాయం వ్యక్తం చేస్తూ గెయిషాలు పూర్వకాలపు జపాను నృత్య రీతులలో నిష్ణాతులని వారు పూర్వ సంప్రదాయాలకు మూలస్థంబాలని అభివర్ణించింది. అయితే ఏ విధమైన విద్యాగంధం కాని, కళాసంపద కాని లేని వ్యభిచారులు కూడా తమని తాము గెయిషాలుగా పిల్చుకోవటం దురదృష్టం అంది ఆమె. అయితే సాంప్రదాయసిద్ధమైన జపాను నాట్యరీతులలో మగవారిని ఆనందపరిచే గెయిషాలు తగ్గిపోయారు. గెయిషాల ప్రాబల్యం అత్యంత ప్రముఖంగా ఉండే రోజుల్లో 80 వేలమంది గెయిషాలు ఉండేవారు. ఇప్పుడు 15 వేలమంది మాత్రమే జపానులో ఉన్నట్టు అంచనా. సంప్రదాయ జపాను నృత్యం, సంగీతం నేర్చుకోవడానికి సంవత్సరాలు కృషి చేయవలసి ఉన్నందున జపానులో నిజమైన గెయిషాలు నానాటికి తగ్గిపోతున్నారు. వారి స్థానంలో సామాన్య బార్లలో పనిచేసే స్త్రీలు కిమోనోలు ధరించి గెయిషాలుగా చలామణి అవుతున్నారు. ఈ రోజుల్లో నిజమైన గెయిషాను చూడడానికి ప్రత్యేక శ్రమ పడాలి. టోకియో నగరంలో గింజా ప్రదేశంలో ఉన్న 'కనెతనకా' రెస్టోరెంటు ప్రవేశ ద్వారం దగ్గర పడిగాపులు పడి ఉంటే నిజమైన గెయిషాను చూడవచ్చును. ఆ రెస్టోరెంటు జపానులోని పాలకపక్ష సభ్యులు కలుసుకుని ఆనందంగా కాలక్షేపం చేసే కేంద్రం. అది గెయిషాలకు ప్రత్యేక ఆకర్షణ.

గెయిషా పార్టీలు సాంప్రదాయ పద్ధతిలో అతిధులను ఆనందపరచడానికి ఉపయోగపడతాయి. చాలా ముఖ్యమైన వ్యాపారసంబంధాలు గెయిషా పార్టీలలోనే నిర్ణయించబడతాయి. అటువంటి పార్టీలు జపానీ పద్ధతిలో 'తతామి' చాపలు పరచిన గదిలో ఆహ్లాదకరమైన వాతావరణంలో జరుగుతాయి. వాటిలో భోజనం, లెక్కలేనంత సాకే (జపానీ రైస్ వైన్) త్రాగడం, సాంప్రదాయ

సంగీతం చక్కటి సంభాషణ ఉంటాయి గెయిషాల గురించి అనేక అతిశయోక్తులు వ్రాయబడ్డాయి ఆ వ్రాతలు చాలా వరకు సత్యదూరాలని విజ్ఞులైన జపానువారు అంటారు జపాను భాషలో గెయి అనే మాటకు అర్థం కళ షా అంటే వ్యక్తి నిజంగా గెయిషా అంటే కళాకారిణి అని చెప్పుకోవచ్చు గెయిషా అనేక సంవత్సరాల క్రమశిక్షణ, అభ్యాసము పుణ్యమా అంటూ ప్రపంచంలో అత్యంత నైపుణ్యవంతమైన కళాకారిణిగా తయారవుతుంది ఆమె జపాను సాంప్రదాయ నృత్యం చేయడం, పాత పద్ధతి సంగీతం పాడడంతో పాటు అద్భుతంగా కబుర్లు చెబుతుంది

విదేశీయుల దృష్టిలో జపాను ఫూజికొండ ఛెర్రీ పుష్పాలు, గెయిషాల దేశం సాంప్రదాయాలకు కట్టుబడి బ్రతికే జపానీయులకు కూడా ఈ మూడు చిహ్నాలు వారి దేశానికి మరువరాని గుర్తులు ఫూజికొండ అలాగే ఉంది ప్రతి ఏడాది ఛెర్రీ పుష్పాలు పూస్తూనే ఉన్నాయి కాని గెయిషా వ్యవస్థలో మాత్రం మార్పులు వస్తున్నాయి పూర్వ సాంప్రదాయాలు కొద్దిగా సడలుతున్నాయి అయినా ఆధునిక జపానులో కూడా సంప్రదాయ గెయిషాకు స్థానం లేకపోలేదు

జపాను ప్రజలకు సినిమా పిచ్చి అంటే ఆశ్చర్యపోకండి టోకియో మహా పట్టణంలో ఒక వీధి యావత్తూ సినిమా హాల్సు తప్ప మరేమి ఉండవు ఆ వీధిలో వెళుతుంటే ఒక హాలుకంటే మరొకహాలు ప్రజలతో క్రిక్కిరిసిపోయి కనబడతాయి అక్కడ సినిమా ప్రదర్శనలు ఉదయం 10 గంటలనుండి రాత్రి 10 గంటలవరకు విరామం లేకుండా జరుగుతూనే ఉంటాయి ఆ వీధి యావత్తు సినిమా చూడ్డానికి వెళ్ళేవారు ప్రదర్శన చూచి బైటకు వచ్చే ప్రజాసందోహంతో ఎప్పుడూ క్రిక్కిరిసి ఉంటుంది ఆ వీధి, ఆ ప్రజలు, ఆ సినిమాలు గమనిస్తే వారి సినిమా పిచ్చి అర్థం అవుతుంది ప్రపంచంలో అన్ని దేశాలలో వలెనే జపానులో కూడా టెలివిజన్ రావడంతో సినిమా పరిశ్రమ దెబ్బతింటుందని భయపడ్డారు ఆ పోటీ విజయవంతంగా ఎదుర్కోవడానికి ప్రజలకు నచ్చే చిత్రాలు తీయవలసి వచ్చింది సినిమాకు జపానులో ఈనాటికి బ్రహ్మాండమైన ప్రజాదరణ ఉంది

ప్రపంచంలోని మహానగరాలతో పోలిస్తే టోకియో ప్రజలు తలసరి ఆదాయం చాలా తక్కువ కాని ప్రపంచంలోని మహానగరాలలో కంటే టోకియోలో డిపార్టుమెంటల్ స్టోర్సు, అదునాతన షాపులు హెచ్చుగా ఉన్నాయి పాశ్చాత్య జీవనవిధానం కోరే విదేశస్తులకు టోకియో ప్రపంచంలోకెల్లా ఖరీదైన నగరం అయినా పదివేలమంది పాశ్చాత్యులు టోకియోలో నివసిస్తారు టోకియో నగరం ప్రపంచంలో అతి పెద్దదైన

టోకియో అఖాతంపై నిర్మించబడింది ఆ అఖాతం 30 మైళ్ళు పొడవు టోకియో వాతావరణం అమెరికాలోని వాషింగ్‌టన్ నగర వాతావరణంలా ఉంటుంది శీతాకాలంలో తాపమానం సున్నాకి దిగువకి వెళ్ళదు మంచు చాలా అరుదు

ఒసాకా మూడు మిలియన్ల జనాభాతో జపానులోని రెండవ పెద్ద నగరం జపాను పశ్చిమ భాగంలో ప్రముఖ పారిశ్రామిక ఆర్థిక కేంద్రం ఒసాకానగరం యోడోనది ముఖద్వారం వద్దనున్న సారవంతమైన ప్రదేశంలో నిర్మించబడింది అక్కడ ప్రవహించే అనేక కాలువల పుణ్యమా అంటూ ఒసాకాను "జపాను దేశపు వెనిస్" అంటారు నదీ రహదారులు ఒసాకా సౌభాగ్యానికి దోహదం చేసాయి దానియొక్క చక్కటి స్థల మహాత్మ్యం వల్ల చరిత్రలో అనేకసార్లు వారి చక్రవర్తులు అక్కడ నివాసం ఏర్పరచుకున్నారు ఒసాకా రేవునుంచి కొరియా, చైనా తదితర ఆగ్నేయ ఆసియా దేశాలకు కూడా బ్రహ్మాండమైన వ్యాపారం జరిగేది ద్వితీయ ప్రపంచ యుద్ధం మూలంగా ఒసాకాలోని చాలా కంపెనీలు టోకియోకి మారాయి అయినా ఇప్పటికీ దాదాపు 30 వేల పారిశ్రామిక సంస్థలు ఒసాకాలో పరిశ్రమలు నడుపుతున్నాయి ఒసాకా చుట్టూ అనేక పారిశ్రామిక ఉపనగరాలు ఉన్నాయి బ్రహ్మాండమైన పారిశ్రామిక ప్రగతి, ఆధునికత పుణ్యమా అంటూ ఓసాకా నగరం పూర్వపు తూర్పు దేశాల కళ పోగొట్టుకుంది ఒసాకాని ముద్దుగా తూర్పు దేశాల మాంచెస్టరు" అని పిల్చుకుంటారు

ఒసాకాకు టోకియోకి ప్రజల ప్రవర్తనలోను ఆలోచనా సరళిలో కూడా › కనిపిస్తుంది ఒసాకా పారిశ్రామికవేత్తలు వ్యాపారులు మంచి ఆత్మ ర్యం, అనుభవం సాహసం గలవారు ఆ నగరంలో యిద్దరు వ్యాపారులు లుసుకుంటే "క్షేమమా" అని అడుగరు "డబ్బు సంపాదన ఎలా ఉంది" ంటారు అయినా ఈ నగర ప్రజలు టోకియో ప్రజలకంటే ఎక్కువ స్నేహశీలురు మనఃపూర్వకంగా ఉత్సాహంగా ప్రవర్తిస్తారు ఒసాకా ‌గరానికి ఉన్న పెద్ద సమస్య భూగర్భ జలవనరులను అధికంగా బైటకు ‌తీయడం వల్ల నేలమట్టం దిగిపోవడం ఆ నగరంలో ఉన్న అత్యంత ఆకర్షణీయమైన పర్యాటక స్థలం ఒసాకా కోట దానిని 1584లో హిదయోషి టొయొటోమి నిర్మించాడు అది అనేక సార్లు అగ్నిప్రమాదాలకు లోనైనది 1913లో దానిని కాంక్రీట్‌తో పునర్నిర్మించారు నాలుగు శతాబ్దాల పూర్వం పెద్దపెద్ద శిలలు కియిషు షికోకు ద్వీపకల్పాలనుంచి ఓడలమీద తెప్పించి ఆ కోట ప్రాకారాలు నిర్మించారు

నగోయా జపాను దేశంలోని పెద్ద పట్టణాలలో మూడవది పదిహేడు

లక్షల ఏభైవేల జనాభాతో నగోయా మధ్య జపానులో ముఖ్యమైన పట్టణం. ఈ పట్టణం టోకియో మహానగరానికి కియోటో నగరానికి మధ్యలో ఉండడం వల్ల దానిని "మధ్య ముఖ్యపట్టణం" అంటారు. నగోయా 16వ శతాబ్దంలో నిర్మించబడిన అనేక కోటల ఆధారంగా అభివృద్ధి చెందింది. ఆ నగరానికి పునాదులు 1610లో ఇయెయాసు టోకుగావా తన కుమారుడు యోషినావో కొరకు నగోయా కోట నిర్మించటంతో ప్రారంభమయ్యాయి. 1882 నాటికి అక్కడ అనేక పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. అవి నేటి నగోయా ప్రాముఖ్యతకు కారణం. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో నగోయా కోట సర్వనాశనమైనది. దానిని 1959 లో పునర్నిర్మించారు.

నగోయా నగరం చాలా తొందరగా అభివృద్ధి చెందుతోంది. అభివృద్ధిలో నగోయా ఒసాకా నగరాన్ని మించిపోయింది. ఈ అనూహ్యమైన అభివృద్ధికి మూలకారణం యుద్ధానంతర నగర నిర్మాణం. నగోయా ఉత్తర అమెరికను పట్టణాల పద్ధతిలో వెడల్పయిన రోడ్లు, ఖాళీ స్థలాలతో చతురంగా నిర్మించబడింది. జపానులోని అత్యాధునిక నగరాలలో నగోయా ఒకటి.

యోకోహామా పదిహేను లక్షల జనాభాతో జపాను దేశంలో నాల్గవ పెద్ద పట్టణం. ఇది టోకియో బేకి దక్షిణంగా ఉంది. టోకియోకి యోకోహామా ఓడరేవుగా వ్యవహరిస్తుంది. ఈ నగరంలో ఉన్న చైనా టౌన్ ప్రపంచంలో అనేక నగరాలలో ఉన్న చైనా టౌన్లకంటే పెద్దదిగా ప్రఖ్యాతి. 1859లో జపాను పాశ్చాత్యులను తమ దేశంలో నివసించడానికి అనుమతించినప్పుడు ప్రప్రథమంగా వారు యోకోహామాలో ఉండేవారు. అప్పట్లో అది చేపలు పట్టుకుని బ్రతికే 87 కుటుంబాలు ఉండే కుగ్రామం. నలభై ఏళ్ళ తరువాత యోకోహామా అధికారికంగా పట్టణంగా అభివృద్ధి చేయబడింది. అప్పటికి దాని జనాభా లక్ష ఇరవై వేలు. 1808 నాటికి జపాను విదేశీ వ్యాపారంలో85 శాతం యోకోహామా ఓడరేవునుంచి జరిగేది. 1923లో సంభవించిన "గ్రేట్" కాంటో భూకంపం యోకోహామా నగరాన్ని నేలమట్టం చేసింది. అయితే త్వరలో వెడల్పయిన రోడ్లు, అందమైన భవనాలతో ఆ నగరం పునర్నిర్మింపబడింది. ప్రపంచ యుద్ధంలో ఆ నగరం నష్టపోయింది. కాని షింటో భూకంపం చేసినంత విధ్వంసం కాలేదు. యోకోహామా జపానులోని సంపన్నవంతమైన ఓడరేవు.

క్యాటో జపాను దేశంలోని ఐదవ పెద్ద పట్టణం. పురాతన జపాను యొక్క ఆత్మ ఈ పట్టణంలో గోచరిస్తుంది. వెయ్యి సంవత్సరాలు పైగా క్యోటో జపాను యొక్క ముఖ్య పట్టణం సాంస్కృతిక కేంద్రంగా రాణించింది. మతము, కళలు ఈ పట్టణంలో మూడు పువ్వులు ఆరు కాయలుగా

విరాజిల్లాయి ఈ పట్టణానికి మూడు ప్రక్కల పర్వతాలు ఉన్నాయి పట్టణ మధ్య కామో నది ప్రవహిస్తుంది పదమూడు లక్షల జనాభాతో ఉన్న పట్టణంలో అధునాతన లక్షణాలు ఉన్నమాట వాస్తవం కాని ఈపట్టణంలో చెప్పుకోదగ్గ పరిశ్రమలు లేవు క్యోటో పాతకాలపు జపానుకు ప్రతీక విచిత్రమైన విలక్షణమైన అందం ఉంది క్యోటో నగరంలో

<u>కోబె</u> 12లక్షల జనాభాతో జపానులో ఆరవ పెద్దనగరం దానిలో పాత పట్టణం హయాగో కలిసి ఉంది తూర్పు ప్రాంతాలలో ఉన్న రేవులలో అతి పెద్ద రేవు కోబె ఈ నగరం ఒసాకాకు, క్యోటో నగరాలకు దగ్గరలో ఉండడంవల్ల బ్రహ్మాండమైన ఐశ్వర్యం అభివృద్ధి పొందగలిగింది వ్యాపారం సమశీతోష్ణ వాతావరణం పుణ్యమా అంటూ కోబెలో58 దేశాల నుంచి వచ్చిన 39 వేల మంది విదేశీయులు నివసిస్తున్నారు జపానులో వ్యవసాయం జీవన సమస్య అంటే చాలా మందికి ఆశ్చర్యంగా ఉంటుంది జపాను చిన్న దేశం కావడం వల్ల వ్యవసాయానికి అనుకూలమైన భూమి తక్కువ కావడంవల్ల జపాను ప్రజలు ప్రతి అంగుళం భూమిని ఉపయోగించుకోవడానికి ప్రయత్నిస్తారు కొండలప్రక్క రైలుమార్గాల ప్రక్క ఊడ్చిన పొలాలు కనిపిస్తాయి వ్యవసాయ గ్రామాలలో రైతులంతా కలిసి ఊడ్పులు చేస్తారు ఒకరికి మరొకరు సహాయపడతారు ప్రకృతికి దగ్గరలో ఉండడం మూలంగా జపాను వ్యవసాయదారులలో మత విశ్వాసం హెచ్చుగా ఉంటుంది పంటలు వేయడానికిముందు వ్యవసాయపనులు పూర్తి అయిన తరువాత వారంతా పొలంవద్ద మత సంబంధమైన డాన్సులు చేసి పుష్కలంగా ధాన్యం పండాలని ప్రార్థనలు చేస్తారు రైతులు కోళ్ల పెంపకం పాల ఉత్పత్తి కూడా చేపడతారు జపానులో 10లక్షల పాలిచ్చే ఆవులు ఉండగా 25 లక్షల ఆవుల్ని బీఫ్ కోసం పెంచుతారు ఈ మధ్య కాలంలో జపాను బీఫ్ ప్రపంచ ప్రఖ్యాతికెక్కింది జపాను రైతులు ఆగ్నేయ ఆసియా దేశాలనుంచి ఆధునిక వ్యవసాయపద్ధతులు నేర్చుకోవడానికి వచ్చే యువరైతులకు తమ ఇండ్లలో మకాం ఏర్పాటుచేసి వారికి వ్యవసాయ పద్ధతులు నేర్పుతారు నేను జపానులో ఉన్న రోజుల్లో ఎప్పుడు రైలు ప్రయాణం చేసినా కన్ను పొడుచుకున్నా వరి పొలాలు కనిపించేవికావు కాని ఉత్తర జపాను దీవులకు వెళ్ళినప్పుడు మాత్రం ఆవిరితో నడిచే రైలు ఇంజన్లు వరిపొలాలు పుష్కలంగా కనిపించేవి రైతులు నివసించే ఫారం హౌస్ విలక్షణంగా ఉంటాయి ఆ గృహాల్లో కూడా నూతన ఆధునిక పరికరాలు, టి వి లు దర్శనమిస్తాయి

ఆధునిక జపానులో నూతన సౌభాగ్యం పుణ్యమా అంటూ ప్రజలు తమ తీరిక సమయాల్లో కాలక్షేపానికి కొత్తమార్గాలు వెతుక్కుంటున్నారు వారి పని

గంటలు తగ్గటం, జీతాలు హెచ్చడంతో ఆ దేశస్థులు తమ కాలక్షేపానికి ఖరీదైన వినోదం కోసం వెతుక్కుంటున్నారు సామాన్య జపాను పౌరునికి వినోదంకోసం అనేక సాధనాలు ఉన్నాయి ఆ దేశంలో కూడా వినోదకార్యక్రమాలు గ్రామీణ ప్రాంతాలకంటే పట్టణాలలో హెచ్చుగా ఉంటాయి అయితే టెలివిజన్ పుణ్యమా అని పట్టణాలకు గ్రామాలకు ఉన్న తేడా తగ్గిపోతోంది ప్రతి కార్మికుడు తన పని పూర్తి అయిన తరువాత వినోద కాలక్షేపం కోసం ఆశించడం సహజం దానితో జపానులో బ్రహ్మాండమైన వినోద పరిశ్రమలు నెలకొల్పబడి మూడుపువ్వులు ఆరు కాయలుగా విస్తరించాయి జపానులో వినోద కాలక్షేపానికి వేలాది సదుపాయాలున్నాయి

ఆధునిక జపాను యొక్క ఆర్థిక విజయ పరంపరతోపాటు జపానులో టెలివిజన్ ఉపయోగం బ్రహ్మాండంగా పెరిగిపోయింది 1953 ఫిబ్రవరిలో జపానులో 866 టెలివిజన్ సెట్లు ఉండేవి అవన్నీ కూడా అమెరికా నుంచి దిగుమతి చేసుకున్నవే 1953 ఫిబ్రవరి1వ తేదీన ఆ దేశంలో మొదటి టెలివిజన్ ప్రసారం చేసినప్పుడు పరిస్థితి అది అయితే మార్చి 1963 నాటికి జపానులో 13,379,090 టి వి సెట్లు ఉన్నాయి వాటిలో 9,662,000 పట్టణ ప్రాంతాలలోను 3,717,000 గ్రామీణ ప్రాంతాల్లోను ఉన్నాయి 1964 జనవరికి ఆ దేశంలో 15,354,000 టెలివిజన్ సెట్లు ఉన్నాయి అవి అన్నీ కూడా ఆ దేశంలోనే తయారయినవి అంతేకాదు వేలాదిసెట్లు ప్రపంచం అనేక దేశాలకు ఎగుమతి చేయడానికి తయారుచేస్తున్నారు

జపానీయులు టి వి ని ముద్దుగా "టెరెబి" అని పిల్చుకుంటారు అది వా జీవిత సరళిలో ముఖ్యభాగం అయింది అమ్మమ్మలు, సంప్రదాయ సిద్ధమైన కిమోనోలు ధరించి టి వి ని అంటుకుపోతారు తండ్రులు బీరు సేవిస్తూ తాము మెచ్చిన "సుమో" కుస్తీ లేక బేస్‌బాల్ గేమ్ చూస్తూ కాలక్షేపం చేస్తారు ఇ తల్లులు టి వి లో వచ్చే డ్రామాలు చూచి కన్నీరు కారుస్తారు యువతీయువకులు అధునాతన సంగీతానికి అనువుగా చిటికలు, అడుగులు వేస్తూ ఆనందిస్తారు చిత్రం ఏమిటంటే ఆధునిక టెలివిజన్ పుణ్యమా అంటూ జపానీయులు తమ సంప్రదాయ కళలను తెలుసుకుంటున్నారు పాత కాలపు కోర్టు డాన్సులు, నోహ్ కబుకి నాటకాలు టి వి లో దగ్గరగా చూస్తే వారికి కొత్త అవగాహన, ఆనందం కలుగుతుంది

టోకియోలో ఉద్యోగం అయిపోయింది భారతదేశం తిరిగి రావడానికి ప్రయాణ సన్నాహాలలో ఉన్నాను అదే సమయంలో ఎయిర్ ఇండియా సమ్మె చేస్తున్నారు ఒక వారం రోజులు టోకియోలో ఖాళీగా కూర్చోవలసివచ్చింది టోకియోలోని ఎయిర్ ఇండియా వారి పుణ్యమా అని నాకు అలిటాలియా

ఇటాలియన్ విమాన సర్వీసులో ఢిల్లీకి ప్రయాణం ఏర్పాటు చేసారు మిత్రులు సామానులు సర్దడంలో తోడ్పడ్డారు నేను భారతదేశం తిరిగి రావడానికి కొద్దిగా ముందే శ్రీ రామన్ టోకియో వచ్చారు అప్పటికే నేను కొనదలచిన కారు రూపు రేఖలు అంద చందాలు చూచి దానిని కొనడానికి సర్వసిద్ధంగా ఉన్నాను ఇక కంపెనీకి సొమ్ము చెల్లించడం ఒక్కటే మిగిలింది ఒకనాడు నేను కొనబోయే కారు చూడడానికి రామన్ గార్ని ఆహ్వానించాను ఆయన ఆ పరిస్థితులలో కారు కొనడంలోని పొరపాటుని చెప్పి, దానిని భారతదేశం తీసుకు వెళ్ళడంలోని ఇబ్బందులు వివరించారు ఆస్ట్రేలియా నుంచి కారు తెచ్చుకున్నప్పుడు దాన్ని తీసుకురావడానికి ఖర్చులు ప్రభుత్వం పెట్టుకుంది టోకియోలో నేను ఉద్యోగ విరమణ చేస్తున్నాను కాబట్టి ఆ కారు భారతదేశం తీసుకు రావడానికి ప్రభుత్వం ఒక్క కానీ ఖర్చు పెట్టదు అంతే కాదు భారతదేశం వచ్చిన తరువాత ఐదేళ్ళ వరకు ఆ కారు అమ్మడానికి వీలులేదని, ఉద్యోగవిరమణ చేసిన తరువాత కారు అవసరం ఉండదని పెన్షన్‌తో కారును పోషించడం కష్టమవుతుందని శ్రీ రామన్ చెప్పారు అంతే మళ్ళా నేను ఆ టొయోటో షోరూముకి వెళ్ళనే లేదు

అప్పటికి టోకియో నరోనా ఎయిర్‌పోర్టు నిర్మాణం పూర్తికాలేదు పాత కాలపు టోకియో ఎయిర్ పోర్టుకి స్నేహితులతో కలిసి వెళ్ళాను సామాన్లు యిర్ పోర్టులో కంపెనీకి అందజేసి మిత్రులతో కబుర్లు చెబుతూ కాలక్షేపం ేసాను విమానం ఎక్కడానికి ముందు అంతా కలిసి ఫొటో తీయించుకున్నాం బరువైన హృదయంతో స్నేహితులను వదలడం, నా ఉద్యోగ పర్వం కూడా పూర్తి అయిపోయినదనే భావం, నా టోకియో నిష్క్రమణను బాధాకరం చేసింది ఆ రోజే రాత్రికి ఢిల్లీ పాలం ఎయిర్ పోర్టులో దిగాను సామానులు తీసుకునే సమయంలో మా మిత్రులు ప్రత్యేకంగా పాక్ చేసిన రేడియో కనపడలేదు నేను వచ్చింది అలిటాలియా వారి విమానం కాబట్టి అందునా ఎయిర్ ఇండియా వారి రికమెండేషనుతో వచ్చాను కాబట్టి ఆ రేడియో పోయినట్టే లెక్కకట్టారు సామాన్యంగా ఎయిర్ కంపెనీ ఆ రేడియో మనకు కొనిపెట్టడం కాని లేదా దాని ఖరీదు కట్టి నగదు ఇవ్వడం కాని చేయాలి అలిటాలియా కంపెనీ రూల్సు పుస్తకం నా మొఖాన్ని కొట్టి ఉత్తచేతులు చూపించారు మిగిలిన సామానులు అన్నీ క్షేమంగా చేరినందుకు సంతోషించాను

ఉద్యోగ విరమణ చేసిన తరువాత ఆరుమాసాలు ఢిల్లీ నరసాపురం మధ్య తిరిగాను స్థిరనివాసం ఎక్కడ ఏర్పరచుకోవాలనే ఆలోచనతో కొంతకాలం సతమతమయ్యాను చివరకు నరసాపురంలోనే స్థిరపడడానికి

నిర్ణయించాను పిల్లలకు నేను తీసుకున్న నిర్ణయం నచ్చలేదు విదేశాలలో 12 సంవత్సరాలు ఉన్న వ్యక్తి నరసాపురం లాంటి చిన్న పట్టణంలో ఎలా బ్రతుక గలుగుతాడని వాళ్ళ అనుమానం వాళ్ళకెవరికీ నరసాపురం రావటం ఇష్టం ఉండదు వాళ్ళు పట్టణవాసానికి అలవాటుపడిపోయారు అంతే కాకుండా ఉద్యోగరీత్యా వాళ్ళు ఢిల్లీలోనే ఉండాలి 30 సంవత్సరాలు ఢిల్లీలో జీవితం గడిపాను దానిలో 12 సంవత్సరాలు విదేశాలలో గడిపాను అయినా నరసాపురంలో స్థిరనివాసం ఏర్పరచుకోవడానికి నిర్ణయించాను నరసాపురం వచ్చినా అంతా కొత్త నాతో చదువుకున్న వాళ్ళు ఎవరూ లేరు తరాలు మారాయి ఈ తరం వారికి నేను కొత్త ఖాళీగా కూర్చోవడమేనా లేక ఏదైనా చేద్దామా అనే ఆలోచన తెగలేదు ఇంతలో అమెరికా వెళ్ళి వద్దామా అనే ఆలోచన కలిగింది యూరోపు, ఆసియా ఆస్ట్రేలియా ఖండాలలో చాలా భాగాలు, ఆఫ్రికా ఖండం అంచులు చూసాను కాని ఎప్పుడూ అమెరికా వెళ్ళలేదు ఒక ప్రక్క మిత్రుడు పి జె రావు న్యూయార్కు నుంచి ఒకసారి అమెరికా వచ్చి వెళ్ళమని జాబులు వ్రాస్తున్నారు మరో ప్రక్క అమెరికా చూడలేదే అనే బావం మనస్సును పీకుతోంది సరిగ్గా అదే సమయంలో యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా ప్రభుత్వం తమ దేశానికి 200 ఏళ్ళు నిండిన పండుగ చేసుకుంటోంది అమెరికా వెళ్లడానికే నిర్ణయించాను పాస్ పోర్టు ఉండనే ఉంది ఇక వీసా కావాలి యునైటెడ్ స్టేట్స్‌కి వీసా సంపాదించడం అంత సులభం కాదు అయితే పి జె రావుగారు న్యూయార్క్ నుంచి వ్రాస్తూ మూర్తిగారు మా అంకుల్ కాబట్టి ఆయన అమెరికాలో ఉండగా ఆయన బాధ్యత మాది అని ఒక జాబు వ్రాసారు దానికి తోడు రెండువందల ఏళ్ళ పండుగ సందర్భంలో టూరిస్టు వీసాలు సులభంగా యివ్వడానికి అమెరికను ప్రభుత్వం నిర్ణయించింది

మద్రాసులో ఉన్న అమెరికన్ కాన్సులేట్‌కి వెళ్ళి నా వీసా అప్లికేషన్ యిచ్చాను ఆశ్చర్యం ఏమిటంటే కొద్ది నిమిషాలలో నాకు అమెరికన్ వీసా వచ్చింది అది తీసుకుని ఎయిర్ ఇండియా మద్రాసు ఆపీసుకి వెళ్ళి పదివేల రూపాయలు అక్కడి మేనేజరుకి యిచ్చి న్యూయార్కుకి రాను పోను టిక్కెట్టు యివ్వవలసినదిగా చెప్పి నా పాస్‌పోర్టు ఆయనకు యిచ్చి నరసాపురం తిరిగి వచ్చాను దేనికైనా అదృష్టం ఉండాలంటారు మన పెద్దవాళ్ళు అమెరికన్ ప్రభుత్వం వీసా యిచ్చింది పి జె రావు అమెరికాలో నా బాధ్యత వహించడానికి సిద్ధంగా ఉన్నారు అయినా నేను అమెరికా వెళ్ళలేకపోయాను దానికి కారణం భారత ప్రభుత్వం నిబంధనలే ఒకసారి విదేశాలనుంచి తిరిగి వచ్చిన వ్యక్తి తిరిగి మూడేళ్ళ వరకు విదేశాలకు వెళ్ళడానికి వీలులేదని ప్రభుత్వ నిబంధన నేను టోకియో నుంచి తిరిగి వచ్చి కొన్ని మాసాలే అయినందున

నాకు అమెరికాకు టికెట్టు అమ్మడానికి వీలులేదని ఎయిర్ ఇండియా మద్రాసు అఫీసు నా సొమ్ము పాస్ పోర్టు తిరిగి పంపించేసారు అటు తరువాత జనతా ప్రభుత్వం పాలనలో ఆ నిబంధనను మార్చారు అయితే అప్పటికి నేను కూడా మనస్సు మార్చుకుని నరసాపురం వచ్చేసాను

  

# జననీ జన్మ భూమిశ్చ....

1959 లో శ్రీ రాజగోపాలాచారి ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్న రోజుల్లో రాజకీయ బాధితులకు ఐదు ఎకరాల బంజరు భూములు ఇచ్చారు నేను ఢిల్లీలో ఉండిపోయినందున ఆ భూమిని బాగుచేసుకొని ఉపయోగంలో పెట్టలేకపోయాను ఆ భూమి ఎక్కడ ఉందో కూడా తెలియని పరిస్థితి ఆ భూమి నరసాపురం మండలం ఎల్ బి చర్ల పంచాయితీలోని చేమకూరపాలెం గ్రామంలో ఉన్నదని తెలుసుకుని దానికి దగ్గరలో ఉన్న కొడప గ్రామంలో ఉన్న కరణాన్ని కలిసి ఆ భూమి కొలిచి యివ్వమన్నాను నాకు ప్రభుత్వం ఇచ్చిన ఐదు ఎకరాల నాలుగు సెంట్లు భూమి కొలిచి ఇచ్చాడు దానిలో కొంత మురుగు కాలువలోను మరికొంత ప్రక్క రైతు ఆక్రమణలోను ఉండిపోయింది ఆ భూమిని బాగుచేయించి వ్యవసాయ యోగ్యంగా చేయడానికి నా తాతలు కనిపించారు అలవాటులేని వ్యవసాయంతో కుస్తీ పట్టడం ప్రారంభించాను ఈ సందర్భంలో కొడప గ్రామ కాపురస్తుడు గ్రామ పోస్టల్ ఉద్యోగి శ్రీ సూర్యారావు సహకారాలు మరువలేనివి నేను స్వంత వ్యవసాయం చేయడానికి నిర్ణయించాను దానికి ముఖ్య కారణం ఆ భూమి అప్పట్లో ఉన్న పరిస్థితిలో ఊరికినే వ్యవసాయం చేసుకోమన్నా ఎవరూ అంగీకరించలేదు దానితో నాలో పట్టుదల ఎక్కువైంది సూర్యారావు సలహా మీద కొడప గ్రామనివాసి భాస్కరరావుని జీతగానిగా పెట్టుకుని వ్యవసాయం ప్రారంభించాను

ఆ పొలానికి మంచినీరు తీసుకురావడానికి భగీరథ ప్రయత్నాలు చేయవలసివచ్చింది పంటకాలువనుంచి పొలం వరకు ఒక కిలోమీటరు దూరం బోదె తవ్వవలసి వచ్చింది ఆ సందర్భంగా మొదట తవ్విన బోదె ఉపయోగించకపోతే మరొక కాలువ తవ్వించాను పంటనీరు సమస్య తీరింది కాని ఆ భూమి అంతా చౌడునేల కావడంతో ఆ చౌడు విరచడానికి అనేక ప్రయత్నాలు చేయవలసి వచ్చింది నాకు వ్యవసాయంలో అనుభవం లేకపోవడం మూలంగా ఇతరుల సలహాలపై ఆధారపడవలసి వచ్చేది నరసాపురంలో వ్యవసాయ శాఖ అధికారులకు నేనంటే ఒక విధమైన అభిమానం ఉండేది ఏదో చదువుకున్నవాడు, విదేశాలలో ఉండి వచ్చినవాడు పల్లెటూరిలో చౌడు భూమిలో ధాన్యం పండించటానికి ప్రయత్నిస్తున్నానని వారికి అభిమానం కాని వారి సలహాలు మా మేస్త్రీ బాస్కరరావుకి కాని

పొలంలో పనిచేసే ఇతర రైతులకుకాని నచ్చేవి కావు వ్యవసాయశాఖ వారు కుర్చీలలో కూర్చుని వ్యవసాయం చేస్తారు కాబట్టి వారి సలహాలపై ఆధారపడితే మనం వ్యవసాయం చేయలేమనేవారు నాకు ఆశ్చర్యంగా ఉండేది స్వంత వ్యవసాయం ప్రారంభించిన నాటినుంచి భూమిని పరీక్ష చేయించలేకపోయానంటే నమ్మండి అది మన వ్యవసాయంపై సాంప్రదాయానికున్న పట్టుకి ప్రత్యక్ష నిదర్శనం అనిపించింది

ఐదు ఎకరాల భూమిని త్రవ్వించి పెద్ద గట్లు వేయించి ఆ గట్లపై కొబ్బరి మొక్కలు పాతించాను నా వ్యవసాయ తాపత్రయం చూసి నరసాపురంలో మిత్రులంతా నవ్వేవారు ప్రారంభంలో ఎంత ఖర్చుపెట్టినా చెప్పుకోతగ్గ ప్రతిఫలం ఉండేది కాదు ఐదు, ఆరు సంవత్సరాల తరువాత ఐదు ఎకరాల భూమిలో 80 బస్తాల ధాన్యం పండించగలిగాను ఊడ్పుకి కావలసిన ఆకుకోసం నానా అవస్థలు పడవలసి వచ్చేది నా పొలం చౌడు భూమి కావడం వల్ల దానిలో ఆకుమడి వేయడానికి అవకాశం లేదు సార్వా దాళ్వా పంటలకు ఆకుమడిగా పనికివచ్చే 40 సెంట్లు భూమి ఎకరం 85 వేల రూపాయల ఖరీదు చేసి కొన్నాను వ్యవసాయం మూడు పువ్వులు ఆరుకాయలుగా సాగుతోంది అంతలో తీర ప్రాంతాలలో నీలి విప్లవం మంచి ప్రబలంగా ఉన్నందున చౌడు భూములను రొయ్యల చెరువులుగా మార్చుతున్నారు 12 సంవత్సరాలు వ్యవసాయంతో కుస్తీ పట్టి నాకున్న ఐదు ఎకరాలలో నాలుగు ఎకరాలలో చెరువులు త్రవ్వి, రొయ్యలు పెంచుకునే రైతుకి లీజుకి యిచ్చాను మిగిలిన 1ఎకరంలో ఉన్న కొబ్బరి మొక్కలను బాగు చేయించి వాటిని కూడా లీజ్‌కి యిచ్చాను ఇక ఆకుమడి కోసం కొన్న 40 సెంట్ల భూమిలో స్వంత వ్యవసాయం చేసి ధాన్యం పండిస్తున్నాను కొన్ని సంవత్సరాలుగా నా పొలంలో పండిన ధాన్యం ఆడించుకుని తిండికి ఉపయోగిస్తున్నాను అది ఒక విచిత్రమైన సంతృప్తి

వయస్సు పైబడిన కొద్దీ చాదస్తం పెరగడం సహజం చాలామందికి యువతలో ఉన్న భ్రమలు తొలిగిపోతాయి కాని నాకు చాదస్తం పెరగలేదు అయితే భ్రమలు తొలగలేదు దానికి ప్రత్యక్ష నిదర్శనం నేను ప్రారంభించిన పక్ష పత్రికే! ఒక ప్రక్క వ్యవసాయం, మరొకప్రక్క పత్రికా ప్రచురణ నిర్వహించడానికి ప్రారంభించాను మనకు తెలిసినవారు ఢిల్లీలోను, హైద్రాబాదులోను చాలామంది ఉన్నారు కాబట్టి ప్రకటనల రూపంలో ధనార్జన చేసి పత్రిక నడపవచ్చునని భావించాను ప్రథమ సమస్య పేపరుకి నామకరణం చేయడం మన ఇష్టం వచ్చిన పేరు పెట్టడానికి వీలులేదు ఆ పేరుకు ఢిల్లీలోని పత్రికల రిజిష్ట్రారువారి అనుమతి ఉండాలి కొన్ని పేర్లు

సూచించి వారికి దరఖాస్తు పెట్టాను ఆ పేర్లన్నీ అంతకుముందే ఎవరికో ఇవ్వడం జరిగింది కాబట్టి నాకు ఇవ్వడానికి వీలులేదని జవాబు వచ్చింది ఆ విషయం తేల్చుకోవడానికి ఢిల్లీ వెళ్ళాను పత్రికల రిజిష్ట్రారు ఆఫీసులో పనిచేసే తెలుగు అధికారిని కలిసి చర్చించాను ఆయన సలహామీద మరొక దరఖాస్తు పెట్టాను దానిలో ఆఖరి నిమిషములో మిత్రుడు ప్రసాద్ సలహామీద "ఊరూవాడ" అనే పేరుకూడా వ్రాసాను చివరకు ప్రభుత్వం ఊరూవాడ అనే పేరు అనుమతించింది

1981 జనవరి 26 రిపబ్లిక్ దినం నాడు ఊరూవాడ పక్షపత్రిక ప్రచురణ ప్రారంభించాను సత్యనారాయణ ప్రింటింగు ప్రెస్‌లో ఆరుపేజీలతో ప్రతినెల 10, 25 తేదీలలో పత్రిక ప్రచురించడం మొదలుపెట్టాను సంవత్సర చందా 12 రూపాయలు శాశ్వత చందా వంద రూపాయలు అప్పట్లో పత్రిక పోస్టు చేయడానికి పోస్టేజి 2 పైసలు ఉండేది దానిని కేంద్ర ప్రభుత్వం ఒక్కసారిగా 15 పైసలు చేసింది నేను ప్రభుత్వాన్ని న్యూస్‌ప్రింట్ కోసం ఎప్పుడూ అడగలేదు పేపరు ప్రచురణకు కావలసిన న్యూస్‌ప్రింట్ విజయవాడలో శ్రీ M వెంకటరెడ్డిగారి షాపులో ఖరీదు చేయడం అలవాటు అయింది శ్రీ రెడ్డి స్నేహశీలి ఆయన కుటుంబ సభ్యులు నన్ను గౌరవ మర్యాదలతోపాటు వారి ఆప్యాయతతో ముంచెత్తుతారు

చిన్న పత్రికలకు ప్రకటనలు ఇవ్వడానికి వ్యాపారస్తులు ముందుకిరారని నిండా మునిగితేనేకాని తెలియలేదు కొంతకాలం ప్రభుత్వ ప్రకటనలు ఆదుకున్నాయి అయితే శ్రీ ఎన్ టి రామారావు రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్న రోజుల్లో కొంతకాలం ప్రభుత్వ ప్రకటనలు ఇచ్చి అమాంతంగా చిన్న పత్రికలకు ప్రభుత్వ ప్రకటనలు ఆపివేసారు అటు తరువాత అధికారంలోనికి వచ్చిన కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం కూడా చిన్న పత్రికలపై చిన్న చూపే చూసింది ప్రకటనలు లేకుండా పత్రికా నిర్వహణ సాధ్యంకాదని తేలిపోయింది అయినా ప్రారంభించి మధ్యలో ఆపివేయడానికి మనస్కరించలేదు ఈ లోపుగా న్యూస్‌ప్రింట్ ధర హెచ్చిపోయింది ప్రింటింగు ఖర్చుకూడా పెరిగింది దానికి తోడు అంతకుముందే పెరిగిన పోస్టు ఖర్చులు ప్రభుత్వ ప్రకటనలు రద్దుకావడం నన్ను నిజంగా ఇబ్బంది పెట్టాయి అందుమూలంగా పత్రికా ప్రచురణలో కొన్ని మార్పులు చేయడం తప్పలేదు సంవత్సర చందా 12 రూపాయలనుంచి 15 రూపాయలు చేసాను శాశ్వత చందా వంద రూపాయలనుంచి 130 రూపాయలకు పెంచాను 6 పేజీలు వేసే పత్రికను 4 పేజీలు చేసాను "ఊరూవాడ" ప్రచురణ ప్రారంభించి ప్రజలకు చాలా ఉపయోగకరమైన విషయాలు చెప్పాలనే సంకల్పం కూడా

భ్రమ అని తేలిపోయింది మనం చెప్పే విలువైన విషయాలపై ప్రజలనుంచి స్పందన రాలేదు చందాలు పెరగలేదు అయినా నిరుత్సాహపడకుండా అన్ని సమస్యలను ఎదుర్కొంటూ పట్టు విడువని విక్రమార్కునిలా పత్రికా ప్రచురణ సాగిస్తున్నాను

ఈ సందర్భంగా ఊరూవాడ పత్రికా నిర్వహణలో నాకు తోడ్పడిన మిత్రులకు కృతజ్ఞతాభివందనలు తెలియజేసుకోకుండా ఉండలేను డా||సుదర్శనం శేషాచార్యులు, కీ శే ప్రముఖ న్యాయవాది, మంచి మిత్రులు కానుకొలను శ్రీరామమూర్తి, శ్రీ వైయస్ కళాశాల అధ్యాపకులు శ్రీ యం వి సుబ్బారావు, శ్రీ పుట్రేవు పుండరీకాక్ష శర్మ, శ్రీమాన్ కిళాంబి వెంకటాచార్యులు, శ్రీమాన్ అత్తిలి గోపాల కృష్ణమాచార్యులు, డా|| అరిపిరాల నారాయణరావు, శ్రీ కడిమిళ్ళ వరప్రసాద శతావధాని శ్రీ పండా నాగేంద్ర త్రినాధ్ ఇతర మిత్రులు ప్రతిఫలాపేక్ష లేకుండా తమ రచనలతో నన్ను ప్రోత్సహించి పత్రికా ప్రచురణకు తోడ్పడ్డారు వారి సహాయం మరువలేను

ఉద్యోగ విరమణ చేసి ఢిల్లీనుంచి నరసాపురం మకాం మార్చిన తరువాత కాలక్షేపం కోసం చేసిన పనులలో వ్యవసాయం, పత్రికా నిర్వహణతోపాటు విజయవాడనుంచి ప్రచురించబడే ఆంధ్రప్రభ తెలుగు దినపత్రికకు నరసాపురం విలేఖరిగా పనిచేయడం ప్రారంభించాను నేను నరసాపురం చేరేసరికి ఆంధ్రప్రభ పాలకొల్లు విలేఖరి నరసాపురం వార్తలు ...గా పంపేవాడు ఆ పద్ధతి దాదాపు 20 ఏళ్ళనుంచి సాగుతోంది ...రసాపురంలో ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికల ఏజెంటు మా రెండవ ...బాయి ఆయన మరణానంతరం ఆ ఏజెన్సీ ఆయన భార్య పేర తరువాత వారి కుమారుడు కృష్ణ పేరుమీద నడుస్తోంది కృష్ణ పట్టుదల మూలంగా ఆంధ్రప్రభ విలేఖరి బాధ్యత నేను 1978 మార్చిలో స్వీకరించవలసి వచ్చింది అప్పట్లో శ్రీ కూచిమంచి సత్య సుబ్రహ్మణ్యం ఆంధ్రప్రభ సంపాదకులుగా ఉండేవారు ఆయనకు ఢిల్లీలో అప్పట్లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ స్థానిక సంపాదకుడు, నా మిత్రుడు కులదీప్ నయ్యరు నా గురించి జాబు వ్రాసాడు శ్రీ సత్య సుబ్రహ్మణ్యం "మూర్తిగారూ, ఇంత చిన్న ఉద్యోగం మీకెందుకండీ?" అనేవారు నరసాపురం ఏజెంటు మా బాబాయిగారి కుమారుడు కాబట్టి అతడి పట్టుదల మూలంగా చేయవలసి వస్తున్నదనేవాణ్ణి కావడానికి ఆంధ్రప్రభ విలేఖరినైనా ప్రజలంతా ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విలేఖరినని చెప్పుకునేవారు దానిలో రహస్యం ఏమిటంటే ఆంధ్రప్రభకు పంపిన వార్తలను ఎక్స్‌ప్రెస్‌లో వేసుకునేవారు నరసాపురం ప్రెస్‌క్లబ్‌లో అన్ని తెలుగు పత్రికల విలేఖరులు ఉన్నారు చాలాకాలం నరసాపురం ప్రెస్‌క్లబ్‌కి అధ్యక్షపదవిని నిర్వహించాను

నరసాపురంలో స్థిరనివాసం ఏర్పరచుకున్న తరువాత కేంద్రప్రభుత్వం స్వాతంత్ర్య సమరయోధులకి ఇచ్చే పెన్షన్‌కి దరఖాస్తు పెట్టాలని నిర్ణయించాను బ్రిటిష ప్రభుత్వంపై జరిగిన జాతీయపోరాటంలో ఆరునెలల పైబడి జైలు శిక్ష అనుభవించిన వారికి (శ్రీమతి ఇందిరాగాంధీ బారత ప్రధానిగా ఉండగా) కేంద్రప్రభుత్వం ఒక ఫలకాన్ని, పెన్షన్‌ను యివ్వడానికి నిర్ణయించింది ఆ ప్రణాళిక ప్రవేశపెట్టే సమయానికి నేను జపానులో ఉద్యోగంలో ఉన్నాను ఉద్యోగానంతరం దరఖాస్తు పెట్టడానికి రాజమండ్రి, వెల్లూరు సెంట్రల్ జైళ్ళకు సర్టిఫికెట్లకోసం వెళ్ళవలసి వచ్చింది రాజమండ్రి జైలులో రికార్డులు లేవన్నారు రెండువందల రూపాయలు లంచం ఇస్తే వెల్లూరు జైలులో సర్టిఫికెట్ దొరుకుతుందని నరసాపురంలో పుకారుగా ఉంది వెల్లూరు వెళ్ళి హోటల్‌లో మకాం చేసి సెంట్రల్ జైలుకి వెళ్ళి క్యాంటీన్‌లో కూర్చున్నాను అక్కడకు వచ్చే జైలు సిబ్బందితో నా సమస్య చెప్పాను వారంతా చాలా సానుభూతితో నాకు సహాయం చేయడానికి ప్రయత్నించారు చివరకు రెండవరోజు మద్యాహ్నం వారు మొండిచెయ్యి చూపించారు నిరుత్సాహంతో క్యాంటిన్ వసారాలో నిలబడ్డాను ఆ జైలు సూపరింటెండెంటు నన్ను దూరంనుంచి చూచి విషయం తెలుసుకోమని వార్డర్‌ని పంపారు నేనే ఆయనవద్దకు వెళ్ళి నా సమస్య ఆయనకు చెప్పాను తన సిబ్బంది సహాయం చేయలేకపోతే తానుమాత్రం ఏమి చేయగలనన్నాడు ఆ జైలు రిజిస్టరు చూడ్డానికి నాకు అనుమతి ఇవ్వమని కోరాను ఆయన వెంటనే నన్ను తనతో జైలు లోపలకు తీసుకువెళ్ళి జైలు ఆఫీసులో కూర్చోబెట్టి అక్కడ సిబ్బందితో నాకు రిజిస్టరు చూపించమన్నారు ఆ రిజిస్టరు చాలా పాతది అనేకమందికి సర్టిఫికెట్లు ఇవ్వడానికి దానిని పరిశీలించడంతో పేజీల ముక్కముక్కలైపోయాయి చాలాసేపు ప్రయత్నించగా ఒక ముక్క కనిపించింది ప్రాణం లేచివచ్చింది చివరకు నేను వెల్లూరు జైలుకి వచ్చిన వివరాలు ముక్కలుగా దొరికినవి అయితే వెల్లూరునుంచి రాజమండ్రికి మార్చిన వివరాలు దొరకలేదు వెల్లూరు జైలులో గడిపిన కాలం ఆరుమాసాలకంటే కొద్దిగా ఎక్కువ ఉన్నందున నా అవసరానికి సరిపోయిన వివరాలు దొరికినట్టే ఆ సర్టిఫికెట్ తీసుకుని నరసాపురం చేరాను వెల్లూరు జైలులో నేను ఎవ్వరికీ ఒక్క నయాపైసా ఇవ్వలేదు సరికదా, క్యాంటీన్‌లో టీ ఫలహారాలు, జైలు ఆఫీసులో మజ్జిగ జైలు సిబ్బంది ఇప్పించారు

జైలు సర్టిఫికెట్టుతోపాటు నాతో జైలులో ఉన్నవారిపద్ద జాబు కావాలన్నారు నాతోపాటు వెల్లూరులోను, రాజమండ్రిలోను జైలు జీవితం గడిపిన వల్లభరావు రాజ్యసభ సభ్యుడుగా ఉన్నాడు ఆయన నాకు కావలసిన జాబు పంపాడు జైలు సర్టిఫికెట్ వల్లభరావు జాబుతో దరఖాస్తు పెట్టాన

పెన్షన్ వచ్చింది అది ప్రారంభంలో నెలకు ఐదువందల రూపాయలు ఉండేది శ్రీ రాజీవ్ గాంధి ప్రధానిగా ఉన్న రోజుల్లో స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ నెలకు వెయ్యి రూపాయలు చేసారు అంతేకాదు, సమరయోధుడు మరణిస్తే ఆయన భార్యకు ఆమె జీవితకాలం పెన్షన్ ఇస్తారు రాజీవ్ గాంధి పుణ్యమా అంటూ స్వాతంత్ర్య సమరయోధులకు రైలులో ఫస్టుక్లాసు పాస్ ఇప్పించే ఏర్పాటు చేసారు దానితో ఇద్దరు ఉచితంగా ఎక్కడికైనా ప్రయాణం చేయవచ్చును ఈ సదుపాయాలు అన్నీ రాజీవ్ గాంధి ఎవరూ అడగకుండానే ఇచ్చారు ఈ రైలు ప్రయాణ సదుపాయాన్ని దుర్వినియోగం చేస్తున్న ఘనులు ఉన్నారని విని సిగ్గుతో కుంచించుకుపోవడం తప్ప చేయగలిగినదేమీ లేకపోయింది

పశ్చిమ గోదావరి జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంస్థలో సభ్యత్వం తీసుకున్న తరువాత కార్యవర్గసభ్యునిగా ఎన్నుకోబడ్డాను అప్పటికి జిల్లా సంస్థలు రెండు ఉండేవి ఒకదానికి అధ్యక్షులు శ్రీ మంగళంపల్లి చంద్రశేఖర్, రెండవదానికి శ్రీ కె పి యస్ రాజు అధ్యక్షులుగా వ్యవహరించేవారు ఆ రెండు సంస్థలను ఒకటి చేసి శ్రీ ఇందుకూరి చిన సత్యనారాయణ గారిని అధ్యక్షులుగా ఎన్నుకున్నారు శ్రీ ఇందుకూరి సత్యనారాయణగారి తరువాత నన్ను జిల్లా అధ్యక్షులుగా ఎన్నుకున్నారు శ్రీ మంగళంపల్లి చంద్రశేఖర్ గారు పశ్చిమ గోదావరి జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల చరిత్ర వ్రాసారు శ్రీ ఇవటూరి వీరభద్రరావు జిల్లా సంస్థ కార్యదర్శిగా నాకు సహాయపడ్డారు శ్రీ వీరభద్రరావు మరణానంతరం శ్రీ కాంగ్రెసు సుబ్బన్న కార్యదర్శిగా నా అధ్యక్షత క్రింద కొత్త కార్యవర్గాన్ని ఏర్పాటు చేసుకున్నాం

  

# నేను సైతం....

ఇప్పటి వరకూ వ్రాసినదంతా నా స్వంతగొడవే సమాజానికి దీనివలన ప్రయోజనం ఉందా? లేదా? అనే నిర్ణయం మీది కాని విద్యార్థులకేదైనా ప్రయోజనకరమైన పని చేయాలన్నది మాత్రం నాలో ఉండిపోయింది కారణం నేను చదువుకోవడానికి ఎంత కష్టపడవలసి వచ్చిందో మీకు వేరే చెప్పనక్కరలేదు బందరు పట్టణంలో ఉండే ఇంపీరియల్ బ్యాంకులో పని చేసిన గుడిసేవ సుబ్బారావుగారు నా యూనివర్సిటీ చదువునకు సహకారం అందిస్తూ నువ్వు సంపాదించే సమయంలో 10 శాతం సంపాదన పేద విద్యార్థులకు వినియోగపర్చమన్నారు ఆ మాట ఎప్పుడూ జ్ఞాపకం వస్తూనే ఉంటుంది డబ్బుకి ఇబ్బంది తీరిన తర్వాత పేదవిద్యార్థులకు సహాయం చేయాలనే తలంపు వచ్చింది కాని సరైన ప్రణాళిక నా దగ్గరలేదు

ఏమయినప్పటికీ ఒక ట్రస్టు ఏర్పాటుచేసి విద్యార్థులకు సహాయం చేయాలనే నిర్ణయానికి వచ్చాను 1992లో నా చదువుకు మూలకారణమైన మా అమ్మమ్మ కీ శే మంచర్ల దుర్గమ్మపేర ఒక ట్రస్టు ఏర్పాటు చేయడం జరిగింది లక్షరూపాయలు ఫిక్సెడ్ డిపాజిట్ నరసాపురం స్టేట్‌బ్యాంకులో వేసాను దానిమీద వచ్చే వడ్డీ ప్రతిసంవత్సరం స్థానిక హైస్కూళ్లలో 8,9,10 తరగతులు చదివే బాలబాలికలకు మాత్రం ఉపయోగించాలనుకున్నాను ట్రస్టులో నా శ్రీమతి లక్ష్మినరసమ్మ మిత్రులు శ్రీ కె రామకోటయ్య శ్రీ i నాగేంద్ర త్రినాథ్, శ్రీ బి రంగనాథరావులను సభ్యులుగా పేర్కొన్నాను స్థానిక హైస్కూలు ప్రధానోపాధ్యాయులను సమావేశపరచి ఒక ప్రణాళిక రూపొందించాను కులమత రహితంగా ప్రతిభ ప్రాతిపదికపై పేద విద్యార్థులకు సహాయం అందించడానికి సమావేశంలో అందరూ అంగీకరించారు 1993 సంవత్సరంలో ట్రస్టు డిపాజిట్టుపై వడ్డీగా వచ్చిన 12,000 రూపాయలు విద్యార్థులకు వినియోగించడం జరిగింది కొందరికి పుస్తకాలు, కొందరికి పరీక్షఫీజులు, బ్లైండ్‌స్కూలులో చదివే విద్యార్థులకు బ్రెయిలీ లిపికి ఉపయోగించే పలకలు ఇవ్వడం జరిగింది నేను కూడా విద్యార్థులకు కొంతసేవ చేయగలిగాననే సంతృప్తి కలిగింది స్వర్గస్థురాలైన మా అమ్మమ్మ ఆత్మ కూడా సంతృప్తి పొందినట్లు భావిస్తాను

కుటుంబ విషయంగా రెండు మాటలు వ్రాసి ముగిస్తాను మా పెద్దకుమార్తె సుధాదేవి, భర్త వై సుందరరావుతో హైద్రాబాదులో ఉంది

ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు రెండవ కుమార్తె అరుణాదేవి, భర్త నీలాచలంతో సికింద్రాబాద్‌లో ఉంది ఆయన ఆర్మీలో ఉద్యోగం చేసారు మూడవ కుమార్తె ఉమాదేవి, భర్త రామారావు ఢిల్లీలో ఉన్నారు ఆయన ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం అబ్బాయి మధుబాబు, భార్య పంక్తి ఢిల్లీలో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫారెన్ ట్రేడ్ సంస్థలో ఉద్యోగాలు చేస్తున్నారు ఆఖరి అమ్మాయి మాయాదేవి ఆమె భర్త శ్రీనివాస్ ఢిల్లీలో ఉద్యోగాలు చేస్తున్నారు ఆఖరి అబ్బాయి కృష్ణమోహన్ ఆర్మీలో మేజర్‌గా పని చేస్తున్నాడు అతని బార్య వైజయంతి

ప్రస్తుతం నా బార్యతో నరసాపురంలో ఉంటున్నాను ఊరూవాడ పత్రిక నడుపుతూ, వ్యవసాయం చేసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాను

  

# కాలంతో నా జీవితం

| | | |
|---|---|---|
| 1916 | భాస్కర్ల సూర్యనారాయణమూర్తి జననం | నరసాపురం |
| 1925 | 5 వ తరగతి వరకు విద్యాభ్యాసం బోర్డు ఎలిమెంటరీ పాఠశాల | " |
| 1930 | 8 వ తరగతి వరకు విద్యాభ్యాసం మిషన్ మిడిల్ స్కూలు | " |
| 1932 | హయ్యర్ గ్రేడ్ ట్రయినింగ్ | " |
| 1934 | అసిస్టెంట్ టీచర్ ఉద్యోగం | చిట్టవరం గొంది |
| 1936 | 9 వ తరగతి వరకు విద్యాభ్యాసం ఆర్ ఆర్ బిహెచ్ ఆర్ హైస్కూలు | పిఠాపురం |
| 1938 | ఎస్ ఎస్ ఎల్ సి శ్రీ రామా హైస్కూలు | మచిలీపట్నం |
| 1940 | ఇంటర్మీడియట్ హిందూ కాలేజి | " |
| 1941 | బి ఎ ఆనర్స్‌లో ప్రవేశం ఆంధ్రవిశ్వవిద్యాలయం | విశాఖపట్నం |
| 1941 | రాజకీయ డిటెన్యూ 14 మాసాలు | వెల్లూరు రాజమహేంద్రి |
| 1943 | విద్యార్థి సంఘ అధ్యక్ష పదవి | గుంటూరు |
| 1944 | బి ఎ ఆనర్స్ పూర్తి | " |
| | గుమస్తా ఉద్యోగం డిఫెన్స్ అకౌంట్స్ ఆఫీసు | ఔరంగాబాద్ |
| 1945 | సీనియర్ సబ్ ఎడిటర్ జనవాణి పత్రిక | హైదరాబాద్ |
| | మూడు ఏకాంకికలు రచన | " |
| | సంయుక్త కార్యదర్శి హైదరాబాద్ జర్నలిస్టుల సంఘం | " |
| | సహాయకార్యదర్శి కేంద్ర శాసన సభ కాంగ్రెస్ పార్టీ | ఢిల్లీ |
| 1949 | ఆంగ్లో ఫ్రెంచి రిలేషన్స్ విత్ సయామ్ | |
| | 1876 1904 అనే అంశం పై పరిశోధన (3 సం) | లండన్ |
| | ప్రతినిధి కాంగ్రెస్ ఆఫ్ పీపుల్స్ ఎగెనెస్ట్ | |
| | ఇంపీరియలిజం సమావేశాలు | లండన్ |
| | విలేఖరి "స్వతంత్ర ఇండియన్ రిపబ్లిక్" పత్రికలు | " |
| | సభ్యుడు గ్రేట్ బ్రిటన్ ఐర్లండులోని పత్రికా విలేఖరుల సంఘం | " |
| 1952 | సంయుక్త కార్యదర్శి పార్లమెంట్ రిసెర్చ్ బ్యూరో | ఢిల్లీ |
| 1953 | నెహ్రూస్ ఫారిన్ పాలసీ గ్రంథ రచన | " |
| | ఇండియాస్ స్టేండ్ ఆన్ కొరియా - గ్రంథ రచన | " |
| | ఇండియా ఇన్ ది కామన్వెల్త్ గ్రంథరచన | " |
| | సీనియర్ రీసెర్చ్ ఆఫీసర్ భారత దేశంలో స్వాతంత్ర సమరయోధుల చరిత్ర | |
| | కేంద్రప్రభుత్వం నియమించిన సంపాదక సంఘం | " |
| | కార్యదర్శి ఇండియా ఆఫ్రికా కౌన్సిల్ | " |
| | ప్రతినిధి ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ యూత్ | " |
| 1954 | పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ డెప్యూటీ సెక్రటరీ జనరల్ | |
| | వియత్నాంలో శాంతి పరిరక్షణకు ఏర్పాటు చేయబడ్డ అంతర్జాతీయ కమిషన్ | వియత్నాం |
| 1957 | సోవియట్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ అతిథిగా పర్యటన | రష్యా |
| | మూడు వారాలు పర్యటన | చైనా |
| | పోలిష్ ప్రభుత్వ అతిథిగా పర్యటన | పోలెండ్ |
| 1959 | డైరెక్టర్ కేంద్ర ప్రభుత్వ పర్యటనశాఖ (1967 వరకు ఉద్యోగం) | ఢిల్లీ |
| 1961 | కార్యదర్శి టూరిజం పై ఇకాఫె నిర్వహించిన | |
| | సెమినార్ ఐక్యరాజ్య సమితి నిపుణుడు | " |
| | ప్రతినిధి రోడ్ ట్రాన్స్‌పోర్టు పై జరిగిన ఇకాఫె సెమినార్ | మద్రాస్ |
| 1962 | డైరెక్టర్ కేంద్ర ప్రభుత్వ వినోద పర్యాటకశాఖ | మెల్బోరన్ |
| | 1965 వరకు ఉద్యోగం | (ఆస్టేలియా) |
| 1964 | భారత ప్రతినిధి పాటా మహా సభలు | సిడ్నీ ( ఆస్ట్రేలియా) |
| | వియత్నాం డివైడెడ్ ఆన్ ఫినిష్డ్ స్ట్రగుల్ - గ్రంథరచన | |
| 1965 | భారతప్రభుత్వ పరిశీలకుడు ఐ ఎల్ ఒ మహాసభ | మెల్బోరన్ |
| 1967 | సలహాదారు ఆసియా ఆఫ్రికా న్యాయ ఆలోచన సలహా కమిటి సమావేశం | ఢిల్లీ |
| | భారత ప్రతినిధి కమర్షియల్ ఆర్బిట్రేషన్ పై జరిగిన అంతర్జాతీయ సెమినార్ | " |
| | సెక్రటరీ జనరల్ ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా (1971 వరకు నిర్వహణ) | " |
| | సంపాదకుడు ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా పత్రిక | |
| | డైరెక్టర్ ఇండియన్ అకాడమీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా అండ్ డిప్లమసీ | " |
| 1968 | వియత్నాం ది సైకిల్ ఆఫ్ పీస్ గ్రంథరచన | |
| 1971 | డైరెక్టర్ కేంద్ర ప్రభుత్వ వినోద పర్యాటకశాఖ | టోక్యో జపాను |
| | భారత ప్రతినిధి 'పాటా రిసెర్చి సెమినార్ | సింగపూర్ |
| 1973 | చైర్మన్ జపాను దేశంలో ఉన్న విదేశప్రభుత్వ టూరిస్ట్ సంస్థలు | జపాను |

ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు. రెండవ కుమార్తె అరుణాదేవి, భర్త నీలాచలంతో సికింద్రాబాద్‌లో ఉంది. ఆయన ఆర్మీలో ఉద్యోగం చేసారు. మూడవ కుమార్తె ఉమాదేవి, భర్త రామారావు ఢిల్లీలో ఉన్నారు. ఆయన ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం. అబ్బాయి మధుబాబు, భార్య పంక్తి ఢిల్లీలో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫారెన్ ట్రేడ్ సంస్థలో ఉద్యోగాలు చేస్తున్నారు. ఆఖరి అమ్మాయి మాయాదేవి, ఆమె భర్త శ్రీనివాస్ ఢిల్లీలో ఉద్యోగాలు చేస్తున్నారు. ఆఖరి అబ్బాయి కృష్ణమోహన్ ఆర్మీలో మేజర్‌గా పని చేస్తున్నాడు. అతని భార్య వైజయంతి.

ప్రస్తుతం నా భార్యతో నరసాపురంలో ఉంటున్నాను. ఊరూవాడ పత్రిక నడుపుతూ, వ్యవసాయం చేసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాను.

  